## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2990100051698

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

**Title Beginning with.**

| A | B | C | D | E | F | G | H | I | J | K | L | M | N | O | P | Q | R | S | T | U | V | W | X | Y | Z |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|

**Author's Last Name**

| A | B | C | D | E | F | G | H | I | J | K | L | M | N | O | P | Q | R | S | T | U | V | W | X | Y | Z |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝలిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# మారుతున్న సమాజం
# నా జ్ఞాపకాలు

రచన
ఆచార్య మామిడిపూడి వెంకటరంగయ్య




తెలుగు విద్యార్థి ప్రచురణలు
మచిలీపట్నం

'తెలుగు విద్యార్థి' తో ఆచార్యజీ అనుబంధం ఈనాటిది కాదు. 'తెలుగు విద్యార్థి' ప్రచురణలలో మొట్టమొదటిది — "సమాధాన వేదిక." ఆచార్యజీ 'తెలుగు విద్యార్థి' లో నెలనెలా పాఠకుల ప్రశ్నలకు యిచ్చిన సమాధానాల సంకలనం. ఇది 1959 లో ప్రచురించబడింది. మరల వారి చిట్టచివరి రచన "మారుతున్న సమాజం। నా జ్ఞాపకాలు" తెలుగు విద్యార్థి ప్రచురణగా మీ చేతులలో పెడుతున్నాం.

మారుతున్న సమాజంలో కలిసి అడుగు వెయ్యటం అందరికీ సాధ్యమయ్యే పని కాదు. వస్తున్న మార్పులను సమన్వయ దృక్పథంతో వీక్షించటం సామాన్యులకు సాధ్యం కాదు. ఆచార్యజీ మేధస్సు శిఖరాగ్రం. అక్కడినుంచి అది అన్నింటినీ అతి సూక్ష్మంగానే పరిశీలించ గలదు. అందువల్లనే తెలుగు విద్యార్థి' వారిని పదేపదే అర్థించింది. ఇట్టి గ్రంథాన్ని వ్రాసి యిమ్మని. తీవ్రమైన అస్వస్థతతో బాధపడుతూకూడ వారీ పుస్తకాన్ని వ్రాసి యిచ్చారు. అచ్చులో వారికీ పుస్తకాన్ని అందించే అదృష్టమే 'తెలుగు విద్యార్థి'కి లభ్యం కాలేదు. వారితో తెలుగు విద్యార్థికి వున్న అనుబంధం విడదీయరాని బంధం—అదే ఋణానుబంధం. సుస్మరణీయంగా నిలిచే పుస్తకంగా దీని ప్రచురణకు 'తెలుగు విద్యార్థి' పూనుకున్నది.

తెలుగు విద్యార్థి ప్రచురణలను, ప్రత్యేకించి ఆచార్యజీ గ్రంథాలను అమితాదరంతో స్వీకరిస్తున్న తెలుగు విద్యార్థి విద్యాలోకానికి మా కృతజ్ఞతలు.

మచిలీపట్నం
1-1-1981

ఇట్లు
తెలుగు విద్యార్థి ప్రచురణలు

# విషయసూచిక

| | పేజీలు |
|---|---|
| మా గ్రామం | 1 |
| మా శాఖ | 28 |
| మా కుటుంబం | 37 |
| నేను - నా విద్య | 58 |
| నా ఉద్యోగం - ప్రథమ దశ | 76 |
| నా ఉద్యోగం - రెండవ దశ | 88 |
| నా ఉద్యోగం . మూడవ దశ | 137 |
| నిరుద్యోగదశ - మొదటి భాగం | 171 |
| నా ఉద్యోగ జీవితంలో ఆఖరు దశ (1) | 209 |
| నా ఉద్యోగ జీవితంలో ఆఖరు దశ (2) | 224 |
| వార్ధక్యం - ప్రథమ దశ (1957 - '61) | 252 |
| వార్థక్యం - రెండవ దశ | 295 |



ఆచార్యజీ మాతృదేవి శ్రీమతి నరసమ్మగారు

పితృదేవులు వెంకటేశయ్యగారు



ఆచార్యజీతో 'తెలుగు విద్యార్థి' సంపాదకులు శ్రీ కొల్లూరి
( 1969-వ సంవత్సరములో ఆచార్యజీ 80-వ జన్మదినోత్సవ సందర్భముగా తీసిన ఛాయాచిత్రం



31-1-1952-వ తేదీన మూడవ కుమార్తె డాక్టర్ వైదేహిగారి వివాహ సందర్భమున
ఆచార్యజీ దంపతులు, కూతుళ్లు, అల్లుళ్లతో



12-7-1977-వ తేదీన రెండవ కుమారుడు శ్రీ సీతారాం షష్టిపూర్తి సందర్భమున
కుటుంబ సభ్యులతో ఆచార్య మామిడిపూడి వెంకటరంగయ్యగారు



9-4-1972-వ తేదీన శ్రీ ఎం. వి. రాజగోపాల్‌గారు రచించిన 'Perspectives in Indian Education పుస్తకావిష్కరణ హైదరాబాద్ కళాభవన్‌లో ఆచార్య మామిడిపూడి వెంకటరంగయ్యగారి అధ్యక్షతన జరిగినది. ఆ సందర్భమున తీసిన ఛాయాచిత్రంలో నాటి ముఖ్యమంత్రి శ్రీ పి. వి. నరసింహారావు, శ్రీ ఎం. వి. రాజగోపాల్, శ్రీ కొల్లూరి కోటేశ్వరరావు, ఆచార్యజీలను చూడవచ్చును.



1968-వ సంవత్సరములో భారత రాష్ట్రపతి డాక్టర్ జకీర్ హుస్సేన్ నుండి
"పద్మభూషణ" బిరుదాన్ని స్వీకరిస్తున్న ఆచార్యజీ



సతీమణి శ్రీమతి వెంకమ్మగారితో ఆచార్యజీ



ఆచార్యజీ దంపతులకు వారి సోదరులు రామకృష్ణయ్యగారు రచించిన
"వాల్మీకి రామాయణామృతము" గ్రంథమును అంకితమిస్తున్నారు.



ఆచార్యజీ ఉస్మానియా విశ్వవిద్యాలయ



ఆచార్యజీ కొడుకులు, కోడళ్లు

# 1. మా గ్రామం

మాది నెల్లూరు జిల్లా, కోవూరు తాలూకాలోని పురిణి గ్రామం. ఇది ఒక పెద్ద గ్రామంగా పరిగణింపవచ్చును. ఏటేట దీనినుండి ప్రభుత్వానికి భూమిశిస్తు రూపంగా రూ. 14,000 లు లభించేది. సాధారణంగా చుట్టుపట్ల గ్రామాలకు ఒక మునసబు, ఒక కరణం మాత్రమే ఉండేవారు. కాని మా గ్రామానికి వీరితోకూడా ఒక పెద్దకాపు కూడా ఉండేవాడు. వసూలు చేయవలసిన భూమిశిస్తు ఎక్కువగా ఉండడమే దీనికి కారణం. వీరు వెట్టివారి సహాయంతో వాయిదాల మేరకు శిస్తులు వసూలు చేయడం జరిగేది. సాధారణంగా ఏ రైతూ శిస్తులు బకాయి పెట్టడం సాధ్యమయ్యేది కాదు. అప్పులు చేసి అయినా వాటిని సకాలంలో చెల్లించడం జరిగేది. చెల్లించని పక్షంలో భూములను వేలం వేయడం మామూలు. వ్యవసాయమే ప్రజలకు ప్రధాన వృత్తి కావడంచేత ఎవరూ వారి భూములను పోగొట్టుకొని నిరాధారులు కావడానికి ఇష్టపడేవారు కారు. రెవిన్యూ అధికారులు ఈ విషయంలో కఠినంగాను, నిర్మొహమాటంగాను ప్రవర్తించేవారు. ప్రభుత్వానికి లభించే సాలీనా ఆదాయంలో భూమిశిస్తు ప్రధాన భాగంగా ఉండడంచేత, దానిని వసూలుచేసే విషయంలో వారు ఈ విధంగా ప్రవర్తించడం అవసరమైంది. ఈ వసూలు విషయంలో అధికారులదే ఆఖరుమాట. ప్రజాస్వామికం లేక పోవడంచేత ప్రజల ప్రశంసను సంపాదించకోరే శాసనసభ్యులు ఇందులో జోక్యం కలిగించుకొనడం సాధ్యము కాలేదు, అందుచేత

కూడ ఎలాటి బకాయీలు లేక వసూళ్లు జరుగుతూ వచ్చాయి. ఇటీవల కాలంలో పరిస్థితులు మారిపోయినవి. బకాయీలు పెరిగినవి. సకాలంలో పన్నులను చెల్లించే అలవాటు గ్రామ ప్రజలలో క్షీణించింది.

నా బాల్యంలో మా గ్రామానికి ప్రభుత్వంద్వారా ఏలాటి సౌకర్యాలు లభించేవి కావు. ప్రయాణసౌకర్యాలు బొత్తిగా లేవు. మా గ్రామం నెల్లూరు నుంచి ఉత్తర దిక్కుగా వెళ్లే ట్రంకు రోడ్డుకు 3½ మైళ్ళ దూరంలో ఉండేది. కాలినడకనో, రెండెడ్ల బండి సాధనానవో, ట్రంకురోడ్డు నుండి మా గ్రామానికి చేరేవారు. అతి కష్టంమీద ఒంటెద్దు బండ్లు ఇందుపూరు వరకు వచ్చేవి. అక్కడనుంచి మా గ్రామం 1¼ మైలు దూరంలో ఉండినా, దారిలో మోకాలులోతు మడుగులు రెండు ఉండడంచేతను, తక్కినభాగం సాఫుగా లేక గతుకులతో కూడినది కావడంచేతను సాధారణంగా ఒంటెద్దు బండ్లు మా గ్రామానికి వచ్చేవి కావు. ఎప్పుడైనా వస్తే వాటికి రు. 1, 1½ లు కిరాయి ఇవ్వవలసి ఉండేది.

ట్రంకురోడ్డు నుండి మోపూరు గ్రామానికి సమీపాన ఒక త్రోవ ఉండేది. అందులో ఒక దొంగల ముఠా స్థిరనివాసం ఏర్పరచుకొని ప్రయాణికులను దోచుకోనడం మామూలు. పోలీసు వారు ఈ విషయంలో ఏలాంటి జోక్యం కల్పించుకొనేవారు కారు. దోచుకొన్న వెండి బంగారాలను, ఇతర వస్తువులను దొంగలు మోపూరులోని భూస్వాములకు అప్పగించేవారని, వారు దొంగలకు ప్రతినెలా కొంత జీతం ఇచ్చి, వారిని శాశ్వతంగా తమ వశంలో ఉంచుకొనేవారని ఒక ప్రతీతి ఉండేది. ఇందులో కొంత సత్యం లేకపోలేదు. ధనికవర్గం న్యాయపద్ధతిని నీతినియమాలను అనుసరించి ధనాన్ని సేకరించడం ఎన్నడూ జరిగేదికాదు.

ట్రంకురోడ్డులోనే గాక దానికి ఆవల అడవులలో కూడ దొంగల ముఠాలు ఉండేవి. నా మాతామహులు ఆత్మకూరు తాలూకాకు చెందిన లింగాలపాడులో నివసించేవారు. అది మా గ్రామానికి ఇరవై మైళ్ళ దూరంలో ఉండేది. మార్గంలో ఏలాటి రోడ్డు లేదు. అడవులలో నడిచి వెళ్ళవలసిందే. మార్గంలో

దొంగల ముఠాలు ( వారికి కత్తెర దొంగలని వ్యవహారంలో పేరు ) విశృంఖలంగా ప్రయాణీకులను దోచుకొనేవారు.

నా బాల్యంలోను అటుతర్వాత చాలకాలం వరకు గ్రామంలో కూడా దొంగలభయం విస్తారంగా ఉండేది. ఇండ్లను కాపలా కాయడానికి ఏర్పరచుకొన్న ఏనాదులు ఆ ఇండ్లకే కన్నంవేసి వస్తువులను దొంగలించడం మామూలు. ఇది నా స్వానుభవం. కొంతకాలం దివిటీదొంగలు రాత్రిపూట గ్రామాన్ని ప్రవేశించి దోపిడీలు చేసేవారు. నేను నా ఇంగ్లీషుచదువు నిమిత్తం మద్రాసులో ఉండి వేసవిసెలవులలో గ్రామానికి వచ్చేవాడిని. కాని కొంతకాలం దొంగలభయం అమితంగా ఉండడంచేతను, మా ఇల్లు గ్రామానికి మొదటిది కావడం చేతను, దొంగలు మా ఇంటిపైననే పడ్తారనే భయంకొద్దీ రాత్రి 6, 7 గంటలకే భోజనం చేసి, ఇంటిలోని మేమందరం గ్రామం లోపల ఇతరుల ఇండ్లలో పడుకొని, తిరిగి ఉదయం మా ఇంటికి వచ్చేవారం. చాలకాలం వరకు రోడ్లమీదగాని, గ్రామంలోగాని దొంగల ప్రమాదాల నుండి ఎలాటి రక్షణా లేకుండా ఉండేది. బ్రిటిషు పరిపాలకులు దేశంలో శాంతిభద్రతలను స్థాపించారని చరిత్రకారులు వ్రాయడం మామూలు. కాని భద్రత విషయంలో గ్రామ ప్రాంతాలలో, వారి పరిపాలన మూలంగా పూర్తి భద్రత లభించలేదు.

ఇటీవలి కాలంలో ప్రయాణసౌకర్యాల విషయంలో మా గ్రామంలోని పరిస్థితులు మారినవి. ట్రంకురోడ్డు నుండి మా గ్రామానికి రోడ్డు పడింది. ఇది అంత ప్రశస్తమైన రోడ్డు కాక పోయినా బస్సులు నడవడానికి వీలుగా ఉన్నది. రోజూ నెల్లూరు నుండి మా గ్రామానికి రెండు పర్యాయాలు బస్సులు రావడం జరుగుతూ ఉన్నది. నెల్లూరులోను, కోవూరులోను, రోడ్డుమీది ఇతర చోట్లలోను పనులున్న గ్రామస్థులు ఉదయం బస్సులో ప్రయాణంచేసి, వారి వారి పనులను ముగించుకొని సాయంకాలానికి ఇల్లు చేరుతున్నారు. చిల్లర వ్యాపారంకూడ కొంతవరకు పెరిగింది. రోడ్డుమీద బస్సులు అనేకం తరుచుగా తిరగడంచేత దొంగల భయం కూడ తగ్గింది. రాకపోకలు సులభం కావడంచేత గ్రామస్థులకు ఎన్నో లాభాలు చేకూరినవి.

ఇటీవలివరకు మా గ్రామానికి తపాలా సౌకర్యాలు కొద్దిగా ఉండేవి. మూడు మైళ్ల దూరంలో ఉండే అల్లూరులో ఒక తపాలాఫీసు చాలాకాలంగా ఉంటూ ఉన్నది. అక్కడనుండి మా గ్రామానికి వారానికి రెండు పర్యాయములు ఒక పోస్టు బంట్రోతు వచ్చి ఉత్తరాలను పంచిపెట్టి కార్డులు, కవర్లు అమ్మి, పోస్టుచేయవలసిన ఉత్తరాలను పట్టుకొని వెళ్లేవాడు. పోస్టు సౌకర్యాలు లేని కారణంగా వార్తాపత్రికలను తెప్పించుకొనే వారు కారు. ఎవరైనా నెల్లూరికి వెళ్ళి ఒక పత్రికను తెస్తే దానిని అనేకులు చదివి, అందులో అచ్చైనదంతా వేదవాక్యంగా నమ్మేవారు. ఇందులోకూడ ఇటీవలికాలంలో పరిస్థితులు మారినవి. గ్రామంలో ఒక పోస్టాఫీసు స్థాపింపబడింది. రోజూ ఉత్తరాలు, మనియార్డర్లు మొదలైనవి గ్రామస్థులకు అందుతున్నవి. కొందరు వార్తాపత్రికలను స్వయంగా తెప్పించుకొంటున్నారు. వారు వ్రాసిన ఉత్తరాలు వగైరా రోజూ బట్వాడా అవుతున్నవి. ప్రయాణ సౌకర్యాలు ఏర్పడటంచేత గ్రామస్థుల దృక్పథం గ్రామానికి మాత్రమే పరిమితంకాక, విశాలమై తాము భారతీయులమని, దేశప్రజలందరితో సంబంధం కలవారమని భావించడం పారిపాటి అయింది.

1897 వరకు మద్రాసు నుంచి నెల్లూరు వరకే రైలు నడిచేది. ఆ సంవత్సరము విజయవాడ వరకు రైలు మార్గం పూర్తిచేశారు. ఆ మార్గంలో మా గ్రామానికి 7 మైళ్ళ దూరంలో ఉండే తలమంచిలో స్టేషన్ ఏర్పడి రైలు ప్రయాణాన్ని కూడా సులభతరం చేసింది. చాలాకాలంవరకు గ్రామంలో ఒక వీధిబడి మాత్రమే ఉండేది. అందులో చాలా తక్కువ సంఖ్యలో రెండు మూడు సంవత్సరాలకాలం మగపిల్లలు మాత్రం చదువు కొనేవారు. వారు నేర్చుకొన్న చదువుకూడ తక్కువ స్థాయిలో ఉండేది. ఇంగ్లీషువిద్యను అభ్యసించదలచినవారు నెల్లూరుకో, మద్రాసుకో వెళ్లవలసి ఉండేది. అందుచేత చాలాకాలంవరకు ఇద్దరో ముగ్గురో ఇంగ్లీషు విద్యను అభ్యసించారు. ప్రస్తుతం గ్రామంలో వీధిబడికి బదులు ప్రభుత్వం స్థాపించిన అయిదు తరగతులబడి ఉన్నది. అందులో ముగ్గురో నలుగురో ఉపాధ్యాయు

లున్నారు. విద్యార్థుల సంఖ్య కూడ చాలా పెరిగింది. ఆడ పిల్లలు చదువుకొంటున్నారు. ఎలాటి నిషేధం లేకుండా అస్పృశ్యులు ఇతరులతో కలసి చదువుతున్నారు. దీనిమూలంగా గ్రామంలో విద్యావ్యాప్తి వృద్ధిగాంచింది.

ఇంతేకాదు. మూడుమైళ్ల దూరంలో ఉండే అల్లూరు గ్రామంలో ఒక ఉన్నత విద్యాలయం ఏర్పడింది. ఇంగ్లీషు విద్యను నేర్చుకోదలచినవారు అందులో చేరి, రోజూ ఉదయం 9 గంటలకు బయలుదేరి మూడు మైళ్లు నడిచి స్కూలుకు వెళ్లి తిరిగి సాయంకాలం 6 గంటలకు ఇల్లు చేరుతున్నారు. దీని ఫలితంగా ఉన్నత ఇంగ్లీషు విద్యను నేర్చుకొనేవారి సంఖ్యకూడ పెరిగింది. కొందరు బి. ఏ., బి. ఎస్‌సి., పరీక్షలలో కృతార్థులై పట్నాలలో ఉద్యోగాలు చేస్తున్నారు. కొందరు ఇంజనీరింగు విద్యను పూర్తిచేసుకొని ఉన్నత ఉద్యోగ పదవులలో ఉన్నారు. 5, 6 సంవత్సరాలక్రిందట నేను గ్రామానికి వెళ్ళినప్పుడు రెడ్ల కుటుంబానికి చెంది కర్నూలు వైద్యకళాశాలలో విద్యాభ్యాసం చేస్తున్న ఇద్దరు ఆడపిల్లలను చూచి సంతోషించాను. హరిజనుల సౌకర్యార్థం నెల్లూరులో ప్రభుత్వం స్థాపించిన వసతిగృహాలలో మాఊరికి చెందిన మగపిల్లలు, ఆడపిల్లలు చదువులు సాగిస్తున్నారు. మన సమాజం మారుతున్నదని చెప్పడానికి ఇవి అన్నీ తార్కాణాలు.

గ్రామానికి ఇప్పటివరకు వైద్య సౌకర్యాలు లేవనే చెప్ప వలసి యున్నది. నా బాల్యంలో గ్రామస్థులు చాలావరకు జలుబు, దగ్గు, జ్వరం మొదలైన జబ్బులకు సొంఠి, మిరియాలు, కరక్కాయలు, పిప్పలి మొదలైన వాటితో ఏవో కషాయాలు తయారుచేసి ఉపయోగించేవారు. గ్రామంలోని చెన్నకేశవ దేవాలయానికి అర్చకుడైన ఉదయగిరి నారాయణాచార్యులు కొద్దిపాటి వైద్యం చేసేవాడు. ఆయనవద్ద రకరకాలైన మాత్రలు, కుప్పెకట్లు కొన్ని ఉండేవి. ఇవి అన్నీ ఒక చిన్నసంచిలో ఇమిడిపోయేవి. నాడీపరీక్ష చేసి ఆయన రోగులకు ఈ ఔషధాలను ఇచ్చేవాడు. వీటిమూలంగా రోగం కుదిరితే కుదిరినట్లు. లేదా కుదరకపోవచ్చు. రోగులకు ఇంతకంటే వేరే సదుపాయము లేదు. అటుతర్వాత

వేదం వెంకటాచలయ్యా ఈలాటి వైద్యాన్నే చేస్తూ ఉండేవాడు. దేశద్రిమ్మరులైన ఒక కులంవారు అప్పుడప్పుడు గ్రామానికి వచ్చి వీరముష్టి మాత్రలను అమ్మకం చేసేవారు. కొన్ని జబ్బులకు వీటినికూడా గ్రామస్థులు వాడడం మామూలు. కాని మొత్తం మీద వైద్యసౌకర్యాలు చాలా లోపించి ఉండినవి. స్త్రీలకు ప్రసవం ఒక గండంగా ఉండేది. నేర్పుగల మంత్రసానులు లేరు. ప్రసవమైన తర్వాత మూడవరోజో, నాల్గవరోజో ఏదో ఒకవిధమైన విషజ్వరం సోకి వారు మరణించేవారు. దానికి తగిన వైద్యం ఏదీ లేదు. కలరా, మశూచి వ్యాధులు తరచుగా సంభవించేవి. ఆరోగ్యశాఖవారు టీకాలు వేసేవారు కాని, మశూచిని అరికట్టలేక పోయినారు. నా చిన్నవయసులో కొన్ని సంవత్సరాలపాటు మలేరియా జ్వరం విపరీతంగా వ్యాపించింది. చలిజ్వరంతో అనేకులు బాధపడ్డారు. ఆరోజులలో ప్రభుత్వంవారు పోస్టాఫీసులలో మలేరియా వ్యాధికే చికిత్సగా క్వైనామాత్రలను చౌకధరలకు అమ్మేవారు. కాని గ్రామస్థులకు వాటిపైన ఎక్కువ నమ్మకం ఉండేది కాదు. మూడు మైళ్లదూరంలో ఉండే పోస్టాఫీసుకు వెళ్ళి వాటిని కొనడం కష్టంగా వుండేది. అందుచేత అనేకులు అకాలమరణానికి గురి అయ్యేవారు. క్రమక్రమంగా ఆరోగ్యశాఖవారు ఎక్కువ శ్రద్ధవహించిన కారణంగా ప్రస్తుతం కలరా, మశూచి, మలేరియా వ్యాధులు గ్రామస్థులను పీడించడంలేదు. కాని మొత్తంమీద వైద్య సౌకర్యాల విషయంలో గొప్ప మార్పులు ఏమీ రాలేదు. గ్రామంలో ఆసుపత్రిలేదు. శిక్షణపొందిన మంత్రసాని ఉండడంచేత ప్రసవం మూలంగా స్త్రీలకు గండం తప్పుతూంది. గర్భిణీస్త్రీలు ప్రయాణ సౌకర్యాలు ఏర్పడటంచేత ప్రసవానికి కొన్నిరోజులకు ముందు నెల్లూరికి వెళ్లి అక్కడి ఆస్పత్రులలో ప్రసవించడంచేత కొంత సౌకర్యం ఏర్పడినట్లు చెప్పవచ్చు. కాని ఈ సౌకర్యం ధనికులు, మధ్యతరగతి వారికే లభిస్తున్నది. ఇది పేదలకు అందుబాటులో లేదు.

ఈలాంటి సౌకర్యాలు కొన్ని లభించడంచేత గత 20, 30 సంవత్సరాలమధ్య గ్రామస్థుల జీవితం కొన్ని రంగాలలో మెరుగు

పడినట్లు భావించవచ్చు. వారు వారి పూర్వులకంటే జీవితాన్ని సుఖంగా సాగించగలిగి ఉన్నారు.

మొదటినుండి గ్రామస్థులకు వ్యవసాయం ప్రధాన వృత్తి. అధికసంఖ్యాకులకు దీని మూలంగానే జీవనం గడుస్తున్నది. తక్కిన వృత్తులను అనుసరించేవారుకూడా— కుమ్మర్లు, కమ్మర్లు వడ్రంగులు, చాకళ్లు, మంగళ్లు— వారిజీవితానికి వీరిపైననే ఆధార పడి ఉండేవారు. పంటలు బాగా పండినప్పుడు వ్యవసాయదార్లే గాక, తక్కిన వృత్తులలోని వారు సుఖపడడం, క్షామం సంభవించి పంటలకు నష్టం కల్గినప్పుడు రైతులతోపాటు వీరుకూడ కష్టాలపాలు కావడం తప్పేది కాదు. గ్రామస్థుల జీవిత మంతా పరస్పరాశ్రయంగాను, స్వయంపోషకంగాను ఉండేది. ఇతర గ్రామాలతోగాని, పట్టణాలతోగాని గ్రామస్థులకు ఎక్కువ సంబంధం ఉండేదికాదు. గ్రామస్థులు ఒక కుటుంబంలోని వారుగా జీవించేవారు.

వ్యవసాయంతో సంబంధం ఉన్నవారిని మూడు వర్గాలుగా విభజించవచ్చు. ఎంతో కొంత భూమికి సొంతదార్లు మొదటి వర్గంలోనివారు. వీరిది కొంతవరకు స్వతంత్ర జీవితం. గ్రామంలో ఈలాటివారికి ఎక్కువ గౌరవం ఉండేది. ఈ కారణాలచేత ఓ ఎకరం సొంతభూమినైనా సంపాదించడానికి భూములు లేనివారు ప్రయత్నం చేయడం మామూలు. కౌలుదార్లు రెండవ వర్గానికి చెందినవారు. వీరు సొంతదార్లనుండి భూములను తీసుకొని ఏటేట ఒక నిర్ణీతమైన మక్తాధాన్యాన్నిగాని, పండినపంటలో సగభాగాన్ని గాని ఇస్తూ ఉండేవారు. కాని మా గ్రామంలో 10, 15 ఎకరా లకు మించిన భూవసతి గలవారి సంఖ్య చాలా తక్కువ. 4, 5 ఎకరాల భూమిగలవారు స్వయంగానే తమ భూములను సాగు చేసుకొనేవారు. అందుచేత కౌలుదార్లుగా ఉండదలచిన వారికి భూములు లభించడం కష్టసాధ్యంగా ఉండేది. సొంతభూములుండి గ్రామాంతరాలలో నివసించేవారు తమ భూములను కౌలుకు ఇచ్చేవారు. సొంతభూములు ఉన్నవారుకూడా, వారి ఆదాయాన్ని పెంచుకొనే నిమిత్తం ఒక్కొక్కప్పుడు భూములను కౌలుకు తీసుకొనేవారు. సాధారణంగా ఎకరాకు పందుం మక్తా కౌలుదార్లు

చెల్లించేవారు. వ్యవసాయ ఖర్చులన్నింటినీ వారే భరించవలసి ఉండేది. పాలికి తీసుకున్నవారు ఖర్చులన్నిటినీ భరించి పండిన పంటలో సగభాగం సొంతదార్లకు ఇచ్చేవారు.

వ్యవసాయకూలీలు మూడవ వర్గానికి చెందినవారు. భూములు లేనివారూ, ఉన్నా పరిస్థితులు మారడంచేత వాటిని పోగొట్టుకొన్నవారూ నేత, కంచరం మొదలైన వృత్తులను అనాదిగా అనుసరిస్తూ ఉండేవారు. బ్రిటిషుపరిపాలన కాలంలో యంత్రాల సహాయంతో ఇంగ్లండులో తయారయ్యే చౌకవస్తువుల పోటీకి నిలబడలేక తమ వృత్తులను కోల్పోయినవారు వ్యవసాయానికి కావలసిన భూములు లభించని కారణంగా కూలీలుగా జీవితాన్ని సాగించవలసినవారయ్యారు. మా గ్రామంలో ఎందరు ఈవిధంగా తమ వృత్తులను కోల్పోయినారో అంచనా వేయడానికి ఆధారాలులేవు. కాని కొందరు కోల్పోయి వుంటారని చెప్పవచ్చు. ప్రతి గ్రామంలో పచ్చిక భూములు, బీడు భూములు కొన్ని ఉన్నా జనసంఖ్య పెరగడంచేత అలాటి భూములను వ్యవసాయ యోగ్యం చేసుకోడానికి అందరికీ అవకాశం లేకపోయింది. భూములున్నవారు సాహుకార్లకు ఋణగ్రస్తులై అధిక వడ్డీలతో తమ ఋణాలను చెల్లించలేక సాహుకార్లకు తమ భూములను ఇచ్చివేయవలసిన వారయ్యారు. ఇది ఋణాల విషయంలో బ్రిటిషు ప్రభుత్వం చేసిన కొత్త చట్టాల ఫలితం. ఈలాగు అనేక కారణాల మూలంగా అన్ని గ్రామాలలో ఏర్పడినట్లు మా గ్రామంలో కూడ ఒక వ్యవసాయకూలీల వర్గం ఏర్పడింది. వీరికి సంవత్సరం పొడుగునా పని దొరకకపోవడంచేత శుష్కదరిద్రులుగా జీవించవలసినవారయ్యారు. దీని మూలంగా గ్రామస్థుల జీవితంలో నా జీవితకాలంలో ఒక విప్లవం సంభవించినట్లు చెప్పవచ్చు. ఈనాడు పల్లెప్రాంతాలలో దారిద్ర్యం, నిరుద్యోగం తాండవ మాడుతున్నట్లు మనంచెప్తూ ఉన్నాం. దీనికి మూలం బ్రిటిషు పరిపాలన కాలంలో పైన సూచించిన విప్లవం; కొద్దిగా భూవసతి ఉన్నవారు, కౌలుదార్లు కూడ ఈ వర్గంలో చేరిపోయినారు.

నా చిన్నతనంలో గ్రామవాసులలో సుమారు నలభై శాతం శుష్క-దారిద్ర్యాన్ని అనుభవిస్తూ ఉండేవారు. వారందరు అతుకురాలా గోచిపాతరాయండ్లు. వారి ఇండ్లలోని ఆడంగులు చిరిగి పోయిన చీరెలతో జీవితాంతం వరకు కాలక్షేపం చేసేవారు. కొత్త చీరెలు కొనడానికి వారికి ఏలాటి స్తోమత ఉండేదికాదు. వారు పనిచేసే ధనికుల ఇంటివారు ఎప్పుడైనా పాత చీరెలు ఇస్తే వారు తృప్తిపడేవారు. గంజీ మెతుకులు, ఒక మిరపకాయో, ఉల్లిపాయో వారి ఆహారం. దీనితోనే వారు తృప్తిపడి ఉండేవారు. "ఎవరి తలవ్రాతను వారు అనుభవించడం తప్పదు" అనేదే వారి మానసికతత్త్వం. మధ్యతరగతికిగాని, ధనికవర్గానికిగాని చెందినవారిపట్ల అసూయపడక ప్రవర్తించుటకు ఇదే కారణం.

సేద్యవిధానం కూడ నా బాల్యంలో చాలా వెనుకబడి ఉండేది. పొలాలకు పశువులు, గొర్రెలు, మేకలు మొదలైన వాటి పెంటను మాత్రమే ఎరువుగా వాడేవారు. ఆ రోజులలో రసాయనిక ఎరువులు ఉపయోగంలోకి రాలేదు. 30 సంవత్సరాల క్రిందట ఫాస్‌ఫేట్లు, ఎముకలపొడి వాడుకలోకి వచ్చాయి. పిల్లిపెసర, ఇతర ఆకుల ఎరువుకూడ కొంతవరకు వాడుకలో ఉండేవి. ఎంపికచేసిన విత్తనాలు ఉపయోగంలోకి రాలేదు. తెగుళ్ల నివారణకు మందులులేవు. వ్యవసాయదార్లు వాడు పనిముట్లు కూడ చాలా పాతకాలం నాటివి. ట్రాక్టర్లు మొదలైన యంత్రాలను ఎవరూ ఉపయోగించేవారుకారు. వ్యవసాయశాఖ ఒకటి ఉండినా దానికి చెందిన ఉద్యోగస్థులు గ్రామీణులతో సన్నిహిత సంబంధాలు ఏర్పరచుకొని, పరిశోధన ఫలితాలను వారి అందుబాటులోకి తీసికొని రాలేదు. ఈకారణాలచే పంటలు వృద్ధిగాక, కొన్ని పొలాలలో తగ్గిపోవడం కూడ జరిగింది. రైతుల దారిద్ర్యానికి ఈ పాతకాలపు విధానం ఒక కారణం. ఇటీవల ఇదీ మారింది. రసాయనిక ఎరువులను, ఎంపిక చేసిన విత్తనాలను, తెగుళ్ల మందులను, మరికొన్ని పరిశోధన ఫలితాలను గ్రామంలోనివారు వాడడంచేత పంట రెండింతలు పెరిగింది. ధరలు కూడ పెరగడంచేత భూవసతిగల రైతులందరు బాగుపడినారు.

కాని ప్రభుత్వం కౌలుదారీ చట్టాలను ప్రవేశపెట్టడంచేత భూము లను కౌలుకు ఇచ్చుటకు బదులు స్వంతదారులు స్వయంగానే వాటిని సాగుచేసుకొంటున్నారు. ఇందుచేత కౌలుదారీవర్గం వారు నష్టపడి కూలీల వర్గంలో చేరిపోయారు. ఈ వర్గంలోని వారి స్థితి యథాపూర్వంగా ఉంటున్నది.

నా బాల్యంలో విత్తనాలను పొలాలలో చల్లేవారు. కొందరు గొర్రులలోని గొట్టాలలో విత్తనాలనువేసి, వరుసగా వాటిని నాటేవారు. మా నాయనగారు ఈ పనులను చేస్తూ ఉన్నప్పుడు నేనుకూడ పొలంలో ఉండేవాడిని. ఇటీవలికాలంలో ఈ పద్ధతి పోయి, దీని స్థానే పైరుమొక్కలను నాటే పద్ధతి వాడుకలోకి వచ్చింది. ఇదికూడ పంటల పెరుగుదలకు కొంత కారణమైంది. వ్యవసాయ విధానంలో గ్రామంలో జరిగిన మార్పులన్నిటిని వివరించడం నా అభిమతంకాదు. దానికి ఒక ప్రత్యేకగ్రంథం కావలసి ఉంటుంది. సమాజంలో నా జీవితకాలంలో జరిగిన మార్పులను సూచించడమే నా ఉద్దేశం. రైతుల విషయంలో జరిగిన మార్పులలో కొన్నిటిని ఇచ్చట మచ్చుకు పేర్కొన్నాను. వీటిమూలంగా గ్రామస్థులు చాలవరకు మారిపోయారు. వారి దృక్పథం, వారి ఆశయాలు మారడం జరుగుతూ ఉన్నది.

పంటకాపులలోని స్త్రీలు, వెలమల కుటుంబాలలోని స్త్రీలు పైకి వచ్చేవారు కారు. తక్కిన స్త్రీలలో ఈలాటి ఘోషా పద్ధతి లేదు. క్రింది కులాలస్త్రీలు మాత్రమే పొలాలకు వెళ్ళి సేద్యపు పనులలో పాల్గొనేవారు.

అన్నిగ్రామాలలో ఉన్నట్లే మా గ్రామంలో కూడ అనేక కులాలకు చెందినవారు నివసిస్తూ ఉండినారు. పూదూరు ద్రావిడ శాఖకు చెందిన బ్రాహ్మణులు, పౌరోహిత్యం వృత్తిగాగల వైదికులు, రెండు మూడు ఇండ్ల నియోగులు, ఒక వైఖానస వైష్ణవ కుటుంబం ఉండేవి. కోమట్లు అయిదారు ఇండ్లవారు ఉండినారు. వీరందరికి భూవసతి ఉండేది. కొందరు చిల్లరదుకాణాలు పెట్టుకొని కొంత ఆదాయము ఆర్జిస్తూ వచ్చేవారు. సాధారణంగా స్త్రీలే వీటిలో బేరసారాలు చేస్తూ ఉండేవారు. కొందరు వడ్డీ

వ్యాపారం కూడ చేసేవారు. వీరుగాక రెండు పంటకాపుల (రెడ్ల) కుటుంబాలు ఉండేవి. వీరిలో ఒక కుటుంబానికి చెందినవారు గ్రామ మునసబులు. నా బాల్యంలోను, తర్వాతను కొండూరు రామలింగారెడ్డి మునసబు. వీరు చదువు వచ్చిన వారు కారు. చేవ్రాలు మాత్రం చేయగలవారు. గ్రామంలో అయిదారు అరవ కరణాల కుటుంబాలు ఉండేవి. బహుశా వీరు అరవ దేశాన నుండి అనేకసంవత్సరాల క్రిందట ఆంధ్రదేశంలో స్థిరపడిపోయినారని చెప్పవచ్చును. చుట్టుపట్ల గ్రామాలలో నియోగులు కరణాలుగా ఉండేవారు. కాని మా గ్రామంలో అరవ కరణాలే కరణీకం చేస్తూ ఉండేవారు. నా బాల్యంలోను, అటుతర్వాత చాలా కాలం వరకు పురిణి నరసింహులునాయుడు కరణంగా ఉండేవారు. ఆయన గ్రామానికి సంబంధించిన రెవిన్యూ లెక్కలను వ్రాసి పెట్టడంలో సమర్థుడు. ఎవరెవరు ఎంత శిస్తు చెల్లించవలసినది ఆయన నిర్ణయించిన తర్వాత వాటి ప్రకారం మునసబు పెద్దకాపు వెట్టివారి సహాయంతో వాటిని వసూలు చేసి తాలూకా కచ్చేరీకి పంపడం మామూలు. వర్షాభావంచేత పంటలకు నష్టం కలిగి నప్పుడు ఎంత నష్టం కలిగిందీ కరణం అంచనా వేసి రెవిన్యూ ఇన్‌స్పెక్టరుకు తెలియపరచేవాడు. దానినిబట్టి పై అధికారులు భూమిశిస్తులో ఎంత ముజరా ఇయ్యవలసింది, ఎంత వసూలు చేయవలసింది నిర్ణయించేవారు. ఒకవిధంగా గ్రామాధికారులలో కరణం కీలకస్థానం వహించినవాడు.

పైన పేర్కొన్న కులాలవారే గాక వెలమలు, కమ్మవారు, బలిజెలు, సాతానివారు, జంగాలు, బలహీనవర్గాలకు చెందిన కుమ్మర్లు, కమ్మర్లు, వడ్రంగులు, చాకళ్లు, మంగళ్లు ఉండేవారు. వీరు వారి వారి కులవృత్తులను అనుసరిస్తూ, గ్రామంలోని కుటుంబాలను తమ మధ్య పంచుకొని, ఆ యా కుటుంబాల అవసరాలనుతీర్చి, వారు ఏటేటా ఇచ్చే ధాన్యంతో జీవనాన్ని సాగిస్తూ ఉండినారు. చాకళ్ళకు బట్టలు ఉతికిన రోజున ఆ యా కుటుంబాల వారు అన్నం పెట్టడం మామూలు. నా చిన్నతనంలో ఇత్తడి, కంచు మొదలైన పాత్రసామానులు ఎక్కువగా వాడుకలోనికి రాలేదు. అందుచేత కుండలకు ఎక్కువగా గిరాకి ఉండేది.

బ్రాహ్మణులుకూడా కుండలలో వంటజేసుకొని, వాటిని స్వయంగా తోముకొనేవారు.

కుల వ్యవస్థకు మూడు ప్రధాన లక్షణాలని చెప్పవచ్చును. కులాలలో కొన్నిటికి ఉన్నతస్థానం, కొన్నిటికి అల్పస్థానం ఉండడం మొదటి లక్షణం. సమాజంలో వ్యక్తిఅర్హత కంటె ఏ కులానికి చెందినవాడో దానిని బట్టి సమాజంలో అతనికి లభించే గౌరవాగౌరవాలు నిర్ణయింపబడేవి. దీనికి జన్మస్థానం వర్ణవ్యవస్థ. వర్ణవ్యవస్థలో నాలుగు వర్ణాలు మాత్రమే గుర్తింపబడినవి. కుల వ్యవస్థలో లెక్క లేని కులాలు ఏర్పడినవి. కాని రెండు వ్యవస్థలు సోపాన విధానాన నిర్మింపబడినవి.

కులాల మధ్య హెచ్చు తగ్గులు గుర్తింపబడినా అన్నికులాల వారు గ్రామ శ్రేయస్సుకై ప్రవర్తించేవారు. శరీరానికి శరీరం లోని అవయవాలకు ఏలాటి సంబంధమో గ్రామానికి, గ్రామంలోని వివిధ కులాలకు అలాటి సంబంధమే ఉండేది. అన్ని కులాలవారు అనాదిగా వారికి లభించిన స్థానంతో తృప్తిపడి ఒక కుటుంబం లోనివారివలె కలిసికట్టుగా గ్రామ శ్రేయస్సుకు కృషిచేస్తూ ఉండేవారు. కులాలమధ్య ఏర్పడిన తరతమ భేదాలు ఈ కృషికి ఆటంకం కలిగించలేదు.

దీనికి ప్రధాన కారణం అనాదిగా హిందూమతం బోధించిన కర్మ సిద్ధాంతంలోను, జన్మాంతర సిద్ధాంతంలోను ప్రజలందరికీ ఉండిన గాఢవిశ్వాసం. పూర్వజన్మలో చేసిన కర్మఫలితంగా కొందరు పై కులాలలోను, మరికొందరు క్రింది కులాలలోను జన్మిస్తున్నారని, ఈ జన్మలో ఎవరి కులధర్మాలను వారు ఆచరిస్తే వచ్చే జన్మలో పై కులాలలో పుట్టే అవకాశం ఉన్నదని అందరు నమ్ముతూ వచ్చారు. మనం అనుసరించే జీవిత విధానానికి నమ్మకాలే ఆధారం. ఆ నమ్మకాలు హేతుబద్ధములై ఉండవచ్చు. లేదా హేతురహితములైన మూఢనమ్మకాలుగా వుండవచ్చు. అవి ఏలాంటివైనా జీవితవిధానంపై వాటికిగల ప్రభావాన్ని గుర్తించవలసి ఉన్నది. కులవ్యవస్థ కూడ నమ్మకాల ప్రభావానికి లోబడినట్టిది.

కులవ్యవస్థకు ఏ కులాలవారు ఆ కుల-లోనే వివాహాలుచేసు కొనడం రెండవ లక్షణం. ఇదే సత్సంప్రదాయంగా అందరూ అంగీకరించారు. అందరూ కులాంతర వివాహాలను గర్హించారు. దీనిమూలంగా కులవ్యవస్థకు స్థిరత్వం లభించింది. ప్రతికులం దాని వ్యక్తిత్వాన్ని రక్షించుకొనగలిగింది.

దీనితోపాటు ప్రతికులానికి ఏదో ఒక వృత్తి ఉండేది. వంశపారంపర్యంగా దానినే ఆ కులానికి చెందినవారు అనుసరిస్తూ వచ్చారు. అందులో వారు ఎక్కువ నైపుణ్యాన్ని సంపాదించ డానికి ఇదే ప్రధాన కారణం. దీనిమూలంగా దేశంలో ఏ వృత్తీ నశించకుండా స్థిరంగా నిలబడి పోయింది. వృత్తి విషయమై కులాలమధ్య పోటీలు లేకపోవడంచేత అందరు సమిష్టి సౌభాగ్యానికి పాటుపడటం తమ విధ్యుక్తధర్మమని భావించారు.

మనదేశంలో ఇటీవలి వరకు మతసంస్కర్తలు గాని, సంఘసంస్కర్తలు గాని మానవులందరు సమానులనే సిద్ధాంతాన్ని ప్రసాదించలేదు. గౌతమబుద్ధుడు క్షత్రియులకంటె బ్రాహ్మణులు అధికులు కారని, ఆ ఆధిక్యం క్షత్రియులకే ఉండవలెనని చెప్పినాడు గాని, అన్ని వర్గాలమధ్య సమత్వం ఉండవలెనని ప్రచారం చేయలేదు. అన్ని వర్గాలవారిని పురుషులతోసహా స్త్రీలను తన సంఘంలో చేర్చుకొన్నాడు గాని, ఈ సంఘం సన్న్యాసులతో కూడినట్టిది. దీని అర్థం అందరు సన్న్యాసాశ్రమాన్ని స్వీకరించ వచ్చుననేదే. మధ్యయుగంలో వైష్ణవసంస్కర్త రామానుజా చార్యులు, వీరశైవమతాన్ని స్థాపించిన బసవేశ్వరుడు అస్పృశ్యు లతో సహా మానవులందరు సమానులని ప్రతిపాదించినారు. కాని ఇది ఆధ్యాత్మిక రంగానికి మాత్రం సంబంధించినట్టిది. లౌకికజీవితంలో వర్ణవిభేదాలుగాని, కులభేదాలుగాని అదృశ్యం కాలేదు.

పాశ్చాత్యదేశాలలో గత రెండువందల సంవత్సరాలకు పూర్వం ప్రజలలో ప్రత్యేకంగా ప్రముఖవర్గంవారని, పారిశ్రామిక వర్గంవారని, సామాన్యవర్గంవారని విభేదం ఉండేది. 1750 తర్వాత ఆర్థికపరిస్థితులు మారడంచేత ఈలాటి విభేదాలు మానవులమధ్య ఉండరాదని, మానవులందరు సమానులని కొందరు తత్త్వవేత్తలు

(ప్రధానంగా ఫ్రెంచి తత్త్వవేత్తలు) ప్రతిపాదించారు. దీని ప్రభావంచేత పారిశ్రామికులు, సామాన్యవర్గానికి చెందినవారు అప్పటి సామాజిక వ్యవస్థపై తిరుగుబాటుచేసి అనేక విప్లవాలను లేవదీశారు. అమెరికా విప్లవము, ఫ్రెంచి విప్లవము ఈలాటివే. తర్వాత కొంతవరకు మార్క్సు ఈ సిద్ధాంత స్వరూపాన్ని మార్చి రష్యాలో సంభవించిన బోల్షివిక్ విప్లవానికి పితామహు డయ్యాడు. ఆ విప్లవ ఫలితంగా వర్గరహితమైన సమాజమే మానవ సమాజానికి తుదిస్వరూపమని, కమ్యూనిజం, కమ్యూనిష్టు పార్టీ ఆ ఆదర్శాన్ని ఆచరణసాధ్యం చేయగలవని విప్లవాన్ని లేవదీసిన నాయకులూ, వారి అనుచరులూ అభిప్రాయపడి అలాటి సమాజాన్ని నిర్మాణం చేయుడానికి విశ్వప్రయత్నం చేస్తున్నారు.

1750 తర్వాత పై విధంగా పాశ్చాత్య ప్రపంచంలో మానవ సమానత్వ సిద్ధాంతం, బ్రిటిష్ పరిపాలన కాలంలో ఇంగ్లీషు విద్యావిధానం ద్వారా మన దేశంలోని విద్యాధికులను ప్రభావితం చేసింది. మనకు స్వతంత్రం లభించిన తర్వాత మనం ఏర్పరచుకొన్న రాజ్యాంగంలో ఈ సిద్ధాంతం ప్రాధాన్యం వహించింది. కులవ్యవస్థ నిర్మూలం అయితేగాని ఇది ఆచరణ సాధ్యం కాదని మనవా రనేకులు భావిస్తున్నారు. కాని దీనిని ఏలాగు నిర్మూలం చేయడం అనే ప్రశ్నకు ఎవరూ సమాధానం చెప్పలేకుండా ఉన్నారు. చెప్పినా ఆ సమాధానాన్ని ఆచరణలో పెట్టగల సామర్థ్యం ఎవరికీ ఉన్నట్లు కనిపించదు. ఆచరణలో ఒక కులం అగ్రస్థానంలో ఉండవలెనని, తక్కిన కులాలు క్రింది స్థానంలో ఉండవలెననే వాదాన్ని ఈనాడు ఎవరూ విశ్వసించడం లేదు. కులవ్యవస్థకు ప్రధాన లక్షణమైన తర తమ భేదం నశించింది. బ్రాహ్మణులు అన్నిరంగాలలో వారి ఆధిక్యతను కోల్పోయారు.

కాని ప్రతి కులం దాని వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకొనుటకు ప్రయత్నిస్తున్నది. రెడ్లు రెడ్లుగాను, కమ్మవారు కమ్మవారుగాను, వెలమలు వెలమవారుగాను, రాజులు రాజులుగాను, కోమట్లు కోమట్లుగాను ఉండవలెనని అనుకొనుచున్నారేగాని, అన్నికులాల వారు కలిసిపోవుటకు సిద్ధంగా లేరు. కులాంతర వివాహాలు సర్వ

సాధారణమైనప్పుడే ఈ కలయిక సాధ్యమౌతుంది. కాని దేశంలో విద్యావంతుల సంఖ్య వ్యాపించినా, ఏ కులంవారు ఆ కులం లోనివారినే వివాహ మాడుతున్నారు గాని కులాంతరులను వివాహ మాడడానికి ముందుకు రావడంలేదు. అలాగు వచ్చేవారి సంఖ్య చాల కొద్దిగా ఉన్నది. ఆర్థికపరిస్థితులు మారిన కారణంగా ఎవరూ వారి వారి కులవృత్తులను మాత్రమే చేపట్టడంలేదు. దేశంలో ఏది లాభకరమైన వృత్తో దానిని చేపట్టుతున్నారు. కులవ్యవస్థలో జరిగిన గొప్పమార్పు ఇంతమాత్రమే. గ్రామాలలో కూడా ఈ మార్పుయొక్క ప్రభావం కనిపిస్తున్నది.

ఇంతవరకు గ్రామంలోని సవర్ణులగురించి మాత్రమే వివరించాను. ప్రస్తుతం ధనధాన్యాలు, అధికార పదవులు మొదలైన వాటిని అనుభవించేవారు బ్రాహ్మణులు మినహాగా వీరే. కాని అన్ని గ్రామాలలో ఉన్నట్లు మా గ్రామంలోకూడ సవర్ణులు కాని మాలలు, మాదిగలు ఉన్నారు. వీరు అస్పృశ్యులుగా పరిగణింపబడుతున్నారు. మాలలు గ్రామాన్ని ఆనుకొని ఉన్న మాలవాడలోను, మాదిగలు అరమైలు దూరంలోని మాదిగవాడలోను నివసిస్తున్నారు. వీరు అస్పృశ్యులు కావడంచేత సవర్ణులమధ్య ఇండ్లు కట్టుకొని నివసించడానికి వీలులేదు. సవర్ణులు ఉపయోగించే నూతులలో నీళ్లు చేదుకొనరాదు. వీరిపై ఈలాటి ఆంక్షలు మరికొన్ని ఉన్నవి.

కాని వీరు గ్రామంలోని వీథు లన్నిటిలో నడవవచ్చు. సవర్ణుల ఇండ్ల ఆవరణలోకి వచ్చి నిలబడి ఇండ్ల యజమానులతో మాట్లాడవచ్చు. కూలీలుగా వారి పొలాలలో పనిచేయవచ్చు. జంతువుల మృతకళేబరాలను సవర్ణుల ఇండ్లనుండి తీసుకొని పోవుటకు, వాటి చర్మాలను ఒలిచి పదును చేయుటకు వీరే ఆధారం. ఈ కారణంచేతనే మాదిగలు చర్మకారవృత్తి చేపట్టి సవర్ణులకు కావలసిన చెప్పులు వగైరా తయారుచేసి ఇవ్వడం మామూలు. మాలలు, మాదిగలు లేని పక్షంలో గ్రామజీవితం స్తంభించిపోవడం తప్పదు. ప్రభుత్వ ప్రకటనలను, ఇతర ప్రకటనలను తప్పెటల ద్వారా దండోరా వేసేవారు వీరే. వెట్టివాండ్లుగా గ్రామాధికారులకు సహాయం చేసేవారు వీరే.

గ్రామజీవితంలో ఈలాటి ప్రాధాన్యం వారికి ఉన్నా వారిని ప్రత్యేకవాడలలో నివసింపజేసి, అస్పృశ్యులుగా పరిగణించడానికి కారణం ఏమిటి అనే ప్రశ్నకు చరిత్రకారులు ఎన్నో సమాధానాలు చెప్తున్నారు. వారు దేశంలోని ఆదివాసులని, వారిని ఆర్యులు ద్రావిడులు జయించి వశపరచుకొనిన కారణంగా ఊరి బైట ప్రత్యేకవాడలలో నివసింప వలసినవారయ్యారని, అన్ని దేశాలలో ప్రాచీనకాలంలో యుద్ధాలలో ఓడిపోయిన వారికి ఈ గతే పట్టిందని, ఇందులో విపరీతం ఏదీ లేదని చరిత్రకారులు చెప్పడం కద్దు. ఇందులో సత్యం ఉన్నట్లు మనం అంగీకరించవచ్చు.

ఇదీగాక మృత జంతువుల మాంసాన్ని భక్షించుటకు వీరు అనాదిగా అలవాటుపడినారనీ, అందుచేత వారు అశుచులుగాను, అస్పృశ్యులుగాను పరిగణింపబడినారనీ, తక్కిన మాంసాహారులు ఈలాగు చేయనివారు కావడంచేత వీరికి అస్పృశ్యతాదోషం పట్టిందనీ అనేకుల అభిప్రాయం. ఇందులో కూడ సత్యం ఉన్నట్లు చెప్పవచ్చును.

ఈ సందర్భంలో స్పృశ్యత, అస్పృశ్యతల గురించి మనలో జీర్ణమైపోయిన కొన్ని భావాలు, కొన్ని ఆచారాలు పేర్కొనిన పక్షంలో మాలలు, మాదిగలు అస్పృశ్యులుగా ఎందుకు పరిగణింపబడుతున్నారో మరికొన్ని కారణాలు మనకు స్ఫురించవచ్చును. మైల, మడి, శుచిత్వం, అశుచిత్వం, దృష్టిదోషం మొదలైనవి సవర్ణుల జీవితవిధానంలో కూడా కనుపిస్తున్నవి. వైష్ణవులు స్మార్తులను తమ వంటఇంటిలోకి రానివ్వరు. వారితో పంక్తి భోజనం చేయరు. వారి దృష్టిదోషం సోకరాదనేదే దీని అర్థం. అలాగే బ్రాహ్మణులు బ్రాహ్మణేతరులను ముట్టుకొంటే మైలపడిపోతారు. అలాగు ముట్టుకొన్నప్పుడు వారు బట్టలు మార్చుకొని స్నానం చేయవలసి ఉంటుంది. (బ్రాహ్మణేతరులలో కూడ ఈ మైల, మడి అనే భేదం కనుపిస్తుంది) ఇంటిలో ప్రసవం జరిగినప్పుడు పదిరోజులపాటు ఇంటివారు వారి బంధువులు పురుడు పాటిస్తారు. ఆ రోజులలో వారు ఇతరులకు అస్పృశ్యులగుచున్నారు. ఎవరైనా మృతిచెందినప్పుడు పదిరోజులు జ్ఞాతులందరు ఈ ఆచారాన్ని పాటిస్తారు. వారిని తక్కిన

పంచాంగం బ్రాహ్మణుడు, పౌరోహితుడు, పౌరాణికుడు, కోమటి, శెట్టి, బంగారం పనిచేసే కంసాలిబత్తుడు, కుమ్మరి, కమ్మరి, వడ్రంగి, వెట్టి మొదలైనవారిని పేర్కొని వారు సుఖంగా ఉండవలె ననేది ప్రధానాంశం. గ్రామసౌభాగ్యం అనేకులపై ఆధారపడి ఉన్నదనే భావం ఈ పాటలో స్పష్టంగా కనుపిస్తున్నది. గ్రామ జీవితాన్ని గురించి తప్పకుండ గుర్తించవలసిన విషయం ఇందులో ప్రాముఖ్యత వహించింది. ఇది 80 సంవత్సరాల క్రింద నేను విన్న పాట. ఇప్పుడు ఈ పాటను పాడేవారు ఎవరూ లేరు.

క్రిందికులాలవారు సాధారణంగా పైకులాలవారిని పేరుపెట్టి పిలిచేవారు కారు 'నాయన, అమ్మ, అత్త, అక్క' అని ఏదో సంబంధం కలుపుకొని వారిని సంబోధించడం కూడ గ్రామస్థుల ఏకీభావానికి ఒక నిదర్శనం.

భారతీయు లందరు మతంపట్ల ఎక్కువ శ్రద్ధాభక్తులు కలవారని చెప్పడం కద్దు. కాని మా గ్రామంలోని వారిలో దీనికి ఏలాంటి ప్రత్యేక నిదర్శనం నాకు కనిపించలేదు. గ్రామంలో చెన్నకేశవదేవాలయం, సన్న్యాసిదేవాలయం అని రెండు దేవాలయములు ఉండేవి. వీటిలో మొదటిదానికి ఒక గర్భగృహం, దానిపైన గోపురం, దాని ఎదుట ఒక ధ్వజస్తంభం, దేవాలయం చుట్టూ ఒక ప్రహరీగోడ ఉండేవి. దేవాలయానికి ఇనాం భూములు ఉండడంచేత వాటినుండి వచ్చే ఆదాయాన్ని ఆధారం చేసుకొని దానికి అర్చకుడైన ఉదయగిరి నారాయణా చార్యులు రోజూ మధ్యాహ్నం దేవాలయానికి వెళ్లి పూజ పురస్కారాలను నడిపి, దీపారాధన పూర్వంగా దేవునికి నైవేద్యం పెట్టి వచ్చేవారు. ఈ దినచర్య తప్ప ఉత్సవాలు, ఊరేగింపులు జరగడంలేదు. గ్రామీణులెవ్వరు దేవాలయానికి వెళ్లేవారుకారు. వారిని ఆకర్షించే ఉత్సవాదులు లేకపోవడమే దీనికి కారణం.

సన్న్యాసిదేవాలయం దీనికి ఎదుటనే ఉండేది. దీనికి ఒక చిన్న గర్భగృహం, అందులో రెండు పావుకోళ్ళు వుండేవి. దీనికి పూజా పురస్కారాలు ఏమీ లేవు. ఎప్పుడైనా ఎవరైనా పావుకోళ్ళకు అర్చన చేసేవారు. కాని దీనిచుట్టూ చక్కగా గచ్చు

చేసిన విశాలమైన అరుగు ఉండేది. రోజూ సాయంకాలం నాలుగు గంటల ప్రాంతాన అరవ కరణాల కులానికి చెందిన మల్లవనాయుడు అరుగుమీద హాజరు కావడం మామూలు. ఇది ఆయన దినచర్య. ఆయన చుట్టూ పది పదిహేను మంది చేరి కబుర్లు చెప్పుకొంటూ ఉండేవారు. ఈ అరుగే గ్రామస్థులు సమావేశమయ్యే ప్రదేశంగా ఉపయోగపడేది.

ఈ అరుగుమీద అప్పుడప్పుడు పురాణపఠనం జరిగేది. మా పినతండ్రి శ్రీనివాసాచార్లుగారి అల్లుడు, దండిగుంట నివాసి శ్రీ వావిళ్ళ విశ్వనాథశాస్త్రి పురాణపఠనంలో ఆరితేరినవారు. ఆయన మా గ్రామానికి వచ్చినప్పుడు ఈ అరుగుమీద పురాణ పఠనం జరిగేది. దానిని వినడానికి 40, 50 మంది హాజరయ్యే వారు. అస్పృశ్యులు కూడ దానిని వినడానికి వచ్చి, అరుగు ఎదట కొంతదూరంలో నిలబడి ఉండేవారు. మన మతం యొక్క సారాంశం కథారూపంలో మహాభారతం, రామాయణం వంటి గ్రంథాలలో రూపొంది ఉన్నది. పురాణపఠనం వినడం మూలంగా గ్రామస్థులకు మన మతంతో పరిచయం లభించేది.

సాధారణంగా గ్రామస్థులకు ఏదైనా ప్రమాదం సంభవించి నప్పుడు దాని నివారణార్థం వారు తిరుపతిలో వెంకటేశ్వరస్వామికి గాని, నరసింహులు కొండపైన దేవాలయంలోని నరసింహస్వామికి గాని మొక్కుకొని, మొక్కుబడి తీర్చుకొనడానికి ఈ దేవాలయాలకు వెళ్ళి స్వామి దర్శనంచేసుకొని వచ్చేవారు. వారికి మతంలో గల శ్రద్ధ ఈ రూపంలో కనుపించేది.

గ్రామంలో నా బాల్యంలో రెండు మూడు పర్యాయములు జాతర్లు జరగడం నేను చూచాను. వీటిలో క్రింది కులాలవారే ప్రధానంగా పాల్గొనేవారు. అన్నపు రాసులతోను, జంతుబలుల తోను, చెవులు తూట్లు పడేటట్లు తప్పెటలను వాయిస్తూ గ్రామ దేవతను పూజించడం జాతరలకు లక్షణం. కాలక్రమేణ జాతర్ల ప్రాధాన్యం తగ్గింది. ఈనాడు జాతర్లు జరగడంలేదు.

మా గ్రామానికి మూడు మైళ్ళ దూరంలో సముద్రతీరాన రామతీర్థంలో ఒక గొప్ప దేవాలయం ఉన్నది. అందులో వెలసిన దేవుడికి ఏటేట జ్యేష్ఠ బహుళ అమావాస్యకు ముందు 9 రోజులు

ఉత్సవాలు జరిగేవి. మా గ్రామంతో సహా చుట్టుపట్ల గ్రామాల నుంచి వందలాది జనం దాన్ని చూడడానికి వెళ్ళి, అమావాస్య రోజున సముద్రస్నానం చేసి వచ్చేవారు. ఈలాంటి తిరునాళ్లు నెల్లూరు రంగనాయక దేవాలయంలోను, నరసింహులకొండ, బిట్రగుంట దేవాలయాలలోను జరిగేవి. గ్రామస్థులు ఆ సమయాలలో అక్కడికి వెళ్లేవారు. వీటి మినహా వారి జీవితంలో మతసంబంధమైన విశేషాలు లేవు.

40, 50 సంవత్సరాలకు పూర్వం అందరిలోను బ్రాహ్మణ భక్తి ఎక్కువగా ఉండేది. వారిని సత్కరించిన పక్షంలో తమ పాపాలు నశించి, తమకు మోక్షప్రాప్తి కలుగుతుందని భావించేవారు. వారిని సత్కరించ గలిగిన ధనికులు మా గ్రామంలో ఎవరూ లేరు. మాకు సమీపంగా ఉండే ఇందుపూరు గ్రామంలో సంపన్నులైన రెడ్లు చాలమంది ఉండేవారు. వారు అప్పుడప్పుడు బ్రాహ్మణ సంతర్పణలను ఏర్పాటు చేసేవారు. సంక్రాంతినాడు వారికి దానాలు చేసి సత్కరించేవారు. వారి ఈ మతవిశ్వాసం కొంతవరకు ఇటీవలకాలంలో అదృశ్యము కావడమే కాకుండా, బ్రాహ్మణద్వేషం కూడ పెరిగింది. ఈ మార్పులను గురించి విచారించవలసినది ఏదీ లేదు. మూఢ విశ్వాసాలు తగ్గుముఖం పట్టినట్లు దీనిమూలంగా భావించవచ్చు. సమాజంలో జరిగిన మార్పులలో ఇది ఒకటి.

గ్రామంలో హిందువులతో పాటు అయిదారు కుటుంబాల ముస్లింలు (వీరిని తురకలని, సాయెబులని ఆనాడు పిలిచేవారు ) ఉండేవారు. వీరి ఇండ్లన్నీ ఒకే వీధిలో ఒకే ప్రక్కన ఉండేవి. గ్రామీణుల అభిప్రాయంలో వీరు యితర కులాలవలె వేరొక కులానికి చెందినవారనేది మాత్రమే. వీరు ఉర్దూ మాట్లాడే వారైనా తెలుగుకూడ చక్కగా మాట్లాడేవారు. పంచెలకు బదులు పంట్లాములు ధరించేవారు. స్త్రీలు చెవినిండా పోగులు పెట్టుకొనేవారు. తక్కిన కులాలవారివలె వారిలో కొందరు భూస్వాములుగాను, కొందరు కౌలుదార్లుగాను, కొందరు కూలీలు గాను జీవితం సాగిస్తూ ఉండినారు. కొన్నిసంవత్సరాలకాలం మా సేద్యగాడు ఒక తురకసాయబు. అతడు మాఇంటి ఆవరణలో

ఇంటికి ఎదట ఒక వసారా వేసుకొని కుటుంబ సహితంగా అందులో కాపురం చేస్తూ ఉండినాడు.

తురకల మతాభిమానం వారి పీర్లపండుగల కాలంలో (మొహరం కాలంలో) కనుపించేది. ఆ సమయంలో వారు అనేక వేషాలు వేసుకొని వీధులలో ఊరేగింపుగా వెళ్ళడం మామూలు. తక్కిన కులాలవారు కూడ ఆ ఊరేగింపులలో పాల్గొనడం సర్వ సాధారణం. వారు వేరే, హిందువులు వేరే అనే భావం ఆనాడు లేదు. ఈనాడు కూడ గ్రామంలో ఆలాటి భావం లేదనే చెప్పవచ్చును.

ఇటీవలి కాలంలో వారి సంఖ్య పెరిగింది. వారు నివసిస్తున్న వీధిలో క్రొత్త ఇండ్లు కట్టుకొనుటకు స్థలం లేని కారణంగా వారు చెరువుకట్ట క్రింద ఖాళీప్రదేశంలో ఇండ్లు కట్టుకొన్నారు. 7, 8 కుటుంబాలవారు అక్కడ నివసిస్తున్నారు. 6, 7 సంవత్సరాలుగా నేను మాగ్రామానికి వెళ్ళలేక పోయాను. వృద్ధాప్యం, దానికి సంబంధించిన జబ్బులు దీనికి కారణం. ఈ మధ్యకాలంలో చెరువును పూడ్చి, వ్యవసాయయోగ్యంగా చేశారని, చెరువుకట్ట ఏదీ లేదని, అందుచేతనే చెరువును ఆనుకొని ఉన్న ప్రదేశంలో తురకలు ఇండ్లుకట్టుకో గలిగారని తెలియవచ్చింది.

గ్రామంలో సాతాని కుటుంబం ఒకటి ఉన్నట్లు ఇదివరకే చెప్పినాను. దాని యజమాని సాతాని నరసయ్య ఈసందర్భంలో నాకు జ్ఞాపకం వస్తున్నాడు. అతడు ఆజానుబాహువు. 6½ అడుగుల పొడగరి. వారానికి ఒకటి రెండు పర్యాయాలు ఉదయమే స్నానంచేసి, పింజెపోసిన తెల్ల ధోవతిని ధరించి, నడుముచుట్టు ఒక తెల్లని అంగవస్త్రాన్ని చుట్టుకొని, వైష్ణవం ఉట్టిపడేటట్లు ముఖం లోను, చేతులపైన, రొమ్ముపైన నామాలు వేసుకొని, తలపైన రాగి అక్షయపాత్రను పెట్టుకొని భగవన్నామస్మరణ చేస్తూ, కీర్తనలను రాగయుక్తంగా పాడుతూ, నాట్యం చేస్తూ మాయింటి ఆవరణలో 15, 20 నిమిషాలు గడిపేవాడు. ఎంత నాట్యం చేసినా తలపైన అక్షయపాత్రకు ఏలాటి చలనం ఉండేదికాదు. దానిని

శిరస్సుపైన అమర్చుకొనడంలోనే అతని గొప్ప నేర్పు. ఆతడు నాట్యం ముగించిన వెంటనే మా తల్లిగారు అర్ధశేరు బియ్యాన్ని అక్షయపాత్రలో పోసి, అతనిని పంపివేయడం మామూలు. తక్కిన గృహిణిలు కూడ ఈలాగే చేసేవారు. అతడు భిక్షాటకుడని ఎవరూ గర్హించినవారు కారు. కులవృత్తిని అనుసరించడమే సత్సం ప్రదాయమని, అతడు భగవద్భక్తుడని అందరు భావించేవారు. 80 సంవత్సరాలు గడచిపోయినా అతడు ఇప్పటికి కూడ నా కండ్లఎదుట ఉంటున్నాడు.

నా బాల్యంలోను, అటు తర్వాత కొంతకాలం వరకు ప్రజలకు గౌరవపాత్రులైనవారు ఇద్దరు ముగ్గురు ఉండినట్లు చెప్పవచ్చును. వారిలో మా నాయనగారు ఒకరు. వారి పేరు వెంకటేశయ్య. కాని గ్రామస్థు లందరు వారిని వెంకటేశమయ్య అని పిలిచేవారు. గ్రామంలో ఎవరిమధ్యనైనా వివాదాలు సంభవించినప్పుడు వాటిని తీర్చుటకు వివాదపడినవారు సాధారణంగా వారిని మధ్యవర్తిగా ఎన్నుకొని, వారిది నిష్పక్షపాత వైఖరి అనే భావంతో, వారి తీర్పుకు కట్టుబడి ఉండేవారు. కోర్టులకు వెళ్ళి వివాదాలు పరిష్కరించుకొనుటకు ఎవరూ ఆ రోజులలో ఇష్టపడేవారు కారు. మునసబుకోర్టు గ్రామానికి ఇరవై మైళ్ళ దూరంలో కావలిలో ఉండేది. అక్కడికి వెళ్ళి దావాలు చేయడం వ్యయ ప్రయాసలతో కూడు కొన్నపని. అబద్ధం చెప్పడం పాపమని అందరూ భావించినా కోర్టులో అబద్ధం చెప్పడం పాపకార్యం కాదని అందరూ అనుకొని, ప్లీడర్లు ఏలాటి సాక్ష్యం చెప్పమంటే ఆలాటి సాక్ష్యం చెప్పేవారు. కోర్టుల పరిష్కారం ఆలాటి సాక్ష్యంపై ఆధారపడి ఉండడంచేత దానిపట్ల ఎవరికీ విశ్వాసం ఉండేదికాదు. ఆ పరిష్కారం జరుగుటకు ఒక్కొక్కప్పుడు సంవత్సరాలు గడిచేవి. వ్యాజ్యాలను ఏదో మిషమీద పొడిగించడం ప్లీడర్లకు లక్షణం. వాటిని పొడిగించే కొద్దీ వారి ఆదాయం పెరిగేది. బ్రిటిషువారు ప్రవేశ పెట్టిన న్యాయ విచారణ విధానంలో తప్పుడు సాక్ష్యాలకూ, కాల యాపనకు, హద్దుమీరిన ఖర్చులకు ఎంతైనా అవకాశం ఉండేది. అందుచేతనే గ్రామీణులు కోర్టులకు వెళ్ళడం మాని,

గ్రామంలోని పెద్దమనుష్యుల మధ్యవర్తిత్వంద్వారా వివాదాలను పరిష్కరించుకొంటూ ఉండేవారు.

మా నాయనగారు వ్రాతకోతలలో సిద్ధహస్తులు. విక్రయ పత్రాలు మొదలైన వాటిని గ్రామస్థులలో అనేకులు వారిచేతనే వ్రాయించుకొనేవారు. పత్రాలను రిజిస్టరు చేయవలసి వచ్చినప్పుడు వారి సహాయంతో అల్లూరు రిజిస్ట్రార్ కచ్చేరికి వెళ్లి వాటిని రిజిస్టరు చేసుకొని వచ్చేవారు. విధిలేక కోర్టులో దావాలు వేయవలసినప్పుడు వారి సహాయాన్ని కోరేవారు. అనేకవిధాలుగా వారు గ్రామస్థులకు సహాయంచేస్తూ వారి గౌరవాభిమానాలకు పాత్రులైనారు.

మా పొరుగున మైలు దూరంలో వున్న ఇందుపూరు గ్రామం సుసంపన్నులైన పంటకాపుల (రెడ్లు) తో కూడినట్టిది. వారిలో ఏటూరు సుబ్బారెడ్డి, రామిరెడ్డి, రామచంద్రారెడ్డి, నూకలపాటి రాఘవరెడ్డి (వీరికి వ్యవహారంలో దత్తు రాఘవరెడ్డి అని పేరు. వీరు సుప్రసిద్ధ నటకులు పర్వతిరెడ్డి రామచంద్రారెడ్డిగారి తండ్రి) గార్ల ఇండ్లలో మా నాయనగారు లెక్కలు వ్రాసి, వారి వ్యవహారాలలో సహాయపడుచుండెడివారు. మా నాయనగారిపట్ల వారికి అఖండమైన నమ్మకం. వ్యవహారాలన్నిటిని వారి సలహాతో సాగించుకొనడం వారికి పరిపాటి. అందుచేత మా నాయనగారు సాధారణంగా ప్రతిరోజు 9 గంటలకు ఇందుపూరు వెళ్లి, వారి ఇండ్లలో లెక్కలు వ్రాసి, వ్యవహారాలను, వారి ఇతర పనులను పూర్తిచేసి 11 గంటలకు తిరిగి ఇంటికి చేరేవారు. ఒక్కొక్కప్పుడు నేనుకూడ వారితో వెళ్ళుచుండేవాడను. వారు ఆ రెడ్ల ఇండ్లలో తయారైన మజ్జిగను, పెరుగును తీసుకొని వచ్చేవారు. ఇవి బహు రుచికరముగ ఉండేవి. వారి ఇండ్లలోని ఆడవారు పాలను చక్కగాను, నెమ్మదిగాను కాచి, సకాలంలో చెమిరిపెట్టి, ఈలాటి పెరుగును, మజ్జిగను తయారుచేసేవారు. ఇందులో వారికి ప్రత్యేక నేర్పు ఉండేది. మోపూరు కాపుల ఇండ్లలోని పెరుగు ఇంతకంటె ప్రశస్తమైనట్టిది. పెండ్లిండ్లు ఎవరి ఇంట్లోనైనా జరిగినప్పుడు ఈ పెరుగును తెప్పించి అనేకులు అతిధులకు వడ్డించేవారు. ఇప్పటికి కూడ దాని ప్రాశస్త్యం తగ్గలేదు. ఆ రోజులలో పాడిగలవా

రెవ్వరు పాలనుగాని, పెరుగునుగాని అమ్మేవారు కారు. ఇది పాపకార్యమని వారు భావించేవారు. గొల్లలకు ఇది కులవృత్తి కావడంచేత వారుమాత్రమే దీనిని అమ్మడం మామూలు. ఇతరులు ఉచితంగా తమ ఇంటికివచ్చి అడిగినవారికి దానిని పంచిపెట్టేవారు.

నాకు తెలియునప్పటికి ఏటూరు సుబ్బారెడ్డిగారు కడు వృద్ధులు. వారికి అయిదుగురు కుమారులు. వారిలో పేరారెడ్డి పెద్దవారు. వారికి మా గ్రామంలోకూడ భూములు ఉండడంచేత వారు మా ఇంటికి అప్పుడప్పుడు రావడం జరిగేది. వారు ఒక్కొక్కప్పుడు మా ఇంటి అరుగుమీద కూర్చుండి మా నాయనగారి చేత భారతాన్ని చదివించి దానిని శ్రద్ధతో విని వెళ్ళిపొయ్యేవారు.

గ్రామస్థులలో చెప్పుకోతగిన వారిలో ఉదయగిరి నారాయణాచార్యులు ఇంకొకరు. వీరు వైఖానస వైష్ణవులు. సంస్కృతంలోను, తెలుగులోను కొంత పాండిత్యం సంపాదించినవారు. చెన్నకేశవ దేవాలయానికి అర్చకులు. వీరు చిన్నతనంలోనే భార్యను కోల్పోయారు. వైఖానసులలో ఆడపిల్లల సంఖ్య చాలా తక్కువ. మొదటి వివాహానికి కూడ పిల్లలు దొరకడం చాలా కష్టం. రెండవ వివాహానికి దొరికేవారు కారు. అందుచేత ఆచార్లు రెండవ వివాహం చేసుకోనడం సాధ్యం కాలేదు. ఒక కుమ్మరి స్త్రీ ఆయనకు అన్ని పరిచర్యలు చేస్తూ ఉండేది. కాని వంటనుమాత్రం ఆయన చేసుకోనేవాడు. రోజు 11, 12 గంటల ప్రాంతంలో ఆయన పళ్లెంలో నైవేద్యం పెట్టుకొని, దేవాలయమునకు వెళ్ళి, దేవుడికి అర్చన చేసి, దీపారాధన పూర్వంగా నైవేద్యం పెట్టి ఇంటికి వచ్చి భోజనం చేసి, కొంత విశ్రాంతి తీసుకొని మూడు గంటలప్పటినుండి సాయంకాలంవరకు ఇంటికి వచ్చినవారితో కాలక్షేపం చేయడం వారి దినచర్య. వారి ఇల్లు ఒక క్లబ్బుమోస్తరుగా ఉండేది. వారు భారతమో, రామాయణమో, భాగవతమో చదువుచు, వచ్చినవారికి దాని అర్థం చెప్తూ ఉండేవారు. ఒక్కొక్కప్పుడు మా గ్రామానికి మైలు దూరంలో ఉన్న దిన్నె గ్రామ నివాసి, వావిళ్ల కామాక్షయ్య బంధువులను చూచుటకు మా గ్రామానికి వచ్చి మధ్యాహ్నం ఆచార్లుగారి ఇంట్లో కాలం గడపడం మామూలు. కామాక్షయ్య రాగయుక్తంగా పద్యాలు చదువ

గలవాడు. ఆయన వచ్చిన రోజులలో ఆచార్లుగారు ఆయనచేత పుస్తకాన్ని చదివించి, అర్థంమాత్రం తాను చెప్పేవాడు. నా చిన్నతనంలో మద్రాసులో ఇంగ్లీషు చదువు సాగిస్తూ సెలవులలో మా గ్రామానికి వచ్చినప్పుడు మధ్యాహ్నకాలాన్ని ఆచార్లుగారి ఇంట్లోనే గడిపేవాడను. మద్రాసునుంచి ఏదైనా కథలపుస్తకాన్ని నేను తెచ్చినప్పుడు దానిని కూడ చదివి, ఇంటికి వచ్చినవారికి అర్థం చెప్తూ ఉండేవారు.

ఆనాడు చెన్నకేశవ దేవాలయంలోని కఱ్ఱ ధ్వజస్తంభం శిథిలావస్థలో ఉండేది. ఆచార్యులవారు కష్టపడి దానిస్థానే రాగి రేకులు పొదిగిన ధ్వజస్తంభాన్ని ప్రతిష్ఠించారు. ఇంతేగాక ఊరి నడుమ ఇంకొక చిన్న దేవాలయాన్ని కట్టి దానికి తానే అర్చకుడై దేవునికి దీపారాధన, నైవేద్యాదులను రోజూ సమర్పించేవారు.

ఆచార్యులుగారు ఆయుర్వేద వైద్యంలో కొంత నైపుణ్యం కలవారు. గ్రామీణులకు ఏలాటి వైద్యసహాయం లేని ఆ రోజులలో ఆయనమూలంగా గ్రామస్థులకు కొంతవరకైనా సహాయం లభించేది. వారు ఒక సంచి నిండా మాత్రలు, కుప్పెకట్లు పెట్టుకొని అవి ఖర్చు అయినప్పుడు వాటిని తిరిగి తయారు చేయడం నేను తరుచుగా చూచేవాడను. వారు నాడిని పరీక్షించి తగిన మందులు ఇచ్చేవారు. ఇంగ్లీషు చదువు నిమిత్తం చిన్న వయస్సులో మద్రాసుకు వెళ్ళినప్పుడు మొదటి సంవత్సరములో నేను జిగటవిరేచనాలతో నెలరోజులు చాలా బాధపడ్డాను. అక్కడ వైద్యులు ఇచ్చిన మందులు రోగాన్ని అరికట్టలేక పోయినవి. ఆసమయంలో మా నాయనగారు మద్రాసుకు వచ్చి, నన్ను గ్రామానికి తీసుకొని వెళ్ళి ఆచార్యులుగారిచే చికిత్స చేయించడంవలన నాలుగు రోజులలో విరేచనాలు నిలిచి పోయినవి. మామూలు ఆరోగ్యం నాకు లభించింది. ఆయుర్వేద వైద్యానికి సంబంధించిన లోతుపాతులన్నీ వైద్యులకు తెలియక పోయినా, దాని విషయమై వారు కొత్త పరిశోధనలు చేయలేక పోయినా వారు సేకరించి పెట్టుకొన్న ఔషధాలు చక్కగా పని చేయగలిగి ఉండేవి అని స్వానుభవం మూలంగా నేను తెలుసుకొన

గల్గినాను. ఆయుర్వేద వైద్య విధానాన్ని గురించి పరిశోధనలు జరగవలసిన అవసరం ఎంతైనా ఉన్నది. ప్రభుత్వం అలాంటి అవసరాన్ని తీర్చుటకు కృషి చేయవలసి ఉన్నది. దీనిని గురించి అధికారులు ఉపన్యాసాలు చేస్తారేగాని, అవి క్రియారూపం ధరించడంలేదు. ప్రాశ్చాత్య వైద్యవిధానంమీద అధికారం వహించినవా రందరికి ఉండే అభిమానమే ఈ ఉదాసీనతకు కారణము.

గ్రామస్థులలో పేర్కొనదగిన వారిలో వేదం వెంకటాచలయ్యగారు ఇంకొకరు. వీరు కొంతకాలం గ్రామానికి పెద్ద కాపుగా ఉండినారు. నారాయణాచార్యులు మోస్తరుగా కొంత వైద్యం కూడ చేసేవారు. కాని తోలుబొమ్మలను తయారు చేయడంలో వారికి ప్రత్యేక నైపుణ్యం ఉండేది. వారి ప్రఖ్యాతికి ఇదే ప్రధాన కారణం. బొమ్మలను వారు తయారుచేసి, వాటికి రంగులు వేసి అప్పుడప్పుడు బొమ్మలాటలను ఏర్పాటు చేసేవారు. ఇవి రాత్రి పది గంటలకు ప్రారంభమై సూర్యోదయంవరకు జరిగేవి. గ్రామంలోనివారు అధికసంఖ్యలో వీటిని చూచుటకు వచ్చేవారు. ఈ ఆటలలో అనేకం రామాయణానికి సంబంధించి నట్టివి. రామ రావణ యుద్ధాన్ని గురించి వెంకటాచలయ్య ఏర్పాటుచేసిన బొమ్మలాటను నేను స్వయంగా చూచాను. ఆటమధ్యన బంగారక్క, కేతిగాడి బొమ్మలు కనిపించేవి. వారి సంభాషణలోని హాస్యం కొంచెం ముదుగుగా ఉండినా గ్రామస్థులు దానిని ఎక్కువగా ప్రశంసించి ఆనందించేవారు.

ఆరోజులలో యానాదులు వీధినాటకాలను ప్రదర్శించడం కద్దు. బొమ్మలాటలతో పాటు ఇవి కూడ గ్రామస్థులకు చాలా ఆకర్షణీయంగా ఉండేవి. ఇవి కూడ దివిటీల ఎదుట రాత్రి పది గంటలకు ప్రారంభమై సూర్యోదయం వరకు జరిగేవి. ఆట ముగిసిన తర్వాత యానాది బృందం ఇంటింటికి వెళ్ళి ధాన్యరూపంలోగాని, బియ్యం రూపంలోగాని, డబ్బురూపంలోగాని ఇంటివారు ఇచ్చిన విరాళాలను తీసుకొని వెళ్ళిపొయ్యేవారు. ఆనాడు టిక్కట్లపద్ధతి లేదు. ఎలాంటి ఖర్చూ లేక గ్రామస్థులు నాటక ప్రదర్శనాలను చూచే

## 2. మా శాఖ

"నీవు ఎవరు?" అనే ప్రశ్నను ఎవరైనా వేసినప్పుడు దానికి జవాబుగా తన కులాన్ని చెప్పడం మన సంప్రదాయం. కులాచారాలను, కులవృత్తులను తూచా తప్పకుండా అనుసరిస్తున్న కాలంలో కులం పేరు చెప్పడం ద్వారా తన్నుగురించి చెప్పినట్లే భావించడం ఉచితంగానే ఉండేది. ఈ సంప్రదాయాన్ని అనుసరించి బ్రాహ్మణ వర్గానికి చెందినవారిలో అనేక శాఖలు ఉండడంచేత, తాను ఏ శాఖకు చెందినవాడో 'నీవు ఎవరు?' అనే ప్రశ్నకు జవాబు చెప్పడం మామూలు. నేను బ్రాహ్మణ శాఖలో పుదూరు ద్రావిడ శాఖకు చెందినవాడను.

ప్రాచీనకాలంలో బ్రాహ్మణ సంప్రదాయం దీనికి భిన్నంగా ఉండేది. పై ప్రశ్నకు సమాధానంగా వారు వారి ప్రవర్తను, గోత్రాన్ని, సూత్రాన్ని, వేదాన్ని చెప్పేవారు. వారు చేసే సంధ్యావందనంలో తుదివాక్యం వీటిని సూచించేది. నా సంధ్యావందనంలో అది ఈక్రింది విధంగా ఉండేది :

"అభివాదయే. ఆంగీరస ఆయాస్య
గౌతమ త్రయార్షేయ ప్రవరాన్విత
గౌతమ గోత్రః ఆపస్తంబ సూత్రః
యజుశ్శాఖాధ్యాయీ
వేంకట రంగ శర్మాహం అస్మిభో..."

పెద్దలకు నమస్కరించునప్పుడు ఈ వాక్యాన్ని ఉచ్చరిస్తూ నమస్కారం చేసేవారు. సనాతనులుగా ఉండేవారు ఈనాడు

కూడ ఈలాగే చేస్తారు. అధునాతనులు సంధ్యావందనాన్ని మానివేయడంచేత ఈలాటి వాక్యం ఒకటి ఉన్నదనిగాని, తమ గోత్రం ఏదైనది గాని వారికి తెలియదు. లాంఛన ప్రాయంగా వివాహానికి పూర్వం ఉపనయనం చేసుకొనే ఆచారం ఇప్పుడు కూడ నిలబడి ఉన్నది. కాని ఉపనయన కాలంలో సంధ్యా వందనాన్ని నేర్చుకొనేవారు, దానిని ప్రతిరోజు చేసేవారు లక్షకు ఒకడు కూడ లేడు. బ్రాహ్మణ సమాజంలో ఇటీవలి కాలంలో జరిగిన మార్పులలో ఇది మౌలికమైనట్టిది. అనాదిగా బ్రాహ్మణత్వానికి ఉపనయనం ఒక చిహ్నంగా ఉండేది. ఈనాడు దానికి ఏలాటి ప్రాధాన్యం లేదు.

మాది పుదూరు ద్రావిడశాఖ అని పైన చెప్పినాను. సాధారణంగా బ్రాహ్మణులపట్లను, వారిలో ముఖ్యంగా వేదశాస్త్ర పండితులపట్లను రాజులు, ప్రజలు ఆదరణ కలవారుగా ఉండిన కాలంలో మా శాఖకు చాలా ప్రాధాన్యం ఉండేది. ఈనాడు కూడ దీని చరిత్ర మూలంగా మనం కొన్ని గుణపాఠాలు నేర్చుకోగల అవకాశం ఉండడంచేత, దానిని సంక్షిప్తంగా ఇచ్చుట వివరిస్తున్నాను.

అనాదిగా మనదేశంలో ఒక ప్రాంతానికి చెందినవారు వేర్వేరు ప్రాంతాలకు వెళ్ళి, అక్కడ స్థిరనివాసాలు ఏర్పరచుకొని, అక్కడి ప్రజలతో పూర్తిగానో, కొంతవరకో కలసి పోవడం జరుగుతూ ఉన్నది. ఈ సాంఘిక పరిణామానికి మా శాఖకు చెందిన చరిత్ర ఒక ఉదాహరణము.

ద్రావిడులు ప్రధానంగా తమిళప్రాంతాలకు చెందినవారు. వారు తమిళభాషను మాట్లాడేవారు. వారిలో అనేకులు అప్పుడప్పుడు ఆంధ్రప్రాంతాలకు వచ్చి అక్కడే స్థిరంగా ఉండి పోయ్యారు. 11-వ శతాబ్దానుండి తమిళ దేశంలోని చోళచక్రవర్తులకు ఆంధ్రదేశంలో కోస్తాప్రాంతానికి పరిపాలకులుగా ఉండిన వేంగీ పరిపాలకులైన తూర్పుచాళుక్యులకు బాంధవ్యమూలంగా సన్నిహిత సంబంధం ఏర్పడింది. తుదకు దీని ఫలితంగా చాళుక్యులే తమిళాంధ్రదేశాలకు పరిపాలకులయ్యారు. మొదటి కులోత్తుంగచోళు డనబడు రాజేంద్రుడు రాజరాజనరేంద్రుని

కుమారుడు. చోళచక్రవర్తి రాజేంద్రచోళుని దౌహిత్రుడు. కాబట్టియే వీనిని 'ఉభయకులోత్తుంగ' అన్నారు. ఇతని తర్వాత రెండువందల సంవత్సరములు ఇతనివారు పాలించారు.

వీరి పరిపాలన కాలంలో తమిళ బ్రాహ్మణు లనేకులు కుటుంబ సహితంగా ఆంధ్రదేశానికి వచ్చి, ఇక్కడ అగ్రహారాలను సంపాదించి, స్థిరపడిపోవడం జరిగింది. ఆంధ్రులు అలాటివారిని ద్రావిడ బ్రాహ్మణులని పిలిచేవారు. వీరు కొన్ని అగ్రహారాలను కేంద్రాలుగ జేసుకొన్నవారు కావడంచేత అనేక శాఖలుగా విడిపోయారు. ఆ అగ్రహారాలను బట్టి విశాఖపట్నం జిల్లాలో దిమిలి *ద్రావిడులు తూర్పుగోదావరి జిల్లాలో పేరూరు ద్రావిడులు, ఆరామ ద్రావిడులు వేర్వేరు శాఖలుగా ఏర్పడినారు. మా శాఖ వారు నెల్లూరు జిల్లాలో నాయుడుపేటకు సమీపాన ఉండే పుదూరు అగ్రహారాన్ని కేంద్రంగా చేసుకొన్నవారు కావడంచేత వ్యవహారంలో వీరికి పుదూరు ( పుదూరు అనగా తమిళంలో క్రొత్తఊరు అని అర్థం ) ద్రావిడులనే పేరు వచ్చిందని ప్రతీతి. ఈవిషయం లోను, వీరు ఏ కాలంలో ఏ పరిస్థితులలో వచ్చిన విషయాల గురించిన్నీ చాలా పరిశోధన జరుగవలసి యున్నది. అప్పుడుగాని వీరి పుట్టుపూర్వోత్తరాల గురించి ఇదమిద్ధమని నిర్ణయించుటకు సాధ్యపడదు. దీనినిగురించి 1920 ప్రాంతాన సుప్రసిద్ధ పండితులు చెదలవాడ సుందరరామశాస్త్రిగారు ఇటీవల వేదం వెంకటరాయ శాస్త్రిగారు ( సుప్రసిద్ధ రచయిత వెంకటరాయశాస్త్రిగారి మనుమలు ) కొంత పరిశోధన గావించారు గాని అది అసమగ్రంగానే ఉన్నది.

పుదూరు ద్రావిడులు తమిళదేశంలోని కంద్ర మాణిక్య బృహచ్చరణ శాఖకు చెందినవారు. కంద్ర మాణిక్యం తంజావూరు జిల్లాలో ఒక గ్రామం. ఈ శాఖవారు కర్ణాటక, మళయాల ప్రాంతాలకు కూడ వెళ్ళి అచ్చట స్థిరపడిపోయినారు. ప్రయాణ సౌకర్యాలు లేని ఆకాలంలో కుటుంబ సహితంగా వృద్ధులు, పిల్లలు, గర్భిణీస్త్రీలు మొదలగువారిని వెంటపెట్టుకొని కంద్ర

* తమిళదేశంలో 'దిమిలి, దిమిరి, తిమిరి' పేర్లతో అగ్రహారా లున్నవి.

మాణిక్య పరిసరాల నుండి వందలాది మైళ్ళు ప్రయాణం చేసి నెల్లూరు మండలానికి ఎలాగు వచ్చి చేరగలిగారో ఊహించడం చాలా కష్టం. చెదలవాడ గుంటూరు జిల్లాలోని గ్రామం. పుదూరు ద్రావిడులలో చెదలవాడవారున్నారు. వీరు ప్రథమంలో ఆ గ్రామవాసులై తర్వాత నెల్లూరు మండలం చేరారో తెలియదు. పుదూరు ద్రావిడుల వలెనే నెల్లూరు మండలానికి వచ్చినవారు తుమ్మగుంట ద్రావిడులు. తుమ్మగుంట కోవూరు తాలూకాలో ఒక గ్రామం.

పుదూరు ద్రావిడులలో ఈనాడు వైష్ణవులు, స్మార్తులు ఉన్నారు. ఈ వైష్ణవులది వీరవైష్ణవం కాదు. వారు చక్రాంకితం చేసుకోరు. నామాలను మాత్రం పెట్టుకొంటారు. కొందరు తమిళ దేశంలోని తెంగలులవలెను, కొందరు వడగల వలెను నామధారణ చేస్తారు. వైష్ణవులైనా, స్మార్తులైనా వీరు ఒకే శాఖకు చెందిన వారు కావడం చేత వీరి మధ్య వివాహ సంబంధాలు ఉన్నవి. ఇతర శాఖలవారితో వీరు సంబంధాలు ఇటీవలి వరకు చేసుకొనే వారు కారు. ఇప్పుడిప్పుడు తక్కిన కులాల వారివలెనే కొందరు శాఖాంతర వివాహాలు చేసుకొనుచున్నారు.

తమిళదేశాన నుండి ఆంధ్రదేశానికి వచ్చినప్పుడు వీరందరు వైష్ణవులుగా ఉండిరి. వైష్ణవమత ప్రవర్తలైన నాదముని, ఆళవందారు, రామానుజాచార్యులవారు వీరి బంధువర్గంలో చేరిన వారని పరిశోధకులు కొందరు చెప్పుచున్నారు. మా పూర్వులు నిస్సందేహముగా వైష్ణవులు. విజయనగర చక్రవర్తి, సదాశివ రాయల ఆదేశానుసారం మా పూర్వులు వైష్ణవోత్తముడైన అనంతయార్యుని కుమారుడు ఆచారయ్యకు తుంగభద్రానదీ తీరాన మామిడిపూడి గ్రామమును దానమిచ్చినట్లు మామిడిపూడి శాసనము తెలియపరచుచున్నది. నా తరంవరకు మా పూర్వులు వారి పేర్లతో ఆచార్య శబ్దమును వాడుచుండిరి. మా తాతగారు రామకృష్ణమాచార్యులు. మా తండ్రిగారు వెంకటేశాచార్యులు. మా పినతండ్రిగారు శ్రీనివాసాచార్యులు. నా పూర్వు లందరు నామధారులు. నేను కూడ నా బాల్యంలో నామములను వేసుకొనే వాడను. కాని ఏ కారణముచేతనో దానిని మానివేశాను.

మేము తమిళదేశంనుండి వచ్చినవారము గుటచేత తమిళమే మాకు మాతృభాషగా ఉన్నది. దిమిలి, వేసూరు, ఆరామ ద్రావిడులు తమిళమును మాట్లాడుటలేదు. కాని మా తమిళములో 90 శాతం తెలుగుమాటలే. ఈనాటి తమిళులు మా తమిళాన్ని అర్థంచేసుకోనలేరు. మాతృభాష తమిళమైనా మా వ్యవహారభాష తెనుగే. తమిళమును వ్రాయలేము. చదువలేము. మా శాఖవారు అనేకులు గ్రంథరచనలు గావించారు కాని అవి తెలుగులోనే ఉన్నవి.

ప్రథమతః మద్రాసులో తెనుగు ముద్రాక్షరశాలను స్థాపించి, తెనుగు గ్రంథములను ప్రకటించినవారు వావిళ్ల రామస్వామిశాస్త్రులవంటి మా పూర్వులే. ఈ విధంగా వారు ఆంధ్రభాషకు ఎంతో సేవచేశారు. ఇప్పుడు కూడ సేవ చేస్తున్నారు.

మేము మాట్లాడే తమిళభాషలో 10, 11 శతాబ్దపు తమిళంలోని మాటలు అనేకం ఉన్నవి. అవి ఈనాటి తమిళంలో లేవు. తమిళభాషాచరిత్రను వ్రాయువారికి ఇది సహాయపడగలదు.

మా శాఖవారు ఏగ్రామంలో నివసించినా వారిమధ్య పూర్తి ఐకమత్యం ఉండేది. మా గ్రామంలో 5, 6 పుదూరు ద్రావిడ కుటుంబాలు ఉన్నట్లు ఇదివరకే చెప్పినాను. ఈ కుటుంబాలలో ఎవరింట పెండ్లిళ్లు మొదలైన శుభకార్యాలు జరిగినా అన్నికుటుంబాలవారు కలిసి వారికి సహాయపడేవారు. అటుకులు దంచడం, వడియాలు పెట్టడం, అప్పడాలు ఒత్తడం, పిండి వంటలుచేయడం మొదలైన పనులలో వారు సహాయపడేవారు. తుదకు పెండ్లిండ్లలో వారే వంటచేసి వడ్డించేవారు. కులకట్టుబాట్లు సడలిపోయిన ఈకాలంలో పూర్వపు ఐకమత్యం కనుపించడంలేదు.

వైష్ణవులు, స్మార్తులు కలిసి ఒకే శాఖగా ఏర్పడడం మాలోని విశిష్టత. బహుశః అందుచేతనే కాబోలు మావారు శంకరాచార్యులను గురువుగా స్వీకరించరు. గ్రామాలకు వారు వచ్చినప్పుడు వారికి భిక్షలు పెట్టేవారు కారు. మా శాఖవారు స్వయం ఆచార్య పురుషులు.

వీరిలో అనేకులు వైదిక విద్యలలో నిష్ణాతులై అందరి మన్ననలకు పాత్రులయినారు. 18–వ శతాబ్దంలో పూనాలో పీష్వాలు అధికారం వహించిన కాలంలో వేదపండితులను పరీక్షించి వారిని సత్కరించడం మామూలు. అట్టి సత్కారాన్ని పొందుటకు మా శాఖకు చెందినవారు కొందరు వెళ్లేవారు. వారిని పరీక్షించిన అధికారులు వారి పాండిత్యం అఖండమైనట్టిదని భావించి, భవిష్యత్తులో ఎలాంటి పరీక్షలతో నిమిత్తం లేకుండా వారిని సత్కరించవలసిందిగా నిర్ణయించారట. ఇది వారి పాండిత్యానికి గొప్ప తార్కాణం.

వేదపండితులలో అనేకుల ఇండ్లు వేదవిద్యాలయాలుగా ఉండేవి. కొందరివద్ద ఏకకాలంలో 50, 60 విద్యార్థులు ఉండేవారట. వారికి ఉచితంగా భోజన సదుపాయాలు ఏర్పాటు చేసి వేదాధ్యయనం పూర్తి అయ్యేవరకు వారికి విద్యాబోధ చేసేవారు. ఆలాటివారిలో పుదూరు గ్రామవాస్తవ్యులు అల్లాడి రామబ్రహ్మశాస్త్రి (వీరు నాభార్యకు పితామహులు) చాల ప్రఖ్యాతి గాంచినవారు. వారి ఇండ్లలోని స్త్రీలు విసుగు, వేసటలు లేక వారికి వంటచేసి భోజన సదుపాయాలు కల్పించేవారు. ఇది బహుప్రాచీన సంప్రదాయం. ఈనాడు ఈ విధానం పూర్తిగా మారిపోయినది. తాము నేర్చిన విద్యను విద్యార్థులకు అమ్మకం చేసి ఈనాటి ఉపాధ్యాయులు జీవితం సాగిస్తున్నారు. తమ జీతభత్యాలను పెంచవలసిందిగా ఆందోళనలను లేవదీయుచు సమ్మెలలోకి దిగుచు క్రమశిక్షణకు స్వయంగా దూరులై విద్యార్థులలో కూడ క్రమశిక్షణారాహిత్యాన్ని పెంపొందించుచున్నారు. విద్యారంగంలో సమాజం ఏవిధంగా మారిందో, ఏవిధంగా మారుతున్నదో ఇది స్పష్టం చేస్తూ ఉంది.

బ్రిటిష్ పరిపాలన కాలంలో వేదశాస్త్రులకు ప్రాచీన కాలాన నుండి ఉండిన గౌరవం చాలావరకు తగ్గినది. లౌకిక విద్యలకు గిరాకి పెరిగింది. దీనికి అనుగుణంగా మా శాఖవారు వారి విద్యావిధానాన్ని మార్చుకొనడం అవసరమని గ్రహించి, అలాటి విద్యలను నేర్చుకొని, అధ్యాపకులుగా వాటిని ఇతరులకు

నేర్పసాగారు. కాలానికి కట్టుబడి ప్రవర్తించడం మానవునికి తప్పదు. ఈ విషయంలో ఒక మార్పును గురించి చెప్పవలసి ఉన్నది. పరిపాలనలోని ఉన్నతశాఖలలో పనిచేయుటకు తమ స్వదేశమైన బ్రిటన్ నుండి యువకులను నియమించడం మొదటి నుండి బ్రిటిషువారు అనుసరిస్తున్న విధానం. అలాటి యువకులకు ఆ యా రాష్ట్రాలలోని భాషలను రెండు మూడు సంవత్సరాల కాలం నేర్పడం అవసరమని భావించి 19-వ శతాబ్దం తొలిభాగంలో మద్రాసులోను, బొంబాయిలోను, కలకత్తాలోను ప్రత్యేక కళాశాలలను స్థాపించారు. విదేశీయులకు సులభంగా తెనుగు మొదలైన దేశభాషలను నేర్పుటకు పండితులను నియమించేవారు. ఆ పండితులలో పుదూరు ద్రావిడు లనేకులు ఉండినారు. వారు సులభశైలిలో గద్యరచనలను చేశారు. సులభములగు తెనుగు వ్యాకరణాలను రచించారు. అట్టివారిలో వేదుల పట్టాభిరామశాస్త్రిగారు అగ్రగణ్యులు. మా శాఖకు చెందిన పుదూరు సీతారామశాస్త్రిగారు పెద్దబాలశిక్షను వ్రాసిరి. అది అప్పటినుంచి ఇప్పటివరకు ఆంధ్రదేశ మంతటా బహుళ ప్రచారములో నున్నది. నా చిన్నతనములో వీధిబడులలో అది ఒక్కటే పాఠ్యగ్రంథము. ఇంగ్లీషు విద్య మద్రాసులో క్రమక్రమముగా వ్యాపించిన కాలములో అనేక మాధ్యమిక విద్యాలయాలలోను, కళాశాలలలోను పుదూరు ద్రావిడులు తెనుగు పండితులుగా కృషిచేశారు. సి. పి. బ్రౌన్ తెనుగుభాషకు అపారమైన సేవచేసినవాడు. అతనికి సహాయపడిన తెనుగు పండితులలో పుదూరు సీతారామశాస్త్రిగారు ఒకరు. ఇటీవలి కాలంలో ఇంగ్లీషు విద్యలో ప్రవీణులై అల్లాడి కృష్ణస్వామయ్యవంటివారు దేశవ్యాప్తమైన ప్రఖ్యాతిని గడించినారు. స్వోత్కర్ష గా ఉండగలదని వారందరిని పేర్కొనడం మానుకొన్నాను. వేదము (చిన) వేంకటరాయశాస్త్రిగారు రచించిన పుదూరు ద్రావిడ చరిత్ర అను వ్యాసములో వారి పేర్లు అనేకం కనబడుచున్నవి.

పుదూరు ద్రావిడ చరిత్రనుండి మనం ఈనాడు నేర్చుకొనవలసిన గుణపాఠం ఒకటి ఉన్నది. వీరు తమిళభాష మాట్లాడేవారైనను, తమిళదేశంనుండి వచ్చిన వారైనను ఆంధ్రులు

వీరిని పరాయివా రని భావించలేదు. ఆంధ్రులలోని వేదశాస్త్ర ప్రవీణులు వీరి పట్ల అసూయను ప్రదర్శించినవారు కారు. వీరిపట్ల గౌరవముకలవారై స్నేహ సాహార్ద్రిములతో ప్రవర్తించిరి. వీరుకూడ పూర్తిగా ఆంధ్రులతో కలిసిపోయి అన్ని వ్యవహారము లలో వారితో కలసికట్టుగ పాల్గొనిరి. తమిళ దేశమునుండి వీరేగాక వీరికి కొంతపూర్వము పేరూరు ద్రావిడులు, ఆరామ ద్రావిడులు, దిమిలి ద్రావిడులు అని వ్యవహారంలో పేర్కొనబడు బ్రాహ్మణులు తమిళదేశమునుండి ఆంధ్రదేశమునకు వచ్చి స్థిరపడిపోయిరి. వీరి పట్ల కూడ ఆంధ్రులు స్నేహభావముతో ప్రవర్తించిరి. భిన్న ప్రాంతములనుండి ఒక రాష్ట్రములో నివసించువారి మధ్య కలయిక సాధ్యమనియు, అదియే రాష్ట్రమునకును దేశమునకును శ్రేయస్సును సమకూర్చు విధానమనియు ఆంధ్రదేశములోని ద్రావిడ బ్రాహ్మణుల చరిత్ర ఋజువు చేయుచున్నది. ఈ చరిత్ర నుండి మన మీనాడు నేర్చుకొనవలసిన గుణపాఠము ఇదియే. ఇది అమూల్యమైనట్టి గుణపాఠము.

కాని ఇటీవలి కాలంలో దేశప్రజలలో మితిమీరిన ప్రాంతీయాభిమానములు, భాషాభిమానములు వృద్ధిగాంచినవి. భాషను ఆధారముగ జేసుకొని, స్వతంత్రము లభించిన తర్వాత, దేశములోని రాష్ట్రములు పునర్నిర్మాణము చేయబడినవి. అది మొదలు అనేక రాష్ట్రములలో భాషాద్వేషము ముదిరినది. ప్రతి రాష్ట్రములోను చారిత్రక కారణాల ఫలితముగ అనేక భాషలు మాట్లాడేవా రున్నారు. రాష్ట్రములో అధికసంఖ్యాకులు మాట్లాడే భాష అధికార భాషగా గుర్తింపబడినది. కాని వీరు ఇతర భాష లను మాట్లాడే అల్పసంఖ్యాక వర్గములపట్ల ద్వేషభావమును వహించి రాజ్యాంగము వారికి ప్రసాదించిన మౌలిక హక్కులకు భంగకరముగా ప్రవర్తించడం జరుగుచున్నది. అస్సాం రాష్ట్ర ములో ఆసామీస్ భాషను మాట్లాడే అధికసంఖ్యాకులు, బెంగాలీ భాషను మాట్లాడే అల్పసంఖ్యాకులపట్ల ఈవిధముగ ప్రవర్తించడం చేత ఈ రెండు వర్గాలమధ్య రక్తపాతముతో కూడిన కలహాములు సంభవించి శాంతి భద్రతలకు అనేకపర్యాయములు ప్రమాదము కలిగినది. మహారాష్ట్రములో చాలకాలమునుండి నివసించుచున్న

మలయాళీలపట్ల అధికసంఖ్యాకులైన మహారాష్ట్రులు కొందరు ఇదే విధముగ ప్రవర్తించడము జరిగినది. ఇతర ప్రాంతములనుండి వచ్చిన వారిని పరాయివారుగ భావించి వారికి ఉద్యోగములలో ప్రవేశము ఉండరాదని తీవ్రమైన ఆందోళనలను లేవదీయడం అనేక రాష్ట్రాలలో ఇటీవలి కాలంలో పరిపాటి అగుచున్నది. ఇది అవాంఛనీయ పరిణామం. గతకాలంలో ఈలాగు జరగలేదని ఆంధ్రదేశములోని ద్రావిడ బ్రాహ్మణుల చరిత్ర చాటించుచున్నది. అనాదిగ మన దేశములో ఒక ప్రాంతమునుండి ఇంకొక ప్రాంతమునకు ప్రజలు వెళ్లి స్థిరనివాసములను ఏర్పరచుకొన్నారు. అసలు జీవిక కొరకేగదా ఈ విదేశములకు పోవుట. సంకుచితములైన ప్రాంతీయాభిమానాలు లేకపోవడంచేత ఇది సాధ్యమైనది. మనం ఈనాడు మన పూర్వులకంటె నాగరికులమని, వారికంటె ఎక్కువ జ్ఞానము కలవారమని, మనలో వారిలో ఉన్న మూఢనమ్మకాలన్నీ లేవని గర్వించుచున్నాము. కాని మన ప్రాంతీయాభిమానాలు, భాషాభిమానాలు హద్దుమీరి పూర్వులలో ఉండిన సహనము మనలో లోపించినది అని, దీని మూలంగా దేశవిచ్ఛిత్తి సంభవించే ప్రమాదం ఉన్నదని ఋజువు చేయుచున్నవి. పూర్వులనుండి ఈ విషయములో మనం నేర్చుకొనదగిన గుణపాఠములను మనం నేర్చుకొనకపోవడం విషాదకరం.

# 3. మా కుటుంబం

మేము మామిడిపూడివారము. అదియే మా ఇంటిపేరు. విజయనగరచక్రవర్తి సదాశివరాయలవారు 1549 – 50 లో మామిడిపూడి అగ్రహారమును అనంతయార్య కుమారుడు ఆచారయ్యకు తుంగభద్రానదీతీరంలో విఠలేశ్వర సన్నిధిని దానపూర్వకముగ ఇచ్చినారు. దానికి సంబంధించిన తామ్ర శాసనములో ఆచారయ్యను గురించి వివరణము ఈక్రింది విధముగా నున్నది :

తుంగభద్రానదీతీరే విఠ్ఠలేశ్వరసన్నిధౌ,
గౌతమాన్వయ దుగ్ధాబ్ధి కల్పవృక్షాయితాత్మనే,
వాదివారణసింహాయ వరాపస్తంబసూత్రిణే,
యశస్వినే యజుశ్శాఖాధ్యాయినే బుద్ధిశాలినే,
షట్కర్మ సంతతాసక్తాత్మ నర్మణే వేదవర్మణే,
షణ్ణామపిచ శాస్త్రాణి నిర్ణాయక నిజోక్తయే,
వైష్ణవాగమసిద్ధాన్త వేదినే బ్రహ్మవాదినే,
విశిష్యశిష్యవర్గాణాం శ్రీభాష్యోపదేశినే,
శ్రీ వేంకటేశ పాదాంబుజాతాబ్జాశ్రయణోల్లాసితచేతసే,
శ్రీమతోనంతయార్యస్య సుపుత్రాయ సువృత్తయే,
ఆచారయ్యాభిధానాయ సూరయే సూనృతోక్తయే
ఉదయాచలరాజ్యస్థం పాకనాడౌకృతాంస్థితిం,
సర్వపల్యాఖ్య సీమాయాం సంప్రాప్తం ఖ్యాతిముత్తమాం
తాళ్లపూడి వరగ్రామా త్ప్రాచీమాశాముపాశ్రితాం,
పిడితాపోలు ముశిడికాడు గ్రామద్వయస్య చ

ప్రఖ్యాతా ద్యుక్తసీమాంతాత్ దక్షిణస్యాం దిశి స్థితం
నేలటూరోః కృష్ణరాయ పట్టణస్య ద్వయోరపి
గ్రామయోః యుక్తసీమాన్తాత్ పశ్చిమాం దిశ మాశ్రితం,
ముత్తూరు నామకాద్గ్రామాత్ సంప్రాప్తం దిశ ముత్తరాం,
విఖ్యాత శ్రీరంగరాజపురమిత్యపరాభిధం
గ్రామం మామిడిపూండ్యాఖ్యం సర్వసస్యోపశోభితం
సర్వమాన్యం ... ... ...
పుత్ర పౌత్రాదిభిర్భోగ్యం క్రమాదాచంద్రతారకం

మా తాతగారు రామకృష్ణమాచార్యులు ఏకారణము చేతనో మామిడిపూడిని వదలి పురిణి వాస్తవ్యులైనారు. ( పురిణికి సమీపమున నుండు ఇసుకపల్లి ఉప్పుకోఠారులో వీరి కేదో ఉద్యోగము లభించుటచేత వీరు పురిణి వాస్తవ్యులైనట్లు ఒక ప్రతీతి కలదు. )

మా తండ్రి వెంకటేశాచార్యులు. ( వ్యవహారంలో వారిని వెంకటేశమయ్య, వెంకటేశయ్య అని పిలిచేవారు. ) మా తల్లి నరసమ్మ ఆత్మకూరు తాలూకా లింగాలపాడు శ్రోత్రియంలో భాగస్వాములైన పునుగువారి ఆడపడచు. ఆమె బహు దొడ్డ ఇల్లాలు. మా బంధువులెవ్వరు ఆమెను పేరు పెట్టి పిలిచేవారు కారు. అందరికి ఆమె అక్కయ్య. ఆ రోజులలో ఇంటిపనులు చేయుటకు నౌకర్లు ఎవరూ ఉండేవారు కారు. ఆమె మామూలుగ వేకువజామునన లేచి వాకిలి చిమ్మి, కళ్లాపునీళ్ళు చల్లి, ముగ్గులు వేసి, తర్వాత ఇంటిని అలికి ముగ్గులువేసి, పాలుపితికి, మజ్జిగ చిలికి, బావిలోనుండి నీళ్లు చేది, దొడ్డిలోని కుండలను నింపి, 10 గంటల ప్రాంతంలో చెరువుకు వెళ్లి స్నానంచేసి, ఉతికిన చీరెను, నీళ్లతో నిండిన బిందెను భుజమున పెట్టుకొని ఇంటికి రావడం ఆమె దినచర్య. ఆ రోజులలో కుండలలోనే వంటచేయడం మామూలు. వాటిని తోమి శుభ్రపరచడం కూడ ఆమె పనే.

ఆ రోజులలో జీవితం నిరాడంబరంగా ఉండేది. దీనికి దారిద్ర్యం కారణం కాదు. మాది మధ్యతరగతి కుటుంబం. మాకు చాలినంత ఆదాయం భూములనుండి వచ్చేది. కాని

నిరాడంబరంగా జీవించడమే ధర్మమని అనుకొనేవారు. మా తల్లి గారికి రోజూ కట్టుకొనుటకు రెండు చీరెలు మాత్రమే ఉండేవి. ప్రతిరోజు చెరువులో స్నానంచేసే సమయంలో కట్టుకొన్న చీరెను ఉతకడం, ముందురోజు ఉతికి ఆరవేసిన చీరెను కట్టుకొనడం మామూలు. ఈరోజులలో మధ్యతరగతి స్త్రీలకు ఉండే చీరెల పిచ్చి ఆనాడు ఉండేది కాదు. అదేవిధంగా మా నాయనిగారికి కట్టుకొనుటకు రెండే ధోవతులు, రెండు పైపంచెలు ఉండేవి. వాటిని రోజూ ఉతికి, ఆరవేసి మరుసటి రోజున కట్టుకొనేవారు.

భోజనం కూడ నిరాడంబరమైనట్టిది. మధ్యాహ్నం అన్నం, ఒక కూర, ఒక పచ్చడి, మజ్జిగ—వీటితో తృప్తిగా భోజనం చేసేవారు. రాత్రిపూట పచ్చడి, మజ్జిగ మాత్రమే. పండుగనాడే పప్పు. జ్వరం వచ్చినప్పుడే చారు. మా ఇంటి ప్రక్కనే మాకు ఒక తోట ఉండేది. కూరగాయలు అందులో కాచేవి. తోటలో ఒక పెద్ద బావి ఉండేది. తోటకు కావలసిన నీళ్లను ఏతాము ద్వారా తోడేవారు.

ఇది ఆ రోజులలోని జీవన విధానం.

మా తల్లిదండ్రులకు మొదటి ముగ్గురు ఆడసంతానం. మొగ సంతానము కలుగుతుందో లేదో అనే సందేహంతో వారు ఉండగా నేను పుట్టినాను. అప్పుడు వారు అత్యంత సంతోష భరితులై తమ జన్మ సార్థకమైనట్లు భావించారు.

ముగ్గురు ఆడపిల్లల తర్వాత నేను పుట్టడంచేత నాపట్ల వారికి ప్రత్యేక ప్రేమాభిమానము లుండేవి. దానికి చిహ్నంగా నా జ్ఞాపకాలలో స్థిరపడిపోయిన ఒక చిన్న అనుభవాన్ని ఇక్కడ పేర్కొంటున్నాను. నేను రెండు మూడు సంవత్సరముల వయస్సు వాడినై ఉన్నప్పుడు వారు నన్ను రాత్రి పదకొండు గంటలకు లేపి, సాయంకాలం చేమిరి పెట్టిన పాలలో ఏర్పడిన తియ్యటి మీగడను తినిపించేవారు. శైశవంలో ఈలాటి అనుభవంకలగడంచేత ఈనాటి వరకు నాకు మీగడతో కూడిన పెరుగుపట్ల ఎంతో ఇష్టం. భోజన సమయంలో తక్కిన వంటకాలు ఉన్నా లేకపోయినా ఈలాటి పెరుగు లభించిన పక్షంలో పంచభక్ష్య పరమాన్నముల మూలంగా

కలిగే తృప్తికంటె ఎక్కువ తృప్తి నాకు కలుగుతుంది. శైశవం లోని అనుభవాలు జీవితంలో శాశ్వతస్థానం కల్పించుకొనగల వనుటకు ఇది తార్కాణము. ఈనాటి మానసికశాస్త్రవేత్తల అభిప్రాయం ఈలాటిదే.

సర్వధారి సంవత్సర పుష్య శుద్ధ సప్తమి మంగళవారం ఉత్తరాభాద్ర నక్షత్రం వేకువ జామున (1889-వ సంవత్సరం జనవరి, 8) నా జననం. జాతకాలను వ్రాయించడం మా కుటుంబ సంప్రదాయం కాదు. అందుచేత మా నాయనగారు నా జాతకాన్ని వ్రాయించలేదు. నాకు కూడ జ్యోతిషంలో ఏలాటి నమ్మకము లేదు. అందుచేత నేనుకూడ నా జాతకాన్ని వ్రాయించలేదు. కాని నా తమ్ముడు రామకృష్ణయ్యకు ఇందులో చాలా నమ్మకం. నా కుమాళ్లలో కూడ కొందరికి ఈలాటి నమ్మకం ఉన్నది. అందుచేత నెల్లూరిలో నేను కట్టిన ఇంటికి గృహప్రవేశ ముహూర్తం పెట్టవలసివచ్చినప్పుడు నా జన్మ నక్షత్రం వగైరా అవసరమైనది. ఆ సందర్భంలో నేను నా తమ్ముడికి ఉత్తరం వ్రాయగా అతడు నా జాతకాన్ని తయారుచేసి నాకు పంపినాడు. నా జన్మదినాన్నిగురించి పైన వ్రాసిన వివరాలకు ఆ జాతకమే ఆధారం. అది ఈ క్రిందివిధముగా ఉండినది:

సర్వధారి సంవత్సరం పుష్య శు. 7 మంగళవారం తెల్లవారి జాము వేళ. నక్షత్రం - ఉత్తరాభాద్రం.

| | | | |
|---|---|---|---|
| చ | | | రా |
| శు కు | | | శ |
| బు | | | |
| గు ర | ల | | |

నేను ఆంధ్ర విశ్వవిద్యాలయంలో అధ్యాపకుడుగా ఉండిన రోజులలో నా కుమార్లలో ఒకనికి ఒక జ్యోతిష్కుడు స్నేహితుడుగా ఉండేవాడు. - ఆయన నా భవిష్యత్తు గురించి "మీ తండ్రిగారు చాలకాలం జీవిస్తారు. వారు విశ్వవిద్యాలయ అధ్యాపకత్వాన నుండి విరమించిన తర్వాత ఎక్కువ సంఖ్యలో గ్రంథాలను రచించి ప్రఖ్యాతిని సంపాదించగలరు" అని చెప్పినాడట. వారు దీనిని ఏలాగు ఊహించినారో నేను చెప్పలేను. కాని ఇది సత్యమని నిరూపింపబడినది.

నేను నెల్లూరు కళాశాలకు ప్రిన్సిపాల్‌గా ఉన్నరోజులలో ఒక పంజాబీవాడు అకస్మాత్తుగా నా ఆఫీసు గదిలోనికి వచ్చి తాను జ్యోతిష్కుడననీ, గతంలో నా జీవితంలో జరిగిన సంఘటనల గురించి యథార్థమైన మాటలు కొన్ని చెప్పి కొద్దికొద్దిగా నావద్దనుండి రు 17 ల వరకు లాగినాడు. మరి కొంత సొమ్ము ఇచ్చిన పక్షంలో నా భవిష్యత్తును గురించి చెప్పగలనని పలికినాడు. ఇందుకుగాను అంతసొమ్ము ఖర్చుపెట్టడం వ్యర్థమని భావించి వానిని వదలించుకొన్నాను. నా గతాన్ని గురించి వాడు చెప్పిన మాటలను ఎందుకు ఆలకించానో నాకే ఆశ్చర్యం కలిగిస్తున్నది. ఇది తప్ప నాజీవితంలో మరియెప్పుడు జ్యోతిష్కులను నేను కలుసుకొనలేదు. గతాన్ని గురించి పంజాబీవాడు సమాచారాన్ని స్వీకరించి నావద్దకు వచ్చినాడనేది నా అభిప్రాయం.

నా తర్వాత నా తల్లిదండ్రులకు ఒక కుమార్తె, ఇద్దరు కుమార్లు కలిగారు. వీరిలో రెండవ కుమారుడు వెంకట్రాముడు ఇంటర్మీడియేట్ చదువుతూ న్యూమోనియా జ్వరం కారణంగా అకాలమరణానికి గురి అయ్యాడు. పుత్రశోకంవల్ల నా తల్లిదండ్రులు ఎంతగానో బాధపడినారు.

మొత్తంమీద ఆడసంతానం మూలంగా వారికి ఏలాటి సుఖము కలుగలేదు. వారి మూలంగా వారు దుఃఖాన్నే అనుభవించారు.

నా పెద్ద అక్క పేరు అన్నపూర్ణమ్మ. ఆనాటి ఆచార ప్రకారం ఆమెకు 10-వ ఏటనే వివాహం చేశారు. నా బావగారు కాళహస్తి పార్వతీశ్వరయ్య. రేబాల గ్రామం

సమీపాన ఉన్న అగ్రహారం కాపురస్తులు. వీరు అయిదుగురు సోదరులు. వీరికి 30, 40 ఎకరముల మంచి భూవసతి ఉండేది. కాని దానిని ఒక రెడ్డికి స్వాధీన ఆడుమానం పెట్టి ఋణంచేసేవారు. అందుచేత వారికి ఏలాటి ఆదాయం లేక స్వగ్రామాన్ని వదలి మద్రాసులో కాపురం పెట్టారు వారందరు కలిసి సమిష్టి కుటుంబంగా ఉండలేదు. మా బావగారు ఎక్కువగా చదువు కొన్నవారు కారు వారు ఉద్యోగంచేసి జీవితాన్ని సాగించడం సాధ్యం కాలేదు. 13-వ ఏట మా అక్క కాపురానికి వెళ్లింది.

ఈ పరిస్థితిలో ఆయన ఒక కొత్తరకమైన వ్యాపారాన్ని ప్రారంభించారు. ఆ రోజులలో మద్రాసులో పౌరోహిత్యంచేసే బ్రాహ్మణులకు దానపూర్వంగా అనేక వస్త్రములు లభించేవి. మా బావగారు రోజు ఉదయం వారి ఇండ్లకువెళ్ళి ఆ వస్త్రములను చౌకగా కొనుగోలుచేసి, గుజిలీ బజారులో ఒక చిన్న గదిని అద్దెకు తీసుకొని ఆ వస్త్రములను సాయంకాలం 4 గంటలనుండి 6 గంటల వరకు విక్రయించేవారు. ఈ వ్యాపారం మూలంగా ఖర్చులు పోను నెలకు 60, 70 రూపాయలు ఆయన సంపాదించగలిగాడు. ఆనాడు రూపాయకు ఇప్పటికంటె 10, 12 రెట్లు ఎక్కువ విలువ ఉండడం చేత ఆ ఆదాయం గొప్పదనే చెప్పవచ్చును. వారు రెండు పూటలు భోజనం చేయడమేగాక కాఫీకికూడ అలవాటుపడినారు. గ్రామం వదలి నగరవాసం ఫలితంగా వారి అభిరుచులలో ఈ మార్పు కలిగింది.

కాని వారు కఠిన హృదయులు. ఆ రోజులలో భర్తలకు భార్యలపట్ల ఏలాటి గౌరవం ఉండేదికాదు. అనేకులు భార్య అంటే తమకు చాకిరి చేసే బానిస అని భావించేవారు. మా బావగారు అలాటి వర్గానికి చెందినవారు. నిష్కారణంగా మా అక్కగారిని తిట్టడమే కాకుండా కొట్టేవారు. ఆమె ఏమీ ఎదురు చెప్పలేక భర్త పెట్టే బాధ లన్నిటిని ఓర్పుతో భరించేది. వారికి సంతానం కలగని కారణంగా ఈ బాధలు కాలక్రమాన పెరిగిపోయినవి. ఎప్పుడైనా మా నాయనగారుగాని, తల్లిగారుగాని మా అక్కగారిని చూడడానికి వచ్చేవారు. వారు వచ్చినప్పుడు వారి సమక్షంలో కూడ ఆయన మా అక్కగారిని మరింత బాధపెట్టే

పోడు. వారు కండ్లనీళ్లు పెట్టుకొని నిస్సహాయులై ఉండిపోయేవారు. నేను ఇంగ్లీషుచదువు నిమిత్తం మద్రాసుకు వెళ్ళినప్పుడు కొంత కాలం మా అక్కగారి ఇంట్లోనే ఉండినాను. ఆ రోజులలో ఆమె భరించిన బాధలను స్వయంగా చూచినాను. ఇదీ ఆనాటి మధ్యతరగతి బ్రాహ్మణ కుటుంబా లనేకంలో దాంపత్య జీవితం.

ఈలాగు కొన్ని సంవత్సరములు గడచిన తర్వాత మా బావగారు ఋణ విముక్తులై తమ భూములను స్వాధీనం చేసుకో గల్గినారు. ఆ రోజులలో భూస్వాములే వడ్డీవ్యాపారం చేసి ధనార్జన చేయడం మామూలు. రెడ్డికులస్థులు ధనికులు కావడానికి ఇది ప్రధాన కారణం. మా బావగారి వంతుకు 8, 10 ఎకరాల సారవంతమైన భూమి వచ్చింది. అంతటితో వారు మద్రాసు కాపురం ఎత్తివేసి స్వగ్రామమైన అగ్రహారంలో కాపురం పెట్టారు. అటుతర్వాత ఒకటి రెండు సంవత్సరాలకు మా అక్క గర్భవతి అయినది. మా బావగారి మనస్సు మెత్తబడినది. మా అక్కగారి జీవితం అంతవరకు కష్టమయంగా ఉండేది. ఇప్పటినుంచి ఆమె సుఖపడగలదనే విశ్వాసం మా తల్లి తండ్రులకు కలిగింది. కాని త్వరలోనే అన్యథాగా జరిగింది.

ఆమెను ప్రసవం నిమిత్తం పురిణిలో మా ఇంటికి తీసుకొని వచ్చారు. ప్రసవం సుఖంగా జరిగి ఒక ఆడపిల్ల కలిగింది. కాని మా దురదృష్టవశాత్తున మూడవరోజు ఆమెకు విషజ్వరము సోకి, తగిన వైద్య సహాయం లేని కారణంగా, అయిదవరోజున ఆమె కుటుంబంలోని వారందరిని దుఃఖసాగరంలోముంచి కాలగర్భంలో కలిసిపోయింది. ఆ రోజులలో ప్రసవం స్త్రీలకు ఒక గండంగా పరిణమించేది అని ఇదివరలోనే చెప్పినాను. మా అక్కగారి మరణం అది అక్షరాలా సత్యమని ఋజువు చేసింది.

పుట్టిన ఆడపిల్లను మా తల్లిగారు బహు జాగ్రత్తతో సంరక్షించారు. కాని మూడు నెలలకే దానికి కూడ మరణం సంభవించినది. నా తల్లిదండ్రులకు ఆడ సంతానం మూలంగా ఏలాటి సుఖము కలుగలేదని పైన చెప్పినాను. మా అక్కగారి జీవితం దానికి దృష్టాంతం.

ఆమె ఎన్ని కష్టాలు అనుభవించినా నా పట్ల అత్యంత ప్రేమ కలిగి ఉండేది. నేను ఇంగ్లీషు చదువు నిమిత్తం మద్రాసుకు వెళ్లినప్పుడు కొంతకాలం ఆమె సంరక్షణలో ఉండినాను. ఆమె నా విషయంలోనే గాక మా బావగారి అన్నదమ్ముల విషయం లోను, వృద్ధురాలైన వారి తల్లిగారి విషయంలోను వాస్తవంగా అన్నపూర్ణ అనే పేరును సార్థకం చేసుకొన్నది. ఆమె నాకు చిరస్మరణీయురాలు. అందుచేతనే నా పెద్దకుమార్తెకు అన్నపూర్ణ అనే పేరు పెట్టినాను. ఆమె ముక్కుట్లు నా మూడవ కుమార్తెలో ఉన్నవి. దానిని చూచినప్పుడు ఆమె నా స్మృతిపథంలో కనుపిస్తుంది.

నా రెండో అక్క ఆదిలక్ష్మమ్మ. ఆమెను మేమందరం ఆదెక్క అని, ఇతరులు ఆదెమ్మ అని పిలిచేవారం. సంప్ర దాయానుసారం ఆమెకు తిరుపతి వాస్తవ్యులు, నేలటూరి అనంతయ్యకు ఇచ్చి 11-వ ఏటనే వివాహం చేశారు. వీరికి నేలటూరు గ్రామంలో (ఇది నా జ్ఞాపకం) కొద్దిగా భూవసతి ఉండేది. కాని కౌలుదార్లు మక్తాను సక్రమంగా చెల్లించేవారు కారు. అందుచేత భూవసతి ఉన్నా లేనట్టే ఆయన జీవించవలసి వచ్చింది. ఏదో పౌరోహిత్యం ద్వారా ఆయన చాలీచాలని ఆదాయంతో కుటుంబాన్ని పోషించవలసినవారు అయ్యారు. మా అక్క 13-వ ఏట కాపురానికి వెళ్లింది. ఆమె సంరక్షణార్థం బాల్యంలోనే భర్తను కోల్పోయిన నా పినతల్లి వెంకమ్మ తిరుపతికి ఆమెతో కూడ వెళ్లింది.

నా రెండో అక్కకు కూడ సంతానం కలగలేదు. భర్త తిట్టడం, కొట్టడం లేదుగాని దారిద్ర్యబాధను ఆమె అనుభవించ వలసి వచ్చింది. ఈలాగు కొన్ని సంవత్సరములు గడచిన తర్వాత మా బావగారు అకాలమరణానికి గురి అయ్యారు. అప్పుడు మా అక్కకు 22 సంవత్సరాలు ఉండవచ్చును. ఆమె తిరుపతిని వదిలి పురిణిలో మావద్ద ఉండిపోయినది.

కొన్ని సంవత్సరాలు గడచిన తర్వాత ఆమెకు మశూచి వ్యాధి సోకి ఒక కన్ను పోయింది. నేను బి. ఏ. క్లాసుకు వచ్చే వరకు కొంతకాలం మా అక్కగారి ఇంట్లోను, మరికొంతకాలం

మా పెదతండ్రి రంగాచార్యుల కుమారుడు వెంకట సుబ్బయ్య (ఆయనను అందరు "నామాలు" అని పిలిచేవారు) గారి ఇంట్లోను ఉంటూ వచ్చాను. బంధువుల ఇండ్లలో ఉండడం మర్యాదకాదని అప్పటికి నాకు తోచింది. ఒక సంవత్సర కాలం నా స్నేహితులతో కలిసి ఒక గదిని అద్దెకు తీసుకొని హోటలులో భోజనం చేస్తూ నా బి. ఏ. చదువును సాగించాను. రెండవ సంవత్సరంలో మా అక్క (ఆదెమ్మ) సహాయంతో స్వంత కాపురం పెట్టాను. ఆమె నాకు వంటచేసి పెట్టి సర్వవిధాలా నన్ను తల్లితో సమానంగా సంరక్షించింది. నేను ఎం. ఏ. ను పూర్తిచేయుటకు మూడు నెలలకు ముందు నా భార్య కాపురానికి వచ్చింది. అటుతర్వాత కూడ మా అక్కగారి సంరక్షణలో నేనూ, నా భార్య ఉండినాము. 1910 జనవరికి నా ఎం. ఏ. చదువు పూర్తి అయింది. కాకినాడ కాలేజిలో నాకు ఉద్యోగం లభించింది. అంతటితో మద్రాసు కాపురాన్ని ఎత్తివేశాము. మా అక్క మా గ్రామం చేరుకొన్నది.

తర్వాత కొన్ని సంవత్సరాలకు ఆమెకు కడుపులో ఏదో రుగ్మత సంభవించింది. చికిత్సకుగాను మా తల్లిదండ్రులు ఆమెను నెల్లూరులో నా మేనమామ ఇంటికి పంపినారు. చికిత్స లాభం లేక ఆమె 5, 6 నెలలు మంచంలో ఉండి చనిపోయింది. నడి వయస్సులో వైధవ్యం, దారిద్ర్యం, వ్యాధిగ్రస్తత ఆమెను కష్టజీవిగా చేసినవి. ఆమె మూలంగా మా తల్లిదండ్రులకు ఏలాటి సుఖం కలుగలేదని ప్రత్యేకంగా చెప్పవలసింది లేదు.

నా మూడవ అక్క వెంకటమ్మ. ఆమె నాకంటె రెండు సంవత్సరములు పెద్ద. ఆమె జీవితం తక్కిన ఇద్దరి జీవితాలకంటె విషాదకరంగా పరిణమించింది. ఆనాటి సాంఘిక దురాచారాల ఫలితాన్ని ఆమె పూర్తిగా అనుభవించింది.

ఆమెకు కూడ పది సంవత్సరముల వయస్సులోనే మా పొరుగుగ్రామం దండిగుంట వాస్తవ్యులు ఉడాలి వెంకట నరసయ్యకు ఇచ్చి వివాహం చేశారు. నా ఉపనయనం తోనే ఈ వివాహం జరిగింది. ఆ రోజులలో పెండ్లిండ్లు అయిదు రోజులు జరిగేవి. బ్రాహ్మణ ఇండ్లలో ఆ రోజులలో మధ్యాహ్నం,

సాయంకాలం మంత్రసహితంగా వధూవరులు హోమం చేసేవారు. ముహూర్తకాలంలో హోమం చేసిన అగ్నిని హోమకుండంలో పదిలపరచి, హోమకాలంలో దానినే ప్రజ్వలింపజేసి హోమం చేసేవారు. కాని మా అక్కగారి పెండ్లిలో ముహూర్తం ముగిసిన వెంటనే హోమకుండంలో పెట్టిన అగ్ని తగినన్ని ఎండు పిడకలు, సమిధలు పౌరోహితుని అజాగ్రత్తవలన చేర్చని కారణంగా సాయంకాలానికి ఆ అగ్ని చల్లారిపోయింది. సాయంకాల హోమం నిమిత్తం కుండంలోని అగ్నిని పైకి తెచ్చినప్పుడు అది వెలగలేదు. ఇది అశుభసూచకమని మా తండ్రిగారు దుఃఖించినారు. ప్రాయశ్చిత్తపూర్వకంగా కొత్త అగ్నిని వెలిగించి అయిదు రోజులు హోమం జరిపినారుగాని మా తండ్రిగారికి ఏలాటి తృప్తి కలుగలేదు.

వారు భయపడినట్లే వివాహం జరిగిన ఒక సంవత్సరం లోపలనే మా బావగారు వ్యాధిగ్రస్తులై మరణించారు. పదకొండవ ఏటనే మా అక్క వెంకటమ్మ వితంతువైనది. యావజ్జీవం వితంతువుగా కాలం గడపవలసి వచ్చింది.

మానవునికి ఆహార నిద్రలు ఎంత అవసరమో దాంపత్య సుఖం కూడ అంత అవసరం. ఐచ్ఛికంగా కొందరు వివాహం చేసుకొనక సన్న్యాసాశ్రమాన్ని స్వీకరించి జీవితాన్ని సాగిస్తున్నారు. ఈలాటి జీవితం అందరికీ సాధ్యంకాదు. ఇది వాంఛనీయం కూడా కాదు. ఈలాగు అందరూ జీవిస్తే మానవకోటి నిర్మూలమై పోతుంది. నిర్బంధ వైధవ్యం దాంపత్య సుఖానికి అవరోధం కల్పిస్తుంది. మన సమాజంలో అలాటివారు ఏవిధమైన సుఖాన్ని అనుభవించ జాలరు.

వారిలో కొందరు సమాజం ఏర్పరచిన నీతి నియమాలకు కట్టుబడి ఉండలేక అవినీతి మార్గంలో ప్రవేశిస్తారు. ఆకలి గొన్నవాడు ఆకలిని భరించలేక ఒక్కొక్కప్పుడు చౌర్యానికి సిద్ధపడతాడు. బాల్యంలోనే వితంతువులై నిర్బంధ వైధవ్యం అనుభవించవలసినవారు ఇదేవిధంగా అవినీతికి సిద్ధపడతారు.

నా అక్క వెంకటమ్మ ఈలాటి ప్రవర్తనకు సిద్ధపడినదని నేను భావిస్తున్నాను. నేను అప్పటికి చాలా చిన్నవాడిని.

ఈలాటి విషయాలను గురించి ఏమీ తెలియని వాడిని. అందుచేత ఏమి జరిగిందో స్వానుభవాన్ని ఆధారం చేసుకొని చెప్పగల స్థితిలో లేను. కాని జరగకూడనిది ఏదో జరిగినట్లు ఇతరుల గుసగుసల వలన ఊహించాను.

ఇదే సమయంలో గ్రామజీవితాన్ని పూర్తిగా కలుషితం చేయ సిద్ధపడ్డవారు మా గ్రామానికి వచ్చారు. వారు భూములను కొలతలను వేయుటకు ప్రభుత్వం నియమించిన సర్వే పార్టీకి చెందినవారు. ఆనాటి భూమిశిస్తు పద్ధతికి 20 సంవత్సరాలకో 30 సంవత్సరాలకో ఒక పర్యాయం గ్రామంలోని భూములను సర్వేచేయడం ఒక భాగం. అందుకుగాను ఎక్కడనుంచో 7, 8 మంది మా గ్రామం చేరారు. వారు భార్యలతో రాలేదు. వారు అవివాహితులుగా ఉండవచ్చును. వారందరు యువకులు. తలా తోకా లేక విశృంఖలంగా సంచరించేవారు. గ్రామస్థులలో ఒక రిద్దరు వారితో కలిసిపోయ్యారు. వారు నాటకాలాడి ప్రజలను ఆకర్షించగలిగారు. అనేక స్త్రీలను చెరిచారు. ఒక సంవత్సరంపాటు గ్రామజీవితం కలుషితమై పోయింది. వారికి బుద్ధిచెప్పగల పెద్దమనుష్యులు గ్రామంలో లేకపోయినారు. పెద్ద మనుష్యులుగా వ్యవహరిస్తున్నవారిలో అనేకులు బహిరంగంగా అవినీతిమార్గంలో నడుస్తున్నవారు. ఈలాటివారు ఆ యువకులకు ఏలాగు బుద్ధి చెప్పగలరు?

వారి వలలో చిక్కుకొన్న స్త్రీలలో నా అక్క వెంకటమ్మ ఒకత్తె. దాని ఫలితంగా ఆమె ఒకరోజు ఇంటినుండి పారిపోయింది. ఆమెను వెదికి తెచ్చి, ఇంటి బయట వసారాలో పెట్టారు. కాని ఆమె తిరిగి పారిపోయింది. శ్రమపడి, వెదకి, ఆమెను ఇంటికి తీసుకొనిరావడం వ్యర్థమని, మా నాయనగారు భావించి, ఆలాటి ప్రయత్నం చేయలేదు. కాని గ్రామంలో ఆయన తల ఎత్తుకొని తిరగడం సాధ్యంకాలేదు. దుఃఖంతో అవమానాన్ని కూడా భరించవలసినవా రయ్యారు. ఆయనపట్ల ఎవరూ సానుభూతి చూపినవారు లేరు.

ఈలాగు కాలం గడచిపోయింది. ఆడ సంతానం మూలంగా నా తల్లిదండ్రులు దుఃఖాలకు లోనైనారే గాని సుఖపడలేదని

చెప్పాను. 15 సంవత్సరాలకే వెంకటమ్మ జీవితం దీనిని ఋజువు చేసింది. నెలలు ఏండ్లు గడచిపోయినవి. మేము ఆమెను గురించి ఏవిధంగాను పట్టించుకోనలేదు. మాపట్ల ఆమె వైఖరి ఏవిధంగా పరిణమించిందో మాకు తెలియదు.

ఇంటినుండి పారిపోయి ఆమె అల్లూరిలోని క్రైస్తవ మిషనరీలకు వశపడిపోయింది. వారు ఆమెను క్రైస్తవమతంలోకి చేర్చి కొంతచదువు చెప్పించి, కాలక్రమాన ఒక క్రైస్తవునికి ఇచ్చి వివాహం చేశారు. అతడు హైదరాబాదు నివాసి. ఆమె కూడ హైదరాబాదుకు వెళ్లి అతనితో అక్కడ కాపురం పెట్టింది.

ఈలాగు కొంత కాలం గడచిపోయిన తర్వాత నేను విజయనగరంలోని మహారాజావారి కళాశాలలో అధ్యాపకుడుగా ఉన్నప్పుడు ( 1915 సంవత్సరంలో అని జ్ఞాపకం ) ఆమె అకస్మాత్తుగా మాయింటికి వచ్చింది. అప్పుడు నేను నా తల్లి, నా భార్య, ముగ్గురు పిల్లలతో ఉన్నాను. ఆమె రాగానే ఆమెను ఒక ప్రత్యేక గదిలో నివసించవలసినదిగా ఏర్పాటు చేశాము. మా పంక్తిలో కూర్చుండబెట్టుకొని ఆమెకు భోజనంపెట్టదగినంతగా నా హృదయం పరిపక్వం కాలేదు. ఆమె ఇంటినుంచి పారిపోవడంగాని, క్రైస్తవమతంలో చేరడంగాని ఖండించ తగినదికాదని నేను గ్రహించాను. ఆమె పతితురాలైనదని నేను భావించలేదు.

“న స్త్రీ స్వాతంత్ర్య మర్హతి” అనే పాతకాలపు సూక్తికి కలిగిన ప్రాబల్యం, బాల్యవివాహాలు, నిర్బంధ వైధవ్యం ఆమె ప్రవర్తనకు కారణాలని, నేను అప్పటికి దృఢనమ్మకం కలవాడనైనాను. కాని హృదయ దౌర్బల్యమువల్ల ఆమెను ఆదరించ సిద్ధపడకపోయినాను. దీనికి ఈనాడు నేను ఎంతగానో విచారిస్తున్నాను. మా తల్లి కంట తడిపెట్టుకొని ఆమెతో కొంచెం మాటలాడింది. ఈ విధంగా నాలుగైదురోజులు గడచిన తర్వాత నేను ఆమెకు రైలు ఖర్చులు, మరి కొంత సొమ్ము ఇచ్చి హైదరాబాదుకు పంపివేశాను. అటు తర్వాత ఆమె నాకు రెండు మూడు ఉత్తరాలు వ్రాసింది. కాని ఆమెతో ఉత్తరప్రత్యుత్తరాలను జరపడానికి

నేను ఇష్టపడలేదు. దానిమూలంగా కలిగే ప్రయోజనం ఏలాటిదీ లేదు. అంతటితో మా సంబంధం విడిపోయినట్లు భావించాను.

ఆమె వివాహ మాడినా సంతానవతి కాలేదు. ఒక ఆడ పిల్లను దత్తు తీసుకొన్నది. ఆమెకు ఒక కుమార్తె కలిగింది. కుమార్తె పెద్దది కాకపూర్వమే ఆమె చనిపోయింది. ఆ మనుమ రాలిని మా అక్కగారే సంరక్షించి పెద్దదానిని చేసి, ఒక క్రైస్తవ యువకునకు ఇచ్చి వివాహం చేసింది. అతడు టెలిగ్రాఫ్ బంట్రోతు. సౌమ్యుడు. సంతానవంతుడైనాడు. హైదరాబాదు మలక్ పేటలో స్వంత ఇల్లు కట్టుకొన్నాడు. వారివద్దనే నా అక్కగారు జీవితం సాగిస్తూ వచ్చింది.

నేను 1957 లో హైదరాబాదు నివాసి అయ్యాను. అప్పటి నుంచి తరుచుగా ఆకాశవాణిలో మాట్లాడుతుండేవాడిని. నా అక్కగారు ఆకాశవాణిలో నా పేరు విని, నా ప్రసారా లన్నిటిని బహుశ్రద్ధతో వింటూ ఉండేది.

ఈలాగు కొన్ని సంవత్సరములు గడచిన తర్వాత ఆమె ఇంటికి పొరుగున ఉన్న ఒక ఉద్యోగిచేత నాకు ఒక ఉత్తరం వ్రాయించింది. నన్ను చూడవలెననే ఆసక్తితో ఆమె ఉన్నట్లు, వీలైతే మలక్ పేటకు వచ్చి ఆమెను చూడవలసినట్లు ఆయన తెలియపరచాడు. ఉత్తరం రాగానే నేను నా భార్య, నా పెద్ద కుమార్తె అన్నపూర్ణ ఆమెను చూచుటకు వెళ్లాము. అప్పటికి ఆమె 80 సంవత్సరాల వృద్ధురాలుగా ఉండినది. ఒక అరగంటసేపు పరస్పర యోగక్షేమాలను గురించి మాట్లాడుకొని, ఆమె వద్ద సెలవు పుచ్చుకొని మా ఇల్లు చేరాము.

అప్పటినుండి ఆమెను మా ఇంటికి పిలిపించి, ఆమె మా అందరితో కలిసి భోజనం చేస్తూ, ఏదో కబుర్లు చెప్పుకుంటూ రెండు మూడు రోజులు గడిపి వెళ్లిపోవడం జరుగుతూ వచ్చింది. మా ఇంట్లో పెండ్లిండ్లు మొదలైన శుభకార్యాలు జరిగినప్పుడు ఆమెను ఆహ్వానించి, ఇతరులతోపాటు ఆమెకుకూడ చీరెలిచ్చి పంపించేవారం. ఇదిగాక ఆమెకు ప్రతినెల కొంత డబ్బు సహాయం

చేస్తూ వచ్చాను. నా మూడవ కుమార్తె వైదేహి ఇల్లు మలక్ పేటకు సమీపంలో ఉండేది. అందుచేత ఆమె వైదేహి ఇంటికి తరుచుగా వచ్చి నాలుగైదు రోజులు ఉంటూ ఉండేది. ఈవిధంగా ఎప్పుడో విడిపోయిన సంబంధం తిరిగి ఏర్పడింది. ఇది అంతకుపూర్వం ఏనాడో ఏర్పడవలసింది. కాని నా హృదయం పరిపక్వత గాంచని కారణంగా చాలాకాలం గడచిన తర్వాతనే ఏర్పడింది.

క్రైస్తవులలో ఆమెకు గౌరవస్థాన ముండేది. ఆమె బైబిలు గ్రంథాన్ని చదివి దానికి చక్కగా అర్థం చెప్పేది. దానిని వినుటకు చుట్టుప్రక్కల నుండి క్రైస్తవులు తరుచుగా సమావేశ మయ్యేవారు. హిందూసమాజం ఆమెను పతితు రాలుగా భావించినా క్రైస్తవుల గౌరవాన్ని ఆమె సంపాదించ గలిగింది. దీని ఫలితంగా ఆమె జన్మ సార్థకమైనదని నా దృఢ విశ్వాసం.

వార్ధక్యంవల్ల ఆమె 5, 6 సంవత్సరాలక్రింద వ్యాధిగ్రస్తు రాలైనది. ఆమెను చూచుటకు నేను, నాభార్య, వైదేహి వెళ్లినాము. కుటుంబములోని వారు, ఇరుగుపొరుగు వారు ఆమె చుట్టూ మూగి ఉండనారు. ఆమె చాల బలహీనస్థితిలో ఉండినది. ఎక్కువగా మాటలాడలేక పోయింది. తర్వాత అయిదారు రోజులకు కాలం చేసింది.

మా ఇంటిలో ఆమె ఉన్న రోజులలో ఆమె మూలంగా నా తల్లిదండ్రులు కష్టాలు అనుభవించారు. ఆడసంతానం మూలంగా వారికి కష్టాలే గాని, సుఖం కలగలేదని స్పష్టపరచు టకు, సమాజంలోని కొన్ని ఆచారాలు దానికి ప్రధాన కారణాలని నిరూపించుటకును నేను నా అక్కగార్ల గురించి ఇంత దీర్ఘంగా వ్రాయవలసి వచ్చింది.

ఈనాడు ఆలాటి ఆచారాలు లేవు. కొంతవరకు ప్రభుత్వం చేసిన చట్టము మూలంగాను, చాలావరకు స్త్రీలు కూడ పురుషు లతో పాటు ఇంగ్లీషు విద్యను అభ్యసించుట చేతను 20, 22 సంవత్సరాలకు గాని ఈ విద్య పూర్తి కాకపోవడంచేతను, వివాహం చేసుకొన్న పక్షంలో విద్య పూర్తి కావడం సాధ్యపడక

పోవుటచేతను, బాల్యవివాహాలు అంతరించినవి. స్త్రీ పునర్వివాహాలపట్ల ఈనాడు ఏలాటి విముఖత్వం లేదు. సమాజంలో ఇటీవల జరిగిన మార్పులలో ఇవి చాలా ప్రాధాన్యం వహిస్తున్నవి.

కాని దాంపత్య సుఖానికి అవరోధం కలిగించే ఇంకొక క్లిష్ట పరిస్థితిని స్త్రీలు ఎదుర్కొనుచున్నారు. నిర్బంధ వైధవ్యానికి బదులు నిర్బంధంగా వారు వయస్సు మీరిపోయే వరకు అవివాహితలుగా వుండవలసిన పరిస్థితులు ఏర్పడుచున్నవి. దీనికి వరదక్షిణలు ఇయ్యవలసి రావడం ప్రధాన కారణం. పురుషులు ఎంత చదువు కొన్నవారైనా వరదక్షిణలు పుచ్చుకొనక వివాహమాడడంలేదు. వారి విద్యాస్థాయి, ఉద్యోగస్థాయి పెరిగేకొద్దీ వరదక్షిణల మొత్తం కూడా పెరుగుతూ ఉంది. ఇంతటి దక్షిణలిచ్చి కుమార్తెలకు పెండ్లి చేయగలవారు లక్షాధికారులు మాత్రమే. సామాన్య మధ్య తరగతి వారికి ఇది సాధ్యం కావడంలేదు. ఇద్దరు ముగ్గురు కుమార్తెలు ఉన్నవారికి ఇది మరీ సాధ్యం కావడంలేదు. వరదక్షిణలను తీసుకోరాదని ప్రభుత్వం చట్టం చేసినా దానిని అమలుపరచడం సాధ్యం కాలేదు. చట్టం నిరర్థకమై పోయింది. ప్రస్తుతం సమాజం ఎదుర్కొంటున్న సమస్యలలో ఇది ఒకటి.

అమెరికావంటి కొన్ని దేశాలలో మానవ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు వివాహం అనేది ఒక ప్రతిబంధకంగా ఉన్నదని, వివాహ సంబంధంతో నిమిత్తం లేకుండా స్త్రీలు, పురుషులు వారికి ఇష్టం ఉన్నంతకాలం కలిసి ఉండి, తర్వాత విడిపోవచ్చుననే అభిప్రాయం బలపడుతున్నది. అనేకులు అలాగే చేస్తున్నారు, ఇది సర్వసాధారణం కావచ్చునేమో అని తోచుచున్నది. మనదేశంలో కూడ ఈలాటి విధానాన్ని అనుసరించ దలచినవారు లేకపోలేదు. పుట్టిన పిల్లలను పోషించి, పెద్దవారినిచేసి, వారికి విద్యను నేర్పే బాధ్యతను ఈ విధానంలో ఎవరు నిర్వహిస్తారు అనే సమస్య బయలుదేరక తప్పదు. వివాహ సమస్య లన్నిటిని గురించి చర్చించడం నా అభిమతం కాదు. అందుచేత ఈ విషయాన్ని ఇంతటితో ముగించుచున్నాను.

మా తల్లిదండ్రులకు కలిగిన నాల్గవ కుమార్తె సావిత్రమ్మ నాకంటె చిన్నది. ఆమె భర్త సుప్రసిద్ధ న్యాయశాస్త్రవేత్త

అల్లాడి కృష్ణస్వామయ్య అన్నగారు అల్లాడి సుబ్రహ్మణ్యంగారు. నా చెల్లెలు కాపరానికి వెళ్లేనాటికి వీరు బందరు కలెక్టరు కచ్చేరిలో ఒక ఉద్యోగి. వీరిది ప్రథమంలో అనుకూల దాంపత్యం. కాని కొన్ని సంవత్సరాలు గడచిన తర్వాత నా చెల్లెలికి కాలివ్రేళ్లలో పెద్దవ్యాధి కనుపించింది. అప్పటినుంచి నా బావమరది ఆమెతో కాపురం చేయడం మానుకొన్నాడు. అది నా తల్లిదండ్రుల కష్టాలకు కారణమైంది. మేము ఆమెకు ఎన్నో ఔషధాలు తెప్పించి చికిత్స చేయించాము. కాని లాభం లేకపోయింది.

తర్వాత సుమారు పదిసంవత్సరాలకు మా బావమరది తిరిగి నా చెల్లెలితో కాపురం చేయసాగారు. దానితో నా తల్లిదండ్రుల కష్టాలు ముగిసి ఆమె మూలంగా కొంత సుఖం కలిగింది. మొత్తంమీద ఆడసంతానం వారిని కష్టాలపాలు చేసినట్లే చెప్పవలసి ఉంది. చాలావరకు సమాజంలోని ఆచారాలే దీనికి కారణం.

నాకు ఇద్దరు తమ్ములని, వారిలో రెండవవాడు అకాల మరణానికి గురిఅయ్యాడని ఇదివరలోనే చెప్పాను. మొదటివాడు రామకృష్ణయ్య. ఇతని జీవితంలో మొదటి భాగం ఒక విధంగాను, రెండవ భాగం ఇంకొకవిధంగాను ఉండేది. ఇతడు నామోస్తరుగానే మద్రాసులో ఇంగ్లీషు విద్యను ప్రారంభించాడు. నేను నా విద్యను పూర్తిచేసుకొని కాకినాడ కళాశాలలో అధ్యాపకుడనైనప్పుడు నాతో కూడా కాకినాడకు వచ్చి స్కూలుఫైనల్లో కృతార్థుడై ఇంటర్మీడియేట్ చదువుచుండగా నేను విజయనగరంలో మహారాజావారి కళాశాలలో అధ్యాపకుడనైనాను. నా తమ్ముడు ఇంటర్మీడియేట్ పూర్తిచేసుకొని, బి. ఏ. కు విజయనగరం వచ్చి, చరిత్రశాఖలో చేరి నాకు శిష్యుడయ్యాడు. అప్పుడు స్నేహితులతో కలిసి కొన్ని చిలిపి చేష్టలు చేసేవాడు. వాటిలో ఒకటి నాకు ఇప్పుడు కూడ జ్ఞాపకంలో ఉన్నది. నాకు సహాయ అధ్యాపకుడుగా మద్రాసుకు చెందిన శ్రీనివాసాచార్యులు ఉండేవారు. వారు నేను ఉన్న ఇంటి పొరుగుననే ఉండేవారు. దీపావళి రోజున నా తమ్ముడు కొందరు స్నేహితులతో కలిసి రాత్రి పూట ఆచార్యులుగారి ఇంటిచుట్టూ తిరుగుతూ టపాసులను

కాల్చడమేగాక కొన్ని టపాసులను వెలిగించి, కిటికీగుండా ఆచార్యుల పడకగదిలోకి పారవేశాడు. అవి ఎలాంటి ప్రమాదాన్ని కలిగించలేదు గాని గట్టిగా ప్రేలి వారిని భయభ్రాంతులుగా చేసి, వారికి నిద్రాభంగం కలిగించాయి. మరుసటి ఉదయమే ఆచార్యులు గారి తల్లి మా ఇంటికి వచ్చి, ఈ ఉదంతాన్నంతా నాకు విశదపరచి, నా తమ్ముడిని మందలించవలసిందిగా చెప్పి వెళ్లి పోయింది. నేను వాడిని మందలించడంతో వాడు ఈలాటి చేష్టలను మానుకొన్నాడు.

వాడు బి. ఏ., పూర్తిచేసి 'లా' చదువుటకు మద్రాసుకు వెళ్లాడు. ఆ సమయంలోనే వాడికి మా నాయనగారు వివాహ ప్రయత్నం చేయసాగారు. సుప్రసిద్ధ న్యాయశాస్త్రవేత్త అల్లాడి కృష్ణస్వామయ్యగారికి ఇద్దరు అన్నలు. వారిలో రెండవవారు సుబ్రహ్మణ్యంగారు మా బావమరది. మొదటివారు రామశాస్త్రి గారికి ఒకే కుమార్తె, కాని మొగసంతానం లేదు. కృష్ణ స్వామయ్యగారి ఇంటి వ్యవహారాలను చూచుకొంటూ కొంత ఆస్తి పరుడైనాడు. మావాడు 'లా' పూర్తిచేసి లాయరుగా ప్రాక్టీసు పెట్టవలసినవాడు. ఆ సందర్భంలో కృష్ణస్వామయ్యగారితో వియ్యం ప్రయోజనం కాగలదని మా నాయనగారు ఊహించారు. ఆ పిల్లతో నా తమ్ముడికి వివాహం చేయుటకు మా నాయనగారు తీర్మానించుకొన్నారు. నేనుకూడ వారితో ఏకీభవించినాను. కాని ఈవిషయమై మేము నా తమ్ముడితో సంప్రతించలేదు. ఆ రోజులలో పిల్లల వివాహాలను పెద్దలే ఏర్పాటుచేసేవారు. వారి ఏర్పాటులకు అన్యథాగా పిల్లలు ప్రవర్తించేవారు కారు. మేము చేసిన ఏర్పాటుకు నా తమ్ముడు కట్టుబడి ఉంటాడని మేము భావించాము.

కాని అంతకు ముందే మా పినతల్లి మనుమరాలిని—శాస్త్ర వేత్తగా ప్రసిద్ధిగాంచి, మైసూరు సంస్థానంలో గొప్ప ఉద్యోగ పదవిలో ఉన్న అల్లాడి మహాదేవశాస్త్రిగారి కుమార్తెను— నా తమ్ముడికి ఇచ్చి వివాహం చేయుటకు వారు రహస్య ప్రయత్నాలు చేస్తూ ఉండినారు. అవి మాకు తెలియవు. ఆ అమ్మాయిని పెండ్లాడుటకు నా తమ్ముడు అంగీకరించాడు. ఇది అంతా రహస్యంగా జరుగుచుండడంచేత మేము అల్లాడి రామశాస్త్రుల

కుమార్తెతో పెండ్లికి అన్ని ఏర్పాటులు చేశాము. శుభలేఖలు మాత్రం పంచిపెట్టలేదు. ఈలాటి సమయంలో నా తమ్ముడు మాకు తెలియపరచకుండా ఇంటినుంచి ఎక్కడకో పారిపొయ్యాడు. అప్పుడు మేము విచారించగా మైసూరు సంబంధం మాకు తెలిసింది. అంతటితో నేను వాడిని కలుసుకొనుటకు మైసూరు వెళ్లినాను. అక్కడ వాడు కనుపించలేదు. మహాదేవశాస్త్రి మొదలైనవారు వాడిని గురించి తమకు ఏమీ తెలియనట్లు నటించారు. నా ప్రయాణం వ్యర్థమైనది. వాడి వివాహ ప్రయత్నాన్ని మానుకొన్నాము.

'లా' పరీక్షలో కృతార్థుడైనవాడు ప్రాక్టీసు పెట్టుటకు ముందు ఒక లాయరువద్ద అప్రెంటీసుగా (పనులను నేర్చుకొనేవాడుగా) ఒక సంవత్సరకాలం పనిచేయవలెననే నియమం ఉండేది. నేను కృష్ణస్వామయ్య వద్దకు వెళ్ళి మావాడిని అప్రెంటీసుగా స్వీకరించవలసిందిగా కోరాను. కాని ఆయన వెంటనే దానికి నిరాకరించాడు. ఇందులో ఆశ్చర్యపడవలసింది ఏదీ లేదు. ఇది సహజమైన పరిణామమే. తర్వాత మహాదేవశాస్త్రిగారి కుమార్తెతో మావాడికి వివాహం చేశాము (ఆయన నాకు పెదమామగారు.)

వివాహ విషయంలో నా తమ్ముడి ప్రవర్తన మా నాయనగారికీ, నాకు చాలా ఆశాభంగాన్ని కలిగించింది. దానిమూలంగా కృష్ణస్వామయ్య కుటుంబంతో మనస్పర్థలు కలిగి కొంతవరకు నా చెల్లెలు సావిత్రమ్మ అనుభవించిన కష్టాలకు దారితీసింది. సమాజంలో ఒకరి ప్రవర్తన వారిపైన మాత్రమే ప్రభావం వహించదు. ప్రత్యక్షంగానో, పరోక్షంగానో వారి సన్నిహితులందరిపైన ప్రభావం వహిస్తుంది.

నా తమ్ముడు పేరి నారాయణమూర్తివద్ద అప్రెంటీసుగా పనిచేసి నెల్లూరిలో ప్రాక్టీసు పెట్టాడు. న్యాయవాదిగా వాడు మంచి ఆదాయాన్ని సంపాదించాడు. కొంతకాలం గవర్నమెంటు ప్లీడరుగా ఉండినాడు. వాడికి ఏడుగురు కుమార్తెలు, ఏడుగురు కుమార్లు. కుమార్తెలలో నలుగురికి శాఖాంతర వివాహాలు చేశాడు. ఇద్దంతా ప్రశంసనీయమే. కాని అనేక సంవత్సరాలపాటు వాడు

నెల్లూరిలో ప్రఖ్యాతి గాంచిన ఒక క్లబ్బులో సభ్యుడై, సభ్యులలో అనేకుల మోస్తరుగా రోజు సాయంత్రం 6 గంటలనుంచి 10 వరకు పేకాట ఆడుతూ ఉండేవాడు. ఇంట్లోవారందరికి ఇది విసుగు కలిగించేది. మా నాయనగారు అప్పుడప్పుడు నెల్లూరికి వెళ్లుతూ ఉండేవారు. ఆయన కూడ వాడిలో ప్రబలిన పేకాట పిచ్చికి చాలా విచారించారు. కాని వాడిని మందలించలేకపోయినారు. కుమాళ్లు పెద్దవారై స్వతంత్రంగా జీవించగలవారైన తర్వాత తల్లిదండ్రులు వారిని మందలించడం ప్రాజ్ఞత కాదు. వారు దానిని సహించరు. నా అనుభవం కూడ ఈలాటిదే.

కాని ఈవిధంగా కొంతకాలము జరిగిన తర్వాత వాడి పెద్దకుమార్తె ఇద్దరి పిల్లల తల్లి ఒక అగ్నిప్రమాదంలో మరణించింది. పిడుగువంటి ఈ వార్తను విని వాడు దుఃఖసాగరములో మునిగి పోయినాడు. పైకి తేలడానికి కొంతకాలం పట్టింది. ఈ విచార ఫలితంగా వాడి జీవితమంతా పూర్తిగా మారింది. క్లబ్బుకు వెళ్లడం మానుకొన్నాడు. భగవద్భక్తిపరాయణుడయ్యాడు. రోజు రాముల పటానికి ఎదురుగ కూర్చొని ధూప దీప నైవేద్యాలతో ఒక గంట పూజ చేయసాగాడు. వాల్మీకి రామాయణం తదేక ధ్యానంతో పారాయణం చేయడం ప్రారంభించాడు. ఇంతేకాదు, దానిని నాలుగైదు పర్యాయాలు చదివి క్షుణ్ణంగా పరిశీలించాడు, దానిని ఆధారం చేసుకొని, తెనుగులో ఒక వచన గ్రంథాన్ని వ్రాయ సంకల్పించి ఒక సంవత్సర కాలంలో ఆ రచనను పూర్తి చేశాడు.

దానికి 'శ్రీమద్వాల్మీకి రామాయణ కథామృతము' అని పేరు పెట్టాడు. ఇది నిస్సందేహంగా అమృతమే.

అందులో వాల్మీకి శ్లోకాలను సమయోచితంగా చేర్చి, రామాయణ కథను రసవంతంగా, మనోజ్ఞంగా సామాన్య ప్రజలకు అర్థం అయ్యేటట్లు సులభ భాషలో రచనను సాగించాడు. ఆంధ్ర సరస్వతికి అది ఒక అమూల్య అలంకారంగా రూపొందింది. ఈలాటి రచనాశక్తి అతనిలో ఉన్నట్లు మేము ఎవరమూ ఎన్నడూ ఊహించలేదు. బహుశా వాడుకూడ ఊహించలేదేమో!

రచనను పూర్తి చేసిన తర్వాత దానిని నాకు, నా భార్యకు అంకితం చేయ నిర్ణయించుకొన్నాడు. విద్యార్థిగా వాడు మాతో కలిసి కొన్ని సంవత్సరాలు గడిపాడని ఇంతకు పూర్వమే చెప్పినాను. అప్పటినుంచి మా ఇద్దరిని తల్లిదండ్రులవలె గౌరవించేవాడు. తన గ్రంథాన్ని మాకు అంకితంచేయడానికి నిర్ణయించడం దీని ఫలితమే. మేము కూడా దీనిమూలంగా ధన్యుల మైనట్లు భావించాము. రామాయణ పారాయణం మా వంశంవారికి ఒక ప్రధాన లక్షణము. మా నాయనగారు రోజు ఒక గంట దానిని పారాయణం చేసే వారు. నేను కూడ కొన్ని సంవత్సరాలకాలం సుందరకాండ పారాయణం చేసేవాడిని. మా పినతండ్రి శ్రీనివాసాచార్యులు, ఆయన కుమారులు ఈలాగే చేసేవారు. మా నాయనగారు పారాయణం చేసిన రామాయణ గ్రంథాన్ని నా తమ్ముడు పదిల పరచి తనవద్ద ఉంచుకొన్నాడు. వాడు మా దంపతులిద్దరికి తన గ్రంథాన్ని అంకితం చేయడం మూలాన రామాయణంతో మాకు సన్నిహిత సంబంధం ఏర్పడింది.

అంకిత సందర్భంలో నెల్లూరి టౌను హాలులో ఒక గొప్ప సమావేశం జరుప నిశ్చయించి నాకు తెలియపరిచాడు. నేను వెంటనే ఆంధ్రప్రదేశ్ హైకోర్టులో న్యాయాధీశులుగా ఉన్న శ్రీ పెనుమత్స సత్యనారాయణరాజుగారిని (వీరు విజయనగరం మహారాజా కళాశాలలో నా వద్ద చదువు కొనినవారు. నా ప్రోత్సాహ మూలంగా దివ్యజ్ఞాన సభలో సభ్యులైనారు. నా పట్ల అత్యంత గౌరవాభిమానములు కలిగినవారు) కలుసుకొని అంకిత సమావేశానికి అధ్యక్షులుగా ఉండవలసినదిగా కోరాను. వారు దానికి అంగీకరించి, సమావేశానికి అధ్యక్షులై, నా తమ్ముడు రచించిన రామాయణాన్ని, నన్ను, నా భార్యను ప్రశంసించి, రెండురోజులు మాకు అతిథులుగా ఉండి మూడవ రోజున తిరిగి హైదరాబాదుకు వెళ్లారు. ఈ సభ నా జ్ఞాపకాలలో స్థిరపడి పోయినది.

తర్వాత గ్రంథాన్ని ముద్రించుటకై నా తమ్ముడు హైదరాబాదుకు వచ్చాడు. నా కుమారుడు ఆనందం దానికి కావలసిన ఏర్పాట్లు చేశాడు. ఖర్చులకు నిమిత్తం విరాళాలు

సేకరించాడు. సంవత్సరంలో ముద్రణ పూర్తియై ఆంధ్రలోకం ఆ ఉద్గ్రంథాన్ని చదివి ఆనందించగల అవకాశం లభించింది. చదివినవా రందరు అది ఒక ఉత్తమ గ్రంథంగా భావించారు. ఈలాటి ప్రశంసకు అది సర్వవిధాలా అర్హమైనట్టిది.

చిన్నతనంలో మావాడి చిలిపి చేష్టలు, యవ్వనంలో వివాహ విషయంలో మాకు ఆశాభంగాన్ని కలిగించడం, తర్వాత పేకాటలో నిమగ్నుడు కావడం — ఇవి అన్నీ ఈ గ్రంథ రచన మూలంగా వెనుకబడిపోయినవి. ఇది వాడికేగాక మా కుటుంబాని కంతా ఒక అమూల్యమైన అలంకారంగా రూపొందింది.

ఈ రచన తర్వాత భగవద్గీతను కూడ ఇదే శైలిలో రచించాడు. దీని ప్రకటన జరుగుటకు పూర్వమే క్యాన్సర్ వ్యాధి మూలంగా మరణించాడు. తర్వాత వాడి కుమాళ్లలో చిత్రలేఖకుడుగా ప్రసిద్ధిగాంచిన కృష్ణమూర్తి దీనిని ముద్రించి ప్రకటించినాడు.

నా తమ్ముని మిత్రులలో ఒకడైన నేలనూతల కృష్ణ మూర్తి వాడి తెనుగు రామాయణాన్ని ఇంగ్లీషులోకి తర్జుమా చేశాడు. కాని ఇది యింతవరకు ముద్రింపబడలేదు. ముద్రణ చాలా ఖర్చులతో కూడుకొనిన పని కావడమే దీనికి కారణము. భగవద్గీతకు చేయబడిన ఇంగ్లీషు భాషాంతరీకరణం ముద్రింప బడింది.

ఆడసంతానం మూలంగా మా తల్లిదండ్రులు కష్టాలు భరించినా మగసంతానం వారికి కొంత సంతోషాన్ని కలిగించింది. నా తమ్ముడు విద్యను పూర్తిచేయడం, న్యాయవాదిగా వృద్ధిలోకి రావడం వారు చూడ గలిగారు. వాడి జీవితంలో రెండవదశ ప్రారంభమయ్యే నాటికి వారు మరణించారు.

# 4. నేను - నా విద్య

సర్వధారి సంవత్సర పుష్య శుద్ధ సప్తమి ( 1889 జనవరి 8 ) నా జన్మదినం అని ఇదివరలోనే చెప్పినాను. నా బాల్యం సాఫీగానే నడిచిపోయింది. నా గ్రామస్థులు నేను వారికి గౌరవపాత్రులైన వెంకటేశయ్య కుమారుడ నని, నా బంధువర్గం అక్కయ్య కుమారుడ నని నా పట్ల ప్రేమాభిమానములు కలవారయ్యారు. 5, 6 సంవత్సరముల వయస్సులో నేను మా నాయనగారితో ఇందుపూరులోని ఏటూరు సుబ్బారెడ్డిగారి ఇంటికి వెళ్లినప్పుడు ఆయన భార్య నన్ను ఎత్తుకొని, ముద్దుపెట్టుకొనడం నాకు ఇప్పటివరకు జ్ఞాపక మున్నది.

అయిదవ ఏట నాకు అక్షరాభ్యాసం చేసి గ్రామంలోని వీధి బడిలో చేర్చారు. శిరోభూషణం రాఘవాచార్యులుగారు నాకు అయ్యవారు. వీరు ఎక్కువగా చదువుకొన్నవారు కారు. ఆనాటి విద్యాబోధకు గొప్ప చదువు అవసరం లేదు. పెద్దబాలశిక్ష మాకు పాఠ్యగ్రంథం. అందులోని విషయాలను బోధించుటకు కావలసిన పాండిత్యమే మా అయ్యవారికి ఉండేది.

మా బడిలో 15, 20 మంది కంటె ఎక్కువగా పిల్లలుండేవారు కారు. వీరందరు బ్రాహ్మణ, కోమటి, పంటకాపు, వెలమ, అరవ కరణాల కులాలకు చెందినవారు. తక్కిన సవర్ణులు తమ పిల్లలకు విద్య అనవసరమనే భావంతో వారి పిల్లలను వీధి బడికి పంపేవారు కారు. మాల, మాదిగలు అస్పృశ్యులు కావడం చేత బడిలో వారి పిల్లలకు ప్రవేశం ఉండేది కాదు. ఆడపిల్లలు ఎవరూ ఆ రోజులలో బడికి వచ్చి చదువుకొనేవారు కారు.

మా బడి అక్షరాలా వీధిబడియే. అయ్యవారి చిన్న పూరి ఇంటికి ముందు ఖాళీ ప్రదేశమే మాబడి. దానికి, వీధికి మధ్య ఒక గోడ కూడా లేదు. అది వీధిలో కలసిపోయి ఉండేది.

బడిలో పిల్లలు నేలమీద కూర్చుండి వారి చదువును సాగించేవారు. కొందరు చిన్న తాటాకు చాపలను తెచ్చుకొని వాటిపైన కూర్చుండేవారు. ఆ రోజులలో బెంచీలు వాడుకలోకి రాలేదు.

పిల్లలు గోచీ పెట్టుకొని బడికి వచ్చేవారు. దానికి అదనంగా వారికి దుస్తులు ఉండేవి కావు. బడికి రానిపిల్లలు కూడా గోచీతోనే తిరగడం మామూలు. చలికాలంలో మాత్రం ఒక చిన్న దుప్పటిని కప్పుకొని బడికి వచ్చేవారు.

విద్యావిధానంలో అది ఒక సంధియుగం. పాత కొత్త కలిసి పోతున్నకాలం. పిల్లలలో కొందరు కర్రపలకలపై సుద్దముక్కతో వ్రాసేవారు. మరికొందరు అప్పుడప్పుడే ఉపయోగంలోకి వచ్చిన స్లేటు పలకలను, స్లేటు బలపాలను ఉపయోగించేవారు. స్లేటు పలకలను ఎండుకొబ్బరి ముక్కలతో రుద్దడం వారి అలవాటు. కాగితాలు, రెక్క పేనాలు పిల్లలే తయారు చేసుకొని కరక్కాయ సిరా కొందరు ఉపయోగించేవారు. కాని తక్కినవారు పాతపద్ధతి ప్రకారం గంటంతో తాటాకులపై వ్రాయడం నేర్చుకొనేవారు. నేను అలాగు నేర్చుకొన్నవాడిని.

సూర్యోదయానికి ముందే పిల్లలు బడికి రావడం మామూలు. మొదట వచ్చినవాని అరచేతిలో సిరీ, తర్వాత వచ్చినవాడి చేతిలో చుక్క అయ్యవారు పెట్టేవారు. పిల్లలందరు 8 గంటల ప్రాంతంలో ఇండ్లకు వెళ్ళి చల్దిఅన్నంతిని, వెంటనే తిరిగి బడికివచ్చి, మధ్యాహ్నం పదకొండు గంటలకు ఇండ్లకు వెళ్ళి భోజనం చేసి, రెండు గంటల ప్రాంతంలో బడికివచ్చి సాయంకాలం సూర్యాస్తమయ సమయంలో ఇంటికి వెళ్ళిపొయ్యేవారు.

నేలమీద అక్షరాలు వ్రాసి నేర్చుకోవడంతో వారి విద్య ప్రారంభమయ్యేది. క్రమక్రమంగా పలకలమీద అక్షరాలను, గుణింతాన్ని వ్రాయుటకు నేర్చుకొనేవారు. తర్వాత బాలశిక్షలోని

చిన్న చిన్న మాటలను వ్రాసేవారు. ఈవిధంగా ఒక సంవత్సరములో వ్రాతను, సునాయాసంగా బాలశిక్షను చదవడం వారు పూర్తిచేసేవారు. దీనితోపాటు ఉదయం, సాయంత్రం ఎక్కాలను వల్లించడం ఒక దినచర్య. ఇది పూర్తికాగానే రెండవ సంవత్సరం భిన్నాలు, అటు తర్వాత మాపులు నేర్చుకొనే వారు. కూడికలు, తీసివేతలు, గుణకార భాగారాలు, వడ్డీ కట్టడం, బాలశిక్షలోని ఇతర రకములైన లెక్కలు నేర్చుకొనడం జరిగేది.

బాలశిక్షను చక్కగా చదవగలవారికి రెండవ సంవత్సరంలో "పెద్దపుస్తకం" (అనగా భారతమో, భాస్కర రామాయణమో) చదవడం నేర్పేవారు. పౌర్ణమి, పాడ్యమి, అమావాస్య, పాడ్యమీలు సెలవు రోజులు. ఆ రోజులలో వల్లించుటకు సుమతీశతకం, వేమనశతకం, రుక్మిణీకల్యాణం మొదలైన వాటిలోని నాలుగైదు పద్యాలను పలకలమీద వ్రాసుకొనిపోయి, విదియనాడు బడికి వచ్చేనాటికి వాటిని ఒప్పగించేవారు. ఈవిధంగా చదువు పూర్తి అయ్యేటప్పటికి రెండు మూడు వందల పద్యాలు వారికి కంఠతా వచ్చి ఉండేవి.

5-వ ఏటి నుంచి 7 వరకు నేను వీధిబడిలో చదివి, పైన వివరించిన విద్యను పూర్తిగా నేర్చుకొన్నాను.

ప్రతిసంవత్సరము బడిని తనిఖీ చేసి పిల్లలను పరీక్షించుటకు ఒక ప్రభుత్వ ఇన్‌స్పెక్టరు వచ్చేవాడు. ఆ సందర్భంలో నాకు ఒక విషయం ఇంకా జ్ఞాపకం ఉన్నది. నేను రెండో తరగతిలో ఉన్నప్పుడు బడి తనిఖీకి ఇన్‌స్పెక్టరు రాత్రి 7–8 గంటల మధ్య వచ్చాడు. ఆయన దగ్గర ఒక గుడ్డిలాంతరు ఉండేది. దాని ఎదుట పిల్లలందరిని సమావేశపరచవలసిందిగా అయ్యవారిని ఆదేశించాడు. పిల్లల పరీక్షను అప్పుడే పూర్తి చేసి, మరుసటి రోజు ఉదయమే గ్రామాంతరానికి వెళ్లే ఉద్దేశంతో వచ్చినాడు. రాత్రి 7–8 గంటలప్పుడు పిల్లలందరు నిద్రలో ఉండేవారు. వారిని లేపి, బడిలో హాజరు పెట్టడం ఒక సమస్య. తక్కిన పిల్లల విషయం నాకు తెలియదు. కాని నన్ను లేపి ఒక అరటిపండును నా చేతిలో పెట్టి బడికి తీసుకొని వెళ్లినారు. ఇన్‌స్పెక్టరు నన్ను ఒక పద్యం

చదువుమని, ఒక ఎక్కం ఒప్పగించుమని, లాంతరు ఎదుట బాలశిక్షలోని రెండు వాక్యాలను చదువుమని అడిగాడు. నేను ఆయన కోరిన ప్రకారం చేశాను. అంతటితో నా పరీక్ష పూర్తియై నేను కృతార్థుడైనట్లు చెప్పాడు. తక్కిన పిల్లల పరీక్షకూడ ఇదే పద్ధతిలో జరిగింది. అందరూ కృతార్థులైనారు. కృతార్థుల సంఖ్యనుబట్టి ఒక్కొక్క విద్యార్థికి మూడు రూపాయలచొప్పున అయ్యవారికి ప్రభుత్వం గ్రాంటు ఇచ్చేది. ఇదే ఆయనకు లభించే ఆదాయం. ఆ సంవత్సరం ఆయనకు 40, 50 రూపాయలు ముట్టి ఉంటుంది.

అయ్యవారు ఒక రిజిస్టరులో ప్రతినెల పిల్లలలో ఎందరు హాజరైనది తనిఖీ రోజున వ్రాసిపెట్ట వలసినట్లు ఒక చట్టం ఉండేది. మా అయ్యవారికి రిజిస్టరు తయారుచేసి పెట్టడం తెలియదు. నెల్లూరు తాలూకా దుత్తపాడు గ్రామంలో ఆయన అల్లుడు కొంచెం చదువుకొన్నవారు ఉండేవారు. ఆయన మా గ్రామానికి ఎప్పుడైనా వచ్చి రిజిస్టరును పూర్తిచేసి, పిల్లలందరు హాజరైనట్లు వ్రాసి వెళ్ళిపొయ్యేవాడు. ఈ రిజిస్టరు ఆధారంగా బడి తనిఖీ జరిగేది.

ప్రభుత్వం ఇచ్చే గ్రాంటు గాక విదియనాడు పిల్లలు బడికి వచ్చినప్పుడు అర్ధశేరు బియ్యం తెచ్చి అయ్యవారికి ఇచ్చేవారు. కొందరి తల్లిదండ్రులు ప్రతినెల ఒక కుంచెడు ధాన్యం ఇవ్వడం మామూలు. అప్పుడప్పుడు కాయకూరలను కూడ పంపేవారు. వీటి అన్నిటితో అయ్యవారు సునాయాసంగా కుటుంబాన్ని పోషించగలవారయ్యారు.

బడిపిల్లలందరు దసరాకు ముందు ఇరవైరోజులు దసరా పద్యాలను ఒప్పగించడానికి నేర్చుకొనేవారు. ఈ పద్యాలను గుండ్రంగా కత్తిరించిన తాటాకులలో వ్రాసి, వాటి నన్నిటిని కలిపి కట్టి ఉంచేవారు. దీనిని చేతిలో పెట్టుకొని పిల్లలు అయ్యవారితో కూడ గ్రామంలోని కొందరి ఇండ్లకు వెళ్ళి పద్యాలను ఒప్పగించేవారు. ఇంటి యజమానులు పిల్లలకు పప్పు బెల్లాలను, అయ్యవారికి అర్ధ, పావలా డబ్బులను ఇచ్చి పంపివేయడం మామూలు.

మా గ్రామానికి 4, 5 మైళ్ళ దూరంలో ఇసుకపల్లిలో ఒక ఉప్పు కొఠారు ఉండేది. అందులోని ఉద్యోగులు దసరాలో పిల్లలతో అయ్యవారు వచ్చినప్పుడు ఆయనకు రెండు, మూడు రూపాయలు పారితోషికంగా ఇవ్వడం మామూలు. అందుకుగాను 4, 5 మైళ్ళు నడవగల పిల్లలు అయ్యవారితో అక్కడికి వెళ్ళి వచ్చేవారు. ఒక సంవత్సరం నేను కూడ అక్కడికి వెళ్ళినాను.

దసరాలో పిల్లలందరు మంచి దుస్తులను ధరించి, చేతిలో విల్లంబులనుగాని, కోతి కొమ్మంచినిగాని పెట్టుకొని దసరా పద్యాలను చదువుటకు వెళ్లేవారు. నా పినతల్లి వెంకమ్మ తిరుపతినుండి నాకు ఒక చల్లడం (పంట్లాం), ఒక వొక్కాయ, ఒక టోపీని తెచ్చి ఇచ్చింది. ఈ దుస్తులను వేసుకొని, చేతిలో కోతి కొమ్మంచిని పెట్టుకొని దసరా కార్యక్రమంలో నేను పాల్గొనేవాడను.

ఈవిధంగా నేను నా బాల్యంలో నా వీధిబడి విద్యను పూర్తిచేశాను. ఈనాడు ఈలాటి వీధిబడులుగాని, విద్యావిధానంగాని లేదు. మా గ్రామంలోను, ఇతర గ్రామాలలోను ప్రభుత్వం వారో, జిల్లాపరిషత్తువారో విద్యాలయాలను స్థాపించి నడిపిస్తున్నారు. అవి కొంత విశాలమైన ఇండ్లలో నెలకొని ఉన్నవి. వాటిలో అస్పృశ్యులతో సహా అన్ని కులాలకు చెందిన పిల్లలు, మగపిల్లలేగాక ఆడపిల్లలు, చదువుతున్నారు. ఒక అయ్యవారికి బదులు కొంత ఉన్నత విద్యను అభ్యసించి, ప్రత్యేకంగా శిక్షణ పొందినవారు ఉపాధ్యాయులుగా ఉన్నారు. ఒక ఉపాధ్యాయునికి బదులు తరగతుల సంఖ్యనుబట్టి నలుగు రైదుగురు ఉపాధ్యాయులున్నారు. బెంచీలు, కుర్చీలు, మేజాబల్లలు, బ్లాక్ బోర్డులు, మ్యాపులు, ఇతరములైన పటాలు, వివిధ విషయాలను బోధించే పాఠ్యపుస్తకాలు, నోటుబుక్కులు, పెన్సిలులు, పేనాలు మొదలైన పరికరాలు వాడుకలోకి వచ్చినవి. గోచి పెట్టుకొని ఎవరూ బడికి వెళ్లడంలేదు. అందరు వొంటినిండా దుస్తులు వేసుకొని వెళ్లుతున్నారు. వీటి అన్నిటిమూలంగా నేను చిన్ననాడు నేర్చిన విద్యకంటె సర్వవిధాలా విశాలతరమైన విద్య అందరి అందుబాటులోకి వచ్చింది. సమాజంలో నా జీవితకాలంలో అన్నిరంగాలలో మార్పులు వచ్చినట్లే విద్యారంగంలో విప్లవాత్మకములైన

మార్పులు వచ్చినవి. ఇది హర్షింపదగిన పరిణామం. ఇది అందరి అనుభవంలో ఉన్న విషయం కావడంచేత దీనినిగురించి విపులంగా వివరించవలసిన అవసరం లేదు. నా చిన్ననాటి చదువు ఈలాటిది కాదు. ఈతరం వారికి దానిని గురించి ఏమీ తెలియదు. అందుచేతనే దానిని గురించి కొంచెం దీర్ఘంగా వ్రాశాను.

సంప్రదాయానుసారంగా నాకు పదవఏట ఉపనయనం జరిగింది. నేను మా గ్రామంలో ఉన్నంతవరకు త్రికాల సంధ్యావందనం చేస్తూ వచ్చాను. పూర్వకాలం నుంచి పరిపాలకులలోను, ప్రజలలోను వేదశాస్త్రాలను అభ్యసించినవారి పట్ల ఆదరణ ఉండేది. వారిని అనేకవిధాలుగా సత్కరించే వారు. బ్రిటిషు పరిపాలన కాలంలో ఈ ఆదరణ చాలావరకు తగ్గింది. అందుచేత వీధిబడి చదువు పూర్తిచేసుకొన్న తర్వాత మా శాఖకు చెందిన పిల్లలు వేదశాస్త్రాల అధ్యయనాన్ని మానుకొన్నారు. నా బాల్యంలో ఎవరో కొందరు మాత్రమే వాటిని అభ్యసిస్తూ ఉండేవారు. అన్ని కుటుంబాలవారికి ఏదో కొంత భూవసతి ఉండినందున వారు సోమరులుగా వారి కాలాన్ని వ్యర్థపుచ్చేవారు. నేను అలాగు వ్యర్థపుచ్చడం మా నాయనగారికి ఇష్టం లేదు. అందుచేత నాకు శ్రీసూక్తం, పురుషసూక్తం, మహాన్యాసం, నమకం, చమకం నేర్పారు. నేను వాటిని చక్కగా వల్లించాను. యజుర్వేద అధ్యయనాన్ని ప్రారంభించాను.

ఇంతేగాక నా పినతండ్రి శ్రీనివాసాచార్యుల వద్ద సంస్కృతం నేర్చుకొనసాగాను. వారు సంస్కృతంలో గొప్ప పండితులు. చిన్నతనంలో కాళహస్తి గురుస్వామి శాస్త్రుల వద్ద వ్యాకరణశాస్త్రాన్ని క్షుణ్ణంగా చదివారు. మా గ్రామంలో సంస్కృతం నేర్చుకోదలచినవారు వారి వద్ద నేర్చుకొనేవారు. నేను కూడ అలాగే చేసి అచ్చుపడ్డ శబ్దమంజరిలోని శబ్దాలు అనేకాన్ని వల్లించాను. అందులో చేర్చబడిన సంక్షిప్తరామాయణ కథను చదివాను. రఘువంశంలో నాల్గవ సర్గను చదవడం మొదలుపెట్టాను. అప్పటికి నాకు 9 సంవత్సరాలు.

కాని మా నాయనగారు మంచి లౌకికజ్ఞానం కలవారు. వారు ఆనాటి పరిస్థితులను గమనించి నాకు ఇంగ్లీషు చదువును

నేర్పుటకు నిర్ణయించారు. అంతకుపూర్వం మా గ్రామంలో మా అయ్యవారు శిరోభూషణం రాఘవాచార్యులగారి కుమారుడు ఒక్కడే మద్రాసుకు వెళ్లి ఇంగ్లీషు చదివినాడు. (నా పేరు, ఆయన పేరు ఒకటిగా ఉండడం కాకతాళీయం.) నేను ఇంగ్లీషు నేర్చుకొనుటకు మద్రాసుకు వెళ్లడం తప్ప సాధనాంతరం లేదు. ఈనాడు మా గ్రామానికి మూడు మైళ్ళ దూరాన అల్లూరిలో రెండు ఉన్నత పాఠశాల లున్నవి. ఇంగ్లీషు నేర్చుకొనదలచినవారు రోజు ఉదయం 9 గంటలకు బయలుదేరి, అల్లూరికి వెళ్ళి సాయంకాలం 6 గంటలకు తిరిగి తమ ఇండ్లకు వస్తున్నారు. ఇది ఈనాటి గొప్ప సదుపాయం. ఇది నా బాల్యంలో లేదు. అందుచేత నేను మద్రాసుకు వెళ్ళడం తప్పింది కాదు.

తొమ్మిది సంవత్సరాల వయస్సులో తగిన సంరక్షణ లేక నన్ను మద్రాసుకు పంపడం ఉచితంకాదని మా నాయనగారు భావించారు. ఆనాడు మద్రాసులో మాకు సన్నిహిత కుటుంబాలు రెండు ఉండేవి. వాటిలో ఒకటి మా బావగారు పార్వతీశ్వరయ్యది. వారిని గురించి ఇదివరకు వ్రాసినాను. రెండవది మా పెదతండ్రి రంగాచార్యుల కుమారుడు వెంకట సుబ్బయ్యది. (వ్యవహారంలో అందరూ వీరిని "నామాలు" అని పిలిచేవారు.) వీరు మెట్రిక్యులేషన్ వరకు చదివి హిందూ తియలాజికల్ స్కూలులో రు. 15–20 ల జీతంమీద చిన్న క్లాసుకు ఉపాధ్యాయులుగా ఉండేవారు. మా నాయనగారు నన్ను మద్రాసుకు తీసుకొని మా బావగారి సంరక్షణలో వారి ఇంట చేర్చినారు. బావగారు ఏలాటివారైనా మా అక్కగారు నన్ను నా తల్లివలెనే చూచుకొనగలదనేదే దీనికి కారణం.

నేను ఆనాడు మామూలు స్కూలులో మొదటి తరగతిలో చేరిన పక్షాన బి. ఏ. వరకు నా చదువు పూర్తి అగుటకు 14 సంవత్సరాలు పట్టేది. ఇది కాలయాపనతో కూడుకొన్న పని అని భావించి నన్ను మొదటి సంవత్సరం (అంటే 1898 లో) ఒక ప్రైవేటు స్కూలులో చేర్చారు. అందులో పాఠ్య విషయా లన్నిటినీ ఒక సంవత్సరములో పూర్తిచేసి, రెండవ సంవత్సరంలో మామూలు స్కూలులో రెండవ ఫారంలో

చేరుటకు అవకాశం ఉండేది. నన్ను చేర్చిన ప్రైవేటు స్కూలులో నెల్లూరుకు చెంది, మా అన్న వెంకట సుబ్బయ్యకు మిత్రుడైన పూళ్లకుట్టి ఆదినారాయణయ్య అనే తుమ్మగుంట బ్రాహ్మణుడు ఉపాధ్యాయుడు. ఈ స్కూలు వర్తక వ్యాపారాలద్వారా ధనికులైన కోమట్లకు కేంద్రంగా ఉండే గోవిందప్పనాయకర్ వీధిలో ఒక మేడపైన గదిలో ఉండేది. అందులో చదివే వారంతా కోమట్లే. ఆ రోజులలో ఇంగ్లీషు విద్యను ప్రారంభించే వారు తప్పనిసరిగా ఒక వొకాబ్యులరీ (Vocabulary. ఇందులో మూడు నాలుగు వందల ఇంగ్లీషు మాటలకు తెలుగు అర్థం ఉండేది), ఒక స్పెల్లింగ్ పుస్తకం (Spelling book ఇది ఒక గుణింతం పుస్తకం వంటిది), గార్త్‌వైటు అనే గ్రంథకర్త వ్రాసిన మొదటి తరగతి ఇంగ్లీషు వాచకం, ప్రాథమిక ఇంగ్లీషు వ్యాకరణం, పాఠ్యపుస్తకాలు వీటిని వల్లెవేయడం, రెండవ ఫారంలో చేరుటకు కావలసిన లెక్కలు వేయడం— ఇదీ నేను చేయవలసిన పని. ఆదినారాయణయ్య మంచి శక్తి సామర్థ్యాలు గల ఉపాధ్యాయుడు.

నేను స్కూలులో చదవడమే కాకుండా అప్పుడప్పుడు ఆదినారాయణయ్యగారి ఇంటికి వెళ్ళి ఒకటి రెండు గంటలు చదివేవాడిని. ఆదినారాయణయ్య చేతిలో ఎప్పుడూ ఒక బెత్తం ఉండేది. ఇది ఉపాధ్యాయు లందరికి ఒక బాహ్య చిహ్నం. దానిని విద్యార్థులపై వినియోగించడం తమ జన్మహక్కుగా వారు భావించేవారు. విద్యార్థులను మంచిమార్గంలో పెట్టడానికి ఇది అవసరమైన సాధనమని వారి విశ్వాసం. ఒక రోజు నేను ఆదినారాయణయ్య గారి ఇంటిలో చదువుతుండగా వారు నన్ను నిష్కారణంగా బెత్తంతో కొట్టినారు. నేను అంతకుపూర్వం ఎవరి చేతుల లోను దెబ్బలు తిన్నవాడను కాను. బాధను భరింపలేక కొంత ఏడ్చాను. దగ్గర నిలబడి ఉన్న ఆదినారాయణయ్య గారి భార్య దీనిని గమనిస్తూనే ఉండింది. వెంటనే ఆయన ఎదుట నిలబడి "ఎందుకండీ నిష్కారణంగా ఆ పిల్లవాడిని కొట్టారు? వాడు ఏమీ తప్పు చేయలేదే! చూడండి, ఈసారి

మీరు ఈలాగు కొట్టారంటే మిమ్ములను ఏమి చేస్తానో" అని ఆయనను గదమాయించింది. అప్పటినుంచి నన్నే కాదు తక్కిన విద్యార్థులను కొట్టడం ఆయన మానుకొన్నారు. భార్య ఆయనకు తగిన బుద్ధి చెప్పింది. మామూలు స్కూళ్లలో కూడ నాల్గవ ఫారం వరకు ఉపాధ్యాయులు ఆ రోజులలో బెత్తాన్ని ఉపయోగించేవారు. అటుతర్వాత వారిని కొట్టే అధికారం ఒక హెడ్ మాస్టరుకే ఉండేది.

ఆదినారాయణయ్యవద్ద ఒక సంవత్సరం చదివి 1899 లో నేను పచ్చయప్పా కళాశాలకు అనుబంధంగా ఉండిన గోవింద నాయకర్ మాధ్యమిక విద్యాలయంలో రెండవ ఫారంలో చేరినాను. ఆ రోజులలో కళాశాల కార్యనిర్వాహకవర్గం వారు అర్హతగల విద్యార్థులను సగం జీతం పైనగాని, లేదా పూర్తి జీతం కూడ తీసుకోకుండా గాని కళాశాలలోను, అనుబంధ స్కూళ్ళలోను చేర్చుకొనేవారు. నా పెదతల్లి ( వెంకట సుబ్బయ్య తల్లి ) ద్వారా నాకు ఆలాటి సదుపాయం లభించింది. ఆనాటి పచ్చయప్ప కళాశాల కార్యనిర్వాహకవర్గంలో ప్రభుత్వోద్యోగిగా ప్రఖ్యాతిగాంచిన వెంబాకం కృష్ణమాచార్యులు సభ్యులుగా ఉండేవారు. వీరు బాల్యంలో మా పెదతల్లితో కూడ ఆడుకొన్నవారు. ఆ చనువుచేత ఆమె నన్ను ఆయన వద్దకు తీసుకొని వెళ్ళింది. ఆయన మొదటి సంవత్సరంలో నేను సగం జీతం చెల్లించవలసినట్లు, అటుతర్వాత నా విద్య పూర్తి అయ్యే వరకు జీతం చెల్లించడం అవసరంలేనట్లు కార్యనిర్వాహకవర్గంచేత ఆర్డరు వేయించాడు. దాని ఫలితంగా మూడవ ఫారం నుంచి ఏలాటి జీతం చెల్లించడం అవసరంలేకుండా బి. ఏ. లో కృతార్థుడనయ్యేవరకు ఈ కళాశాలలో చదువు సాగించాను. ఇందుచేత నా పెత్తల్లి నాకు చిరస్మరణీయురాలైనది. ఆమె నాకు విద్యాదానం చేసింది.

స్కూలులోను, కళాశాలలోను నా విద్య తృప్తికరంగా సాగింది. అన్నితరగతులలో నేను మొదటివాడనుగానో, రెండవ వాడనుగానో ఉండి, ఏటేట పుస్తకరూపంలో బహుమానాలకు అర్హుడ నైనాను. ఆ పుస్తకాలలో ఒకటికూడ ఈనాడు నావద్ద

లేకపోయినందుకు చాలా విచారిస్తున్నాను. వాటిని పదిలపరచ డంలో నేను జాగ్రత్త వహించడం నా బాధ్యత. కాని నేను ఆ బాధ్యతను విస్మరించాను. బి. ఏ., పరీక్షలో నేను మూడు శాఖ లలో ( ఇంగ్లీషు, తెలుగు, చరిత్ర ) మొదటిశ్రేణిలో కృతార్థుడ నగుటయే గాక విశ్వవిద్యాలయాని కంతా చరిత్రలో మొదటివాడ నయ్యాను. అప్పుడు విశ్వవిద్యాలయంవారు బహూకరించిన గ్రంథాలలో ఒకటి మాత్రం ఈనాడు నావద్ద ఉన్నది. దానిని నాకు బహూకరించినట్లు తెలియపరుస్తూ విశ్వవిద్యాలయ ఉపా ధ్యక్షుని సంతకంతో ఒక సర్టిఫికేటు దానిలో ఉన్నది. ఇదిగాక కళాశాలవారు బహూకరించిన రెండు బంగారు పతకాలు కూడ ఇప్పుడు నావద్ద ఉన్నవి.

మద్రాసులో నా విద్య చక్కగా జరిగినా నాకు లభించిన భోజన వసతులు, సంరక్షణ తృప్తికరంగా లేకపోయినవి. మా బావగారు, అక్కగార్ల మధ్య ఏలాటి సంబంధమో ఇదివరకే తెలియపరచాను. అక్కడ ఉండడం అప్పుడప్పుడు నాకు కష్టంగా ఉండేది. అలాటి సమయాలలో నేను నా అన్న నామాలుగారి ఇంట్లో ఉండేవాడిని. కాని వీరి ఇంట్లో వీరు, వీరి భార్య, బావమరది మాత్రమే గాక, వీరి అక్కగారు బావగారు వారి సంతానం అయిదుగురు, బావగారి ముదుసలి తల్లి మొత్తం 14 మంది ఉండేవారు. కాపురం ఉన్న ఇల్లు చాలా చిన్నది. వారి ఆదాయం కూడ చాలా తక్కువ. అందరి మధ్య నా చదువు చక్కగా సాగేదికాదు. భోజనవసతి కూడ చెప్పుకోనతగినది కాదు. ఉచితంగా భోజనంపెట్టేవారిని తప్పుపట్టడం ధర్మం కాదు. అయినా ఆ రోజులలో నేను పడిన కష్టాలను పూర్తిగా మరచిపోలేను. ఉదయం 9 గంటలకు భోజనంచేసి, మధ్యాహ్న భోజన నిమిత్తం మజ్జిగ అన్నాన్ని ఒక విస్తరిలో పెట్టి దానిని మూటగట్టి, మూటను చేతిలో పెట్టుకొని స్కూలుకు వెళ్ళేవాడిని. దారి పొడుగున మజ్జిగ కారిపోతూనే ఉండేది. దానిని పట్టుకొని నడవడానికంటె వీధిలో పారవేయడమే ఉచితంగా తోచేది. అనేకపర్యాయాలు అలాగే చేసి మధ్యాహ్నం పస్తు ఉండేవాడిని. ఆకలితో అలసిపోయి సాయంకాలానికి ఇంటికి వచ్చి రాత్రి

8 గంటలకు భోజనం చేసేవాడిని. ఆ రోజులలో టిఫిన్ కారియర్లు వాడుకలోకి రాలేదు. ఈలాగు పస్తుండటం దుర్భరమై అవినీతికి పాల్పడే ప్రమాదం ప్రాప్తిస్తుందేమో అని భయపడినాను. ఈ బాధను భరించలేక ఒక పర్యాయం టికెట్ కొనక మా గ్రామానికి రైలు ప్రయాణం చేశాను. మా నాయనగారు నన్ను మద్రాసుకు తీసుకొనివచ్చి మా బావగారి ఇంట్లో చేర్చారు. ఈలాటి సంఘటన లన్నిటిని ప్రస్తావించడం సందర్భోచితం కాదేమో నని ఆ పనిని మానుకొంటున్నాను.

కాని ఈలాటి అనుభవాల మూలంగా ఒక గుణపాఠాన్ని నేర్చుకొన్నాను. చిన్నవయస్సులోని పిల్లలు తల్లిదండ్రుల పోషణ లోను, సంరక్షణలోను కాలం గడపడమే ఉత్తమ మార్గం. బంధువులు ఎంత సన్నిహితులైనా తల్లిదండ్రులవలె బాధ్యతతోను, అభిమానంతోను వారిని సంరక్షించలేరు. సంరక్షించగలవారు బొత్తిగా లేరని నేను చెప్పడం లేదు. కొందరు ఉన్నారు గాని వారి సంఖ్య చాలా తక్కువ. నేను పైన చెప్పినదంతా నా అనుభవాన్ని ఆధారంచేసుకొని చెప్పిన మాటలు.

బంధువుల ఇండ్లలో ఆశ్రయం లభించక ఇంగ్లీషు విద్యను నేర్చుకొనుటకు మద్రాసుకు వచ్చినవారు ఆనాడు ఎందరో ఉండేవారు. ఆ రోజులలో బ్రాహ్మణభక్తి ( ఇది మూఢ భక్తి కావచ్చు ) తక్కిన కులాలవారికి ఎంతగానో ఉండేది. మద్రాసులోని కోమట్లు కన్యకాపరమేశ్వరీ దేవాలయానికి అనుబంధంగా స్థాపించిన సత్రములో బ్రాహ్మణ విద్యార్థులకు ఉచితంగా భోజనం పెట్టేవారు. మొదలియార్లు కూడ ఈలాటి సత్రాలను స్థాపించి, వాటిని సక్రమంగా నడిపిస్తూ ఉండేవారు. వాటిలో విద్యార్థులకు భోజనవసతిని మాత్రమేగాక బసను కూడ ఏర్పాటు చేసేవారు. గుజరాతీ వర్తకులు పేద బ్రాహ్మణ విద్యార్థు లకు ప్రతినెలా రూపాయో, అర్ధరూపాయో ఇచ్చి, వారిని పోషిస్తూ ఉండేవారు. మా శాఖకు చెందిన పునుగు వెంకట్రాయులు ఒక గుజరాతీ వర్తకునివద్ద ప్రథమంలో గుమాస్తాగా చేరి, తన శక్తి సామర్థ్యాలను ప్రదర్శించి, కొంత కాలనికి లాభంలో ఒక వంతుకు అర్హతను సంపాదించి ధనవంతులలో ఒకరుగా ప్రఖ్యాతి గాంచారు.

ఆయన తన ఇంటిలో 10, 12 విద్యార్థులు నివసించుటకు తగిన ఏర్పాటులు చేసి, వారు విద్యను నేర్చుకొనడంలో చాలా సహాయ పడినారు.

సమాజంలో ఇటీవలి కాలంలో ఎన్నో మార్పులు జరిగాయి. వర్ణవ్యవస్థపట్ల కొన్నివిషయాలలో ఆ మార్పులు ప్రశంస నీయములే. కులాల మధ్య తరతమ భేదాలు అదృశ్యం కావడం ప్రశంసనీయమే. కాని ప్రతికులము తన వ్యక్తిత్వాన్ని నిలబెట్టు కొని, దాని శ్రేయస్సుకు మాత్రమే పాటుబడుచున్నది. కులాల మధ్య సహకారం బదులు పోటీ పెరిగి పోయింది. కులానికే ప్రాధాన్యంగాని వ్యక్తులకు కాదు. కులతత్త్వం వేరే రూపంలో ప్రాబల్యం గాంచింది. ప్రజాస్వామ్యాన్ని అపార్థం చేసుకొనడం జరుగుతూ ఉంది. ఏ కులం అధిక సంఖ్యలో ఉన్నదో ప్రభుత్వం మూలంగా పొందవలసినలాభాలు ఆ కులానికే ఎక్కువగా లభిస్తున్నవి. సంఖ్యకు ఉన్న ప్రాధాన్యం వ్యక్తులకు లేదు. వ్యక్తుల అర్హతా నర్హతలను గుర్తించడం లేదు. వీటి అన్నిటి ఫలితంగా గత కాలంలో బ్రాహ్మణులకు ఉండిన ప్రత్యేక ఆధిక్యత అడుగంటి పోయింది. ఇది సమత్వ సిద్ధాంతానికి అనుగుణమైనది. కాని ఆధిక్యం అడుగంటి పోవడంతో పాటు బ్రాహ్మణద్వేషం ముదిరి పోయింది. బ్రాహ్మణు లన్న కారణంగా వారికి విద్యారంగంలోను, ఉద్యోగరంగంలోను, ఇతరరంగాలలోను అవకాశాలు సన్నగిల్లినవి. ఆకలిగొన్నవాడు ఏ కులానికి చెందినా అన్నం పెట్టడం, ఇల్లు లేనివాడు ఏ కులానికి చెందినా వాడికి గృహదానం చేయడం, విద్యా విహీనుడు ఏ కులానికి చెందినా వాడికి విద్యను నేర్పడం—ఇదీ మానవ సమత్వానికి, సాంఘిక న్యాయానికి లక్షణాలు. కాని ఈనాటి సమాజంలో దీనికి విరుద్ధంగా జరుగుతూన్నది.

నేను చదువుతున్న కాలంలో ఇంగ్లీషుకు అత్యంత ప్రాధాన్యం ఉండేది. అది పరిపాలకుల భాష కావడంచేతను, పరిపాలన మంతా ఆ భాషద్వారా జరుగుచుండటంచేతను దానికి ప్రాధాన్యం లభించింది. విద్యాలయాలలో క్రింది తరగతులనుండి పై తరగతుల వరకు ఇది బోధనాభాషగా ఉండేది. విద్యావిధానంలో ఇది మొదటి భాషగ గుర్తింపబడినది. సైన్స్, గణితము, చరిత్ర, భూగోళము

మొదలైన విషయము లన్నిటిని ఇంగ్లీషు భాషద్వారా విద్యార్థులు నిర్బంధంగా నేర్చుకొనవలసి ఉండేది. ఈలాటి పద్ధతి ప్రపంచంలో యూరోపియనులు (వారిలో ప్రధానంగా బ్రిటిషువారు, ఫ్రెంచి వారు) జయించి పరిపాలించిన వలస రాష్ట్రాలలో మాత్రమే వుండేది. స్వతంత్రంగల దేశాలలో దేశభాష మాత్రమే బోధనా భాష. జపాన్ దేశస్థులు పాశ్చాత్య విద్యలను నేర్చుకొనుటకు 19-వ శతాబ్దం ఆఖరు భాగంలో ప్రారంభించిన తర్వాత తమ మాతృభాషలోనే వాటిని నేర్చుకొన్నారు. తమ భాషను దానికి అనుగుణంగా వృద్ధిచేశారు. ఇదే విద్యను నేర్చుకొనుటకు సహజమైన పద్ధతి. మనదేశంలో కూడ పరాయి భాషను మాట్లాడే ఆఫ్గన్‌లు, మొగలాయిలు పరిపాలకులైనప్పుడు వైదిక విద్యలను సంప్రదాయానుసారం సంస్కృతం మూలంగా ప్రజలు నేర్చుకొనేవారు. కాని బ్రిటిషువారు పరిపాలకులైన తర్వాత ఇంగ్లీషుకే ప్రాధాన్యం లభించడంచేత విద్యావిధానమంతా మారి దేశీయ విద్యలన్నిటికీ ప్రమాదం సంభవించింది. అవి అడుగంటి పోయినవి. విద్య అంటే ఇంగ్లీషు విద్య మాత్రమే అనే సూత్రానికి యాజమాన్యం లభించింది. అందుచేత నా విద్యాభ్యాస మంతా ఆ భాష ద్వారానే జరిగింది.

దీని మూలంగా పఠనీయ విషయాలను అవగాహన చేసుకొనడం కష్టతరమైంది. క్రింది కులాలవారికి ఇది మరీ కష్టతరం. అందుచేతనే హైస్కూలు విద్యావిధానంలో మాతృభాషను బోధనభాషగా చేయడం జరిగింది. కొన్ని సంవత్సరాలనుండి కళాశాలలలోను, విశ్వవిద్యాలయాలలోను ఈ పద్ధతి ప్రవేశపెట్టబడింది. కాని కొన్ని విద్యాలయాలలో ఇంగ్లీషుకూడా బోధనా భాషగా ఉండుటకు ప్రభుత్వం అంగీకరించిన కారణంగా కొత్త విధానం పూర్తిగా అమలులోకి రాలేదు. ఈ ద్వంద్వవిధానం చాలా ప్రమాదకరం. దీనికి స్వస్తిచెప్పి దేశభాషలలో మాత్రమే విద్యాబోధ జరగవలసిందిగా ప్రభుత్వం తుదినిర్ణయం తీసుకొనడం చాలా అవసరం.

నేను ఇంగ్లీషు విద్యను అభ్యసిస్తున్న కాలంలో నాకు ఉపాధ్యాయులుగా ఉండిన వారిలో కొందరు నాకు చిరస్మరణీయు

లైనారు. రెండవ ఫారంలో లెక్కలను బోధించిన స్వామినాథయ్యరుగారు అలాటి వారిలో ఒకరు. దీనిని బోధించడంలో వారి శక్తి సామర్థ్యాలు ప్రశంసనీయములు. అదే కోవకు చెందినవారు రేఖాగణితాన్ని, యూక్లిడ్‌ను బోధించిన రాజగోపాలచారిగారు. వీరికి ఆడం తోక (Adam's Tail) అనే పేరు వ్యవహారంలో ఉండేది. ఆ రోజులలో ఆడం ఒక గణితశాస్త్ర ప్రవీణుడుగా మద్రాసులో ఉండేవాడు. రాజగోపాలాచారి అతనికి శిష్యుడై ఎప్పుడూ అతని వెంట తిరుగుతూ ఉండేవాడట. అందుచేతనే ఆయనకు ఈ పేరు వ్యవహారంలోకి వచ్చింది.

నాల్గవ ఫారంలో తాయి తిరుమలరావు నాయుడుగారు మాకు భూగోళశాస్త్రాన్ని బోధించేవారు. ఈ బోధనలో ఆయన ప్రథమంగా మ్యాపుల వాడకాన్ని ప్రవేశపెట్టారు. మ్యాపుల సహాయం లేక భూగోళాన్ని బోధించడం హాస్యాస్పదం. కాని విద్యాలయాధికారులు మ్యాపులు కొనుటకు సిద్ధంగా లేరు. నాయుడుగారు వారిని ఏలాగో ఒప్పించి, మ్యాపులను కొనిపించి వాటి సహాయంతో మాకు భూగోళశాస్త్రాన్ని చక్కగా బోధించగలిగారు. వీరు తర్వాత ప్రభుత్వోద్యోగంలో చేరి, జిల్లా విద్యాధికారిగా పని చేశారు. వీరి నివాసస్థానం బందరు అని నా జ్ఞాపకం.

అయిదవ ఫారంలో దేవరాజ మొదలియార్ మాకు చరిత్రను బోధించేవారు. వారి బోధనాపద్ధతి వింతగా ఉండేది. ముందు రోజు పాఠ్యగ్రంథంలో ఏ అధ్యాయం చదువవలెనో మాకు తెలియచేసేవారు. మేము దానిని చదివి వచ్చేవారం. వారు పాఠ్యగ్రంథాన్ని ఒక్కొక్క వాక్యంలో ఒకభాగం చదివి, తక్కిన భాగాన్ని పూరించవలసిందిగా విద్యార్థులను అడిగేవారు. శివాజి ఏ సంవత్సరంలో జన్మించినాడు అని ఆయన ప్రశ్న వేస్తే, ఆ సంవత్సరాన్ని చెప్పడం విద్యార్థుల వంతు. వారు స్వయంగా కథారూపంలో చరిత్రను బోధించుట కంటె ఇదే ఉత్తమ విధానమని భావించినవారు.

ఆరవ ఫారంలో మాకు నెల్లూరు వాస్తవ్యులు కే. ఏ. వీరరాఘవాచార్లు భూగోళాన్ని, చరిత్రను బోధించేవారు. సరి క్రొత్త గ్రంథాలను చదివి, వాటిలోని విషయాలను బోధించడం

వారిలోని ప్రత్యేకత. నెల్లూరు విద్యార్థులపట్ల వారికి ప్రత్యేకమైన అభిమానం. ఆ రోజులలో సర్కారు విద్యార్థుల సంఘం ఒకటి, రాయలసీమ విద్యార్థుల సంఘం ఇంకొకటి ఉండేవి. నెల్లూరు ఈ మండలాలలో దేనికీ చెందినది కాకపోవడం చేత నెల్లూరు విద్యార్థులకు సంఘం ఏదీ ఉండేదికాదు. ఆచార్యులుగారు ఈ లోపాన్ని తీర్చి నెల్లూరు విద్యార్థుల సంఘం ఒక దానిని స్థాపించారు. అది అప్పుడప్పుడు సమావేశమై చర్చలు జరుపుతూ ఉండేది. నేను వారి అభిమానానికి ప్రత్యేకంగా పాత్రుడనైనాను. నేను బి. ఏ., లో మొదటిశ్రేణిలో కృతార్థుడనైన సందర్భములో వారు నెల్లూరు విద్యార్థులను, నెల్లూరికి చెందిన మరికొందరిని సమావేశపరచి నన్ను అభినందించుటకు, బహూకరించుటకు ఏర్పాటులు గావించారు. వీరుగాక మాకు లెక్కలను బోధించిన వేలాల వెంకట సుబ్బయ్యగారు బోధన విషయంలో అసమానమైన శక్తి సామర్థ్యాలు కలవారు. తర్వాత వారు హైస్కూలుకు హెడ్‌మాస్టరుగా గొప్ప పేరు ప్రఖ్యాతులను సంపాదించినారు. అప్పుడే ప్రారంభమైన స్కౌటు ఉద్యమంలో వారి పాత్ర ఘనమైనట్టిది. వారు మామూలుగా ధోవతి కట్టుకొని, లాంగ్‌కోటు, తలపాగా ధరించి స్కూలుకు వచ్చేవారు. స్కౌటు ఉద్యమంలో నాయకుడైనప్పుడు ధోవతికి బదులు పంట్లాము, ఉద్యమానికి సంబంధించిన ఇతర దుస్తులు ధరించవలసి వచ్చింది. వారు కొంత లావు మనిషి. పంట్లాం వేసుకొని వారు నడుస్తూ ఉంటే అది మాకు వింతగా కనుపించేది.

ఆ రోజులలో తెనుగు బోధించే ఉపాధ్యాయులను విద్యార్థులు లక్ష్యపెట్టేవారు కారు. వారిని అల్లరిపెట్టడంకూడ జరిగేది. కాని మాకు తెనుగు ఉపాధ్యాయులుగా ఉండిన చిలకమర్రి వెంకట రామానుజాచార్యుల విషయంలో విద్యార్థులందరు అతి గౌరవాన్ని, వినయాన్ని ప్రదర్శించేవారు. వారి పాండిత్యము, వారి బోధనాశక్తి దీనికి ప్రధాన కారణాలు. ఆరవ ఫారంలో వారు మాకు ధ్రువోపాఖ్యానం ( అది మా పాఠ్యగ్రంథము ) పాఠము చెప్పారు. వారి బోధన ఇప్పటికీ నా జ్ఞాపకాలలో స్థిరంగా ఉన్నది. శృంగార

రసయుక్తమైన కొన్ని గద్య గ్రంథాలను రచించి గ్రంథకర్తగా వారు ప్రఖ్యాతి గాంచినారు.

నేను మెట్రిక్యులేషన్ పరీక్షలో 1903 లో కృతార్థుడనై రెండు సంవత్సరాలు ఎఫ్. ఏ. ( F A ), తర్వాత రెండు సంవత్సరాలు బి. ఏ., చదివినాను. అప్పట్లో నాకు ఉపాధ్యాయులుగా ఉండినవారిలో ముగ్గురు నాకు చిరస్మరణీయులు. వారిలో చరిత్రను బోధించిన కె. రామానుజాచార్యులు అగ్రగణ్యులు. వారు క్లాసుకు వచ్చి ఒక గంట కాలం గంభీరంగాను, స్పష్టంగాను ధారావాహినితో ఉపన్యాస శైలిలో పాఠం చెప్పేవారు. వారు ప్రదర్శించిన స్పష్టత మరే ఉపాధ్యాయులలో కనుపించేది కాదు. వారి ఉపన్యాసాన్ని విన్న తర్వాత పాఠ్యగ్రంథాన్ని చదవడం అనవసరంగా తోచేది. నేను ఉపాధ్యాయుడనుగా వారి పద్ధతినే అనుకరించాను. అధ్యాపకుడనుగా నేను సంపాదించిన ప్రఖ్యాతికి వారే కారణభూతులు. నేను వారికి ఎంతో ఋణపడి యున్నాను.

మాకు ఇంగ్లీషును బోధించిన కె. బి. రామనాధయ్యరుగారి పాండిత్యం అసమానమైనట్టిది. ఇంగ్లీషువారికి కూడా అంతటి పాండిత్యం ఉండి ఉండదు. వారు 10, 15 పుస్తకాలతో క్లాసుకు వచ్చేవారు. అవసరమైనప్పుడు పాఠం చెప్పడంలో వాటినుండి కొన్ని వాక్యాలను చదివేవారు. కాని వారి బోధనా పద్ధతి రామానుజాచార్ల పద్ధతి మోస్తరుగా హృదయంగమంగా ఉండేదికాదు. వారి పాండిత్యానికి తగినట్లుగా వారి బోధన ఉండేదికాదు. ఈ లోపం అనేకులలో కనుపిస్తుంది. అయినా వారు విద్యార్థులందరికి గౌరవపాత్రులైనారు.

ఎఫ్. ఏ. లో మాకు గణితాన్ని బోధించిన యన్. రామానుజాచార్యులు కూడ గొప్ప బోధనాశక్తి గలవారు. గణిత శాస్త్రంలో మొదటినుండి నేను కొంత వెనుకబడి ఉండేవాడిని. కాని వారి బోధన ఫలితంగా ట్రిగ్నామెట్రీ, బీజగణితం ( Algebra) నేను చక్కగా నేర్చుకొన గలిగాను. వారు తత్త్వశాస్త్రంలో కూడ గొప్ప పాండిత్యాన్ని సంపాదించినవారు. వారు కొంత కాలానికి గణితశాస్త్రాన్ని వదలి, తత్త్వశాస్త్రశాఖలో ప్రధానాచార్యులైనారు.

నేను బి. ఏ. క్లాసు రెండవ సంవత్సరంలో ఉండగా కన్నింగ్‌హాం అనేవారు ఇంగ్లాండు నుంచి వచ్చి మాకు షేక్స్పియర్ నాటకాలను పాఠంగా చెప్పారు. వారి బోధనాశక్తి అఖండమైనట్టిది. తర్వాత వారు ప్రభుత్వోద్యోగిగా పని చేసి, అస్సాం రాష్ట్రానికి విద్యాశాఖా డైరెక్టరుగా ప్రఖ్యాతిని సంపాదించినారు.

డాక్టర్ ధన్వాడ రామచంద్రరావుగారు బి. ఏ. లో మాకు అర్థశాస్త్రాన్ని, రాజనీతిని బోధించారు. వీరు ఎడిన్‌బరోలో అర్థశాస్త్రంలో ఎం. ఏ. డిగ్రీని సంపాదించడమేగాక వైద్యశాస్త్రంలో కూడ పట్టభద్రులైనవారు. కాని వైద్యవృత్తిని అనుసరించక కళాశాల ఉపాధ్యాయులుగా వీరు జీవితాన్ని సాగించారు. వీరి బోధనాశక్తి చాలా తక్కువ. తర్వాతికాలంలో వారు స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొని జైలు శిక్షను అనుభవించారు. ధన్వాడవారు బ్రాహ్మణులు. కాని వీరి తండ్రి అనంతంగారు క్రైస్తవమతంలో చేరారు. రామచంద్రరావుగారు కూడ క్రైస్తవులే. ఉపాధ్యాయుడుగా వీరిలో ఒక ప్రత్యేకత ఉండేది. సాధారణంగా ఆ రోజులలో ఉపాధ్యాయు లెవ్వరు విద్యార్థులతో ఏలాంటి సన్నిహిత సంబంధాలు పెట్టుకొనేవారు కారు. పాఠాలు చెప్పడంతో వారి బాధ్యత ముగిసేది. రామచంద్రరావుగారు ఆలాగు కాక బ్రిటన్‌లోని సంప్రదాయప్రకారం విద్యార్థులను తమ ఇంటికి ఆహ్వానించి, టీ పార్టీలు ఏర్పాటు చేసి, వారి కష్టసుఖాలను కనుగొనేవారు. విద్యార్థుల గౌరవానికి వారు పాత్రులగుటకు ఇదియే ప్రధాన కారణం.

నేను విద్యార్థిగా ఉన్న రోజులలో విద్యార్థులకు ఉపాధ్యాయుల పట్ల అత్యంత గౌరవం ఉండేది. వారికి ఎదురుచెప్పడం గాని, వారి ఆదేశాలకు అన్యథాగా ప్రవర్తించడం గాని గొప్ప నేరమని వారు భావించేవారు. ఇది అనాదిగా మనదేశంలో ఏర్పడిన సంప్రదాయం. ఆ రోజులలో సినిమాలు లేవు. నాటక ప్రదర్శనలు, పాటకచ్చేరిలు మొదలైనవి జరిగినా విద్యార్థులు వాటికి వెళ్లేవారు కారు. 1905 తర్వాతగాని, వారి దృష్టిని ఆకర్షించే రాజకీయాలు ఏవీ లేవు. బాలురతో కలసి ఒకే విద్యాలయంలో బాలికలు చదివేవారు కారు. విద్యలో వెనుకబడినవారే

ఎక్కువగా క్రీడలలో పాల్గొనడం జరిగేది. ఈలాంటి పరిస్థితుల కారణంగా విద్యార్థుల ఆందోళనలు. సమ్మెలు, దౌర్జన్యాలు ఏవీ ఉండేవి కావు. విద్యార్థి జీవితం నెమ్మదిగా సాగిపొయ్యేది.

ఈనాటి వారికి ఇది రుచించక పోవచ్చును. ఇది సంకుచిత విధానమనిన్నీ, మా కాలపు విద్యార్థులు లోకజ్ఞానం లేనివారనిన్నీ ఇప్పటివారు అనుకోవచ్చును. నేను వ్రాసినది 1910 నాటి విధానం. ఈ మధ్యకాలంలో విద్యావిధానాన్ని ప్రభుత్వంవారు ఎన్ని పర్యాయాలో మార్చారు. వీటితో తృప్తిపడక ఇంకా కొన్ని మార్పులు చేయ తలపెట్టున్నారు. కాని ఈ మార్పులు ఎంతవరకు ఉపయోగకరమైనవో చెప్పలేము. ఒకటిమాత్రం సత్యం. విద్యార్థులకు ఇవి ఎంతమాత్రము తృప్తిని కలిగించలేదు. వారు రోజు రోజు ఎక్కువ ఆశాభంగాన్ని పొందుతున్నారు. ఇది విద్యావిధానంలోని లోపంవల్లనా, లేక దేశంలో ఏర్పడిన ఇతర పరిస్థితుల వల్లనా అనే ప్రశ్నకు ఈసందర్భంలో సమాధానం చెప్పడం అవసరం. కాని నేను ఆ ప్రయత్నానికి పూనడం సందర్భోచితం కాదు. దానిని పాఠకులకే వదలివేయుచున్నాను.

# 5. నా ఉద్యోగం - ప్రథమదశ

నా రోజులలో ప్రభుత్వ ఉద్యోగం చేసే ఉద్దేశంతోనే అందరు ఇంగ్లీషు విద్యను నేర్చుకొనేవారు. బి. ఏ. పాసుకాగానే కలెక్టరు కచ్చేరిలో గుమాస్తాగా ప్రవేశించి క్రమక్రమంగా రెవిన్యూ ఇన్‌స్పెక్టరు, సబ్‌మాజిస్ట్రేటు ఉద్యోగాలు చేసి, అదృష్టవంతులు తహసీల్‌దారుగాను, మరీ అదృష్టవంతులు డిప్యూటీ కలెక్టరుగాను పనిచేసి, పెన్షన్ పుచ్చుకొనడం మామూలు. ఉద్యోగాలు అధికారంతోను, పేరుప్రతిష్ఠలతోను కూడుకున్నవి. జీతాలతో పాటు పై సంపాద్యానికి వీటిలో గొప్ప అవకాశం ఉండేది. సామాన్యంగా బంధువులుగాని, ఇతర సన్నిహితులుగాని ఉద్యోగం చేసే వారిని కలుసుకొన్నప్పుడు "మీ జీతం ఎంత" అని అడగడంతోపాటు "పై సంపాద్యం ఏమాత్రం" అని అడగడం మామూలు. జీతానికంటె పై సంపాద్యమే ఎక్కువగా ఉండేది. పై సంపాద్యం ఖాతిరుచేయక జీతంతోనే తృప్తిపడి, నీతి నిజాయతీలతో ప్రవర్తించే ఉద్యోగులు లేకపోలేదు. కాని అలాటివారి సఖ్య చాలా తక్కువ. వారిని చేతకానివారని ప్రజలు భావించేవారు

నాకు ఇంగ్లీషు విద్యను అనేక కష్టాలను భరించి మా నాయనగారు చెప్పించడంలో ఇదే ఉద్దేశం. నేను బి. ఏ. పాసయ్యే నాటికి, నా మామగారు నెల్లూరు హుజూరు శిరస్తాదారుగా ఉండేవారు. నేను అర్జీ పెట్టుకొనవలసిన అవసరం లేకుండానే, కలెక్టరుతో మాట్లాడి గుమాస్తా ఉద్యోగంలో నన్ను నియమిస్తూ, ఒక

ఆర్డరును పంపినారు. కాని కొన్ని పరిస్థితుల ప్రభావంచేత నేను ఆ ఆర్డరు మేరకు ఉద్యోగంలో చేరలేదు. ఈ నా ప్రవర్తన మా నాయనగారికి చాలా ఆశాభంగాన్ని కలిగించింది. నా పైన ప్రభావం వహించిన పరిస్థితు లెలాంటివో చెప్పడం ఉచితమని భావిస్తున్నాను.

1907 కు పూర్వం మద్రాసు విద్యార్థులలో ఏలాంటి రాజకీయ చలనం ఉండేది కాదు. ఆ సంవత్సరం ఏప్రిల్ లో దేశంలో తిలక్, లజపతిరాయ్ వంటి అతివాదులతో కలిసిన బెంగాలీ నాయకుడు బిపిన్ చంద్రపాల్ 'వందే మాతరం' ఉద్యమాన్ని, ప్రచారం చేయడానికి ఆంధ్ర దేశానికి వచ్చి విశాఖపట్టణం, కాకినాడ, రాజమండ్రీ, విజయవాడ, బందరు మొదలైన పట్టణాలలో గొప్ప ఉపన్యాసా లిచ్చి ఆఖరున మద్రాసుకు అదే ఉద్దేశంతో వచ్చినాడు. అప్పటికి వార్తాపత్రికల మూలంగా ఆయన ప్రతిభ మద్రాసుకు వ్యాపించింది. విద్యార్థులు కూడా దానిచే ప్రభావితులైనారు.

దాని ఫలితంగా గాఢనిద్రలో ఉన్న విద్యార్థులు ఆయనకు రైలుస్టేషన్ లో సాయంకాలం ఘనమైన స్వాగతాన్ని ఇవ్వడానికి నిర్ణయించుకొన్నారు. నేను అప్పుడు పచ్చయప్పా కళాశాలలో బి. ఏ., సీనియర్ క్లాసులో ఉండినాను. నేను కూడ తోటి విద్యార్థులతో కలసి స్టేషన్ కు వెళ్లుటకు సిద్ధపడ్డాను. విద్యార్థు లందరం మూడు గంటలకే క్లాసులను వదలి బయటకు వచ్చినాము. గేట్ల వద్ద మా అధ్యాపకులు నిలబడి మేము వెళ్ళరాదని సలహా ఇచ్చినారు. నాకు అత్యంత గౌరవపాత్రులైన కె. రామానుజా చార్యులుగారు ' నీవు కూడా వెళ్ళుతున్నావా " అని కొంత ఆశ్చర్యంతో నన్ను ప్రశ్నించారు. నేను వారిపట్ల నమ్రతతో ప్రవర్తిస్తూ ఉండేవాడిని. ఆ రోజున నా ఉత్సాహం కొద్దీ "అవునండి, నేను కూడా వెళ్ళుతున్నాను. క్షమించండి" అని జవాబు చెప్పి వీధిలో ప్రవేశించాను.

వేలసంఖ్యలో విద్యార్థులు "వందే మాతరం" అని కేకలు వేస్తూ $4\frac{1}{2}$ గంటలకు బేసిన్ బ్రిడ్జి జంక్షన్ చేరారు. పాల్ గారు రైలునుండి దిగగానే వారిని పుష్పమాలాలంకృతుల గావించి, ఊరేగింపుగా వారిని వెంబడించి ట్రిప్లికేన్ లో వారికి ఏర్పాటు

చేయబడిన బసలో వారిని వదలిపెట్టి, వెనుకకు మరలి వారి వారి ఇండ్లకు వెళ్లిపోయినారు. నేను కూడ అలాగే చేసినాను. వారి రాకతో అందరి విద్యార్థులలో రాజకీయ సంచలనం కలిగింది.

అప్పటికే తిలక్ లేవదీసిన "స్వరాజ్యం నా జన్మహక్కు" అనే నినాదం దేశమంతటా వ్యాపించింది. దానిని సంపాదించడానికి రక్తపాతంతో కూడిన తిరుగుబాటు అవసరంలేదని, సాత్వికనిరోధం (Passive Resistance) దానికి పటిష్ఠమైన ఆయుధమని, బ్రిటిష్ వస్తువుల బహిష్కరణ, స్వదేశీ, జాతీయవిద్య, పంచాయతీ కోర్టుల సంస్థాపనము మొదలైనవి అందులో ప్రధానాలైన అంశాలని, ప్రజలు వీటికి అనుగుణంగా ప్రవర్తించిన పక్షంలో దేశాన్ని పరిపాలించడం బ్రిటిషువారికి సాధ్యంకాక వారు వెళ్లిపోగలరని రాజకీయ నాయకులందరు ప్రచారం చేశారు. అదే ఉద్దేశంతో పాల్ మద్రాసుకు వచ్చాడు.

అయిదారు రోజులు నగరంలో ఉండి స్వరాజ్యం, బహిష్కరణ, జాతీయవిద్య మొదలైన విషయాలను గురించి సమావేశాలలో ప్రసంగించుటకు నిర్ణయించుకున్నాడు. ఆనాడు మద్రాసులోని రాజకీయ నాయకులందరు బ్రిటిషువారిపట్ల ప్రభుభక్తిని ప్రదర్శించే మితవాదులు. అలాటి వాతావరణంలో పాల్ ప్రసంగించుటకు తగిన హాలు దొరకలేదు. వారి సమావేశాలకు అధ్యక్షత వహించుటకు కూడ నాయకులుగా ప్రసిద్ధి గాంచినవారెవరు అంగీకరించలేదు. అలాటి క్లిష్టసమయంలో పాల్ తన సమావేశాలకు ఏలాటి హాలు అక్కరలేదని, తాను సముద్రతీరం బీచిలో ఉపన్యసించడానికి సిద్ధంగా ఉన్నట్లు తెలియపరచాడు. బీచిలో సమావేశాలు అప్పటినుంచే ప్రారంభమైనవి.

పాల్ సింహగర్జనతో సమానంగా గొంతెత్తి ప్రసంగించగలవాడు. సముద్రతరంగాల శబ్దం కూడా అతని గొంతుకతో సమానంకాదని ఋజువు చేశాడు. మైకులులేని రోజులలో ఇది ఎవరికీ సాధ్యం కాని పని. అయిదు రోజులు వరుసగా సాయంకాలం ఆయన సముద్రతీరంలో ఉపన్యసించారు. వాటిని వినుటకు విద్యార్థులు, తదితరులు హాజరయ్యారు. విద్యాధికులెవ్వరు

ప్రభుత్వోద్యోగాలలో చేరరాదనేదే విద్యార్థుల నుద్దేశించి ఆయన చేసిన ప్రసంగాలలో ప్రధాన విషయం. పరాయి ప్రభుత్వంక్రింద ఉద్యోగం చేయడం దేశానికి ద్రోహం చేయడమే. ఆత్మ గౌరవంగల భారతీయు డెవ్వడూ దానికి సిద్ధపడకూడదు అని ఆయన పదేపదే నొక్కి చెప్పాడు.

ఈ మాటలు నాపైన అత్యంత ప్రభావం వహించినవి. ప్రభుత్వ ఉద్యోగము స్వీకరించరాదని నేను వెంటనే నిర్ణయించు కున్నాను. కలెక్టరు కచ్చేరి ఉద్యోగాన్ని నిరాకరించాను. కళాశాలలో అధ్యాపకుడుగా కృషిచేసిన పక్షములో యువకులకు దేశాభిమానముతో కూడిన విద్యను బోధించి, వారిని చక్కగా తీర్చి దిద్దగల అవకాశము లభించగలదని నిర్ణయించుకున్నాను. దానికి కావలసిన అర్హతను సంపాదించుటకు బి. ఏ. తర్వాత ఎం. ఏ. చదువు సాగించి అందులో కృతార్థుడ నయినాను.

ఈమధ్యకాలంలో ప్రప్రథమంగా నేను అధ్యాపకుడను కావటం కూడా జరిగింది. బి. ఏ. పూర్తిచేసిన తర్వాత ఎం. ఏ. చదువును మద్రాసులోనే సాగించడం ఉచితంగా తోచింది. (ఆనాడు ఎం. ఏ. కు కళాశాలలో చదువవలసిన అవసరము లేక ప్రయివేటుగా చదివి పరీక్షకు వెళ్ళే ఏర్పాటు ఉండేది.) కాని రెండు సంవత్సరాల కాలం మద్రాసులో కాపురాన్ని నిర్వహించడం కష్టసాధ్యమని తోచింది. ఏదైనా ఒక చిన్న ఉద్యోగాన్నైనా సంపాదించడం అవసరమైంది. అప్పట్లో ప్రఖ్యాతి గాంచిన పిట్టి త్యాగరాయ శెట్టిగారు పచ్చయప్పా కళాశాల కార్యనిర్వాహక వర్గంలో సభ్యులు. (నా చిన్నతనంలో వెంబాకం కృష్ణమాచార్యులు సభ్యులైనట్లే.) వీరి సోదరుని కుమారుడు బి. ఏ. లో నా సహాధ్యాయి. నాకు చాల సన్నిహితుడు అతని ద్వారా నేను శెట్టిగారిని కలుసుకొని నాకు కళాశాలలో ఏదైనా ఉద్యోగం ఇప్పించవలసిందిగా కోరాను. వారు వెంటనే నన్ను బి. ఏ. క్లాసుకు ట్యూటర్ గా నియమించుటకూ, మొదటి సంవత్సరం రు. 20 లు జీతం ఇచ్చుటకూ, రెండవ సంవత్సరం రు. 40 లు ఇచ్చుటకూ అంగీకరించినారు. జీతం చాలా స్వల్పమైనా అధ్యాపకుడుగా నాకు ఉద్యోగం లభించినందుకు చాలా సంతోషించాను.

బి. ఏ. క్లాసు విద్యార్థులు ఆ రోజులలో ఇంగ్లీషునుండి తెనుగులోనికి, తెనుగునుండి ఇంగ్లీషులోనికి తర్జుమా చేయడం నేర్చుకోవలసిన అవసరముండేది. పరీక్షలో దీనికి సంబంధించిన ప్రశ్నపత్రం ఒకటి. ట్యూటరుగానేను చేయవలసిన పనులలో వీరికి ఇందులో శిక్షణాగరపడం ఒకటి. ఇదిగాక వారు ఇంగ్లీషులో వ్రాసిన వ్యాసాలను దిద్దడం ఇంకొకటి. ఈ రెండు పనులను నిర్వహిస్తూ రెండు సంవత్సరాల కాలంలో ట్యూటర్ ఉద్యోగంలో ఉండినాను.

1910 జనవరిలో నేను ఎం. ఏ. పరీక్ష వ్రాసినాను. ఫలితాలు తెలియకముందే కాకినాడలోని పిఠాపురం మహారాజ కళాశాలకు ప్రిన్సిపాల్‌గా ఉండిన ప్రఖ్యాత విద్యావేత్త రఘుపతి వెంకటరత్నం నాయుడుగారు వారి కళాశాలలో మంచి అర్హత గలవారిని చరిత్రశాఖలో అధ్యాపకులుగా నియమించే ప్రయత్నంలో ఏదో పనిమీద మద్రాసుకు వచ్చారు. బి. ఏ. లో నాకు అధ్యాపకులుగా ఉండిన కె. బి. రామనాథయ్యరుగారు వారికి సన్నిహితులు. వారితో సంప్రదించగా నాకు కాకినాడ కళాశాలలో అధ్యాపకుడుగా ఉండుటకు నేను అర్హతగలవాడనని వారితో చెప్పినారు. అంతటితో నాయుడుగారు నన్ను తమ కళాశాలలో చరిత్రశాఖ అధ్యాపకుడుగా నియమించ దలచినట్లును, ఎం. ఏ. పరీక్ష ఫలితాలు తెలిసే వరకు నెలకు రు. 100 లు ఇచ్చేటట్లును, పరీక్షలో నేను కృతార్థుడనుకాగానే రు. 120 - 150 గ్రేడు నాకు ఇచ్చేటట్లును, వెంటనే నా అంగీకారాన్ని తెలుపవలసినట్లున్ను స్వహస్తంతో, అందమైన దస్తూరితో నాకు ఉత్తరం వ్రాశారు. నేను వెంటనే వారికి నా అంగీకారాన్ని తెలియపరచాను. వారు నన్ను అధ్యాపకునిగా నియమిస్తూ ఆర్డరు పంపారు. 1910 జనవరి ఆఖరులో నేను వారి కళాశాలలో అధ్యాపకునిగా చేరాను.

పచ్చయప్పా కళాశాలలో నేను రెండు సంవత్సరాలు ట్యూటర్‌గా ఉన్నట్లు ఇదివరలోనే చెప్పినాను. ఈ ఉద్యోగంలో అధ్యాపకుడుగా ఒక విషయాన్ని బోధించే అవకాశం లేదనే

చెప్పవచ్చును. అందుచేత నా అధ్యాపకత్వం కాకినాడ కళాశాల లోనే ప్రారంభమైంది.

విద్యార్థిగా నేను విద్యార్థి సంఘాల సమావేశాలలో ఎక్కువగా పాల్గొనినవాడను కాను. నాకు కొంత సభాకంపం కూడా ఉండేది. విద్యార్థులకు నేను ఉపన్యాస ధోరణిలో విషయాన్ని బోధించగలనా అనే సందేహం నాకు కలగడంలో ఆశ్చర్యపడవలసింది లేదు. కాని కాకినాడ కళాశాలలో నా మొదటి నాటి అనుభవం ఈ సందేహాన్ని పూర్తిగా తొలగించింది.

ఆనాడు ఇంటర్మీడియేటు విద్యార్థులకు గ్రీసుదేశ చరిత్రను బోధించవలసి ఉండేది. ప్రఖ్యాత చరిత్ర రచయిత బూరీ వ్రాసిన గ్రీసుదేశ చరిత్ర ( సుమారు వేయి పేజీల గ్రంథము ) వారికి పాఠ్య గ్రంథం. బోధించవలసిన పాఠానికి సంబంధించిన అందులోని అధ్యాయాన్ని ఇంటిలో పూర్తిగా చదివి, అర్థం చేసుకొని ప్రధానాంశాలను ఒక చిన్న కాకితంపైన వ్రాసుకొని క్లాసుకు వెళ్లి, ఏలాటి జంకు లేకుండా, ఒక గంటసేపు అనర్గళంగా ఉపన్యసించి పాఠాన్ని బోధించాను. విద్యార్థులు దానిని కడు శ్రద్ధతో విన్నారు. వారి ముఖవైఖరిని బట్టి వారు పూర్తిగా తృప్తి పడినట్లు నేను గ్రహించాను. నేను చక్కగా బోధించగలవాడ ననే విశ్వాసం వారికి కలిగింది నాకు కూడ పూర్తిగా ఆత్మవిశ్వాసం కలిగింది. ఈ ఒక్క పాఠంతో నా సందేహం తొలిగిపోయింది. విద్యార్థులకు, నాకు మధ్య పరస్పర విశ్వాసం ఏర్పడడంచేత, అధ్యాపకుడుగా ఆ రోజు మొదలు ఏలాటి ఆటంకం లేకుండా నా జీవితం సాగిపోయింది.

అధ్యాపకత్వానికి ఉండవలసిన శక్తి సామర్థ్యాలు ప్రకృతి సిద్ధములైనవి. ట్రెయినింగు కళాశాలలో శిక్షణ ద్వారా లభించేవి కావు. ప్రకృతి సిద్ధములైన శక్తి సామర్థ్యాలను శిక్షణ క్రమబద్ధం చేసి బలపరచగలదే గాని, వాటిని సృష్టించలేదు. అధ్యాపకత్వం కూడ సంగీతం, చిత్రలేఖనం వంటి కళ. గాయకునికి అవసరమైన మధురగాత్రం జన్మతః లభించగలదే గాని శిక్షణ ద్వారా లభించదుగదా!

సంవత్సరాంతం జరిగిన విశ్వవిద్యాలయ పరీక్షలో చరిత్ర శాఖకు చెందిన విద్యార్థు లందరు కృతార్థులైనారు. ఏడెనిమిది మంది మొదటి శ్రేణిలో కృతార్థులైనారు. దీనిమూలంగా విద్యార్థులకు నా యందలి విశ్వాసము, గౌరవము ఇనుమడించినవి. అధ్యాపకుడుగా నేను జీవితాన్ని గడిపిన కాలంలో ఇతర విధములైన ఒడుదుడుకు లనేకములను నేను ఎదుర్కొన్నాను. విద్యార్థుల అభిమానం నాకు ఏలాటి లోపం లేకుండ లభించడంచేత, నేను వాటికి లొంగిపోక జీవితాన్ని గడపగలిగాను. విద్యార్థుల గౌరవాభిమానాలే అధ్యాపకునికి అలంకారాలు.

వెంకటరత్నంనాయుడుగారు అధ్యాపకులలో ఉత్తమ శ్రేణికి చెందినవారు. క్లాసులో విద్యార్థులకు విద్యను బోధించడమే గాక, వారిని నీతిమంతులుగాను, యోగ్యులుగాను తీర్చి దిద్దడం అధ్యాపకుని కర్తవ్యమని భావించినవారు. ఇది వారిలో భావంగా మాత్రమే ఉండినట్టిది కాదు. క్రియారూపం ధరించినట్టిది కూడా. నాయుడుగారు బ్రహ్మసమాజ సిద్ధాంతములలో పూర్తి విశ్వాసం కలవారు. వాటిని చాలాకాలాననుండీ ప్రచారం చేస్తూ వచ్చారు. వాటిని ప్రత్యేకంగా విద్యార్థులకు బోధించి, వాటిద్వారా వారిని చక్కబరచుటకు నిర్విరామంగా కృషి చేశారు. వారిలో అనేకులు ఈ మతంలో చేరారు. అధ్యాపకులలో కొందరు, తదితరులు కూడా ఈలాగే చేశారు. వీరు ఆదివారాలలో ఉదయం సమావేశమైనవారు భగవద్భక్తిగీతాలను కలిసి గానం చేసిన తర్వాత, నాయుడుగారు సుమారు ఒక గంటకాలం ఉపన్యాసం చేయడం మామూలు. ఇవి బహు ఉత్తేజకరంగా ఉండేవి. వారి జీవితం కూడా లోపరహితంగా ఉండేది. ఇందు చేతనే వారి అభిమానులు వారిని మహర్షి వెంకటరత్నం నాయుడని పేర్కొనేవారు. ఇది వారికి సార్థకమైన నామధేయం. ఆనాటి పిఠాపురం మహారాజులు వెంకట సూర్యారావు బహదూరుగారు వారి శిష్యవర్గంలో ఒకరు. వారు నాయుడుగారి కోరికను అనుసరించి ఒక బ్రహ్మమందిరాన్ని, ఒక శిశు శరణాలయాన్ని కాకినాడలో కట్టించారు.

నేను బ్రహ్మసమాజంలో చేరినవాడను కాకపోయినా, నాయుడుగారికి నాపట్ల అత్యంత గౌరవం ఉండేది. నేను కాకినాడ కళాశాలలో ఉద్యోగం స్వీకరించిన నాటికి నా వయస్సు 22 సంవత్సరాలు మాత్రమే. అంత చిన్నవయస్సులో వారికి గౌరవపాత్రుడై నందుకు నేను చాలా గర్వపడుతున్నాను. సాధారణంగా అధ్యాపకు లెవరైనా వారిని చూచుటకు వారి ఇంటికి వెళ్ళినప్పుడు అరగంట, గంట వేచియుండిన తర్వాతనే వారికి వారి దర్శనం లభించేది. నేను వెళ్ళినప్పుడు నాకు వెంటనే దర్శన మిచ్చి, నేను చెప్పగోరిన మాటలను విని నన్ను పంపించి వేసేవారు. కాకినాడలో నేను ఉన్నప్పుడు రెండు వారాలపాటు వ్యాధిగ్రస్తుడనై నాను. వారు ఎవరినీ ఇంటికి వచ్చి చూచేవారు కారు. కాని వారు మా ఇంటికి వచ్చి నా యోగక్షేమములను స్వయంగా కనుగొనినారు. నేను వారి కళాశాలలో ఉద్యోగానికి రాజీనామా చేసి విజయనగరానికి వెళ్లుటకు ప్రయాణమైన నాడు వారు రైల్వేస్టేషన్‌కు వచ్చి నాకు వీడ్కోలు గావించారు ఇవి అన్నీ స్వల్పవిషయాలుగా కనుపించవచ్చును. కాని వారికి నాపట్ల ఉన్న గౌరవానికి ఇవి తార్కాణములు కావడంచేత అవి నా జ్ఞాపకాలలో స్థిరపడిపోయినవి.

1925 సంవత్సరములో నేను విజయనగరం మహారాజా వారి కళాశాల ఉద్యోగానికి ఒక సంవత్సరము సెలవు పెట్టి, పరిశోధనార్థం కుటుంబ సహితంగా మద్రాసుకు వెళ్లినాను. సెలవు కాలంలో విజయనగరం మహారాజా వారు నాకు 250 రూపాయలు నెలజీతం ఏర్పాటు చేశారు. దానితో మద్రాసులో జీవించడం కష్టసాధ్యం. ఆ రోజులలో పరిశోధన చేసేవారికి మద్రాసు విశ్వ విద్యాలయంవారు నెలకు 150 రూపాయలు ఉపకారవేతనంగా ఇచ్చేవారు. అప్పట్లో నాయుడుగారు ఆ విశ్వవిద్యాలయానికి ఉపాధ్యక్షులు. బ్రాహ్మణుల ఆధిక్యాన్ని తొలగించుటకు నిర్మాణ మైన బ్రాహ్మణేతర పక్షంలో (జస్టిసు పార్టీలో) వారు సభ్యులు. నా ఉపకారవేతన విషయమై నాకు సహాయపడవలసిందిగా వారి బసకు వెళ్లి వారిని కోరాను. వారు నా కోరికను మన్నించి నాకు ఉపకారవేతనాన్ని మంజూరుచేశారు. వారి ఔదార్యానికి

ఇది ఒక తార్కాణం. 1927 లో విజయనగర సంస్థానానికి దివాన్‌గా మహారాజావారు నన్ను నియమించినప్పుడు నన్ను అభినందించుచు నాయుడుగారు నా కొక ఉత్తరం వ్రాశారు. 1910 లో నేను వారి కళాశాలలో చేరినప్పుడు ఏర్పడిన గౌరవం తాత్కాలికం కాక స్థిరపడి పోయింది. విద్యార్థులను యోగ్యులుగా తీర్చి దిద్దడం అధ్యాపకుల ప్రత్యేక కర్తవ్యమనే గుణపాఠాన్ని నేను వారినుండి నేర్చుకొన్నాను.

ఆరోజులలో కాకినాడలో స్త్రీలకు ప్రత్యేక కళాశాల ఉండేది కాదు. వారు కూడ మొగపిల్లలవలె ఉన్నతవిద్యను నేర్చుకొనడం అవసరమని నాయుడుగారు గ్రహించి, ప్రత్యేక కళాశాలను స్థాపించుటకు వనరులు లేకపోవడంచేత 'గుడ్డిలో మెల్ల' అనే సూత్రాన్ని అనుసరించి పురుషుల కళాశాలలో వారిని చేర్చుకొని, ఉచితంగా వారికి విద్యను నేర్పగల అవకాశాన్ని కల్పించినారు. మా సంఘసంస్కరణ ఉద్యమాన్ని అభిమానించిన వారు. స్త్రీల ఉద్ధరణకు ఉన్నత విద్య అవసరమని భావించినారు. ఇందులో వారు కందుకూరి వీరేశలింగంపంతులువారితో కలిసి కృషిచేశారు.

కాకినాడ కళాశాలలో ఆనాడు అధ్యాపకులుగా ఉన్నవారి మధ్య ఏలాటి అసూయలుగాని, ద్వేషాలుగాని ఉత్పన్నం కాలేదు. వారందరు ఒకే కుటుంబానికి చెందిన సోదరులవలె ప్రవర్తించారు. విజయనగర కళాశాలలో గాని, ఆంధ్రవిశ్వవిద్యాలయంలో గాని, నాకు ఈలాటి అనుభవం కలగలేదు. ఈ విద్యాలయాలలో ముఠాతత్వం ప్రాబల్యం గాంచింది. కాకినాడలో అలాగుగాక నేను నా జీవితాన్ని నెమ్మదిగా సాగించినాను. నాతో కూడ అక్కడ ఫిజిక్సుశాఖలో ఎ. సోమసుందరం చెట్టిగారు. తర్కశాస్త్ర శాఖలో యం. లక్ష్మీనారాయణరావుగారు, జీవశాస్త్రశాఖలో జి. యన్. రంగిస్వామిఅయ్యంగారు అధ్యాపకులుగా ఉండినారు. మేమందరం సమవయస్కులం. మేము తరుచుగా మా ఇండ్లలో కలుసుకొంటూ ఇష్టాగోష్ఠిగా కాలక్షేపం చేసేవారం. మా భార్యలు కూడ పరస్పరం కలుసుకొంటూ ఉండేవారు. సోమసుందర చెట్టి గారికి అధ్యాపకత్వంలో ఎక్కువ శ్రద్ధ ఉండేదికాదు. ఇంతకంటే

వర్తక వ్యాపారాలు వారికి ఆకర్షణీయంగా ఉండేవి. అందుచేత వారు త్వరితకాలంలోనే కళాశాల ఉద్యోగాన్ని మానుకొని, స్వస్థలమైన మద్రాసుకు వెళ్లి అనేక ప్రయోగాలు చేసి తుదకు "రుక్మిణీ కుక్కరు" అని ప్రసిద్ధిగాంచిన కుక్కరును తయారుచేసి, దానిమూలంగా ధనికులయ్యారు. అనేకసంవత్సరాల తర్వాత 1946 ప్రాంతాన నేను అధ్యాపకవృత్తిని మాని మద్రాసు నివాసినై నప్పుడు ఆ కుక్కరు కొనుటకు రాయపురంలో వారి ఇంటికి వెళ్లినాను. అప్పుడు వారు కాకినాడలో మా స్నేహాన్ని గురించి ముచ్చటించి కుక్కరు ఖరీదులో 10 శాతం తగ్గించి దానిని నాకు అమ్మకం చేశారు. తర్వాత కూడ మా బంధువుల నిమిత్తం కుక్కరు కొనుటకు నేను అయిదారు పర్యాయాలు వారిని కలుసుకొన్నాను.

లక్ష్మీనారాయణరావుగారు కూడ కళాశాలను వదలి ప్రభుత్వ విద్యాశాఖలో ఉద్యోగిగా చేరి, రాజమండ్రి కళాశాలలో కొంతకాలం పనిచేసి, క్రమక్రమంగా జిల్లా విద్యాధికారిగా పింఛన్ పుచ్చుకొన్నారు. రంగస్వామిఅయ్యంగారు కోయంబుత్తూరు వ్యవసాయకళాశాలలో అధ్యాపకులుగాను, పరిశోధకులుగాను పనిచేసి గొప్ప ప్రఖ్యాతిని సంపాదించినారు.

కాకినాడ కళాశాలలో నా శిష్యులుగా ఉన్నవారు కొందరు గొప్ప పదవులలో పేరుప్రతిష్ఠలు సంపాదించినారు. మద్రాసు హైకోర్టులో న్యాయాధిపతిగా ఉండిన చింతగుంట రాఘవరావు గారు, విద్యాశాఖకు డైరెక్టరుగా ఉండిన పురాణం భద్రయ్య నాయుడుగారు, భూమి తనఖాబ్యాంకుకు కార్యదర్శిగా ఉండిన నేత్రగంటి కోనేటిరావుగారు, కాకినాడ కళాశాలలో ప్రిన్సిపాల్‌గా పనిచేసిన పెద్దాడ రామస్వామిగారు నా స్మృతిపథంలో ఇప్పటికి కూడ ఉన్నారు. వేదాంతం వెంకటకృష్ణయ్య అనే విద్యార్థి స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్నారో లేదో నాకు జ్ఞాపకంలేదు. కాని వారి భార్య కమలాదేవిగారు ఉద్యమంలో పాల్గొని ప్రఖ్యాతి సంపాదించ గలిగింది.

ఉప్పులూరి లక్ష్మీనారాయణశాస్త్రిగారు (వి. యల్. శాస్త్రిగారు) కూడా స్వాతంత్ర్యోద్యమంలోను, మద్రాసులోని

కార్మిక ఉద్యమంలోను గొప్ప పాత్రను వహించారు. వారు కాకినాడలో నా శిష్యులు.

కళాశాలలో నేను ఉన్నప్పుడు నాకు సన్నిహితులైన వారిలో హైస్కూలు హెడ్ మాస్టరు గొడవర్తి జగన్నాథస్వామిగారు ఒకరు. వీరు సనాతన వైష్ణవ బ్రాహ్మణులు. వీరు విద్యార్థులకు గణితాన్ని బోధించేవారైనా సంస్కృతంలో అఖండమైన పాండిత్యం ఉండేది. దానిని వృద్ధిచేసుకొనదలచి, ఒక పండితునివద్ద రోజూ సాయంకాలం 5, 6 గంటలమధ్య వ్యాకరణశాస్త్రాన్ని అధ్యయనం చేసేవారు. నేను కూడ వారితో కలిసి, పండితుని సమక్షంలో ఆ గంటకాలం గడిపేవాడిని. నా చిన్నతనంలో మా పినతండ్రి వద్ద సంస్కృతం నేర్చుకొన్నాను. కాని అందులో నాకు చెప్పుకొన దగిన జ్ఞానం కలుగలేదు. ఇంగ్లీషు విద్యకై మద్రాసుకు వెళ్లినప్పుడు మూడవ ఫారంలో తెనుగు బదులు సంస్కృతాన్ని రెండవభాషగా ఎన్నుకొనే అవకాశం ఉండేది (ఆనాడు ఇంగ్లీషు ప్రథమభాష, కాని పెద్దల సలహా ఏలాంటిది నాకు లేనందున నేను ఆ అవకాశాన్ని వినియోగించుకొనలేదు. తర్వాత కాకినాడలో చేసిన ప్రయత్నం కూడ ఫలప్రదం కాలేదు. విజయనగరం వెళ్లిన తర్వాత మా ఇంటి పొరుగున రుద్రాభట్ల రామశాస్త్రులు అనే వ్యాకరణశాస్త్ర ప్రవీణులు ఉండేవారు. వారు సుప్రసిద్ధ మహామహోపాధ్యాయ తాతా సుబ్బరాయశాస్త్రిగారికి గురువు. వారివద్ద నా సంస్కృత జ్ఞానాన్ని వృద్ధిచేసుకొనుటకు నేను ప్రయత్నంచేశాను. వారు నాచేత భారవి కిరాతార్జునీయాన్ని చదివించారు. లఘుకౌముదిని కూడా బోధించారు. కాని దీనిమూలంగా నా సంస్కృతి జ్ఞానం ఎక్కువగా అభివృద్ధి గాంచలేదు. ఈనాడు సంస్కృతాన్ని నేర్చుకొనుటకు సులభపద్ధతు లనేకం ఉన్నవి. పాశ్చాత్యదేశాలలో ఈ పద్ధతుల మూలంగానే ఇంగ్లండు, జర్మనీ, ఫ్రాన్సు, రష్యా, అమెరికా దేశాలలో అనేకులు సంస్కృతంలో అఖండ పాండిత్యాన్ని సంపాదించి, గొప్ప పరిశోధకులుగా అనేక గ్రంథాలను వ్రాసి, సంస్కృతభాష పునరుద్ధరణకు ఎనలేని సేవచేయ గలిగారు. కాని నాకు సంస్కృతం నేర్పినవా రెవ్వరు ఈ పద్ధతులతో

పరిచయం లేనివారు. అందుచేత నేను సంస్కృతంలో సంపాదించిన జ్ఞానం మిడి మిడి జ్ఞానంగానే ఉండిపోయింది.

కాకినాడలో నేను అక్కడి క్లబ్‌లో సభ్యుడనైనాను. పురప్రముఖులలో అనేకులు ఇందులో సభ్యులుగా ఉండేవారు. అందుచేత వారితో నాకు పరిచయం లభించింది. వారిలో బులుసు సాంబమూర్తిగారు, దుగ్గిరాల సూర్యప్రకాశరావుగారు ఇప్పటికి కూడ నా జ్ఞాపకాలలో స్థిరత్వం పొందినారు. సూర్యప్రకాశ రావుగారు కొంతకాలం ప్రభుత్వోద్యోగిగా పనిచేసి, పింఛన్ పుచ్చుకొని మితవాదిగా రాజకీయాలలో పాల్గొనుచుండేవారు. వారు పురప్రముఖుల సమావేశాలను జరిపి, తీర్మానాలు గావించి, వాటిని తరుచుగా అధికారులకు పంపుచుండేవారు.

కాకినాడలో నాకు పరిచయమైన వారిలో ఉప్పులూరి గోపాలకృష్ణగారు ఇంకొకరు. వీరు వి. యల్. శాస్త్రిగారి అన్న గారు. వీరు వైద్యశాస్త్రంలో ఎల్. ఎం. పి. ని పూర్తి చేసి, కొంతకాలం రంగూన్‌లో ప్రాక్టీసు చేసి, తిరిగి స్వస్థలమైన కాకినాడకు వచ్చారు. కాకినాడలో వీరికి మంచి ప్రాక్టీసు ఉండేది. మా కుటుంబానికి వారే డాక్టర్‌గా ఉండేవారు.

నేను కాకినాడ కళాశాలలో ఉద్యోగాన్ని మానుకొని విజయనగరం వెళ్ళిన సందర్భంలో విద్యార్థులు నా గౌరవార్థం వీడ్కోలు సభను సమావేశపరచి, నాకు ఒక బంగారు పతకాన్ని బహూకరించారు. నేను ఆ పట్టణంలో మూడున్నర సంవత్సరాలు మాత్రమే గడిపినా అది నా జీవితంలో అన్నివిధాలా మధుర స్మృతులతో కూడినట్టి కాలం. తిరిగి అలాటి అనుభవం నాకు 1949 – '52 లో బొంబాయి విశ్వవిద్యాలయంలో రాజనీతి శాఖలో ప్రధానాచార్యులుగా ఉండిన కాలంలో కలిగింది. కాకినాడలో నాది మొదటి అధ్యాపకత్వం, బొంబాయిలో నాది చివరి అధ్యాపకత్వం.

# నా ఉద్యోగం - రెండవదశ

1913 జూలై మొదలు 1928 ఏప్రిల్ వరకు నా ఉద్యోగ జీవితంలో రెండవదశ. ఈ కాలంలో నేను 10 నెలలు మినహాగా విజయనగరం మహారాజా కళాశాలలో ఉద్యోగంచేశాను.

కాకినాడ కళాశాలలో బి. ఏ. తరగతులు లేని కారణంగా అది రెండవగ్రేడు కళాశాలల వర్గంలో చేరి ఉండినది. విజయనగరం కళాశాల ఆలాగుగాక, బి. ఏ. తరగతులతో కూడిన మొదటిగ్రేడు కళాశాలగా ఉండేది. అందుచేత నాకు అది ఆకర్షణీయమైంది. కాని అక్కడ కూడా 1913 జూలై నాటికి బి. ఏ. లో చరిత్రశాఖ ఉండేదికాదు. దానిని ప్రారంభించి సాగించడానికి కళాశాలాధికారులు ప్రయత్నం చేస్తున్నట్లు నాకు తెలిసింది. వెంటనే నేను కళాశాల ప్రిన్సిపాల్ కిళాంబి రామానుజాచార్యులకు నన్ను అధ్యాపకుడుగా నియమించ వలసిందిగా కోరుతూ దరఖాస్తు పంపినాను.

ఆచార్యులుగారు గొప్ప పండిత కుటుంబానికి చెందినవారు. చిన్న తనంలో సంస్కృతంలో గొప్ప పాండిత్యాన్ని సంపాదించి, అష్టావ ధాన శతావధానాలను చేసేవారట. అప్పటికి వారికి విజయనగర సంస్థానంతో సంబంధం ఏర్పడింది. తర్వాత వారు ఇంగ్లీషు చదివి ఎం. ఏ. లో పట్టభద్రులై విజయనగర సంస్థాన యాజమాన్యంలో వుండిన ఇంగ్లీషు కళాశాలకే గాక, సంస్కృత కళాశాలకుకూడ ప్రిన్సి పాల్‌గా నియమితులై, అనేక సంవత్సరాలకాలం ఉద్యోగంచేశారు. ఆరోజులలో ఆంధ్ర దేశమందంతటా విద్యావేత్తలుగా గుర్తింప బడినవారు వెంకటరత్నంనాయుడుగారూ, ఆచార్యులుగారూ మాత్రమే. తెల్లదొరలు కొందరు ఈలాటివారు వుండినా వారిని గురించి నేను ప్రస్తావించదలపెట్టలేదు. భారతీయులలో వీరిద్దరు మాత్రమే అగ్రశ్రేణికి చెందినవారనే ప్రఖ్యాతిని సంపాదించినారు.

ఉద్యోగం నిమిత్తం నా దరఖాస్తును పంపిన తర్వాత కొన్నిరోజులకు నేను విజయనగరం వెళ్లి ఆచార్యులగారిని, వారి ఇంట్లో కలుసుకున్నాను. నన్ను గురించి వారు అదివరకే విని యుండిన కారణంగా నాతో గౌరవపూర్వకంగా మాట్లాడినారు.

నా దరఖాస్తును గురించి ఏలాటి నిర్ణయం తీసుకోలేదనీ, త్వరలోనే అధికారులతో సంప్రతించి, నిర్ణయాన్ని తీసుకొని తెలియపరిచేటట్లు చెప్పినారు. వారి మాటలనుబట్టి నా పట్లవారు సుముఖులుగా ఉన్నట్లు గ్రహించాను. నేను బి. ఏ. లో కృతార్థుడనై పచ్చయప్పా కళాశాలలో ట్యూటరు పదవి నిమిత్తం పిట్టీ త్యాగరాయశెట్టిని కలుసుకొన్న ఉదంతం జ్ఞాపకానికి వచ్చింది. తర్వాత కొన్ని రోజులకు చరిత్రశాఖలో 175 రూపాయల జీతంతో నన్ను అధ్యాపకుడుగా నియమిస్తూ ఆచార్యులుగారు ఆర్డరు పంపినారు. వెంటనే నేను విజయనగరం వెళ్లి కళాశాల ఉద్యోగంలో చేరినాను. కాకినాడ ఉద్యోగం లభించినట్లే ఈ ఉద్యోగం కూడ సునాయాసంగానే లభించింది.

బి. ఏ. లో చరిత్రశాఖను ప్రారంభించడానికి ఒక సంవత్సరం పట్టింది. దీనికి తగిన వనరులు కళాశాలలో ఉండేదీ లేనిదీ తెలుసుకొని మద్రాసు విశ్వవిద్యాలయం వారు దీనికి అనుమతించవలసిన నియమం వుండేది. ఈ తంతు పూర్తికావడానికి ఒక సంవత్సరం పట్టడంచేత, ఈ సంవత్సరకాలంలో నేను ఇంటర్మీడియేట్ తరగతులకు మాత్రమే చరిత్రను బోధించడం జరిగింది. ఒక విధంగా ఇది నాకు లాభకారిగానే పరిణమించింది. విద్యార్థులు, అధికారులు నా బోధనాశక్తిని తెలుసుకోడానికి అవకాశం లభించింది. వారు తృప్తిపడి బి. ఏ. తరగతులకు కూడ నేను చక్కగా బోధించగలవాడనని భావించారు.

విశ్వవిద్యాలయంవారు మద్రాసు నుంచి గ్రీన్ అనే ప్రొఫెసరును కళాశాల వనరులు ఏలాటివో పరిశీలించి, ఒక నివేదికను పంపడానికి నియమించారు అప్పటికే నేను బి. ఏ. క్లాసుకు కావలసిన గ్రంథాలను, మ్యాపులను కొనిపెట్టినాను. అతడు వచ్చి భవనాన్ని, గ్రంథాలు మొదలైన పరికరాలను పరిశీలించి, అవి తృప్తికరములుగా వున్నవనీ, కాని నాకు అప్పటి వరకు బి. ఏ. తరగతులకు బోధించే అనుభవం లేని కారణాన నేను చరిత్రశాఖకు ప్రధానాధ్యాపకుడుగా వుండదగినవాడనని అంగీకరించి, అలాటి అనుభవంగల ఒకరిని నాకు సహాయాధ్యాపకుడుగా నియమించవలెనని షరతును విధిస్తూ విశ్వవిద్యాలయాధికారులకు

తన నివేదికను పంపినాడు. బి. ఏ. అనుభవం లేనివాడనగుటచేత ప్రధానాధ్యాపకుడుగా వుండుటకు నాకు అర్హత లేదని చెప్పే అధికారం అతనికి వుండినదికాని, అలాగు చెప్పక పైన పేర్కొన్న షరతును విధించి నాకు మహోపకారం చేసినాడు. ఎవడో ఒక మహానుభావుడు "నంబీ నంబీ, నీ వల్లనే నాకు వివాహం జరిగింది" అన్నాడట. నంబి "అయ్యా, నేను మీకు ఏలాటి సహాయము చేయలేదే! ఏమి అలాగు సెలవిస్తున్నారు" అని అన్నాడట. "అది కాదయ్యా, పెండ్లి సమయంలో అపశకున సూచకంగా నీవు నా ఎదటికి రాకపోవడమే నీవు చేసిన గొప్ప సహాయం." ఇదే విధంగా గ్రీన్ దొరగారు నాకు మహోపకారంచేసినారు.

వారు విధించిన షరతు మేరకు మద్రాసు పచ్చయప్పా కళాశాలలో అధ్యాపకులుగా ఉండిన సి. ఎస్. శ్రీనివాసాచారి నాకు సహాయాధ్యాపకులుగా నియమింపబడినారు. నా తమ్ముడు రామకృష్ణయ్య చిలిపిచేష్టల సందర్భంలో వారిని ఇంతకు పూర్వమే పేర్కొన్నాను. వారు ఒక సంవత్సరం మాత్రమే విజయనగరం కళాశాలలో అధ్యాపకులుగా ఉండినారు. బోధన విషయంలో వారినుండి నేను నేర్చుకున్నదిగాని, వారు నేర్పినదికాని ఏమీ లేదు. ఈ ఉద్యోగాన్ని ఆధారంచేసుకొని, పచ్చయప్పా కళాశాల అధికారులతో బేరంచేసి, మరింత ఎక్కువ జీతంతో వారు తిరిగి అదే కళాశాలకు వెళ్లిపొయ్యారు.

వారి తర్వాత శిరుగూరి హనుమంతరావుగారు వారి స్థానే నియమింపబడినారు. వీరుఅప్పుడే బి. ఏ. ఆనర్సులో పట్టభద్రులైన వారు. అధ్యాపకత్వంలో ఏలాటి అనుభవం లేనివారు. కాని కడుసమర్థతతో విద్యార్థులకు బోధించి వారి మన్ననలకు పాత్రు లైనారు. వారు రెండు సంవత్సరాలు మాత్రమే విజయనగరంలో ఉద్యోగంచేసి, అటుతర్వాత మద్రాసులో కొంతకాలం ప్రభుత్వ విద్యాశాఖలోచేరి, తర్వాత హైదరాబాదు నిజాం కళాశాలలో అధ్యాపకులై పేరుప్రతిష్ఠలు సంపాదించి, పింఛన్ పుచ్చుకొని, హైదరాబాదు స్థిరనివాసి అయినారు. నేను కూడ 1957 లో అక్కడ స్థిరనివాసి అయినాను. విజయనగరంలో ఏర్పడిన మా మైత్రి ఇప్పటికి కూడ స్థిరంగా నిలిచి వున్నది. ఇద్దరం వృద్ధుల

మైనాము. ఇల్లు కదలి బయటకు వెళ్లే స్థితిలో లేము. కాని ఉత్తరప్రత్యుత్తరములద్వారా మేము పరస్పరం సంప్రదింపులు జరుపుకొనుచున్నాము. తణికెళ్ల వీరభద్రుడుగారు ఇంగ్లీషుశాఖలో అధ్యాపకులుగా చేరారు. వీరు కూడ అధ్యాపకులుగా హైదరాబాదులోని ఉస్మానియా విశ్వవిద్యాలయంలో గొప్ప ప్రఖ్యాతిని సంపాదించినారు. తర్వాత అదే సంస్థానంలో పబ్లిక్ సర్వీసు కమీషన్‌లో సభ్యులై పింఛన్ పుచ్చుకొన్నారు. ఆనాడు విజయనగరం కళాశాల ప్రఖ్యాతిగాంచిన అధ్యాపకులకు కేంద్రమై వివిధశాఖలకు చెందిన విద్యార్థులను ఆకర్షించగలిగింది. విద్యాసంస్థల పేరుప్రతిష్ఠలకు సర్వకాలాలలో అధ్యాపకులే ఆధారమని అది రుజువు చేసింది.

రామానుజాచార్యులు గొప్ప విద్యావేత్తయే గాని అధికారిగా వారిలో పక్షపాత దృష్టి వుండేది. కొందరి అధ్యాపకుల పట్ల ఎక్కువ అభిమానము, మరికొందరి పట్ల తక్కువ అభిమానము ప్రదర్శించేవారు. నా కంటే కొన్ని సంవత్సరములకు ముందు మంగుళూరుకు చెందిన సుబ్బరామభట్టుగారు ఇంగ్లీషుశాఖలో అధ్యాపకులుగా చేరినారు. అధ్యాపకుల గరిష్టజీతం 200 రూపాయలు. నేను చరిత్రశాఖకు ప్రధానాధ్యాపకుడను కావడం చేత నాకు న్యాయంగా 225, 300 రూపాయలు లభించవలసి వుండేది. కాని నాకు వెంటనే 225 రూపాయలు ఇచ్చిన పక్షంలో భట్టుగారికి అదివరకు లభించిన సీనియారిటీకి నష్టం కలిగేది. అందుచేత ఆచార్యులుగారు నాకు 200 రూపాయులు జీతం మాత్రమే మొదటి సంవత్సరంలో ఇచ్చేటట్లు అధికారులచే ఆర్డరు వేయించారు. ఆనాడు సంస్థాన పరిపాలన ప్రభుత్వం నియమించిన ఒక ట్రస్టీ ఆధీనంలో వుండేది. అప్పట్లో ఫౌలర్ ( Fowler), ఐ. సి. యస్. ట్రస్టీగా వుండేవాడు. బ్రిటిషు పరిపాలకుల సంప్రదాయాన్ని అనుసరించి తనకు విద్యావిషయాలలో చాలావరకు ఆచార్యుల సలహా మేరకు ప్రవర్తించేవాడు. ఆచార్యులు నాకు 200 రూపాయల జీతం మాత్రమే లభించవలెనని చెప్పిన సలహాకు అంగీకారం తెలియపరచాడు. ఇది అన్యాయమని విన్నవించుకొన్నా లాభంలేకపోయింది.

శిరుగూరి హనుమంతరావుగారు వెళ్లిపోయిన తర్వాత వారి స్థానంలో యం. ఎస్. రామస్వామిఅయ్యంగారు అధ్యాపకులుగా చరిత్ర శాఖలో చేరారు. అప్పటికి ఫౌలర్ స్థానే వి. టి. కృష్ణమాచారి ట్రస్టీ పదవిలోకి వచ్చినారు. అయ్యంగారు అధికారులను ఆశ్రయించడంలో ఆరితేరినవారు. కృష్ణమాచారిగారిని తరచుగా కలుసుకొంటూ ఉండేవారు. దీని ఫలితంగా వారికి ప్రత్యేక గ్రేడును కల్పించడం తక్కిన ఉపాధ్యాయులకంటె ఎక్కువ జీతం లభించడం జరిగింది. రామానుజాచార్యులుగారు దీనికి ఏలాంటి ఆక్షేపణ తెలుపలేదు. వైష్ణవపక్షపాతం దీనికి కారణమని అందరూ భావించారు.

కొన్ని విషయాలలో ఈలాంటి సంఘటనలు సంభవించినా మొత్తంమీద ఆచార్యులగారు ప్రిన్సిపాల్‌గా ఉండినకాలంలో నా జీవితం నెమ్మదిగాను శాంతియుతంగాను సాగిపోయింది. విద్యార్థులు నాపట్ల అభిమానం కలవారుకావడమే దీనికి ప్రధాన కారణం. నా బోధనా పద్ధతి కారణంగా తక్కిన అధ్యాపకుల కంటె నా పట్ల ఎక్కువ గౌరవం కలవారయ్యారు. వారు జరిపిన కొన్ని సమావేశాలలో ఈ అభిప్రాయాన్ని బహిరంగంగా వ్యక్తంచేశారు. దీని ఫలితంగా కొందరు అధ్యాపకులు, నా పట్ల అసూయాగ్రస్తులైనారు. ఇది క్రమక్రమంగా కళాశాలలో ముఠాతత్వాలు బయలుదేరుటకు దారి తీసింది. రామానుజాచార్యులుగారి విరమణానంతరం ఏచూరి నరసింహంగారు ప్రిన్సిపాల్ పదవిలోకి వచ్చిన తర్వాత ఇది తారాపథం అందుకొన్నది.

ఒక ముఠాకు నరసింహంగారే నాయకులయ్యారు. ఇంగ్లీషు శాఖకు చెందిన బుర్రా శేషగిరిరావు, ఫిజిక్సుశాఖకు చెందిన కాళ్లకూరి జానకిరావు వీరి అనుచరులలో ప్రధానులు. వీరి కుమారుడు ఏచూరి వెంకట్రామయ్యకు కళాశాలలో ఏలాటి స్థానం లేకపోయినా, ఆయన రసాయనశాస్త్రంలో గొప్ప పరిశోధకుడని ప్రచారం చేయడం వీరి కార్యక్రమాలలో అగ్రస్థానం వహించింది. వీరందరు కలసి కళాశాల తరఫున ఒక పత్రికను స్థాపించి ముఠాకు చెందిన వారి వ్యాసములనే ప్రకటించసాగారు. కౌటిల్యుని అర్థ

శాస్త్రాన్ని ఆధారం చేసుకొని, నేను రెండు పరిశోధక వ్యాసాలు వ్రాసి, వాటిని పత్రికలో ప్రకటించవలసిందిగా కోరినాను. కాని వారు వాటిని ప్రకటించ నిరాకరించారు. తర్వాత వాటిలో ఒక దానిని మద్రాసులో ఇండియన్ రివ్యూ సంపాదకులు, రెండవదానిని పాట్నాలోని హిందూస్తాన్ రివ్యూ సంపాదకులు వారి పత్రికలలో ప్రకటించినారు.

1920 ప్రాంతాన నెల్లూరిలో వెంకటగిరిరాజా కళాశాలను స్థాపించారు. అంతకుపూర్వం అక్కడ హైస్కూలు మాత్రమే ఉండేది. కళాశాల కమిటీవారు నన్ను ప్రిన్సిపాల్‌గా నియమించి నాకు ఆర్డరు పంపినారు. విజయనగరం కళాశాల మొదటి గ్రేడు కళాశాల అనీ ఎప్పటికైనా దానికి ప్రిన్సిపాల్‌గా నన్ను నియమించ గలరని ఆశాభావం నాకు ఉన్నందున నెల్లూరు ఉద్యోగాన్ని తిరస్కరించాను. కాని ఏచూరి నరసింహంపంతులుగారు సంస్థానానికి దివాన్‌గా నియమింపబడి ప్రిన్సిపాల్ పదవి ఖాళీ అయినప్పుడు వారి మరాకుచెందిన జానకిరావుగారు ప్రిన్సిపాల్‌గా నియమించబడినారు. ఇది నాకు చాలా ఆశాభంగాన్ని కల్గించింది.

1920 లోనే చిదంబరక్షేత్రానికి సమీపములోనే ఒక క్రొత్తనగరంగా రూపొందిన అన్నామలై నగరంలో రాజా అన్నామలై శెట్టిగారు ఒక కళాశాలను స్థాపించినారు. మా బంధు వర్గానికి చెందిన అల్లాడి కృష్ణస్వామయ్యగారు శెట్టిగారి వకీలు. వారిపై ఎక్కువ పలుకుబడి కలవారు. నన్ను ఈ కళాశాలకు ప్రిన్స్‌పాలుగా నియమించవలసినదని శెట్టిగారికి సిఫారసుచేసి, వారి అనుమతితో ఆ ఉద్యోగాన్ని స్వీకరించ వలసిందిగా నాకు రెండు టెలిగ్రాములను పంపినారు. కాని దూరదృష్టి లేనివాడనై నేను దీనిని కూడ నిరాకరించాను. తమిళులు కుట్రలు చేసేవారని, వారి మధ్య ఉద్యోగం చేయడం కష్టసాధ్యమని భయసందేహాలతో నేను ఈలాగు ప్రవర్తించాను. విజయనగరం కళాశాలలోను, అటుతర్వాత ఆంధ్ర విశ్వవిద్యాలయంలోను నాకు కలిగిన అనుభవాల మూలంగా కుట్రలను పన్నడంలో తమిళులకంటె ఆంధ్రులే గొప్పవారని గ్రహించాను. అన్నామలై నగరంలోని కళాశాల ప్రిన్సిపాల్ పదవిని స్వీకరించి

ఉంటే నా జీవితం ఇంకొక మోస్తరుగా సాగి ఉండేది. కాని ఆనాడు నేను ఉద్యోగాన్ని తిరస్కరించినందుకు ఏవిధమైన విచారాన్ని పొందినవాడను కాను. మొత్తంమీద నా జీవితం సార్థకమైనట్లుగానే భావిస్తున్నాను.

ఆనాడు మద్రాసు విశ్వవిద్యాలయంలో ఆర్థికశాఖలో ప్రొఫెసరుగా ఉన్న గిల్బర్టు స్లేటరుగారు మన దేశం లోని గ్రామాల లోని వాస్తవ పరిస్థితులను తెలుసుకొనగోరి తన విద్యార్థుల సహాయంతో కొన్ని సర్వేలు చేయించారు. ఆ పద్ధతి ననుసరించి నేను కూడ సంస్థానంలోని కొన్ని గ్రామాలలో ఈలాటి పరిశోధనలు జరిపించి, వారు నా సలహాపైన సమర్పించిన నివేదికలను సంస్థానం ట్రస్టీగారు వి. టి. కృష్ణమాచారిగారికి చూపించాను. వారు దానిపట్ల సంతోషాన్ని చూపెట్టి వాటిని ముద్రించవలసిందిగా సంస్థానం ముద్రణాలయానికి ఆదేశించారు. దాని మేరకు అవి ప్రకటింపబడినవి.

ఇదే సమయంలో నేను కళాశాలలో కొన్ని సమావేశాలను ఏర్పాటుచేసి, వాటిలో భారత ఆర్థిక విధానాన్ని గురించి, చలామణిని గురించి కొన్ని ఉపన్యాసాలు గావించినాను. కృష్ణమాచారిగారు ఒక సమావేశానికి అధ్యక్షులుగా వచ్చినారు. ఇంకొకదానికి విజయనగరంలోని ఇంపీరియల్ బ్యాంకు ఏజెంటు ఒక తెల్లదొర అధ్యక్షత వహించారు. వీరిద్దరు నా ఉపన్యాసాలను ప్రశంసించారు. తెల్లదొర నన్ను తన బసలో కలుసుకొని, చలామణిని గురించి చర్చించవలసిందిగా ఆహ్వానించారు. దాని మేరకు నేను వారిని కలుసుకొని వారితో చర్చలు సాగించాను. ఇది ఒక గౌరవంగా నేను భావించాను.

అధ్యాపకుడనుగా నా శక్తిసామర్థ్యాలపట్ల కృష్ణమాచారి గారికి మంచి అభిప్రాయం కలిగింది. దీనిని గురించి వారు ఆనాటి యువరాజా అలక్‌నారాయణ గజపతిగారి తల్లి మహారాణి లలితకుమారీదేవికి ఉభయుల సంభాషణ సమయంలో ఒకటి రెండు పర్యాయాలు తెలియపరచారు. మహారాణి దర్శనార్థం కోటకు వెళ్ళే వారితో మరికొందరు కూడా వారికి ఈవిధంగానే చెప్తూ ఉండేవారు. వీటి అన్నిటి ఫలితంగా నన్ను యువరాజాగారికి

ట్యూటరుగా నియమించవలసిందిగా మహారాణిగారు కృష్ణమాచారి గారిని కోరారు. వారు ఆ కోరికను మన్నించి నన్ను ట్యూటరుగా నియమించినారు.

నేను రోజూ కళాశాలలో సాయంత్రం నాలుగు గంటల వరకు పనిచేసి, 5½, 6 గంటలకు యువరాజా వారికి విద్య నేర్పుటకై కోటకు వెళ్లేవాడిని. బంట్రోతు ద్వారా హాజరు మనవి చేసి, వారు రమ్మని చెప్పిన తర్వాతనే వారి గదిలోకి వెళ్లడం మర్యాద. నేను హాజరు మనవి చేసి, వారినుండి జవాబుకు వేచి ఉండేవాడను. ఎప్పటికీ ఆ జవాబు వచ్చేది కాదు. వారికి జ్ఞాపకం చేయడం కూడ కోట మర్యాద కాదు. వారి సెలవైతేనేగాని నేను కోట నుంచి ఇంటికి వెళ్లరాదు. ఇది కూడ కోట మర్యాదలలో ఒకటి. ఒక్కొక్క రోజు రాత్రి 9 గంటలకుగాని వారి సెలవు లభించేది కాదు. ఏ పనీ లేకుండా మూడుగంటలసేపు వారి దర్శనార్థం వచ్చినవారు కూర్చుండే ముందు గదిలో కూర్చుండి ఉండేవాడను. వారు చాలా తెలివితేటలు గలవారు. సూక్ష్మంగా అన్నివిషయాలను గ్రహించేవారు. కాని కొంత తిక్కమనిషి. ఒక నిమిషం చాల ఆప్యాయతతో మాట్లాడేవారు. మరు నిమిషంలోనే ఆగ్రహపరవశులయ్యేవారు. వారు కొన్ని సంవత్సరాలపాటు అజ్మీరులో సంస్థానాలకు చెందిన రాజకుమార్ల శిక్షణార్థం ప్రభుత్వం స్థాపించిన కళాశాలలో విద్యార్థిగా ఉండేవారు. చదువుకోనవలసినదంతా అక్కడే చదువుకొన్నట్లు, మరి నావద్ద చదువుకొని నేర్చుకోన తగినది ఏదీ లేనట్లు వారు భావించినట్లు నాకు సందేహం. తల్లిగారి మాటకు అన్యథాగా ప్రవర్తించలేక నన్ను ట్యూటరుగా అంగీకరించినారే గాని నేను వారికి విద్యాబోధన చేయడంగాని, వారు నావద్ద విద్యను నేర్చుకొనడం గాని జరగలేదు. ఏదో వారికి తోచినప్పుడు వారానికి ఒక పర్యాయమో, రెండు పర్యాయాలో నన్ను కలుసుకొనేవారు. ఏదైన బోధించవలసి ఉంటే ఆ సమయాలలో బోధించేవాడిని. ఒక్కొక్క పర్యాయం వారు సాయంకాలం వాకింగ్ వెళ్లుతూ నన్ను కూడ వెంట రమ్మని చెప్పేవారు. ఆ సమయాలలో సంభాషణ సందర్భంలో విద్యకు సంబంధించిన విషయాలను ప్రస్తావించేవాడిని.

కాని ట్యూటరుగా నాకు ప్రథమంలో నెలకు రు. 150 లు, తర్వాత రు. 250 లు అలవెన్సుగా ఇచ్చేవారు. అప్పటికి కళాశాలలో నా జీతం రు. 300 లు. ఈ అలవెన్సులు మూలంగా నా ఆదాయంపెరిగి, నేను మరింత సుఖంగా జీవించగలవాడనైనాను.

నేను ట్యూటరుగా ఉండినకాలంలో మరికొన్ని అనుభవాలు కూడా నాకు కలిగినవి. వేసవిలో రెండు పర్యాయాలు రాజా వారితో కూడ ఊటీకి వెళ్లినాను అక్కడ వారి భవనం ఒక ఎత్తైన కొండమీద ఉండేది. దానికి ఎల్క్ హౌసు ( Elk house ) అని పేరు. భవనం యొక్క ఆవరణలో నాకు, వారి అనుచరవర్గంలో యిద్దరు ముగ్గురు సర్దార్లకు బస ఏర్పాటు చేశారు. మాకు అక్కడే వంట, భోజనం. మాకు ఏలాంటి స్వాతంత్ర్యంలేదు. ఎప్పుడు వారు పిలిపిస్తే అప్పుడు వారిని కలుసుకోనవలసినవారం. అందుచేత మా బసను విడిచి నగరంలోకి వెళ్లడం సాధ్యపడేది కాదు. ఉదయం లేవగానే కాఫీ త్రాగడం నా అలవాటు. కాని మా బసలో నేను తప్ప కాఫీ త్రాగేవా రెవరూ లేరు. అందుచేత అక్కడ నాకు కాఫీ లభించేదికాదు. అందుమూలంగా నేను రోజూ సూర్యోదయానికి ముందే కొండ దిగి నగరంలోని ఒక కాఫీ హోటలుకు వెళ్లి కాఫీ త్రాగి, కొండను ఎక్కి నా బసను చేరే వాడిని. ఊటీలో వారం వారం ఒక సంత జరిగేది. అక్కడికి వచ్చేవారందరు ఆ సంతకు వెళ్లి వచ్చేవారు. కాని రాజుగారి అనుజ్ఞలేనిదే మేము అక్కడికి వెళ్లడం సాధ్యంకాదు. ఒకటిరెండు పర్యాయాలు వారి అనుజ్ఞను ఏలాగో సంపాదించి, సంతను చూచి వచ్చాము. సాయంకాలం వారు కొండలపైన వాక్ కు వెళ్లేవారు. అప్పుడు మేము వారివెంటనే వెళ్లే వారము. వారు మాకు ఏర్పరచిన బసలో ఉండడం తప్ప మరి ఏలాంటి కార్యక్రమం మాకు ఉండేది కాదు.

ఈలాగు కొన్నిరోజులు గడిచిన తర్వాత హరికథ చెప్పే వారిలో అగ్రగణ్యులని ప్రఖ్యాతిగాంచిన ఆదిభట్ల నారాయణదాసు గారిని, వారి బృందాన్ని ఊటీకి పిలిపించారు. ఒకటి రెండు హరికథలు వారు చెప్పగా నాకు వినే అవకాశం కల్గింది. దాసు గారు వీణను కూడ అద్భుతంగా వాయించేవారు. మైసూరు మహా

రాజావారి దర్బారులో అనేకపర్యాయాలు వీణ వాయించి, వారి ప్రశంసలకు పాత్రులైనవారు. వేసవిలో మైసూరు మహారాజా వారు కూడ ఊటీకి వచ్చేవారు. నారాయణదాసుగారు తన రాకను వారికి తెలియపరచగా ఒకరోజు రాత్రి వారిని ఆహ్వానించి వీణను వాయించమన్నారు. నేను కూడ దాసుగారితో కూడ వెళ్ళి మహారాజావారి దర్శనలాభం పొంది వచ్చాను.

విజయనగరం యువరాజావారు ఎప్పుడైనా ఊటీలో నాటక ప్రదర్శనలను చూచుటకు వెళ్లేవారు. అప్పుడు వారివెంట నేను, సర్దారులు వెళ్లే వారం. వారి సమక్షంలో ఎప్పుడూ నడుముకు కమర్బందు ( నడుముకు అంగవస్త్రాన్ని ) చుట్టుకొని వెళ్లవలసిన ఆచారం ఒకటి ఉండేది. ఇది ఒకప్పుడు దర్బారు సమయాలలో మాత్రము అనుసరించవలసిన ఆచారమైనా ఏకారణంచేతనో, అన్నిసమయాలలో అనుసరించవలసినదిగా ఏర్పడింది. దీనిని కట్టుకొన్నప్పుడు ప్రభుత్వ కచ్చేరిలోని బంట్రోతువలె మేము కనుపించేవారము. ఒకనాడు దీనిని కట్టుకొని నాటక ప్రదర్శనానికి వెళ్లినప్పుడు బొబ్బిలి మహారాజావారు ( వీరు వయస్సులో కొంత వృద్ధులు ) దీనిని చూచినారు. మరుసటిరోజు వారిని కలుసు కొనవలసిందిగా నాకు కబురు చేశారు. నేను వారిని కలుసు కొన్నాను. అప్పుడు వారు నాతో "ఏమండీ, మీ రాజుగారు సర్వదా మీచేత కమర్బందును కట్టుకొనేటట్టుచేస్తూ ఉన్నారు. ఇది మీ హోదాకు తగినదికాదు. ఈ అలవాటు మాన్పించ వలసిందిగా నేను చెప్పినట్లు మీ రాజుగారికి తెలియపరచండి. వారు వయస్సులో చిన్నవారు కావడంచేత లోకానుభవం చాలా తక్కువ" అని చెప్పినారు. ఈ మాటలను రాజుగారికి తెలియ పరచడం ఏలాగు అని కొంతభయపడినాను. కాని మరుసటిరోజు వారిని కలుసుకొన్నప్పుడు "ఏమిటి విశేషాలు" అని వారు అడగగా కొంత ధైర్యం తెచ్చుకొని బొబ్బిలి మహారాజావారు చెప్పిన దానిని వారికి తెలియపరచాను. వారు నా పట్ల ఆగ్రహం పొందలేదు. "వారు లోకానుభవంగల పెద్దలు. వారి సలహాను మన్నించవలసిందే. ఇది మొదలు మీరు నాతోకూడ బయటికి

8)

వచ్చినప్పుడు కమర్బందును ధరించవలసిన అవసరం లేదు" అని ఆదేశించారు. గండం తప్పినట్లుగా భావించాను. కాని ఈ మార్పు ఊటీలో ఉన్నంతకాలమే అమలులో పెట్టారు. నేను వారితో కలకత్తాకు, డార్జిలింగుకు, ఇతర ప్రదేశాలకు వెళ్లినపుడు కమర్బంద్ చుట్టుకొనే వెళ్ళేవాడిని.

రాజుగారికి తెల్లదొరలన్నా, వారిని కలుసుకొనడమన్నా ఇష్టం ఉండేదికాదు. వారు జమీన్‌దార్లను తమ చేతి కీలు బొమ్మలవలె ఆడించేవారని, వారినుండి గొప్ప బహుమానాలను సంపాదించేవారని వారికి గట్టి అభిప్రాయం. నేను వారి కొలువులో ఉన్నప్పుడు మద్రాసు గవర్నరు విశాఖపట్టణం రానున్నాడని రాజు గారికి తెలిసింది. విశాఖపట్టణం వచ్చిన ప్రతి గవర్నరు విజయ నగరానికి కూడ వచ్చి అధమపక్షం ఒకరోజైనా సంస్థానానికి అతిథిగా ఉండి, విలువగల బహుమానాలతో సత్కరింపబడడం మామూలు. కాని రాజుగారికి గవర్నరు విజయనగరం రావడం ఎంతమాత్రం ఇష్టంలేదు. అందుచేత ఆ సమయంలో విజయనగ రాన్ని వదిలి ఎక్కడికైనా వెళ్లదలచి, తుదకు డార్జిలింగు వెళ్ళ డానికి నిర్ణయించుకొన్నారు. వారితోకూడ నాయబ్ దివాన్ కృష్ణస్వామినాయుడుగారిని, కళాశాలలోని జానకిరావుగారిని రావల సిందిగా ఆదేశించారు. కాని తల్లిగారు నన్నుకూడ వారివెంట డార్జిలింగుకు వెళ్ళవలసిందిగా కబురు చేశారు. దానికి నేను సమ్మతించి, వారి అనుచరవర్గంలో ఒకడినిగా వారితో కూడ వెళ్లినాను.

అది నవంబరు నెల. డార్జిలింగులో భరించరాని చలి. సాధారణంగా అక్కడికి వెళ్లేవారు వేసవిలో వెళ్ళడం మామూలు. కాని మా రాజుగారు చలికాలంలో అక్కడికి వెళ్ళడానికి సిద్ధపడి నారు. వారు కొంత తిక్కమనిషని ఇదివరలోనే చెప్పినాను. నవంబరులో డార్జిలింగుకు వెళ్ళడం దీని కొక నిదర్శనం.

ప్రయాణంలో ఒకపూట కలకత్తాలో మకాం చేశారు. అక్కడ మమ్ములను వైట్‌వై లేడులా కంపెనీకి తీసుకొనివెళ్లి చలి కాలానికి కావలసిన దుస్తులను మాకు కొనిపెట్టారు. నేను అప్పటి వరకు మేజోళ్ళను గాని, బూట్సును గాని ధరించినవాడను కాను.

కాని ఇవి లేకుండా డార్జిలింగులో తిరగడం సాధ్యంకాదు. అందు చేత వీటిని కూడా మాకు కొనిపెట్టారు.

రాత్రి తొమ్మిది గంటల ప్రాంతాన కలకత్తాలో రైలు ఎక్కి మరుసటిరోజు ఉదయం 6 గంటలకు సిలుగురి అనే జంక్షన్‌ను చేరాము. అక్కడనుండి డార్జిలింగుకు కొండల మీదుగా రైలు. అది 6½ గంటలకు బయలుదేరేది. కాని రాజుగారు సకాలానికి నిద్రనుండి లేవలేదు. వారిని లేపడానికి ఎవరికీ ధైర్యంలేదు. అందుచేత రైలు గార్డును, స్టేషన్ మాస్టరును ఒక అరగంటసేపు రైలు ఆలస్యంగా బయలుదేరేటట్లు ఒప్పించాము. ఇంతలోనే రాజుగారు నిద్రనుండి లేచి కొండరైలును ఎక్కారు. 12 గంటల ప్రాంతాన మేము డార్జిలింగు చేరాము.

అక్కడ దర్భంగా మహారాజావారికి ఒక భవనం ఉండేది. అందులో మేము దిగాము. అక్కడ మా అనుభవాలను గురించి ఒకటి, రెండు మాటలు చెప్పవలసి ఉన్నది. చలికాలం కావడం చేత సాయంత్రం వాక్‌కు వెళ్లేవారు 4 గంటలకు బయలుదేరి 6 గంటలకు తమ బసలకు వచ్చేవారు. మా రాజుగారు అలాగుగాక 6 గంటలకు బయలుదేరే వారు. ఆరోజులలో మనుష్యులు లాగే రిక్షాలు తప్ప మరి ఏలాటి వాహనాలు అక్కడ ఉండేవి కావు. రాజుగారితో సహా మేము పదిమంది బయలుదేరేవారం. అందు చేత పది రిక్షాలను అద్దెకు తీసుకొనేవారు. కాని రాజుగారు రిక్షాలో కూర్చునేవారు కారు. వారు కూర్చుంటేనే గాని అనుచరు లెవ్వరు కూర్చుండడం మర్యాదకాదు. రాజుగారు చాలా వడిగా నడవగలిగేవారు. నేను మధ్యవయస్కుడను కావడంచేత వారితో సమానంగా నడిచేవాడిని. కృష్ణస్వామినాయుడుగారు, జానకిరావుగారు నడవలేక చాలా అలసిపోయ్యేవారు. ఏలాగో మా పర్యటనను ముగించుకొని, భరింపరాని చలిలో 7-30 గంట లకు బసకు వచ్చేవారం.

డార్జిలింగుకు 7, 8 మైళ్ళ దూరంలో ఒక కొండమీద నుంచి మేఘావృతం కాని రోజులలో సూర్యోదయ సమయంలో ఎవరెస్టు శిఖరాన్ని చూడవచ్చు. ఒకరోజు వేకువనే బయలుదేరి, రిక్షాలో ప్రయాణం చేసి ఆ కొండను చేరాము గాని, ఆకాశం

మేఘావృతమై ఉండిన కారణంగా, మేము ఎవరెస్టు శిఖరాన్ని చూడలేక, ఆశాభంగాన్ని పొంది బసను చేరుకున్నాము.

ఈవిధంగా వారం రోజులు డార్జిలింగులో గడిపి తిరుగు ప్రయాణంలో ఒకరోజు కలకత్తాలో మకాం చేశాము. కలకత్తా నగరంలోని కొన్ని ప్రదేశాలకైనా చూచుటకు రాజుగారి అనుజ్ఞ లేనిదే వెళ్ళుటకు వీలులేదు. ఏలాగో వారి అనుజ్ఞను సంపాదించి రెండు మూడు గంటల వ్యవధిలో న్యూ మార్కెట్టు, దాని పరిసరాలను చూడగలిగాను. రాజులతో పర్యటించడం ఒకవిధమైన బానిసత్వమే.

ఒక పర్యాయం రాజుగారు కారులో నన్ను కూర్చుండబెట్టుకొని శృంగవరపుకోటకు వేటకుగాను రాత్రిపూట ప్రయాణమైనారు. మార్గంలో చిరుతపులి ఒకటి పది నిమిషాల పాటు కారు ఎదుట రోడ్డు నడుమ నిలబడింది. అది కారుపైకి దుముకుతుందేమోనని భయపడినాను. కాని అలాటి ప్రమాదం జరుగలేదు. మరుసటి రోజు సాయంకాలం 4 గంటలకు వేట నిమిత్తం శృంగవరపుకోట సమీపంలోని అడవికి వెళ్లినాము. పులిని వేటాడి పట్టుకొనడమే రాజుగారి ఉద్దేశం. అందుకుగాను ఒక చెట్టుపై మంచెను తయారు చేయించి, చేతిలో తుపాకి పట్టుకొని అందులో కూర్చుండినారు. నేను కూడ ఏలాగో చెట్టు ఎక్కి వారి వెనుక కూర్చున్నాను. అనుకొన్న ప్రకారం ఆ పరిసరాలకు పులి రాలేదు. రాజుగారికి ఆశాభంగం కలిగి చెట్టు దిగడానికి సిద్ధపడ్డారు. కాని చెట్టు క్రింద ఒక పొడుగైన నాగుపాము తన పడగను విప్పుకొని చెట్టు చుట్టూ తిరగసాగింది. ఆ పరిస్థితులలో చెట్టును దిగడం ప్రమాదకరమే. కాని చీకటి పడడానికి ముందే అడవిలో నుండి బయటపడడం అవసరమని తోచింది. ఏమి చేయడానికీ సాధ్యంకాలేదు. 20 నిమిషాలైన తర్వాత నాగుపాము మాకు కనుపించకుండా వెళ్లిపోయింది. అప్పుడు ధైర్యం తెచ్చుకొని, చెట్టు దిగి బస చేరాము.

ఇంకొక పర్యాయం రాజుగారు అనంతగిరికి కారులో ప్రయాణమయ్యారు. వారే కారును నడపడం మామూలు. నేను యథాప్రకారం వారి వెనుక సీటులో కూర్చున్నాను. కొంతదూరం

వెళ్లిన తర్వాత వర్షం పడసాగింది. మార్గంలో ఒక చిన్న ఏరు వరదలతో బహువేగంగా ప్రవహిస్తున్నది. దానిని దాటే ప్రయత్నంలో కారు ప్రవాహంలో కొట్టుకొనిపోయే ప్రమాదం ఉన్నట్లు నదీ తీరంలోని ఆదివాసులు కొందరు హెచ్చరించి, మోకులతో కారును దాటించడానికి సిద్ధపడ్డారు. కాని రాజుగారు, వారు దాటించడానికి అంగీకరించలేదు. కారును ఏలాగో ప్రవాహంలో నడిపించి ఆవలి గట్టుకు తీసుకొని వెళ్ళారు. ఇది ప్రమాదంతో కూడిన చర్య అని నాకు అనిపించింది. కాని ప్రమాదాన్ని ఎదుర్కొనడమే క్షత్రియ లక్షణమని వారు భావించారు. ఏలాగో అటుతర్వాత అనంతగిరి చేరి ఒక రోజు అక్కడ గడిపి తిరిగి విజయనగరం చేరుకున్నాము.

వేరొక పర్యాయం భీమునిపట్టణం వెళ్లి ఒక మామూలు పడవలో కూర్చుండి రెండు మైళ్ళ దూరం సముద్రంలో ప్రయాణం చేశారు. నేను కూడ పడవలో వారి వెంట ఉన్నాను. రెండు మైళ్ళు వెళ్లిన తర్వాత బ్రహ్మాండమైన రెక్కచేపలు తరంగాల మధ్య సంచరించడం మామూలు. అవి పడవమీద పడి దానిని తిరగదోసే ప్రమాదం ఏర్పడింది. కాని అదృష్టవశాత్తున అలాటి ప్రమాదం సంభవించలేదు. మేము తిరిగి క్షేమంగా తీరాన్ని చేరుకొనగలిగాము.

ట్యూటరుగా నా కొలువు ఈలాగు పరిణమించింది. నేను వారికి చదువు చెప్పడంగాని, వారు నావద్ద చదువు నేర్చుకొనడంగాని జరగలేదు. ఒక పర్యాయం చదవదగిన రెండు చిన్న పుస్తకాల పేర్లను చెప్పమన్నారు. నేను అప్పుడే టాల్‌స్టాయ్ రచించిన కథల పుస్తకాన్ని, జిడ్డు కృష్ణమూర్తిగారి 'At the feet of the Master' అనే గ్రంథాన్ని చదివి ముగించాను. ఈ రెండు పుస్తకాలు చదవదగినవని చెప్పి, వాటిని వారికి ఇచ్చినాను. వారు వాటిని చదివినట్లు నా విశ్వాసము.

ఈవిధంగా 3, 4 సంవత్సరాలు నా కోట కొలువు సాగింది. నాకు నెల్లూరిలో ఏదో పని ఉన్నందున నాలుగు రోజులు సెలవు దయచేయవలసిందిగా 1924, ఆగస్టులో వారికి స్వయంగా నా అర్జీని ఇచ్చినాను. వారు నా అర్జీని చదువుకొని "నీకు సెలవు మంజూరు

చేస్తున్నాను. కాని కోటలో నీవు చేయవలసిన పని ఏదీ లేనందున ఇకమీదట నీవు మా కళాశాలలోని కార్యక్రమాన్ని మాత్రమే చేయవలెను. వ్యక్తిగతంగా నాకు చేస్తున్న సేవకు నీకు ఇస్తున్న అలవెన్సు జూలై 31 నుండి చెల్లింపబడదు "అని నా దరఖాస్తు పైన వ్రాసి దానిని నా చేతిలో పెట్టినారు. నేను కోరినది నాలుగు రోజుల సెలవు మాత్రమే. వారు నాకు శాశ్వతమైన సెలవు దయచేసినారు. ఇంతటితో నా కోట కొలువు ముగిసింది.

ఈ మధ్యకాలంలో జరిగిన ఇంకొక సంఘటనను గురించి ఇక్కడ చెప్పవలసి ఉన్నది. 1920 లో మహాత్మాగాంధీగారు భారతదేశానికి స్వాతంత్ర్యం లభించడానికి దౌర్జన్య రహితమైన సహాయనిరాకరణమే పటిష్ఠ సాధనమని భావించి, దానిని గురించి ప్రచారం చేయడానికి దక్షిణ భారతానికి వచ్చి రెండు రోజులు విజయనగరంలో గడిపారు. పార్కులో ఒక బహిరంగ సభలో వారి ఉద్యమాన్ని గురించి, అందులో రాట్నంపై నూలువడకడం, ఖద్దరు ధరించడం ప్రధాన భాగములనే విషయాన్ని గురించి గట్టిగా నొక్కి చెప్పినారు. నేను నా భార్య, పిల్లలతో కూడ ఆ సమావేశానికి వెళ్లి వారి ప్రసంగాన్ని శ్రద్ధతో విన్నాము. అప్పటినుంచి మా కుటుంబంలోనివా రందరం ఖద్దరు ధరించ సాగినాము. ఆనాడు సన్నపాటి ఖద్దరు లభించేది కాదు. గోనె సంచులలాంటి ముతక ఖద్దరే శరణ్యంగా ఉండేది. కాని దాని నాణ్యతతో నిమిత్తం లేకుండా ఖద్దరు ధరించేవార మయ్యాము. నా కుమార్తె లిద్దరు ముతక ఖద్దరు పరికిణీలను కట్టుకొనసాగారు. నాభార్య గర్భం ధరించి ఉండడంచేత నూలు వడకడాన్ని వెంటనే ప్రారంభించలేదు. ఖద్దరు మాత్రం ధరించేది. ప్రసవమైన తర్వాత నూలు వడకడం ప్రారంభించి స్వరాజ్యం వచ్చేవరకు దానిని నిర్విఘ్నంగా కొనసాగించింది. స్వరాజ్యం లభించిన తర్వాత దానిని మానివేయడంలో తప్పులేదని ఖద్దరు ధరించడం చాలా వరకు మానివేసింది. కాని నేను, నా పెద్దకుమార్తె, నా కుమా ళ్ళలో కొందరు ఈనాటి వరకు ఖద్దరు ధరించే వారంగా ఉన్నాము.

'రామాయణంలో పిడకల వేట్లాట' అన్నట్లు సమావేశం జరిగిన తర్వాత మరుసటిరోజున ట్రస్టీ కృష్ణమాచారిగారు నన్ను వారి బసకు పిలిపించి "కళాశాల అధ్యాపకులలో చాల అనుభవం గడించిన నీవు రాజద్రోహి అయిన గాంధీగారి సమావేశానికి వెళ్లడం చాలా తప్పు. ఇకమీదట నీవు అలాటి సమావేశాలకు వెళ్ళరాదు" అని హెచ్చరించారు. ఖద్దరు ధరించడాన్ని గురించి వారు ప్రస్తావన చేయలేదు.

1921 లో గాంధీగారు సహాయనిరాకరణ ఉద్యమాన్ని ప్రారంభించి, విద్యార్థు లందరు ప్రభుత్వ సహాయం పొందే విద్యాలయాలను బహిష్కరించవలసిందిగా ఆదేశించారు. దానిమేరకు విజయనగరం కళాశాల విద్యార్థులు కళాశాలను బహిష్కరించక పోయినా (కొందరు మాత్రం అలాగు చేశారు) సమ్మెలు సాగించారు. నేను కూడ ఉద్యోగాన్ని వదలుకొని ఉద్యమంలో చేరబోతున్నానని ఒక వదంతి బయలుదేరింది. దానికి కారణం ఆరోజులలో సహాయనిరాకరణ ఉద్యమంలో గొప్ప పాత్రను వహించిన బులుసు సాంబమూర్తిగారు, కాకినాడలో నాకు వారితో కలిగిన పరిచయాన్ని ఆధారం చేసుకొని, రెండు మూడు రోజులు నాకు అతిథిగా ఉండి, నన్ను ఉద్యమంలో చేరవలసిందిగాను, కాకినాడలో స్థాపింపబడిన జాతీయ కళాశాలకు ప్రిన్సిపాల్‌గా ఉండవలసిందిగాను నన్ను ప్రోత్సహించడమే. నేను వారి కోరికను మన్నించలేనివాడనైనాను. కాంగ్రెసుపట్ల, సహాయనిరాకరణం పట్ల నాకు గాఢమైన అభిమానం ఉండినా, ఉద్యమంలో పాల్గొని నా కుటుంబాన్ని కష్టాలపాలు చేయగల ధైర్యం లేకపోయింది. కాని వారు నాకు అతిథిగా ఉండడం అందరికీ తెలిసింది. అందుచేతనే వదంతులు బయలుదేరినవి. వాటిని పురస్కరించుకొని కళాశాల ప్రిన్సిపాల్ ఏచూరి నరసింహం పంతులుగారు ఈలాటి వదంతులలో ఎంతమాత్రం సత్యం ఉన్నదీ వెంటనే వారికి తెలియపరచవలసిందిగా నాకు ఒక ఉత్తరం వ్రాశారు. వదంతుల మూలంగా విద్యార్థులలో కూడ ఆందోళన బయలుదేరినట్లు నాకు తెలియపరచారు. వదంతులలో సత్యం లేదని వారికి నేను జవాబు వ్రాసినాను. కాని వారి సందేహం

నివర్తి కాలేదు. మురాతత్త్వాల ప్రభావంచేత వారు నాపట్ల అంతకుపూర్వమే ద్వేషాన్ని వహించి ఉండినారు. వారి సందేహం నివర్తికాకపోవడానికి ఇదే ప్రధానకారణం.

ఇది జరిగిన తర్వాత కొన్నిరోజులకు నా పెద్దకుమార్తె కంటి జబ్బుకు వైద్యం నిమిత్తం నేను, నా భార్య విశాఖపట్టణం వెళ్లినాము. అప్పుడు కొండా వెంకటప్పయ్య పంతులుగారు కూడ ప్రచారార్థం విశాఖపట్టణం వచ్చి ఉండి, సాంబమూర్తిగారి వలెనే నన్ను ఉద్యమంలో చేరవలసిందిగా ప్రోత్సహించారు. కాని సాంబమూర్తిగారి కోరికను నిరాకరించినట్లే వారి ప్రోత్సాహాన్ని నిరాకరించడం తప్పిందికాదు.

1921 లో మద్రాసు విశ్వవిద్యాలయంలో ఆర్థికశాఖలో సహాయక అధ్యాపకుని పదవికి అర్హతగలవారు దరఖాస్తులు పంపవలసిందిగా ఒక ప్రకటన చేసినారు. దానికి నేను దరఖాస్తు పంపినాను. ట్రస్టీ కృష్ణమాచారిగారు నా దరఖాస్తును బలపరస్తూ సర్వవిధాలా నేను ఆ పదవికి అర్హుడనని విశ్వవిద్యాలయాధికారులకు దానిని అందజేశారు. ఆనాడు అల్లాడి కృష్ణస్వామయ్య విశ్వవిద్యాలయ సిండికేటులో చాలా పలుకుబడి గల సభ్యులు. నా దరఖాస్తు విషయమై నాకు సహాయం చేయవలసిందిగా వారిని కోరాను. కాని 1920 లో అన్నామలై నగరంలోని కళాశాల ప్రిన్సిపాల్ పదవి సందర్భంలో నేను వారి కోరికను మన్నించని కారణంగా నాకు సహాయపడడం సాధ్యం కాదని తెలియపరచారు.

నేను విజయనగరంలో ఉన్నకాలంలో నా జీవితంపై గొప్ప ప్రభావాన్ని వహించిన ఇంకొక విషయాన్నిగురించి ప్రస్తావించడం అవసరం. అది నేను, నా భార్య దివ్యజ్ఞాన సమాజంలో సభ్యులు కావడం.

దివ్యజ్ఞాన ప్రచారకులలో ప్రఖ్యాతి గాంచిన చిట్టమూరు రామయ్యగారు 1915-1916 ప్రాంతాన విజయనగరం వచ్చి ఐదారు రోజులు నాకు అతిథిగా ఉండినారు. వారు నా మామగారైన అల్లాడి నారాయణయ్యగారికి సన్నిహితులు. ఇద్దరు దివ్యజ్ఞాన సమాజంలో సభ్యులు కావడం దీనికికారణం. రామయ్యగారి

ఉపన్యాసాలకు కావలసిన ఏర్పాటు లన్నింటినీ నేనే చేసినాను. వారు చక్కని తెలుగులో దివ్యజ్ఞానాన్ని సామాన్యులకు అర్థం అయ్యేటట్లు ఉపన్యసించగలవారు. కొంతకాలం కడపలోని ఉన్నతపాఠశాలకు హెడ్‌మాస్టరుగా ఉండి విద్యార్థులకు స్పష్టంగా బోధించే అనుభవాన్ని సంపాదించడం దీనికి కారణం కావచ్చు. వీరు దివ్యజ్ఞానమునకు సంబంధించిన గ్రంథాలను మాత్రమేగాక భగవద్గీతవంటి మన ప్రాచీనగ్రంథాలను క్షుణ్ణంగా పరిశీలించిన వారు. వీరు విజయనగరంలో బహిరంగ సభలలో ఉపన్యాసాలు చేయడంతోపాటు నగరంలోని ప్రముఖులను కలుసుకొని వారితో చర్చలు సాగించారు. వీరి ఉపన్యాసాలను, చర్చలను వినగల అవకాశం నా భార్యకు, నాకు లభించింది. దాని ఫలితంగా మేము దివ్యజ్ఞాన సమాజంలో సభ్యులమై ఈనాటివరకు సభ్యులుగా ఉంటున్నాము.

ఈ సభ్యత్వం మూలంగా నాకు దివ్యజ్ఞాన సమాజంతో కొంత పరిచయం లభించింది. మానవ జీవితంలో ఒక్కొక్కప్పుడు సుఖాన్ని, ఇంకొకప్పుడు దుఃఖాన్ని అనుభవించడం తప్పదు. మంచి జరిగినప్పుడు పొంగిపోవడం, చెడు జరిగినప్పుడు క్రుంగి పోవడం మనశ్శాంతికి భంగం కలిగించి మానవుని చైతన్య హీనునిగా చేస్తుంది. ఈలాగుగాక, ఏది జరిగినా అది కర్మఫల మనే విశ్వాసంతో జీవితాన్ని సాగించడమే ప్రాజ్ఞత. ఈ గొప్ప సత్యాన్ని దివ్యజ్ఞాన సమాజ సభ్యత్వం మూలంగా నేను గ్రహించాను. ఉద్రేకానికి, ఆగ్రహానికి లోనుగాక ఇతరులపట్ల నెమ్మదిగాను, స్నేహభావంతోను ప్రవర్తించగలవాడనయ్యాను. ఈలాంటి సత్యాలు భగవద్గీతాది మన ప్రాచీన గ్రంథాలలో ఉన్నవిగదా, దివ్యజ్ఞాన సమాజంలో ఉన్న విశేషం ఏమిటి అని కొందరు ప్రశ్నించవచ్చు. కాని నామట్టుకు నాకు దివ్యజ్ఞాన సమాజంలో సభ్యుడనైన తర్వాతనే ఈ సత్యాల తోటి పరిచయం సంపాదించి వాటి విలువలను గ్రహించగలిగాను. అందుచేతనే ఆ సభ్యత్వం నా జ్ఞాపకాలలో ఎనలేని ప్రాధాన్యాన్ని వహిస్తున్నది.

జీవితంలో నాకు అనేకులు మిత్రులైనారు. వారిలో కొందరు ప్రజాజీవితంలో ప్రఖ్యాతి గాంచినవారు. కాని దివ్యజ్ఞాన సమాజ

సభ్యుల మైత్రి ఒక అనిర్వచనీయమైన ఆప్యాయతతో కూడు కొన్నట్టిది. అది కృష్ణార్జునుల మధ్య ఏర్పడిన ప్రేమ వంటిది. సోదరుల మధ్య ఉన్న ప్రేమకంటె గొప్పది. సమాజంలో సభ్యుడనైన తర్వాత సమాజ అధ్యక్ష పదవిని అలంకరించిన అనీబిసెంటు, జినరాజదాసా, శ్రీరాం మొదలైన వారికిని, దివ్యజ్ఞాన ప్రచారంలో ప్రముఖ పాత్రను వహించిన న్యాయమూర్తి సదాశివయ్యర్, తదితరులకు ఆతిథ్యం ఇవ్వగల గౌరవం నా భార్యకు, నాకు కలిగింది.

విజయనగరం కళాశాలలో ముతాతత్వాలు పెరగడం మూలంగా నాకు కొంత విసుకు కలిగింది. ఏదైన మార్పు ఉండడం అవసరమని భావించాను. ఇంతేగాక పరిశోధనకు కావలసిన గ్రంథాలు మొదలైనవి అక్కడ లభించని కారణంగా, పరిశోధనలో నాకు ఆసక్తి ఉండినా, అది కార్యరూపం ధరించలేదు. అందుచేత మద్రాసుకు వెళ్లి కొంతకాలం పరిశోధన కార్యక్రమం చేపట్టడం ఉచితమనే నిర్ణయానికి వచ్చి, అందు నిమిత్తం నాకు ఒక సంవత్సరం సెలవు మంజూరు చేయవలసిందిగా రాజుగారికి అర్జీ పెట్టుకొన్నాను. వారికి నాపట్ల ఎప్పుడు సదభిప్రాయమే ఉండేది. అందుచేత వారు నాకు నా జీతంలో సగం భాగం, అనగా 150 రూపాయలు, మీద సెలవు దయచేశారు. అటుతర్వాత వారు కుటుంబ సమేతంగా ఇంగ్లండుకు వెళ్లారు. మద్రాసులో 150 రూపాయలతో కుటుంబాన్ని పోషిస్తూ జీవించడం కష్టసాధ్యమని వారికి ఒక ఉత్తరం వ్రాశాను. దానికి జవాబుగా వారు నా సెలవుకాలం అలవెన్సును 250 రూపాయలకు పెంచారు.

దీనిని ఆధారంచేసుకొని కుటుంబ సహితంగా మద్రాసు ట్రిప్లికేన్ అక్బరుసాహెబు వీధిలో ఒక ఇల్లు అద్దెకుతీసుకొన్నాను. నా ఇద్దరు కుమార్తెలను లేడీ విలింగ్డన్ ట్రెయినింగు కాలేజిలో విద్యార్థులుగా చేర్చాను. ఆరోజులలో పరిశోధనను ప్రోత్సహించే నిమిత్తం అర్హతగల పరిశోధకులకు నెలకు రు 150 ల విద్యార్థి వేతనాన్ని మద్రాసు విశ్వవిద్యాలయంవారు ఇచ్చేవారు. దానిని నాకు ఇయ్యవలసిందిగా ఒక అర్జీని అధికారులకు సమర్పించి, అప్పట్లో విశ్వవిద్యాలయానికి ఉపాధ్యక్షులుగా ఉండిన రఘుపతి

వెంకటరత్నం నాయుడుగారిని సందర్శించగా వారు నాకు సహాయం చేయడాని కంగీకరించి, ఆర్థిక శాఖలో ప్రధానాధ్యాపకులుగ నుండిన డాక్టర్ మత్తాయిని కలుసుకోవలసిందిగా సలహా ఇచ్చారు. నేను వారిని కలుసుకొని, విజయనగరం సంస్థానంలోని గ్రామాల ఆర్థిక పరిస్థితుల గురించి నేను చేసిన పరిశోధనలను వారి దృష్టికి తెచ్చినాను. ఉపకార వేతనానికి నేను అర్హుడనని వారు భావించి నాకు సహాయంచేయడానికి అంగీకరించారు. అధికారులలో ప్రముఖులైనవా రిద్దరు సహాయపడిన కారణంగా ఉపకార వేతనం నాకు లభించింది. ఈవిధంగా నెలకు 400 రూపాయలు ఆదాయంతో కుటుంబ పోషణ చేసుకొంటూ మద్రాసులో నేను తలపెట్టిన పరిశోధనను సాగించాను.

నేను ఎన్నుకొన్న పరిశోధన విషయం "మద్రాసు రాష్ట్రంలో స్థానిక పన్నుల ప్రారంభదశ" (Beginnings of Local Taxation in the Madras Presidency). దీనిని గురించి అంతకు పూర్వం ఎవరూ పరిశోధన గావించలేదు. ఈ పరిశోధన నిమిత్తం నేను రోజూ సెక్రటేరియట్ గ్రంథాలయానికి వెళ్ళేవాడిని. దీనికి సంబంధించిన గ్రంథాలు, నివేదికలు మొదలైనవి నాకు లభించినవి. ఒకనాడు అకస్మాత్తుగా గ్రంథాలయంలో ఒక మూలలో పడిపోయి వున్న కొన్ని గ్రంథాలు నా దృష్టిని ఆకర్షించినవి. వాటిలో ఒకటి Madras Towns Improvement Act కు సంబంధించి నట్టిది. నా పరిశోధనకు ఇది చాలా సహాయపడింది. స్థానిక చట్టాలను గురించి, పన్నులను గురించి జిల్లా కలెక్టర్లు ప్రభుత్వానికి పంపిన నివేదికలు ఇందులో ఉండినవి. దీని ప్రాధాన్యాన్ని గ్రంథాలయాధికారులు గుర్తించినవారు కాకపోవడంచేత వానిని ఒక మూలలో పడవేశారు. అదృష్టవశాత్తు దానిని నేను చూడడం, తర్వాత పూర్తిగా చదవడం జరిగింది. నా పరిశోధనలో అది నాకు చాలా సహాయ పడింది.

ఇదిగాక నేను అప్పుడప్పుడు మద్రాసు రికార్డు ఆఫీసుకు వెళ్ళి అక్కడి రికార్డులను పరిశోధించినాను. వీటి అన్నిటి ఫలితంగా సంవత్సరాంతానికి పరిశోధన విషయాన్నిగురించి ఒక నివేదికను తయారుచేసి విశ్వవిద్యాలయాధికారులకు సమర్పించాను. అంతటితో

నా సంవత్సరం సెలవు గడిచిపోయింది. నేను మద్రాసుకు వచ్చిన కార్యక్రమం ఫలప్రదమైంది. 1926 జూలైలో విజయనగరం వచ్చి కళాశాలలో యథాప్రకారం నా అధ్యాపకత్వాన్ని సాగించాను. అప్పటికి ఏచూరి నరసింహంపంతులుగారు సంస్థానానికి దివాన్ అయినారు. న్యాయతః ప్రిన్సిపాల్ పదవి నాకు లభించవలసింది. కాని అలాగు జరుగలేదు. ప్రిన్సిపాల్‌గా వుండిన కాలంలో నరసింహంపంతులుగారు ముఠా తత్వాలకు లోబడి, నాపట్ల ద్వేషం వహించడం దీనికి కారణం. దివాన్‌గా నన్ను కాదని కాళ్ళకూరి జానకిరావుగారిని ప్రిన్సిపాల్‌గా నియమించారు.

ఈలాగు ఒక సంవత్సరం గడిచిపోయింది. 1927 జూలైలో రాజుగారు నన్ను దివాన్‌గా నియమించడంతో నా జీవితంలో ఇంకొక అధ్యాయం ప్రారంభమైంది.

1927 మే, జూన్ వేసవి సెలవులలో నేను కుటుంబంతో నెల్లూరులో మా పూర్వికుల మామిడిపూడి గ్రామంలో ఉండుటకు నిశ్చయించుకొన్నాను. ఈ గ్రామంలో భాగస్థులుగా మాకు ఉన్న భాగాన్ని కొన్ని సంవత్సరాలక్రిందట మా నాయనగారు అమ్మివేశారు. కాని అటుతర్వాత మా జ్ఞాతులలో ఒక రైతు మరణించడంచేత ఆమె వశంలో ఉండిన మాగాణి, మెట్ట, తోట, ఇల్లు వారసత్వంద్వారా మా నాయనగారికి లభించింది. అందుచేత మేము తిరిగి ఆ గ్రామంలో భాగస్వాములమయ్యాము. మా భూములను కోట లక్ష్మీనరసారెడ్డిగారు మక్తాపద్ధతిని సేద్యం చేసి, ఏటేట సక్రమంగా మక్తాను చెల్లించేవారు. ఈ పరిస్థితిలో నేను మామిడిపూడి గ్రామానికి మే నెలలో వెళ్లినాను.

ఆరోజులలో నగరవాసానికి అలవాటు పడిన వారికి గ్రామవాసం కొంత కష్టంగా ఉండేది. గ్రామాలలో పాలు, పెరుగు అమ్మేవారు ఎవరూ లేరు. పాడి కలవారు వారి వారి శక్తికొద్దీ, వాటిని ఉచితంగా ఇతరులకు ఇవ్వడం మామూలు. వాటిని అమ్మడం ఒక పాపకార్యంగా వారు భావించేవారు. (గొల్లలకు ఇది కులవృత్తి కావడంచేత వారు మాత్రమే వీటిని అమ్మేవారు. కాని వారు అన్ని గ్రామాలలో ఉండేవారు కారు. ఉన్నవారు తరచుగా

మేకపాలను మాత్రమే అమ్మకం జరిగేది.) కాని మా రైతు లక్ష్మీ నరసారెడ్డి మాకు కావలసిన పాలు, పెరుగు, కూరగాయలు ఇస్తూ ఉండడం చేత మాకు ఏలాటి కష్టము ఉండేది కాదు. సుఖంగానే కాలక్షేపం చేయగలిగాము.

నేను రోజూ మధ్యాహ్నం భోజనం చేసిన తర్వాత నా భార్యకు, పిల్లలకు మహాభారతాన్ని చదివి అర్థం చెప్పడం నా కార్యక్రమం. అంతకుపూర్వం 1925 లో వారికి రాత్రిపూట భాగవతం చదివి అర్థం చెప్తూ ఉండే వాడిని.

ఈవిధంగా గ్రామంలో వేసవి సెలవులను గడుపుతూ ఉండగా, అప్పట్లో ఊటీలో ఉన్న విజయనగరంరాజుగారి వద్ద నుండి, "ఊటీ చాలా చల్లగా ఉన్నది. నీవు ఇక్కడికి వచ్చి కొంతకాలం నాతో గడపవలసిందిగా కోరుతున్నాను. ఈ ఉత్తరం అందగానే నీవు బయలుదేరేది. నీవు ఇక్కడికి వచ్చిన తర్వాత ఖర్చుల నన్నింటిని నేను చెల్లిస్తాను" అని మే 26–వ తేదీన వ్రాసిన ఉత్తరం అందినది. వెంటనే నేను బయలుదేరి జూన్ 4–వ తేదీన ఊటీ చేరి, వారిని కలుసుకొన్నాను. వారు నా యొక్క క్షేమాలను గురించి తెలుసుకొని "నేను నిన్ను నా సంస్థానానికి దివాన్‌గా నియమించ కోరుతున్నాను. అది నీకు సమ్మతమేనా" అని అడిగారు. రాజుల కొలువు ఏలాటిదో స్వానుభవంవల్ల నాకు తెలిసినదే. అందుచేత నా అభిప్రాయాన్ని తెలియపరచడానికి కొన్ని గంటల వ్యవధి ఇయ్యవలసిందిగా కోరాను. నేను అప్పుడు వారి కళాశాలలో ఉద్యోగిగా ఉన్నాను. వారి కోరికను మన్నించని పక్షంలో నా ఉద్యోగం ఊడిపోవడం తప్పదు. అందుచేత నేను దానికి అంగీకరించాను.

వారు వెంటనే నెలకు 700 రూపాయల జీతంమీద నన్ను దివాన్‌గా నియమిస్తూ ఆర్డరును నా చేతికే ఇచ్చారు. దానితో నేను విజయనగరం వెళ్ళి కొత్త పదవిలో చేరాను.

దివాన్‌గా నాకు ఏలాటి స్వాతంత్ర్యమూ లేదు. ప్రధాన విషయా లన్నింటిని గురించి నాకు తోచిన సూచనలను ఊటీలో ఉన్న రాజుగారికి పంపిస్తూ ఉండేవాడిని. సాధారణంగా వాటికి వారు అంగీకరించేవారు.

నా హయాంలో రెండు మూడు విషయాల గురించి నేను ప్రత్యేక శ్రద్ధవహించాను. ఆరోజులలో సంస్థానములోని బంట్రోతుల జీతం 5 లేక 6 రూపాయలకు మించి ఉండేదికాదు. వారందరు జీతాన్ని పెంచవలసిందిగా కోరారు. అది సహేతుకమనే భావంతో వారందరికి 1 రూపాయి అదనపు జీతాన్ని ఇయ్యవలసిందిగా రాజావారికి సూచించినాను. దానికి వారు అంగీకరించారు. తమ జీతాన్ని పెంచిన దివాన్‌గా వారందరు నాపట్ల కృతజ్ఞు లయ్యారు.

మునిసుబ్బ నరసయ్య అనేవారు సంస్థానంలో చాలాకాలం అటవీశాఖలో ప్రధానాధికారిగా ఉండి రెండు మూడు సంవత్సరాల క్రిందట పదవీ విరమణ చేసినారు. కాని ఏకారణంచేతనో రూల్సు ప్రకారం వారికి ముట్టవలసిన పించన్ మంజూరు కాలేదు. వారు అధికారులతో అనేక ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపారు. కాని లాభం లేకపోయింది. అందుచేత వారు సంస్థానముపై దావా చేశారు. సాధారణంగా కోర్టులో దావాలు పరిష్కారం కావడానికి సంవత్సరాలు పట్టేవి. ఇది బ్రిటిషువారు ప్రవేశపెట్టిన న్యాయవిచారణ పద్ధతికి ఒక ప్రధాన లక్షణం. ఇంతేగాక అది చాలా వ్యయంతో కూడుకొన్నది. నరసయ్యగారితోను, వారి కుటుంబంతోను నాకు చాలాకాలంగా పరిచయం ఉండేది. దానిని పురస్కరించుకొని వారు నా వద్దకు వచ్చి ఏదో ఒక రాజీపద్ధతి మీద వారి సమస్యను పరిష్కరించవలసిందిగా కోరారు. పించన్ పాత బకాయిని వారు మానుకొనిన పక్షంలో 1927 నుండి వారికి పించన్ మంజూరుచేయవలసిందిగా రాజాగారికి సిఫారసు చేయగలనని చెప్పాను. దానికి వారు అంగీకరించారు. ఆ మేరకు నేను రాజుగారికి సిఫారసు చేయగా వారు కూడ దీనిని ఆమోదించారు. నేను సాధించిన పనులలో ఇది రెండవది.

సంస్థాన ఉద్యోగులలో ఎవరూ ఆనాడు కారులో ప్రయాణం చేసే అవకాశం ఉండేది కాదు. ఆ హక్కు రాజకుటుంబానికి చెందినవారికి మాత్రమే వుండేది. నాకు ఒక గుర్రపు కోచి బండిని ఇచ్చారు. కాని సంస్థానంలో పర్యటించడానికి అది ఉపయోగపడేది కాదు. అందుచేత నేనే ఏదో ఏర్పాటులు

చేసుకొని అప్పుడప్పుడు గ్రామ ప్రాంతాలకు వెళ్ళేవాడిని. ఆనాడు సంస్థానంలోని జలాధారాలు మరమ్మత్తు లేని కారణంగా రైతులకు సకాలంలో వ్యవసాయానికి నీళ్ళు అందేవికావు. దానిని నేను గుర్తించి వాటి మరామత్తులకై కొంత సొమ్మును కేటాయించాను. ఇది రైతులకు చాలా ప్రయోజనకారి అయింది.

సంస్థానంలోని ఇనాం భూములను గురించి చాలాకాలాన నుండి ప్రభుత్వంతో ఒక తగాదా వుండేది. దానిని ఏవిధంగానైనా పరిష్కరించడం అవసరమని భావించాను. అందునిమిత్తం మద్రాసులో సంస్థానం న్యాయవాదిగా వుండిన యస్. శ్రీనివాస అయ్యంగారి అభిప్రాయాన్నేగాక, సుప్రసిద్ధ న్యాయవాది అయిన అల్లాడి కృష్ణస్వామయ్యగారి అభిప్రాయాన్ని కూడ గ్రహించి, వాటిని ఆధారం చేసుకొని జిల్లాకలెక్టరును రెండు మూడు పర్యాయాలు కలుసుకొని, ఈ విషయాన్ని గురించి చర్చించాను. కాని చర్చలు పూర్తికాకముందే దివాన్ పదవినుండి నేను తొలగింపబడినందున. నేను తలపెట్టిన పని ఫలప్రదం కాలేదు.

ఇవి తప్ప దివాన్‌గా నేను సాధించగలిగింది ఏదీ లేదనే చెప్పవలసి వుంటుంది. దైనందిన కార్యక్రమం, భూమి శిస్తు వసూళ్ళు సక్రమంగా జరుగుటకు చర్యలు తీసుకొన్నాను గాని ఇందులో విశిష్టత ఏదీ లేదు.

నా దివాన్ ఉద్యోగకాలంలో ఒక ప్రధానమైన సంఘటన జరిగింది. కాని దానిని గురించి వివరించడం ఔచిత్యానికి భంగకరం కాగలదనే కారణాన ఆ పనిని మానుకొన్నాను.

ఈలాగు పది నెలలు గడచినవి. అటుతర్వాత 1928 మార్చి 29 తేదీన పిడుగు పడినట్లు రాజుగారి వద్దనుండి (అప్పుడు వారు విశాఖపట్టణంలో తాత్కాలికంగా ఉండేవారు) నన్ను దివాన్ పదవినుండి తొలిగిస్తూ వారు వ్రాసిన ఒక ఉత్తరాన్ని బంట్రోతు తెచ్చాడు. అందులో ఈక్రిందివిధంగా రాజుగారు వ్రాశారు :

"నేను నిన్ను దివాన్ పదవినుండి విరమింపజేయుచున్నా నని తెలియపరచవలసి వచ్చినందుకు చాలా విచారిస్తున్నాను. నీవు ఏచూరి నరసింహంగారికి చార్జి ఒప్పగించు. నీవు ఇంకా పనిచేయ గల స్థితిలో ఉన్నట్లు నేను భావించడంచేత నీవు నీ స్వస్థలానికి వెళ్లి పోయి అక్కడ ఏదైనా ఉద్యోగానికి ప్రయత్నం చెయ్యి. నీ విర మణను గురించి తర్వాత నేను నీకు తెలియపరుస్తాను" అని వారి మామూలు పద్ధతి ప్రకారం ఈ ఉత్తరం వ్రాసి బంట్రోతుద్వారా దానిని కవరులోకూడ పెట్టకుండా నాకు పంపినారు. వాడు దానిని అందరికీ చూపిస్తూ ఉదయం పది గంటలకు నాకు అందజేశాడు. నా జీవితంలో ఎంతో ప్రాధాన్యం వహించిన ఈ విషయం ప్రపం చానికంతా తెలిసిన తర్వాతనే నాకు తెలిసింది. 10 నెలల దివాన్‌గిరి ఈనాటితో ముగిసింది.

ఈ వార్త రాజుగారి తల్లికి తెలిసినవెంటనే "నీవు విశాఖ పట్టణం చిరంజీవిని (రాజుగారిని ఎప్పుడూ ఆమె ఈవిధంగా పేర్కొనడం మామూలు) కలుసుకోదలచిన పక్షంలో నేను నా కారును ఇస్తాను. అందులో నీవు వెళ్ళిరావచ్చు" నని కబురు పంపారు. నేను సాయంకాలం 3 గంటలకు బయలుదేరి, విశాఖ పట్టణం వెళ్లి వెంటనే రాజుగారి బసనుచేరి, నా రాకను తెలియ పరచాను. వారు స్వయంగా బయటికి వచ్చి "వెంకటరంగయ్యా, నేను నీ విరమణను గురించి తొందరపడి ఆర్డరు వేసినాను. ఆర్డరు వేసిన తర్వాత దానిని రద్దుచేయడం నాకు సమ్మతంకాదు. నీవు ఏమీ అనుకోవద్దు. నీకు అనుకూలంగా నేను రెండు మూడు రోజులలో తిరిగీ వ్రాస్తాను" అనిచెప్పి నన్ను పంపివేశారు.

రెండు మూడు రోజులు నేను వేచి ఉండినాను. కాని వారి వద్దనుండి ఉత్తరం రాలేదు. అప్పుడు నేను వారి మాటలను జ్ఞాపకంచేస్తూ ఒక ఉత్తరం వ్రాశాను. దానికి జవాబుగా 5-4-1928 న వారు ఈ క్రిందివిధంగా ఆర్డరు వేసినట్లు నాకు ఉత్తరం వచ్చింది:

నెలకు 200 రూపాయల అలవెన్సుతో 30-3-'28 నుండి వెంకటరంగయ్యను విరమించడమైనది. ఇదిగాక వారికి 5000 రూపాయలు చెల్లించడమౌతుంది.

ఇదీ బాగానే వున్నట్లు భావించాను. కాని నన్ను పదవి నుండి విరమించడం రాజుగారి తల్లి లలితకుమారి గారికి ఎక్కువ బాధను కలిగించింది. నా భార్యా, నేను ఆదర్శ దంపతులమని, పార్వతీ పరమేశ్వరులవంటివారమని, మాకు ఏలాటి అపచారం జరిగినా రాజకుటుంబానికి అది ప్రమాదకరంగా పరిణమించగలదని వారు భావించారు. ఇది మూఢనమ్మకంగా కనిపించవచ్చు. కాని ఈలాటి నమ్మకాలు వుండడంచేతనే అనేకులు న్యాయానికి, ధర్మానికి కట్టుబడడం జరుగుతూ వుంది. ప్రతిసమాజంలోను ప్రజలు ఏవో కొన్ని నమ్మకాలను ఆధారం చేసుకొని జీవిస్తారు. ఇది తప్పదు. విజ్ఞానశాస్త్రము, హేతువాదము అభివృద్ధి గాంచిన పాశ్చాత్యదేశాలలో కూడా ఎన్నో మూఢనమ్మకాలు వున్నవి. మానవాళి విముక్తికి విజ్ఞానశాస్త్రం ఏకైక సాధనమనేది కూడ మూఢనమ్మకమే. విజ్ఞానశాస్త్రాభివృద్ధి అణ్వస్త్రాలకు దారి తీసినదని, ఈ అస్త్రాలు మానవాళి మనుగడకే ముప్పు తెచ్చి పెట్టేవని రెండవ ప్రపంచయుద్ధం స్పష్టం చేసింది. ఈలాగే కమ్యూనిస్టు దేశాలలో మార్క్సు 150 సంవత్సరాల క్రిందట ఆనాటి పరిస్థితులను ఆధారం చేసుకొని ప్రతిపాదించిన సిద్ధాంతాలపట్ల మూఢనమ్మకం ప్రాబల్యం గాంచి వుంది.

మహారాణిగారికి పైన చెప్పిన మూఢనమ్మకం వుండడం చేత నా భార్యను పిలిపించి, "మీకు అపచారం జరిగిన మాట వాస్తవమే. కాని మీరు ఎన్నడు కూడ మా కుటుంబ శ్రేయస్సును కోరేవారుగా ఉండవలెను. నీకేమైనా కోరిక ఉంటే చెప్పు. దానిని నేను తీరుస్తాను" అని చెప్పారు. నా భార్య, "మీ అనుగ్రహం ఉంటే చాలు. నాకు ఏలాటి కోరికా లేదు" అని జవాబు చెప్పింది. అయినా మరుసటిరోజు మహారాణిగారు నా భార్యకు 2000 రూపాయలు బహుమానంగా ఇచ్చారు.

రాజుగారికి కూడా నాపట్ల గౌరవాభిమానాలు లేకపోలేదు. వారు ఉద్యోగాన నుండి నన్ను విరమించినందుకు విచారం వెలిపుచ్చారని ఇదివరకే చెప్పినాను. ఎవరో నాపైన ఏవో చాడీలు చెప్పడం నా విరమణకు కారణమని నాకు సందేహము

కలిగించింది. కొన్ని సంవత్సరాలు గడిచిన తర్వాత నేను ఏదో పనిమీద విజయనగరం వెళ్ళినప్పుడు కోటలో రాజుగారిని కలుసుకొనగా వారి మాటలను బట్టి పై సందేహం నిరాధారం కాదని నేను ఊహించాను. ఇదిగాక నేను నెల్లూరు కళాశాలకు ప్రిన్సిపాల్‌గా ఉన్న కాలంలో దివాన్ ఏచూరు నరసింహంగారు "మీకు ఇష్టం ఉంటే మీరు తిరిగి విజయనగరం కళాశాలలో మీ అధ్యాపకత్వంలో చేరవచ్చును" అని ఒక ఉత్తరం రాజుగారి ఆదేశానుసారం వ్రాశారు. నా విరమణకు ఏదో తాత్కాలిక కారణం మాత్రమే నని దీనినుండి కూడ స్పష్టం అవుతున్నది. కాని దివాన్‌గారి సూచనను నేను నిరాకరించాను. రాజుల కొలువు ప్రమాదకరమన్న భావం స్వానుభవంవల్ల నాలో లోతుగా నాటుకొన్నది.

ప్రపంచంలో ఏలాటి బాధ్యతా లేక ఐశ్వర్యాన్ని, అధికారాన్ని అనుభవించే అవకాశంగల వారందరు విజయనగరం రాజుగారివలెనే ప్రవర్తిస్తారు. వారి ఐశ్వర్యంగాని, అధికారంగాని కష్టపడి సంపాదించినట్టివి కావు. ఆనాటి పరిపాలన పద్ధతిలో జమీందార్లకు ఒక ప్రత్యేకస్థానం ఉండేది. జమీందార్ల సహాయం బ్రిటిషువారికి అవసరమైన కారణంగా వారిని అదుపులో పెట్టడానికి వారు ఏలాటి ప్రయత్నం చేయలేదు. అందుచేతనే స్వాతంత్ర్యోద్యమం తీవ్రరూపం ధరించిన కాలంలో జమీందారీ విధానాన్ని రద్దుచేయడం అవసరమని నాయకులలో అనేకులు గ్రహించారు. ఇంతేగాక ధనికులూ, దరిద్రులు మధ్య విపరీతమైన తారతమ్యాలు ఉండడం న్యాయసమ్మతం ఏనాటికీ కాజాలదనే భావం దేశంలో వ్యాపించింది. అందుచేతనే దేశానికి స్వాతంత్ర్యం లభించిన వెంటనే జమీందారీలు రద్దుచేయబడినవి.

రాజుగారు నాకు దయచేసిన 200 రూపాయల అలవెన్సును కొన్నిసంవత్సరాల పాటు సక్రమంగా చెల్లించారు. తర్వాత ఖజానాలో సొమ్ము లేదనే కారణంగా దానిని బకాయిపెట్టారు. తర్వాత కొంతకాలానికి జమీందారీ పరిపాలన తృప్తికరంగా లేదని ప్రభుత్వం రాజుగారి అధికారాన్ని తాత్కాలికంగా తొలగించి, జమీందారీని కోర్టు ఆఫ్ వార్డ్సు (Court of wards) అనే

ప్రభుత్వశాఖ ఆధీనంలోకి తెచ్చి, సంస్థానాన్ని పాలించడానికి ఒక కలెక్టరును నియమించారు. ఇతడు సత్యనాథన్ అనేవాడు. ఐ. సి. యస్. (I. C. S.) వర్గానికి చెందినవాడు. ఇతడు ప్రథమంలో ఖజానాలో సొమ్ము లేదనీ, సొమ్ము జతపడగానే బకాయితో సహా నా పింఛన్ చెల్లింపబడగలదనీ చెప్తూ వచ్చాడు. తర్వాత నాకు పింఛన్ ఇయ్యవలసిన అవసరమే లేదని ఆర్డరు వేశారు. నాకు ఆనాడు ఆంధ్ర విశ్వవిద్యాలయం నుంచి నెల నెలా 500 రూపాయలు ముట్టుతూ ఉన్నదని, దానితో నేను సుఖంగా కాలక్షేపం చేసే అవకాశం ఉన్నదని ఈ చర్యకు కారణంగా సూచించాడు. I. C. S. కు చెందినవారు నెలకు 2000, 3000 రూపాయలు సంపాదిస్తున్నారని, 1935 రాజ్యాంగ చట్టాన్ని గురించి చర్చలు జరుగుచుండిన కాలంలో తమ జీతభత్యాలకు, స్థిరత్వానికి, పింఛన్లకు ఏలాటి ప్రమాదం ఏర్పడకుండా ఉండేటట్లు ఆ చట్టాన్ని రూపొందించారని, ఆలాటివారు 200 రూపాయల పింఛన్‌ను రద్దు చేయడం ఆశ్చర్యకరంగా ఉన్నదని, నాకు ఈ విషయంలో న్యాయం చేకూర్చడం ప్రభుత్వానికి విధి అని నేను కోర్టు ఆఫ్ వార్డ్సు వారికి అపీలు పెట్టుకొన్నాను. వారేదో ఆలోచించినట్లు నటించి, సంస్థానంలో నా ఉద్యోగంకాలం 10½ సంవత్సరాలు మాత్రమే అని (వాస్తవంగా నాది 15 సంవత్సరాల సర్వీసు) ఏదో లెక్కలను తయారుచేసి, రూల్సు ప్రకారం నాకు ముట్టవలసిన పింఛన్ 60, 50 రూపాయలు మాత్రమే అని, సత్యనాథన్ గారి ఆర్డరును రద్దుచేసి, నా పింఛన్‌ను 60 - 50 రూపాయలకు తగ్గించారు. 1939 లో క్రొత్త రాజ్యాంగ చట్ట ఫలితంగా మద్రాసులో కాంగ్రెస్ ప్రభుత్వం ఏర్పడింది. టంగుటూరు ప్రకాశం పంతులుగారు రివిన్యూశాఖకు మంత్రి అయ్యారు. వారితో నాకు కొంత పరిచయం ఉండేది. వారికి నేను అపీలు చేసుకొన్నాను. 60 - 50 రూపాయలకు బదులుగా నాకు 100 రూపాయల పింఛన్ చెల్లించవలసిందిగా ఆర్డరు చేశారు. జమీందారీలు రద్దు కావడంతో సంస్థానాలు ఇస్తూ ఉన్న పింఛన్‌ను ఆపివేశారు. ఆసందర్భంలో జమీందారీ పింఛన్‌దార్లు, ఇది చాలా అన్యాయమనీ, అనేక మహజర్లు పెట్టుకొని, కొంత ఆందోళన జరిపారు. దానిమూలంగా పింఛన్‌లు చెల్లించడమే

న్యాయమనే నిర్ణయానికి వచ్చారు. దాని ఫలితంగా నాకు ఇప్పటివరకు నెలకు 100 రూపాయల పింఛన్ చెల్లింపబడు తున్నది. వేలాది రూపాయల జీతాన్ని పుచ్చుకొనేవారు అంతటి జీతం కూడ చాలదనీ, దానిని పెంచవలసిందిగా ఆందోళన చేసేవారు. రెండువందల రూపాయల పింఛన్ విషయంలో ఈలాగు ప్రవర్తించడంలో ఏలాటి న్యాయం లేదు. అందరిలోను స్వార్థ పరత్వం ఒక ప్రధాన లక్షణం. "ఇతరులు నీ పట్ల ఏలాగు ప్రవర్తించవలెనని నీవు కోరుతావో ఆలాగే ఇతరులపట్ల నీవు ప్రవర్తించడం విధి" అని ఒక తత్త్వవేత్త చెప్పాడు. కాని వాస్తవ ప్రపంచంలో అందరి ప్రవర్తన దీనికి చాల విరుద్ధంగా ఉన్నది.

విజయనగరంలో నేను వుండిన కాలంలో మరి రెండు ఉదంతాలను గురించి చెప్పడం ఉచితంగా భావిస్తున్నాను. 1914 లో ప్రారంభమైన ప్రథమ ప్రపంచ సంగ్రామము ఫలితంగా నగరంలో బియ్యానికి, కిరోసిన్‌కు చాలా కొరత ఏర్పడింది. అధికారుల అలసత్వం దీనికొక కారణం. ఒకరోజు మహాజీ మ్యునిసిపల్ కౌన్సిల్ అధ్యక్షులు ఓరుగంటి సోమసుందర రావుగారు, నేను కలిసి ప్రధానాధికారికి ప్రజలు అనుభవించుచున్న చిక్కుల గురించి విన్నవించడానికి అతని దగ్గరకు వెళ్ళినాము. అతడు అధికారమదంచేత మేము చెప్పిన మాటలను వినకపోవడమేగాక మాపట్ల కొంత మర్యాదరహితంగా మాటలాడినాడు. అంతటితో వెనుకకు మరలి వచ్చాము. నగరంలో నాకుగల పలుకుబడిని, గౌరవాన్ని అతనికి స్పష్టం చేయదలచి, అప్పుడు జరుగుతున్న మ్యునిసిపల్ ఎన్నికలలో నేను ఒక అభ్యర్థిగా నిలబడినాను. ఒక లాయరు నాకు ప్రత్యర్థిగా నిలబడినాడు. అధికారులు అతని పక్షం వహించి అతని విజయానికి ఎంతగానో ప్రయత్నించారు. నేను నా విద్యార్థులు కొందరిని వెంటబెట్టుకొని వోటర్ల ఇండ్లకు వెళ్ళి, నాకు వోటు చేయవలసిందిగా అభ్యర్థించాను. తుదకు నాకే విజయం లభించి కౌన్సిలుకు ఎన్నికయ్యాను.

కౌన్సిల్ సభ్యుడనుగా నేను సాధించినది ఏదీ లేదు. కౌన్సిల్‌లో ముఠాతత్వాలు ప్రాబల్యంగాంచి ఉండేవి. అధికారం

ఏ ముఠా వహించడ మనేదే వారి ప్రవర్తనకు ఆధారం. ప్రజల బాగోగుల గురించి వారు ఏమీ పట్టించుకోనందువల్ల నేను ఏ ముఠాలోను చేరక స్వతంత్రుడనుగా ప్రవర్తించాను. మూడు సంవత్సరాలు పూర్తి కాగానే తిరిగి ఎన్నికలలో పాల్గొనడం వృధాశ్రమ అని భావించాను.

అప్పటికీ, ఇప్పటికీ మ్యునిసిపల్ వ్యవహారాలన్నీ ఈలాగే జరుగుతున్నవి. అధికారాన్ని హస్తగతం చేసుకొని, దాని మూలంగా ఏదో కొంత లాభాన్ని సంపాదించడమే సభ్యులలో అనేకుల ఆశయం. లంచాలు తీసుకొని తమకు కావలసినవారి కోరికలను తీర్చడానికి కూడ వారు సిద్ధపడుతూ వుంటారు. ప్రజల శ్రేయస్సుపట్ల వారికి గల శ్రద్ధ చాలా తక్కువ. వారి అవినీతిని మాన్పించడానికి ప్రభుత్వం ప్రతి మ్యునిసిపాలిటీకి ఒక కమీషనరును నియమించి, అనేక అధికారాలను అతని వశం చేసింది. కాని వారిలో కూడ అవినీతి ప్రాబల్యం గాంచింది. ఒక్కొక్కప్పుడు వారూ, సభ్యులు కొందరు, అధ్యక్షుడూ చేతులు కలిపి, తమ తమ స్వార్థాన్ని సాధించుకొంటున్నారు. పోలీసులు, దొంగలు కలిసి ప్రజలను దోచుకొన్నట్లే. దేశానికి ప్రజాస్వామ్యం లభించిందేగాని ప్రజలు విద్యావిహీనులు కావడంచేతను, దారిద్ర్య పీడితులై పబ్లిక్ వ్యవహారాలలో ఆసక్తిలేనివారు కావడంచేతను, అధికారంలోవున్న వారిని గుడ్డిగా అనుసరించడానికి తరతరాలుగా అలవాటుపడినవారు కావడంచేతను ప్రజాస్వామికం మూలంగా ఆశించిన ఫలితాలు లభించడంలేదు. వాస్తవంగా పరిపాలనాధికారమంతా ధనికవర్గంవారూ, ఉద్యోగులూ అనుభవిస్తున్నారు.

నేను విజయనగరంలో ఉన్నకాలంలో సహకార ఉద్యమం శైశవదశలో ఉండేది. దానిపట్ల నాకు కొంత ఆసక్తి కలిగింది. దాని ఫలితంగా ఏచూరి నరసింహంపంతులు, ఓరుగంటి సోమసుందరరావు మొదలైన వారితో కలిసి నగరంలో ఒక బాంకిని స్థాపించడంలో ప్రముఖ పాత్రను వహించాను. దానికి డైరెక్టరుగా ఎన్నికయ్యాను. సభ్యులకు ఋణాలు ఇవ్వడం, వాటిని వాయిదా మేరకు తిరిగి వసూలుచేసి బకాయీలు

విస్తారం లేకుండా బ్యాంకి వ్యవహారాలను నడపడం డైరెక్టర్ల ప్రధాన కర్తవ్యం. దీనిని మేము సౌష్టవంగాను, నిజాయతీతోను నిర్వహించాము. క్రమక్రమంగా ఈ బ్యాంకి చాలా అభివృద్ధి గాంచి రాష్ట్రంలోని నగర బ్యాంకీలలో అగ్రశ్రేణికి చెందినట్టిదిగా గుర్తింపబడినది. నేను 1927 లో విజయనగరాన్ని వదలివేయడంతో దీనితో నాకు ఉండిన సంబంధము ఆగిపోయింది. 1965-వ సంవత్సరములో దీని స్వర్ణోత్సవాన్ని జరిపారు. అప్పటికి దీనిని స్థాపించినవారిలో నేను ఒక్కడనే జీవించి ఉండినాను. ఆ కారణం చేత బ్యాంకి అధికారులు ఉత్సవాన్ని ప్రారంభించడానికి నన్ను ఆహ్వానించారు. నేను వారి ఆహ్వానాన్ని అందుకొని ఉత్సవంలో పాల్గొని, విజయనగరంలో నా మిత్రులందరిని కలుసుకొని అతి సంతోషంతో హైదరాబాదుకు తిరిగి వచ్చాను.

టౌన్ బ్యాంకి స్థాపించిన తర్వాత కొంత కాలానికి విజయనగరంలో జిల్లా కేంద్ర బ్యాంకిని స్థాపించడంలో కూడా నేను ప్రధానపాత్రను వహించాను. దానికి డైరెక్టరుగా ఎన్నికయ్యాను. చాలాసంవత్సరాలు గడచిన తర్వాత దానికి అధ్యక్షుడుగా కూడా ఎన్నుకోబడినాను. నేను ఆంధ్ర విశ్వవిద్యాలయంలో అధ్యాపకుడుగా ఉన్న కాలంలో దీనికి కార్యదర్శిగా ఉండిన చేపూరి సుబ్బారావుగారు 40,000 రూపాయలకు గవర్నమెంటు పత్రాలను కొన్నట్లు లెక్కల పుస్తకంలో వ్రాసి, వాటిని కొనకుండా ఆ సొమ్మును అపహరించారు. ఏటేట బ్యాంకి లెక్కలను డిప్యూటీ రిజిస్ట్రారు ఆడిట్ చేసేవాడు. ఆడిట్ సమయంలో క్యాష్ బాలెన్స్‌ను, పత్రాలను తనిఖీచేసి, అవి వాస్తవంగా ఉన్నదీ లేనిదీ తన నివేదికలో తెలియపరచడం అతని బాధ్యత. ఆడిట్ కాలంలో సుబ్బారావుగారు డిప్యూటీ రిజిస్ట్రార్ గారికి, వారి సిబ్బందికి విందులు చేసి, వారిని సంతోషపెట్టడం మామూలు. రిజిస్ట్రారు దీనితో పొంగిపోయి గవర్నమెంటు పత్రాలు ఉన్నదీ లేనిదీ తనిఖీ చేయకుండా ఉన్నట్లు నివేదికలో వ్రాస్తూ ఉండేవాడు. కాని ఒక సంవత్సరం ఆడిట్ సమయంలో సుబ్బారావు, డిప్యూటీ రిజిస్ట్రార్ రంగస్వామి నాయుడు మధ్య ఏవో అభిప్రాయ భేదాలు కలగడంచేత, ఆయన పత్రాలు ఉన్నదీ లేనిదీ తనిఖీ చేయగా అవి కనుపించలేదు.

40,000 రూపాయలు సుబ్బారావు అపహరించినాడని, అతనిని అరెస్టు చేయించి, అపహరణనేరంక్రింద కేసు పెట్టాడు.

ఆయనను అరెస్టు చేసినప్పుడు వెంటనే డిప్యూటీ రిజిస్ట్రారు నాకు కబురు పంపి, బాంకి వ్యవహారాల గురించి నాతో చర్చించుటకు నన్ను వెంటనే విజయనగరానికి రావలసిందిగా కబురుపెట్టాడు. నేను వెంటనే వాల్తేరు నుండి విజయనగరం వెళ్ళగా, జరిగినదంతా ఆయన నాకు తెలియపరచాడు. అధ్యక్షుడనైన నన్ను కూడ అరెస్టుచేసి ఉండవచ్చు, కాని కాష్ విషయంలో గాని, పత్రాల విషయంలో గాని నాకు ఏలాటి బాధ్యతా లేకపోవడంచేత నన్ను అరెస్టుచేయడం మానుకొన్నాడు.

సుబ్బారావుగారి కేసు విచారణ రెండు సంవత్సరాల కాలం జరిగింది. తుదకు ఆ విచారణ ఆనాడు విశాఖపట్టణం సెషన్సు జడ్జీగా ఉన్న ఎ. యస్. పి. అయ్యర్ చేశారు. వీరు గొప్ప మేధావులు. అనేక గ్రంథాలను రచించినవారు. వారి ఎదుట నేను సాక్ష్యం చెప్పినాను. కేసులో సాక్ష్యాన్ని పూర్తిగా విని సుబ్బారావుగారు రు 40,000 లు అపహరించినట్లు నిర్ణయించారు. కాని గోలుకొండ నవాబు తానీషాక్రింద తహసీల్దారుగా ఉన్న రామదాసు ఆరు లక్షలతో భద్రాచల రామాలయాన్ని నిర్మాణం చేసినట్లే సుబ్బారావు తాను అపహరించిన సొమ్మును ధర్మకార్యాలకు వినియోగించాడని, అందుచేత అతనికి రెండు సంవత్సరాల విడిఖైదును విధించారు.

ఈ కేసులో నాకు ఏలాటి చిక్కులూ సంభవించనందులకు నేను పరమానందభరితుడ నయ్యాను. కాని సహకారసంఘాలు అనేకాలలో ఈలాటి అపహరణలు జరుగుతూ ఉండేవి. అందుచేత భవిష్యత్తులోవాటితో ఎలాటి సంబంధం పెట్టుకొనరాదనే నిర్ణయానికి వచ్చి, నా అధ్యక్షపదవికి రాజీనామా చేశాను. అంతటితో ఉద్యమంతోటి నా 25 సంవత్సరాల సంబంధం వీడిపోయింది. మోయలేని భారంనుండి విముక్తుడనైనట్లు భావించాను. మంచి చేసే ఉద్దేశంతో ఉద్యమంలో ఆసక్తి కలవాడనైనానుగాని, పై పరిణామం దానికి అన్యథాగా సంభవించింది. విజయనగరంలో

వుండిన కేంద్ర బ్యాంకికి వారి తరఫున ఉపాధ్యక్షుడనుగా వుండడం నేను చేసిన పొరబాటు.

ఈవిధంగా కళాశాల అధ్యాపకుడనుగాను, రాజాగారికి ట్యూటరుగాను, సంస్థానానికి దివాన్‌గాను, ప్రజాహిత సంస్థలలో పాల్గొనినవాడనుగాను 14 సంవత్సరాలు (1913–27) విజయ నగరంలో గడిపి, అనేక అనుభవాలను గడించాను. జీవితంలో సుఖంతోపాటు దుఃఖాన్నికూడా అనుభవించడం తప్పదని గ్రహించాను. కాని ఇదే కాలంలో దివ్యజ్ఞాన సమాజంలో సభ్యుడనై కొంతవరకు ఆధ్యాత్మిక జీవితంపట్ల ఆసక్తి కలవాడను కావడంచేత సుఖం కలిగినా, దుఃఖం కలిగినా మనశ్శాంతితో ప్రవర్తించడం నేర్చుకొనగలిగాను.

దివాన్ ఉద్యోగాన్నుండి విరమింపబడిన నాటికి నా వయస్సు 39 సంవత్సరాలు. నాకు ఆర్గురు మొగపిల్లలు, ముగ్గురు ఆడ పిల్లలు కలిగారు. నా భార్య గర్భవతిగా వుండినది. ఏదైనా ఇంకొక ఉద్యోగాన్ని సంపాదించగలిగితేనేగాని ఇంత పెద్ద కుటుంబాన్ని పోషించడం కానిపని. అందుచేత ఉద్యోగ ప్రయత్నం చేయసాగాను.

పర్లాకిమిడి మహారాజావారి కళాశాలలో ఏదో ఒక అధ్యాపకత్వం ఖాళీగా ఉన్నట్లు తెలియవచ్చింది. దానిని సంపాదించే విషయంలో నాకు సహాయపడవలసిందిగా జయపూరు మహారాజా విక్రమదేవవర్మగారిని అర్థించినాను. వారితో నాకు స్వల్పంగా పరిచయం ఉండేది. వారు నా కోరికను మన్నిస్తూ, రాజులు చపల చిత్తులని ఒక సంస్కృత శ్లోకాన్ని ఉదహరిస్తూ, దివాన్ పదవినుండి విజయనగరంరాజాగారు నన్ను తొలగించినందుకు విచారిస్తూ పర్లాకిమిడి మహారాజావారు మరుసటిరోజు మద్రాసునుండి పర్లాకిమిడికి రైలులో ప్రయాణం చేస్తున్నారని, రైల్వేస్టేషన్‌లో వారిని కలుసుకొనవలసినదని నాకు ఉత్తరం వ్రాశారు. వారి కోరిక మేరకు నేను మహారాజాగారిని కలుసుకొన్నాను. జయపూరు మహారాజావారి సలహా మేరకు ఉద్యోగ విషయమై నేను వారితో ప్రస్తావించలేదు. గౌరవసూచకంగా వారి దర్శనం చేసుకొని ఇంటికి వచ్చాను.

అదే సమయంలో నెల్లూరి వెంకటగిరిరాజావారి కళాశాల ప్రిన్సిపాల్ పదవి ఖాళీగా ఉన్నట్లు నాకు తెలియవచ్చింది. 1920 లో కళాశాలను స్థాపించినప్పుడు నా దరఖాస్తుతో నిమిత్తం లేకుండా కమిటీవారు తమంతట తామే నన్ను ప్రిన్సిపాల్ పదవికి నియమించారని, విజయనగరం కళాశాలలోనే అలాంటి పదవి లభించ గలదనే ఆశచేత దానిని నిరాకరించానని ఇదివరకే తెలియ పరచాను. ఇప్పుడు నాకు ఆ పదవి అవసరమైనది. నేను కమిటీ కార్యదర్శికి నా దరఖాస్తును పంపినాను. కమిటీలోని సభ్యులలో అనేకులు మద్రాసులో నాతో కూడ చదువుకొన్న సహాధ్యాయులు. నెల్లూరు విద్యార్థుల సంఘంలో మేమందరం సభ్యులుగా ఉండినాము. అందుచేత వారు ఏలాటి సంకోచం లేక నెలకు 400 రూపాయల జీతంమీద నన్ను ప్రిన్స్పాల్‌గా నియమించారు. మిత్రులు, బంధువులు అనేకులు ఉండిన నా స్వస్థలంలోనే నాకు ఉద్యోగం లభించడం నా అదృష్టమని భావించి 1928 జూలైలో కళాశాల ప్రిన్స్పాల్ పదవిని అధిష్ఠించినాను

కమిటీవారికి నా అర్హతపట్ల, యోగ్యతపట్ల విశ్వాసం ఉండినందున ఏలాటి చిక్కులు లేక నేను ఉద్యోగం చేయగలిగాను. సాధారణంగా ఆనాడు, ఈనాడు కమిటీల ఆధ్వర్యంలో ఉండే విద్యాలయాలలో కమిటీకి, ప్రిన్స్పాల్‌కు మధ్య అనవసరమైన మనస్పర్థలు ఏర్పడడం, కమిటీవారు కళాశాల ఆంతరంగిక వ్యవహారాలలో జోక్యం కలిగించుకొని, ప్రిన్స్పాల్‌కు ఉండతగిన స్వాతంత్ర్యానికి భంగం కల్గించడం మామూలు. కాని నాకు అలాటి చిక్కులు ఏవీ కలుగలేదు.

కాని కళాశాలను నడుపుటకు కావలసిన ఆర్థిక స్తోమత కమిటీవారికి ఉండేది కాదు. అందుచేత అధ్యాపకుల జీతాలు ఏ నెలకూ సకాలంలో ముట్టేవి కావు. నా జీతం కొంత ఆలస్యంగా లభించినా నేను పట్టించుకొనక, ఉన్న డబ్బును అధ్యాపకులకు ఇచ్చేవాడిని.

విద్యార్థులు కూడ క్రమశిక్షణకు లోబడి నాతో సహకరించే వారు. వారి ప్రయోజనార్థం నేను ఒక త్రైమాసిక పత్రికను ప్రకటింప సాగాను. అందులో వారి రచనలకు ప్రాధాన్యం

కల్పించినాను. విద్యార్థి సంఘంలో వారు పాల్గొని చర్చలు సాగించవలసిందిగా ప్రోత్సహించాను.

ఆనాడు నెల్లూరు కళాశాలలోని అధ్యాపకు లందరు ప్రఖ్యాతి గాంచినవారు. చరిత్రశాఖలో నాకు సహాయధ్యాపకులుగా వున్న రాజ శివరామకృష్ణారావుగారు, ఇంగ్లీషుశాఖలోని గుర్రం సుబ్బరామయ్యగారు, లాజిక్ శాఖలోని యం. యస్. రాఘవన్ గారు (వీరు తర్వాత ప్రిన్సిపాల్ అయ్యారు), తెనుగు శాఖకు చెందిన దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారు, సంస్కృతశాఖకు చెందిన నేలటూరు రామదాసయ్యంగారు వారి వారి శాఖలో సుప్రసిద్ధులు. ఈలాటి వారితో కలిసి పనిచేయడం నా అదృష్టమని భావిస్తున్నాను.

కాని 1930 లో ఉప్పు సత్యాగ్రహం కారణంగా కొన్ని చిక్కులు ఎదుర్కొనవలసి వచ్చింది. ఆనాడు జిల్లా విద్యాశాఖాధి కారి గ్రామీణ ప్రాంతాలకు వెళ్ళి ప్రభుత్వంపై తిరుగుబాటు చేయరాదని వారితో కలిసి నేను కూడ ప్రచారం చేయవలసిందిగా నన్ను కోరారు. ఇది నా ప్రకృతికి విరుద్ధమనీ, ఇంతటి దేశ ద్రోహానికి నేను ఎన్నడు పాల్పడజాలననీ వారి కోరికను నిరాక రించాను. దాని ఫలితంగా వారు నాపైన పోలీసువారికి లేనిపోని చాడీలు చెప్పడం ప్రారంభించారు. పోలీసువారు కూడ కొందరు విద్యార్థులకు రోజూ రూపాయో, అర్ధరూపాయో చెల్లిస్తూ వారిని సి. ఐ. డి. లుగా వినియోగించ సాగారు. ఇదికూడ నాకు కొన్ని చిక్కులను కలిగించింది. కొందరు విద్యార్థులు సత్యాగ్రహంలో పాల్గొని, పోలీసువారు పెట్టిన బాధల నన్నిటినీ సహించి, జైలుకు కూడ వెళ్ళి వారి దేశాభిమానాన్ని వ్యక్తం చేశారు. గౌహతి విశ్వవిద్యాలయంలో రాజనీతిశాఖకు ప్రధానాధ్యాపకులుగా ఉండిన వడ్లమూడి వెంకట్రావు, ఆంధ్ర విశ్వవిద్యాలయంలో చరిత్రశాఖలో ఆలాటి పదవినే అలంకరించిన ఓరుగంటి రామ చంద్రయ్య ఈలాటి వారిలో కొందరు. వారు ప్రదర్శించిన ధైర్య సాహసాలకు, త్యాగశీలతకు నేను ఎంతగానో గర్విస్తున్నాను. కాని అది నా ప్రేరణ మూలంగా జరిగినట్టిది కాదు. ఒకటి రెండు పర్యాయాలు విద్యార్థు లందరు సమ్మె చేశారు. ఆ సందర్భంలో

జిల్లా కలెక్టరు నన్ను పిలిపించి, విద్యార్థులపై ఏలాటి చర్యను తీసుకొన్నానో తెలియపరచవలసిందిగా కోరారు. చర్యను తీసుకొనని పక్షంలో కళాశాలకు గ్రాంటులను ఆపివేయవలసిందిగా విద్యాశాఖ డైరెక్టరుకు సిఫారస్సు చేసేటట్లు బెదరించారు. విద్యార్థులందరినీ శిక్షించడం సాధ్యం కానిపని అని, అది ఆందోళనకు దారి తీసేదని, అయినా వారిపై ఒక రూపాయి జరిమానాను విధించినా నని చెప్పాను. తరువాత వెంకటగిరి కుమారరాజా వారు ఏదో పనిమీద నెల్లూరికి వచ్చి, నన్ను పిలిపించి కలెక్టరు నాతో మాట్లాడిన విధంగానే మాట్లాడి, నాకు ఒకవిధమైన హెచ్చరికను చేశారు. సత్యాగ్రహంలో నేను ప్రత్యక్షంగా పాల్గొనకపోయినా, దానిపట్ల నాకు అభిమానం ఉండడం వాస్తవమే. కాంగ్రెసువారికి కొన్ని విరాళాలు ఇచ్చి, నా అభిమానాన్ని చూపెట్టాను. కాని విద్యార్థులు సత్యాగ్రహంలో పాల్గొనుటకు గాని, సమ్మెలు లేవదీయడానికిగాని నేను కారకుడను కాను. వారిలోని దేశాభిమానమే వీటికి వారిని పురికొల్పినది. దీనికి వారు ప్రశంసాపాత్రులు.

1931 మార్చిలో గాంధీ ఇర్విన్‌ల మధ్య ఒడంబడిక జరగడంచేత ఉప్పుసత్యాగ్రహం తాత్కాలికంగా ఆపివేయబడినది. దానిని ఒక అవకాశంగా తీసుకొని నేను అధ్యక్షుడను గాను, దాతగా ప్రఖ్యాతిగాంచిన యువకనాయకుడు రేబాల పట్టాభిరామిరెడ్డి కార్యదర్శిగాను ఒక కమిటీని ఏర్పాటుచేసి, దాని ఆధ్వర్యంలో నేను నెల్లూరులో ఒక స్వదేశీ పారిశ్రామిక ప్రదర్శనాన్ని 10 రోజులపాటు నిర్వహించినాను. అందులో కుటీర పరిశ్రమల మూలంగా వస్తువులను తయారుచేసేవారు అనేకులు వారి వస్తువులను ప్రదర్శించారు. నెల్లూరు, దాని చుట్టుపట్ల ఉండిన గ్రామాల నుండి ప్రజలు వచ్చి దానిని చూడగలిగారు. ఆ ప్రదర్శనలో అమ్మకానికి తెచ్చిన ఏలూరు రత్నకంబళిని ఒక దానిని నేను కొన్నాను. ప్రదర్శన స్మారకచిహ్నంగా దానిని ఈనాటి వరకు నేను పదిలపరచి నావద్ద ఉంచుకొని ఉన్నాను. ఉడతకు ఉడతాభక్తి అన్నట్లు నాలోని దేశభక్తిని ఈ ప్రదర్శన ద్వారా వ్యక్తం చేశాను.

నెల్లూరులో ఉన్నప్పుడే నేను, సహకార కేంద్ర బాంకి కార్యదర్శిగా ఉండిన సుప్రసిద్ధ న్యాయవాది కె. వి. రాఘవాచారి, పూనాలోని భారత సేవకుల సంఘం (Servants of India Society) సంఘ సభ్యుడును, మద్రాసులో దాని ప్రతినిధిగా ఉన్న వెంకట సుబ్బయ్య గార్లతో కలిసి ఇందుకూరుపేట గ్రామాన్ని కేంద్రంగా చేసుకొని, పల్లెప్రాంతాల పునర్నిర్మాణ ఉద్యమాన్ని ప్రారంభించాను. గ్రామాలలో సహకార సంఘాలను, పంచాయతీలను స్థాపించి వాటిమూలంగా ప్రజల శ్రేయస్సును అభివృద్ధిచేయడమే దాని ఉద్దేశం. ఇందు నిమిత్తం తరుచుగా మేము ఇందుకూరుపేట చుట్టుపట్ల గ్రామాలకు వెళ్ళి, అక్కడి ప్రముఖులతో సంప్రతించి పంచాయతీలను స్థాపించినాము. మైపాడు నివాసి, గొప్పభూస్వామి దువ్వూరు బలరామిరెడ్డి మాకు ఈవిషయంలో చాలా సహాయ పడినారు. 1930 లో ఒక 'వేసవికాలపు పాఠశాల' ను సాగించుటకు ప్రయత్నించాను. కాని సత్యాగ్రహం ముమ్మరంగా ఉండిన కారణంగా అది కొనసాగలేదు. 1931 లో నేను నెల్లూరు వదలి ఆంధ్ర విశ్వవిద్యాలయంలో అధ్యాపకుడనుగా విశాఖపట్టణానికి వెళ్ళిపోయినాను. అటుతర్వాత ఉద్యమం సాగినట్లు కనుపించదు.

ఈవిధంగా నా జీవితంలో రెండవ ఉద్యోగదశ ముగిసింది. ఇది 1910 లో కాకినాడలో ప్రారంభమై 1931 లో నెల్లూరిలో పూర్తిగాంచింది. ఈ 17 సంవత్సరాలలో నేను అనేక రకాలైన అనుభవాలను గడించాను. అనేక గుణపాఠాలను నేర్చుకొన్నాను. సుఖంతో పాటు అనేక చిక్కులను కూడ ఎదుర్కొన్నాను. కాని వీటిని అధిమించ గలిగాను. జీవితం సుఖ దుఃఖాలతో మిశ్రితమై నట్టిదని గ్రహించాను.

నేను పదమూడు సంవత్సరాలు విద్యార్థిగాను, పదిహేడు సంవత్సరాలు అధ్యాపకుడనుగాను ఆనాటి విద్యావిధానం ఏలాటిదో తెలుసుకొన్నాను అప్పటి విద్యార్థులు వారి చదువు తప్ప ఇతర కార్యక్రమాలను చేపట్టేవారు కారు. బిపిన్ చంద్రపాల్ ఆంధ్ర దేశంలోనూ, మద్రాసులోనూ పర్యటించినప్పుడు మాత్రం వారిని రాజకీయాలు ఆకర్షించి, రాజమండ్రి వంటి నగరాలలో కొన్ని అవాంఛనీయ పరిణామాలకు దారితీసినవి. కాని ఇవి తాత్కాలికములు,

మాత్రమే. ఇదిగాక 1920 లో మహాత్మాగాంధీగారు సహాయ నిరాకరణోద్యమాన్ని ప్రారంభించి, విద్యార్థులు ప్రభుత్వం నిర్వహించే విద్యాలయాలను, ప్రభుత్వ గ్రాంటులను పుచ్చుకొనే విద్యాలయాలను బహిష్కరించి జాతీయ విద్యాలయాలలో విద్యను నేర్చుకొనవలసినదని ఆదేశించినప్పుడు కొందరు విద్యార్థులు వారి ఆదేశానుసారం ప్రవర్తించారు. కాని తగినన్ని జాతీయ విద్యాలయాలు దేశంలో ఏర్పడలేదు. అందుచేత విద్యార్థులు కొందరు స్వచ్ఛంద సైనికులుగా కాంగ్రెసులో ప్రవేశించి దాని కార్యక్రమాలలో పాల్గొన్నారు. విద్యాలయాలను బహిష్కరించిన వారి సంఖ్య చాలా తక్కువ. వారిలో కొందరు తిరిగి మామూలు విద్యాలయాలలో ప్రవేశించి వారి చదువులను సాగించారు. మొత్తం మీద ఆనాటి విద్యార్థులను విద్యకు సంబంధించని ఇతర కార్యక్రమాలు ఆకర్షించేవి కావు. 'వందేమాతరం' ఉద్యమ కాలంలో స్వదేశీ వ్రతాన్ని భారతీయు లందరు చేపట్టవలెనని, దేశీయ పరిశ్రమలను ప్రోత్సహించవలెనని నాయకులు ప్రబోధించారు. ఆ సందర్భంలో మద్రాసురాష్ట్రంలోని కొన్ని ప్రాంతాలలో దీపావళి రోజున విద్యార్థులు ఇంటింటికీ వెళ్ళి చందాలను వసూలుచేసి దేశీయ పరిశ్రమలను ప్రోత్సహించడానికి ఏర్పడిన సంస్థలకు అందజేసేవారు. వారు అనుసరించిన ఇతర కార్యక్రమాలు చాలా పరిమితంగా ఉండేవి.

విద్యపట్ల వారు ఎక్కువ శ్రద్ధను వహించినందుకు రెండు మూడు ప్రధాన కారణాలు వున్నట్లు చెప్పవచ్చు. ఇంగ్లీషు విద్యను నేర్చుకొనేవారందరి ఆశయం మొదటినుండి ప్రభుత్వ ఉద్యోగాలను సంపాదించడమే. పరీక్షలలో కృతార్థులైతే తప్ప ఉద్యోగాలు లభించేవి కావు. కృతార్థులైన వారికి ఏదో ఒక ఉద్యోగం తప్పకుండా లభించేది. ఆనాడు నిరుద్యోగ సమస్య వుండినా అది ఈనాటి వలె తీవ్రరూపం ధరించలేదు. ఇదిగాక పరీక్షలలో కృతార్థులు కావడానికి కష్టపడి విద్యను నేర్చుకొనడం తప్ప సాధనాంతరాలు లేవు. ఈనాడు ప్రాబల్యంగాంచిన అవినీతి మార్గాలు ఆనాడు లేవు. పరీక్షాధికారులు ప్రశ్నపత్రాలను ముందుగా తమ విద్యార్థులకు తెలియపరచేవారు కారు. పరీక్షలలో

కాపీచేసే వారిని కఠినంగా శిక్షించేవారు. పరీక్షాధికారులు లంచాలు పుచ్చుకొని మార్కులు వేయడం ఆనాడు కని విని ఎరుగనట్టిది. అందుచేత చదువుపట్ల విద్యార్థులు పూర్తి శ్రద్ధను వహించేవారు. ఇదీగాక సినిమాల వంటివి ఆనాడు లేవు. ఆడ పిల్లలు, మొగపిల్లలు కలిసి ఒకే విద్యాలయంలో చదువుకొనే వారు కారు. యౌవనదశలో ఈలాగు కలిసి చదువుకొనడం విద్యార్థుల దృష్టిని వక్రమార్గాలలోకి మరల్చడానికి సాధన మౌతుంది. అతి బాల్యంలోను, కొంత వయస్సు వచ్చిన తర్వాతను మొగపిల్లలు, ఆడపిల్లలు కలిసి చదువుకొనడం ఏలాంటి ప్రమాదాలకు దారి తీయవు. చదువులో వెనుకబడిన వారే ఆనాడు ఎక్కువగా క్రీడలలోను, ఆటలలోను పాల్గొనడం మామూలు. ఈలాంటి పరిస్థితుల ప్రభావంచేత విద్యార్థులు చదువులపట్ల మాత్రమే ఆసక్తి కలవారుగా వుండేవారు.

బ్రిటిష్ పారిపాలన కాలంలో బ్రాహ్మణాది అగ్రవర్ణాలకు చెందినవారే ఎక్కువగా ఇంగ్లీషు విద్యను నేర్చుకొనేవారు. అనాదిగా వీరికి విద్యపట్ల ఎక్కువ ఆసక్తి. ఇదీగాక వీరిలో అధిక సంఖ్యాకులకు భూవసతిగాని, వర్తక వ్యాపారాలు చేసి జీవితాన్ని సాగించే అవకాశంగాని అంతగా వుండేది కాదు. ప్రభుత్వ ఉద్యోగాల మూలంగానే వీరు జీవించేవారు. ముస్లింల పరిపాలన కాలంలో కూడా వీరు ఈలాగు జీవించడం జరిగేది. బ్రిటిషు పరిపాలన కాలంలో వీరే ఎక్కువగా ఉద్యోగాలు చేసేవారయ్యారు. భూస్వాములకును, వర్తక వ్యాపారాలను అనాదిగా సాగించే వైశ్యులు మొదలైన వారికిని ఉద్యోగాలు ఆకర్షణీయంగా వుండేవి కావు. వారికి ఉద్యోగాపేక్ష ఎక్కువగా లేదు. అనాదిగా విద్యపట్ల పూర్తి శ్రద్ధ వుండేది అగ్రవర్ణాల వారికే.

కాని కాలక్రమాన ధనికవర్గానికి చెందిన వారికి కూడ విద్యపట్ల ఆసక్తి కలిగింది. స్వాతంత్ర్యం లభించిన తర్వాత ఈ ఆసక్తి మరింత పెరిగింది. వీరు ఎక్కువ సంఖ్యలో విద్యాలయాలలో ప్రవేశించడం జరిగింది. వీరు వాటిలో ప్రవేశించినా విద్యపట్ల ఎక్కువ శ్రద్ధను చూపేవారు కారు. వీరు విద్యార్థులపై నాయకత్వాన్ని వహించి రాజకీయాలలో పాల్గొనడం పట్ల ఎక్కువ

అభిరుచికలవా రయ్యారు. శాసన సభలలోను, మంత్రి మండలుల లోను సభ్యత్వం వహించడం వీరి ప్రధాన ఆశయం. విద్యార్థిదశ దానికి ఒక మార్గమనే భావం వారిలో ఏర్పడినది. విద్యార్థుల ఆందోళనలో పాల్గొనడంలో వీరే నాయకు లయ్యారు. సామాజిక పరిస్థితులు ఈవిధంగా మారడంచేత విద్యార్థులకు విద్య పట్ల శ్రద్ధ తగ్గుముఖం పట్టింది.

ప్రజాస్వామికం కారణంగా బలహీన వర్గాలవారు, అస్పృశ్యులు మొదలైన వారు విద్యార్థి వేతనాల వంటి ప్రత్యేక సదుపాయాల ద్వారాను, విద్యాలయాలలో కొన్ని స్థానాలు వారికి ప్రత్యేకించడం ద్వారాను విద్యాలయాలలో ప్రవేశించడం జరిగింది. కాని వారి తల్లిదండ్రులు విద్యాగంధం లేనివారు కావడం చేతను, ఇండ్లలో చదువుకొనుటకు తగిన వసతులు వారికి లేకపోవడం చేతను, వారికి ప్రత్యేక శిక్షణను గరపుటకు కావలసిన ఏర్పాటులను ప్రభుత్వం చేయకపోవడం చేతను వారు విద్యాలయాలలో ప్రవేశించినా విద్యపట్ల ఎక్కువ శ్రద్ధను వహించడం లేదు. విద్యార్థివేతనాలను తమ కుటుంబ పోషణకు ఒక సాధనంగా వినియోగించు కొంటున్నారు. దేశంలో అన్ని కులాలవారు, అన్ని వర్గాలవారు విద్యను నేర్చుకొనడం అవసరమే. కాని ఈనాటి విద్యాలయాలు ఈ అవసరాన్ని చక్కగా తీర్చడంలేదు. క్రమ శిక్షణా రాహిత్యానికి ఇది ఒక ప్రధాన కారణం. స్వతహాగా విద్యపట్ల ఆసక్తి లేనివారికి అలాంటి ఆసక్తి కలిగించే విద్యా విధానాన్ని రూపొందించినప్పుడే విద్యావ్యాప్తిమూలంగా వాస్తవ ప్రయోజనం కలుగుతుంది. కాని అలాటి విద్యావిధానం దేశంలో ఇప్పటివరకు ఏర్పడలేదు.

దేశంలోని రాజకీయపార్టీలు కూడా విద్యార్థులను తమ పార్టీల ప్రయోజనాలకు వినియోగించుకొనడం కూడ విద్యపట్ల విద్యార్థులకు ఆసక్తి లోపించడానికి ఇంకొక కారణం. ఇంతేగాక పరీక్షలలో కృతార్థులైనా ఉద్యోగాలు లభించడంలేదు. కష్టపడి చదవడం ఎందుకు అనే మనోవైఖరికూడ ఈలాటి విద్యార్థులలో ప్రాబల్యం వహించింది. విద్యార్థులు విద్యార్థి దశను కులాసాగా గడుపుటకు వినియోగించుకొనేవా రయ్యారు.

1931 కి పూర్వం అధ్యాపకులకు, విద్యార్థులకు మధ్య సన్నిహిత సంబంధం ఉండేదని, అధ్యాపకులు వారి గుణగణాలను తీర్చిదిద్దే వారని ఒక అభిప్రాయం వ్యాపించి ఉన్నది. కాని ఇందులో ఎక్కువ సత్యం లేదు. ఆనాడు అధ్యాపకులు విద్యార్థులతో ఎక్కువ సంబంధం పెట్టుకొనేవారు కారు. క్లాసుకు రావడం, పాఠాలు చెప్పడం తప్ప వారికి విద్యార్థులతో ఎలాంటి సంబంధం ఉండేది కాదు. వారు విద్యార్థులను తమ ఇండ్లకు ఆహ్వానించి, వారితో ఇష్టాగోష్ఠి జరిపే అలవాటు కూడా చాలా తక్కువ. మద్రాసు క్రిస్టియన్ కళాశాలలోని అధ్యాపకులు కొందరు మాత్రం ఈలాగు చేసేవారు. నేను పచ్చయప్ప కళాశాలలో విద్యార్థిగా ఉన్నప్పుడు రెండు, మూడు పర్యాయాలు మాకు అధ్యాపకులుగా ఉండిన దన్నాడ రామచంద్రరావుగారు మమ్ము వారి ఇంటికి ఆహ్వానించి, ఫలహారాలు కాఫీ ఇచ్చి, మా యోగక్షేమాలను విచారించారు. కాని ఇంతకు మించి సాధారణంగా ఉపాధ్యాయులకు, విద్యార్థులకు మధ్య సంబంధం ఉండేది కాదు. విద్యార్థులలోని క్రమశిక్షణకు ఇతర పరిస్థితులు కారణాలే గాని, ఈలాటి సన్నిహిత సంబంధం కారణం కాదు.

1931 తర్వాత విద్యావిధానంలో జరిగిన మార్పు లన్నిటినీ వివరించడం సందర్భోచితం కాదు. అంతకుపూర్వం విద్యార్థులకు విద్యపట్ల ఎక్కువ ఆసక్తి ఉండడానికి, అటుతర్వాత అది లోపించడానికి గల కారణాలను స్థూలంగా సూచించడమే నా ఉద్దేశం.

నేను నెల్లూరిలో ఉన్నప్పుడు ఒక మంచి అలవాటును మా కుటుంబంలో ప్రవేశపెట్టినాను. రోజూ సాయంత్రం దేవుని పటాన్ని పెట్టి, దీపాలు వెలిగించి, వాటి ఎదుట నేను నా భార్య, పిల్లలు అందరము కలిసి కూర్చుండి ఒక గంటకాలం దైవభక్తి గీతాలను పాడటమే ఈ అలవాటు. పిల్లలలో దైవభక్తి, దేశాభిమానము ఏర్పడడానికి ఇది పటిష్ఠ సాధనమని నా నమ్మకం. ఈవిధంగా వారితో కలసి కొంతకాలాన్ని వినియోగించడం తల్లిదండ్రుల కర్తవ్యమని నేను ఆనాడు గాక ఈనాడు కూడా భావిస్తున్నాను. కుటుంబంలోనివారందరు పరస్పర ప్రేమాభిమానాలతో ప్రవర్తించడంలో ఇది గొప్ప సాధనం. నెల్లూరు

వదలిన తర్వాత కూడ కొంతకాలం ఈ అలవాటును సాగించాను. కాని పిల్లలు పెద్దవారై చదువులకు ఇతర నగరాలకు వెళ్ళిన కారణంగా ఇది క్రమక్రమంగా ఆగిపోయింది. ఈనాటి తరం వారిలో దీనిపట్ల ఏలాటి ఆసక్తి లేకపోవడం కుటుంబజీవితంలో ఒక లోపంగా నేను భావిస్తున్నాను.

విజయనగరం కళాశాలలో నావద్ద చదువుకొన్న వారిలో కొందరు వారి జీవితంలో పేరుప్రఖ్యాతులు సంపాదించినారు. వారిలో వింజమూరి గోవిందరాజాచారిగారు ఒకరు. వీరు బి. ఏ. లో ప్రథమశ్రేణిలో కృతార్థులై ఒక సంవత్సరం కళాశాలలో ట్యూటరుగా పనిచేశారు. అప్పట్లో వారు, నేను సాయంకాలం ఒక గంటసేపు ఆర్థికశాస్త్రంలోని కొన్ని మూల గ్రంథాలను కలిసి అధ్యయనం చేసేవారం. వారు తర్వాత మద్రాసులో 'లా' చదివి గొప్ప న్యాయవాదిగా ప్రఖ్యాతి గాంచి, మద్రాసు ఉన్నత న్యాయస్థానంలో న్యాయమూర్తిగా పనిచేసి అకాలమరణానికి గురి అయ్యారు.

నా శిష్యకోటిలో ఇంకొకరు పెనుమత్స సత్యనారాయణ రాజుగారు. వీరు విద్యార్థిగా దివ్యజ్ఞాన సమాజంలో పాల్గొని, ప్రతి ఆదివారం నేను నిర్వహిస్తున్న గ్రంథకాలక్షేపంలోను, చర్చలలోను పాల్గొనేవారు. చాలా సౌమ్యులు. వీరు కూడ మద్రాసులో 'లా' లో కృతార్థులై న్యాయవాదిగా ప్రఖ్యాతిని గాంచి, ఆంధ్రప్రదేశ్ ఉన్నత న్యాయస్థానంలో న్యాయాధికారి గాను, తర్వాత ఢిల్లీలోని సుప్రీం కోర్టులోను న్యాయాధికారిగా గొప్ప పదవిని అధిష్ఠించినారు. వారు హైదరాబాదులో ఉన్నప్పుడు నేను, నా భార్య వారిని, వారి భార్యను తరుచుగా కలుసుకొంటూ ఉండేవారం. వారు కూడా అకస్మాత్తుగ అకాల మరణానికి గురి అయ్యారు.

కళా వెంకట్రావుగారు నా శిష్యవర్గంలో ఇంకొకరు. వీరు ఇంటర్మీడియేట్ లో విద్యార్థిగా ఉన్నప్పుడు విజయనగరంలో ఒక గ్రంథాలయాన్ని నెలకొల్పి దానిని చక్కగా నిర్వహించి,

ప్రజాహిత కార్యాలలో వారికి గల శ్రద్ధను విద్యార్థి దశలోనే ప్రదర్శించినారు. తర్వాత వారు స్వాతంత్ర్య సమరంలో గొప్ప పాత్రను వహించి, జైలు శిక్షలను అనుభవించి, దేశానికి స్వాతంత్ర్యము లభించిన తర్వాత ఆంధ్రప్రదేశ్ మంత్రిమండలిలో సభ్యులుగా కీర్తి ప్రతిష్ఠలు సంపాదించినారు.

గుమ్మిడిదల సుబ్బారావుగారు నా శిష్యులలో ఇంకొకరు. వీరు కూడ బి. ఏ. లో ప్రథమ శ్రేణిలో కృతార్థులై, కళాశాలలో రెండు సంవత్సరాలు ట్యూటరుగా ఉండి, తర్వాత ఏదో ఒక బ్యాంకులో ఉద్యోగం చేసి, దానికి రాజీనామా ఇచ్చి, రాజకీయాలలో ప్రవేశించారు. వీరు దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారికి సన్నిహితులు. వారిని చక్కగాను, పూర్తిగాను అర్థం చేసుకొన్న వారు. దాని ఫలితంగా వారి జీవితాన్ని వివరిస్తూ ఒక ఉద్గ్రంథాన్ని వ్రాసినారు తర్వాత స్వరాజ్యపార్టీలోను, ఆంధ్రోద్యమంలోను గొప్ప కృషిచేశారు. వారి స్వస్థలమైన అమలాపురంలో స్థిరనివాసియై 'గోష్ఠి' అనే పత్రికను నిర్వహిస్తూ వుండేవారు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఆదేశానుసారం వారు ఆంధ్రోద్యమ చరిత్రను వ్రాశారు. కాని ప్రభుత్వం వారి మరణానంతరం దానిని ప్రకటించడంపట్ల ఏలాంటి శ్రద్ధను వహించని కారణంగా వారి వ్రాతప్రతి మూలపడిపోయినది. ప్రభుత్వం తలపెట్టిన రచనా కార్యక్రమాలు అనేకానికి ఇదే గతి పట్టింది.

విజయనగరంలో నావద్ద విద్యాభ్యాసం చేసిన వారిలో దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు ఇంకొకరు. విద్యార్థిగా వీరు చదువుల పట్ల ఎక్కువ శ్రద్ధను వహించలేదు. వారిలో కవితాశక్తి వున్నట్లు నేను అప్పట్లో ఊహించలేదు. కాని తర్వాత వారు భావకవిగా ప్రఖ్యాతిని సంపాదించగలిగారు. వారి రచనలు ఆంధ్రవాఙ్మయంలో స్థిర స్థానాన్ని సంపాదించుకో గలిగినవి. నాయందు వారికి అపారమైన భక్తి. నేను 1925 లో మద్రాసులో పరిశోధన నిమిత్తం వున్నప్పుడు వారు మా ఇంటికి వచ్చి వారి 'కృష్ణపక్ష' గ్రంథాన్ని చదివి వినిపించారు. తర్వాత అనేక సంవత్సరాలు గడిచిపోయినవి. కాని నాపట్ల వారికి గల భక్తిలో ఏలాటి మార్పు రాలేదు. దీనికి తార్కాణంగా వారు నా

గౌరవార్థం హైదరాబాదు రవీంద్ర భారతిలో ఒక గురుపూజ సమావేశాన్ని ఏర్పాటుచేసి నన్నూ, నా భార్యను సత్కరించినారు. అనేక వక్తలు మమ్ములను గురించి ప్రశంసాపూర్వమైన ఉపన్యాసాలు చేశారు. సుప్రసిద్ధ శొంఠి రామమూర్తిగారు సమావేశానికి అధ్యక్షులుగా వారి సహజ ధోరణిలో ప్రసంగించారు. ఈనాటివరకు కృష్ణశాస్త్రిగారు నాపట్ల భక్తిగలవారుగా ఉన్నారు.

ఆనాటి నా శిష్యవర్గంలో గరిమెళ్ళ సత్యనారాయణగారు ఇంకొకరు. వీరు "మా కొద్దు ఈ తెల్లదొరతనము" అనే దేశాభిమాన పూరితమైన గేయాన్ని రచించి, స్వాతంత్ర్యోద్యమ కాలంలో రెండు పర్యాయాలు జైలు శిక్షను అనుభవించారు. ఆనాటి సమావేశాలలో 'వందేమాతరం' గీతాని కంటె వారిగేయం ఎక్కువ ప్రాధాన్యాన్ని వహించింది. ఈ గేయం మూలంగా వారు ఆంధ్ర దేశచరిత్రలోను, వాఙ్మయంలోను సుస్థిర స్థానాన్ని సంపాదించారు.

హాస్యచక్రవర్తిగా ప్రఖ్యాతి గాంచిన మునిమాణిక్యం నరసింహారావుగారు కూడా విజయనగరంలో మా శిష్యులలో ఒకరు. వారి 'కాంతం' కథలు చదవనివారు ఆంధ్ర దేశంలో ఎవరూ లేరని నా నమ్మకం. నేను హైదరాబాదు ఆకాశవాణిలోని ఉద్యోగానికి రాజీనామా చేసిన తర్వాత నా స్థానంలో వారిని నియమించ వలసిందిగా అధికారులకు సూచించినాను. వారు అలాగే చేశారు.

వివిధరంగాలలో ఈలాటి ప్రఖ్యాతి గాంచినవారు ఒకప్పుడు నావద్ద విద్యాభ్యాసం చేయడంపట్ల నేను గర్విస్తున్నాను. ఇది నా జ్ఞాపకాలలో స్థిరంగా నిలిచిపోయింది.

నేను ఆంధ్ర విశ్వవిద్యాలయాన నుండి విరమించిన తర్వాతనే భీమవరం కళాశాలలో ఉద్యోగం చేసినా దానిని గురించి ఇక్కడే ప్రస్తావించడం ఉచితం. దీనితో అనుబంధ కళాశాలలలో నా అనుభవం పూర్తి అవుతుంది.

1944 జనవరి 8-వ తేదీన ఆంధ్ర విశ్వవిద్యాలయ ఉద్యోగాన నుండి, నా వయస్సు 55 సంవత్సరాలైన దనే కారణంగా

అధికారులు నన్ను విరమింప జేశారు. వెంటనే నేను గుంటూరు (అప్పుడు విశ్వవిద్యాలయం తాత్కాలికంగా గుంటూరులో వుండినది) వదల లేదు. నా పిల్లలకు పరీక్షలయ్యే వరకు అక్కడే వుండి, అటుతర్వాత కొన్ని రోజులు నెల్లూరిలో గడపి జూన్ లో, మద్రాసులో నా పిల్లల చదువు నిమిత్తం కాపురం పెట్టాను. 1945 లో వారి వేసవి సెలవులలో నా మామూలు అలవాటు ప్రకారం నేను కొత్తగా భూములను కొనుగోలు చేసిన బొంతల పాళెం గ్రామానికి కుటుంబ సహితంగా వెళ్లినాను. నేను అక్కడ వుండగా కొత్తగా పశ్చిమ గోదావరి జిల్లాలోని భీమవరంలో స్థాపించిన కళాశాల కార్యదర్శి నారాయణరాజుగారు, మా ఉభయులకు మిత్రుడైన డాక్టర్ మల్లవరపు కృష్ణారావుగారు నన్ను కలుసుకొనుటకు నెల్లూరు వచ్చి, నాకు కబురు పంపినారు. నేను గ్రామంనుండి వచ్చి వారిని కలుసుకొన్నాను. వారు నేను కళాశాలకు ప్రిన్సిపాల్ గా వుండవలసినదిగా కోరారు. విశ్వ విద్యాలయంలో ప్రొఫెసరుగా వుండిన నేను రెండవ గ్రేడు కళాశాలలో ప్రిన్సిపాల్ గా వుండడం నాకు అభిమతం కాలేదు. అలాంటి కళాశాలలో పరిశోధనకు, గ్రంధరచనకు ఎలాంటి అవకాశం లభించదు. ఇదీగాక కమిటీ యాజమాన్యంలో వుండే కళాశాలలో ఉద్యోగం చిక్కులతో కూడుకొన్నట్టిది. కమిటీలో చీలికలు ఏర్పడడం, అది కారణంగా ప్రిన్సిపాల్ చిక్కులను ఎదుర్కోనడం తప్ప దనేది నా భావం. ఇంతేగాక పిల్లల చదువు పూర్తి అయ్యే వరకు నేను మద్రాసులో వుండడం చాలా అవసరం. నేను భీమవరం వెళ్ళిన పక్షంలో అక్కడ ఒక కాపురం, మద్రాసులో ఇంకొక కాపురం, రెండు కాపురాలను నిర్వహించ వలసి వస్తుంది. నా భార్య, పిల్లల సంరక్షణార్థం మద్రాసులో వుండడం తప్పదు. దీని నంతా గమనించి భీమవరం ఉద్యోగాన్ని స్వీకరించడంపట్ల నాకు అంతగా ఇష్టం లేకపోయింది. కాని వారిద్దరి ఒత్తిడిని నేను ఎదుర్కోనలేక తుదకు దానికి వారు ఒక షరతుకు లోబడిన పక్షంలో నేను అంగీకరిస్తానని చెప్పినాను.

అప్పుడు నా పెద్ద కుమారుడు నెల్లూరు కాలేజి కెమిస్ట్రీ శాఖలో అధ్యాపకుడుగా ఉండేవాడు. వాడి జీతం చాలా

తక్కువగా ఉండడమే గాక, అక్కడి పరిస్థితులు కూడా తృప్తి కరంగా ఉండేవి కావు. వాడు కెమిస్ట్రీలో ఎం. ఎస్‌సి. రెండవ క్లాసులో కృతార్థుడైనవాడు. కెమిస్ట్రీశాఖలో అధ్యాపకునిగా భీమవరం కళాశాలలో వాడిని నియమించిన పక్షంలో నేను ప్రిన్సిపాల్‌గా ఉండుటకు అంగీకరిస్తానని చెప్పినాను. వాడూ, నా కోడలూ నాకు సహాయంగా ఉంటారని కూడ నేను చెప్పాను. దానికి వారు సమ్మతించారు. జూన్ 15 నాటికి మా ఇద్దరి నియామకాన్ని గురించి కమిటీ నుండి ఆర్డర్లు అందినవి. జూన్ ఆఖరున మేము భీమవరం వెళ్ళి, కళాశాలలో నేను ప్రిన్సిపాల్‌గాను, వాడు కెమిస్ట్రీశాఖలో అధ్యాపకుడుగాను చేరాము. నా భార్య పిల్లల సంరక్షణార్థం మద్రాసులో ఉండిపోయింది.

'ఆదిలోనే హంసపాది' అన్నట్లు నా నియామక విషయంలో ఒక చిక్కు ఏర్పడేటట్లు కనుపించింది. ఆరోజులలో కళాశాలలోని అధ్యాపకుల నియామకాన్ని విశ్వవిద్యాలయ సిండికేట్ (కార్య నిర్వాహకసభ) ఆమోదించవలసినట్లును, అధ్యాపకులు కనీసం ఎం.ఏ. లో రెండవ క్లాసులో కృతార్థులుగా ఉండవలసినట్లును రెండు నియమాలు ఉండేవి. నేను 1910 లో అనగా 34 సంవత్సరాలకు పూర్వం ఎం. ఏ. లో మూడవ క్లాసులో ఉత్తీర్ణుడైన వాడిని. ఆరోజులలో పైన సూచించిన రెండో నియమం లేనందున నేను కాకినాడ, విజయనగరం, నెల్లూరు కళాశాలలలో ఏలాంటి ఆక్షేపణ లేక ఉద్యోగం చేశాను. ఇంతేగాక విశ్వవిద్యాలయంలో కూడ ప్రొఫెసర్ పదవిని అధిష్ఠించినాను. ఇది అధ్యాపకుని జీవితంలో అత్యున్నతమైన పదవి. ఈలాంటి పదవిలో ఉండిన వాడనైన నేను రెండవ గ్రేడు కళాశాలకు ప్రిన్సిపాల్‌గా ఉండుటకు అర్హతలేని వాడనని సిండికేట్‌లోని ఒక మహామహుడు ఎం. ఏ. లో నేను మూడవ క్లాసులో కృతార్థుడను కావడం ఆధారంగా చేసుకొని ఆక్షేపించాడు. ఆనాడు విశ్వవిద్యాలయంలో ముఠాతత్వాలు ప్రాబల్యం గాంచి ఉండేవి. అధికారవర్గంలో నాపట్ల ద్వేషం వహించినవారు కొందరు ఉండేవారు. వారు పగదీర్చుకోనే ఉద్దేశంతో హాస్యాస్పదమైన ఈ ఆక్షేపణను లేవదీశారు. పగను సాధించ దలచినవారు ఉచితానుచితాలను

గమనించక ప్రవర్తించటం మామూలు. కాని సిండికేట్ సమావేశంలో ఈ ఆక్షేపణ వీగిపోయింది. నా నియామకాన్ని అది ఆమోదించింది. ఆక్షేపణ లేవదీసిన మహామహుడు నవ్వుల పాలైనాడు.

ఆనాడు కళాశాలకు భవనాలు లేవు. క్లాసులన్నీ పూరి పాకలలో జరిగేవి. ప్రిన్సిపాల్ ఆఫీసు, గ్రంథాలయం ఈలాంటి పాకలలోనే ఉండేవి. కాని విద్యార్థులుగాని, అధ్యాపకులుగాని దీనిపట్ల నిరసన తెలిపినవారు కారు. చుట్టుపట్ల ఇంకొక కళాశాల లేనినాడు కమిటీవారు ఏదోవిధంగా విరాళాలను వసూలుచేసి కళాశాలను స్థాపించ గలిగారని అందరూ వారిని ప్రశంసిస్తూ ఉండేవారు. అధిక సంఖ్యలో విద్యార్థులు కళాశాలలో చేరారు.

కమిటీవారు నాపట్ల పూర్తి విశ్వాసాన్ని ప్రదర్శించినారు. వారినుండి నాకు ఏలాటి చిక్కులు సంభవించలేదు. నారాయణ రాజుగారు చాలా మర్యాదస్థులు. నెమ్మదిగా ప్రవర్తించేవారు. అన్నివిషయాలలో నా సలహాలకు అంగీకరించేవారు. ప్రధానంగా అధ్యాపకుల నియామకం విషయంలో ఈ అంగీకారం నాకు పూర్తిగా లభించింది.

ఇంగ్లీషుశాఖలో పి. ఎల్. ఎన్. శర్మగారు నియమితులైనారు. వారు తర్వాత ఉస్మానియా విశ్వ విద్యాలయంలో అధ్యాపకులుగా పనిచేసి, విశ్వ విద్యాలయ కళాశాలలో ఒకదానికి ప్రిన్సిపాల్ గా ఉండి పింఛన్ పుచ్చుకొన్నారు. చరిత్రశాఖలో ఓరుగంటి సత్యనారాయణమూర్తిగారు నియమితులయ్యారు. వీరు తర్వాత గుంటూరు హిందూ కాలేజిలో అధ్యాపకుడుగాను, ప్రిన్సిపాల్ గాను ఉద్యోగం చేశారు. గణితశాఖలో అర్క సోమయాజులుగారు నియమితులైనారు. వీరు తర్వాత తిరుపతి లోని ప్రాచ్య కళాశాలలో ప్రాచీన భారతీయ గణితంలోను, జ్యోతి శ్శాస్త్రంలోను గొప్ప పరిశోధకులుగా ప్రఖ్యాతి గాంచారు. సంస్కృతంలో వీరికి గొప్ప పాండిత్యం ఉండేది. కొన్ని నెలలు గడిచిన తర్వాత నా కుమారుడు నరసింహం మద్రాసులోని పచ్చయప్ప కళాశాలలో కెమిస్ట్రీ శాఖలో అధ్యాపకత్వం లభించినందున అక్కడికి వెళ్లిపొయ్యాడు. ఆ ఖాళీలో పాలగుమ్మి

పద్మరాజుగారు నియమితు లయ్యారు. వీరు కొంతకాలం తర్వాత అధ్యాపకత్వాన్ని వదలి గొప్ప రచయితగా ప్రఖ్యాతి గాంచినారు. ఫిజిక్సుశాఖలో సుబ్బిరెడ్డిగారు నియమితులైనారు. వీరు తర్వాత బొబ్బిలి కళాశాలలో అధ్యాపకుడుగాను, ప్రిన్సిపాల్‌గాను ఉండినారు. దీనినిబట్టి భీమవరం కళాశాలలో అధ్యాపకులుగా నియమితులైనవా రందరు వారి వారి శాఖలలో శక్తిసామర్థ్యాలు కలవారని స్పష్టం జౌతున్నది. కళాశాల ప్రఖ్యాతికి ఇది ప్రధానకారణమైనది.

నేను చరిత్రశాఖకు చెందిన విద్యార్థులకు మాత్రమే విద్యాబోధ చేసేవాడిని. ఇతర శాఖలలోని విద్యార్థులతో ఏలాటి సంబంధం ఉండేది కాదు. ప్రిన్సిపాల్‌కు అందరి విద్యార్థులతో సన్నిహిత సంబంధం ఉండడం అవసరమని భావించాను. ఇదీగాక ఆనాడు భీమవరం చుట్టుపట్ల కమ్యూనిస్టుల ప్రచారం తీవ్రంగా ఉండేది. విద్యార్థులలో కొందరు ఆ పార్టీకి చెందినవారు. వారు కరపత్రాలను పంచిపెట్టడం ద్వారాను, ఇతర విధాలుగాను విద్యార్థు లందరిని మభ్యపెట్టే ప్రమాదం ఎంతైనా ఉండేది. ఇది క్రమశిక్షణారాహిత్యానికి దారితీసేదని నేను భావించాను. విద్యార్థు లందరితో సంబంధం పెట్టుకొనడం ఈ ప్రమాదాన నుండి వారిని తప్పించుటకు అవసరమని కూడ నేను తలచాను. ఈ అవసరాలను తీర్చుటకు నేను రెండు సాధనాలను వినియోగించాను.

విద్యార్థు లందరిని నాలుగు బృందాలుగా విభజించి, ప్రతి ఆదివారం సాయంత్రం ఒక్కొక్క బృందానికి ఒక టీపార్టీని నా సొంత ఖర్చులతో ఏర్పాటు చేయసాగాను. ఆ సమయంలో నేను సమావేశమైన విద్యార్థులతో ఇష్టాగోష్ఠిగా మాట్లాడి, వారి యోగక్షేమాలను తెలుసుకొని వారికి విశ్వాసపాత్రుడనైనాను. ఈవిధంగా ఒక నెల రోజులలో విద్యార్థు లందరిని కలుసుకొనేవాడిని.

ఇదీగాక విద్యార్థు లందరిని అప్పుడప్పుడు సమావేశపరచి, కమ్యూనిస్టు తత్వంలోని గుణదోషాల గురించి ఉపన్యసించి, వారు వేసిన ప్రశ్నలకు సమాధానాలను చెప్పేవాడిని. దీనిమూలంగా కూడా నాకు విద్యార్థు లందరితో సన్నిహిత సంబంధం ఏర్పడింది.

విద్యార్థులలో కొందరికి ఆధ్యాత్మిక విషయాలపట్ల ఆసక్తి ఉన్నట్లు గ్రహించాను. వారు అన్ని శాఖలకు చెందినవారు.

వారిని కూడ అప్పుడప్పుడు సమావేశపరచి, వారికి ఆసక్తిగల ఆధ్యాత్మిక విషయాలనుగురించి చర్చించ సాగాను. ఈవిధంగా నేను విద్యార్థు లందరితో సంబంధం పెట్టుకొన్నాను. ఏలాంటి అల్లరులు లేవదీయక వారు నాతో సహకరించి, కళాశాల కార్యక్రమాలు నెమ్మదిగా జరిగేటట్లు చేశారు.

ఈవిధంగా పదినెలలు జరిగిపోయినవి. అప్పుడప్పుడు మద్రాసునుండి నాభార్య వచ్చి కొన్నిరోజులు ఉండి వెళ్లిపోయ్యేది. నా కుమారుడు, కోడలు మద్రాసుకు వెళ్లిన తర్వాత నా పెద్ద కుమార్తె అన్నపూర్ణ నా సంరక్షణార్థం నెల్లూరునుండి వచ్చేది. 1946 ఏప్రిల్ లో నాకు జబ్బుచేసి, ఒకరోజు రాత్రి చాలా బాధ పడినాను. మరుసటిరోజు ఉదయం ప్రఖ్యాతిగాంచిన ఒక డాక్టర్ సుబ్బరాజుగారిని పిలిపించాను. వారు నా కడుపులో ఒక వ్రణం ఏర్పడడం నా వ్యాధికి మూలకారణమైనట్లు ఊహించి ఒక నెలరోజులు చికిత్సచేసి, చింతపండు, కారం పూర్తిగా వర్జించ వలసిందిగా సలహా ఇచ్చారు. అప్పటినుంచి ఈనాటివరకు వారి సలహాప్రకారం నేను నడుచుకొంటున్నాను. వారి చికిత్స పూర్తి కాగానే నేను వేసవి సెలవులను పురస్కరించుకొని నెల్లూరు వెళ్ళినాను. అక్కడ నా అల్లుడు ( బావమరది కూడా ) అల్లాడి మహాదేవయ్య ప్రసిద్ధిగాంచిన డాక్టర్. వారు కూడా కడుపులోని వ్రణం మూలంగానే నేను వ్యాధిగ్రస్తుడనైనట్లు నిర్ణయించి, మరి కొన్ని మందులు ఇచ్చారు. జూన్ ఆఖరుకు నేను పూర్తిగా నా ఆరోగ్యాన్ని కోలుకొన్నాను.

అప్పటికి భీమవరం కళాశాల ఉద్యోగంపట్ల నాకు ఇష్టం లేక పోయింది. కుటుంబాన్ని మద్రాసులో వదలి భీమవరంలో ఉండవలసిన అవసరం నాకు కనుపించలేదు. ఉద్యోగం లేకపోయినా భూముల నుండి నాకు లభించే ఆదాయంతోను, వార్తాపత్రికలకు నేను వ్రాసే వ్యాసాలు, గ్రంథ సమీక్షలు మూలంగా నాకు లభించే ఆదాయం తోను సుఖంగా జీవించడం సాధ్యమైంది. నా జీవితంలో ఏనాడూ నేను దారిద్ర్యబాధను అనుభవించవలసిన అవసరం లేకపోయింది. ఈ పరిస్థితుల నన్నిటిని గమనించి జూన్ ఆఖరులో భీమవరం కళాశాల ప్రిన్సిపాల్ పదవినుండి విరమించాను. ఏలాంటి బెడదా

లేకుండా మద్రాసులో స్వతంత్రంగా జీవించగలిగాను. ఈవిధంగా అనుబంధ కళాశాలలో 1910 న నాకు కలిగిన సంబంధం 1946 జూన్ లో విడిపోయింది. నా జీవితానికి రూపురేఖలు దిద్దినది ఈ సంబంధమే.

## నా ఉద్యోగం - మూడవ దశ

1931 జూలై నుంచి 1944 జనవరి 8-వ తేదీ వరకు నేను ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ప్రథమంలో రీడర్ గాను అటు తర్వాత ప్రొఫెసర్ గాను 13 సంవత్సరాలు ఉద్యోగం చేశాను. ఇది గౌరవప్రదమైన ఉద్యోగమైనా మొత్తానికి అనేక పరిస్థితులు కారణంగా మనశ్శాంతి లేక కాలం గడిపాను. నేను విశ్వవిద్యాలయంలో ప్రవేశించినప్పుడు ప్రఖ్యాత తత్త్వవేత్త డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణన్ ఉపాధ్యక్షులు. వారు 1936 లో రాజీనామా చేసి వెళ్ళిపోగా డాక్టర్ కట్టమంచి రామలింగారెడ్డిగారు ఉపాధ్యక్షులుగా ఎన్నికయ్యారు. వీరి హయాంలో నా దృష్ట్యా పరిస్థితులు విషమించి ఏదో ఉద్యోగం చేస్తూ ఉండినా అది తృప్తికరంగా ఉండలేదు. దీనికి రెడ్డిగారు నాపట్ల వహించిన ద్వేషభావం ప్రధాన కారణం.

ఆంధ్రోద్యమం 1911 లో ప్రారంభమైన నాటినుండి ఆంధ్ర జిల్లాలకు ప్రత్యేక విశ్వవిద్యాలయము ఉండవలెననే వాంఛ నాయకులలోను, రాజకీయ చైతన్యం గల ప్రజలలోను ప్రాబల్యం గాంచింది. కాని మద్రాసు ప్రభుత్వం దీనిపట్ల సుముఖంగా లేక పోవడంచేత ఆంధ్రుల వాంఛ తీరిందికాదు. 1921 లో మాంటేగు చెమ్స్‌ఫర్డు సంస్కరణలు ఫలితంగా మద్రాసు రాష్ట్రంలో ద్వంద్వ ప్రభుత్వం ఏర్పడి కొన్ని పరిపాలన శాఖలు శాసనసభకు బాధ్యులైన మంత్రుల వశంలోకి వచ్చినవి. ఆ శాఖలలో విద్య ఒకటి. విద్యను గురించి సంస్కరణలు ప్రవేశపెట్టుటకు మంత్రులకు అవకాశము, అధికారము లభించినవి. 1925 లో ప్రత్యేక ఆంధ్ర విశ్వవిద్యాలయ స్థాపనార్థం శాసనసభలో ఒక బిల్లు ప్రవేశపెట్ట

బడింది. గానిని త్వరలోగా పరిశీలించుటకు ఒక సెలక్టు కమిటీ ఏర్పడింది. ఆ కమిటీ ఎదుట సాక్ష్యం ఇవ్వవలసిందిగా నన్ను ఆహ్వానించారు. దానిని పురస్కరించుకొని కమిటీ సమావేశానికి వెళ్ళి ఆంధ్ర జిల్లాలకు ప్రత్యేక విశ్వవిద్యాలయం ఏర్పడడం అవసరమని, అది అనుబంధ కళాశాలలపై అజమాయిషీ చేసే విద్యాలయం మాత్రమే గాక ఉన్నత పరీక్షలకు చదివే విద్యార్థులకు విద్యాబోధ చేసే విశ్వవిద్యాలయంగా (Teaching University) ఉండవలెననీ, అలాంటి విద్యార్థులు విశ్వవిద్యాలయంలోనే నివసిస్తూ ఒక విధమైన గురుకుల పద్ధతితో విద్యను అభ్యసించవలెననీ, విజయవాడ ఆంధ్ర దేశానికి నడిగట్టున ఉండడంచేత దీనిని అక్కడ స్థాపించడం ఉచితమనీ నా సాక్ష్యంలో చెప్పినాను.

1926 లో విశ్వవిద్యాలయం విజయవాడలో స్థాపింపబడింది. కాని ప్రథమంలో అది అనుబంధ విశ్వవిద్యాలయంగా ఉండినది. డాక్టర్ సి. ఆర్. రెడ్డిగారు ఉపాధ్యక్షులుగా ప్రభుత్వంచే నియమింపబడినారు. మామూలుగా అన్ని విశ్వవిద్యాలయాలకు ఉన్నట్లే దీనికి కూడా ఒక సెనెట్, ఒక అకాడమిక్ కౌన్సిల్, ఒక సిండికేట్ ఏర్పడినవి. మొదటి మూడు సంవత్సరాలు గడిచిన తర్వాత ఉపాధ్యక్షుని సెనెట్ ఎన్నుకొనే పద్ధతి ప్రవేశ పెట్టబడింది.

సెనెట్‌లో 15 స్థానాలకు పట్టభద్రులు సభ్యులను ఎన్నుకొనవలసినట్లు చట్టంలో ఏర్పాటు జరిగింది. దాని ప్రకారం జరిగిన ఎన్నికలలో నేను ఒక అభ్యర్థిగా నిలబడినాను. పట్టభద్రులలో అనేకులు నా శిష్యవర్గంలో చేరినవారు. ఎన్నికలకు ముందు నేను చిత్తూరు మొదలు బరంపురం వరకు పర్యటించి వోటర్లను కలుసుకొన్నాను. ఎన్నికలలో అధికసంఖ్యాకమైన వోట్లతో నేను ఎన్నుకొనబడినాను. అటుతర్వాత నేను నెల్లూరు కళాశాల ప్రిన్సిపాల్‌గా ఉన్నప్పుడు సిండికేట్‌కు కూడా ఎన్నుకొనబడినాను. నాకు మొదటినుండి విశ్వవిద్యాలయంతో సన్నిహిత సంబంధం ఉండినదని చెప్పే ఉద్దేశంతో పై విషయాలను వివరించాను.

1931 ప్రారంభంలో విశ్వవిద్యాలయంలో ఆనర్సు తరగతులు ప్రారంభించడం అవసరమని సిండికేట్ సభ్యులకు ఉత్తరాలు

వ్రాసినాను. అప్పటికి విశ్వవిద్యాలయం విజయవాడ నుండి వాల్తేరుకు మార్చబడింది. (ఈ మార్పు రాయలసీమవారికి అంగీకారం కాలేదు. అందుచేత వారు ఆంధ్ర విశ్వవిద్యాలయము నుండి విడిపోయి, పూర్వం మోస్తరుగా మద్రాసు విశ్వవిద్యాలయంలో చేరిపోయ్యారు.) నాతో ఏకీభవిస్తూ సిండికేట్ సభ్యులుగా ఉండిన బుర్రా సత్యనారాయణగారు, రాయ్ స్ట్రాక్ గారు, వేమూరు రామకృష్ణారావుగారు, డాక్టర్ త్రిమూర్తిగారు నాకు ఉత్తరాలు వ్రాశారు. కొన్ని రాజకీయ కారణాల మూలంగా అప్పటికి రెడ్డిగారు ఉపాధ్యక్షత పదవికి రాజీనామా చేశారు. వారి స్థానే రాధాకృష్ణన్ గారు ఎన్నికయ్యారు. వీరి ఎన్నికలో నేను చాలా కృషిచేశాను. వీరి స్నేహితులైన అల్లాడి కృష్ణస్వామయ్యగారు నేను కృషి చేయవలసిందిగా నాకు ఉత్తరాలు వ్రాశారు. నేను కృషి చేయుటకు ఈ ఉత్తరాలు మాత్రమే కారణం కాదు. రాధాకృష్ణన్ గారి పాండిత్యము, అంతర్జాతీయరంగంలో వారు సంపాదించిన ప్రఖ్యాతి, వారి విశాల దృక్పథము కారణాలు.

1931 జూలై నుండి విశ్వవిద్యాలయంలో ఆనర్సు తరగతులు ప్రారంభించవలెనని నిర్ణయం జరిగింది. అది ఉన్నతవిద్యను బోధించే సంస్థగా మారింది. అందుకుగాను ప్రథమంలో చరిత్ర, అర్థశాస్త్రము, రాజనీతిశాస్త్రాలను బోధించుటకు, తెనుగును బోధించుటకు ఈ రెండు శాఖలతో కూడిన సంస్థగా విశ్వవిద్యాలయం రూపొందింది.

ఈ శాఖలలో ప్రొఫెసర్లను, రీడర్లను, ఇతర అధ్యాపకులను నియమించేటట్లున్నూ, వాటికి దరఖాస్తులు పెట్టుకొనవలసినట్లున్నూ ప్రకటనలు చేశారు. నేను చరిత్రశాఖలో ప్రొఫెసరు పదవికి దరఖాస్తు పెట్టుకొన్నాను. అప్పటికి నేను ఎక్కువగా పరిశోధన చేసినవాడను కాను. అయినా 1925 లో నేను మద్రాసు విశ్వవిద్యాలయం వారి ఉపకారవేతనంతో పరిశోధనచేసి వ్రాసిన "స్థానికపన్నుల ప్రారంభదశ" (Origins of Local Laxation in the Madras Presidency) అనే గ్రంథాన్ని ఆధారంచేసికొని, నాకు విద్యను బోధించడంలోనే గాక పరిశోధనలో కూడా శక్తి సామర్థ్యాలు ఉన్నవని నా దరఖాస్తులో తెలియపరచాను.

ఈగ్రంధాన్ని 1928 లో ఆంధ్రవిశ్వవిద్యాలయంవారు ప్రకటించారు. వారు ప్రకటించిన గ్రంధాలలో ఇదే మొదటిది. దీనిని ప్రశంసిస్తూ అప్పటి ఉపాధ్యక్షులు రెడ్డిగారు ఒక తొలిపలుకు వ్రాశారు.

కొన్నిరోజులైన తర్వాత అప్పట్లో ప్రొఫెసర్‌ను నియమించదలచుకొనలేదని, రీడరుగా ఉండుటకు నేను అంగీకరించిన పక్షంలో నన్ను ఆ పదవిలో నియమించుటకు సిద్ధంగా ఉన్నట్లు రాధాకృష్ణన్ గారు సిండికేట్ సభ్యులైన డాక్టర్ త్రిమూర్తిచేత నాకు ఉత్తరం వ్రాయించారు. అప్పుడు నేను నెల్లూరు కళాశాల ప్రిన్సిపాల్‌గా ఉన్నాను. రెండవ గ్రేడు కళాశాల ప్రిన్సిపాల్ పదవి కంటె విశ్వవిద్యాలయంలో రీడరుగా ఉండడం ఉత్తమ మనే భావంతో నేను రీడరుగా ఉండుటకు అంగీకరించినాను. నెలకు 400 రూపాయల జీతంతో నన్ను రీడరుగా నియమిస్తూ ఉత్తరువులు వచ్చినవి. 1931 జూన్ ఆఖరుకు నేను విశాఖపట్టణం వెళ్ళి విశ్వవిద్యాలయంలో అధ్యాపకుడనుగా చేరాను.

కాని ప్రభుత్వానికి నా నియామకం అంగీకారయోగ్యం కాలేదు. నేను కాంగ్రెసు అభిమానినని, నెల్లూరు కళాశాల ప్రిన్సిపాల్‌గా ఉన్నప్పుడు, స్వదేశీ వస్తువుల ప్రదర్శనను ఏర్పాటు చేసినవాడ నని వారు నా నియామకాన్ని విమర్శించారు. ఇదిగాక ఆరోజులలో పాశ్చాత్య విశ్వవిద్యాలయాలలో పట్టభద్రులైన వారిపట్ల ఎక్కువ గౌరవం ఉండేది. విశ్వవిద్యాలయాలలో అధ్యాపకులుగా ఉండుటకు వారు మాత్రమే అర్హులని ఉన్నతోద్యోగాలలో ఉన్నవారు భావిస్తూ ఉండేవారు. నాకు ఆలాటి డిగ్రీలు లేవు. డాక్టర్ రాధాకృష్ణన్ వంటివారు పాశ్చాత్య డిగ్రీలు లేనివారైనా అధ్యాపకులుగాను, పరిశోధకులుగాను అంతర్జాతీయ రంగంలో కూడ గొప్ప ప్రఖ్యాతిని సంపాదించినారనీ, పాశ్చాత్య డిగ్రీలు పొందినవారిలో అత్యధికులు స్వదేశానికి వచ్చిన తర్వాత ఏలాటి ఘనమైన కృషినీ చేసినవారు కారనీ వారు విస్మరించారు. అందుచేత ప్రభుత్వం నా నియామకంపట్ల చేసిన విమర్శ సమర్థించతగ్గదికాదని, ఆంధ్రదేశంలో నాకు మంచి పేరు ప్రతిష్ఠలు ఉన్నవని, రాధాకృష్ణన్‌గారు ప్రభుత్వంతో వాదించి నా నియామకాన్ని సమర్థించారు. వారికి నా శక్తిసామర్థ్యాలపట్ల ఉండిన

సదభిప్రాయానికి ఇది ఒక తార్కాణంగా నేను భావించాను. అందుచేత నా ఉద్యోగానికి ఏలాటి భంగం కలుగలేదు. కాని నేను విశ్వవిద్యాలయంలో ఉన్నంతకాలం ప్రభుత్వంవారు నాపట్ల ద్వేషం వహించి ఉండినారు. ఆ కారణంచేత నాకు లభించవలసిన ఉన్నత పదవులు సకాలంలో రాకపోవడం జరిగింది.

ఈ సందర్భంలో మరి రెండు ఉదంతాలు పేర్కొనడం అవసరం. నావద్ద నెల్లూరు కళాశాలలో చదివిన విద్యార్థి వడ్లమూడి వెంకట్రావు సత్యాగ్రహంలో పాల్గొని జైలు శిక్షను అనుభవించి, ఆనర్సు తరగతిలో చేరుటకు నాతోకూడ విశాఖపట్టణం వచ్చి మా ఇంట్లోనే మా పిల్లలలో ఒకడివలె ఉంటూ వచ్చాడు. కాని పోలీసులు ఎప్పుడూ అతనిపై నిఘా కలవారైనారు. ఒక సి. ఐ. డి. పోలీసువాడు మామూలు దుస్తులు ధరించి ఎప్పుడూ విశాఖపట్టణంలో మా ఇంటి ఎదుట కూర్చొని ఉండేవాడు. రాజద్రోహం చేసినవారిపట్ల నాకు అభిమానం ఉన్నట్లు, ప్రభుత్వం పరిగణించుటకు ఇది కూడా ఒక అవకాశాన్ని కల్పించింది. కాని దీనిపట్ల నేను ఏలాటి శ్రద్ధను వహించలేదు. ఆనర్సులో చేరినప్పటినుండి వెంకట్రావు రాజకీయ కార్యకలాపాల నన్నిటిని మానుకొని, చదువుపట్ల మాత్రమే శ్రద్ధవహించి మూడు సంవత్సరాల ఆఖరున ఆనర్సులో కృతార్థుడైన తర్వాత కూడా కొంతకాలం మా ఇంట్లోనే ఉండి, అటుపిమ్మట అలహాబాదు విశ్వవిద్యాలయంలో ఎం. ఎ. పట్టభద్రుడై ప్రభుత్వోద్యోగాలు కొన్నిటిని చేసి, మద్రాసు విశ్వవిద్యాలయంలో స్థానికసంస్థలను గురించి పరిశోధన గావించి, కొన్ని గ్రంథాలను రచించి, గౌహతి విశ్వవిద్యాలయంలో రాజనీతిశాఖలో ప్రొఫెస రయ్యాడు. వచ్చిన జీతంలో తన ఖర్చులకు 100, 150 రూపాయలు ఉంచుకొని, తక్కిన సొమ్మును విరాళంగా విశ్వవిద్యాలయానికి ఇస్తూ ఉండే వాడు. ఇది ఒక లక్ష రూపాయలకు పెరిగిన వెంటనే జవహర్ లాల్ నెహ్రూ పేరట ఒక అధ్యాపకత్వాన్ని ఏర్పాటుచేశాడు. ఆంధ్ర విశ్వవిద్యాలయానికి నా పేరట, నా భార్యపేరట ఒక బహుమానం రాజనీతిలో కృతార్థులైన విద్యార్థులలో అగ్రశ్రేణికి చెందినవారికి ఇచ్చుటకు 7500 రూపాయలు విరాళంగా ఇచ్చాడు.

అతడు అవివాహితుడు. నిరాడంబరజీవి. ఇప్పటికి కూడా తనకు వచ్చే ఆదాయంలో చాలా భాగాన్ని గౌహతి విశ్వవిద్యాలయానికి విరాళంగా ఇస్తూ ఉన్నాడు. ఈమధ్యనే అతడు విశ్వవిద్యాలయం నుండి విరమించి గౌరవ ప్రొఫెసరుగా కృషి చేస్తూ ఉన్నాడు. అతనివంటి త్యాగశీలురు దేశంలో అనేకులు లేరు. ప్రథమంలో అతడు మా ఇంట్లో ఉన్నప్పుడు అతనిపైనా, నాపైనా సి. ఐ. డి పోలీసులు ఒక కన్ను వేసి ఉండినారని చెప్పుటకు ఈ ఉదంతాన్ని అంతా వివరించాను. ఏలాంటి విచక్షణా లేకుండా ఆనాడు దేశాన్ని పాలించిన పరాయి ప్రభుత్వం అందరిపట్ల నిరాధారాలైన అనుమానాలు కలిగి ఉండడానికి ఇది ఒక నిదర్శనం.

నేను ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ఉన్నప్పుడు ఒక పర్యాయం ప్రాథమిక ఉపాధ్యాయుల మహాసభలో మాట్లాడుటకు పార్వతీపురం వెళ్ళినాను. ఆ పట్నంలో నావద్ద అంతకుపూర్వం చదువుకొన్నవారు న్యాయవాదులుగా ఉండేవారు. వారు నన్ను కలుసుకొని న్యాయవాది సంఘం తరఫున "కమ్యూనిజం, ప్రజాస్వామ్యం" అనే విషయాన్ని గురించి ఉపన్యసించవలసిందిగా కోరినారు. దానికి అంగీకరించి సిద్ధాంత దృష్ట్యా ఈ రెండు తత్త్వాలకు ఉన్న భేదాన్ని స్పష్టంగా వివరించాను. కాని ఆనాడు ఒక సి. ఐ. డి. పోలీసు ఇన్‌స్పెక్టర్ నా ఉపన్యాసానికి వచ్చి, దానిని చక్కగా అర్థం చేసుకొనలేక, నేను కమ్యూనిస్టు తత్త్వాన్ని ప్రచారం చేసినట్లు పై అధికారులకు ఒక అబద్ధపు నివేదికను పంపినాడు. ఈ ఇన్‌స్పెక్టరు కూడ ఒకప్పుడు నాకు శిష్యుడుగా ఉండినవాడే. ఆ రోజులలో జిల్లాకి లెక్చరు, ప్రభుత్వోద్యోగులు ఇద్దరు ముగ్గురు సిండికేట్ సభ్యులుగా ఉండేవారు. వీరు ఈ నివేదికను ఆధారం చేసుకొని, నా ప్రమోషన్ విషయం చర్చలోకి వచ్చినప్పుడంతా నాకు అడ్డుతగలడం మామూలైనది. ఈవిధంగా నేను విశ్వవిద్యాలయంలో ఉన్నంతకాలం ఈలాటి దురభిప్రాయాలకు గురి అయ్యాను. జీవితంలో అదృష్టం అనే దానికి ఒక ప్రధాన స్థానం ఉన్నదని గ్రహించాను.

ఆనాటి రాజకీయాలు నా జీవితంపైననే గాక మరికొందరి జీవితాలపైన కూడ గొప్ప ప్రభావం వహించినవి. 1930 లో

సి. ఆర్. రెడ్డిగారు కాంగ్రెసు పట్ల, స్వాతంత్ర్యఉద్యమంపట్ల బ్రిటిష్ ప్రభుత్వం అనుసరిస్తున్న దమన విధానానికి నిరసనగా తమ ఉపాధ్యక్ష పదవికి రాజీనామా చేశారు. అప్పట్లో వారికి ప్రభుభక్తికంటె దేశస్వాతంత్ర్యం పట్ల ఎక్కువ భక్తి ఉండేది. తర్వాత పది సంవత్సరాలలో వారి రాజకీయ దృక్పథం పూర్తిగా మారింది. వారు గొప్ప ప్రభుభక్తి పరాయణులైనారు. వారికీ జస్టిస్ పార్టీ వారికీ ఈ విషయంలో ఏలాంటి భేదమూ కనిపించలేదు. 1939 నుండి బ్రిటిష్‌వారు రెండవ ప్రపంచ సంగ్రామంలో చిక్కుకొని ఉండినారు. అనేక రాష్ట్రాలలో కాంగ్రెసు మంత్రివర్గాలు ఏర్పడినా వారెవరితోను సంప్రతించకుండా భారతదేశం సంగ్రామంలో బ్రిటిష్‌వారి పక్షంలో ఉండి జర్మన్‌లతో యుద్ధము చేయవలసిందిగా ఏకపక్ష నిర్ణయం చేశారు. దీనికి నిరసనగా కాంగ్రెసు మంత్రివర్గాలు రాజీనామా చేయడం, రాజకీయాలలో ప్రతిష్టంభన ఏర్పడడం, కాంగ్రెసుపార్టీవారు తిరిగి సత్యాగ్రహోద్యమాన్ని ప్రారంభించడానికి సన్నాహాలు చేయడం, తుదకు 1942 ఆగస్టులో వారు 'క్విట్ ఇండియా' ఉద్యమాన్ని లేవదీయడం జరిగింది.

ఆ సందర్భంలో రెడ్డిగారు విశ్వవిద్యాలయంలోని నావంటి అధ్యాపకులు గ్రామప్రాంతాలకు వెళ్ళి, రాజభక్తిని ప్రదర్శించడం ప్రజల కర్తవ్యమని ప్రచారం చేయడం అవసరమని కళాశాలల ప్రిన్సిపాల్‌గా ఉన్న విస్సా అప్పారావుగారి ద్వారా నాకు కబురు పంపినారు. నేను అప్పుడు వారితో "అయ్యా! ఈలాంటి ప్రచారం చేయడం నా తత్త్వానికి, నా ఆశయాలకు పరమ విరుద్ధం. నేను దేశద్రోహాన్ని తలపెట్టలేను. నన్ను మన్నించండి" అని వారికి జవాబు చెప్పినాను. అంతటితో రెడ్డిగారు ఈ ప్రచారప్రయత్నాన్ని విడనాడారు.

తర్వాత కొన్ని వారాలకు మద్రాసు గవర్నరు సర్ ఆర్థర్ హోప్ విశాఖపట్టణం వచ్చి, విశ్వవిద్యాలయ హాలులో ప్రసంగం చేశారు. ప్రసంగం ముగియుటకు కొంచెం ముందు, హాస్టలులో విద్యార్థులు "హోప్ గో బాక్" (Hope go back) అని కేకలు వేశారు. ఇవి గవర్నరుకు వినబడినవి. ప్రసంగం ముగియగానే

గవర్నరు రెడ్డిగారిని పిలిచి విద్యార్థుల క్రమశిక్షణా రాహిత్యానికి ఎవరు బాధ్యులో తెలియపరచవలసిందని ఆదేశించారు. కళాశాల ప్రిన్సిపాల్ విద్యార్థుల ప్రవర్తనకు బాధ్యులని నిర్ణయిస్తూ, విస్సా అప్పారావుగారిని ప్రిన్సిపాల్ పదవినుండి రాజీనామా చేయవలసిందిగా రెడ్డిగారు కోరారు. అప్పటివరకు అప్పారావుగారు రెడ్డిగారిపట్ల ఎంతో భక్తిగలవారై వారి అడుగు జాడలలో నడుస్తూ ఉండేవారు. కొన్ని సందర్భాలలో ఉచితానుచితాలను వివక్షచేయక వారి ఉత్తరువులను అమలులో పెట్టుతుండేవారు. ఈలాటి వారిని రాజీనామా చేయమని కోరడం నమ్మకద్రోహంగా అనేకులు భావించారు. కాని అప్పారావుగారు చేయగలిగినది ఏలాటిదీ లేదని గ్రహించి, రెడ్డిగారి కోరికను మన్నించి, ప్రిన్సిపాల్ పదవికి రాజీనామాచేసి, విశ్వవిద్యాలయంనుండి వెళ్ళిపోయారు. ఈ ఉదంతంలో రెడ్డిగారు నాపైన ఎలాంటి నిందను మోపలేదు. అందుకు నేను ఎంతగానో సంతోషించాను. విశ్వవిద్యాలయంలో నాజీవితం మనోవేదనతో గడపవలసి వచ్చిందని తెలియపరచుటకు పైన పేర్కొన్న పరిస్థితులను వివరించవలసి వచ్చింది.

అప్పారావుగారి రాజీనామా గురించి వ్రాస్తూ ఉండగా షేక్స్పియర్ ఎనిమిదవ హెన్‌రీ నాటకంలో కార్డినల్ ఉల్సీ పలికిన మాటలు నా స్మరణకు వచ్చినవి.

విశ్వవిద్యాలయంలోని అధ్యాపకుని జీవితం అనేకుల సంబంధంపై ఆధారపడి ఉంటుంది. వీరిలో మొదటివారు విశ్వవిద్యాలయానికి అధికారులైన ఉపాధ్యక్షులు. నేను ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ఉన్నప్పుడు ప్రథమంలో 1936 వరకు డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణన్ గారు, అటుతర్వాత 1944 వరకు డాక్టర్ సి. ఆర్. రెడ్డిగారు ఉపాధ్యక్షులుగా ఉండినారు. వీరిద్దరి హయాంలో విశ్వవిద్యాలయం అనేకవిధాలుగా అభివృద్ధి గాంచింది. బోధనశాఖల సంఖ్య పెరిగింది. భవనాల నిర్మాణం చురుకుగా సాగింది. వీరిద్దరి కృషి ఫలితంగా విరాళాలు లభించినవి. జయపూర్ మహారాజా విక్రమదేవ వర్మగారు ఉదారస్వభావంతో ఏటేట ఒక లక్ష రూపాయలు ఇయ్యసాగారు. కొంతకాలమైన

తర్వాత ఒకే పర్యాయం రు. 20 లక్షలు ఇచ్చారు. దీనితో విజ్ఞానశాస్త్ర, సాంకేతిక శాస్త్రముల ( Science and Technology ) భవనాలకు, శాఖలకు వారి పేరు పెట్టబడింది.

రాధాకృష్ణన్ గారు గొప్ప మేధావులు. తత్వశాస్త్రంలో అంతర్జాతీయ ప్రఖ్యాతిని సంపాదించినవారు. అందుచేత సాధారణంగా వారు ప్రతిసంవత్సరం అయిదారు నెలలు విదేశాలలో పర్యటించడం పరిపాటి. ఆ నెలలలో విశ్వవిద్యాలయ వ్యవహారాలను తాత్కాలిక ఉపాధ్యక్షులు డాక్టర్ త్రిమూర్తిగారు, రిజిస్ట్రారు సి. డి. సుబ్రహ్మణ్యచెట్టిగారు నడిపేవారు. రాధాకృష్ణన్ గారు ఉపాధ్యక్షులు కావడంచేత విశ్వవిద్యాలయానికి గొప్ప పేరు ప్రతిష్ఠలు లభించినవి. కాని వారు అధ్యాపకులపైనగాని, విద్యార్థులపైనగాని గొప్ప ప్రభావాన్ని వహించలేదు. వారు తర్వాత వారణాసిలోని హిందూ విశ్వవిద్యాలయానికి ఉపాధ్యక్షులుగా ఉండిన కాలంలో విద్యార్థులను, అధ్యాపకులను అప్పుడప్పుడు సమావేశపరచి భగవద్గీతను గురించి ఉపన్యసించేవారు. కాని ఆంధ్ర విశ్వవిద్యాలయంలో వారు అలాంటి ప్రయత్నం చేయలేదు.

వారికి డాక్టర్ త్రిమూర్తి, సుబ్రహ్మణ్యచెట్టి, సి. వి. రామన్ ఆప్తులు. వారి సలహాల ననుసరించి విశ్వవిద్యాలయ పరిపాలనను సాగించేవారు. ఇదిగాక వారికి కలకత్తా విశ్వవిద్యాలయంతో సంబంధం ఉండేది. అది కారణంగా వారు బెంగాలీలను కొందరిని, డాక్టర్ శైలేశ్వర సేన్, హుమయూన్ కబీర్, హిరెన్ ముఖర్జీ మొదలైన వారిని, అధ్యాపకులుగా నియమించినారు. నేను వారికి గౌరవపాత్రుడనైనా అభిమానపాత్రుడను కాలేదు. నేను వారి ఆప్తవర్గంలో చేరిన వాడను కాను. అందుచేత రీడరు పదవి నుండి ప్రొఫెసరు పదవికి రాలేకపోయినాను. వారు నన్ను రీడరుగానే గాక విశ్వవిద్యాలయ కళాశాలల ప్రిన్సిపాల్ బాధ్యతను నిర్వహించవలసినదిగా నియమించినారు. కాని ప్రిన్సిపాల్ అనే పేరును నాకు లభింపచేయలేదు. ఇది బ్రిటిష్ పరిపాలనా పద్ధతి. వారి పరిపాలనలో ఉన్నత పదవులు, జిల్లా కలెక్టరు మొదలైనవి తెల్లదొరలు అనుభవించేవారు. కాని ఆ పదవులకు సంబంధించిన

కార్యకలాపాలను భారతీయులే నిర్వహించేవారు. వారి సలహాల ననుసరించే కలెక్టర్లు మొదలైనవారు పరిపాలన సాగించేవారు. నన్ను రీడర్ - ఇన్‌చార్జి అని వ్యవహరించారు. నాచేత చాకిరి చేయించుకొన్నారు. దానికి ఏవిధమైన ప్రతిఫలం నాకు ముట్ట లేదు. కాని విద్యార్థు లందరు వ్యవహారంలో నన్ను ప్రిన్సిపాల్ అని పిలిచేవారు. దానితో నేను తృప్తిపడినాను.

ఇదిగాక హాస్టల్ భవనాలు నిర్మాణమైన తర్వాత నన్ను హాస్టల్ వార్డన్‌గా నియమించారు. వార్డన్‌కు విశ్వవిద్యాలయ ఆవరణలో ఒక ఇంటిని కట్టి దానిని అద్దె చెల్లించవలసిన అవసరం లేకుండా నాకు ఇచ్చారు. ఈవిధంగా నేను రీడరుగాను, ప్రిన్సి పాల్ బాధ్యతను వహించేవాడనుగాను, వార్డన్‌గాను పనిచేశాను. ఏకకాలంలో ఇన్ని బాధ్యతలను నిర్వహించడం కష్టసాధ్యమైనా, వీటిని వహించడంలో కొన్ని చిక్కులు ఎదుర్కొనవలసి వచ్చినా నేను మధ్యవయస్కుడ నగుటచేతను, అధికారుల విశ్వాసానికి పాత్రుడ నైనందుననూ వాటిని ఎదుర్కొన గలిగాను.

కట్టమంచి రామలింగారెడ్డిగారు ఉపాధ్యక్షులైన తర్వాత కొంతకాలం పై పరిస్థితులే కొనసాగినవి. కాని క్రమక్రమంగా వారు నాపట్ల అభిమానంలేనివారు కావడమే కాకుండా, ద్వేష భావాన్నికూడా వహించారు. వారు కూడా రాధాకృష్ణగారి వలెనే గొప్ప మేధావులు. గొప్ప వక్తలు. వారి ఉపన్యాసాలలో అనర్గళధారతోపాటు హాస్యంకూడ ఉండేది. తెలుగులో వారి పాండిత్యం అసమానమైనట్టిది. కాని వారిలో సాత్త్వికగుణాని కంటె రాజసం ఎక్కువ. 20-వ శతాబ్దంలోకాక మధ్యయుగంలో వారు జన్మించి యుండిన పక్షాన కొండవీడులోనో, రాజమహేంద్ర వరంలోనో ఒక రెడ్డిరాజుగా ప్రఖ్యాతి గాంచి ఉండేవారు. 20-వ శతాబ్దంలో జన్మించిన కారణంగా అట్టి పదవికి అవకాశం లేక పోయింది. అయినా ఉపాధ్యక్షులుగా వారికి ఒక ఉన్నత పరిపాలనా పదవి లభించింది. వారిలోని క్షాత్రం ఆ పదవిని నిర్వ హించడంలో స్పష్టంగా కనబడింది. రాజులవలెనే వారు కొందరి పట్ల అభిమానం, మరికొందరిపట్ల ద్వేషం వహించారు. చెప్పుడు మాటలు వినుటకు అలవాటు పడినారు. దురదృష్టవశాత్తున నేను

వారి ద్వేషానికి గురి ఐనాను. ఇది నిర్హేతుకమైన ద్వేషం. ఈ కారణంచేత వారు ఉపాధ్యక్షులైన తర్వాత కూడ నాకు సకాలంలో పై పదవి లభించలేదు. తుదకు అది లభించిందిగాని దానికి కారణం వారికి నాపట్ల గల స్నేహభావం కాదు. ఇతర కారణాల మూలంగా అది నాకు లభించింది.

విశ్వవిద్యాలయాలలోని అధ్యాపకులు విద్యార్థులకు విద్యాబోధ చేయడంతో తృప్తిపడక పరిశోధన గావించి, గ్రంథ రచనలను చేసి, విజ్ఞానాభివృద్ధికి తోడ్పడవలెనని అందరూ ఆనాడు, ఈనాడు భావిస్తున్నారు. నా భావం కూడ ఈలాటిదే. ఇందు నిమిత్తం నేను "మద్రాసు రాష్ట్రంలో స్థానికసంస్థల అభివృద్ధి" (Development of Local Boards in the Madras Presidency) అనే గ్రంథాన్ని 1933 లోను, "రాజ్యపరిపాలనలో సమాఖ్య విధానము" (Federalism in Government) అనే గ్రంథాన్ని 1935 లోను ప్రచురించాను. వీటిలో రెండవ దానిని ఆంధ్ర విశ్వవిద్యాలయంవారే ప్రకటించారు. కాని అటుతర్వాత విశ్వవిద్యాలయంలో నాకు కావలసిన వసతులు సమకూరక పోవడం చేత నా పరిశోధన కార్యక్రమం ఆగిపోయింది. రాధాకృష్ణన్ గారు, రెడ్డిగారు సాంఘికశాస్త్రాలలో పట్టభద్రులైనారు. వారి పరిశోధనలు కూడా ఆ శాస్త్రాలకు సంబంధించి నట్టివే. కాని ఉపాధ్యక్షులుగా వారు విజ్ఞానశాస్త్ర పరిశోధన (Physical Sciences) పట్ల చూపినంత శ్రద్ధను సాంఘికశాస్త్రాల విషయంలో చూపలేదు. అందుచేత చరిత్ర, రాజనీతి, అర్థశాస్త్రం మొదలైన వాటిలో వారికాలంలో ఎక్కువ పరిశోధనలు, గ్రంథరచనలు జరుగలేదు. ఈ శాస్త్రాలకు సంబంధించిన గ్రంథాలనుగాని, పత్రికలనుగాని కొనుటకు కావలసిన ద్రవ్యసహాయం వారు మంజూరు చేయలేదు. ముడిపదార్థాలు లేక అనుభవయోగ్యము లైన వాటిని తయారు చేయడం సాధ్యం కాని పని. నూతన గ్రంథాలు , పత్రికలు పరిశోధకులకు కావలసిన ముడిపదార్థాలు. ఇవి విశ్వవిద్యాలయంలో నాకు లభించనందున నా పరిశోధన కార్యక్రమం ఆగిపోయింది. విశ్వవిద్యాలయాల నుండి నేను విరమించి 1944 తర్వాత మద్రాసులో నివాసము ఏర్పరచుకొనిన తర్వాతను,

1949 – '53 లో బొంబాయి విశ్వవిద్యాలయంలో రాజనీతిశాఖకు ప్రధానాధ్యాపకుడనుగా ఉన్నప్పుడును, అటు తర్వాతను నా గ్రంథరచన ఎక్కువగా జరిగింది. విశ్రాంతి, గ్రంథాలు మొదలైన పరికరాలు విరివిగా లభించడమే దీనికి కారణం.

అధ్యాపకుల పరిశోధన ఈనాడు కూడ ఒక గట్టి సమస్యగా పరిణమించింది. విశ్వవిద్యాలయాల అధికారులు అధ్యాపకుల గుణదోషాలను నిర్ణయించడంలోను, వారి పైపదవులకు గల అర్హతను నిర్ణయించడంలోను వారి పరిశోధనను ప్రధానమైన ఆధారంగా గ్రహిస్తున్నారు. కాని వారికి కావలసిన పరిశోధన సౌకర్యాలు లభిస్తున్నవా అనే విషయాన్ని పూర్తిగా విస్మరిస్తున్నారు. అధ్యాపకులు వారానికి 12, 14 గంటలు విద్యాబోధ చేయవలసి ఉన్నది. ఈ పనిని నిర్వహించుటకు వారు ఇండ్లలో రోజూ రెండు మూడు గంటలకాలం బోధన విషయాన్ని గురించి గ్రంథాలను చదవడం అవసరం. ఇది కారణంగా పరిశోధనకు కావలసినంత కాలవ్యవధి, విశ్రాంతి వారికి లభించుటలేదు. ఇదిగాక విద్యాలయంలోని గ్రంథాలయాలలో, నూతనగ్రంథాలలో ఉత్తమములైన వాటిని, పరిశోధనకు అవసరములైన పత్రికలను తగిన సంఖ్యలో సమకూర్చడం జరగడంలేదు. ఇందులో మన విశ్వవిద్యాలయాలకు, అభివృద్ధిగాంచిన ఇంగ్లండు అమెరికా మొదలైన దేశాలలోని విద్యాలయాలకు హస్తిమశకాంతరమున్నది. అందుచేతనే మనదేశపు రాజకీయాలు, ఆర్థిక విషయాలు, చరిత్ర మొదలైన వాటిని గురించి పాశ్చాత్యులు రచించ గలిగిన ఉత్తమగ్రంథాలవంటి వాటిని మన విద్యాధికులు రచించలేకపోతున్నారు. అన్నివిషయాలలో మనం వెనుకబడినట్లు పరిశోధన రంగంలో ఈ కారణంచేత వెనుకబడి ఉన్నాము. ప్రభుత్వంగాని, విశ్వవిద్యాలయాధికారులు గాని దీనిని గుర్తించకపోవడం చాలా విచారకరం.

రెడ్డిగారు నాపట్ల ద్వేషం వహించుటకు ఇంకొక కారణం కూడా ఉండినది. అకాడమిక్ కౌన్సిలులో విద్యావిధానానికి సంబంధించిన విషయా లనేకం చర్చకు వచ్చేవి. చర్చల సందర్భంలో నేను నాకు తోచిన అభిప్రాయాలను వ్యక్తం చేస్తూ ఉండేవాడిని,

ఒక్కొక్కప్పుడు ఇవి ఉపాధ్యక్షులైన రెడ్డిగారి అభిప్రాయాలకు విరుద్ధంగా ఉండేవి. ఇది వారికి ఎంతమాత్రం రుచించలేదు. నన్ను లోబరచుకొనుటకు కొంతకాలం అకాడమిక్ కౌన్సిలుకు నాయకునిగా నియమించారు. పార్లమెంటరీ విధానంలో సభానాయకుని కర్తవ్యం ప్రభుత్వం చేసిన ప్రతిపాదనలను సమర్థించడం కాని ఈ నాయకత్వం కొంతకాలం వరకు మాత్రమే. తర్వాత యథాస్థితి నెలకొన్నది.

కొసకు రెడ్డిగారు నాపట్ల వహించిన ద్వేషభావం నాకు 55 సంవత్సరాలు పూర్తికాగానే నన్ను ఉద్యోగాననుండి విరమింపజేయడంలో ఉచ్ఛస్థాయికి వచ్చింది. 1944 జనవరి 8-వ తేదీన నాకు 55 సంవత్సరాలు పూర్తి అయినవి. అప్పట్లో రెడ్డిగారు సెలవులో ఉండినారు. వారు ఎప్పుడు సెలవులో ఉండినా వారి స్థానే లక్కరాజు సుబ్బారావుగారిని (వీరు కాకినాడలో ప్రఖ్యాతి చెందిన న్యాయవాది) తాత్కాలిక ఉపాధ్యక్షునుగా నియమించడం మామూలు. అందుచేతనే వీరిని శాశ్వత తాత్కాలిక ఉపాధ్యక్షులని పేర్కొంటూ ఉండేవారు. 55 సంవత్సరాలు గడచిన తర్వాత కూడ సిండికేట్ సభవారు కొందరు అధ్యాపకుల పదవీకాలాన్ని వారి వారి అర్హతలను బట్టి పొడిగించడం మామూలు. నా ఉద్యోగకాలాన్ని పొడిగించడం సిండికేట్ సభలో చర్చకు వచ్చినప్పుడు సగం సభ్యులు పొడిగించవలసిందిగాను, తక్కిన సగం సభ్యులు పొడగించరాదని వోటు చేశారు. అధ్యక్షస్థానంలో ఉండిన సుబ్బారావుగారు (రెడ్డిగారి సలహాను అనుసరించి) పొడిగించరాదని వోటు చేశారు. ఈవిధంగా 1944, జనవరి 8-వ తేదీన నా విశ్వవిద్యాలయ అధ్యాపకత్వం ముగిసింది. ఎప్పుడు నేను వెళ్లిపోతానా అని రెడ్డిగారు కనిపెట్టుకొని వుండినారు. కొసకు వారి అభీష్టం కొనసాగింది.

లక్కరాజు సుబ్బారావుగారు రెడ్డిగారి అనంతరం ఉపాధ్యక్ష పదవి తనకు లభిస్తుందని, ఆ ఎన్నికలలో రెడ్డిగారు తనకు సహాయం చేయగలరని విశ్వసించి వుండడంచేతనే, తన వ్యక్తిత్వాన్ని పూర్తిగా వదలుకొని రెడ్డిగారి ఆదేశానుసారం సర్వదా ప్రవర్తించారు. కాని 1949 లో రెడ్డిగారు రాజీనామాచేసి

ఉపాధ్యక్ష పదవికి ఎన్నికలు జరిగిన సందర్భంలో, లక్కరాజు సుబ్బారావుగారికి సహాయం చేయక వి. యస్. కృష్ణాగారికి సహాయంచేసి వారిని గెలిపించారు. సుబ్బారావుగారు ఎంతో ఆశాభంగాన్ని పొంది రెడ్డిగారి కాలంలో జరిగిన అవకతవకలు గురించి ఒక చిన్న గ్రంథాన్నికూడా ప్రకటించారు. ఆశాభంగాన్ని పొందినవారు వీరొక్కరేకాదు. విస్సా అప్పారావుగారు, డాక్టర్ భగవంతంగారు ఒకప్పుడు రెడ్డిగారికి విశ్వాసపాత్రులుగా ఉండి తుది ఘట్టంలో ఆశాభంగాన్ని పొందినారు. రెడ్డిగారి పరిపాలన కాలంలో అధ్యాపకులలో ముఠాతత్వాలు ప్రాబల్యం గాంచినవి. అనేకులు విశ్వవిద్యాలయాన్ని వదలి ఇతర విద్యాయాలలో గొప్ప ఉద్యోగాలను సంపాదించి వెళ్లిపోయారు. ఆశాభంగాన్ని నేనొక్కడనే పొందినవాడనుకాను.

విశ్వవిద్యాలయంలోని అధ్యాపకుల జీవితం ఇతర అధ్యాపకులతో వారికి ఏర్పడే సంబంధాలపై ఆధారపడి ఉంటుంది. ఈ అధ్యాపకులను రెండు వర్గాలుగా విభజించవచ్చు. ఒక వర్గం వారు నా ఆధ్వర్యంక్రింద ఉన్న చరిత్ర, రాజనీతి, అర్థశాస్త్ర శాఖకు సంబంధించినవారు. రెండవ వర్గంవారు ఇతర శాఖలలో పనిచేసేవారు. నా శాఖలో పనిచేసేవారిలో ఒకరిద్దరితో నాకు ఘర్షణ సంభవించింది. వారిలో మొదటివారు డాక్టర్ లంక సుందరంగారు. వీరు లండన్ వెళ్ళి, ఆర్థికశాఖకు సంబంధించిన "ఉత్తర సర్కారులలోని రెవిన్యూ విధానం" గురించి పరిశోధన చేసి, పిహెచ్. డి. డిగ్రీని సంపాదించినారు. పాశ్చాత్యదేశాల డిగ్రీని సంపాదించిన కారణంగా వీరిలో అహంభావం ఎక్కువగా ఉండేది. వీరు విశ్వవిద్యాలయంలో నాశాఖలో లెక్చరర్‌గా నియమితులయ్యారు. చక్కగా ఉపన్యాసం చేయగలవారు. వీరి అభిమానశాస్త్రం ఆర్థికశాస్త్రమైనా రాజనీతిని బోధించుటకు అవకాశం కల్పించవలసిందిగా నన్ను కోరారు. అతికష్టంమీద నేను దానికి అంగీకరించినాను. ఈ శాస్త్రానికి సంబంధించిన ఒక పాఠ్యవిషయాన్ని విద్యార్థులకు బోధించవలసిందిగా ఏర్పాటు చేశాను. కాని విద్యార్థులకు వారు చెప్పినది ఏదీ అర్థం కాలేదు. ఇంతేగాక వారు విద్యార్థులకు విశ్వవిద్యాలయంలో బోధించడమే

గాక అప్పుడప్పుడు నాలుగుమైళ్ళ దూరంలోఉండే విశాఖపట్టణంలో తన ఇంటికి రమ్మని, అక్కడ పాఠాలను చెప్పటకు నిర్ణయించుకొన్నారు. విద్యార్థులకు ఇది నచ్చినది కాదు. వారి బోధ సందర్భోచితంగాను, అర్థమయ్యేటట్టిదిగాను ఉండటంలేదని తరుచుగా విద్యార్థులు నా వద్దకు వచ్చి చెప్పకొనేవారు. వారిని తృప్తిపరచడం అవసరమైంది. నేను అప్పటి తాత్కాలిక ఉపాధ్యక్షులు డాక్టర్ త్రిమూర్తిగారితో సంప్రదించి, డాక్టర్ సుందరంగారికి రాజనీతిలో ఇంకొక విషయాన్ని కేటాయించాను. అప్పటినుంచి వారు నాపట్ల విరోధభావాన్ని వహించారు. కాని దానిమూలంగా గొప్ప ప్రమాదమేమీ సంభవించలేదు. కొంత కాలమైన తర్వాత వారు విశ్వవిద్యాలయ ఉద్యోగాన్ని మానుకొని ఢిల్లీకి వెళ్లి పత్రికా రచయితగా ప్రఖ్యాతి గాంచారు. తర్వాత లోక్‌సభకు ఎన్నికై మంచి వక్త అని పేర్గాంచారు. ఇవే వారి శక్తిసామర్థ్యాలను వ్యక్తంచేయుటకు అనుగుణమైన రంగాలు. అధ్యాపకత్వం అలాటిది కాదు. నేను ఒకటి రెండు పర్యాయాలు ఢిల్లీకి వెళ్లినప్పుడు వారిని కలుసుకొన్నాను. వారు నాపట్ల అభిప్రాయాన్ని మార్చుకొని స్నేహభావంతో మర్యాదగా మాట్లాడారు.

వీరు వెళ్లిపోయిన తర్వాత వీరి స్థానే యస్. శ్రీనివాసన్ గారు లెక్చరర్‌గా నియమింపబడినారు. వీరు తిరున్వేలిజిల్లాకు చెందిన ఆంధ్రులు. విజయనగరసామ్రాజ్య కాలంలో ఆంధ్రులనేకులు దక్షిణ జిల్లాలకు వలస వెళ్ళినారు. శ్రీనివాసన్‌గారు వారి సంతతిలోనివారు. వీరు కమ్మకులానికి చెందినవారు. వీరు కూడ లండన్ వెళ్లి బి. ఎస్‌సి. డిగ్రీని సంపాదించినారు. పాశ్చాత్య డిగ్రీ ఉండడంవల్ల వీరిలో కూడా కొంచెం అహంభావం ఉండేది.

డాక్టర్ సుందరంగారు పట్టుబట్టినట్లే వీరు కూడా రాజనీతిని తనకు కేటాయించవలెనని కోరడమేగాక, కొంతకాలమైన తర్వాత నేను రాజనీతిని బోధించరాదని పట్టుబట్టారు. నేను చాలా సంవత్సరాలుగా దానిని బోధిస్తూ వచ్చాను. శ్రీనివాసన్ గారి కోరికను నేను మన్నించుటకు సమ్మతించలేదు. అప్పటి

నుంచి మా ఇద్దరి మధ్య అభిప్రాయ భేదాలు ఉత్పన్నమైనవి. వారు చక్కగా బోధించ గలవారైనా వారి డిగ్రీకి, వారి అర్హతకు తగిన పదవి తనకు లభించలేదని ఎప్పుడూ అతృప్తితో ఉండేవారు. తరుచుగా ఈ విషయాన్ని గురించి, ఇతర విషయాలను గురించి రెడ్డిగారిని కలుసుకొంటూ ఉండేవారు. ఆలాటి సమయాలలో నేను, వారికి అన్యాయం చేసినట్లు, పక్షపాత వైఖరిని అనుసరిస్తూన్నట్లు చెప్పేవారు. ఈ చెప్పుడు మాటలు రెడ్డిగారిపై కొంత ప్రభావాన్ని వహించినవి. శ్రీనివాసన్ గొప్ప మేధావి అయినా, శ్రమపడి విద్యార్థులకు బోధించేవారు కారు. మా ఇద్దరి మధ్య పూర్తి స్నేహభావం ఏర్పడలేదు. వారు నాయందు గౌరవం కలవారే. కాని నేను రీడర్‌గా ఉండడం వారు లెక్చరర్‌గా వుండడం కొంత అసూయకు కారణమైనది. కొన్ని సంవత్సరాలు గడిచిన తర్వాత వారు విశ్వవిద్యాలయాన్ని వదలి ఢిల్లీలోని Indian Institute of Public Administration లో ప్రొఫెసర్ పదవిని సంపాదించగలిగారు. ఢిల్లీలో నేను వారిని కనుకొన్నప్పుడు నా పట్ల చాలా అభిమానంతో మాట్లాడారు. వారు, వారి భార్య మా బసకు వచ్చి మా దంపతు లిద్దరిని గౌరవించారు.

గొర్తి వెంకట్రావుగారు లెక్చరర్‌గా నాతోకూడా నా శాఖలో ప్రవేశించారు. వారు అలహాబాదు విశ్వవిద్యాలయంలో ఎం. ఏ., డిగ్రీని పొందినవారు. చాలకాలం అలహాబాదులోనే నివసిస్తూ వుండినవారు. వారిది నిర్మొగమాటమైన స్వభావం. కాని ఎవరితోనూ అనవసరంగా పేచిలోకి దిగక వారి పనిని వారు నిర్వహిస్తు వుండేవారు. మా ఇద్దరిమధ్య ఏలాటి అభిప్రాయ భేదాలు ఎన్నడూ ఉత్పన్నంకాలేదు. వారు భారత దేశ చరిత్రలో పరిశోధన చేసినవారు. ఆ విషయాన్ని విద్యార్థులకు బోధించే వారు. అధ్యాపకుడుగా గొప్ప సామర్థ్యాన్ని ప్రదర్శించారు. నేను విశ్వవిద్యాలయంలో ఉన్నంతకాలం పరస్పరం గౌరవించుకొంటూ కాలం గడిపాము.

వాసిరెడ్డి శ్రీకృష్ణాగారు కూడా నాతో, విశ్వవిద్యాలయంలో అర్థశాస్త్రపు లెక్చరర్‌గా నా శాఖలో ప్రవేశించారు. ఆక్సుఫర్డు విశ్వవిద్యాలయంలో అర్థశాస్త్రంలో పట్టభద్రులైనవారు.

స్నేహపాత్రులు. నెమ్మది మనిషి. విశ్వవిద్యాలయంలో చేరిన తర్వాత తిరిగి యూరపు వెళ్ళి అర్థశాస్త్ర విద్యా కేంద్రంగా ప్రఖ్యాతి గాంచిన వియన్నా విశ్వవిద్యాలయంలో అర్థశాస్త్రాన్ని అధ్యయనం చేసి ఆంధ్ర విశ్వవిద్యాలయానికి వచ్చారు. మా ఇద్దరి మధ్య కూడా ఏలాంటి అభిప్రాయభేదాలు ఉత్పన్నం కాలేదు. రెడ్డిగారికి వీరి బోధనా సామర్థ్యంపట్ల ప్రథమంలో సదభిప్రాయం ఉండేది కాదు. వీరు చక్కగా ఉపన్యసించేవారు కారు. మితభాషి కావడమే దీనికి కారణం. కొంతకాలమైన తర్వాత వీరు అధ్యాపకత్వాన్ని వదలి విశ్వవిద్యాలయపు రిజిస్ట్రారుగా ఎన్నికయ్యారు. అప్పటినుంచి రెడ్డిగారికి సన్నిహితు లయ్యారు. ఈ సన్నిహితత్వానికి ఇంతకంటె ప్రబలమైన కారణం ఇంకొకటి ఉండేది. వీరు కమ్మకులానికి చెందిన విద్యావేత్తలు. కమ్మవారందరిలోను వీరు ఎక్కువ పలుకుబడి గలవారు. ఆ రోజులలో జిల్లాబోర్డులు కమ్మవారి వశంలో ఉండేవి. జిల్లాబోర్డు ప్రతినిధులు సెనెట్ సభ్యులుగా ఉండేవారు. అదిగాక కృష్ణాగారు తన పలుకుబడిని వినియోగించి జిల్లాబోర్డుల నుండి విశ్వ విద్యాలయానికి విరాళాలు సంపాదించగలిగారు. విరాళా లిచ్చిన వారికి కూడా సెనెట్‌లో ప్రాతినిధ్యం ఉండేది. ఉపాధ్యక్షుని ఎన్నుకొనడంలో సెనెట్ సభ్యులైన కమ్మవారి సహాయం రెడ్డి గారికి చాలా అవసరమైంది. శ్రీకృష్ణాగారు తన పలుకుబడిని వినియోగించి వారి వోట్లను రెడ్డిగారికి సంపాదించి పెట్టేవారు. రిజిస్ట్రారు కాకముందుకూడ శ్రీకృష్ణాగారు ఈలాటి సహాయాన్ని చేస్తూ ఉండేవారు. రెడ్డిగారు తన కృతజ్ఞతను తెలియపరచ దలచి, ఆర్థికశాఖను ప్రత్యేకశాఖగా నిర్మాణం చేసి, దానికి శ్రీకృష్ణాగారిని ప్రొఫెసరుగా నియమించారు. ఆ సందర్భంలో నేను కూడా ప్రొఫెసరుగా నియమింపబడినాను. నాపట్ల శ్రీ కృష్ణాగారికి అత్యంత గౌరవము ఉండడంచేత 1944 లో నేను ఉద్యోగాననుండి విరమింపబడిన తర్వాత నా ఛాయాపటమును చరిత్ర, రాజనీతి శాఖ హాలులో ప్రదర్శింప ప్రయత్నం చేసి, నా ఫోటో పంపమని ఉత్తరం వ్రాశారు. నేను ఆలాగు

చేసినాను. ఈ విషయం రెడ్డిగారికి తెలిసింది. అప్పుడు శ్రీకృష్ణా గారిని పిలిపించి నా ఫోటోను విశ్వవిద్యాలయంలో పెట్టే ప్రయత్నాన్ని విరమించవలసినదిగా ఆదేశించారు. శ్రీకృష్ణా గారు ఆ ఆదేశానుసారం ప్రవర్తించారు. అటుతర్వాత మా ఇద్దరిమధ్య ఏలాటి ఉత్తర ప్రత్యుత్తరాలు జరుగలేదు. మేము ఒకవిధంగా వేరుపడినాము. తర్వాత వారు ఒకపర్యాయం మద్రాసుకు వచ్చినప్పుడు అడయారు బస్‌స్టాండ్ వద్ద వారిని అకస్మాత్తుగా కలుసుకోవడం జరిగింది. ఒకరొకరి యోగక్షేమా లను గురించి రెండు నిమిషాలు మాట్లాడుకొన్నాము. 1949 లో వారు విశ్వవిద్యాలయానికి ఉపాధ్యక్షులుగా ఎన్నుకొనబడినారు. కాని నాకు వారికాలంలో విశ్వవిద్యాలయంతో ఏలాటి సంబంధము ఏర్పడలేదు. నేను చాలా సంవత్సరాల వరకు భారతదేశంలో పది పంద్రెండు విద్యాలయాలలో అనేక బోర్డులలో సభ్యుడుగా ఉండినాను. ఐ.ఏ.ఎస్. పరీక్షలో పరీక్షాధికారిగా కూడా పని చేసినాను. నేను దరఖాస్తు పెట్టుకొనక పోయినా బొంబాయి విశ్వవిద్యాలయంవారు 1949 లో కొత్తగా ప్రారంభింపబడిన రాజనీతిశాఖలో ప్రొఫెసర్‌గాను, ప్రధానాధ్యాపకుడుగాను ఉండ వలసిందిగా ఆహ్వానించారు. ఆ ఆహ్వానాన్ని పురస్కరించుకొని 1949-'52 లో అక్కడ ప్రొఫెసర్‌గా పనిచేసి అధికారులయొక్కయు, విద్యార్థుల యొక్కయు మన్ననలను పొందగలిగాను. కాని సుమారు పదమూడు సంవత్సరాలు అధ్యాపకుడనుగా పనిచేసిన ఆంధ్ర విశ్వవిద్యాలయంతో 1970 ప్రాంతంవరకు నాకు ఏలాటి సంబంధం లేకపోయింది.

నా శాఖలో ఉద్యోగం చేసిన వారిలో హిరెన్ ముఖర్జీ గారు ఒకరు. వీరు ఆక్స్‌ఫర్డు విశ్వవిద్యాలయంలో ఎం. లిట్. పట్టభద్రులై ఆంధ్ర విశ్వవిద్యాలయంలో లెక్చరర్‌గా నా శాఖలో నియమింపబడినారు. చరిత్ర, రాజనీతి శాస్త్రాలలో వీరు గొప్ప కృషి చేసినవారు. చక్కగాను, ఆకర్షణీయంగాను ఇంగ్లీషు భాషలో ఉపన్యసించగలవారు. వీరు నాకు చాలా సన్నిహితు లైనారు. మా మధ్య వాస్తవమైన మైత్రి ఏర్పడింది. వీరి ఉపన్యాస ధోరణి కారణంగా అందరి గౌరవానికి పాత్రులై

నా శాఖకు వన్నె తేగలిగినారు. నేను ఆరోజులలో హాస్టలుకు వార్డెన్‌గా విశ్వవిద్యాలయం ఆవరణలోనే నివసిస్తూ ఉండేవాడిని. నా నివాసంలో అప్పుడప్పుడు ముఖర్జీతో సహా మరికొందరు స్నేహితులు వారం పదిరోజుల కొక పర్యాయం సాయంకాలం సమావేశమై ఏదో ఒక విషయాన్ని గురించి చర్చించేవారు. ముఖర్జీ విశ్వవిద్యాలయంలో ఉన్నంతకాలం ఈ గోష్ఠి కార్య క్రమాలు చక్కగా సాగినవి. వారు వెళ్ళిపోయిన తర్వాత ఇది ఆగిపోయింది. వీరిక్కడనుండి వెళ్ళిపోయి, స్వస్థలమైన కలకత్తాలో కొంతకాలం అధ్యాపకుడుగాను, వార్తాపత్రికల సంపాదకులుగాను పనిచేసినారు తర్వాత దేశానికి స్వాతంత్ర్యం లభించి 1952 లో లోక్‌సభకు జరిగిన ఎన్నికలలో కమ్యూనిస్టుపక్ష అభ్యర్థిగా కలకత్తాలోని ఒక నియోజకవర్గాన నుండి నిలబడి గెలుపొందినారు. అప్పటినుంచి 1977 వరకు ప్రతి ఎన్నికలో విజయాన్ని సాధించి సభ్యులుగా ఉంటూ వచ్చినారు. కమ్యూనిస్టు పక్షానికి ఉపనాయకు లుగా లోక్‌సభలో గొప్ప బాధ్యతను నిర్వహించారు. లోక్‌సభ సభ్యులుగా వీరు గొప్ప ప్రఖ్యాతిని సంపాదించినారు. అనేక ఉత్తమగ్రంథాలను రచించినారు.

వీరు ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ఉన్నప్పుడు నాకు తెలియకనే కమ్యూనిస్టు సిద్ధాంతాలకు సంబంధించిన గ్రంథాలను తెప్పించారు. ఒక పర్యాయం విదేశాలనుండి గ్రంథాలయాధికారి కొన్ని గ్రంథాలను ఆర్డరు చేశారు. కాని కస్టమ్స్ అధికారులు వాటిని వశపరచుకొన్నారు. ఇది రెడ్డిగారికి తెలిసి, ఈ గ్రంథాలను అధ్యాపకులలో ఎవరు ఆర్డరు చేశారో తెలియపరచవలసిందిగా నన్ను ఆదేశించారు. లైబ్రరీ అధికారి థామస్‌ను విచారించగా వారు వీటిలో కొన్నిటిని రెడ్డిగారే ఆర్డరు చేశారని, తక్కినవాటిని ముఖర్జీ ఆర్డరు చేశారని తెలియవచ్చింది. ఈవిషయాన్ని నేను రెడ్డిగారితో చెప్పినాను. అప్పుడు వారు చాలా ఆశ్చర్యంతో "నేనే ఆర్డరు చేశానా" అని అన్నారు. దానిని గురించి వారు మరచిపోయ్యారు. అది తెలిసిన వెంటనే దొంగకు తేలు కుట్టినట్లు మరి దానిని గురించి ప్రస్తావం చేయలేదు. రెండవ ప్రపంచయుద్ధం

సంభవించిన తర్వాత పోలీసు అధికారులు గ్రంథాలయంలోని కమ్యూనిస్టు గ్రంథాలను వశపరచుకొన్నారు.

ముఖర్జీగారు కలకత్తాలో ఉన్నప్పుడు నేను రెండు పర్యాయాలు కలకత్తా మీదుగ ఢిల్లీ, సిమ్లాలకు వెళ్ళాను. దానిని వారికి తెలియపరచాను. వారు హౌరా స్టేషన్‌కు వచ్చి, అరగంట సేపు నాతో మాట్లాడి వెళ్ళినారు. ఒక పర్యాయం నేను ఢిల్లీకి వెళ్లినప్పుడు వారిని చూచుటకు వారి బసకు వెళ్లాను. అప్పుడు వారి ఇంట్లో ఎవరికో జబ్బుచేయడంవల్ల వారు ఎవరితోనూ మాట్లాడే స్థితిలో లేకపోయినా, నన్ను కలుసుకొని, నా యోగక్షేమాలను తెలుసుకొని, ఎక్కువకాలం నాతో గడపలేనందుకు విచారం తెలియపరుస్తూనావద్దసెలవుపుచ్చుకొన్నారు కొండా వెంకటప్పయ్యగారి శతజయంతి సందర్భంలో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం గొట్టిపాటి బ్రహ్మయ్యగారి అధ్యక్షతన ఒక కమిటీని ఏర్పాటు చేసింది. అందులో నేను కూడా ఒక సభ్యుడను. నా సంపాదకత్వాన ఒక స్మారక సంచిక ప్రకటింపబడింది. నేను అందులో ప్రకటించడానికి ఒక వ్యాసం వ్రాసి పంపవలసిందిగా ముఖర్జీగారిని కోరిన వెంటనే వారు వ్యాసాన్ని పంపించారు. ఒక పర్యాయం వారు కొన్ని సంవత్సరాల క్రిందట కమ్యూనిస్టు పక్ష వ్యవహారాల గురించి స్థానిక నాయకులతో మాట్లాడడానికి హైదరాబాదుకు వచ్చినప్పుడు, కొంచెం తీరిక చేసుకొని మా ఇంటికి వచ్చి అరగంటసేపు నాతో ఇష్టాగోష్ఠి జరిపారు. ఈనాటివరకు వారు నాపట్ల స్నేహభావంతో వుండడం నా అదృష్టంగా భావిస్తున్నాను.

ఆంధ్ర విశ్వవిద్యాలయంలో నా శాఖలో వున్న ప్రముఖులలో ఇంకొకరు డాక్టర్ వి. కె. ఆర్. వి. రావుగారు. వీరు కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయంలో ఆర్థికశాస్త్రమందు పరిశోధన గావించి పిహెచ్. డి. డిగ్రీని పొందినవారు. వీరు లెక్చరర్‌గా ఆంధ్ర విశ్వవిద్యాలయానికి వచ్చారు. వీరి మామగారు, నా మామగారు బాల్యస్నేహితులు. వీరు విశాఖపట్టణానికి భార్యతో రాలేదు. ఒంటరిగా వచ్చారు. అప్పుడు వారిని నా అతిథిగా వుండవలసినదని కోరాను. నా కోరికను మన్నించి సుమారు ఆరువారాలపాటు వారు నాకు అతిథిగా ఉండినారు. వారు గొప్ప వక్తలు. అనర్గళంగా

ఉపన్యాసం చేయగలిగినవారు. కాని ఎక్కువ వేగంతో వారు ఉపన్యసించడంచేత విద్యార్థులు వారు చెప్పిన దానిని గ్రహించడం కొంచెం కష్టంగా వుండేది. కాని వారి పాండిత్యం విద్యార్థులను ఎక్కువగా ఆకర్షించింది. వారు ఎక్కువకాలం విశ్వవిద్యాలయంలో ఉండలేదు. లెక్చరర్ ఉద్యోగం వారి అర్హతకు తగినట్టిదికాదు. వారు ఇక్కడనుంచి వారణాసి హిందూ విశ్వవిద్యాలయంలోను, అహమ్మదాబాదు కళాశాలలలోను కొంతకాలం అధ్యాపకులుగా ఉండి, తర్వాత ఢిల్లీ విశ్వవిద్యాలయంలో ప్రొఫెసర్‌గాను, ఉపాధ్యక్షులుగాను గొప్ప ఉద్యోగాలు చేశారు. నేను ఒక పర్యాయం ఢిల్లీ వెళ్ళినప్పుడు మేము దంపతులిద్దరము వారిని కలుసుకొనగా వారు మాపట్ల చాలా మర్యాదగా మాట్లాడినారు. తర్వాత వారు లోక్‌సభకు ఎన్నుకొనబడి విద్యామంత్రిగా ఉండినారు. అప్పుడు వారు హైదరాబాదు రావడం జరిగింది. ఆ సమయంలో వారు మా ఇంటికి వచ్చి మాతో చాలా ఆప్యాయంగా మాట్లాడి వెళ్ళినారు. ఇందరు ప్రముఖులు నాకు సహాధ్యాపకులుగా నా శాఖలో పనిచేయడం నాకు ఎంతో గర్వకారణమైనది.

వీరుగాక నా శాఖలో అధ్యాపకులుగా ఉన్నవారు కె. వి. పున్నయ్యగారు. వీరు నెల్లూరు కళాశాలలో ఇంటర్మీడియేట్ తరగతిలో నాకు శిష్యులుగా ఉండినారు. తర్వాత ఆంధ్ర విశ్వ విద్యాలయంలో నాకు శిష్యులై ఆనర్సు పరీక్షలో ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణులై పరిశోధన వ్యాసం వ్రాసి ఎం. ఏ. ఆనర్సు డిగ్రీని సంపాదించినారు. వీరి వ్యాసం పరీక్షాధికారు లందరి ప్రశంసలకు పాత్రమైనది. తర్వాత వీరు నా శాఖలో లెక్చరర్‌గా పనిచేసి నేను క్లిష్ట పరిస్థితులను ఎదుర్కొనవలసి వచ్చినప్పుడు నాకు మంచి సలహాల నిచ్చారు. వీరు మా కుటుంబంలో ఒకరుగా ప్రవర్తించారు. తర్వాత వీరు ప్రభుత్వ విద్యాశాఖలో ఉద్యోగిగా ప్రవేశించి, బాధ్యతతో కూడిన పదవుల నధిష్ఠించి, విద్యార్థులలో క్రమశిక్షణ లోపించకుండా వారిని మంచిమార్గంలో నడిచేటట్లు తీర్చిదిద్దగలిగారు. పరిపాలన వ్యవహారాలలో గొప్ప దక్షతను ప్రదర్శించినారు. ఫించన్ పుచ్చుకొన్న తర్వాత స్వస్థలమైన

ఒంగోలులో సి. యస్. ఆర్. శర్మ కళాశాలకు కొంతకాలం ప్రిన్సిపాల్‌గా పనిచేశారు. ఇప్పటివరకు వీరు మా దంపతులిద్దరిని తల్లిదండ్రులవలె ఆదరిస్తూ ఉన్నారు.

నా శాఖలోని అధ్యాపకులలో పైన పేర్కొన్నవారందరు యువకులు, లేదా మధ్యవయస్కులు. కాని ప్రొఫెసర్ కొయాజిగారు కలకత్తా ప్రెసిడెన్సీ కళాశాలలో ఉద్యోగంచేసి, పింఛన్ పుచ్చుకొన్న తర్వాత ఆర్థికశాస్త్రంలో ప్రొఫెసర్‌గా నా శాఖలో నియమింపబడినారు. వీరు వయస్సులోనే గాక పాండిత్యంలో కూడా భీష్మాచార్యులని చెప్పవచ్చు. గొప్ప పండితులైనా నిగర్వశిఖామణి. అందరితోను నెమ్మదిగాను, మర్యాదగాను మాట్లాడేవారు. వారికి ఎన్నడూ కోపం వచ్చినట్లు నాకు కనిపించలేదు. వారు రెండు మూడు సంవత్సరాలు మాత్రమే నా శాఖలో ఉండి తర్వాత విరమించి వారి స్వస్థలమైన బొంబాయికి వెళ్లిపోయ్యారు. వారు వెళ్లిపోవడం నాకు ఎంతో విచారాన్ని కలిగించింది. నేను ఒక పర్యాయం బొంబాయి వెళ్లినప్పుడు వారిని కలుసుకున్నాను. వారు యథాపూర్వకంగా నాతో మాట్లాడి నన్ను మధ్యాహ్న భోజనానికి ఆహ్వానించారు. అలాటివారి స్నేహం లభించడం చాలా దుస్తరం. వారు ప్రొఫెసర్‌గా ఉండినా, ప్రొఫెసర్ పదవి నేను వహించిన రీడరు పదవికంటె ఉన్నతమైనట్టిది అయినా వారి కాలంలో కూడా నా శాఖకు నేనే ప్రధానుడుగా (Head) ఉండినాను. ఇది వారి కోరికపైననే జరిగింది. వారు నా శాఖకు గొప్ప వన్నె తెచ్చినారు.

వీరిలో ఒక శ్రీనివాసన్‌గారితో తప్ప నా శాఖలోని తక్కిన అధ్యాపకులతో నాకు సత్సంబంధాలు ఏర్పడటం నా జ్ఞాపకాలలో స్థిరపడిపోయినవి. కాని పరీక్షల నిర్వహణకు సంబంధించిన కొన్ని పరిస్థితులు నాకు నచ్చినట్టివి కావు. కొందరు పక్షపాతంతో ప్రవర్తిస్తున్నట్లు నాకు తోచింది. ఆ కారణంచేత నా కుమార్తెలను ఇక్కడ చరిత్ర, రాజనీతి శాఖలో ఆనర్సు విద్యార్థులుగా చేర్చడం నాకు అంగీకారయోగ్యం కాలేదు. ఒకటి రెండు పర్యాయాలు రెడ్డిగారు కూడా ఈ పక్షపాత వైఖరిని గురించి నాతో ప్రస్తావించారు. అది కారణంగా నేను నా కుమార్తెల్లు ముగ్గురిని ఉన్నత

విద్యకై మద్రాసుకు పంపించాను. వారిలో నా మూడవ కుమారుడైన ఆనందం ఇక్కడ చరిత్రశాఖలో బి. ఏ. పరీక్షలో ప్రథమశ్రేణిలో కృతార్థుడై మద్రాసుకు వెళ్ళి అక్కడ చార్టర్డు అక్కౌంటెంట్ శిక్షణ నిమిత్తం ఒక ప్రముఖ కంపెనీలో చేరాడు. నాల్గవవాడు వెంకటేశ్వర్లు ప్రెసిడెన్సీ కళాశాలలో చరిత్ర శాఖలో ఆనర్సులోను, అయిదవవాడు పట్టాభిరాం లయోలా కళాశాలలోని ఆర్థికశాఖలో ఆనర్సు విద్యార్థిగాను చేరారు. ముగ్గురిని ఏకకాలంలో మద్రాసులో చదివించడం చాలా ఖర్చుతో కూడిన విధానమైనా ఆంధ్ర విశ్వవిద్యాలయంలోని కలుషిత వాతావరణం మూలంగా ఈలాగు చేయడం తప్పింది కాదు. దీనికంతకు రెడ్డిగారి ఉపాధ్యక్ష కాలంలో ఏర్పడిన రాజకీయాలు మౌలిక కారణం.

నేను ప్రిన్సిపాల్ బాధ్యతను నిర్వహించిన కారణంగా నాకు అన్ని శాఖలలోని అధ్యాపకులతో సంబంధాలు వుండేవి. వారందరు నాపట్ల గౌరవభావంతో ప్రవర్తించారు నా బాధ్యతను నిర్వహించడంలో వారు నాతో పూర్తిగా సహకరించారు. వీరిలో తెనుగుశాఖలో ప్రధానాధ్యాపకులుగా ఉండిన పింగళి లక్ష్మీకాంతంగారు నాకు చాలా సన్నిహితులైనారు

అధ్యాపకుని జీవితం విద్యార్థులతో అతనికి ఏర్పడిన సంబంధాలపై ఎక్కువగా ఆధారపడి ఉంటుంది. 1931 నాటికి విద్యార్థులందరి వైఖరి చాలావరకు మారింది. నేను విద్యార్థిగా ఉన్నప్పుడు, అనుబంధ కళాశాలలో పనిచేస్తున్నప్పుడు మన ప్రాచీన సంప్రదాయానికి అనుగుణంగా విద్యార్థులు అధ్యాపకులపట్ల భయభక్తులతో ప్రవర్తిస్తుండేవారు. ఎన్నడూ వారు అధ్యాపకులకు ఎదురు తిరిగేవారు కారు. సమ్మెలు లేవదీసేవారు కారు. కాని 1931 నాటికి వారిలో ఈవిషయంలో విప్లవాత్మకమైన మార్పు వచ్చింది. తిరుగుబాటు ధోరణి, సమ్మెల ధోరణి వారిలో ప్రాబల్యం గాంచినవి. దీనికి చాలావరకు గాంధీ మహాత్ముని సహాయ నిరాకరణోద్యమం కారణమని చెప్పవచ్చు. 1920లో వారు ఈ ఉద్యమాన్ని దేశస్వాతంత్ర్యాన్ని సంపాదించుటకు ప్రారంభించారు. అప్పుడు వారు విద్యార్థులను ప్రభుత్వ కళాశాలలను,

ప్రభుత్వాన నుండి ఆర్థిక సహాయాన్ని పొందే విద్యాలయాలను బహిష్కరించవలసిందిగా ఆదేశించారు. ఆ ఆదేశానుసారం విద్యార్థులు అనేకులు విద్యాలయాలను బహిష్కరించి కొందరు జాతీయ విద్యాలయాలలో విద్యార్థులుగాను, మరికొందరు కాంగ్రెసులో స్వచ్ఛంద సేవకులుగాను చేరారు. పరాయి ప్రభుత్వం భారతీయ విద్యార్థులందరిని దేశాభిమానం లేని బానిసలుగా తయారుచేయుటకు విద్యాలయాలను స్థాపించిందనే భావం వ్యాపించింది. విద్యాలయాల పట్ల, ఇంగ్లీషు విద్యావిధానంపట్ల, ఆ విధానాన్ని అనుసరించిన అధ్యాపకులపట్ల వారికి అంతకుపూర్వం ఉండిన గౌరవం అడుగంటింది. అప్పటినుంచి వారు అధ్యాపకులపైన, విద్యాలయాల పైన తిరుగుబాటు చేయడం, ఏదో ఒక కారణాన్ని పురస్కరించుకొని సమ్మెలలోకి దిగడం మామూలైంది. ఈలాటి వాతావరణంలో నేను ఆంధ్ర విశ్వవిద్యాలయంలో అధ్యాపకుడనైనాను.

మహాత్ముని దౌర్జన్యరహితమైన రాజకీయ ఉద్యమంతో పాటు బాంబులను ప్రయోగించి పరాయి ప్రభుత్వాన్ని నిర్మూలించడానికి ఉద్దేశింపబడిన విప్లవ ఉద్యమం కూడా ఈకాలంలో వ్యాపించింది. దీనికి బెంగాలు, మహారాష్ట్రం, పంజాబులు ప్రధాన కేంద్రాలైనా, ఆంధ్రదేశంలో కూడా దీని ప్రభావం లేకపోలేదు. ఇదికూడా విద్యార్థుల మనోవైఖరిలో మార్పులు తెచ్చింది.

ఇదిగాక కమ్యూనిస్టు తత్వాన్ని ప్రచారం చేసేవారు కూడా దేశంలో బయలుదేరినారు. కమ్యూనిస్టులు దౌర్జన్యము, రక్తపాతము లేక వారు తలపెట్టిన వర్గభేద రహితమైన సమాజాన్ని నిర్మాణం చేయడం సాధ్యం కాదని విశ్వసించేవారు. వారు యువకులైన విద్యార్థుల మధ్య రహస్యంగా చేరి, వారిని కమ్యూనిస్టులుగా తయారుచేయసాగారు. ఏకకాలంలో ఈలాటి నూతన శక్తులు, ఉద్యమాలు దేశంలో బయలుదేరి, విద్యార్థులకు సనాతనంగా ఉండిన విద్యపట్ల శ్రద్ధను నిర్మూలించి రాజకీయాలలోను, విప్లవ ఉద్యమాలలోను వారిని నిమగ్నుల చేసినవి. వారి మనోవైఖరిలో ఈలాటి మార్పులు జరగడం చేతనే, నేను విశ్వవిద్యాలయంలో అధ్యాపకుడనుగా అనేక చిక్కులను ఎదుర్కొనవలసినవాడ నయ్యాను.

ఈ చిక్కులు నా అధ్యాపకత్వం మూలాన వచ్చినవి కావు. ఈ ఉద్యోగంతో కూడా మరి రెండు బాధ్యతలు నాపైన విధింపబడినవి. వాటిలో మొదటిది కళాశాలల ప్రిన్సిపాల్ వహించవలసినట్టిది. ఉపాధ్యక్షులు నాకు ప్రిన్సిపాల్ అని పేరు పెట్టకపోయినా ఆ పదవికి సంబంధించిన పనులన్నిటిని నాకు అప్పగించారు. ఇది చాలా అన్యాయమని, బ్రిటిష్ పరిపాలన విధానాన్ని అనుకరించడమేనని ఇదవరలో చెప్పినాను. ఈ బాధ్యత మూలంగా నాకు విద్యార్థు లందరితో సంబంధం కలిగింది. వారు సమ్మెలలోకి దిగుటకు పైన సూచించిన కారణాలే గాక అధ్యాపకులలోని మనస్పర్థలు కూడా కొంతవరకు కారణం. దానిమూలంగా వారిలో కొందరు విద్యార్థులను సమ్మెల లోకి దిగవలసిందిగా ప్రోత్సహించడం జరుగుతూ వచ్చింది. ఒక పర్యాయం కామర్సుశాఖలో విద్యార్థులు సమ్మెచేశారు. వారితో సంప్రతింపులు జరిపే బాధ్యత నాపైన పడింది. ఆ రోజులలో ఐ. సి. ఎస్. ఉద్యోగవర్గానికి చెందిన పుల్లారెడ్డిగారు తాత్కాలిక ఉపాధ్యక్షులుగా ఉండినారు. ఈ ఉద్యోగవర్గంవారు గొప్ప పరిపాలనా సామర్థ్యం కలవారని ప్రఖ్యాతి. విద్యార్థులను సమ్మె నుండి విరమింప జేయుటకు ఏవైనా పటిష్ఠమైన చర్యలు తీసుకొనవలసిందిగా నేను వారిని కోరాను. కాని ఏలాటి చర్యలను తీసుకొనుటకు వారుకూడ సిద్ధపడలేదు. విద్యార్థులతో నేనే సంప్రతించి, అతికష్టంమీద మామూలు పరిస్థితులను నెలకొల్ప గలిగాను.

నేను హాస్టలు వార్డన్‌గా ఉండడంచేత కూడా విద్యార్థు లందరితో సంబంధం కలిగింది. వారిని తృప్తిపరచడం, వారి మధ్య సంభవించే వివాదాలను పరిష్కరించడం కష్టసాధ్యమైంది. రెడ్డిగారు ఉపాధ్యక్షులుగా ఉండిన కాలంలో ఒకనాటి రాత్రి వారి బసలో గొప్ప విందు చేశారు. ఆ సందర్భంలో హాస్టలు నుంచి తమ ఇంటికి పీటలు పంపవలసిందిగా నాకు కబురు పంపినారు. నేను పీటలు పంపినాను. తాము పీటలు లేక, నేల మీద కూర్చొని భోజనం చేయుటకు ఇష్టపడక హాస్టల్ విద్యార్థులు

ఆ పూట భోజనం మానివేయడమేగాక మరి రెండు మూడు రోజులు సమ్మెచేసి, భోజనం చేయడం మానుకొన్నారు. ఒక పూట పీటలు లేకపోవడాన్ని వారు సహించలేక పోయినారు. ఉపాధ్యాయునివంటి పెద్దమనిషిపట్ల మర్యాదతో ప్రవర్తించడం ఉచితమని నేను చేసిన బోధ ఎంతమాత్రము ఫలించలేదు. నేను రిజిస్ట్రారును, డాక్టర్ భగవంతంగారిని కలుసుకొని, భోజనం చేయుటకు ఇష్టపడని విద్యార్థులను హాస్టలునుండి బయటికి పంపించడం మంచిదనే సూచనను చేశాను. కాని ఆలాగు చేసిన పక్షంలో విద్యార్థులందరు సమ్మెచేసే ప్రమాదం ఉన్నదని వారు భయపడి నా సూచనను తిరస్కరించారు. రెండు రోజులైన తర్వాత విద్యార్థులు సమ్మెను మానుకొన్నారు.

వ్యవహారాలు ఈలాగే జరుగుతూ వచ్చినవి. ప్రతి విషయాన్ని గురించి ఏదోఒక పేచీ. ఒక పర్యాయం మూడు హాస్టల్ బ్లాకుల మధ్య ఆటలపోటీ జరిగింది. బహుమానం ఏ బ్లాకుకు ఇయ్యవలెననే బ్లాకుల విషయం గురించి పేచీ బయలుదేరింది. హాస్టల్ కమిటీ సమావేశమై రెండవ బ్లాకుకు చెందవలెనని నిర్ణయించారు. మూడవ బ్లాకువారు సమ్మె చేశారు. వారిని శిక్షించవలసిందిగా రెడ్డిగారు ఆదేశించారు. ఆ ఆదేశాన్ని అమలుపరచడం కొరకు వారిపై నాయకత్వాన్ని వహించినవారు అపాలజీ ఇయ్యవలసిందిగా కోరాను. వారు ఆలాగు చేశారు. అంతటితో ఈ ఉదంతం ముగిసింది.

ఒక పర్యాయం విద్యార్థులకు కల్తీలేని నెయ్యి లభించడం లేదనే ఫిర్యాదు బయలుదేరింది. హాస్టలుకు కావలసిన వస్తు సామాగ్రిని విద్యార్థి ప్రతినిధుల సహాయంతో మేనేజరు కొనుగోలు చేసేవాడు. శుభ్రమైన నెయ్యి ఎక్కడా లభించడంలేదు. ఈవిషయం సెనెట్ మీటింగులో కూడా చర్చకు వచ్చింది. దీనికి విరుగుడు ఏదీ కనుపించడంలేదని చెప్పాను. అప్పుడు సెనెట్ సభ్యులలో ఒకరైన వేమూరు విశ్వనాథశర్మగారు గుంటూరు నుంచి కావలసినంత నెయ్యిని తాను సప్లైచేయగలనని చెప్పారు. ఆలాగే చేయవలసినదిగా నేను కోరాను. కాని గుంటూరు నుండి పంపిన నెయ్యి విశాఖపట్టణం నెయ్యికంటె అధ్వాన్నంగా

ఉన్నదని విద్యార్థులు ఆక్షేపించసాగారు. అంతటితో ఈ సమస్యకు పరిష్కారమార్గం ఏదీ లేదని అందరూ తెలుసుకొన్నారు.

ఈవిధంగా ఈ చిల్లర వ్యవహారాలతో నా కాలం అంతా వ్యర్థం అవుతూ వచ్చింది. రానురాను వార్డన్ ఉద్యోగం మరీ విసుగు కలిగించింది. పై కారణాలే గాక మరి కొన్ని కారణాలు కూడా నాకు అతృప్తిని కలిగించినవి. నా పిల్లలు విశాఖపట్టణంలోని ఎ. వి. ఎన్. కాలేజిలో చదువుతూ ఉండినారు. రోజూ అంతదూరం నడిచి వెళ్ళడం కష్టసాధ్యంగా ఏర్పడింది. విశాఖపట్టణంలో నివసించే విద్యార్థులను విశ్వ విద్యాలయానికి తెచ్చుటకు, వారిని సాయంకాలం విశాఖపట్టణంలో దిగబెట్టుటకు ఒక యూనివర్శిటీ బస్సు ఉండేది. ఉదయం 9-30 గంటలకు అది ఖాళీగా అక్కడికి వెళ్లేది. సాయంత్రం 4-30 గంటల ప్రాంతంలో అది ఖాళీగా వాల్తేరు వచ్చేది. అందరు విద్యార్థులు ఇచ్చే చార్జీలు గాని, అంతకంటె అవసరమైతే ఎక్కువ చార్జీలు కూడా ఇస్తానని, నా పిల్లలను ఖాళీ బస్సులో ఉదయం తీసుకొనివెళ్ళి, సాయంకాలం తిరిగి వారిని దిగబెట్ట వలసినదని రిజిస్ట్రారును కోరాను. వారు ఉపాధ్యక్షులు రెడ్డి గారితో సంప్రతించి నా కోరికను నిరాకరించారు. నా కోరికను మన్నించడం మూలంగా విశ్వవిద్యాలయానికి ఏలాటి నష్టమూ లేదు. కాని వారు నాపట్ల ఏలాటి గౌరవ మర్యాదలు లేక నేను కోరిన సామాన్య సౌకర్యాన్ని నాకు అందజేయలేదు. నాపట్ల రెడ్డిగారికి ఏర్పడిన ద్వేషమే దీనికి కారణమని వేరుగా చెప్పవలసింది లేదు. తర్వాత నేను కారు కొని, పిల్లలను కాలేజికి పంపసాగాను.

హాస్టలు విద్యార్థులు వారికి కావలసిన వారిని రెండు మూడు రోజులు అతిథులుగా వారి గదులలో పెట్టుకొనవచ్చుననే ఏర్పాటు ఒకటి వుండేది. ఒకప్పుడు విప్లవనాయకుడైన ప్రతివాది భయంకరాచారిగారు రహస్యంగా హాస్టలులో నివసించే ఓరుగంటి రామచంద్రయ్య అనే విద్యార్థికి అతిథిగావచ్చి నెలరోజులు వుండినారు. అది నాకు తెలియదు. ఆ సమయంలో వారు విప్లవ తత్వాన్ని రామచంద్రయ్యకు బోధించారు. వారిద్దరు గొప్ప

స్నేహితు లయ్యారు. తర్వాత కొంతకాలానికి కాకినాడ హార్బరులో ఒక బాంబు ప్రేలింది. అప్పుడు భయంకరాచారి, రామచంద్రయ్య, మరి ఆర్గురు కలిసి కుట్రసంఘంగా ఏర్పడి ఈ బాంబు ప్రేలుటకు కారకులని పోలీసువారు వారిపై కేసు పెట్టారు. దానిని గురించి ఇక్కడ వివరించడం సందర్భోచితం కాదు. నేను వార్డన్ గా ఎదుర్కొన్న చిక్కులలో ఇది ఒకటి అని తెలియపరచుటకే దీనిని గురించి వ్రాశాను.

ఇదేవిధంగా బొంబాయికి చెందిన బాట్లివాలా అనే కమ్యూనిస్టు నాయకుడు కూడా రహస్యంగా పదిహేనురోజులు హాస్టలులో నివసించి కమ్యూనిస్టు తత్వాన్ని విద్యార్థులకు బోధించాడు. అప్పటినుంచే వారిలో సమ్మెలను చేయడంలో ఆసక్తి మరింత వృద్ధిగాంచింది.

మూడువందల విద్యార్థులతో కూడిన హాస్టలును ఒక వార్డన్ అజమాయిషీ చేయడం సాధ్యంకాదని ఇవి అన్నీ రుజువు చేశాయి. ఒక్కొక్క బ్లాకుకు ఒక డిప్యూటీ వార్డన్ను నియమించడం అవసరమని సూచించాను. అధికారులు నా సూచనపట్ల ఏలాటి శ్రద్ధను వహించలేదు. ఇటీవలకాలంలో ఈలాటి ఏర్పాటు చేసినట్లు నాకు తెలియవచ్చింది.

కళాశాలలకు, విశ్వవిద్యాలయాలకు అనుబంధంగా వసతి గృహాలు ( హాస్టల్సు ) ఉండడం చాలా అవసరమే. వాటిలో విద్యను అభ్యసించుటకు దూరప్రాంతాలనుండి విద్యార్థులు వస్తారు. వారిలో అధిక సంఖ్యాకులు చిన్న వయస్సువారు. వారు నివసించుటకు వారి భోజనాలకు ఏర్పాటుచేసే బాధ్యతను అధికారులు నిర్వహించవలసి ఉన్నది దానిని నిర్వహించుట కొరకే హాస్టలు పద్ధతిని ప్రవేశపెట్టవలసిందిగా అందరూ కోరుతున్నారు. కాని ఈ పద్ధతి ఎక్కడా కూడా సక్రమంగా ఆచరణసాధ్యం కావడం లేదు. విద్యార్థులు క్రమశిక్షణకు లోబడినప్పుడే ఇది సాధ్యం అవుతుంది. ఇటీవలకాలంలో విద్యార్థులలో అది పూర్తిగా లోపించింది. విద్యపట్ల వారికి గల శ్రద్ధ చాలావరకు తగ్గింది. విద్యార్థిదశను వారు విద్యను నేర్చుటకు వినియోగించుకొనుటకు

బదులు ఆందోళనలు లేవదీయుటకై వినియోగించుకొనుచున్నారు. ప్రజాస్వామిక విధాన ఫలితంగా ఏర్పడిన రాజకీయ పక్షాలవారు విద్యార్థులను తమ తమ కార్యకలాపాలకై వినియోగించుకొను చున్నారు. ఇది ఒక విధమైన స్వార్థం. అమాయకులు, యువకులు అయిన విద్యార్థులు వారి వలలలో చిక్కుకొని తమ భవిష్యత్తుకు భంగకరమైన కార్యకలాపాలలో పాల్గొంటున్నారు. అధ్యాపకులకు కూడా విద్యను నేర్పడంలో శ్రద్ధ తగ్గింది. శ్రద్ధ ఉన్నా విద్యను నేర్చుకొనడంలో విద్యార్థులకు శ్రద్ధలేనప్పుడు వారు చేయగలిగింది ఏలాటిది లేదు. కష్టపడి చదివి పరీక్షలలో ఉత్తీర్ణులైనా వారికి ఉద్యోగాలు లభించడంలేదు. ఈ పరిస్థితులలో విద్యను నేర్చు కొనడం మూలాన తమకు కలిగే లాభం ఏదీ లేదనే మనస్తత్వం వారిలో బలపడింది. ఈనాటి విద్యావిధానం ఒక గడ్డు సమస్యగా పరిణమించింది.

హాస్టలులు ప్రాచీన కాలంనాటి గురుకులాలవంటి వని అనేకులు చెప్పడం కద్దు. కాని గురుకులాలకు, వీటికి ఏలాటి పోలిక లేదు. వందలు, వేలు విద్యార్థులను నియమబద్ధంగా జీవితాన్ని సాగించేటట్లు చేయగల గురువులు ఈనాడు లేరు. గురువులపట్ల ఆనాడు శ్రద్ధా భక్తులు కలిగిన విద్యార్థులు ఈనాడు లేరు. వసతిగృహాలు విద్యా ర్థులు బాధ్యతారహితంగా ప్రవర్తించుటకు అవకాశం కల్గించే సంస్థలు మాత్రమే. విద్యార్థులలో సంఘీభావం ఏర్పడుటకు ఇవి సాధనాలు. కాని ఈ సంఘీభావం నిర్మాణ కార్యక్రమాలకు గాక విధ్వంసక కార్యక్రమములకు వినియోగమగుచున్నది.

విద్యాలయాల ఆధ్వర్యంలో గాక ఆ యా కులాలవారు నిర్మించుకొన్న వసతిగృహాలు ఏలాటి సంఘర్షణలు లేక నెమ్మదిగా సాగిపోతూ ఉన్నవి. గుంటూరులోని కమ్మ హాస్టల్, హైదరాబాదులోని రెడ్డి హాస్టల్ ఈలాటివి. వారణాసి హిందూ విశ్వవిద్యాలయానికి అనుబంధంగా వుండే హాస్టలులో భోజన వసతులను సమకూర్చే బాధ్యతను అధికారులు వహించడం లేదు. 25, 30 విద్యార్థులకు వీలుగా ఒక వంటశాల, ఒక భోజనశాల, వంటకు కావలసిన పాత్ర సామగ్రి అధికారులు సప్లై చేస్తారు. వంటవారిని ఏర్పాటు చేసుకోవడం, భోజన పదార్థాలను కొనడం

వంటి కార్యక్రమం ఆ 25, 30 విద్యార్థులదే. సాధారణంగా ఏదో ఒక ప్రాంతానికి చెందినవారు ఈలాంటి భోజన సౌకర్యాలకై ఒక సంఘంగా ఏర్పడి కార్యక్రమాన్ని సాగించుకొంటారు. అందుచేత భోజన వసతుల గురించి ఆక్షేపించడం జరగదు. ఈలాంటి వికేంద్రీకరణ అన్ని కళాశాలలలోను, విశ్వవిద్యాలయాల లోను ఏర్పడిన పక్షాన భోజన వసతుల మూలంగా ఉత్పన్నమయ్యే సమస్యలు ఏవీ వుండవు. దీనిని గురించి అధికారులు ఆలోచించడం మంచిది.

ప్రిన్సిపాల్ బాధ్యతను నాపై రుద్దడం చేతను, హాస్టలు వార్డన్ ఉద్యోగంలో నన్ను నియమించడం చేతను నాకు విద్యార్థు లందరితో సంబంధం ఏర్పడడం, దానిమూలంగా కొన్ని చిక్కు లను నేను ఎదుర్కొనడం తప్పనిసరి కావడం పైన వివరించాను. ఇదిగాక నాకు నా శాఖలోని విద్యార్థులతో ప్రత్యేక సంబంధం కలిగినది. వారి సంఖ్య చాలా తక్కువ. వారికి నేను విద్యాబోధ చేసేవాడను. నా బోధ వారి అవసరా లను తీర్చేటట్టిది. వారికి చక్కగా అర్థం అయ్యేటట్టిదిగాను, ఆకర్షణీయంగాను ఉండేది. ఈ కారణం మూలంగా ఎల్లప్పుడు నాపట్ల భక్తి శ్రద్ధలు కలవారుగా ఉండినారు. ఎన్నడుకూడా నాపై వారు తిరుగుబాటు చేయలేదు. అనుబంధ కళాశాలలో నా అనుభవం ఇదే. విశ్వవిద్యాలయంలో కూడా నాకు ఈలాంటి అనుభవమే కలిగింది.

నేను ఇదివరలో చెప్పినట్లు బిపిన్ చంద్రపాల్‌గారి ఉపన్యాసాలను విద్యార్థిగా ఉన్నప్పుడు వినిన కారణంగా ప్రభు త్వోద్యోగం చేయరాదని, అధ్యాపకుడుగా కృషిచేసి యువకు లను దేశాభిమానులుగా రూపొందించవలెనని నిర్ణయించు కొన్నాను. దీనిని నా జీవిత ఆశయంగా పెట్టుకొన్నాను. నా శక్తి కొలది ఈ ఆశయాన్ని సాధించినాను. దీనిని సాధించడానికి ఎక్కువ అవకాశం ఉండగలదనే భావంతో విశ్వవిద్యా లయంలో అధ్యాపకత్వాన్ని స్వీకరించాను. అనుబంధ కళాశాలలోని విద్యార్థులకంటె విశ్వవిద్యాలయంలో ఆనర్సు తరగతులలో అధ్యయనం చేసేవారు ఎక్కువ తెలివితేటలు

గలవారుగా ఉంటారు. ఎక్కువ శ్రద్ధతో విద్యావ్యాసంగం చేస్తారు. ఈ విద్యార్థులకు నేను ప్రధానంగా రాజనీతి తత్త్వాన్ని, యూరపు దేశాల చరిత్రను బోధించేవాడిని. రాజనీతిలో మానవ స్వేచ్ఛ, ప్రాథమిక హక్కులు, న్యాయాన్యాయాల స్వరూపం, పరిపాలన విధానాలలోని గుణదోషాలు మొదలైనవి చర్చనీయాంశాలు. వీటిని బోధించడంలో విద్యార్థుల పరిజ్ఞానాన్ని పెంపొందించడమే కాకుండా వారిని స్వేచ్ఛాప్రియులుగాను, దేశాభిమానపూరితులుగాను, జాతీయతాభిమానులుగాను రూపొందించే అవకాశం ఎంతైనా ఉన్నది. ఈ అవకాశాన్ని నేను పూర్తిగా వినియోగించుకొన్నాను. ఇదే విధంగా యూరపు దేశాల చరిత్రను బోధించడంలో కూడా ఈ దృక్పథంతోనే నేను నా బోధను సాగించాను. ఆధునికయుగంలో ఆ దేశాల వారు పరాయిప్రభుత్వ నిర్మూలనకు నిరంకుశ పరిపాలనను అంతరింపజేయుటకు అనేక విప్లవాలను లేవదీశారు. జర్మనీ, ఇటలీలోని స్వాతంత్ర్య సమరాలు, అమెరికన్ స్వాతంత్ర్య యుద్ధం, ఇంగ్లండు, ఫ్రాన్సు, రష్యాలలో జరిగిన విప్లవాలు ఈలాంటివి. మనదేశం కూడా రెండు వందల సంవత్సరాలుగా ఇటలీవలెనే పరాయి ప్రభుత్వానికి లోబడి ఉండినది. దాని విముక్తికే గాంధీమహాత్ముని నాయకత్వంలో స్వాతంత్ర్యోద్యమం 1920 నుండి సాగింది. ఈ ఉద్యమాన్ని పాశ్చాత్యదేశాలలోని విప్లవాలతో పోల్చవచ్చు. ఈ పోలికను సందర్భోచితంగా విద్యార్థుల దృష్టికి తేవడంచేత వారిలో దేశాభిమానం, దేశస్వాతంత్ర్యంపట్ల ఉత్సాహం బలపడింది.

నా బోధ వారికి సర్వవిధాలా ఉపయోగకరం కావడానికి నేను రోజూ నా బసలో రెండు మూడు గంటలకాలం అనేక గ్రంథాలను చదివి, బోధించవలసిన విషయాలను ముందుగానే నిర్ణయించుకొని క్లాసుకు వెళ్ళడం నా పద్ధతి. ఇది కారణంగా బోధించే విషయం ఏటేటా ఒకటే అయినా, నా బోధన పద్ధతి మూలంగా దానికి ఒక నవ్యతను చేకూర్చగలిగాను.

నా విద్యార్థులకు సమకాలిక రాజకీయ ఉద్యమాలలోని నిర్మాణాత్మకమైన ఆసక్తి కలిగినట్లు ఒక ఉదంతం స్పష్టం చేయు

గలదు. 1938 ప్రాంతాన ప్రత్యేక ఆంధ్రరాష్ట్ర నిర్మాణాన్ని గురించి రాజకీయనాయకులలోను, ప్రజలలోను కొంత సంచలనం కలిగింది. నా శాఖలోని విద్యార్థులు కూడా దానిచే ప్రభావితులై, నా సలహాతో తెనుగుశాఖలోని విద్యార్థులతో కలిసి, ఆంధ్ర సాంస్కృతిక వారోత్సవాలు జరపవలసిందిగాను, ఆ ఉత్సవాలలో ఆంధ్రుల చరిత్ర, కళలు, రాజకీయాలు మొదలైన విషయాలను గురించి ప్రముఖుల ఉపన్యాసాలను ఏర్పాటు చేయువలసిందిగాను నిర్ణయించారు. అంతకుపూర్వం ఈలాటి ఉత్సవాలు ఏ కళాశాలలోను జరగలేదు. ఇది మొదలు అవి పరిపాటి అయినవి. ఇందులో నా విద్యార్థులు మార్గదర్శకులు కావడం నాకు ఇప్పుడు కూడా ఎంతో సంతోషాన్ని కలిగిస్తున్నది. వారి నిర్ణయం మేరకు ఉపాధ్యక్షులు రెడ్డిగారు ఉత్సవాలను ప్రారంభిస్తూ గొప్ప ఉపన్యాసం చేశారు. ఆంధ్రభీష్ములు న్యాపతి సుబ్బారావు పంతులుగారు, అడివి బాపిరాజుగారు, గాడిచెర్ల హరిసర్వోత్తమ రావుగారు, గుర్రి వెంకట్రావుగారు, పింగళి లక్ష్మీకాంతంగారు ఉపన్యాసాలు చేశారు. నేను నా ఉపన్యాసంలో మనం వాంఛించ వలసింది బ్రిటిష్ పరిపాలనలోని జిల్లాలను కలిపి ఆంధ్రరాష్ట్ర నిర్మాణం చేయడం మాత్రమే కాదని, అది తెలంగాణాతో కూడిన విశాలాంధ్రంగా ఉండవలెనని, దానికి హైదరాబాదు ప్రధాన నగరంగా వుండవలెనని ఉద్ఘాటించాను. ఈ సూచన ఆచరణ సాధ్యం కాజాలదని అనేకులు అభిప్రాయపడ్డారు. రెడ్డిగారు కూడా వారితో ఏకీభవించారు. కాని అటుతర్వాత 20 సంవత్సరాలలో నేను సూచించిన విశాలాంధ్ర రాష్ట్రం, హైదరాబాదు రాజధానిగా నిర్మాణమైంది. ఈ సూచనను చేసిన వారిలో నేనే మొదటివాడనని గర్విస్తున్నాను. ఉత్సవాల సందర్భంలో ప్రముఖులు చేసిన ఉపన్యాసాలను పుస్తకరూపంలో ముద్రించి ప్రకటించాము. దానిని ఎవరైనా పునర్ముద్రణ చేయడం ఎంతైనా అవసరము.

అధ్యాపకులలో నేను విద్యార్థులకు ఎక్కువ సన్నిహితుణ్ణి కావడంచేత ఒక పర్యాయం వారు సింహాచల క్షేత్రానికి వెళ్ళ దలచి తమతో రావలసినదిగా నన్ను ఆహ్వానించారు. అప్పుడు

నేను వారితో కలిసి వెళ్లాను. మా బృందంలోని ఆడపిల్లలలో ఇద్దరు ముస్లింలు కూడా ఉండినారు. వారిని కూడా గర్భగృహం లోకి తీసుకొని వెళ్లడమూ, మానడమూ అనే సమస్య మమ్ములను ఎదుర్కొన్నది. వారిని తీసుకొని వెళ్ళడమే ఉచితమని తలచి, వారు నొసట కుంకుమబొట్టు పెట్టుకొని రావలసినదిగా చెప్పినాము. దానికి వారు అంగీకరించి, బొట్టు పెట్టుకొని దేవుని దర్శించినారు. ఇది అంత గొప్ప ఉదంతం కాకపోయినా, ఆనాటి విద్యార్థులలోని విశాలదృక్పథానికి ఒక తార్కాణంగా నా జ్ఞాపకాలలో నిలిచి పోయింది.

కొన్ని సంవత్సరాలు గడచిన తర్వాత ప్రిన్సిపాల్‌ను నియమించ దలచి రెడ్డిగారు విజ్ఞానశాస్త్రానికి చెందిన వారినే ఆ పదవిలో నియమించవలసిందిగా సెనెట్ తీర్మానాన్ని చేయించినారు. నేను ఆ శాఖకు చెందినవాడిని కాను. నన్ను ఆ పదవిలో నియమించ డానికి ఇష్టపడని కారణంగా ఈలాటి తీర్మానాన్ని చేయించినారు. మొదట డాక్టర్ భగవంతంగారు, అటుతర్వాత విస్సా అప్పారావు గారు ఈ పదవిలో నియమింపబడినారు. కాని అప్పారావుగారు చార్జి తీసుకొనడంలో కొంత ఆలస్యం జరిగింది. ఆ సమయంలో రెడ్డిగారు నన్ను యథాపూర్వంగా కొంతకాలం రీడర్ ఇన్‌చార్జిగా నియమించి సకాలంలో టైంటేబుల్సును తయారుచేయవలసింది గాను, క్లాసులు ప్రారంభించవలసిందిగాను, వీటికి కావలసిన ఏర్పాటులన్నిటినీ నేను చేయవలసిందిగాను ఆదేశించారు. ఉచితంగా చాకిరిచేయడానికి నేను అర్హుడనైనానుగాని, ప్రిన్సిపాల్ పదవికిమాత్రం అర్హుడను కాలేదు. నాపట్ల వారికి గల ద్వేషం అనేకరూపాలు ధరించింది.

ఈలాటి నిరాదరణ మూలంగా నా మనశ్శాంతికి చాలా భంగం కలిగింది. ఉద్యోగానికి రాజీనామా చేసి వెళ్ళిపోవడం మర్యాదగా ఉండగలదని అప్పుడప్పుడు నేను అనుకొనేవాడిని. కాని నిరుద్యోగిగా సంసారాన్ని పోషించడం సాధ్యంకానిపని అని అందుకు సిద్ధపడలేదు. ఈలాగే కాలం గడిచిపోయింది.

రెండవ ప్రపంచ యుద్ధకాలంలో 1942 ఏప్రిల్‌లో జపాన్ వారు విశాఖపట్టణ నౌకాశ్రయాన్ని వశపరచుకొని నగరంమీద

బాంబులు వేసి కొంత నష్టం కలిగించారు. తిరిగి బాంబులను వేసే ప్రయత్నంలో ఉండినారు. ఆ సమయంలో నేను కుటుంబ సహితంగా నెల్లూరుకు వెళ్ళదలచాను. వేసవి సెలవులు కావడంచేత ఇది సాధ్యం అయింది. కాని రైళ్లు సరిగా నడవడంలేదు. ఒక రోజు రైళ్ల రాకను గురించి తెలుసుకొనడానికి వాల్తేరు స్టేషనుకు వెళ్ళినాను. అది జపాన్ వారు నౌకాశ్రయాన్ని వశపరచుకొన్న రెండవ రోజు. నేను రైలుస్టేషన్ నుంచి ఇంటికి రావడానికి బయలుదేరగానే బాంబుల శబ్దం వినిపించింది. భయపడి ఇతరుల వలెనే నేను కూడ దగ్గర ఉండిన తపాలాఫీసులో తలదాచుకొన్నాను. బాంబుల వర్షం కురిసింది గాని మాకు ఏలాటి ప్రమాదం సంభవించలేదు. ఇంటికి వచ్చి కుటుంబంతో నెల్లూరు వెళ్ళడానికి స్టేషన్ చేరాను. అప్పటికే ఒక రైలు వచ్చి ఉండినది. టిక్కెట్లు కొనడానికి వ్యవధి ఉండినది కాదు. వాటిని కొనకుండానే ఎలాగో రైలు ఎక్కినాము. విజయవాడ స్టేషన్లో టిక్కెట్లు కొని నెల్లూరు చేరినాము. రెడ్డిగారు నేను భయపడి పారిపోయానని నన్ను హేళన చేశారు. కాని మరి రెండు నెలల తర్వాత విశ్వవిద్యాలయం గుంటూరుకు మార్చారు. అధికారంలో వున్నవారి హేళనలు, ప్రశంసలు రెండూ కూడా బాధ్యతా రహితాలు. అధికారములో ఉన్నంత వరకు వారు ఏమిచేసినా చెల్లుతుంది. కాని భాగవతంలో బలి చక్రవర్తి పలికిన మాటలు అధికారంలో వున్నవారందరు సదా జ్ఞాపకమం దుంచుకొనవలెను.

కారే రాజులు, రాజ్యముల్ గలుగవే, గర్వోన్నతిం బొందరే,
వారేరీ సిరి మూటగట్టుకొని పోవం జాలిరే, భూమిపై
బేరైనం గలదే, శిబిప్రముఖులుం బ్రీతిన్ యశఃకాములై
యీరే కోర్కులు, వారలన్ మరచిరే యిక్కాలమున్, భార్గవా.

పంచాంగం ప్రకారం పుష్య శుద్ధ సప్తమికి సరియైన 1944 జనవరి 2-వ తేదీన నాకు 55 సంవత్సరములు పూర్తియై 56-వ సంవత్సరములో ప్రవేశించాను. "జీవితంలో ఎన్నో ఆశాభంగాలు పొందినప్పటికీ మొత్తంమీద నేను విచారించ తగ్గది ఏదీ లేదు. పరిస్థితులు మంచివిగా లేకపోయినా అవి భరించరానంత చెడుగుగా

వుండలేదు. మంచి ఆరోగ్యం సమకూడిన పక్షాన నేను చెప్పుకోదగిన పనిని— గ్రంథరచనలు మొదలైన వాటిని- చేయగలను" అని నా దినచర్యలో (diary) 2-వ తేదీన వ్రాసి వున్నాను. ఈనాడు కూడా ఇది వాస్తవమనే నేను భావిస్తున్నాను.

కాని 2-వ తేదీ నాటికి కూడా నా ఉద్యోగ విరమణను గురించి అధికారులు నాకు ఏమీ తెలియపరచలేదు. నన్ను సందిగ్ధావస్థలో పెట్టినారు. 4-వ తేదీ సాయంకాలం 6 గంటలకు నన్ను విరమింపజేస్తూ అధికారులు పంపిన ఉత్తరువు (దీనిపై అర్జంట్, Urgent అని వ్రాయబడింది) నాకు అందినది. నేను అనుకొన్న మోస్తరుగానే జరిగినది. అయినా తాత్కాలిక ఉపాధ్యక్షుడు (లక్కరాజు సుబ్బారావుగారు) ఈఉత్తరవును రద్దుచేస్తూ, ఇంకొక ఉత్తరం పంపబడుతుందని 7-వ తేదీ నాకు తెలియపరచారు. అప్పటికి అకాడమిక్ కౌన్సిల్ సభ్యులు 22 మంది నా ఉద్యోగాన్ని పొడిగించవలసిందిగా ఒక ఉత్తరమును (3-వ తేదీన) వ్రాసినారు. ఈ పరిస్థితులలో తొందరపడి 4-తేదీన విరమణ ఉత్తరువును ఎందుకు జారీ చేశారో తెలియలేదు. దీనిని గురించి తుదినిర్ణయం చేయడానికి సుబ్బారావుగారి అధ్యక్షతన సిండికేట్ సమావేశమైంది. వోటు చేసిన వారిలో సగం విరమణకు ప్రతికూలంగాను, సగం అనుకూలంగాను వోటు చేశారు. సుబ్బారావుగారు రెడ్డిగారి ఆదేశాను సారం విరమణకు అనుకూలంగా వారి కాస్టింగ్ (Casting) వోటును వేశారు. దాని ఫలితంగా నన్ను ఉద్యోగాననుండి విరమింపజేస్తూ తుది ఉత్తరువు జారీచేయబడింది. ఈవిధంగా విశ్వవిద్యాలయంతో నా 13 సంవత్సరాల అనుబంధం ముగిసింది.

నేను వెంటనే గుంటూరు వదలి నా స్వస్థలం నెల్లూరు వెళ్ళడానికి సాధ్యంకాలేదు. మా పిల్లల పరీక్షలు మార్చిలో జరిగేవరకు నేను అక్కడనే ఉండవలసి వచ్చింది. ఈమధ్యకాలంలో కొన్ని వీడ్కోలు విందులు జరిగినవి. జనవరి 21-వ తేదీన అధ్యాపకుల క్లబ్ వారు (Faculty Club) వీడ్కోలు సభను సమావేశపరచారు. ఫలహారాల అనంతరం లక్కరాజు సుబ్బారావుగారు, భగవంతం గారు, గుర్తి వెంకట్రావుగారు, గంటి సోమయాజిగారు నన్ను ప్రశంసిస్తూ మాట్లాడినారు. నిబంధనలు (Rules) ఉద్యోగం

పాడిగింపునకు విరుద్ధంగా ఉండడంచేత నన్ను విరమణచేయవలసి వచ్చిందని సుబ్బారావుగారు వారి ఉపన్యాసంలో చెప్పినారు. జనవరి 25-వ తేదీన పాతవిద్యార్థుల సంఘంవారు ( Old Boys' Association ) వీడ్కోలు విందు చేశారు. సుందరరామారావు, సర్వేశ్వరరావు, ఓరుగంటి సత్యనారాయణమూర్తి మాట్లాడారు. 26-వ తేదీన విశ్వవిద్యాలయం లో పరిశోధనసంఘంవారు ( Research Association ) వీడ్కోలు విందు చేశారు. 30-న లక్కరాజు సుబ్బారావుగారు నా విరమణను గురించి ఆ పత్రికలో ఒక ఉత్తరం ప్రకటించారు. నా భార్య ప్రోత్సహించగా నేను ఫిబ్రవరి 2-వ తేదీన దానికి జవాబు ప్రకటించాను. 3-వ తేదీన ఆంధ్రపత్రిక ఒక సంపాదకీయం వ్రాసింది. నాయంకాలం చరిత్ర, రాజనీతి ఆర్థికశాస్త్ర శాఖలోని విద్యార్థులు గొప్ప వీడ్కోలు సమావేశాన్ని, విందును ఏర్పాటు చేశారు. రెడ్డిగారు, బెజవాడ రామచంద్రారెడ్డిగారు ( వీరు అప్పుడు సిండికేట్ సభ్యులు ) నన్ను ప్రశంసిస్తూ సందేశాలు పంపినారు. విద్యార్థినులు పాటలు పాడినారు. భగవంతం, కృష్ణ, శ్రీనివాసన్, విద్యార్థులలో కొందరు ప్రశంసతో కూడిన ఉపన్యాసాలు చేశారు. ఒక ఫోటో కూడా ఏర్పాటు చేయబడింది. వీడ్కోలుపత్రాన్ని ఒక దంతపు పెట్టెలో పెట్టి నాకు సమర్పించారు. నేను ఔచిత్యానికి భంగం లేకుండా జవాబు చెప్పినాను. నా భార్య కూడా మాట్లాడింది. అందరు నాపట్ల చాలా అభిమానాన్ని, ఆప్యాయతను ప్రదర్శించినారు. 6-వ తేదీన రాయప్రోలు సుబ్రహ్మణ్యం, వావిలాల కృష్ణమూర్తుల నాయకత్వాన నెల్లూరు విద్యార్థులు వీడ్కోలు సమావేశాన్ని జరిపారు. మంచి భోజనాన్ని ఏర్పాటు చేశారు. దీనితో వీడ్కోలు సమావేశాల అధ్యాయం పూర్తి అయింది. అధ్యాపకులు, విద్యార్థులు ఎక్కువ ఉత్సాహంతో వీటిలో పాల్గొనినందుకు నేను, నా భార్య ఎంతగానో సంతోషించాము. ఈ వీడ్కోలు సమావేశాలు, విందులు, వాటిలో ఉపన్యాసాల మూలంగా విషాదాంతంగా ముగియనున్న నా ఉద్యోగ విరమణ నాటకం శుభాంతంగా ముగిసింది.

ఆంధ్ర విశ్వవిద్యాలయంలో నా శాఖలో చదివిన విద్యార్థులలో అనేకులు వివిధరంగాలలో అత్యున్నతమైన కృషిగావించి పేరుప్రతిష్ఠలు సంపాదించారు. వడ్లమూడి వెంకటరావు, కె. వి. పున్నయ్యగార్లను గురించి ఇదివరకే చెప్పినాను. దుర్గాబాయి దేశ్ ముఖ్ మూడు సంవత్సరాలు నా శిష్యురాలుగా ఉండినారు. వీరు ఆంధ్ర మహిళా సభను స్థాపించి స్త్రీల ఉద్ధరణకై అనేక కార్యక్రమాలను కొనసాగించారు. రాజ్యాంగ సభలోను, ప్రణాళికా సంఘంలోను సభ్యురాలుగా గొప్ప కృషిని గావించినారు. కేంద్ర సంఘ సంక్షేమపు బోర్డుకు అధ్యక్షురాలై అతిదక్షతతో దాని కార్యక్రమాలను సాగించినారు. దేశ్ ముఖ్ గారిని వివాహమాడిన తర్వాత అనేక నూతన కార్యక్రమములను చేపట్టి అంతర్జాతీయ రంగంలో కూడా ప్రఖ్యాతి గాంచినారు. సోమంచి యజ్ఞన్నశాస్త్రిగారు బొంబాయి మునిసిపల్ కార్పొరేషన్ లో డిప్యూటీ కమీషనర్ గాను, కమీషనర్ గాను కృషి చేసినారు. రాంపల్లి విశ్వేశ్వరరావుగారు నైజాం కాలేజిలో ఆర్థికశాఖలో ప్రధాన అధ్యాపకులుగాను,అటుతర్వాతఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంలో పరిశ్రమ శాఖ డైరక్టరుగాను పనిచేశారు. రామచంద్రపోలు సుబ్రహ్మణ్యంగారు ప్రభుత్వ పురావస్తు శాఖలో గొప్ప ఉద్యోగాలు చేసి, నాగార్జున కొండ శిథిలాలను పైకి తీసి, వాటిని గురించి వివరణ గ్రంథాన్ని వ్రాసి కొంతకాలం ఉస్మానియా విశ్వవిద్యాలయంలో చరిత్ర శాఖకు ప్రధానాధ్యాపకులుగా ఉండి, ప్రస్తుతం నాగార్జున విశ్వవిద్యాలయంలో అదే శాఖలో ప్రధానాచార్యులుగా ఉన్నారు. నా శిష్యవర్గంలో ఈలాగు ప్రఖ్యాతి చెందినవారు మరికొందరు ఉన్నారు. కాని వారందరి పేర్లు నాకు ఈనాడు జ్ఞాపకానికి రాలేదు. కాని మొత్తంమీద నా శిష్యులనేకులు అనేకరంగాలలో పేరుప్రఖ్యాతులు సంపాదించడం నాకు గర్వకారణంగా ఉన్నది.

# 6. నిరుద్యోగదశ - మొదటి భాగం

ఆంధ్ర విశ్వవిద్యాలయాన నుండి 1944 జనవరి 8-వ తేదీన విరమణచేయబడినాను. అప్పటినుండి 1949 జూన్ ఆఖరు వరకు నిరుద్యోగిగా ఉండినాను. ఏదో ఒక సంస్థలో పనిచేసి, నెలజీతం పుచ్చుకొనడం ఉద్యోగానికి నిర్వచనం. కాని ఈ 5½ సంవత్సరాల కాలంలో ఒక సంవత్సరం, అనగా 1945 జూలై నుండి 1946 జూలై వరకు భీమవరం కళాశాల ప్రిన్సిపాల్‌గా పనిచేసిన విషయం ఇదివరకే తెలియపరచాను. అందుచేత నా నిరుద్యోగకాలం 4½ సంవత్సరాలు మాత్రమే.

ఈకాలంలో నాకు ఉద్యోగం లేకపోయినా ఉద్యోగం చేస్తున్నప్పుడు ఏలాగు నా జీవితాన్ని సార్థకం చేసుకొన్నానో అదేవిధంగా నిరుద్యోగ కాలాన్ని వ్యర్థపుచ్చక జీవితాన్ని సార్థకం చేసుకొన్నాను. ఉద్యోగం లేకపోయినా, నా పిల్లలు పెద్దవారై నాపైన ఆధారపడవలసిన అవసరం లేనంత వరకు కుటుంబ పోషణకు కావలసిన ఆర్థిక స్తోమత నేను సమకూర్చుకొన్నందుచేత నేను నా జీవితాన్ని నా ఇష్టానుసారం సాగించ గలిగాను. అన్ని స్వాతంత్ర్యాలకు ఆర్థిక స్వాతంత్ర్యం మూలకారణం. ఉద్యోగం చేస్తున్నకాలంలో అవసరమైన ఖర్చులను ధారాళంగా చేస్తూవుండినా నేనుగాని, నా భార్యగాని, నా పిల్లలుగాని ఏలాటి దుబారా ఖర్చులకు అలవాటు పడలేదు. అందుచేత ఆదాయంలో కొంత పొదుపుచేసి, కూడబెట్టుకొని, భూవసతిని సంపాదించి,

దానినుండి వచ్చే ఆదాయంతో పిల్లలను చదివించి, వారికి పెండ్లిండ్లు చేసి, సుఖంగా కాలక్షేపం చేయగలిగాను.

ఈకాలంలో 1944, మార్చి 31 వరకు అనగా సుమారు మూడు నెలలు గుంటూరులోనే వుండవలసి వచ్చింది. పిల్లలు స్కూళ్ళలోను, కాలేజిలలోను చదువుతూ వుండినారు. మార్చి ఆఖరుకుగాని వారి పరీక్షలు పూర్తి కాలేదు. ఇందువలననే నేను గుంటూరు వదలలేకపోయినాను.

ఈ మూడు నెలలలో నా కాలాన్ని వ్యర్థపుచ్చలేదు. నేను ఏదైనా గ్రంథాన్ని రచించవలెనని సంకల్పించాను. ఆ రోజులలో ప్రాథమిక హక్కులను రాజ్యాంగంలో చేర్చడం అవసరమా లేదా అనే విషయం వాదోపవాదాలకు గురియై వుండినది. అందుచేత ప్రాథమిక హక్కులు అంటే ఏమిటో, వాటి ప్రాధాన్యత ఏలాటిదో, అవి 18-వ శతాబ్దాన నుండి ఏ విధంగా ఆచరణలోకి వచ్చినవో మొదలైన విషయాల గురించి వ్రాయడం సందర్భోచితంగా వుంటుందని భావించాను. అందుకు గాను ప్రామాణిక గ్రంథాలను అనేకం చదివాను. అప్పుడప్పుడు ఆంధ్రా క్రిస్టియన్ కళాశాల గంథ్రాలయానికి ఇందు నిమిత్తం వెళ్లి రెండు, మూడు గంటలు అక్కడ లభించిన గ్రంథాలను క్షుణ్ణంగా పరిశీలించి నోట్సు వ్రాసుకొన్నాను. విశ్వవిద్యాలయ గ్రంథాలయానికి చందా ఇచ్చి, అందులో సభ్యుడుగా చేరి కొన్ని గ్రంథాలను ఇంటికి తెచ్చుకొని వాటిని కూడా చదివి నోట్సు వ్రాసుకొన్నాను. ఈ ముడి సామగ్రిని ఆధారం చేసుకొని జూలైలో నేను మద్రాసు నివాసి అయిన తర్వాత పుస్తకం వ్రాయడం ప్రారంభించి, ఆగస్టు ఆఖరుకు దానిని పూర్తిచేశాను. బొంబాయిలో హింద్ కితాబ్సు వారు దానిని ప్రకటించారు.

నేను ఉద్యోగం నుండి విరమించిన తర్వాత నా కార్య కలాపాలు ఎక్కువైనవి. అనేకులు నాకు విశ్రాంతి ఎక్కువగా ఉన్నట్లు భావించి, వారి సమావేశాలకు ఆహ్వానించసాగారు. గుంటూరు ఉన్నత విద్యాలయాల, ఉపాధ్యాయుల సంఘుసమావేశాల లోను, గుడివాడ, బందరు హిందూ కళాశాలల అధ్యాపకుల సమావేశాలలోను ఉపన్యసించాను. నేను నెల్లూరులో ఉండగా

రాష్ట్రీయ స్వయంసేవక సంఘంతో (R. S S.) నాకు కొంత సంబంధం కలిగింది. వారి ఆశయాలు సంకుచితములనే భావం నాకు కలిగినా, వారు హిందూ సమాజాన్ని సుసంఘటిత పరచ డానికి, హిందూ సంస్కృతిని పునరుద్ధరించడానికి గొప్ప కృషిని గావించడం దానిపట్ల నాకు ఏర్పడిన గౌరవాభిమానాలకు కారణం. నెల్లూరులో హిందూ ముస్లింల మధ్య కొట్లాటలు తరచుగా జరుగు తుండేవి. హిందువులు భయపడి ముస్లింలను ఎదుర్కొనలేక వారి బెదిరింపులకు లొంగిపోతూ ఉండేవారు. అలాటి పరిస్థితులలో ఆర్. ఎస్. ఎస్. వారు వారి శాఖనొకదానిని నెల్లూరులో స్థాపించి, హిందూ యువకులకు శిక్షణ ఇచ్చి, ధైర్య సాహసాలతో ముస్లిం లను ఎదుర్కొని నిలబడేటట్లు చేయగలిగారు. దీని ఫలితంగా ముస్లింల బెదరింపులు తుదముట్టింపబడినవి. నేను ఉద్యోగంలో ఉండినప్పుడు, విరమించిన తర్వాతను గుంటూరులోని ఆర్. ఎస్. ఎస్. కవాతులకు, సమావేశాలకు వెళ్లి ఉపన్యసించే వాడిని. మార్చి 5-వ తేదీన 'భారతదేశపు అనేకత్వంలో ఏకత్వం' (Unity in diversity) అనే విషయాన్ని గురించి ఉపన్యసించాను. దానిని వారు వారి పత్రికలో ప్రకటించారు.

1916 లో నేను, నా భార్య దివ్యజ్ఞాన సమాజంలోని సభ్యులుగా చేరినామని ఇదివరకే చెప్పినాను. ఆ సభ్యత్వం మూలంగా నేను అనేక సత్యాలను గ్రహించగలిగాను. విజయ నగరంలో ఉన్నంతకాలం సమాజ సమావేశాలకు తరచుగా వెళ్లే వాడిని. యువక విద్యార్థులను కొందరిని సమాజంలో సభ్యులుగా చేర్చి, ప్రతి ఆదివారం ఏదో గ్రంథాన్ని చదివి దానిని గురించి చర్చలు సాగించి వారిని ఆధ్యాత్మిక జీవితంపట్ల శ్రద్ధగల వారినిగా చేశాను. అలాటివారిలో ఆంధ్రప్రదేశ్ హైకోర్టు జడ్జిగాను గొప్పపదవులకు వచ్చిన పెనుమత్స సత్యనారాయణరాజు, ప్రభుత్వ విద్యాశాఖలో చేరి జిల్లా విద్యాధికారిగా పనిచేసిన పత్రి వెంకటరమణరావు జీవితాంతం వరకు దివ్యజ్ఞానంపట్ల భక్తిశ్రద్ధలు కలవారుగా ఉండినారు. రమణరావుగారు హైదరాబాదు నివాసియై, తరుచుగా అక్కడి లాడ్జిలో ఉపన్యసిస్తూ ఉండేవారు విజయనగర శాఖను సజీవంగా నిలబెట్టినవారు అక్కడి కోర్టులో

అమీనుగా ఉండిన ఆర్. నరసింహరాజుగారు. నేను నెల్లూరులో ఉండగా అక్కడి సమాజ శాఖలో ప్రతిరోజు మా మామగారు అల్లాడి నారాయణయ్యగారు భగవద్గీతను చదివి విపులంగా వ్యాఖ్యానించేవారు. డిస్ట్రిక్టు మునిసిఫ్‌గా ఉండిన మన్యం వెంకట్రామయ్యగారు తరుచుగా ఉపన్యసిస్తూ ఉండేవారు. నేను ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ఉన్నప్పుడు అక్కడి సభ్యులలో ప్రధానంగా కృషి చేసినవారు జగ్గారావు శెట్టి, బులుసు కామేశ్వర రావు, మరికొందరు. శెట్టిగారు శ్రమపడి సమాజ శాఖకు ఒక భవనాన్ని కట్టించారు. నేను, నా భార్య తరుచుగా అక్కడికి వెళ్ళి భారత సమాజ పూజలోను, ఇతర కార్యక్రమాలలోను పాల్గొనే వారము.

నేను విజయనగరంలో ఉండగా సమాజానికి అధ్యక్షులైన బీసెంటుగారు, తర్వాత అధ్యక్షులైన జినరాజదాసగారు నా ఆహ్వానంపై అక్కడకి వచ్చి నాకు అతిథులుగా ఉండి బహిరంగ సభలలో ఉపన్యాసాలు చేసారు. ఇదేవిధంగా జస్టిస్ సదాశివయ్యరు, శంకరరావు, నరహరిశాస్త్రి మొదలైనవారు నా ఆతిథ్యాన్ని స్వీకరించి అనేక ఉపన్యాసాలు గావించారు. గుంటూరులో ఉన్నప్పుడు సమాజానికి ఉపాధ్యక్షులైన శ్రీరాం, ప్రముఖ సభ్యులైన సుబ్రహ్మణ్యయ్యరు, ఆచార్య, వారి సతీమణి నాకు అతిథులై అక్కడి సమాజ శాఖలో ఉపన్యసించారు. ఇందరి ప్రముఖులతో నాకు పరిచయం కలగడంచేత దివ్యజ్ఞాన తత్త్వంలోని ఉత్కృష్టతను నేను కొంతవరకు గ్రహించ గలిగాను.

ఉద్యోగాన నుండి విరమించిన తర్వాత తరుచుగా గుంటూరు శాఖకు వెళ్ళి, అక్కడ కొన్నిపర్యాయాలు ఉపన్యసించాను. అందు నిమిత్తం నేను బీసెంటు మొదలైన ప్రముఖులు వ్రాసిన గ్రంథాలను చదివాను. ఒక పర్యాయం గుడివాడలోని సమాజానికి వెళ్ళి ఉపన్యసించాను. ఉద్యోగం లేకపోయినా నాకు గల వ్యవధిని ఏవిధంగా వినియోగించానో తెలియపరచే నిమిత్తం దివ్యజ్ఞానానికి సంబంధించిన నా జ్ఞాపకాలను ప్రస్తావించాను. నేను విజయనగరం, విశాఖపట్టణం, గుంటూరు నగరాలలో ఉండగా సమాజ

ప్రచారకులలో ఒకరైన కాకరపర్తి సత్యనారాయణగారు అనేక పర్యాయాలు వచ్చి, నాకు అతిథులుగా ఉండి సభలలో ఉపన్యసించారు. వారు చిట్టమూరు రామయ్యగారి మోస్తరుగానే సులభ శైలిలో స్పష్టంగా తెలుగులో మాట్లాడగలవారు.

మేము గుంటూరులో ఉన్నప్పుడు ప్రఖ్యాత చారిత్రక పరిశోధకులు డాక్టర్ మారేమండ రామారావుగారు హిందూ కాలేజిలో అధ్యాపకులుగా ఉండేవారు. వారు ఆంధ్రచరిత్ర సమావేశాన్ని ఏర్పాటుచేసి, మూడు రోజులు దానిని జరిపారు. నేను దానికి ప్రారంభోత్సవంచేసి, చరిత్రను గురించి ఉపన్యసించాను. మద్రాసునుండి ఆచార్య నీలకంఠశాస్త్రి, డాక్టర్ నేలటూరు వెంకటరమణయ్యగార్లు వచ్చి గొప్ప ఉపన్యాసాలు చేశారు. ఈలాటి సమావేశాలకు శాశ్వతత్వం చేకూర్చడానికి 'ఆంధ్రచరిత్ర సంఘం' అనే పేరుతో ఒక సంస్థను స్థాపించి, దానికి నన్ను అధ్యక్షుడుగాను, రామారావుగారిని కార్యదర్శిగాను ఎన్నుకొన్నారు. సమావేశ కాలంలో ఒకరోజున నన్ను గౌరవిస్తూ ఒక సన్మానపత్రాన్ని నాకు సమర్పించారు.

నేను గుంటూరులో గడిపిన మూడు నెలలలో ఆంధ్ర పత్రిక సంవత్సరాది సంచికకు 'మన మైనారిటీల సమస్య' అనే విషయాన్ని గురించి ఒక వ్యాసం వ్రాశాను. హిందూ కళాశాలలో కృష్ణదేవరాయ వర్ధంతి సందర్భంగా ఉపన్యసించాను. ఈవిధంగా ఉద్యోగం నుండి నేను విరమించినా నా కాలాన్ని వృథాచేయక అనేక కార్యక్రమాలలో పాల్గొని, మార్చి 31న కుటుంబ సహితంగా నెల్లూరు చేరాను.

నేను నెల్లూరులో మూడు నెలలు ఉండినాను. అది నా స్వస్థలం కావడంచేత బంధువుల మధ్య ఉండటానికి కొంత అవకాశం కలిగింది. నా పెద్ద కుమార్తె అన్నపూర్ణ, నా అల్లుడు (వీరు నా బావమరదికూడా) డాక్టర్ మహాదేవయ్య, వారి సంతానం అక్కడ ఉండేవారు. నా రెండవ అల్లుడు అల్లాడి వాసుదేవన్ రైల్వేలో గొప్ప ఉద్యోగంలో ఉండేవారు. ఆయన కూడా సెలవు పుచ్చుకొని నా కుమార్తె గోదావరితో నెల్లూరులో ఉండినారు. వారికి అప్పటికి ముగ్గురు పిల్లలు. నా తమ్ముడు రామకృష్ణయ్య

నెల్లూరులో లాయరుగా ఉండేవాడు. వాడి కుటుంబం కూడా పెద్దదే. వీరందరు మా ఇంటికి రావడం, మేము వారి ఇండ్లకు పోవడం పరిపాటి అయింది. నా పెద్ద కుమార్తె పిల్లలు అయిదుగురు తరుచుగా మా ఇంట్లోనే గడిపేవారు. వారు మధ్యాహ్న భోజనానికి, సాయంత్రం కాఫీ ఫలహారాలకు ఇక్కడే ఉండడం మామూలైంది. నా భార్య తన కాలంలో చాలాభాగం ఇందరికీ వంటచేసిపెట్టడంలోను, ఫలహారాలు తయారుచేయడంలోను వినియోగించవలసి వచ్చింది. నా మూడవ కుమార్తె వైదేహి తల్లికి కొంత సహాయంచేసినా ఆమె ఇంతటి శ్రమకు ఇదివరలో అలవాటుపడని కారణంగా చాలా బాధపడేది. వంటవాడిని పెట్టు కొనగల శక్తి ఆరోజులలో మాకు ఉండేదికాదు. అందుచేత ఏలాగో నా భార్య చాలా ఓపికతో ఈ పనులన్నిటిని నిర్వహిస్తూ వచ్చింది.

ఇదేవిధంగా నా కాలం కూడా ఇంటి వ్యవహారాలు చక్క బెట్టుకొనడంలో వినియోగం కావడంచేత నేను తలపెట్టిన గ్రంథ రచన ఆగిపోయింది. నెల్లూరుకి పది మైళ్ళ దూరంలో బొంతల పాలెం గ్రామంలో నేను అదివరకే 30, 35 ఎకరాల మంచి మాగాణి భూమిని కొని ఉండినాను. దానిని మక్తాపద్ధతిని పది పన్నెండు రైతులకు యిచ్చి సాగుచేయిస్తూ ఉండినాను. నెల్లూరులో ఉండిన మూడునెలల కాలంలో అయిదారు పర్యాయాలు అక్కడికి వెళ్ళి మక్తా ధాన్యం వసూలుచేసి, దానిని అమ్మడంలోను, రైతులతో ఇతర వ్యవహారాలు పరిష్కరించడం లోను కాలం గడపవలసి వచ్చింది.

ఇదీగాక నా స్వంతయింటిలో ఇంతవరకు నెల్లూరు కళాశాలలో అధ్యాపకుడుగా ఉండిన నా పెద్ద కుమారుడు నరసింహం, వాడి భార్య ఉండేవారు. వారికి కొన్ని నెలల క్రిందట ఒక మొగపిల్లవాడు కలిగాడు. మేమందరం నెల్లూరికి రావడంతో ఆ ఇల్లు చాల లేదు. అందుచేత మేడమీద వరండా సహితంగా ఒక గదిని కట్టించాను. సిమెంటు కొరత మూలంగాను, పనివాండ్రు సక్రమంగా పనిచేయకపోవడం చేతను ఈ పని పూర్తికావడానికి అయిదారు వారాలు పట్టింది. ఇందుకుగాను నేను రెండువేల రూపాయలు ఖర్చుపెట్టాను. ఇది కూడా నా గ్రంథ రచనా కార్యక్రమానికి అడ్డు కలిగించింది.

నా రెండవ కుమారుడు సీతారాం వారణాసిలోని హిందూ విశ్వవిద్యాలయంలో, బి. యస్‌సి., ఎం. ఎస్‌సి. పరీక్షలకు చదివి నేను గుంటూరులో ఉన్నప్పుడే తిరిగి నావద్దకు చేరాడు. ఎంతప్రయత్నం చేసినా వాడి అర్హతకు తగిన ఉద్యోగం లభించ లేదు. బెజవాడలో ఒక మందులు తయారుచేసే ఫ్యాక్టరీలో 60 రూపాయిల నెల జీతంపైన చేరాడు. రోజూ ఉదయం ఎనిమిది గంటలకే భోజనం చేసి, విజయవాడ రైలులో వెళ్ళి, సాయంత్రం ఆరు గంటలకు తిరిగి ఇంటికి గుంటూరుకి వచ్చేవాడు. ఇది చాలా ప్రయాసతో కూడిన ఉద్యోగంగా పరిణమించినా నిరుద్యోగిగా ఉండడంకంటె ఏదో ఒక ఉద్యోగం ఉండడం ఉత్తమమనే ఉద్దేశంతో ఈ ఉద్యోగం చేస్తూ వచ్చాడు. కాని నేను నెల్లూరుకి వచ్చిన తర్వాత ఇది వాడికి సాధ్యం కాలేదు. అప్పటికి నా మూడవ కుమారుడు ఆనందం హైదరాబాదులో ఆడిటర్‌గా పనిచేస్తూ వచ్చాడు. వాడి సహాయంతో వీడికి కూడా అక్కడ ఏదో ఒక ఉద్యోగం లభించగలదని ఆశిస్తూ వచ్చాను.

ఉద్యోగం లభించకపోయినా వాడికి వివాహం చేయవలెనని నిర్ణయించుకొన్నాము. అప్పటికి వాడి వయస్సు 25 సంవత్సరాలు. అది వివాహానికి తగిన వయస్సుగా నేను, నా భార్య భావించాము. నా భార్య పెదతండ్రి అల్లాడి మహాదేవ శాస్త్రిగారి కుమారుడు కృష్ణన్ అడయారులోని దివ్యజ్ఞాన సమాజంలో ఒక ఉద్యోగిగా ఉండేవాడు. ఆయన కుమార్తె రాధ మెట్రిక్యులేషన్ వరకు చదివింది. ఆపిల్లను సీతారాం వివాహ మాడిన పక్షంలో మా రెండు కుటుంబాల మధ్య ఇదివరకుండిన సంబంధం మరింత బలపడగలదని భావించి, ఇందుకు సమ్మతించాము. వివాహం ఏప్రిల్ 28-వ తేదీన మద్రాసు తిరువళిక్కేణిలో వైభవంగా జరిగింది. మా కుటుంబంలోని వారందరం అందులో పాల్గొన్నాము. కోడలి గృహప్రవేశానికి గాను మే 2-వ తేదీన నెల్లూరులో మా ఇంటిలో ఏర్పాటు చేసినాము. కృష్ణన్ గారు, వారి భార్య, మరికొందరు బంధువులు దానికి వచ్చారు. ఆరోజు రాత్రి గొప్ప విందు చేశాను. మరుసటి రోజు వియ్యాలవారందరు మద్రాసుకు వెళ్లిపొయ్యారు. ఈ శుభకార్యం అందరికీ తృప్తికరంగా

జరిగింది. నా శక్తికొలది కోడలికి కొన్ని బంగారు నగలు చేయించాను. వివాహం నిమిత్తం నేను 1600 రూపాయలు ఖర్చు పెట్టాను.

హైదరాబాదులో ఏదో ఉద్యోగం లభించగలదని, వెంటనే బయలుదేరి రావలసిందని ఒక టెలిగ్రాం రావడంతో నా కుమారుడు సీతారాం 3-వ తేదీ రాత్రి బయలుదేరి అక్కడికి వెళ్లాడు. నా కోడలు రాధను తాత్కాలికంగా పుట్టింటికి పంపినాను. కాని హైదరాబాదులో వాడికి ఏలాటి ఉద్యోగం దొరకలేదు. వాడు, నేను చాలా ఆశాభంగాన్ని పొందినాము. తిరిగి వాడు నెల్లూరుకు వచ్చాడు. వాడితో కలిసి నేను మద్రాసుకు వెళ్లినాను. అక్కడ వ్యవసాయ శాఖలో గొప్ప ఉద్యోగిగా ఉండిన డాక్టర్ నాథ్‌ను కలుసుకొన్నాను. వారి సహాయంతో నా కుమారుడికి ఢిల్లీలో ఒక చిన్న ఉద్యోగం లభించింది. మేము, నాకోడలు రాధ నెల్లూరుకి వచ్చాము. మే 23-వ తేదీన వారిద్దరు ఢిల్లీకి వెళ్లారు. స్వల్పజీతంతో ఢిల్లీలో వారిద్దరు ఉండడం కొంతకష్టమని తోచినా ఏదో ఒక ఉద్యోగం దొరికిందిగదా అనే భావంతో వారు అక్కడ ఉండిపోయినారు.

నాకు చాలాకాలాన నుండి దేశంలోని విద్యా సమస్యలను పరిశీలించడంలో చాలా ఆసక్తి ఉండేది. ఆ కారణంచేతనే బందరులో మద్దూరి శేషాచలంగారితో కలిసి "ఎడ్యుకేషనల్ ఇండియా" అనే మాసపత్రికను స్థాపించినాను. దానికి నేను సంపాదకుడను. ఖర్చులు వగైరా శేషాచలంగారు భరించేవారు. నేను రచించిన పాఠ్యగ్రంథాలను వారే ప్రకటించారు. మాస పత్రికకు సంపాదకీయాలు వ్రాసే సందర్భంలో విద్యారంగంలో ఉత్పన్నములైన సమస్యలన్నిటిని గురించి ఇతరులు వ్రాసిన ఉత్తమ గ్రంథాలను ఇతర ప్రామాణిక పత్రికలను చదవడం నాకు పరిపాటి అయింది.

ఇదే కారణాన 'ఆంధ్ర అధ్యాపకుల సమాఖ్య' (Andhra Teachers' Federation) అనే సంస్థను స్థాపించడంలో ప్రముఖ పాత్రను వహించాను. ఏటేట ఎక్కడో ఒకచోట అది సమావేశమై విద్యావిషయమై చర్చలు సాగించి, తీర్మానాలు చేసి

అధికారులకు పంపడం జరుగుతూ వచ్చింది. కాని అధ్యాపకులకు ఈలాంటి కార్యక్రమాలలో ఎక్కువ ఆసక్తి లేనందున కొంత కాలమైన తర్వాత సాంవత్సరిక సమావేశాలు ఆగిపోయినవి. నేను నెల్లూరుకి వచ్చిన తర్వాత అక్కడి అధ్యాపకులు కొందరితో దానిని పునరుద్ధరించే ఉద్దేశంతో దాని ఆధ్వర్యంలో ఒక సమావేశాన్ని జరపడానికి నిర్ణయించాను. నేను మద్రాసుకు వెళ్లి ఆ సమావేశానికి అధ్యక్షుడుగా ఉండమని శొంఠి రామమూర్తిగారిని కోరాను. వారు తనకు తీరుబడి లేదని నా కోరికను నిరాకరించారు. తర్వాత పచ్చయప్ప కళాశాలలో ఆర్థికశాఖలో ప్రధానోపాధ్యాయులుగా ఉండిన నారాయణస్వామినాయుడు గారిని అధ్యక్షుడుగా ఉండమని అభ్యర్థించాను. దానికి వారు సమ్మతించారు.

సమావేశం మే 6-వ తేదీన నెల్లూరు కళాశాలలో జరిగింది. పౌణకా గోవిందరెడ్డిగారు ప్రారంభోత్సవం చేశారు. నాయుడుగారు అధ్యక్షోపన్యాసం గావించారు. బెజవాడ రామచంద్రారెడ్డిగారు కూడా ఉపన్యసించారు. 7-వ తేదీన చర్చలు కొనసాగినవి. అనేక తీర్మానాలు చేయబడినవి. మధ్యాహ్నం 12 గంటలకు సమావేశం ముగిసింది. ఏలాగో సమావేశం జరిగినందుకు నేను చాలా సంతోషించాను. నేను నెల్లూరులో ఉండగా ఇది తప్ప ఇతర కార్యక్రమాలలో పాల్గొనలేదు. పాల్గొనదగిన కార్యక్రమాలు కూడా ఏవీ జరగలేదు. ప్రజలలో ఎవరికీ, ఎందులోను ఆసక్తి ఉండేదికాదు.

అటుతర్వాత నేను నెల్లూరులో ఉండడమా లేక మద్రాసులో ఉండడమా అనే విషయాన్ని గురించి ఆలోచించి ఒక నిర్ణయం తీసుకొనవలసిన అవసరం ఏర్పడింది. నా కుమార్తె వైదేహి ఇంటర్మీడియేట్ పరీక్షలో కృతార్థురాలైనది. ఆమెను ఆనర్సు చదువు నిమిత్తం మద్రాసుకు పంపవలసి వచ్చింది. నా నాల్గవ కుమారుడు వెంకటేశ్వర్లు ఎం. ఏ. లో పట్టభద్రుడైనా ఉద్యోగం ఏదీ దొరకలేదు. వాడు మద్రాసు విశ్వవిద్యాలయంలో చరిత్రలో పరిశోధన చేయడానికి నిర్ణయించుకొన్నాడు. నా అయిదవ కుమారుడు పట్టాభిరాం బి. ఎల్. లో కృతార్థుడై మద్రాసులో

ఒక ప్రముఖ న్యాయవాదివద్ద అప్రెంటీసుగా ఉండడానికి నిర్ణయించుకొన్నాడు. నేను కూడా మద్రాసులో ఉండిన పక్షంలో నా గ్రంథరచన కార్యక్రమం చక్కగా జరుగగలదనే నిర్ణయానికి వచ్చాను. అందరి నిర్ణయం ఒకటిగానే ఉండడంచేత సమస్య సులభంగా పరిష్కారమైనది.

నెల్లూరు కంటె మద్రాసులో ఇంటి ఖర్చులు ఎక్కువగా ఉంటాయి. వాటిని ఏదోవిధంగా భరించే బాధ్యత నాది మాత్రమే. ఇదిగాక మద్రాసులో అద్దెకు ఇల్లు దొరకగలదా అనేది ఇంకొక ప్రశ్న. అందునిమిత్తం ఒక నెల ప్రయత్నం చేశాను. తుదకు నా కుమారుడు పట్టాభిరాయపేటలో జైన మఠం ఎదుట లలితాపురంలో ఒక ఇంటి క్రిందిభాగాన్ని ఎలాగో అద్దెకు సంపాదించి, ఇంటి యజమానికి రెండు నెలల అద్దెను అడ్వాన్సుగా ఇచ్చాడు. దీనితో ఈ ఆటకం కూడా తొలిగింది.

అన్ని సౌకర్యాలు సమకూరిన కారణంగా నేను కుటుంబ సహితంగా జూలై 1న నా సామానులతో రైలులో ప్రయాణం చేసి రాత్రి పదిగంటలకు లలితాపురం అద్దె ఇంట్లో ప్రవేశించాను. దీనితో నా మద్రాసు కాపురం ప్రారంభమైనది. మధ్య కాలంలో ఒక సంవత్సరం భీమవరం కళాశాల ప్రిన్సిపాలుగా గడిపాను. ఆ ఉదంతాన్ని ఇదివరకే వివరించాను. అటుతర్వాత 1949 మే ఆఖరు వరకు మద్రాసులో ఉండి, తర్వాత బొంబాయి విశ్వవిద్యాలయంలో క్రొత్తగా ప్రారంభింపబడిన రాజనీతిశాఖలో ప్రధానాధ్యాపకునిగా తిరిగి ఒక ఉద్యోగంలో చేరాను. నేను భీమవరం వెళ్లినా కుటుంబంలో చాలాభాగం మద్రాసులో ఉండినారు, అందుచేత మొత్తం మీద 5 సంవత్సరాలు మద్రాసులో గడిపినట్లు చెప్పవచ్చు.

'ఆరోగ్యం మహాభాగ్యం' అని పెద్దలు చెప్పడం కద్దు. నేను ఆ భాగ్యాన్ని 1925 తర్వాత అనుభవించలేక పోయినాను. 1925 లో నేను విజయనగరంలో ఉన్నప్పుడు ఫైలేరియా జ్వరానికి గురి అయ్యాను. ఆ పట్టణంలో ఒక బ్రహ్మాండమైన చెరువు ఉండేది. దాని నిండా దోమలే. ఆ దోమల కాటువలన పట్టణంలోని జనసంఖ్యలో అర్ధభాగం తరతరాలుగా ఈ జ్వరంతో

బాధపడుతూ వచ్చారు. సంస్థానంగాని, మునిసిపల్ అధికారులు గాని, ప్రభుత్వంగాని ఆ చెరువును శుభ్రపరచుటకు ఏలాటి చర్యలు తీసుకొన్నవారుకాదు. ఈ జబ్బుకు గురియైన వారిలో అధిక సంఖ్యాకులు బలిసిన బోదకాళ్ళతో బాధపడేవారు. గజ్జలలో బిళ్ళకట్టడం, తర్వాత ఒకరోజు భరింపరాని చలివేయడం, అటు తర్వాత ఒకటి రెండు రోజులు అమితంగా జ్వరంరావడం, జ్వరం పోయిన తర్వాత నాలుగైదు రోజులు బలాన్ని కోల్పోవడం, ఈ వ్యాధికి ప్రధాన లక్షణాలు. అదృష్టవశాత్తున నాకు బోదకాళ్లు ఏర్పడలేదు. రెండు మూడు సంవత్సరాల వరకు ఈ జ్వరం పదే పదే రాసాగింది. అటుతర్వాత ఇది కనుపించలేదు. దీనినుండి విముక్తి పొందినట్లు నేను భావించాను.

కాని ఆంధ్ర విశ్వవిద్యాలయానమండి నేను విరమించుకొని నెల్లూరుకి వచ్చిన తర్వాత మూడునెలల కాలంలో నాలుగైదు పర్యాయాలు ఈ జ్వరం తగిలింది. నా అల్లుడు డాక్టర్ అల్లాడి మహాదేవయ్య ప్రఖ్యాతిగాంచిన వైద్యుడు. ఆయనతో సంప్రతించగా ఈ వ్యాధికి అప్పట్లో ఎవరూ మందు కనిపెట్టలేదని, ఇంజెక్షన్‌లు తీసుకొనడం వ్యర్థమని, బాధపడడం తప్ప మార్గాంతరం లేదని చెప్పినాడు.

నేను 1944 జూలై 1-వ తేదీకి మద్రాసుచేరి అక్కడే కాపురం పెట్టాను. అటుతర్వాత ఈజ్వరం తరుచుగా రాసాగింది. మద్రాసులోని డాక్టర్లు ఎక్కువ నైపుణ్యము, అనుభవము కలవారని భావించి, అల్లాడి కృష్ణస్వామయ్యర్ వంటి ధనికుల ఇండ్లలో వైద్యం చేస్తూ ఉండిన డాక్టర్ నారాయణస్వామి అయ్యరును కలుసుకొనగా ఆయన ఒక మందు పేరు వ్రాసి ఇచ్చి, దీనిని కొనితెచ్చిన పక్షంలో అయిదు పర్యాయాలు ఇంజెక్షన్ చేస్తానని, దాని మూలంగా వ్యాధి కుదరగలదని సలహా ఇచ్చినాడు. నేను ఆలాగే చేసి, రు. 15 లు ఆయనకు అయిదు ఇంజెక్షన్‌లకు ఫీజు ఇచ్చి ఇంజెక్షన్‌లు చేయించుకొన్నాను. కాని ఏమీ లాభం లేకపోయింది. నా అల్లుడు చెప్పిన మాటలే ఖాయమైనవి.

నా అనారోగ్యానికి ఇది ఒకటి మాత్రమే కారణం కాదు. నేను భీమవరంలో ఉన్నప్పుడు కడుపులో తీవ్రమైన వ్రణం ( peptic

ulcer) ఉన్నట్లు అక్కడి డాక్టరు కనుగొని, ఒక నెల రోజులు చికిత్స చేశాడని ఇదివరలోనే చెప్పినాను. కాని ఈ వ్రణం పూర్తిగా మానలేదు. మద్రాసులో చేరిన తర్వాత ఇది కారణంగా అప్పుడప్పుడు తీవ్రమైన కడుపునొప్పి, తల తిరగడం, ఒకటి రెండు రోజులు మంచం పట్టడం జరుగుతూ వచ్చింది. ఒక పర్యాయం, 1949 లో నెల రోజులు దీనిమూలంగా బాధ పడినాను.

నా అనారోగ్యాన్ని గురించి ఇంత దీర్ఘంగా ఇచ్చట ప్రస్తావించడానికి కారణం లేకపోలేదు. ఈలాటి అనారోగ్యానికి గురి అయినా నేను తలపెట్టిన కార్యక్రమాలనన్నిటినీ నిర్విఘ్నంగా సాగిస్తూనే వచ్చాను. ఈ కార్యక్రమాలు తలకుమించినవిగా పరిణమించినవి. ఒక్కొక్కప్పుడు విశ్రాంతి అనేది లేకుండా వీటిని సాగించవలసి వచ్చేది. ఎందుకు తలకుమించిన బరువును నా పైన వేసుకొన్నానో చెప్పడం అవసరం.

ఉద్యోగంలో ఉన్నప్పుడు నాకు ప్రతి నెలా జీతం రూపంలో ఆదాయం వస్తూ ఉండేది. కాని నా విరమణ అనంతరం ఈలాటి ఆదాయం లభించేది కాదు. కాని పిల్లలందరి చదువు పూర్తి కాలేదు. చదువును పూర్తిచేసిన వారికి తగిన ఉద్యోగం లభించలేదు. లభించినా చాలీచాలని ఆదాయం లభించేది. ఈనాడు విద్యావంతులు నిరుద్యోగులై అనేక బాధలు అనుభవిస్తున్నారు. కాని ఈ నిరుద్యోగం ఈనాటిది కాదు. రెండు వందల సంవత్సరాల క్రిందట బ్రిటిష్ ప్రభుత్వం ఇంగ్లీషు చదువును ప్రవేశపెట్టినప్పుడే ఈ సమస్య బయలుదేరింది. ఇంగ్లీషువిద్య నేర్చిన వారిలో అధిక సంఖ్యాకులు ప్రభుత్వోద్యోగాలు సంపాదించే అభిలాష కలవారు. వారి విద్య మరి ఏ వృత్తిలో చేరుటకు అనుగుణమైనట్టిదికాదు. కాని విద్యాధికులసంఖ్య పెరిగిన దామాషాలో ప్రభుత్వోద్యోగాలు పెరగడం సాధ్యం కాని విషయం. ఇది తెలిసికూడా ప్రభుత్వము, ప్రజలు విద్యావిధానంలో ఏలాటి మార్పులు చేయడానికి సిద్ధపడరైరి. గొర్రెదాటు మోస్తరుగా అందరూ ఈ విద్యనే అభ్యసించేవారు. విద్యాధికుల నిరుద్యోగానికి ఇదే ప్రధాన కారణం. చదువుకొన్న నా కుమాళ్లు అందరు

(ఒకడు మినహాగా) దీనికి గురి అయ్యారు. అందుచేత నేనే ఎలాగో వ్యాధిగ్రస్తుడనైనా ఆదాయాన్ని గడించి వారిని పోషించవలసినవాడ నయినాను.

నాకు ఆరోజులలో బొంతలపాలెం అనే గ్రామంలో 30, 35 ఎకరాల సారవంతమైన భూవసతి ఉండేది. దానినుండి ఏటేట 20 పుట్ల ధాన్యం వచ్చేది. అప్పుడు పుట్టి ఖరీదు రు. 110, 120లు. గ్రామంలోనే కాపురం చేసిన పక్షంలో ఈ ఆదాయంతో సుఖంగా జీవించడానికి అవకాశం ఉండేది.

ఒకప్పుడు గ్రామంలోనే జీవించవలెనని నేను అనుకొన్నాను. నేను నెల్లూరు కళాశాల ప్రిన్సిపాల్‌గా ఉన్నప్పుడు మరి ఇద్దరు మిత్రులతో కలసి గ్రామపునర్నిర్మాణ ఉద్యమాన్ని సాగించినట్లు ఇదివరలో చెప్పినాను. ఉద్యోగాన నుండి విరమించిన తర్వాత బొంతలపాలెం గ్రామంలో నివాసం ఏర్పరచుకొన్న పక్షంలో ఈలాటి ఉద్యమాన్ని విజయవంతంగా సాగించి ఉండేవాడిని.

ఆనాడు గ్రామీణులలో అధికసంఖ్యాకులు నిరక్షరాస్యులు. దేశసమస్యల గురించి వారికి వాస్తవమైన పరిజ్ఞానం లేదు. అలాటి పరిజ్ఞానాన్ని సంపాదించుటలో వారికి ఆసక్తి, ఉత్సాహము ఉండేవి. నేను వేసవి సెలవులలో కొన్ని వారాలు అక్కడ కుటుంబ సహితంగా ఉండేవాడిని. అప్పుడు గ్రామీణులు, మా గ్రామానికి అనుబంధంగా ఉండిన ... ... కొండూరు ఏలాలు అనే గ్రామంలోనివారు, వారిలో ప్రధానంగా అక్కడి హరిజనులు (అక్కడ వారిసంఖ్య ఎక్కువగా ఉండేది) రాత్రిపూట 8 గంటలకు నా వద్దకు వచ్చి పదిగంటల వరకు సోషలిజం, కమ్యూనిజం, దున్నేవాడికే భూమి మొదలైన విషయాల గురించి విపులంగా చెప్పవలసిందిగా కోరేవారు. నేను చెప్తూ ఉన్నప్పుడు మధ్య మధ్య ప్రశ్నలు వేసి సమాధానాలు కోరేవారు. దీనినిబట్టి వారికి ఈలాటి విషయాలలో ఎంతో ఆసక్తి ఉన్నట్లు నేను గ్రహించాను. నేను ఒకనాడు తలపెట్టిన గ్రామ పునర్నిర్మాణ ఉద్యమాన్ని కొనసాగించుటకు ఎక్కువ అవకాశమున్నట్లు, ఎక్కువ అవసరం ఉన్నట్లు ఈ అనుభవం మూలంగా తెలుసుకొన్నాను. నేను స్వయంగా గ్రామంలో నాకు లభించే ఆదాయంతో సుఖంగాను,

నిరాడంబరంగాను జీవించడమే కాకుండా పదిమందిని విజ్ఞాన వంతులుగా చేయగలిగి ఉండేవాడిని.

కాని ఈ పనిని చేయలేక పోయినాను. "తన్ను మాలిన ధర్మం మొదలు చెడ్డ బేరం" అనే వాక్యం ఉన్నది కదా! నా పిల్లల చదువు పూర్తి అయ్యేవరకు వారిని చదివించవలసినది నా మొదటి కర్తవ్యం. దానికి మద్రాసులో కాపురం పెట్టడం ఎంతైనా అవసరం. దానిని తీర్చుకొనక, గ్రామ పునర్నిర్మాణానికి పూనుకొనడం తన్నుమాలిన ధర్మంగా నాకు కనిపించింది. అందుచేత కుటుంబపోషణకు కావలసిన ఆదాయం భూవసతి నుండి నాకు లభించక పోయినా నేను మద్రాసులో కాపురం పెట్టడం తప్పిందికాదు. వ్యాధిగ్రస్తుడనైనా తలకుమించిన కార్య కలాపాలలో పాల్గొనుటకు వీటిమూలంగా కొంత ఆదాయం సంపాదించగలననేది ప్రధానకారణం.

నా విద్యా సంపత్తిచేత అధ్యాపకునిగా 1910 నుండి 35 సంవత్సరాలు గడించిన అనుభవం చేత, రచయితగా మాత్రమే కొంత ఆదాయాన్ని సంపాదించగలవాడనైనాను. అందుచేత 1944 జూలై నుండి కొన్ని రచనా కార్యక్రమాలను తలపెట్టి సాగించాను.

ఈ రచనా కార్యక్రమాలను నాలుగు వర్గాలుగా విభాగం చేయవచ్చు. వాటిలో మొదటిది దేశంలోని రాజకీయాలకు సంబంధించిన గ్రంథరచన; రెండవది వార్తాపత్రికలలో గ్రంథ సమీక్షలు చేయడం; మూడవది వార్తాపత్రికలలో వ్యాసాలు వ్రాయడం; నాల్గవది ఆకాశవాణిలో నా ప్రసంగాలను ప్రసారం చేయడం. వీటిలో గ్రంథరచనను తప్ప తక్కిన వాటిని వార్తా పత్రికలు, ఆకాశవాణి నాకు అందజేసిన ఆహ్వానాలను పురస్క రించుకొని సాగించాను. ఆహ్వానాలు లేక నా అంతట నేను ఈలాటి పనులలో పాల్గొన దలచడం వ్యర్థంగా ప్రయాసపడడమే.

1944-'49 లో దేశం ఎదుర్కొంటున్న రాజకీయ సమస్య లలో ప్రాథమిక హక్కులను మన రాజ్యాంగంలో చేర్చడం అవసరమా అనేది ఒకటి. మన నాయకు లందరు బ్రిటిష్ పరిపాలన కాలంలో ఈలాటి హక్కులు లేని కారణంగా ప్రజలు చాలా

బాధలకు గురి అయ్యారని భావించి, వాటిని మన రాజ్యాంగంలో చేర్చడం అవసరమని భావించారు. బ్రిటిష్‌వారు వారి రాజకీయ సంప్రదాయాన్ని అనుసరించి ఆలాటి అవసరం లేదని వాదించారు. కాని ఇతర పాశ్చాత్య దేశాల రాజ్యాంగాలలో వాటిని చేర్చొనడం పరిపాటి అయింది. ఈ పరిణామాన్ని దృష్టిలో ఉంచుకొని ప్రాథమిక హక్కులు వాటి పుట్టు పూర్వోత్తరాలు, వాటి మూలంగా సాధించ గల ఆశయాలు మొదలైన అంశాలతో కూడిన ఒక గ్రంథాన్ని వ్రాయుటకు నేను గుంటూరులో ఉన్నప్పుడే తలపెట్టి, దానికి కావల సిన ముడి సామగ్రిని సేకరించాను. దాని రచనను 1944 జూలైలో ప్రారంభించి ఆగస్టు ఆఖరుకు పూర్తిచేశాను. దానిని బొంబాయి లోని హింద్ కితాబ్సువారు (Hind Kitabs) ప్రకటించారు.

ఆనాడు వాదప్రతివాదాలకు గురియైన రాజకీయ సమస్య మనదేశానికి అనుగుణమైన రాజ్యాంగాన్ని మనం ఎన్నుకొన్న ప్రతినిధులతో కూడిన రాజ్యాంగసభ తయారు చేయడమా లేక 1772 నుండి జరుగుచున్నట్లు బ్రిటన్‌లోని పార్లమెంటు తయారు చేయడమా అనేది. 1920 తర్వాత స్వరాజ్య సంపాదనార్థం గాంధీమహాత్ముని నాయకత్వాన సహాయ నిరాకరణోద్యమాన్ని, శాసనోల్లంఘన ఉద్యమాన్ని, క్విట్ ఇండియా ఉద్యమాన్ని మనం సాగించాము. మనదేశాన్ని మనమే పరిపాలించుకొనడంపట్ల మనకు గల పట్టుదలను వ్యక్తం చేశాము. ఆదేకాలంలో మన రాజ్యాంగాన్ని అనగా మనదేశాన్ని పరిపాలించుటకు తగిన విధానాన్ని, మనమే రూపొందించుకొనవలెననే అభిప్రాయం ప్రాబల్యం గాంచింది. కాని బ్రిటిష్‌వారు దానికి వెంటనే అంగీక రించలేదు. వారు 1920 లోను, 1935 లోను 'భారతదేశ పరిపాలన శాసనము' అనే పేరట వారి పార్లమెంటులోనే శాసనాలు గావించి వాటిని అమలు పరచారు. దీనిని గురించి వాదప్రతి వాదాలు జరుగుచుండినందున ఈవిషయాన్ని గురించి ఒక గ్రంథాన్ని వ్రాయదలచి, వివిధ దేశాలలో రాజ్యాంగ సభలు ఏవిధంగా నిర్మాణమైనదీ, అవి ఏవిధంగా ఆ దేశాలకు అనుగుణ మైన రాజ్యాంగాలను రూపొందించుకొన్నదీ, మనం కూడా అలాటి పద్ధతిని అనుసరించవలసిన అవసరం ఏర్పడినదీ వివరిస్తూ 1946 లో

"The Case for a Constitutional Assembly for India" అనే గంథాన్ని వ్రాశాను. దానిని కూడా హింద్ కితాబ్సువారే ప్రకటించారు.

1947 ఆగస్టు 15-వ తేదీన మనదేశానికి స్వాతంత్ర్యం లభించింది. అంతకు కొంచెం ముందుగానే ఏర్పడిన రాజ్యాంగ సభ 1946-'49 లో చర్చలు సాగించి, డాక్టర్ అంబేద్కరు ఆధ్వర్యాన ఒక చిత్తురాజ్యాంగాన్ని (Draft Constitution) తయారుచేసి, దానిని గురించి ప్రజాభిప్రాయాన్ని సేకరించ పూనుకొన్నది. దానిని పురస్కరించుకొని 1948 లో "చిత్తు రాజ్యాంగం" అనే పేరుతో ఒక గ్రంథాన్ని వ్రాశాను. దానిని కూడా హింద్ కితాబ్సు వారే ప్రకటించారు.

పై మూడు గ్రంథాలకు మంచి ప్రచారం లభించింది. మొదటి రెండు గ్రంథాలను ప్రశంసిస్తూ రాజనీతికోవిదుడని ప్రఖ్యాతి గాంచిన సర్ తేజ్ బహదూర్ సప్రూ నాకు ఉత్తరాలు వ్రాశారు. వీటి మూలంగా నాకు ప్రకటనదార్లనుండి సుమారు వేయి రూపాయలు ఆదాయం లభించింది. ఇది అంతగొప్ప ఆదాయం కాకపోయినా నాకు విజయనగర సంస్థానంవారు ఇచ్చు చుండిన రు. 100 ల పించన్ తప్ప నెలసరి ఆదాయంలేని రోజులలో ఇది చాల విలువగల ఆదాయంగా నేను భావించాను.

కాని కుటుంబపోషణ దృష్ట్యా ఇది చెప్పుకోదగ్గ ఆదాయం కాదు. అందుచేత అలాటి ఆదాయాన్ని సంపాదించ దలచి 1945 లో నాల్గవ ఫారానికి, అయిదవ ఫారానికి ఆధునికచరిత్రకు సంబంధించిన పాఠ్యగ్రంథాలను వ్రాసాను. ఈవిధంగా వ్రాయడం లోను, వాటికి ప్రభుత్వ ఆమోదాన్ని సంపాదించడంలోను ఆనాడు గ్రంథకర్తలు, ప్రకటనదార్లు రెండు గొప్పచిక్కులను ఎదుర్కొన వలసిన వారయ్యారు. (నా పాఠ్యగ్రంథాలను బందరులో సుప్రసిద్ధ యం. శేషాచలం కంపెనీ వారు ప్రకటించారు) ప్రభుత్వం పాఠ్య ప్రణాళికలను తయారుచేసి, ఆటుతర్వాత రెండు మూడు నెలల వ్యవధిలో ఆ ప్రణాళికల ననుసరించి, పాఠ్యగ్రంథాలను తయారుచేయవలసిందిగా ఆదేశించడం మామూలు. ఈ స్వల్ప వ్యవధిలో చక్కగా ఆలోచించి, చక్కని పాఠ్యగ్రంథాలను

వ్రాయడం సాధ్యం కాని పని. అయినా ప్రభుత్వ ఆదేశాలను కొనసాగించడం తప్పేదికాదు. ఇది మొదటి చిక్కు.

ఇదిగాక వ్రాసిన గ్రంథాలు పాఠ్యగ్రంథాలుగా ఉపయో గించుటకు అర్హాములైనవా, కావా అని నిర్ణయించుటకు ప్రభుత్వం ఇద్దరు ముగ్గురితో కూడిన ఒక సంఘాన్ని నియమిం చడం మామూలు. కాని ఆ సంఘంలోని సభ్యులు నిష్పక్షు పాతంగా గ్రంథాలను పరిశీలించేవారు కారు. అవినీతికి పాల్పడి ధనార్జన చేసే ఉద్దేశంతో వారి బాధ్యతను నిర్వహించేవారు. ఇందుచేత కష్టపడి పాఠ్యగ్రంథాన్ని వ్రాసినా అది ఆమోదింప బడుతుందో లేదో అనే భయ సందేహాలు ఉండేవి. ఇది గ్రంథ కర్తలు, ప్రకటనదార్లు ఎదుర్కొనవలసిన రెండవ చిక్కు. ఆమో దింపబడితేనేగాని ప్రకటనదార్లు గ్రంథకర్తలకు పారితోషికం చెల్లించేవారు కారు. ఏదోవిధంగా నేను రచించిన ఆధునిక చరిత్రను గురించిన రెండు గ్రంథాలు పభుత్వ ఆమోదాన్ని పొందగలిగినవి. ఒక్కొక్క గ్రంథానికి రు. 1000ల చొప్పున శేషాచలం కంపెనీ వారు నాకు 1946 లో చెల్లించారు. ఇది చెప్పుకోదగ్గ ఆదా యంగా నేను భావించాను.

1948 ప్రాంతంలో చరిత్ర, భూగోళం, పౌరశాస్త్రాలకు సంబంధించిన పాఠ్య ప్రణాళికలలో ప్రభుత్వం విప్లవాత్మకములైన మార్పులను గావించింది. అప్పటివరకు ఈ మూడు విషయాలు ఒకటితో ఇంకొకటి సంబంధంలేని ప్రత్యేక విషయాలుగా భావిస్తూ ఉండేవారు. అందుచేత ఒక్కొక్క విషయానికి ఒక ప్రత్యేక ప్రణాళిక, ఒక ప్రత్యేక పాఠ్య గ్రంథం ఉండినవి. కాని ఈ మూడు విషయాల మధ్య పరస్పర సంబంధం ఉన్నదని, ఆ సంబంధాన్ని స్పష్టపరచగల పాఠ్యప్రణాళికలను, పాఠ్య గ్రంథాలను తయారుచేయడం అవసర మనే భావం విద్యారంగంలో కృషిచేసే నిపుణులలో వ్యాపించింది. పాశ్చాత్య దేశాలలో అప్పటికి ఈ అభిప్రాయం కార్యరూపం ధరించింది. సాంఘికశాస్త్రం అనే పేరుతో పాఠ్య గ్రంథాలు వాడుకలోకి వచ్చినవి. ఆ పద్ధతినే మనప్రభుత్వం కూడా ఆమోదించి, దానికి తగినట్లుగా 1948 లో పాఠ్య ప్రణాళికలను తయారుచేసి, వాటిని అనుసరించి 1949 జూన్ లోపల మొదటి

ఫారం నుండి ఆరవ ఫారం వరకు ఆరు పాఠ్య గ్రంథాలను రచించ వలసిందిగా ఆదేశించింది.

శేషాచలం కంపెనీ వారికి చాలాకాలాన నుండి నా శక్తి సామర్థ్యాలపట్ల గొప్ప విశ్వాసం ఉండేది. ఇంతకు పూర్వం నేను వ్రాసిన పాఠ్యగ్రంథాలు కొన్నిటిని వారు ప్రకటించారు. క్రొత్త ప్రణాళికను అనుసరించి ఆరు సాంఘికశాస్త్రాలను వ్రాయ వలసిందిగా వారు నన్ను కోరారు. కాని 1949 జూన్ నాటికి నేను మూడు గ్రంథాలను మాత్రమే వ్రాయగలిగాను. 1949 జూన్‌లో నేను బొంబాయి విశ్వ విద్యాలయంలో రాజనీతి శాఖకు ప్రధానాధ్యాపకునిగా నియమింపబడినాను. ఏలాగో తీరిక చేసుకొని 1949 జూన్, డిసెంబరుల మధ్య తక్కిన మూడు గ్రంథాలను వ్రాసి వారికి అందజేశాను. వారు వాటిని త్వరిత కాలంలోనే ప్రకటించ గలిగారు. ఆరు గ్రంథాలు పాఠ్య గ్రంథాలుగా ఉండటకు అర్హములైనట్లు ప్రభుత్వం నిర్ణయించింది. దీనితో పాఠ్యగ్రంథాల రచనకు సంబంధించిన అధ్యాయం పూర్తి అయింది. అటుతర్వాత ఈలాటి గ్రంథాలను వ్రాయడం మానుకొన్నాను. ప్రభుత్వం కూడా పాఠ్య గ్రంథాలను వ్రాయించే బాధ్యతను స్వీకరించినది. పాఠ్యగ్రంథాల రచన జాతీయం చేయ బడినది.

ఈ ఆరు గ్రంథాల పారితోషిక విషయంలో ఒక పద్ధతిని శేషాచలం కంపెనీవారు అనుసరించినారు. ఒక్కొక్క గ్రంథానికి ఒక దఫాన ఏదో కొంత మొత్తాన్ని చెల్లించుటకు బదులు, వాటి అమ్మకం మూలంగా గణించిన మొత్తపు సొమ్ములో నూటికి పది రూపాయలు చొప్పున నాకు చెల్లించడమే ఆ పద్ధతి. దీనికి 'రాయల్టీ (Royalty) పద్ధతి' అని పేరు. దీనిని అనుసరించి ఏటేట ఈ ఆరు గ్రంథాల మూలంగా నాకు మూడు నాలుగు వేలు ముట్టేవి. ఏడెనిమిది సంవత్సరాల కాలం విద్యాలయాలలో వీటికి మంచి ప్రచారం, అమ్మకం కలిగినవి. నేను మొత్తంమీద 30,000 రూపాయలు వీటి మూలంగా సంపాదించాను. అయితే ఈ సంపాద్యమంతా నేను మద్రాసు వదలిన తర్వాతనే లభించింది.

నా రచనా కార్యక్రమంలో రెండవ వర్గానికి చెందినది పత్రికలలో నేను వ్రాసిన గ్రంథ సమీక్షలు. నేను మద్రాసులో నివాసం ఏర్పరచుకొనిన తర్వాత 1944 నవంబరు నుండి 'హిందూ' పత్రికా సంపాదకులు ప్రతివారం సమీక్ష నిమిత్తం ఒకటి రెండు గ్రంథాలను పంపించసాగారు. కొంత కాలమైన తర్వాత ఎక్స్‌ప్రెస్ (Express) పత్రికా సంపాదకులు, బొంబాయిలోని నేషనల్ స్టాండర్డు (National Standard) సంపాదకులు, మద్రాసులోని 'స్వతంత్ర' సంపాదకులు ఖాసా సుబ్బారావుగారు సమీక్షార్థం గ్రంథాలను పంపిస్తూ ఉండేవారు. సమీక్షించవలసిన గ్రంథాన్ని ఆమూలాగ్రం నేను పూర్తిగా చదివేవాడిని. అవసరమైనప్పుడు రెండవ పర్యాయం కూడా చదవడం పరిపాటి. అప్పుడుగాని గ్రంథకర్తలను పూర్తిగా అర్థంచేసుకొనడం సాధ్యంకాదని నా అభిప్రాయం. నా సమీక్షలలో గ్రంథంలోని విషయాలను సంక్షిప్తంగా తెలియపరచేవాడిని. ప్రతిగ్రంథంలోను కొన్ని సుగుణాలు, కొన్ని లోపాలు ఉండడం సహజం. గుణరహితమైన గ్రంథంగాని దోషరహితమైన గ్రంథంగాని ఏదీ ఉండదు. కొందరు సమీక్షకులు లోపాలను మాత్రమే ప్రకటించడం మామూలు. నేను ఆలాగు కాక గుణదోషాలు రెంటిని పేర్కొనేవాడిని. గ్రంథంలో కనుపించిన సుగుణాలకు ఎక్కువ ప్రాధాన్యం కల్పించేవాడిని. సమీక్షార్థం వచ్చిన గ్రంథాన్ని సానుభూతితో విమర్శించడం ఎంతైనా అవసరము.

గ్రంథాన్ని ఆమూలాగ్రం చదివే విధానం మూలంగా సమీక్షలు వ్రాయుటకు చాలా కాలాన్ని వినియోగించవలసి వచ్చింది. కాని ఇదియే సరియైన పద్ధతి అని నేను భావించాను. ఇందుకుగాను చాలా కాలాన్ని వినియోగించినా, దీనికి అనుగుణంగా ఆర్థికరూపంలో నాకు ఫలితం లభించేది కాదు. కాని నేను ఎలాంటి ఆశాభంగాన్ని పొందలేదు. సమీక్షల మూలంగా ప్రముఖులు వ్రాసిన ఉత్తమ గ్రంథాలను చదివే అవకాశం నాకు లభించింది. దానినే నేను ప్రతిఫలంగా భావించాను. 1944-'49 లో సుమారు 270 గ్రంథాలకు నేను సమీక్షలు వ్రాశాను. వీటిలో అధిక భాగం ఇంగ్లీషు గ్రంథాలు.

నాలుగైదు తెనుగు గ్రంథాలను స్వతంత్ర పత్రికలో సమీక్షించారు.

మూడవ వర్గానికి చెందిన నా రచనలు పత్రికలలో నేను ప్రకటించిన వ్యాసాలు. వీటిలో కొన్నిటిని మాత్రమే హిందూపత్రిక లోను, ఎక్స్‌ప్రెస్‌లోను, బొంబాయి స్టాండర్డులోను ప్రచురించాను. అధికసంఖ్యలో వీటిని ఖాసా సుబ్బారావుగారి స్వతంత్రలో ప్రచురించాను. కొన్నిటిని ఆంధ్ర (దిన) పత్రికలోను, ఆంధ్ర పత్రిక సంవత్సరాది సంచికలలోను, భారతిలోను ప్రకటించాను.

స్వతంత్రలో ఒక సంవత్సరకాలం ప్రతివారం 'అంతర్జాతీయ పరిణామాల గురించి' (Spotlight on the world) అనే శీర్షికతో వ్రాసేవాడిని. నెలకు రు. 100 ల ఆదాయం దీనిమూలంగా లంభించేది. ఇదిగాక ఆంధ్రకేసరి ప్రకాశం పంతులుగారిని ముఖ్య మంత్రి పదవినుండి తొలిగించుటకు కాంగ్రెసు అధిష్ఠానవర్గం చేసిన సన్నాహాలు, ఆంధ్రనాయకులు కాంగ్రెస్ ముసుగుతో జస్టీసు పార్టీవారు చేసిన కుట్రలు నేను స్వయంగా పరిశీలించి వివరించాను. ఆ సందర్భంలో అనేకమంది నాయకులను కలుసుకొని వారి అభిప్రాయాలను తెలుసుకొన్నాను. కాంగ్రెసువారు మద్రాసులో జరిపిన సమావేశాలకు హాజరై వారి ఉపన్యాసాలను శ్రద్ధతో విని, నా వ్యాసాలను వ్రాసినాను.

ఒక పర్యాయం నేను నా భార్యతోను, పెద్ద కుమార్తె అన్నపూర్ణతోను కలిసి తిరువన్నామలైలోని రమణాశ్రమానికి వెళ్ళి రమణమహర్షిని దర్శించినాము. అటుతర్వాత పుదు చ్చేరికి వెళ్లి అరవిందుని ఆశ్రంలో రెండు మూడు రోజులు గడిపి, వారిని వారి జయంతి రోజున దర్శించినాము. రమణా శ్రమం మన ప్రాచీన సంప్రదాయానికి అనుగుణంగా ఉండినది. అరవిందుని ఆశ్రమం ఆలాగుకాక, ఫ్రెంచి అధునాతన సంస్కృతికి అనుగుణంగా ఉండినది. ఈ రెండు ఆశ్రమాల మధ్య నాకు కనుపించిన తారతమ్యాల గురించి స్వతంత్రలో ఒక వ్యాసాన్ని ప్రకటించాను. ఇదిగాక మన కొత్తరాజ్యాంగాన్ని గురించి ఆరు వ్యాసాలు వ్రాశాను. ఇతరవిషయాల గురించి కూడా

15)

నేను వ్యాసాలు వ్రాశాను. ఒక్కొక్కప్పుడు సుబ్బారావుగారు నా వ్యాసాలను సంపాదకీయంగా వినియోగించుకొనేవారు.

సుబ్బారావుగారు, నేను నెల్లూరుకి చెందినవారము కావడం చేత మా మధ్య సన్నిహిత సంబంధం ఏర్పడింది. వారి అభిప్రాయా లన్నిటితో నేను ఏకీభవించకపోయినా, పత్రికను నిర్వహించడంలో వారు ప్రదర్శించిన నిర్భయత్వము, స్వాతంత్ర్యము నన్ను ముగ్ధుని గావించినది. వారు మనదేశంలోని పత్రికా సంపాదకులలో అగ్ర శ్రేణికి చెందినవారు.

పైన చెప్పినట్లు ఆంధ్ర దినపత్రికలోను సంవత్సరాది సంచికల లోను, భారతిలోను నేను ఈకాలంలో అనేక వ్యాసాలను ప్రకటించాను. భారతిలో "భూప్రదక్షిణం" అనే శీర్షికతో ఒక సంవత్సరం ప్రతినెలా అంతర్జాతీయ పరిణామాలు వివరించేవాడిని. 1949లో భారతి రజతోత్సవ సందర్భంలో వెలువడిన ప్రత్యేక సంచికకు "విశ్వవిద్యాలయాల విద్యా విధానాన్ని" గురించి ఒక వ్యాసం వ్రాయవలసిందిగా సంపాదకులు నన్ను కోరారు. నేను ఆలోచించి చక్కని వ్యాసం వ్రాసి పంపినాను. కాని వారు దానిని ప్రత్యేక సంచికలో ప్రకటించలేదు. ప్రకటించక పోవుటకు కారణాన్ని కూడా తెలియపరచలేదు. వారి ప్రవర్తన నాకు ఎంతమాత్రం గిట్టినది కాదు. వారు నన్ను అగౌరవపరచినట్లు భావించి అదిమొదలు భారతికి, ఆంధ్రపత్రికకు వ్యాసాలు వ్రాయడం మానుకొన్నాను.

ఈ సందర్భంలో ఇంకొక ఉదంతాన్ని గురించి వ్రాయడం సందర్భోచితంగా ఉండగలదు. 1914 లో నేను విజయనగరంలో ఉన్నప్పుడు మొదటి ప్రపంచ సంగ్రామం ప్రారంభమైనది. అప్పుడు ఏదో పనిమీద ఆంధ్రపత్రిక సంపాదకులు 'విశ్వదాత' అని ప్రఖ్యాతి గాంచిన కాశీనాధుని నాగేశ్వరరావుగారు మా ఇంటిలో నన్ను ప్రత్యేకంగా కలుసుకొని ఉగాది సంచికకు 'యుద్ధానికి కారణాలు, యుద్ధప్రగతి' మొదలైన విషయాలగురించి సుదీర్ఘమైన వ్యాసాన్ని వ్రాయవలసినదిగా కోరుతూ నా చేతిలో రు 50 లు పెట్టి వెళ్ళిపోయ్యారు. ఇది వారి ఔదార్యానికి చిహ్నంగా నేను భావించాను. అంతకు పూర్వం అనేక పత్రికలకు వ్యాసాలను వ్రాసే

వాడిని. కాని ఎవరూ కూడ నాకు ఎలాంటి పారితోషికాన్ని అందించినవారు కారు. అలాగుచేసిన వారిలో నాగేశ్వరరావు పంతులుగారు మొదటివారు. అది మొదలు నాకు వారితోను, వారి పత్రికలతోను సన్నిహిత సంబంధం ఏర్పడినది. వారు పారితోషికం ఇచ్చినా, ఇయ్యక పోయినా నేను వారి పత్రికలకు ప్రకటనార్థం వ్యాసాలు వ్రాయసాగాను వాటిని వారు ప్రకటించేవారు. 1914 నుండి ఈ విధంగా ఏర్పడిన సంబంధం వారి మరణానంతరం భారతి రజతోత్సవ సందర్భంలో తెగిపోవడం నాకు ఎంతో విచారాన్ని కలిగించింది. అయినా ఇప్పటికి కూడ ఆంధ్రదేశంలోని ప్రముఖ పత్రికలలో ఆంధ్రపత్రిక, భారతి అగ్రశ్రేణికి చెందినవని నేను భావిస్తున్నాను.

1944–'49లో మద్రాసులో నీలంరాజు శేషయ్యగారి సర్వోదయ, కిన్నెర, Chariot; కర్నూలులోని జ్వాల, నవభారతి; ఢిల్లీలో Our India మొదలైన నూతన పత్రికలు వెలువడినవి. వీటి అన్నిట్లో నేను వ్యాసాలు వ్రాసేవాడిని. ఈలాటి వ్యాసాల మూలంగా పత్రికల పాఠకులకు నేను పరిచితుడనైనాను.

నాల్గవ వర్గానికి చెందిన నా రచనలు ఆకాశవాణిలో ప్రసార నిమిత్తం వ్రాయబడినట్టివి. 1944–'49 మధ్యలో సుమారు 40 పర్యాయాలు వివిధ విషయాల గురించి ప్రసారం చేశాను.

ఆనాడు క్రొత్త సంస్థలు అనేకం బయలుదేరినవి. గుంటూరు జిల్లా గోవాడకు చెందిన ఒక ప్రముఖ రైతు మద్రాసులో పరిశోధన నిమిత్తం రైతుసంస్థ నొక దానిని స్థాపించాడు. అందులో కొంతకాలం నేను, నా కుమాళ్లు పట్టాభిరాం, వెంకటేశ్వర్లు, ఆంధ్ర విశ్వవిద్యాలయంలో నావద్ద శిష్యుడుగా ఉండిన వేదుల జగన్నాథం పనిచేశాము. ఒక పర్యాయం గోవాడలో ఏర్పాటు చేయబడిన పశుప్రదర్శనకు వెళ్ళి అందులో ప్రసంగించాను. రాజమండ్రి వాస్తవ్యులు వెన్నేటి సత్యనారాయణగారు ఆంధ్రా ఇన్‌స్టిట్యూట్ (Andhra Institute) ను మద్రాసులో స్థాపించి దాని ఆధ్వర్యాన అనేక సమావేశాలు జరిపారు. వాటిలో నేను వ్యవసాయ సమస్యలను గురించి మూడు నాలుగు పర్యాయాలు ఉపన్యసించాను. దాని ఆధ్వర్యంలో ప్రముఖులు ఇచ్చిన ఉపన్యాసాలను

కొన్నిటిని నా ఉపన్యాసంతో సహా పుస్తకరూపంలో ప్రకటించారు. దాని తరఫున ప్రసంగించుటకు నేను ఒక పర్యాయం రాజమండ్రికి వెళ్లి రెండు ఉపన్యాసాలు చేసినాను.

మద్రాసులోని కళాశాలల విద్యార్థులు తరుచుగా వారి సమావేశాలలో ప్రసంగించుటకు నన్ను ఆహ్వానించేవారు. ప్రెసిడెన్సీ కళాశాల, లయోలా కళాశాల, పచ్చయప్ప కళాశాల, తాంబరంలోని క్రిస్టియన్ కళాశాల, గిండీలోని ఇంజనీరింగ్ కళాశాలలలో నేను అనేక పర్యాయాలు వివిధవిషయాలను గురించి ప్రసంగించాను.

మద్రాసులోని 'అధ్యాపక సంఘం'వారు (South India Teachers' Union) ఏర్పాటు చేసిన సమావేశాలలో నేను తరచుగా పాల్గొనేవాడిని. ఇదిగాక నేను ఒక పర్యాయం వేటపాలెంకు వెళ్లి ప్రఖ్యాతి గాంచిన అక్కడి గ్రంథాలయంలో ప్రసంగించాను. ఇంకొక పర్యాయం హైదరాబాదులో సరిపల్లి విశ్వనాథశాస్త్రిగారి ఆహ్వానాన్ని అందుకొని వారు ఏర్పాటుచేసిన మహాసభలోను, శ్రీకృష్ణదేవరాయ గ్రంథాలయంలోను ఉపన్యసించాను. విశ్రాంతి అన్నది లేక పలువిధములైన కార్యక్రమాలలో పాల్గొనే వాడినని స్పష్టపరచుటకు పైన పేర్కొన్న వివరాలను గురించి వ్రాశాను.

విదేశాలలో రాజనీతి శాస్త్రవేత్తలు తమ శాస్త్రానికి సంబంధించిన పలువిషయాలను గురించి, సిద్ధాంతాల గురించి చర్చించుటకు ఒక ప్రత్యేక రాజనీతిశాస్త్ర సంఘాన్ని స్థాపించుకోవడం పరిపాటి. మన దేశంలో కూడా అలాటి సంఘాన్ని ఒకదానిని స్థాపించడం వాంఛనీయమని కొన్ని విశ్వవిద్యాలయాలలో ప్రధాన అధ్యాపకులుగా ఉండినవారు 1939 లో 'భారతీయ రాజనీతిశాస్త్ర సంఘాన్ని' (Indian Political Science Association స్థాపించినారు. అలాటి స్థాపకులలో నేను కూడా ఒకడిని. అప్పుడు నేను ఆంధ్ర విశ్వ విద్యాలయంలో రాజనీతి శాఖకు ప్రధానాచార్యుడుగా ఉండినాను. ఈ సంఘం ఏటేట ఒక విశ్వవిద్యాలయ కేంద్రంలో సమావేశమై శాస్త్రానికి సంబంధించిన సిద్ధాంతాల గురించి, భారత దేశ పరిపాలన విధానంలో ఉత్పన్నములైన సమస్యల గురించి తీక్ష్ణంగా చర్చలు సాగించేది. నేను 1939 మొదలు 1943 డిసెంబరు

వరకు ఆంధ్ర విశ్వవిద్యాలయ ప్రతినిధిగా సాంవత్సరిక సమావేశాలకు వెళ్ళి, ఏదో ఒక విషయానికి సంబంధించిన పరిశోధనా ధారమైన వ్యాసాన్ని వ్రాసి చదవడం, ఆలాటి వ్యాసాలకు సంబంధించిన చర్చలలో పాల్గొనడం పరిపాటి అయింది. దేశంలోని రాజనీతి శాస్త్రవేత్తలలో నేనొక ప్రముఖుడననే అభిప్రాయం సంఘ సభ్యులకు కలిగింది. 1944 డిసెంబరులో జరిగిన సమావేశానికి నేను వెళ్ళలేదు. అప్పటికి ఆంధ్ర విశ్వవిద్యాలయంనుండి నేను విరమింపబడినాను. ఆ సంవత్సరం రాజస్థాన్ లోని జయపూరులో సాంవత్సరిక సమావేశం జరిగింది. నా స్వంత ఖర్చులతో అంతదూరం ప్రయాణం చేయగల ఆర్థిక స్తోమత ఆనాడు నాకు లేదు. అందుచేత ఆ సమావేశానికి వెళ్ళి చర్చలలో పాల్గొనలేక పోయినాను.

ఏటేట జరిగే ఈ సమావేశంలో మరుసటి సంవత్సరం సంఘానికి అధ్యక్షుని ఎన్నుకోనడం దాని కార్యక్రమంలో ఒక ప్రధానాంశం. ఎన్నికలలో అనేకులు పోటీచేయడం మామూలు. పోటీలు శాసనసభల ఎన్నికల మోస్తరుగా అతితీవ్రరూపం ధరించేవి. జయపూరు సమావేశానికి నేను వెళ్లకపోయినా నా మిత్రులు కొందరు అధ్యక్షపదవికి నన్నుఒక అభ్యర్థిగా నిలబెట్టారు. అప్పటికి నాకు రాజనీతి శాస్త్రవేత్తలలో కొంత ప్రఖ్యాతి ఉండడం చేత 1945 సంవత్సరానికి నేను అధ్యక్షుడుగా ఎన్నుకోనబడినాను.

1945 లో నేను భీమవరం కళాశాల ప్రిన్సిపాల్ గా ఉండినాను. ఆ డిసెంబరులోని సాంవత్సరిక సమావేశం అన్నామలై విశ్వవిద్యాలయంలో జరగవలసినట్లుగా నిర్ణయింపబడినది. సమావేశంలో అధ్యక్షుని ఉపన్యాసానికి ఒక ప్రత్యేక ప్రాధాన్యం ఉండేది. నేను రెండు మూడు నెలలు కృషిచేసి, భారతదేశం ఎదుర్కొంటున్న ప్రధాన సమస్యల గురించి ఒక సుదీర్ఘమైన ఉపన్యాసాన్ని తయారుచేసి, దానిని ముద్రించి, దాని ప్రతులతో సమావేశానికి అధ్యక్షుడుగా వెళ్లినాను. ఆనాడు దేశం ఎదుర్కొంటున్న గడ్డు రాజకీయ సమస్య ముస్లింలీగువారు లేవదీసిన పాకిస్తాన్ నిర్మాణ సమస్య దీనికి ఆధారం. జిన్నా నాయకత్వంలో లీగువారు ప్రతిపాదించిన ద్విజాతి సిద్ధాంతం, ఈ సిద్ధాంతంలోని లోపా

అన్నింటిని నేను నా ఉపన్యాసంలో వివరించాను. ఇతర దేశాలలో కూడ అల్పసంఖ్యాక ప్రజలు ఎందరో ఉన్నారు. కాని వారు ఈలాటి సిద్ధాంతాన్ని పురస్కరించుకొని దేశవిభజనను వాంఛించినవారు కారు. సిద్ధాంత దృష్ట్యాను, చారిత్రక దృష్ట్యాను దేశవిభజన వాంఛనీయం కాదని నేను ఉపన్యాసంలో స్పష్టపరచాను. నా ఉపన్యాసంపట్ల అందరు సదభిప్రాయాన్ని కలవారయ్యారు. దేశంలో ప్రముఖ వార్తాపత్రికలు ఉపన్యాసంలోని ప్రధాన భాగాలను ప్రకటించినవి. ఈ ఉపన్యాసం నా జీవితంలో ఒక సుస్థిరస్థానాన్ని కల్పించుకొన్నది. సమావేశం మూడు రోజులు జరిగినది. మూడవ రోజు అది విజయవంతంగా ముగిసినది.

గ్రామ పునర్నిర్మాణ ఉద్యమాన్ని సాగించి గ్రామాలలోని ప్రజలను విద్యావంతులుగా చేయవలెననే ఆశయం నాకు ఉండినది. నా పరిస్థితులు దానిని సాధ్యపరచుటకు అనుగుణంగా లేకపోయినవని ఇంతకు పూర్వమే చెప్పినాను. మద్రాసులో స్థిరనివాసం ఏర్పరచుకొనిన తర్వాత ఈలాటి ఆశయమే నాపైన ప్రభావం వహించింది. గ్రామప్రజలకంటె నగరవాసులలో ఎక్కువమంది అక్షరాస్యులు. అనేకులు ఇంగ్లీషువిద్య నభ్యసించి స్కూలు ఫైనల్ వరకు చదువుకొన్నవారు. కొందరు పట్టభద్రులైన వారు. ఈలాటి వారందరు స్వయముగా వార్తాపత్రికలను చదివి దేశవ్యవహారాలను గురించి కొంత పరిజ్ఞానం సంపాదించినవారు. సమావేశాలకు వెళ్ళి ప్రముఖుల ఉపన్యాసాలు వినుటకు వీరికి ఎక్కువ అవకాశం ఉంటుంది. ఇదిగాక వీరు వివిధవృత్తులను చేపట్టినవారు కావడంచేత వీరికిగల లోకజ్ఞానం ఎక్కువగా ఉంటుంది.

కాని వీరందరికి పౌరులకు వివిధ విషయాల గురించి ఉండదగిన కనీస పరిజ్ఞానం వాస్తవంగా ఉన్నట్లు నేను భావించలేదు. వారికి ఉన్న లోకజ్ఞానం ఈలాటిది కాదు. దేశంలో రాజకీయ, ఆర్థిక, సామాజిక రంగాలలో ఆనాడు ఎన్నో మార్పులు జరుగుచుండినవి. 1944 నాటికి పరాయి ప్రభుత్వం వెంటనే కాకపోయినా, కొద్దికాలంలో దేశంనుండి వెళ్ళిపొయ్యే సూచనలు కనుపిస్తూ ఉండినవి. దేశాన్ని ప్రజలే పరిపాలించగల పరిస్థితి ఏర్పడునట్లు కనుపించినది. వందలాది సంవత్సరాలుగా ఏదో ఒక

రూపంలో పరాయి ప్రభుత్వానికి లోబడినవారు ప్రాంతీయాభిమానాలను, తమ తమ భాషలపట్ల, తమ తమ మతాలపట్ల ఏర్పడిన దురభిమానాలను వదలుకొని, తామందరు ఒక జాతికి చెందినవారనే భావంతో దేశసమైక్యతను, స్వాతంత్ర్యాన్ని రక్షించుటకు సిద్ధంగా ఉన్నారా అనే ప్రశ్న పొడసూప సాగింది. గతంలో సామ్రాజ్యాలు పతనమైనప్పుడు దేశంలో అనేక రాజ్యాలు ఏర్పడినట్లు, వాటిమధ్య కలహాలు సంభవించినట్లు, దాని మూలంగానే పరాయివారు దేశాన్ని జయించి పరిపాలించ గలిగినట్లు చరిత్ర చాటిస్తూనే వున్నది. బ్రిటిషు సామ్రాజ్యాధికారం తొలగిపోయిన తర్వాత దేశైక్యత సుస్థిరంగా ఉండగలదా లేక చరిత్ర పునరావృతమయ్యే ప్రమాదం ఉన్నదా అనే సందేహం ఉత్పన్నం కలగకపోలేదు. అలాటి ప్రమాదం రాకుండా చేయుటకు ప్రజలందరిలో నగరవాసులతోసహా జాతీయభావం లోతుగా నాటుకొనవలసి ఉన్నది.

ఈవిషయాన్ని గురించి నేను కొంత ఆలోచించ సాగాను. జాతీయత అంటే ఏమిటి? దాని పుట్టుపూర్వోత్తరాలు ఏలాటివి? ఇతర దేశాలలో ఆ భావం ఎలాగు అభివృద్ధి గాంచింది? మనదేశంలో అది అభివృద్ధి గాంచుటకు ఎలాటి చర్యలు అవసరం మొదలైన విషయాలను గురించి మద్రాసు నగరవాసులకు నా శక్తి కొలది కొంత పరిజ్ఞానం కలుగునట్లు ఉపన్యాసాలు ఒక క్రమపద్ధతిని చేయడం అవసరమనే నిర్ణయానికి నేను వచ్చాను. ఆ నిర్ణయాన్ని ఆచరణసాధ్యం చేయుటకు అనుసరించ తగిన విధానం ఏలాటిది అని ఆలోచించి, తుదకు మద్రాసులో ప్రఖ్యాతిగాంచిన మహాజనసభ ద్వారా దానిని ఆచరణసాధ్యంచేయుటకు నిశ్చయించాను.

మద్రాసు మహాజనసభను 1884లో ఆనాటి రాజకీయ వేత్త స్థాపించారు. మద్రాసు నగరంలోనివారే గాక అన్ని జిల్లాల ప్రతినిధులు అందులో సభ్యులయ్యారు. వారు తరుచుగా సమావేశాల జరుపుచూ, ప్రభుత్వవిధానాలను విమర్శిస్తూ, ప్రజల దృష్ట్యా జరగవలసిన మార్పుల గురించి ప్రభుత్వానికి నివేదిస్తూ ఉండేవారు. 1885 భారత జాతీయ కాంగ్రెసు ఏర్పడిన తర్వాత మహాజనసభ

దానికి అనుబంధంగా కృషిచేయ సాగింది. కాని కాలక్రమాన దాని సమావేశాలు సన్నగిల్లినవి. అయినా 1944 నాటికి అది సజీవంగా ఉండినది. దాని ఆధ్వర్యాన వయోజనులకు నా ఉపన్యాసాలను వినిపించ తీర్మానించుకొన్నాను. కార్యనిర్వాహక వర్గంతో సంప్రతించగా వారు నా అభిప్రాయంతో ఏకీభవించి, నేను తలపెట్టిన సమావేశాలను ఏర్పాటుచేయుటకు సంసిద్ధులయ్యారు.

సమావేశాలలో మొదటిది 1944 అక్టోబరు 10-వ తేదీన జరిగినది. నా ఉపన్యాస పరంపరకు ప్రఖ్యాతి గాంచిన చక్రవర్తి రాజగోపాలాచారిగారు ప్రారంభోత్సవం చేసి, వారి ఉపన్యాసంలో నేను తలపెట్టిన కార్యక్రమం ప్రజలను సత్పౌరులుగా మార్చుటకు పటిష్ఠసాధనమని, దానిని ప్రశంసించారు. ఆ సమావేశంలో నేను రాజకీయాలంటే ఏమిటో, వాటికీ ఆర్థిక పరిస్థితులకు ఉన్న సంబంధం ఏలాటిదో వివరించాను. సుమారు 300 వయోజనులు నా ఉపన్యాసాన్ని వినుటకు హాజరయ్యారు.

అటుతర్వాతి డిసెంబరు ఆఖరుకు నేను ఆరు పర్యాయాలు "జాతీయత దాని పుట్టు పూర్వోత్తరాలు, మనదేశంలో దానిని అభివృద్ధి చేయుటకు తీసుకొనవలసిన చర్యలు, జాతీయతకు అంతర్జాతీయతకు గల పరస్పర సంబంధం" మొదలైన విషయాల గురించి ఆరు ఉపన్యాసాలు చేశాను. ప్రతి ఉపన్యాసాన్ని సుమారు 300 మంది విన్నారు. నా ఉపన్యాసానంతరం వారిలో కొందరు తమ సందేహాలను తీర్చుకొనుటకు కొన్ని ప్రశ్నలు వేసేవారు. వాటికి నేను సమాధానాలు చెప్పేవాడిని. వీటి మూలంగా నాకు మద్రాసు నగరవాసులతో సన్నిహిత సంబంధం ఏర్పడింది. ఇదిగాక 1944-'48 లో నేను ఇతర సమావేశాలలో తరుచుగా ఉపన్యసించడంచేత ఈ సంబంధం బలపడింది.

ఆకాలంలో మద్రాసులోని ఆంధ్రులు, తమిళుల మధ్య అనేకరంగాలలో ఒకవిధమైన పోటీ ఉండేది. ఇది మహాజన సభకు కూడా వ్యాపించింది. ఆ సభలోని ఆంధ్రులందరు 1947 మార్చిలో జరిగిన ఎన్నికలలో నన్ను అధ్యక్షపదవికి అభ్యర్థిగా నిలబెట్టారు. తమిళ సభ్యులలోకూడా కొందరు నాకు వోటు

చేయడంచేత నేను అధ్యక్షునిగా ఎన్నుకొనబడినాను. ఆంధ్రులందరు ఇది అపూర్వ విజయంగా భావించారు. నా అధ్యక్షతలో నేను సాధించినది ఎక్కువగా లేదు. సభా గ్రంధాలయాలనికి కొన్ని తెనుగు పుస్తకాలు, రాజకీయాలకు సంబంధించిన కొన్ని ఇంగ్లీషు పుస్తకాలు కొన్నాను.

నేను మహాజనసభకు అధ్యక్షుడుగా ఉన్నప్పుడు 1947 ఆగస్టు 15 న పరాయి ప్రభుత్వం తొలిగి దేశానికి స్వతంత్రం లభించింది. సుమారు 30 సంవత్సరాలు ప్రజలు జరిపిన పోరాటం విజయవంతంగా ముగిసింది. ఆనాడు మద్రాసు నగరమందంతట స్వాతంత్ర్యదినోత్సవం అతివైభవంగా జరిగింది. జాతీయజెండాను ప్రజలు వారివారి ఇండ్లపైన, పబ్లిక్ సంస్థలపైన ప్రతిష్ఠించారు. నేను మహాజనసభను సమావేశపరచి, జాతీయపతాకాన్ని ప్రతిష్ఠించాను. అటుతర్వాత ప్రకాశంపంతులుగారు నెహ్రూ చిత్రపటాన్ని ఆవిష్కరించారు. నేను తిరువళిక్కేణిలోని ఆంధ్ర యువజన సంఘంలో కూడా జాతీయపతాకాన్ని ప్రతిష్ఠించాను. ఆంధ్ర మహిళాసభలలోను, ఇతర సభల సమావేశాలలోను పాల్గొన్నాను. సాయంకాలానికి నగరమందంతట ఎలక్ట్రిక్ దీపాలు ధగధగాయమానంగా ప్రకాశించినవి. నేను నా భార్య, కుటుంబంలోని వారిలో ఇతరులతో సహా ఐలెండు గ్రౌండ్సుకు వెళ్లి అక్కడి ప్రదర్శనలను చూచి, అక్కడి గుంపులను తప్పించుకొని రాత్రి 10 గంటలకు ఇల్లు చేరాము. ఉత్సవ సందర్భంలో సంతోషించనివారొక్కరూ లేరు. కాని స్వాతంత్ర్యం లభించడంతోపాటు దేశవిభజన జరిగి, దేశంలో ఇండియా, పాకిస్థాన్ అనే రెండు స్వతంత్ర రాజ్యాలు ఏర్పడినందుకు అందరూ విచారగ్రస్తులైనారు.

నా జీవితం దృష్ట్యా ఇంకొక విధంగా ఈ అధ్యక్షపదవి ప్రాధాన్యం వహించింది. 1947 డిసెంబరు 27-వ తేదీ నుండి 29 వరకు రవీంద్రనాథ్ టాగూరుగారి శాంతినికేతన్ లో, బొంబాయిలోని "వ్యవసాయ ఆర్థిక సంఘ" సాంవత్సరిక సమావేశానికి సంఘంవారు ఒక ప్రతినిధిని పంపవలసిందిగా మహాజనసభను కోరారు. సభ నన్ను ప్రతినిధిగా ఎన్నుకొన్నది. దీని ఫలితంగా నేను శాంతినికేతన్ కు వెళ్లుటకు అవకాశం లభించింది. ప్రయాణంలో

నాకు సహాయంగా ఉండుటకు నా పెద్దకుమార్తె అన్నపూర్ణను వెంటబెట్టుకొని వెళ్ళినాను.

మేము 23-వ తేదీన బయలుదేరి, బెంగాలీభాష రానందున బొల్పూరుకు వెళ్లే రైలుకు సకాలంలో చేరనందున ప్రయాణంలో కొన్ని చిక్కులు ఎదుర్కొని 26-వ తేదీన చేరినాము. బొల్పూరుకు రెండు మైళ్ళ దూరంలో శాంతినికేతన్ ఉన్నది. బొల్పూరు స్టేషన్‌కు సమావేశానికి చెందిన వాలంటీర్లు వచ్చి మమ్ములను శాంతినికేతన్‌కు తీసుకొని వెళ్లారు. అక్కడి భోజనం మాకు ఎంతమాత్రము నచ్చలేదు. ఇది మాకు ముందుగానే తెలిసిన కారణంగా మేము ఒక డబ్బానిండా పూరీలు, మరికొన్ని పదార్థాలు తీసుకొనివెళ్ళి, వాటితో మూడు రోజులు తృప్తిగా కాలక్షేపం చేశాము.

వ్యవసాయ ఆర్థికసంఘ సమావేశం 27-వ తేదీన ప్రారంభమైనది. రవీంద్రనాథ్ టాగూర్ (విశ్వకవి 1941లో మరణించారు) సహోదరుడు రతీంద్రనాథ్ టాగూరు ఉపన్యాసం చేశారు. తర్వాత రేణుకా రే ఉపన్యాసం. బొంబాయి మంత్రివర్గంలో సభ్యులైన వి. యల్. మెహతా అధ్యక్షులుగా గాంధీగారి ఆర్థిక విధానాలను గురించి ముచ్చటించారు. మూడు రోజులు జరిగిన ఈ సమావేశంలోని చర్చలలో నేను పాల్గొన్నాను. మూడవ రోజు గ్రామపంచాయతీల గురించి చర్చ కొనసాగింది. అది నా అభిమాన విషయం కాబట్టి దానిని గురించి నా పరిశోధనను పురస్కరించుకొని దీర్ఘంగా ఉపన్యసించాను. నా ఉపన్యాసాన్ని అందరు ప్రశంసించారు. ప్రధానంగా సంఘాధ్యక్షులు సర్ నానావతి నా ఉపన్యాసానంతరం నన్ను ప్రత్యేకంగా కలుసుకొని, సంఘ పురోభివృద్ధికి మద్రాసులో కృషిచేయవలసిందిగా కోరారు.

శాంతినికేతన్ విశ్వకవి రవీంద్రనాథ్‌టాగూరు స్థాపించిన 'విశ్వభారతి' అనే విద్యాకేంద్రానికి ప్రసిద్ధి గాంచినట్టిది. దేశంలోని అన్నిప్రాంతాలనుండి వచ్చిన విద్యార్థులేగాక విదేశాల నుండి వచ్చిన విద్యార్థులు, విజ్ఞానవేత్తలు ఇందులోని కార్యక్రమాలలో పాల్గొనేవారు. అందుచేతనే విశ్వశాంతి అనే పేరు దీనికి సార్థకమైనది. మానవకోటి మధ్య ఏలాటి అడ్డుగోడలు

ఉండరాదని, అందరు సోదరులవలె మెలగవలెనని టాగూరు ఆశించి, దానికి తగిన విద్యావిధానాన్ని ఇచ్చట రూపొందించినారు. వారి మరణానంతరం కూడా వారి ఆశయాల ననుసరించి ఇచ్చటి విద్యావిధానం సాగుతూ వచ్చింది. నేను, నా కుమార్తె శాంతినికేతన్‌లోని వివిధ భవనాలను, చీనాభవన్, శిశుభవన్ మొదలైన వాటిని, టాగూరు నివసించిన భవనాన్ని చూచాము. ఈ భవనం అతిసుందరంగా అలకరింపబడి ఉండినది. మూడు రోజులలో ఒకనాడు రాత్రి ఇక్కడ సంగీతసభ జరిగింది. ఇంకొకరాత్రి నాట్యసభ జరిగింది. అక్కడి చిత్రలేఖన విద్యాలయంలో నలుగురు ఆంధ్రులు విద్యార్థులుగా ఉండినారు. వారు మమ్ములను విశ్వభారతి చుట్టూ తీసుకొని వెళ్ళి చూడదగిన ప్రదేశాలన్నిటిని అతి ఓపికతో చూపించి మాకు చాలా సహాయపడినారు. గ్రామీణ ప్రజల పురోభివృద్ధికై శాంతినికేతనానికి అనుబంధంగా స్థాపింపబడిన శ్రీనికేతన్ అనే వ్యవసాయిక కేంద్రాన్ని కూడా దర్శించినాము. మాకు సహాయపడిన విద్యార్థులలో కె శేషగిరిరావు ఈనాడు హైదరాబాదులోని లలితకళల విద్యాలయం చిత్రలేఖన శాఖలో అధ్యాపకులుగా వున్నారు. మొత్తంమీద అన్ని విధాలుగా మా శాంతినికేతన్ యాత్ర ఉత్తేజకరంగా ఉండినది.

29 రాత్రి బయలుదేరి 30 న హౌరా చేరాము. అక్కడ మన్యం నారాయణమూర్తి (వీరు నెల్లూరు కళాశాలలో నావద్ద విద్యాభ్యాసం చేసినవారు) మాకు టిక్కెట్లను కొని రైలులో రిజర్వేషన్ ఏర్పాటుచేసిన కారణంగా మా తిరుగు ప్రయాణం సుఖంగా జరిగి జనవరి 1 న మేము నెల్లూరు చేరినాము.

నెల్లూరులో నాలుగైదు రోజులు గడిపినాము. నా కోడలు సీత గర్భంతో ఉండినది. ఆమెకు గాజులు తొడగడం అప్పుడే జరిగింది. అందులో పాల్గొని దానితోపాటు నెల్లూరులో జరిగిన రైతు కాంగ్రెసు సమావేశంలో ప్రసంగించి, జనవరి 6 న మద్రాసు చేరినాను. మద్రాసు మహాజనసభకు 1947 లో అధ్యక్షుడుగా ఎన్నుకొనబడడంచేత శాంతినికేతన్ యాత్రకు అవకాశం లభించింది. ఈ యాత్ర నా జ్ఞాపకాలలో శాశ్వత స్థానం కల్పించుకొన్నది.

మద్రాసులో నేను గడిపిన అయిదు సంవత్సరాలలో 1948 లో నా కార్యక్రమాలు ఉచ్ఛస్థాయిని అందుకొన్నవి. ఎడతెరపిలేక వాటిని సాగించాను. వివిధ వార్తాపత్రికలకు ఇంగ్లీషు, తెలుగు పత్రికలకు 50 వ్యాసాలు వ్రాశాను. పది సమావేశాలలో ప్రసంగించాను. వీటిలో రెండు పర్లాకిమిడిలో జరిగినవి. 56 పుస్తక సమీక్షలు వ్రాసినాను. 17 పర్యాయాలు ఆకాశవాణిలో ప్రసంగాలు ప్రసారం చేశాను. చిత్తురాజ్యాంగాన్ని గురించి రాజ్యాంగసభ కార్యదర్శికి నా అభిప్రాయాలను పంపినాను. అదేవిషయమై ఒక చిన్న గ్రంథాన్ని వ్రాయగా దానిని బొంబాయి లోని హింద్ కితాబ్సవారు ప్రకటించారు. పుస్తక సమీక్షలు గాక తక్కిన కార్యక్రమాలను సాగించడంలో నేను అనేక గ్రంథాలను చదివినాను. తరుచుగా మద్రాసు విశ్వవిద్యాలయ గ్రంథాలయానికి, కానిమెరా గ్రంథాలయానికి, రనడే హాలులోని గ్రంథాలయానికి వెళ్లుచుండేవాడిని. ఈవిధంగా 1948 సంవత్సరాన్ని గడిపాను.

1944-'49 మధ్య నేను పాల్గొన్న కార్యక్రమాలలో మరి కొన్నిటిని గూర్చి ప్రస్తావించడం అవసరం. వాటిలో ఒకటి ఆంధ్ర విశ్వవిద్యాలయు సెనెట్, అకాడమిక్ కౌన్సిల్, సిండికేటు ఎన్నికలలో 1944 లో పాల్గొనడం ఒకటి. ఆంధ్ర విశ్వవిద్యాలయం నుండి విరమింపబడిన తర్వాత దానితో ఎలాటి సంబంధమూ పెట్టుకొనవలసిన అవసరం లేకపోయినా విద్యావేత్తగా నాకు కొంత పలుకుబడి ఉన్నట్లు ఉపాధ్యాయులు రెడ్డిగారికి రుజువు చేయుటకు నేను ఈ ఎన్నికలలో పాల్గొన్నాను. సెనెట్ ఎన్నికలకు పట్టభద్రుల నియోజక వర్గానుండి అభ్యర్థిగా నిలబడి సులభంగా గెలుపొందినాను. కాని అకాడమిక్ కౌన్సిలుకు అటుతర్వాత నవంబరులో జరిగిన ఎన్నికలలో ఓడిపోయాను. దీనికి కొంత వరకు అధికారవర్గంవారు చేసిన కుట్ర కారణమని నెల్లూరు కళాశాల ప్రిన్సిపాల్ సచ్చిదానందంగారు, మరికొందరు మిత్రులు నాకు తెలియపరచారు. అందుచేత మరి కొంత పట్టుదలతో సిండికేటుకు జరిగిన ఎన్నికలలో అభ్యర్థిగా నిలబడినాను. అధికార వర్గానికి చెందిన సి. ఆర్. రెడ్డిగారు, వి. యస్. కృష్ణాగారు, వారి అనుయాయులైన బెజవాడ గోపాలరెడ్డి మొదలైనవారు

నన్ను ఓడించుటకు గొప్ప ప్రయత్నం చేశారు. కులతత్వాలను, బ్రాహ్మణ బ్రాహ్మణేతర విభేదాలను ఈ ఎన్నికలలో ప్రవేశ పెట్టినారు. కాని ఎక్కువ సంఖ్యలో నేను వోట్లను సంపాదించ లేకపోయినా ఎన్నికలలో విజయాన్ని సాధించినాను. ఎన్నికలలో కపిలేశ్వరపురం జమీందారు పట్టాభి రామారావుగారికి 62 వోట్లు, బెజవాడ గోపాలరెడ్డిగారికి 57, వుయ్యూరు జమీందారు మేకా అప్పారావుగారికి 37, నాకు 36, లాయర్ సర్వేశ్వరశాస్త్రిగారికి 35 వోట్లు లభించినవి. గెలుపొందిన బ్రాహ్మణ అభ్యర్థులు చాలా తక్కువ వోట్లతో గెలిచారు.

నేను సిండికేటుకు ఎన్నిక అయినా అందులో సభ్యుడుగా ఉండి సాధించినది ఏలాటిది లేదు. సభ్యులలో అధికసంఖ్యాకులు రెడ్డిగారి అధికార పక్షానికి చెందినవారు. వారు రెడ్డిగారు చేసిన ప్రతిపాదనలను తూ చా తప్పకుండా అంగీకరించడం పరిపాటి. నేను ప్రతిపక్షానికి చెందినవాడను. నా విమర్శలకు, ఖండనలకు ఏలాటి విలువా లేకపోయినది. ఎన్నికల మూలంగా ఏర్పడిన సభ లన్నిటిలో అధికారపక్షం ఒకటి ఏర్పడినప్పుడు దానిని ఎదుర్కొనుటకు బలీయమైన ప్రతిపక్షం వుండటం ఎంతైనా అవసరం. అలాటి ప్రతిపక్షం లేనప్పుడు ఉపాధ్యక్షులు నిరంకుశంగా వ్యవహరించే ప్రమాదం ఉన్నది. విశ్వవిద్యాలయ వ్యవహారాలన్నీ ఆనాడు నిరంకుశత్వ ధోరణిలోనే సాగినవి. 'విష్ణున్న చెప్పిందే. వేదము' అన్నట్లు రెడ్డిగారు చెప్పినది ఒక వేదవాక్యంగా తయారైనది.

ఈలాటి పరిస్థితిలో సిండికేటు సభ్యునిగా నేను ఏమీ సాధించలేకపోవుటలో ఆశ్చర్యపడవలసింది ఏదీ లేదు. ఏదో మీటింగులుకు వెళ్ళడం తప్ప సాధించ కలిగింది ఏదీ లేకపోవడం నాకు విసుగును కలిగించింది. సభ్యత్వానికి రాజీనామా చేయడం ఉచితమని అప్పుడప్పుడు అనుకొనేవాడను. కాని సభ్యత్వం మూడు సంవత్సరాలు మాత్రమే కావడంచేత ఆ పనికి పూనుకొనలేదు. తిరిగి ఈలాటి ఎన్నికలలో పాల్గొనరాదని నిర్ణయించుకొన్నాను.

ప్రకాశంపంతులుగారు మద్రాసు రాష్ట్రానికి ముఖ్యమంత్రిగా ఉన్నప్పుడు 'విశ్వవిద్యాలయాల విరాళాల కమిటీ' (University Grants Commission) ఒక దానిని స్థాపించి, అందులో

నన్ను ఒక సభ్యునిగా నియమించారు. విద్యాశాఖ డైరెక్టరు, మరి ఇద్దరు సభ్యులు అందులో ఉండేవారని నాకు జ్ఞాపకం. అందులో సభ్యునిగా నేను రెండు ప్రతిపాదనలు చేశాను. ఆంధ్ర విశ్వ విద్యాలయంలో విజ్ఞానశాస్త్రానికి ఉన్నట్టి ప్రాధాన్యం చరిత్ర, రాజనీతి, అర్థశాస్త్ర శాఖలతో కూడిన సాంఘికశాస్త్రాలకు మొదటి నుంచి ఉండినది కాదు. ఈ శాస్త్రాలలో పరిశోధన సౌకర్యాలు ఎక్కువగా ఉండేవికావు. ఈ పక్షపాత వైఖరిని తొలగించి, సాంఘికశాస్త్రాలకు కూడా తగిన ప్రాధాన్యాన్ని కల్గించవలెనని నేను తరుచుగా ప్రతిపాదించేవాడిని. ఇదీగాక ఇదివరకు ఉండే శాఖలను సౌష్ఠవపరచక కొత్తశాఖలను ప్రారంభించరాదని నేను ఉద్ఘాటిస్తూ ఉండేవాడిని. ఈలాటి ప్రతిపాదనలు చేసి, విశ్వ విద్యాలయ స్వాతంత్ర్యానికి భంగం కలిగిస్తున్నానని భావించి, ప్రభుత్వంతో తనకు ఉన్న పలుకుబడిని వినియోగించి, రెడ్డిగారు కమిటీని రద్దు చేయించారు. ఎదుటివారి విమర్శలు ఎంతటి సహేతుకములైనా వారు దానిని ప్రతిఘటించడం మామూలు. దానికి ఈ కమిటీ గద్దు ఒక గొప్ప తార్కాణము.

ఇటీవలకాలంలో సినిమాల పిచ్చి దేశంలో ఎక్కువగా వ్యాపించింది. ప్రజలలో అధికసంఖ్యాకులకు ఇది ఒక్కటే అందుబడిలో ఉండే వినోదము. కొత్తగా వచ్చిన సినిమాలకు వేలంవెర్రిగా వేలాదిజనం ఎగబడుతూ ఉండటం సామాన్య దృశ్యం. టిక్కెట్లకుగాను వారు పడే తాపత్రయం ఇంతా అంతా కాదు. మధ్యవర్తులు ముందుగానే టిక్కెట్లను కొని, వాటిని రెండింతల ఖరీదుకు అమ్మడం పరిపాటి. ఈ పిచ్చి నగరవాసులలోనే గాక గ్రామీణులలో కూడ కనిపిస్తున్నది.

కాని తయారుచేయబడిన సినిమాలన్నీ నైతిక దృష్ట్యా ప్రదర్శనార్హములు కావు. ఆలాటి వాటిని చూచే వారిని, ప్రధానంగా యువకులను అవి అవినీతికి పాల్పడేటట్లు ప్రోత్సహించగల ప్రమాదం ఎంతైనా ఉన్నది. దేశంలో ఇటీవలకాలంలో దౌర్జన్యం వ్యాపిగాంచుటకు ఈలాటి సినిమాలు ఒక ప్రధానకారణం. అందుచేత తయారైన సినిమాలలో ప్రదర్శించుటకు ఏవి అర్హములో ఏవి కావో నిర్ణయించుటకు రాష్ట్రప్రభుత్వం ఒక

ఫిలిం సెన్ సార్ బోర్డును ఏర్పాటు చేయడం మామూలు. 1947లో నేను ఆ బోర్డులో ఒక సభ్యుడుగా నియమింపబడినాను. తక్కిన నా కార్యక్రమాలతో పాటు ఈ సభ్యత్వం మూలంగా సుమారు 25, 30 కొత్త సినిమాలను నేను పరీక్షించినాను. నాతో కూడా మరి ఇద్దరు సభ్యులు ఉండేవారు. సాధారణంగా ఒక్కొక్క సినిమాను పరీక్షించుటకు 2, 3 గంటలు పట్టేది. సినిమాలను తయారుచేసి వాటిమూలంగా లాభాలు గడించ తలపెట్టినవారు సభ్యుల అభిప్రాయాలను తమకు అనుకూలంగా మార్చుటకు వారిని తరుచుగా కలుసుకొంటూ వుండేవారు. ఈ పనుల మూలంగా నా కాలం 1947 లో ఈవిధంగా వినియోగ మయ్యేది. అయితే ఇది ఒక సంవత్సర కాలానికి పరిమితమైనట్టిది. 1948 లో ఇది నాకు అక్కర లేదని ప్రభుత్వానికి తెలియపరచాను.

నేను ఉద్యోగాననుండి విరమించినా, నా ఈ నిరుద్యోగ కాలంలో వివిధములైన కార్యక్రమాలలో పాల్గొనవలసి వచ్చిందని తెలియపరచుటకు పై విషయాలను ఇచ్చట ప్రస్తావించాను. నాకు భూవసతి మూలంగాను, పించన్ మూలంగాను లభించే ఆదాయం కుటుంబపోషణకు చాలకపోవడంచేత వీటిలో కొన్ని కార్యక్రమాలను చేపట్టాను. నేను విద్యావేత్తగా గడించిన అనుభవాన్ని అనేక సంస్థలవారు ఉపయోగించుకొన దలచుటచేత నా విశ్రాంతికి, ఆరోగ్యానికి భంగం కలిగినా తక్కిన కార్యక్రమాలలో అనేకాన్ని చేపట్టాను. ఎవరైనా వచ్చి తమ సమావేశాలలో పాల్గొనవలసినదిగా ఆహ్వానించినప్పుడు వారికి ఆశాభంగం కలిగించడం నా స్వభావానికి విరుద్ధం.

వార్తాపత్రికలలో పుస్తకసమీక్షలు చేయడం, వ్యాసాలు వ్రాయడం వంటి రచనలను సాగించుటకు బదులు పరిశోధన గావించి ప్రామాణిక గ్రంథాన్ని వ్రాసి ఉండకూడదా అనే ప్రశ్నను అప్పుడప్పుడు నేను వేసుకొంటూ ఉన్నాను. కాని నా పరిస్థితుల ప్రభావం చేతను, పరిశోధనకు కావలసిన వసర్లు మద్రాసులో లేకపోవడంచేతను నాకు అది సాధ్యపడలేదు. మద్రాసులో నా కుంటుంబపోషణకు కావలసిన ఆదాయాన్ని సంపాదించవలసిన అవసరం ఏర్పడింది. నాతో ఉండిన నా కుమార్లు పట్టభద్రులైనా

నిరుద్యోగులుగా ఉంటూ వచ్చారు. అందుచేత కుటుంబపోషణ భారాన్ని అంతా నేను భరించవలసి వచ్చింది. పరిశోధన కార్యక్రమం ఆదాయాన్ని చేకూర్చేది కాదు. అందుచేత దానిని వదులుకొనవలసి వచ్చింది. పాశ్చాత్యదేశాలలో పరిశోధన గావించే వారికి విశ్వవిద్యాలయంవారు, ఇతర దాతలు వేతనాలు ఇవ్వడం మామూలు. కాని ఆలాంటి వసతులు మనదేశంలో లేవు. 1925 – '26 లో ఆలాంటి వేతనం మద్రాసు విశ్వవిద్యాలయంవారు నాకు ఇవ్వడంచేతనే నేను పరిశోధన గావించి ఒక గ్రంథాన్ని వ్రాయగలిగాను. ఈనాడు యు. జి. సి. (U. G. C) వారు విరమించిన అధ్యాపకులకు రెండు సంవత్సరాల కాలం ప్రత్యేక వేతనాలు ఇచ్చి వారిచేత పరిశోధన కార్యక్రమాలు చేయించే పద్ధతి అమలులో ఉన్నది. కాని నేను ఉద్యోగవిరమణ చేసినప్పుడు ఈ పద్ధతి లేదు. ఇదీగాక మద్రాసులో గ్రంథాలయాలు అనేకం ఉండినా నా అభిమానశాస్త్రమైన రాజనీతిలో పరిశోధన గావించుటకు కావలసిన గ్రంథాలుగాని, ప్రామాణిక పత్రికలుగాని వీటిలో ఉండేవి కావు. కొన్ని ఉన్నా వాటిని ఎంతో వెతికితేగాని అవి లభించేవి కావు. పాశ్చాత్య దేశాలలోని గ్రంథాలయాల అధికారులు సిబ్బంది ఏ గ్రంథంలో ఏలాటి విషయాలు వివరింపబడి ఉన్నవో పరిశోధకులకు వెంటనే చెప్పగలరు. కాని ఆలాటి ఏర్పాటులు ఆనాడు మద్రాసులో లేవు. ఇప్పుడు కూడా లేవనే చెప్పవలసి యున్నది. నేను తరుచుగా మద్రాసులోని గ్రంథాలయాలకు ఆరోజులలో వెళ్లుతూ ఉండేవాడిని. ఎంతో వెదకితేనేగాని నాకు కావలసిన పుస్తకం లభించేది కాదు. ఒక్కొక్కప్పుడు నా కాలమంతా వెదకడంలోనే వ్యర్థ మయ్యేది. ఈలాటి పరిస్థితులలో పరిశోధనసాగించి ఉత్తమమైన ప్రామాణిక గ్రంథాన్ని వ్రాయపూనడం ఆ కాలంలో భవన నిర్మాణానికి ప్రయత్నంచేయడం వంటిది. అందుచేతనునేనే ఈ కార్యక్రమాన్ని చేపట్టలేక పోయినాను. పరిస్థితులను అధిగమించి కొందరు వారి శక్తి సామర్థ్యాలను ప్రదర్శిస్తారు. వారు అందరి ప్రశంసలకు పాత్రులు. కాని నా ఆర్థికస్థితి ఆనాడు నేను ఈవిధంగా ప్రయత్నించుటకు అనుకూలపడినది కాదు.

1944 జూలై నుండి 1949 మే ఆఖరు వరకు నా మద్రాసు జీవితం పైవిధంగా సాగిపోయింది.

## నా ఉద్యోగ జీవితంలో ఆఖరు దశ (1)

1949 జూన్ 1 నుండి మూడు సంవత్సరాల కాలం నాకు బొంబాయి విశ్వవిద్యాలయంలో కొత్తగా ప్రారంభింపబడిన రాజనీతిశాఖలో ప్రధాన అధ్యాపకుని ఉద్యోగం లభించింది. దీనికి నేను దరఖాస్తు పెట్టకపోయినా అది నాకు లభించడం ఇందులోని విశిష్టత. బొంబాయిలోని నా మిత్రులు, రిజర్వు బ్యాంక్‌లో గొప్ప పదవిలో వున్నట్టి వేదుల నరసింహామూర్తిగారు జనవరి 16 న ఆ అధ్యాపకత్వం ఖాళీగా వున్నదనీ, నేను దరఖాస్తు పెట్టిన పక్షంలో అది నాకు తప్పకుండా లభించగలదనీ ఉత్తరం వ్రాశారు. అంతకుపూర్వం విశ్వవిద్యాలయంవారు ఖాళీ వున్నట్లు వార్తాపత్రికలలో ప్రకటించి, అర్హులను ధరఖాస్తు పంపవలసినదిగా కోరారు. అనేక రాజనీతిశాస్త్రవేత్తలు దరఖాస్తులు పంపినారు. ఎంపికచేసే కమిటీ ( Selection Committee ) సమావేశమై వీరిలో ఎవరూ ఆ పదవికి అర్హులు కారనిన్నీ, దరఖాస్తు పెట్టని వారిలో శాస్త్రజ్ఞానం మూలంగాను, అనుభవం మూలంగాను ప్రఖ్యాతి గాంచిన వారిని ఆహ్వానించి, వారిని ఈ పదవిలో నియమించవలసిందిగానూ సిఫారస్సు చేశారు.

నరసింహామూర్తిగారు నాకు ఉత్తరం వ్రాయునప్పటికి నా వయస్సు 60 సంవత్సరాలు. రాజనీతిశాస్త్రవేత్తలలో కొంత ప్రఖ్యాతిని సంపాదించినవాడను. ఉద్యోగానికి దరఖాస్తు పెట్టి అపజయాన్ని పొందడం నాకు ఎంత మాత్రము రుచించలేదు,

16)

విశ్వవిద్యాలయ రిజిస్ట్రారుగాని, ఉపాధ్యక్షులుగాని నా దరఖాస్తును సుహృద్భావంతో పరిశీలించునట్లు ఒక ఉత్తరం వ్రాసిన పక్షంలోనే నేను దరఖాస్తు పంపెదనని నరసింహమూర్తిగారికి తెలియపరచాను.

తర్వాత ఏమి జరిగిందో నాకు వివరంగా తెలియలేదు. కాని ఏప్రిల్ 5-వ తేదీన రిజిస్ట్రారు రాజనీతిశాఖలో ప్రధానాధ్యాపకునిగా (Professor) నియమించిన పక్షంలో ఆ పదవిని స్వీకరించుటకు సిద్ధంగా ఉన్నట్లు తెలియపరచవలసిందిగా నా కొక ఉత్తరం వ్రాశారు. నేను తప్పకుండా ఆ పదవిని స్వీకరించెదనని వెంటనే వారికి జవాబు వ్రాశాను. 10-వ తేదీన ఉపాధ్యక్షులు కూడా అలాంటి ఉత్తరమే ఒకదానిని వ్రాసారు. వారికి కూడా నా అంగీకారాన్ని తెలియపరుస్తూ, వారు కోరిన మేరకు నా అర్హతల గురించి, అనుభవాన్ని గురించి వివరములు పంపినాను. తర్వాత రెండు మూడు రోజులకు నేను అప్పటి వరకు వ్రాసిన గ్రంధముల ప్రతులను, పరిశోధక వ్యాసముల ప్రతులను వారికి పంపినాను. మే 2న నన్ను ప్రధానాధ్యాపకునిగా నియమించినట్లు వారు ఒక తంతి సమాచారాన్ని పంపినారు. 4-వ తేదీన ఉత్తరం కూడ వ్రాశారు. ఈ ఉత్తర ప్రత్యుత్తరాల ఫలితంగా నేను జూన్ 1న బొంబాయి విశ్వవిద్యాలయంలో రాజనీతిశాఖలో ప్రధాన అధ్యాపకునిగా ఉద్యోగంలో చేరినాను. నేను విశ్వవిద్యాలయంతో చేసుకొన్న ఒడంబడిక ప్రకారం నా ఉద్యోగకాలపరిమితి మూడు సంవత్సరాలు.

అనేకవిధాలుగా ఈ విశ్వవిద్యాలయం ఆదర్శమైనట్టిదని చెప్పవచ్చును. ఇది కలకత్తా, మద్రాసు విశ్వవిద్యాలయాల వలె 1858 లో స్థాపింపబడినది. అప్పటినుంచి 90 సంవత్సరాల మధ్య సత్సంప్రదాయాలు అనేకం ఏర్పడినవి. వీటిలో ప్రధానంగా పేర్కొనదగినది అధ్యాపకులకు వారి కార్యక్రమాలను సాగించుటలో లభించిన స్వాతంత్ర్యం. ఉపాధ్యక్షులు ఇందులో ఏలాంటి జోక్యం కలిగించుకొనేవారు కారు. అధ్యాపకుల కార్యక్రమం మూడు విధాలుగా ఉండేది. ఎం. ఏ. విద్యార్థులకు శాస్త్రబోధ చేయడం వారి బాధ్యతలలో మొదటిది. ఇందుకుగాను సామాన్యంగా వారు వారానికి 6 లేక 8 గంటలు వినియోగించే

వారు. ఆంధ్ర విశ్వవిద్యాలయంలో వారానికి 12, 14 గంటలు ఇందుకుగాను వినియోగింపబడవలసి ఉండేది. తీరిక ఎక్కువగా ఉండడంచేత అధ్యాపకులు పరిశోధన కార్యక్రమాలలో పాల్గొనడం వారి బాధ్యతలలో రెండవది. ఇది రెండు విధాలుగా ఉండేది. మొదటిది పిహెచ్. డి. (Ph. D.) విద్యార్థులు పరిశోధనలో వారికి తగిన సహాయంచేసి, వారికి డిగ్రీ లభించేటట్లు వారిని తర్ఫీదు చేయడం. ఇదిగాక అధ్యాపకులు స్వయంగా పరిశోధన గావించి వారి కృషి ఫలితాలను గ్రంథరూపంలోగాని, వ్యాసాలరూపంలో గాని ప్రకటించడం.

ఈ మూడు కార్యక్రమాలను నేను తృప్తికరంగా నిర్వహించా ననేది నా అభిప్రాయం. విద్యాబోధ చేయడంలో నేను అప్పటికి 35 సంవత్సరాల అనుభవం గడించిన వాడిని కావడంచేత దానిని నిర్వహించడం నాకు సులభసాధ్యంగా ఉండేది. కాని ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ఒక్కొక్క తరగతిలో 20, 25 కంటె ఎక్కువ ఉండే వారు కారు. రాజనీతిశాఖను ఎంపికచేసినవారు 10, 12 మాత్రమే. కాని బొంబాయిలో వీరి సంఖ్య 100 కు మించి ఉండేది. ఇందరికి బోధించడంలో ప్రత్యేక కృషి అవసరమయ్యేది. కాని దానికి తగినట్లు నేను కష్టించేవాడిని. ఇదిగాక 1951 నుండి ప్రభుత్వపరిపాలన విధానం (Public Administration) అనే విషయాన్ని నేను బోధించవలసిన అవసరం ఏర్పడింది. దీనిని అంతకుపూర్వం నేను బోధించి ఉండలేదు. అందుచేత నేను దీనిని గురించిన ప్రామాణిక గ్రంథాలను ఎక్కువగా చదివి, వాటిని పూర్తిగా అర్థంచేసుకొని, నోట్సు (Notes) తయారుచేసుకొని క్లాసుకు వెళ్లవలసినవాడనైనాను. దీనిమూలంగా ఎక్కువ కాలం ఇందుకుగాను వినియోగించవలసి వచ్చింది. ఇది తప్ప బోధన బాధ్యతను నిర్వహించడంలో నేను ఏలాంటి చిక్కులను ఎదుర్కొనలేదు.

నేను బొంబాయిలో ఉన్నప్పుడు నావద్ద 5, 6 విద్యార్థులు పిహెచ్. డి పరిశోధన చేయుటకు చేరినారు. వారికి సహాయం చేయడంలోను, వారు వ్రాసి తెచ్చిన అంశాల గురించి వారితో చర్చించి, వాటిలోని లోపాలను సంస్కరించడంలోను చాలాకాలం

వినియోగించేవాడను. అనేక విశ్వవిద్యాలయాలలో ఆనాడూ, ఈనాడూ అధ్యాపకులు అలాటి వారికి తగిన సహాయం చేయడం లేదు. పిహెచ్. డి విద్యార్థులకు సలహాలను ఇచ్చి, పరిశోధన మార్గాన్ని వారికి సూచించడం మాత్రమే తమ విధి అని, ఆ మార్గంలో వారిని నడిపించడం తమ బాధ్యత కాదని అనేక అధ్యాపకులు భావించడం మామూలు. నేను అలాగుకాక వారికి సాధ్యమైనంత సహాయం చేసేవాడిని. సాధారణంగా ఈ విద్యార్థులు తమ పరిశోధనను పూర్తిచేయుటకు మూడు సంవత్సరాలు పడ్తుంది. కొందరు ఇందుకుగాను నాలుగు సంవత్సరాలు కూడా వినియోగించవలసి వస్తుంది. అందుచేత నా మూడు సంవత్సరాల అధ్యాపకత్వంలో మైసూరుకు చెందిన కె. బి. వై. తోటప్ప అనే విద్యార్థి ఒక్కడే పరిశోధనను పూర్తిచేసి, పిహెచ్. డి. డిగ్రీని సంపాదించగలిగారు. (వీరు ప్రస్తుతం మైసూరు విశ్వవిద్యాలయంలో ప్రధానాధ్యాపకులు.) తక్కినవారి పరిశోధన అసంపూర్ణంగా ఉండిపోయింది. నేను విశ్వవిద్యాలయాన నుండి 1952 జూన్‌లో విరమించుకొన్న తర్వాతనే వారు దానిని పూర్తిచేసి డిగ్రీని పొందగలిగారు. కాని వారికి కూడా నేను చాలా సహాయపడినాను.

నా మూడవ బాధ్యత స్వయంగా పరిశోధన సాగించి, దాని ఫలితాలను ప్రకటించడం, ఇందునిమిత్తం నేను అయిదు విషయాలను గురించి పరిశోధనను గావించి, వాటిలో మూడింటిని మాత్రమే పూర్తిచేయగలిగాను. 1950 లో లండన్ విశ్వవిద్యాలయంలో రాజనీతిశాఖలో ప్రధానాధ్యాపకులుగా ఉండిన రాబ్సన్ (Robson) "ప్రపంచంలోని గొప్ప నగరాలు" (World's Great Cities) అనే గ్రంథాన్ని తన సంపాదకత్వంలో ప్రకటించ దలచి కొందరిచేత తన గ్రంథంలో ప్రకటించుటకు వ్యాసాలు వ్రాయవలసిందిగా ఆహ్వానించారు. నన్ను బొంబాయి, కలకత్తా నగరాల గురించిన వ్యాసాలు వ్రాయమని చెప్పారు. వారి ఉద్దేశం వారు ఎంపికచేసిన నగరాల మునిసిపల్ పరిపాలనా విధానాన్ని వివరంగా పాఠకులకు తెలియపరచడం, ఆ యా దేశాల పరిస్థితుల లోను, చరిత్రలోను ఏర్పడిన భేదాలు కారణంగా వాటిలోని

నగరాల మునిసిపల్ పరిపాలనా విధానంలో కూడా అనేక తారతమ్యాలు ఉండడం సహజం. దీనిని స్పష్టంగా తెలియపరచే ఉద్దేశంతో వారీ గ్రంథాన్ని ప్రకటించదలచారు. వారి కోరిక ననుసరించి నేను 1950 లో బొంబాయి, కలకత్తా మునిసిపల్ పరిపాలన విధానాన్ని గురించి నా వ్యాసాన్ని వారికి పంపాను. దానిని వారు వారి గ్రంథంలో ప్రకటించారు. వారు వారి గ్రంథాన్ని మూడు పర్యాయాలు పునర్ముద్రణ గావించారు. మూడవ పునర్ముద్రణ నాటికి ఢిల్లీనగర మునిసిపల్ పరిపాలన విధానాన్ని చేర్చడం వారి దృష్టిలో ఎక్కువ ప్రాధాన్యాన్ని వహించింది. భారతదేశానికి అది ప్రధాన నగరంగా ఉండడం దానికి కారణం. అందుచేత వారి పునర్ముద్రణలో బొంబాయి, కలకత్తాల గురించి నేను వ్రాసిన వ్యాసానికి బదులు ఢిల్లీని గురించి డాక్టర్ కోసలా వ్రాసిన వ్యాసాన్ని ప్రకటించారు. ఈలాటి మార్పులు మరికొన్నిటిని కూడా వారు మూడవ ముద్రణలో గావించారు.

నేను చాలాకాలంనుండి సమాఖ్య పరిపాలన విధానాన్ని గురించి పరిశోధన చేయడంలో కొంత శ్రద్ధను వహించాను. వాని ఫలితంగా "ఫెడరలిజం ఇన్ గవర్నమెంటు" అనే గ్రంథాన్ని వ్రాయగా 1935 లో దానిని ఆంధ్ర విశ్వవిద్యాలయంవారు ప్రకటించారు. నేను బొంబాయిలో ఉన్నప్పుడు పూనానగరంలో ప్రఖ్యాతి గాంచిన "గోఖలే ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ పాలిటిక్స్" (Gokhale Institute of Politics and Economics) అనే సంస్థ డైరెక్టరు డాక్టర్ గాడ్గిల్‌గారు నన్ను 1951 కాలె స్మారక ఉపన్యాసాన్ని (Kale Memorial Lecture) ఇయ్యవలసిందిగా కోరారు. నేను దానికి అంగీకరించి "కాంపిటివ్ అండ్ కో ఆపరేటివ్ ట్రెండ్సు ఇన్ ఫెడరలిజం" (Competitive and Co-operative Trends in Federalism) అనేవిషయాన్ని గురించి పరిశోధన గావించి ఒక సుదీర్ఘమైన వ్యాసాన్ని వ్రాసి, 1951 ఫిబ్రవరి 24 న పూనాకు వెళ్లి ఆచార్య కార్వే అధ్యక్షతన నా ఉపన్యాసాన్ని చేశాను. ఇది ఏటేటా జరిగే సాంవత్సరిక ఉపన్యాసం. దానిని తర్వాత ఇన్‌స్టిట్యూట్ వారు ప్రకటించారు. ఈ ఉపన్యాసాన్ని వ్రాసే సందర్భంలో నేను అమెరికా, కెనడా, ఆస్ట్రేలియా మొదలైన

సమాఖ్య దేశాలలో ఇటీవలకాలంలో కేంద్ర రాష్ట్రాల మధ్య జరుగుచుండిన మార్పుల గురించి, మన నూతన రాజ్యాంగంలో కేంద్రరాష్ట్రాలమధ్య సహకారానికి సంబంధించిన సూత్రాలగురించి పరిశీలించవలసి వచ్చింది.

నేను గావించిన మూడవ పరిశోధన 1952 ప్రారంభంలో మనదేశంలో మొట్టమొదటిసారిగా పార్లమెంటుకు జరిగిన సాధారణ ఎన్నికలకు సంబంధించినట్టిది. ఈ పరిశోధన విషయంలో నేను 1951 లో అనేక నెలలు నిర్విరామంగా కృషిచేయవలసి వచ్చింది. ఈ కార్యక్రమాన్ని ప్రారంభించుటకు ముందు ఇంగ్లండులో జరిగిన కొన్ని సాధారణ ఎన్నికల గురించి ఉత్తమ గ్రంథాలు వ్రాసిన హెరాల్డు నికలాస్ (Herald Nicholas) గ్లాస్గో నగరంలో జరిగిన వాటిని గురించి అలాటి గ్రంథాన్ని రచించిన ఆచార్య కైర్న్సులను సంప్రదించాను. వారు నాకు వ్రాసిన ప్రత్యుత్తరాలలో కొన్ని సూచనలను చేశారు. నేను వాటి సహాయంతో నా కార్యక్రమాన్ని ప్రారంభించాను. ఇందులో విద్యార్థులు కొందరు, కళాశాలలో అధ్యాపకులుగా ఉండిన మరికొందరు 1951 లో పరిశోధన కార్యక్రమాలలో నాకు ప్రత్యేకంగా సహాయం చేయుటకు విశ్వవిద్యాలయంవారు నియమించిన డాక్టర్ ఉషామెహతా నాకు చాలా సహాయం చేశారు.

ఈ పరిశోధనలో బొంబాయి నగరంలోని వోటర్లు ఏ యే శక్తులచే ప్రభావితులై వోటు చేశారని తెలుసుకొనడమే నా ప్రధాన ఉద్దేశం. వివిధ పార్టీల ప్రణాళికలు, వారు ఏర్పాటుచేసిన సమావేశాలలో వారు చేసిన ప్రసంగాలు, వాటిని విన్నవారు వేసిన ప్రశ్నలకు వారు చెప్పిన సమాధానాలు, వోటర్లు చదివే వార్తాపత్రికలు, ప్రచారార్థం వివిధ పార్టీలు, స్వతంత్ర అభ్యర్థులు ప్రకటించి వీధి గోడలపైన అంటించిన చిత్రపటాలు మొదలైన వాటిని నేను స్వయంగా కొంతవరకు, నాకు సహాయం చేసినవారు మరికొంతవరకు చక్కగా పరిశీలించి, నివేదికలు తయారుచేయడం జరిగింది. నేను స్వయంగా కొందరి ఇండ్లకు వెళ్ళి, ఆ ఇండ్లలో స్త్రీలను పురుషులను కలుసుకొని వారి అభిప్రాయాలను, ఆ అభిప్రాయాలకు కారణాలను తెలుసుకొన్నాను. ఎన్నికలకు కొన్ని

రోజులకు ముందు అభ్యర్థులు ఇంటింటికి వెళ్ళి తమ అభ్యర్థిత్వాన్ని సమర్థించవలసిందిగా వోటర్లను ఏవిధంగా ప్రోత్సహించారో తెలుసుకొన్నాను. వివిధ పార్టీల ఎన్నికల ప్రణాళికలను పరిశీలించాను. ఈలాంటి కార్యక్రమాలను సాగించి, ఎన్నికలు జరిగిన తర్వాత ఎవరు గెలిచింది, ఎవరు ఓడిపోయింది, వారి జయాపజయాలకు గల కారణాలను పరిశీలించినాను. ఈ సందర్భంలో అన్ని పార్టీల నాయకులను కలుసుకొని వారి అభిప్రాయాలను తెలుసుకొన్నాను.

వీటి అన్నిటిని ఆధారం చేసుకొని "బొంబాయి నగరంలో 1952 లో సాధారణ ఎన్నికలు" అనే శీర్షికతో ఒక నివేదికను తయారుచేశాను. దీనిని ప్రకటించుటకు విశ్వవిద్యాలయంవారు రు. 1000 లు ఇచ్చారు. నేను విశ్వవిద్యాలయాన నుండి విరమించిన తర్వాత ఈ నివేదికను గ్రంథరూపంలో ప్రకటించాను. సాధారణ ఎన్నికలకు సంబంధించిన మొదటి పరిశోధన గ్రంథం నాదే. దీని ప్రతులను ఇంగ్లండులో నాకు సూచనలు చేసిన వారికి పంపినాను. వారు నా గ్రంధాన్ని ప్రశంసిస్తూ నాకు ఉత్తరం వ్రాయడమే గాక "మాంచెస్టరు గార్డియన్" అనే ప్రఖ్యాత వార్తాపత్రికలో దానిని సమీక్షించారు.

బొంబాయిలో ఉన్నప్పుడు నేను తలపెట్టి పూర్తిచేసిన పరిశోధన కార్యక్రమాన్ని గురించి పైన వివరించాను. మరిరెండు కార్యక్రమాలను ప్రారంభించాను గాని వాటిని పూర్తి చేయుటకు ముందే నేను ఉద్యోగాన నుండి విరమించడం చేత నా ప్రయత్నం గ్రంథరూపం ధరించలేదు. వీటిలో ఒకటి బొంబాయి శాసన సభలోని సభ్యుల గురించిన వివరాలు : వారి విద్య, వారి కులం, వారి వర్గం, ధనికులా, మధ్య తరగతికి చెందినవారా, వారి వృత్తి మొదలైన వాటిని గురించిన వివరాలు, ప్రజలు ఏలాటి వారిని తమ ప్రతినిధులుగా ఎన్నుకొంటున్నారో తెలుసుకొనుటకు ఈ పరిశోధనను సాగించాను.

నా రెండవ పరిశోధన ఎన్నుకొన్న ప్రతినిధులు నిర్వహించే కార్యకలాపాలకు సంబంధించినట్టిది. వారిలో కొందరు ఏపనీ చేయక అలంకార విగ్రహాలుగా ఉంటారు. కొందరు ప్రశ్నలు

వేస్తారు. కొందరు చర్చలలో పాల్గొంటారు. కొందరు స్వయంగా తమ తీర్మానాలను ప్రవేశ పెడ్తారు. ఈ పరిశోధన ప్రజలు ఎన్ను కొన్న శాసనసభ్యులు ఎంతవరకు వారి బాధ్యతను నిర్వహిస్తు న్నారో తెలుసుకొనుటకు ఉపయోగపడుతుంది. దేశంలోని ప్రజాస్వామిక విధానం ఎంతవరకు ఫలప్రదమైనదో తెలుసు కొనుటకు ఈలాటి పరిశోధన చాలా అవసరం. కాలవ్యవధి లేక పోవడంచేత నేను ఈ రెండు పరిశోధనలను పూర్తిచేయలేక పోయినందులకు ఎంతగానో విచారిస్తున్నాను.

ఈ సందర్భంలో నేను గావించిన ఇంకొక పరిశోధన గురించి చెప్పడం సందర్భోచితంగా ఉంటుంది. 1949 లో ఢిల్లీలో ఇండో అమెరికన్ సమావేశం జరిగింది. ఆ సమావేశంలో చర్చించుటకు 1. భారతదేశ విదేశాంగ విధానము 2. భారతదేశంలోని అల్ప సంఖ్యాకుల సమస్య అనే విషయాల గురించి పరిశోధన వ్యాసాలను పంపవలసిందిగా సమావేశ కార్యకర్తలు కోరారు. వారి కోరిక మేరకు వీటిని తయారు చేశాను. నేను సమావేశానికి ప్రతినిధిగా వెళ్లి చర్చలలో ప్రముఖు లనేకులతో పాటు పాల్గొన్నాను.

ఇవి ప్రధాన అధ్యాపకునిగా నేను చేసిన పరిశోధనల ఉదంతం. విద్యార్థులకు విద్యాబోధన చేయవలసిన కాలం పరిమితంగా ఉండడంచేత ఈ పరిశోధన కార్యక్రమం సాగింది. ఆంధ్ర విశ్వవిద్యాలయ పరిస్థితులకును, బొంబాయి పరిస్థితులకును ఇందులోనే గొప్ప భేదం.

బొంబాయిలో ఉన్నప్పుడు బరోడా, పూనా, మైసూరు విశ్వవిద్యాలయాలలో పరీక్షాధికారిగాను, పాఠ్యప్రణాళికల బోర్డు లలో సభ్యుడుగాను పనిచేశాను. ఇదిగాక మద్రాసు, లక్నో, రాజస్థాన్, ఢిల్లీ, బరోడా, నాగపూర్, పంజాబ్ విశ్వవిద్యాలయా లలో పరీక్షాధికారిగా ఉండినాను. కేంద్రంలోని యు.పి.సి యస్ కమీషన్ వారు, ఐ.ఏ యస్ (I. A. S.) పోటీపరీక్షలలో పరీక్షాధి కారిగా నన్ను నియమించారు. ఇది నాకు కొంత ఆర్థికలాభం చేకూర్చడం మూలంగానేగాక బొంబాయి విశ్వవిద్యాలయ పేరు ప్రతిష్ఠలను పెంపొందించడం మూలంగాకూడ ప్రాధాన్యం వహిం చింది. ఈ విశ్వవిద్యాలయంలోని అధ్యాపకుని అర్హతలను

ఇతర విశ్వవిద్యాలయాలవారు, కమీషన్ వారు గుర్తించడం ఈ ప్రాధాన్యానికి కారణం.

ఇదిగాక నేను బొంబాయిలో ఉన్నప్పుడు ఇతర కార్యక్రమాలను కూడ సాగించినాను. మద్రాసు వార్తాపత్రికలలో గ్రంథసమీక్షలు చాలా వరకు ఆగిపోయినా ఢిల్లీలోని హిందూస్తాన్ టైమ్సు (Hindustan Times) లోను, బొంబాయిలోని నేషనల్ స్టాండర్డులోను, విశ్వవిద్యాలయ త్రైమాసిక పత్రికలోను, ఢిల్లీలోని ఇండియా క్వార్టర్లీ (India Quarterly) లోను నా సమీక్షలు తరుచుగా ప్రకటింపబడేవి. 1950 సంవత్సరపు నా దినచర్య (Diary) ఈనాడు కనుపించడంలేదు. అందుచేత ఆ సంవత్సరంలో ఎన్ని సమీక్షలు చేసినానో తెలియదు. కాని తక్కిన 2½ సంవత్సరాలలో 60 గ్రంథ సమీక్షలను ప్రకటించాను. ఇదిగాక అనేక సమావేశాలలో పాల్గొని ఉపన్యసించాను. కొన్ని వార్తాపత్రికలకు, ప్రధానంగా బొంబాయిలోని భారత జ్యోతికి అనేక వ్యాసాలు వ్రాశాను. మద్రాసులో వున్నప్పుడు వహించినట్లే బొంబాయిలో కూడా ఈ కార్యక్రమాల మూలంగా తలకుమించిన బరువును మోయడం జరిగింది. దీనికి నా స్వభావమే కారణం.

1949 ప్రాంతాన మద్రాసులో తెలుగు భాషా సమితిని ఆంధ్ర ప్రముఖులు కొందరు స్థాపించారు. ఆ సంస్థ తెనుగులో విజ్ఞానసర్వస్వమును పది సంపుటాలలో ప్రకటించుటకు తల పెట్టింది. దాని సలహా సంఘంలో నేను కూడా ఒక సభ్యుడుగా ఉండి, సర్వస్వమును ఏ విధంగా రూపొందించవలె ననే విషయాన్ని గురించిన చర్చలలో పాల్గొన్నాను. అప్పుడు ఏర్పడిన సంపాదకీయ వర్గం నన్ను మొదటి సంపుటానికి (ఇది చరిత్ర, రాజనీతికి సంబంధించి నట్టిది) యూరపుఖండ ఆధునిక చరిత్రను, పాశ్చాత్య రాజనీతి తత్వ పరిణామాన్ని గురించి వ్యాసాలు వ్రాయవలసిందిగా కోరారు. వారి కోరిక మేరకు బొంబాయిలో ఉన్నప్పుడు ఈ రెండు వ్యాసాలను వ్రాసి పంపినాను. అప్పటికి గిడుగు సీతాపతిగారు, బొంబాయి విశ్వవిద్యాలయంలో నాకు సహాయ అధ్యాపకులుగా ఉండిన ప్రతాపగిరి రామమూర్తిగారు సర్వస్వ సంపాదకీయ వర్గంలో చేరారు. రామమూర్తిగారు బొంబాయిలో నాపట్ల కొంత

అసూయ గలవారైనారు. నేను అక్కడికి రావడం మూలంగా తాను రాజనీతిశాఖలో ప్రధానాధ్యాపకుడయ్యే అవకాశం పోయినదని వారు అభిప్రాయపడినారు. ఇది ఒక దురభిప్రాయం. కాని ఇందుమూలంగా వారు యూరపుచరిత్రకు సంబంధించిన వ్యాసాన్ని సర్వస్వంలో ప్రకటించరాదని సీతాపతిగారికి సలహా యిచ్చి, ఆలాటి వ్యాసాన్ని సీతాపతిగారే వ్రాయవలసిందిగా ప్రోత్సహించారు. ఆ కారణంచేత నాకు బొంబాయిలో కాలవ్యవధి లేకపోయినా, ఎంతో కష్టపడి వ్రాసిన వ్యాసం సర్వస్వంలో ప్రకటింప బడలేదు. తర్వాత కొన్ని సంవత్సరాలకు "పాశ్చాత్యుల వృద్ధి క్షయాలు" అనే పేరుతో దానిని శేషాచలం కంపెనీవారు గ్రంథరూపంలో ప్రకటించారు. రాజనీతి తత్వానికి సంబంధించిన వ్యాసం మాత్రం సర్వస్వంలో ప్రకటింపబడినది. వ్యక్తుల మధ్య ఉత్పన్నమయ్యే అసూయ ఏలాంటి దుష్టపరిణామాలకు దారి తీస్తుందో ఈ ఉదంతం స్పష్టంచేస్తూ ఉంది. కొన్ని సంవత్సరాలు గడిచిన తర్వాత ప్రథమ సంపుటిని సంస్కరించవలసిన అవసరం ఏర్పడగా దానికి నన్ను సంపాదకునిగా నియమించారు. నేను ఆధునిక దృక్పథాన్ని అనుసరించి దానిని పూర్తిగా మార్చాను. ఆ ప్రయత్నంలో రాజనీతికి సంబంధించిన రచనను నేనే చేశాను. ఆనాటి కాలచక్రం పూర్తిగా మారింది. బొంబాయిలో ఉన్నప్పుడు ప్రతి శనివారం నా శాఖలోని అధ్యాపకులు, పిహెచ్. డి. (Ph D.) విద్యార్థులు, ఇతర విద్యార్థులు ఒక గోష్ఠిగా ఏర్పడి ఏదో ఒక ప్రధాన విషయంలో చర్చలు జరిపేవారం. ఇది బొంబాయి విశ్వవిద్యాలయంలో నాకు కనిపించిన ఒక విశిష్టత. విద్యార్థులు, అధ్యాపకులు సన్నిహితులగుటకు ఇది ఒక పటిష్ఠ సాధనమైనది.

బొంబాయిలోని ఆంధ్రప్రముఖు లందరితోటి నాకు పరిచయం లభించింది. వారు స్థాపించిన ఆంధ్ర మహాసభ సమావేశాలకు, వున్నత విద్యాలయానికి నేను, నా భార్య తరుచుగా వెళ్ళేవారం. మహాసభ కార్యక్రమాలన్నిటిలో ఆంధ్ర విశ్వవిద్యాలయంలో నా శిష్యుడుగా వున్నట్టిన్నీ, బొంబాయి మునిసిపల్ కార్పొరేషన్ లో గొప్ప అధికార పదవిని అధిష్ఠించినట్టిన్నీ

సోమంచి యజ్ఞన్నశాస్త్రి ప్రాధాన్యత వహించారు. వీరు హాస్యరస పూరితములైన నాటికలనేకం వ్రాసి, ప్రదర్శించేవారు. ఒక పర్యాయం వరాహగిరి వెంకటగిరిగారు, వారి సతీమణి మహాసభకు విచ్చేసినారు. అప్పుడు జరిగిన సమావేశంలో నేను అధ్యక్షత వహించి గిరిగారిని గురించి మాట్లాడినాను. నా భార్య గిరిగారి సతీమణిని గురించి ప్రశంసిస్తూ ఉపన్యసించింది.

బొంబాయిలోని ఇతర ప్రముఖులతో పరిచయం సంపాదించుటకు నేను ప్రయత్నం చేయలేదు. వారు సభ్యులుగా వుండిన కొన్ని సంస్థల సమావేశాలకు నేను వెళ్ళేవాడిని. కాని వారి అలవాటులన్ని విదేశీయములైనవి. వారి దుస్తులు, వారి భోజనము, త్రాగుడు నాకు నచ్చేవికావు. ఈ విషయాలలో నేను శుద్ధ స్వదేశీయుడను. ధోవతి, ఖద్దరు కోటును ధరించేవాడిని. నాకు త్రాగే అలవాటుగాని, వారు ఏర్పాటుచేసిన లంచ్‌లు, టీపార్టీలు మొదలగువాటిలో వారితో కలిసే అలవాటుగాని లేదు. వారిలో ఒక మినూ మసాని తప్ప మరెవరితో నాకు సంబంధం ఏర్పడలేదు. వీరు గొప్ప మేధావులు. సమావేశాలలో చక్కగా మాట్లాడేవారు. వారు, నేను కలిసి ఒక వేదికపై కొన్ని పర్యాయాలు ప్రసంగించాము. తక్కినవారిలో అధికసంఖ్యాకులు అహంభావంకలవారుగా నాకు కనుపించారు. ఇంగ్లీషుభాషలో అలాటివారిని హైబ్రోస్ (Highbrows) అని పేర్కొంటారు. వారు ఊర్ధ్వముఖులు. సామాన్యులు వారి కంటికి కనిపించే వారు కారు.

విశ్వవిద్యాలయంలో పరిపాలన దృష్ట్యా ఆర్థిక, సామాజిక, రాజనీతి శాఖలు మూడును ఒకే డైరెక్టరు యాజమాన్యంలో ఉండేవి. నేను అక్కడ ఉన్నప్పుడు ఆర్థిక శాస్త్రంలో ప్రవీణులైన సి. యన్. వకీలు (C N Vakil) డైరెక్టరుగా ఉండేవారు. వీరు అతి సౌమ్యులు, స్నేహపాత్రులు. తాము అధికారి అనే గర్వం వీరిలో వీసంమాత్రంకూడా లేదు. వీరితో కలిసి పనిచేయడం నాకు ఎంతో సంతోషాన్ని కలిగించింది. సామాజికశాఖలో ప్రధానాధ్యాపకులు ఆచార్య ఘురే కొంత గర్విష్ఠులుగా నాకు కనుపించే వారు. కాని వీరు భారతదేశ సామాజిక పరిస్థితులగురించి,

అందులోను ప్రధానంగా వర్ణవ్యవస్థను గురించి ప్రామాణిక గ్రంధాలు అనేకం వ్రాసి, అంతర్జాతీయ రంగంలో ప్రఖ్యాతి గడించినవారు.

ఆనాడు అమెరికానుండి మేధావి వర్గానికి చెందిన వారనేకులు భారత దేశానికి వస్తూ ఉండేవారు. రెండవ ప్రపంచ యుద్ధ ఫలితంగా అమెరికా ప్రపంచంలోని రెండు అగ్రరాజ్యాలలో (రెండవది సోవియట్ రష్యా) ఒకటిగా ప్రఖ్యాతి గాంచింది. అక్కడి మేధావులు ఇతర దేశాలలో అమెరికా పలుకుబడిని వృద్ధిచేసే ఉద్దేశంతో పర్యటనచేస్తూ, మన దేశానికి వచ్చినప్పుడు బొంబాయి విశ్వవిద్యాలయానికి కూడా వచ్చి ఉపన్యసించడం మామూలు. కాని వారి సిద్ధాంతాలు, ఉపన్యాసాలు, అమెరికాలోని పరిస్థితులకు అనుగుణంగా ఉండేవి. వారికి మన ఆర్థిక, రాజకీయ, సామాజిక పరిస్థితులతో ఏలాటి పరిచయం లేదు. అందుచేత వారి ప్రసంగాల మూలంగా మనం నేర్చుకొనదగిన విషయాలు ఏవీ ఉండేవికావు. వాటిని వినుటకు, వినిన తర్వాత చర్చలలో పాల్గొనుటకు నేను వెళ్లేవాడిని. కాని దాని మూలంగా నేను ఎక్కువ పరిజ్ఞానాన్ని సంపాదించినవాడను కాలేదు. వారి ప్రపంచం, మన ప్రపంచం వేర్వేరై ఉండడమే దీనికి కారణం.

ఈలాగు వచ్చిన అమెరికన్లలో ఏల్ విశ్వవిద్యాలయానికి (Yale University) చెందిన ఆచార్య టర్నర్ (Professor Turner) ఒకరు. వారు నన్ను రెండు మూడు పర్యాయాలు కలుసుకొని మన సంస్కృతిని గురించి నా మూలంగా కొంత తెలుసుకొన్నారు. ఇదిగాక కొన్ని సంస్కృత పదాలకు అర్థం చెప్పవలసిందిగా నన్ను కోరారు. వీరు స్వదేశానికి వెళ్లిన తర్వాత కూడా దీనిని గురించి నాకు ఉత్తరాలు వ్రాశారు.

అమెరికా నుండి మన దేశానికి బొంబాయి విశ్వవిద్యాలయానికి వచ్చిన వారిలో డాక్టర్ పార్క్ (Professor Park) ఇంకొకరు. వీరు కొన్ని సంవత్సరములపాటు మన దేశంలోనే ఉండడంచేత నన్ను తరుచుగా కలుసుకొంటూ ఉండేవారు. వీరు మన రాజకీయ పరిస్థితులను గురించి కొంత పరిశోధన గావించి ఒకటి రెండు గ్రంధాలను వ్రాశారు. పూనా విశ్వవిద్యాలయంలో ఉండిన ఆచార్య కోగేకార్‌కు కూడా వీరు సన్నిహితులైనారు.

1952 లో వీరు, కోగేకార్, నేను కలసి సాధారణ ఎన్నికల గురించిన గ్రంథాన్ని వ్రాయుటకు పూనినాము. కాని అప్పటికి నేను బొంబాయి విశ్వవిద్యాలయాన్ని వదలి, మద్రాసు చేరిన కారణంగా పూనాలో జరిగే సమావేశాలకు వెళ్లలేక పోయినాను. అందుచేత ఎన్నికల గురించిన గ్రంథం వారిద్దరి పేరటనే వెలువడింది. అందులో బొంబాయినగర ఎన్నికల గురించిన అధ్యాయాన్ని నేను వ్రాసినాను.

పై విధంగా నా మూడు సంవత్సరాల బొంబాయి జీవితం సాగింది. నేను అక్కడికి వెళ్లినప్పుడు మహామహోపాధ్యాయ ఆచార్య కాణె (Kane) ఉపాధ్యక్షులు. వీరు మత ధర్మశాస్త్రాల గురించి అయిదు సంపుటాల ప్రామాణిక గ్రంథాన్ని వ్రాసినారు. ఎంతో పాండిత్యం ఉండినా నిరాడంబరంగా ఉండేవారు. వారి తర్వాత హైకోర్టు జడ్జి భగవత్ గారు, వారి తర్వాత వాడియా అనే వారు ఉపాధ్యక్షులయ్యారు. ఈలాటి వారి యాజమాన్యంలో అధ్యాపకుడనుగా వుండడం నా అదృష్టమని భావిస్తున్నాను. వీరికిని, ఆంధ్ర విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు సి. ఆర్. రెడ్డి గారికిని ఏలాటి పోలిక లేదు. అందుచేతనే బొంబాయి విశ్వవిద్యాలయంలో నా అధ్యాపకత్వం నా జీవితంలో సంతోషప్రదమైన స్థిరస్థానాన్ని కల్పించుకొన్నది.

ఆరోజులలో అక్కడి విద్యార్థులు నాపట్ల అత్యంత గౌరవాభిమానాలతో ప్రవర్తించారు. దానికి చిహ్నంగా వారు కొన్ని సంవత్సరాలు గడచిన తర్వాత, నా గౌరవార్థం " Essays in Indian Federalism " ( భారతదేశ సమాఖ్య విధానాన్ని గురించిన వ్యాసాలు ) అనే ఉద్గ్రంథాన్ని ప్రకటించి, అందులో నా జీవితాన్ని గురించి, రాజనీతిశాస్త్రంలో నేను చేసిన కృషిని గురించి విపులంగా వివరించారు. ఆ సంపుటం ఎస్. పి. అయ్యర్, ఉషా మెహతా సంపాదకత్వంలో ప్రకటింపబడినది. దాని మూలంగా బొంబాయి విశ్వవిద్యాలయంతోటి నా అనుబంధం స్థిరరూపం ధరించింది. ఆంధ్ర విశ్వవిద్యాలయంలో నేను 13 సంవత్సరాలు కృషిచేసినా నాకు ఏలాటి గుర్తింపు లభించలేదు. విశ్వవిద్యాలయంలో నా చిత్రపటాన్ని పెట్టుటకు వి. యస్. కృష్ణా

గారు 1944 లో చేసిన ప్రయత్నాన్ని కూడా ఉపాధ్యాయులు రెడ్డి గారు తిరస్కరించారు.

బొంబాయిలో నేను ఉండిన మూడు సంవత్సరాల కాలం నా భార్యకు, కుటుంబంలోని తక్కినవారికి ఉత్తేజకరంగా ఉండినది. నేను రోజూ విశ్వవిద్యాలయానికి వెళ్లిన తర్వాత నా భార్య ఆమె స్నేహితురాండ్రతో కలసి నగరంలోని కొన్ని ప్రాంతాలకు వెళ్ళి రావడం పరిపాటి అయినది. కాండ్వెల్లిలో మా ఇంటి పొరుగున మూడు ఆంధ్ర కుటుంబాలవారు, ఒక తమిళ కుటుంబంవారు ఉండే వారు. ఈ కుటుంబాలలోని స్త్రీలతో నా భార్యకు సన్నిహిత సంబంధం ఏర్పడింది. వారిలో కొందరితో కలిసి ఎలెక్ట్రిక్ రైలు మీద ప్రయాణంచేసి మాతుంగ, దాదర్, గ్రాంట్ రోడ్, క్రాఫర్డు మార్కెట్ మొదలైన ప్రాంతాలలో పర్యటించి సాయంత్రం 5 గంటలకు ఇల్లు చేరేది. బొంబాయి మద్రాసుకంటె ఎన్నో రెట్లు పెద్దది కావడంచేతను, చూడదగిన ప్రదేశాలు ఎక్కువగా ఉండడం చేతను, స్త్రీలకు స్వభావసిద్ధమైన షాపింగుపట్ల (బేర సారాలు చేయడంపట్ల) శ్రద్ధ ఉండడం చేతను, దానికి ఎక్కువ అవకాశం బొంబాయిలో ఉండడంచేతను వీరు చాలాఉత్సాహంగా నగరంలో తిరిగి ఇంటికి వచ్చేవారు.

నా మోస్తరుగానే నా భార్య కూడా ఆంధ్రమహా సభలో సభ్యురాలైనది. దానిమూలంగా స్త్రీలనేకులు ఆమెకు పరిచయమయ్యారు. వారి ఇండ్లకు వెళ్లి, ఇష్టాగోష్ఠి జరిపి, తన సరదాను ఆమె తీర్చుకొనేది. ఈలాంటి కార్యక్రమాలలో ఆమెకు పూర్తి స్వేచ్ఛ ఉండేది. వాటిని సాగించడంలో నేను ఆమెకు ఏలాటి భంగాన్ని కలిగించేవాడను కాను.

ఈ మూడు సంవత్సరాలలో నా కుటుంబానికి చెందినవారు నా కుమార్తెలు, కోడండ్రు, మనుములు, మనుమరాండ్రు అనేక పర్యాయాలు బొంబాయి వచ్చి సరదాగా కాలం గడిపినారు. ఆ సందర్భాలలో మేము ఇద్దరం నాలుగు పర్యాయాలు వారితో కలిసి సముద్ర మధ్యలో ఉండిన ఎలిఫెంటా గుహాలకు, ఒక పర్యాయం కన్హేరి గుహాకు వెళ్లి, అక్కడ ప్రఖ్యాతి గాంచిన శిల్పాలను చూచివచ్చాము. వచ్చినవారు ఎంతో సంతోషించారు.

నా మూడు సంవత్సరాల కాంట్రాక్టు పూర్తికాగానే వేసవి సెలవులలో నేను బొంబాయి విశ్వవిద్యాలయాన నుండి విరమించాను. అటుతర్వాత జూలైలో ఒడెస్సాకు వెళ్లుతూ బొంబాయిలో ఒకరోజు గడిపాను. ఆ అవకాశాన్ని పురస్కరించుకొని నా విద్యార్థులు, వివిధశాఖలలోని అధ్యాపకులు ఒక వీడ్కోలు సమావేశాన్ని జరిపారు. అంతటితో లాంఛనప్రాయంగా నేను వారందరి వద్ద సెలవుపుచ్చుకొనడం జరిగింది.

# నా ఉద్యోగ జీవితంలో ఆఖరు దశ (2)

1952 ఏప్రిల్ 11 న నేను బొంబాయి వదలి హైదరాబాదుకు వచ్చాను. సుమారు రెండు నెలల వరకు బొంబాయి విశ్వవిద్యాలయాధికారులు నా ఉద్యోగం పొడిగింపును గురించి తుది నిర్ణయం తీసుకోనలేదు. అందుచేత ఒక సంధిగ్ధావస్థలో పడిపోయినాను. తుదకు జూన్ 9–న ప్రొఫెసర్ వకీలు మరియొకరిని నా స్థానంలో నియమించినట్లు తెలియపరచారు. అంతటితో నా ఉద్యోగ విరమణ ఖాయమైనది. బొంబాయిలో ఉద్యోగం లేనందుకు నేను ఎంతమాత్రం విచారించలేదు. అది గౌరవ ప్రదమైన ఉద్యోగమే. కాని మద్రాసులోను, హైదరాబాదులోను మా కుటుంబాన్ని వదలి, నేను నా భార్య బొంబాయిలో ఉండడం మాకు అంత ఇష్టంగా లేకపోయింది. ఆర్థికంగా కూడా నా ఉద్యోగం మూలంగా నేను ఆర్జించినది ఏదీ లేదు. రెండు మూడు ప్రదేశాలలో కుటుంబాన్ని పోషించవలసిన కారణంగా నేను నా జీతంలో (1100 రూపాయలు) లో నుంచి ఏమీ కూడబెట్టుకోనలేక పోయినాను. నాకు మిగిలింది 5000 రూపాయలు, నా ప్రావిడెంటు ఫండు మాత్రమే.

తర్వాత రెండు సంవత్సరాలు నేను నిరుద్యోగిగా ఉండినాను. నిరుద్యోగినైనా నా కాలాన్ని వ్యర్థపుచ్చ లేదు. 1944–49 లో చేసినట్లే ఈ రెండు సంవత్సరాలలో తలకు మించిన కార్యక్రమాలను నా పైన వేసుకున్నాను. విశ్రాంతి అనేది లేకుండా వాటిని సాగించాను. తుదకు 1954 ఏప్రిల్ 3–న మద్రాసులోని

ఆకాశవాణిలోని తెనుగు విద్యార్థుల కార్యక్రమాలను సాగించే అధికారిగా నియమింపబడినాను. 1957 నాటికి ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం నిర్మాణమైనది. అంతటితో మద్రాసు ఆకాశవాణిలోని తెనుగు విద్యార్థుల కార్యక్రమాలు చాలావరకు తగ్గింపబడినవి. వాటిని హైదరాబాదు ఆకాశవాణికి మార్చారు. నన్ను కూడా అక్కడికే మార్చారు. జూలై ప్రారంభంలో నేను ఈ ఆకాశ వాణిలో పదవీస్వీకారం చేశాను. కాని ఇందులోని పరిస్థితులు నాకు ఎంతమాత్రం రుచించని కారణంచేత 15 రోజులు గడచిన తర్వాత నేను రాజీనామా చేశాను. ఆటుతర్వాత నేను ఏ ఉద్యోగాన్ని చేపట్టక ఇప్పటివరకు స్వతంత్రంగా జీవిస్తూ వున్నాను. అంతటితో నా జీవితంలో ఉద్యోగ దశ పూర్తి అయింది.

1952–'57 మధ్య నా ఆరోగ్యం పూర్తిగా చెడింది. అంతకుపూర్వం కూడా నేను ఆరోగ్యం అనే మహాభాగ్యాన్ని అనుభవించలేకపోయినా నని ఇంతకుపూర్వమే చెప్పినాను. ఈ అయిదు సంవత్సరాల మధ్య నా ఆరోగ్యం మరింత చెడిపోయింది. ఒకరోజుకూడా ఏదో ఒక జబ్బు లేకుండా గడపలేదు. తరుచుగా మైలేరియా జ్వరం వస్తూ వుండేది. దీనికితోడు కడుపులోని వ్రణం (Peptic ulcer) అప్పుడప్పుడు పగిలి రక్తాన్ని కోల్పోవడం, కడుపు నొప్పితోను, తల తిరగడంతోను బాధపడడం తప్పేదికాదు, జలుబు, దగ్గు, మామూలు ఫ్లూ లేక మలేరియా కనుపిస్తూ ఉండేది. నేను సాగించిన కార్యక్రమాలన్నిటిని ఈలాటి బాధల తోనే సాగించాను. ఆ సంవత్సరాలలోని నా దినచర్యను (Diary) చదువుతూ ఉంటే ఈలాటి బాధలకు గురియై కార్యకలాపాలను సాగించడం నాకే ఆశ్చర్యాన్ని కలిగిస్తున్నది. నాలో ఉన్న ఇచ్ఛా శక్తి (Will power) దీనిని సాధ్యంచేసినట్లు నేను భావిస్తున్నాను. ఆనాటి కార్యకలాపాల స్వభావం మూలంగా, ప్రధానంగా కొన్ని విశ్వవిద్యాలయాలలో పరీక్షాధికారిగా ఉండడంచేత తరుచుగా బరోడా, పూనా, బెంగుళూరు, మైసూరు నగరాలకు ప్రయాణం చేస్తూ ఉండేవాడిని. ఈకారణంచేతను, నా కుటుంబ వ్యవహా రాల నిమిత్తంగా మద్రాసునుండి హైదరాబాదుకు, నెల్లూరుకి

ప్రయాణాలు తప్పేవి కావు. అక్కడక్కడ సమావేశాలకు నన్ను ఆహ్వానించడంచేత నేను ఇతరనగరాలకు—గుంటూరు, ఒంగోలు, ఏలూరు, బందరు మొదలైనవాటికి— వెళ్లే వాడిని. ఎవరు ఆహ్వానించినా వారి ఆహ్వానాన్ని తిరస్కరించడం మొదటినుంచి నా స్వభావంకాదు. అలాగు తిరస్కరించడం వారిని అగౌరవపరచడం అనేదే నా భావం.

ఈకాలంలో నా కుమాళ్ళలో ముగ్గురికి వారి చదువుకు, అర్హతలకు తగిన ఉద్యోగం లభించకపోవడం నాకు విచారకారణ మగుటయేగాక, సమిష్టికుటుంబాన్ని పోషించవలసిన భారం కూడ నా పైననే పడింది. నా పెద్దకుమారుడు నరసింహం ఎం. ఎస్‌సి. లో కృతార్థుడైనవాడు. వాడికి స్థిరమైన ఉద్యోగం లభించలేదు. 1952 లో వాడు నిరుద్యోగియై హైదరాబాదుకు వచ్చి, ఒక ట్యుటోరియల్ కళాశాలను స్థాపించి నిర్వహించాడు. దానికి గాను నేను, నా మూడవ కుమారుడు ఆనందం సుమారు రు. 20,000 లు పెట్టుబడి దఫదఫాలుగా పెట్టవలసి వచ్చింది. కాని ఇదికూడా వాడికి కలిసిరాలేదు. ఇందుమూలంగా వాడూ, మేమూ చాలా నష్టపడ్డాము.

నా రెండవ కుమారుడు సీతారాం కాశీ హిందూ విశ్వవిద్యాలయంలో అయిదు సంవత్సరాలు చదివి బి. ఎస్‌సి., యం. యస్‌సి. లలో కృతార్థుడైనాడు. కాని వాడికి ఢిల్లీలోను, అటుతర్వాత కాన్‌పూరులోను చిన్న చిన్న ఉద్యోగాలు మాత్రమే లభించినవి. వాడికి వచ్చే జీతంతో కుటుంబాన్ని పోషించుకొనడం దుస్తరమైపోవడంచేత, వాటిని వదలుకొని హైదరాబాదుకు వచ్చి వ్యాపారంలోకి దిగాడు. కాని వాడు సాగించిన మొదటి వ్యాపారం ( రసాయనిక ఎరువుల వ్యాపారం ) మూలంగా అందరం నష్టపడినాము. అటుతర్వాత ఒక మందుల దుకాణాన్ని పెట్టుకొన్నాడు. యం. యస్‌సి. పాసైన వాడు మందుల దుకాణాన్ని పెట్టుకొని జీవించడం హాస్యాస్పదమని ప్రత్యేకంగా చెప్పవలసింది లేదు. ఇందులో కూడా నేనూ, ఆనందం చాలా పెట్టుబడి పెట్టినాము. కాని ఇది కూడా కలసి రాలేదు. వ్యాపారంలో వాడికి సహాయం చేయుటకు వచ్చినవా రందరు

చాలా ఆదాయాన్ని సంపాదించారు. కాని వాడికి మాత్రం అలాటి అదృష్టం పట్టలేదు. తుదకు ఆ దుకాణాన్ని మూసివేయవలసి వచ్చింది అటుతర్వాత మందులు తయారుచేసే కర్మాగారంలో ఒక మంచి ఉద్యోగం లభించింది. వాడికి గల నైపుణ్యాన్ని ప్రదర్శించుటకు అవకాశం కలిగింది. అప్పటికి వాడి వయస్సు 47, 48 సంవత్సరాలు. కాని దానిమూలంగా కొంత బాగుపడినాడు. కొంత ఆర్జన చేయగలిగాడు. 55 సంవత్సరాలు పూర్తికాగానే వాడు ఉద్యోగాన్ని వదలుకొనవలసి వచ్చింది. కాని అప్పటికి స్వయంగా కొంత పెట్టుబడి పెట్టగల స్థితిలోకి వచ్చి, ఒక గుజరాతీ వ్యాపారస్తునితో కలిసి మందుల తయారీ, అమ్మకం సాగించాడు. గుజరాతీవారు వ్యాపారంలో ఆరితేరినవారు. అతనితో భాగస్వామి కావడంచేత గత పది సంవత్సరాల మధ్య కొంత ధనార్జన చేయగలిగాడు.

నా మూడవ కుమారుడు ఆనందం ఆడిటర్ పరీక్షలో కృతార్థుడై 1942 సంవత్సరములో హైదరాబాదు నివాసి అయినాడు. వాడు బాగా ఆర్జించగలిగాడు. నా కుమాళ్లందరిలో జీవితాన్ని చక్కగాను, విజయవంతంగాను గడపగలిగినవాడు అతడు మాత్రమే. కష్టదశలో ఉన్న సోదరులను అభిమానపూర్వకంగా వాడు పోషించగలిగాడు. ఇప్పటికి కూడా అలాగే చేస్తున్నాడు. వాడు మా కుటుంబానికి కల్పతరువు.

నా నాల్గవ కుమారుడు వెంకటేశ్వర్లు, ఎం.ఏ., ఎం. లిట్. పరీక్షలలో కృతార్థుడైనా వాడికి తగిన ఉద్యోగం లభించలేదు. స్వల్ప జీతంతో కూడిన చిన్న ఉద్యోగాలతో తృప్తిపడవలసి వచ్చింది. కాని 1952 లో ఏదో పోటీపరీక్షలో ఉత్తీర్ణుడై ఇన్‌కంటాక్సు ఆఫీసరుగా (Income-tax Officer) నియమింపబడినాడు. అప్పటినుంచి 1975 వరకు ఈ ఉద్యోగంలో వుండి పించన్‌తో రిటైరయ్యాడు.

నా అయిదవ కుమారుడు పట్టాభిరాం, ఎం. ఏ., బి. యల్. పరీక్షలలో కృతార్థుడై ప్రఖ్యాత న్యాయవాది వింజమూరి గోవిందరాజాచారివద్ద అప్రెంటిసుగా వుండి హైకోర్టు న్యాయవాదిగా చేరాడు. కాని ఏ కారణంచేతనో వాడికి న్యాయవాది వృత్తి

రుచించక కోర్టుకు వెళ్ళడం మానుకొని, స్వల్ప జీతంతో ప్రథమంలో ఇండియన్ ఎక్స్‌ప్రెస్ పత్రికలోను (Indian Express), అటు తర్వాత హిందూ పత్రికలోను చేరాడు. చెప్పుకోతగ్గ జీతం లభించుటకు చాలా కాలం పట్టింది. కాని క్రమక్రమంగా పైకి వచ్చి మొదట కలకత్తాలోను, తర్వాత ఢిల్లీలోను ప్రత్యేక విలేఖరిగా నియమింపబడి, మంచి ప్రఖ్యాతిని సంపాదించి, ప్రస్తుతం మద్రాసులో హిందూ ఆఫీసులో సంపాదకీయవర్గంలో ఒకడుగా ఉద్యోగం చేస్తున్నాడు.

నా ఆరవ కుమారుడు కృష్ణమూర్తి ఆంధ్ర విశ్వ విద్యాలయంలో ఫిజిక్సు (Physics) యం. యస్‌సి. లో ప్రథమ శ్రేణిలో కృతార్థుడైనా తగిన ఉద్యోగం లభించని కారణంగా ఇంగ్లండుకు వెళ్లి ఒక సంవత్సరం పరిశోధనలో గడిపి 1950 లో తిరిగి వచ్చాడు. అటుతర్వాత ఉస్మానియా విశ్వవిద్యాలయంలో అధ్యాపకుడుగా చేరాడు. కాని 1952 లో వ్యాధిగ్రస్తుడైనాడు. అది కుదిరి మామూలు ఆరోగ్యం లభించుటకు ఒక సంవత్సరం పట్టింది. ఆ సంవత్సరం నాకు గాని, నా కుటుంబంలో మరెవ్వరికి గాని ఏలాంటి మనశ్శాంతి లేకపోయింది. కాని మా అందరి అదృష్టవశాత్తున వాడు పూర్తిగా కోలుకొని తిరిగి ఉద్యోగంలో ప్రవేశించాడు. క్రమక్రమంగా బెంగుళూరు, హైదరాబాదు లలో గొప్ప ఉద్యోగాలు చేసి, ప్రస్తుతం ఢిల్లీలో ఆలాటి ఉద్యోగంలోనే ఉన్నాడు.

నా ఆఖరు కుమారుడు సి హాచలం, బి. కాం., బి. యల్. పాసై కీ. శే. పెనుమత్స సత్యనారాయణరాజుగారి వద్ద అప్రెంటిసుగా చేరి, తర్వాత హైకోర్టు న్యాయవాదిగా చేరాడు. కాని ఈ వృత్తి వాడికి రుచించలేదు. తర్వాత ఆడిటర్ పరీక్ష లలో కృతార్థుడై నా మూడవ కుమారుని ఆనందం కంపెనీలో భాగస్వామిగా నిజామాబాదులో వృత్తిని చేపట్టి మంచి స్థితిలో ఉన్నాడు.

నా కుమార్తె లందరు అదృష్టవంతులే. మొదటి కుమార్తె అల్లాడి అన్నపూర్ణమ్మ (డాక్టర్ అల్లాడి మహాదేవయ్య గారి సతీమణి) హరిజన ఉద్ధరణలోను, ఇతర సంఘ సంక్షేమ

కార్యక్రమాల నిర్వహణలోను పేరు ప్రఖ్యాతుల సంపాదించింది. నా రెండవ కుమార్తె అల్లాడి గోదావరి రైల్వేలో గొప్ప ఉద్యోగం చేసి, ఇటీవల ఫించన్ పుచ్చుకొన్న అల్లాడి వాసు దేవన్ గారి సతీమణి. సుసంపన్నురాలైన గృహిణి. నా మూడవ కుమార్తె అల్లాడి వైదేహి ప్రస్తుతం ఉస్మానియా విశ్వవిద్యాలయంలోని చరిత్రశాఖలో రీడరుగా ఉన్నది. అనేక గ్రంథాలను ఇంగ్లీషులోను, తెలుగులోను రచించింది. ఆమె భర్త అల్లాడి కృష్ణమూర్తి గవర్నమెంటు పాలిటెక్నిక్‌లో గణితశాస్త్ర అధ్యాపకుడుగా ఉన్నాడు.

నా కుటుంబాన్ని గురించి ఇక్కడ ప్రస్తావించుటకు కారణం చాలాకాలంవరకు వారిని పోషించే భారం నాపైన పడడమే. వా రందరికి గొప్ప చదువులు చెప్పించాను. కాని అందరికీ తగిన ఉద్యోగాలు లభించలేదు. దేశాన్నంతా ఆవరించిన విద్యార్థికుల నిరుద్యోగ సమస్య నా కుటుంబంపై కూడా ప్రభావం వహించింది. నా చిన్నతనంలో ఈలాటి సమస్య ప్రాబల్యం గాంచలేదు. మారుతున్న ఇప్పటి సమాజానికి ఇది ఒక ప్రధాన లక్షణంగా రూపొందింది. దీనిని పరిష్కరించుటకు తగిన ఉపాయం ఇంకా లభించలేదు. దినదినానికి ఇది మరింత క్లిష్టమౌతూ ఉన్నది. విప్లవానికి ఇది దారితీస్తుందనే భయం కలుగుతున్నది.

1952 తర్వాత నా జీవితాన్ని గురించి వివరించుటకు పూర్వం రెండు మూడు సాధారణ విషయాల గురించి ప్రస్తావించడం అవసరమని భావిస్తున్నాను. నా జీవితానికి ప్రధాన లక్షణం అధ్యాపకవృత్తిని చేపట్టి, విద్యాబోధకుడుగా ప్రఖ్యాతి గాంచడమే. తాను నేర్చుకొనిన విద్యను ఇతరులకు సులభగ్రాహ్యంగాను, స్పష్టంగాను బోధించడమే అధ్యాపకుడు చేయవలసిన పని. అధ్యాపకుడు ఈ కర్తవ్య నిర్వహణతో మాత్రం తృప్తిపొందడమా లేక దీనితోపాటు స్వయంగా పరిశోధన గావించి ప్రామాణిక గ్రంథాలను రచించడమా అనే విషయాన్ని గురించి విద్యారంగంలో వాదోపవాదాలు చాలాకాలాననుండి జరుగుతూఉన్నవి. కొందరి అభిప్రాయంలో విద్యాబోధ చేసేవాడు పరిశోధన కూడా చేయ వలసి ఉన్నదనేది. కాని ఈ రెంటికీ ముడిపెట్టడమూ, అధ్యాపకుని

అర్హతలను కొలతవేయడంలో అతడు చేసే పరిశోధనలకు ఎక్కువ ప్రాధాన్యం కల్పించడం ఉచితం కాదనేదే నా అభిప్రాయం.

ఈలాటి అభిప్రాయాన్ని వ్యక్తం చేయుటకు పరిశోధనలో నాకు శక్తిసామర్థ్యాలు లేకపోవడం కారణం కాదు. 1925 లో నేను విజయనగరం కళాశాలలో ఉన్నప్పుడు ఒక సంవత్సరం సెలవుపెట్టి మద్రాసులో పరిశోధన గావించి "స్థానికపన్నుల ప్రారంభదశ" (Beginnings of Local Taxation in the Madras Presidency), "స్థానికసంస్థల అభివృద్ధి" (Development of Local Boards in the Madras Presidency) అనే గ్రంథాలను రచించినట్లు ఇదివరకే చెప్పినాను. అటుతర్వాత 1935 లో "ప్రభుత్వంలో సమాఖ్య విధానము" (Federalism in Government) అనే పరిశోధన పూర్వమైన గ్రంథాన్ని ప్రకటించాను. రాజనీతిశాఖలోను, సమాఖ్య విధానంలోను గొప్ప కృషి చేసిన కె. జి. వేర్ (K. G Where) దీనిని అత్యుత్తమ గ్రంథంగా ప్రశంసించాడు. కాని అధ్యాపకుడనుగా విద్యాబోధ చేస్తూ, పరిశోధనను చేయడం కష్టసాధ్యమని నా అనుభవం స్పష్టంచేస్తూ ఉన్నది. అధ్యాపకుని ప్రథమ కర్తవ్యం విద్యాబోధ చేయడం. దీనిపట్ల శ్రద్ధవహించక పరిశోధనలోకి దిగడం తన కర్తవ్యాన్ని విస్మరించడమే. వీలైన పక్షంలో పరిశోధనను సాగించవచ్చు. కాని అది విద్యాబోధకు ఎంతమాత్రమూ అడ్డు తగలరాదు.

విద్యాబోధ అనేది కళాశాలలలోని విద్యార్థులకు మాత్రమే పరిమితమైనట్టిది కాదు. అది దేశానికి, సమాజానికి సంబంధించిన విశాల కార్యక్రమం. కొంతవరకు స్వార్థాన్ని త్యజించి పరార్థానికై పాటుపడడం మానవధర్మమని తత్త్వవేత్తలందరు ఉపదేశించి ఉన్నారు. ఉన్నవారు లేనివారికి సహాయపడడమే దీని అర్థం. ధనికులు ధనహీనులకు, విజ్ఞానులు అజ్ఞానులకు సహాకరించినప్పుడే ఈ తత్త్వం ఆచరణలోకి రాగలదు. అదృష్టవశాత్తు నేను కొంత విజ్ఞానాన్ని సంపాదించగలిగాను. దానిని కళాశాలలోని విద్యార్థులకే గాక, సమాజంలో అజ్ఞానులుగా ఉన్నవారందరికి అందజేయడం నా బాధ్యత అని నేను గ్రహించాను.

సత్యం బహుముఖమైనట్టిది. అవతారపురుషులుగా ప్రఖ్యాతి గాంచిన శ్రీకృష్ణుడు, గౌతమబుద్ధుడు, ఏసుక్రీస్తు, మహాత్ముడు ఆధ్యాత్మిక జీవితానికి సంబంధించిన సత్యాన్ని ఉపదేశించారు. ఇదిగాక లౌకిక జీవితానికి సంబంధించిన సత్యం కూడా ఇంకొకటి ఉన్నది. ఆర్కిమిడీస్, న్యూటన్, గెలీలియో, ఎయిన్‌స్టీన్, బాబా, జగదీశచంద్రబోస్ మొదలైన విజ్ఞానశాస్త్ర పరిశోధకులు ఈ సత్యాన్ని గ్రహించి ప్రపంచానికి తెలియపరచినవారు. కాని వీరు కనుగొనిన సత్యాన్ని ప్రచారంచేయుటకు ఎందరో అవసరమైనారు. భగవద్గీతపై వ్యాఖ్యానాలు వ్రాసినవారు, సన్న్యాసాశ్రమాన్ని స్వీకరించి దాని సారాన్ని ప్రచారం చేసినవారు, చేస్తూ ఉన్న వారు అనేకులు ఉండబట్టే మహానుభావులైన అవతార పురుషులు కనుగొనిన సత్యం ప్రజాసామాన్యం తెలుసుకొనుటకు అవకాశం లభించింది. వీరందరు సత్యాన్ని కనుగొన్నవారు కారు. అవతార పురుషులు కనుగొనిన సత్యాన్ని సామాన్య ప్రజలకు బోధించిన వారు. నావంటి విద్యాబోధకు లందరు ఈ వర్గానికి చెందినవారు. ఈలాటివా రనేకులు ఉండబట్టే తత్వవేత్తలు, విజ్ఞానవేత్తలు కనుగొనిన సత్యం మానవు లందరు తెలుసుకొనగలుగుచున్నారు. సమాజంలో విద్యాబోధ చేయువారికి ఇందుమూలంగానే ప్రాధాన్యం లభిస్తుంది. నేను స్వయంగా పరిశోధనను గావించి గ్రంథ రచనను ఎక్కువగా చేయలేకపోయినా విద్యాబోధచేసి, సమాజాభివృద్ధికి తోడ్పడగలిగానని స్పష్టం చేయుటకే పై వివరణలోకి దిగినాను.

1952–'57 లో నేను వాల్గొన్న కార్యక్రమాలన్నిటికి ఇదే మౌలికమైన లక్షణం. చాలాకాలంనుండి గ్రామాల పునర్నిర్మాణంపట్ల నాకు ఆసక్తి ఉండేది. 1952–'57 మధ్య తరుచుగా నాకు భూవసతి ఉండిన బొంతపాలెంకు వెళ్లుతూ ఉండేవాడిని అక్కడి రైతులకు సంప్రదాయసిద్ధమైన సేద్య విధానాన్ని గురించి నేర్పవలసినది ఏదీ లేదు. అందులో వారు ఆరితేరినవారు. కొత్తపద్ధతులను నేర్చుకొని వాటిని ఆచరణలో పెట్టడంపట్ల వారికి ఎక్కువ ఆసక్తి ఉండేది. రసాయనిక ఎరువుల వాడకం అప్పుడే వాడకలోకి వచ్చినది. అందు నిమిత్తం

వారు నావద్దకు వచ్చి, తక్కువ వడ్డీకి నేను ఇచ్చే ఋణాలను తీసుకొని, ఆ ఎరువులను కొనుగోలుచేసి వాడుకోవడం పరిపాటి అయినది. ఇంతకు మించి ఆ రోజులలో ఏలాటి వ్యవసాయాభివృద్ధి జరగలేదు. సమీపాన ఒక వ్యవసాయ పరిశోధన క్షేత్రం ఉండినా, అక్కడి పరిశోధకులు గాని, అధికారులు గాని గ్రామాలకు వచ్చి వారి పరిశోధనల వ్యాప్తిని గురించి శ్రద్ధ తీసుకొనే వారు కారు.

కాని గ్రామీణులను అక్షరాస్యుల చేయడం, సమకాలిక పరిస్థితుల గురించి వారికి బోధించి వారి పరిజ్ఞానాన్ని అభివృద్ధి పరచవలసిన అవసరం ఎంతైనా ఉండేది. వారిలో కొందరు ప్రధానంగా హరిజనులు. వీటిని గురించి తెలుసుకొనుటకు నేను అక్కడికి వెళ్లినప్పుడు నావద్దకు వచ్చి, అర్ధరాత్రి వరకు నా మాటలను వింటూ వారి సందేహాలను తీర్చుకొనుటకు ఎంతో ప్రయత్నిస్తూ ఉండేవారు. నేను గ్రామంలోనే స్థిరనివాసం ఏర్పరచుకొనిన పక్షంలో నాకుగల జ్ఞానాన్ని వారికి అందజేయుటకు ఎంతో అవకాశం లభించేది. కాని ఇదివరలో చెప్పినట్లు అది నాకు సాధ్యం కాలేదు. కుటుంబాన్ని పోషించే భారం నాపైననే వుండడంచేతను, దానికి కావలసిన ఆదాయాన్ని గడించుటకు మద్రాసులో నివసించడం తప్పనిసరి కావడంచేతను నేను గ్రామీణ ప్రజలకు నాకు గల జ్ఞానాన్ని అందించలేక పోయినాను. ఈ ఆశయాన్ని సాధించలేక పోయినందుకు నేను ఇప్పటివరకు ఎంతగానో విచారపడుతున్నాను. జీవితంలో ఆశయాలకు, ఆచరణకు మధ్య అగాధం ఏర్పడడం సహజమని భావించి ఈ నా ప్రవర్తనను ఏదోవిధంగా సమర్థించుకొంటున్నాను.

అప్పటి నా కార్యక్రమాలు నాలుగు రకాలుగా వుండేవి. వాటిలో మొదటిది గ్రంథ సమీక్షలు. ఢిల్లీలోని హిందూస్థాన్ టైమ్సు, ఇండియా క్వార్టర్లీ, మద్రాసులోని హిందూ, ఎక్స్‌ప్రెస్ పత్రికలలో నా సమీక్షలు ప్రకటింపబడేవి. 1949 ప్రాంతంలో కుందూరి ఈశ్వరదత్తుగారు హిందూస్థాన్ టైమ్సు సంపాదకీయ వర్గంలో చేరారు. వారి విద్యార్థిదశ నుండి వారిని నేను ఎరుగుదును. వారి "Twentieth Century" అనే మాసపత్రికకు

నేను కొన్ని వ్యాసాలను వ్రాశాను. వారితో నాకు కలిగిన పరిచయం మూలంగా హిందూస్థాన్ టైమ్సు పత్రికలో గ్రంథ సమీక్షలు చేయగల అవకాశం నాకు లభించింది. 1952 లో నేను ఢిల్లీ వెళ్ళినప్పుడు కేంద్రమంత్రివర్గంలో ఒకరైన కె. సి. రెడ్డిగారు ప్రముఖులైన అతిథులకు విందుజేసి, దానికి నన్ను కూడా ఆహ్వానించారు. వారిలో హిందూస్థాన్ టైమ్సు పత్రికాధిపతి అయిన దేవదాసు గాంధీగారు ఒకరు. ప్రసంగ సందర్భంలో వారు నా గ్రంథ సమీక్షలను చాలా ప్రశంసించారు.

బొంబాయి విశ్వవిద్యాలయాన్ని వదలిన తర్వాత 1952 లో 40 గ్రంథ సమీక్షలను, 1953 లో 77 సమీక్షలను, 1954 లో 81 ని, 1955 లో 96 ను, 1956 లో 90 ని, 1957 లో 61 ని మొత్తం 445 గ్రంథాల సమీక్షలను ప్రకటించాను. నా కార్యక్రమంలో ఇది ఒక ప్రధానస్థానం వహించడం చేత ఇన్ని గ్రంథాలను చదివే అవకాశం నాకు లభించింది. దీనిమూలంగా నా పరిజ్ఞానం పెరిగింది. నా దృక్పథం విశాలతరంగా రూపొందింది. ఈ గ్రంథాలను రచించిన వారిలో అధికసంఖ్యాకులు రచయితలుగా ప్రపంచ విఖ్యాతిని సంపాదించినవారు. వీటి మూలంగా నేను పాఠకులకు ఏవి చదువుటకు ఎక్కువ అర్హములైనవో, ఏవి మధ్యతరగతికి చెందినవో, ఏవి అనర్హములో చక్కగా పరిశీలించి చెప్పగలిగాను. ఇది నా విద్యాబోధ కార్యక్రమంలో ఒక ప్రధానాంశంగా పరిగణిస్తున్నాను.

1952లో బొంబాయి నగరంలో జరిగిన సాధారణ ఎన్నికల గురించి నేను చాలా గ్రంథ సామగ్రిని సేకరించినట్లు ఇదివరకే చెప్పినాను. ఆ సామగ్రినంతా చక్కగా సమన్వయపరచి, గ్రంథరూపంలో ప్రకటించుటకు నిర్ణయించాను. అందుకుగాను బొంబాయి విశ్వవిద్యాలయంవారు రు. 1000 లు విరాళం ఇచ్చారు. ఈ నిర్ణయాన్ని ఆచరణసాధ్యం గావించుటకు 5,6 నెలలు పట్టింది. తుదకు 1953 లో ఆ గ్రంథాన్ని బొంబాయిలో వోరా కంపెనీ వారి సాధనాన ప్రకటించాను. సాధారణ ఎన్నికల గురించి దేశంలో వ్రాయబడిన ప్రథమ గ్రంథం ఇదే. తర్వాత ప్రొఫెసర్ కోగికార్, ప్రొఫెసర్ పార్క్ అనేవారు '1952 భారతదేశ ఎన్ని

కలు' అనే గ్రంథాన్ని తయారుచేసి దానిని ప్రకటించారు. ఆ గ్రంథంలో బొంబాయి నగరానికి చెందిన అధ్యాయాన్ని నేను వ్రాశాను. ఈ అధ్యాయము వోరా కంపెనీవారు ప్రకటించిన గ్రంథము నేను స్వయంగా చేసిన పరిశోధనమూలంగా వ్రాయబడి నట్టివి.

1953 లో ఆంధ్రరాష్ట్ర నిర్మాణం సందర్భంలో నేను కొన్ని ప్రత్యేక వ్యాసాలను వ్రాసి హిందూ, హిందుస్థాన్ టైమ్సు, త్రివేణి మొదలైన పత్రికలలో ప్రకటించినాను. ఈసందర్భంలో నేను మొదటినుంచి ప్రత్యేక ఆంధ్రరాష్ట్ర నిర్మాణం జరగవలెననే వాదాన్ని సమర్థించిన వారిలో ఒకడనని చెప్పడం ఉచితమని భావిస్తున్నాను. దీనిని సమర్థిస్తూ థార్ కమిటీ ఎదుట సాక్ష్య మిచ్చాను. మద్రాసు నగరం రాజధానిగా ఆంధ్రరాష్ట్ర నిర్మాణం జరగవలెననే అభిప్రాయాన్ని వ్యక్తంచేశాను. ఇది సాధ్యంకాని పక్షంలో నగరాన్ని రెండుగా విభాగంచేసి కూవం నదికి ఉత్తరంగా ఉన్న భాగాన్ని ఆంధ్రరాష్ట్రంలో చేర్చవలసిందిగా ప్రతిపాదించాను.

1953 లో పొట్టి శ్రీరాములుగారు మద్రాసు నగరంతో కూడిన ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికై ఆమరణదీక్షను ప్రారంభించారు. వీరు కొన్నిసంవత్సరాలుగా నెల్లూరులో నివసిస్తూ వచ్చారు. వీరు హరిజనోద్ధరణ విషయంలో ప్రచారం చేయడమే గాక, నెల్లూరులోని వేణుగోపాలస్వామి దేవాలయంలోకి హరిజనులకు ప్రవేశం కలిగించుటకు ఉపవాసవ్రతం చేపట్టి వారికి ప్రవేశం కలిగించారు. నా పెద్ద కుమార్తె అన్నపూర్ణ అనేక సంవత్సరాలుగా నెల్లూరులోని హరిజన బాలికల హాస్టలుకు కార్యదర్శిగా ప్రశంసాపాత్రమైన కృషి జేయడమేగాక హరిజనోద్ధరణకు, అస్పృశ్యతను నివారించుటకు అనేక కార్యక్రమాలను చేపట్టింది. బ్రిటిషు ప్రభుత్వ కాలంలో ఆమె కృషిని ప్రశంసిస్తూ ప్రభుత్వం ఆమెకు కేసరి హింద్ కంచు పతకాన్ని బహూకరించింది. ఈలాటి కార్యక్రమాలలో ఆమె ప్రదర్శించిన దీక్షను గమనించి శ్రీరాములుగారు ఆమెకు సన్నిహితులైనారు. ప్రతిరోజు సాయంత్రం ఆయన ఆమె నివాసానికి వచ్చి, ఇష్టాగోష్ఠి జరిపి, కాఫీ ఫలహారం పుచ్చుకొనుచుండేవారు. దీని

మూలంగా నాకు కూడా ఆయనతో సన్నిహిత సంబంధం ఏర్పడింది.

ఆయన మద్రాసులో బులుసు సాంబమూర్తిగారి ఇంట్లో ఉపవాసదీక్షను ప్రారంభించగానే నా కిమూర్తె, నేనూ కలిసి దీక్షను విరమించుకోనవలెనని కోరుతూ ఒక ఉత్తరం వ్రాశాము. ప్రారంభించిన దీక్షను విరమించడం తనకు అంగీకారయోగ్యం కాదని, తాను కోరేది ఆంధ్రరాష్ట్ర నిర్మాణం మాత్రమే కాదని, మద్రాసు నగరంతో కలిసిన రాష్ట్ర నిర్మాణానికై తాను దీక్షను చేపట్టినట్లు మాకు ప్రత్యుత్తరం వ్రాశారు. తిర్వాత మే మిద్దరం డిసెంబరు 9-వ తేదీన ఆయనను చూచుటకు వెళ్లినాము. అప్పటికే ఆయన ఉపవాసం ప్రారంభించి 51 రోజులైనది. ఆయన ముఖ వికాసం ఏమాత్రమూ తగ్గలేదు. కాని ఆయన చాలా బల హీనంగా ఉండినారు. నేను అంతకుపూర్వం కొన్నిరోజుల క్రిందట శ్రీరాములుగారి ఆశయాన్ని గురించి డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణన్ గారికి ఉత్తరం వ్రాశాను. ప్రధానమంత్రి తగిన నిర్ణయాన్ని చేయగలరని ఆయన నాకు ప్రత్యుత్తరం వ్రాశారు. కాని మద్రాసు నగర విషయం ఆ ఉత్తరంలో ప్రస్తావించలేదు. మద్రాసు నగరం మినహాగా ఆంధ్ర నిర్మాణం జరుగుతుందని నెహ్రూ ఒక ప్రకటనను చేశారు. కాని ఆ ప్రకటన శ్రీరాములు గారికి తృప్తిని కలిగించలేదు. వారు ఆశాభంగాన్ని పొందినారు. డిసెంబరు 10-వ తేదీన వారిని మేము తిరిగి కలుసుకొన్నాము. నెల్లూరులో వారి బంధువుల యోగక్షేమాన్ని గురించి మమ్ము లను అడిగినారు. కాని ఆయన కంఠస్వరం చాలా బలహీనత గాంచింది. చాలాకాలం జీవించడని మేము అభిప్రాయ పడి నాము. మద్రాసులోని ఆంధ్రనాయకు లెవ్వరు ఆయన ఆశయాన్ని గురించి ఏలాటి ఆందోళనా లేవదీయ లేదు. వారి ఔదాసీన్యం నాకు విచారాన్ని కలిగించింది. మద్రాసును ఆంధ్రరాష్ట్రంలో చేర్చిన పక్షంలో తమిళులు దౌర్జన్యంలోకి దిగి నగరవీధులను రక్తప్రవాహంతో నింపడానికి సిద్ధంగా ఉన్నారని చక్రవర్తుల రాజగోపాలాచారి బెదరింపులకు నెహ్రూ మొదలైనవారు లొంగిపోయినారు. శ్రీరాములుగారు 16-వ

తేదీన మృతి చెందినారు. ఆంధ్రరాష్ట్రమే గాక యావద్భారత దేశం ఒక మహానుభావుని కోల్పోయింది.

తర్వాత నెల్లూరు మొదలైన పట్టణాలలోని ప్రజలు దౌర్జన్యంలోకి దిగినారు. ప్రాణనష్టము, ఆస్తినష్టము చాలా సంభవించాయి. అటుతర్వాతనే నెహ్రూ ఆంధ్రరాష్ట్ర నిర్మాణాన్ని గురించి అధికారపూర్వకంగా ప్రకటనను విడుదల చేశారు.

రాష్ట్ర నిర్మాణమును గురించిన వివరాలను, దానికి ఏపట్టణం రాజధానిగా ఉండవలెనో తెలియపరచుటకు జస్టిస్ వాంచూను కేంద్రప్రభుత్వం నియమించింది. ఆయన నెల్లూరుకి వచ్చినపుడు నెల్లూరు ప్రధాన నగరంగా ఉండవలెనని నేను సాక్ష్య మిచ్చి, ప్రజల తరఫున ఒక వినతిపత్రాన్ని సమర్పించినాను. కాని ఈలాటి వినతిపత్రాలు ఆయనపై ఏలాటి ప్రభావాన్ని వహించలేదు. తుదకు కర్నూలు రాజధానిగా ఆంధ్రరాష్ట్రం ఏర్పడింది. ఈ ఏర్పాటు భాషను ఆధారం చేసుకొని దేశంలోని రాష్ట్రాల పునర్నిర్మాణ చరిత్రలో ఒక ప్రధాన ఘట్టం. మనకు స్వతంత్రం లభించుటకు పూర్వం కాంగ్రెసువారు ఈలాటి రాష్ట్రాల నిర్మాణానికి అంగీకరించారు. కొత్తరాజ్యాంగాన్ని రాజ్యాంగ పరిషత్తు రూపొందించే సందర్భంలో రాష్ట్రాల జాబితాలో ఆంధ్ర రాష్ట్రాన్ని చేర్చవలసిందిగా పట్టాభి సీతారామయ్య వంటి నాయకులు పట్టుబట్టినారు. కాని అప్పట్లో పరిపాలనాధికారాన్ని వహించిన నెహ్రూ, పటేల్, అజాద్ మొదలైన నాయకులు ఈవిషయంలో వారి అభిప్రాయాన్ని పూర్తిగా మార్చుకొన్నారు. మనకు 1947 లో స్వరాజ్యం లభించినప్పుడు దేశవిభజన జరగడం, దేశం రెండు స్వతంత్ర రాజ్యాలుగా చీలిపోవడం, హిందూ ముస్లిం కొట్లాటలు ప్రారంభమై లక్షలాది జనం పంజాబు, ఢిల్లీ ప్రాంతాలలో ప్రాణనష్టాన్ని పొందడం, సుమారు 150 లక్షల జనం కాందిశీకులుగా పాకిస్థాన్ నుండి ఇండియాకు, ఇండియా నుండి పాకిస్థాన్ కు చేరడం, వారి పునరావాసం ఒక క్లిష్ట సమస్యగా రూపొందడం నెహ్రూ మొదలైన నాయకులపై గొప్ప ప్రభావాన్ని వహించినవి. భాషాప్రయుక్త రాష్ట్రాలు ఏర్పడిన పక్షంలో ఈలాటి సమస్యలు బయలుదేరి, దేశ విచ్ఛిత్తికి దారి

తీయగలదని వారు భయపడినారు. పొట్టి శ్రీరాములుగారి ఆమరణ ఉపవాసదీక్షకు పూర్వం ఆంధ్రరాష్ట్ర నిర్మాణంపట్ల వారు వహించిన విరోధ వైఖరికి ఈ భయమే కారణము.

శ్రీరాములుగారితో నా కుటుంబైక్యత, నాకు సన్నిహిత సంబంధం వుండిన కారణంగాను, మొదటినుంచి నేను మద్రాసు నగరంతో కూడిన ఆంధ్రరాష్ట్ర నిర్మాణాన్ని సమర్థించినవాడను కావడంచేతను శ్రీరాములుగారి దీక్షను గురించి ఇక్కడ వ్రాసినాను.

1952 తర్వాత నా కార్యక్రమాలను నాలుగు వర్గాలుగా విభాగం చేయవచ్చునని పైన చెప్పినాను. గ్రంథ సమీక్షలు మొదటి వర్గానికి చెందినవి. వార్తాపత్రికలకు వ్యాసాలు వ్రాయడం రెండవ వర్గానికి చెందినది. ఆనాడు దేశంలో సంచలనం కలిగిస్తున్న వివిధవిషయాల గురించి అనేక వ్యాసాలను వ్రాశాను. బొంబాయిలోని "ఇలస్ట్రేటెడ్ వీక్లీ" (Illustrated Weekly) అనే వారపత్రికలో నేను ప్రకటించిన "మన విద్యా విధానంలోని లోపం ఎట్టిది?" (What is wrong with our Education) అనే వ్యాసము, "మన అధ్యాపకుల విచారకరమైన పరిస్థితి" అనే వ్యాసము అమెరికాలోని కొన్ని పత్రికల దృష్టిని ఆకర్షించింది. వాటిలో 'అట్లాస్' (Atlas) అనే పత్రిక రెండవ దానిని పునర్ముద్రణ గావించింది. అనేక గ్రంథాలను సమీక్షార్థం నేను చదవడంచేతను, దేశంలోని ప్రముఖ వార్తాపత్రికలను పరిశీలించడం చేతను నా వ్యాసాలు అనేకుల దృష్టిని ఆకర్షించి వారి ప్రశంసలకు పాత్రములు కాగలిగినవి.

మనకు స్వరాజ్యం లభించిన తర్వాత నెహ్రూ నాయకత్వంలో ఏర్పడిన కేంద్ర ప్రభుత్వం పంచవర్ష ప్రణాళికలద్వారా ఆర్థికాభివృద్ధిని సాధించుటకు నిర్ణయించింది. ప్రణాళికలు అమలు పరచడంలో పరిపాలన విధానాన్ని సంస్కరించవలసి ఉన్నట్లు కూడా ప్రభుత్వం భావించి పంచవర్ష ప్రణాళికలో దానిని గురించి కూడా వివరించింది. కాని ఆ వివరణ సమగ్రమైనదిగా నాకు కనుపించలేదు. అందుచేత నేను కొంత పరిశోధన గావించి "ప్రణాళిక, పరిపాలన విధానము" (Planning and Public

Administration ) అనే వ్యాసాన్ని, భారతరాజనీతిశాస్త్ర పత్రికలో ( Indian Political Science Journal ) ప్రకటించాను. ఇది మన దేశంలోను, విదేశాలలోను నిపుణు లనేకుల దృష్టిని ఆకర్షించింది.

మూడవ వర్గంలో చేరిన నా కార్యక్రమం సమావేశాలలో పాల్గొని ప్రసంగించడం. మద్రాసులో ఆనాడు జరిగిన విద్యా రంగానికి చెందిన సమావేశాలన్నిటికి కార్యనిర్వాహకులు నన్ను ఆహ్వానించడం పరిపాటి. నెల్లూరు, గుంటూరు మొదలైన పట్టణాల లోని సమావేశాలలో కూడా పాల్గొని నేను ప్రసంగించడం జరిగింది. గ్రంథవిస్తరణ భీతిచే వాటిని గురించి పూర్తిగా వివరించడం మానుకొంటున్నాను.

నాల్గవ వర్గానికి చెందిన నా కార్యక్రమం మద్రాసు ఆకాశవాణిలో ప్రసంగాలను ప్రసారం చేయడం. 1954 లో నేను ఆకాశవాణిలో ఉద్యోగాన్ని చేపట్టిన తర్వాత విద్యార్థుల కార్యక్రమాలకు సంబంధించిన ప్రసంగాలను ప్రసారం చేయడమే గాక ఇతర ప్రసంగాలను కూడా ప్రసారం చేసేవాడిని. ఆకాశ వాణి ఏర్పాటు చేసిన చర్చలలో కూడా ఇతరులతో కలిసి పాల్గొనే వాడిని. ఈ చర్చా కార్యక్రమం నాకు ఎక్కువగా రుచించలేదు. ఏ కారణంచేతనో ఆకాశవాణి అధికారులు ఇద్దరి పట్ల ఎక్కువ మోజు కలవారై వారిని తరుచుగా ఆహ్వానించడం జరిగేది. వారు సకాలానికి హాజరుకాక కార్యక్రమాలకు భంగం కలిగించినా, ఆహ్వానించడం తప్పేదికాదు. వారితో కలసి చర్చించడం నాకు చాలా విసుగు కలిగించేది. మరికొందరు చర్చనీయ విషయాన్ని గురించి ఏమీ ఆలోచించక చర్చలకు వచ్చేవారు ఇది కూడా నా విసుగుకు కారణమైనది. ఇది తెలిసి కూడా అలాటివారిని పదే పదే ఎందుకు ఆహ్వానించడం జరిగిందో నాకు అర్థం కాలేదు.

'రామాయణంలో పిడకల వేట్లాట' అన్నట్లు ఆ రోజులలో నా పాఠ్యగ్రంథాల గురించి ఒక పలుకుబడిగల తెనుగు పత్రికా సంపాదకులు చేసిన ప్రచారాన్ని గురించి ఇక్కడ సంక్షిప్తంగా

చెప్పవలసి ఉన్నది. నేను వ్రాసిన సాంఘికశాస్త్ర పాఠ్య గ్రంథాలు వాస్తవంగా నేను వ్రాసినట్టివి కావని, ఎవరిచేతనో వ్రాయించి వాటిని నా పేరట ప్రకటించానసేది వారు గావించిన మొదటి ఆరోపణ. ఇది పూర్తిగా నిరాధారమైనట్టిది. కొత్త పాఠ్యప్రణాళికలను ప్రభుత్వం ప్రకటించిన వెంటనే నేను 1949 లో మద్రాసులో ఉన్నప్పుడు మూడు పాఠ్య గ్రంథాలను, బొంబాయికి వెళ్ళిన తర్వాత తక్కిన మూడు గ్రంథాలను స్వయంగా వ్రాశాను. ఇతరులచేత వాటిని వ్రాయించవలసిన అవసరం ఏలాటిదీ లేదు. స్వయంగా వ్రాయుటకు కావలసిన పరిజ్ఞానం, తీరుబడి నాకు ఉండేవి. నేను వ్రాసిన మూడవ ఫారం పాఠ్య గ్రంథంలో కొన్ని పొరపాట్లు ఉన్నట్లు వారు చేసిన రెండవ ఆక్షేపణ. కాని ఈలాటి పొరపాట్లు అందరు వ్రాసిన పాఠ్య గ్రంథాలలో ఉండేవి. ఆ సంపాదకులు నా గ్రంథాన్ని మాత్రం ప్రత్యేకించి అందులోని పొరపాట్లనే ప్రభుత్వం దృష్టికి తెచ్చారు. దాని ఫలితంగా నాలుగు సంవత్సరాలు ప్రభుత్వం ఆమోదించిన పాఠ్యగ్రంథాల జాబితా నుండి నా గ్రంథాన్ని తొలగించారు. ఇది గాక అప్పుడే ప్రభుత్వం పాఠ్యప్రణాళికలను సవరించి, ఆ సవరణలోని సూచనలకు అనుగుణంగా పాఠ్యగ్రంథాలన్నిటినీ సవరించడం అవసరమని తెలియపరచింది.

దీని ఫలితంగా ఒక మూడవ పాఠ్యగ్రంథాన్నే గాక తక్కిన అయిదు గ్రంథాలను సవరించవలసి వచ్చింది. కాని ఈ సవరణ పట్ల నాకు ఆసక్తిగాని, ఉత్సాహంగాని లేదు. కష్టపడి సవరించినా, పాఠ్యగ్రంథాలను ఆమోదించే కమిటీ వాటిని ఆమోదించడం సందేహాస్పదం. ఈ కమిటీవారు అవినీతికి పాల్పడి, పక్షపాత వైఖరిని అవలంబించడం అందరికీ తెలిసిన విషయమే. అన్ని రంగాలలో అవినీతి వ్యాపించినట్లు ఇందులో కూడా అది వ్యాపించింది. కాని నా గ్రంథాలను ప్రకటించిన శేషాచలం కంపెనీవారి ఒత్తిడికి ఎదుర్కొనలేక నేను ఈ సవరణలు చేయుటకు అంగీకరించి, ఆ పనిని పూర్తి చేశాను. కమిటీవారు వాటిని ఆమోదించారు.

కాని కమిటీ అవినీతికి పాల్పడుతున్నదని క్రమక్రమంగా ప్రభుత్వం కూడా గ్రహించింది. అది కారణంగా పాఠ్యగ్రంధాల రచనను, ప్రకటనను ప్రభుత్వం జాతీయం చేసింది. వాటిని రచించి ప్రకటించే బాధ్యతను ప్రభుత్వమే స్వీకరించింది. దీని మూలంగా ఆదర్శప్రాయమైన గ్రంధాలు వ్రాయడం జరగదని ప్రకటనదార్ల తరఫున ఒక నివేదకను నేను తయారుచేసి, అప్పటి విద్యామంత్రి పట్టాభి రామారావుగారికి సమర్పించాను. కాని దానిమూలంగా ఏలాటి ప్రయోజనం లభించలేదు. జాతీయ విధానం ఖాయపడిపోయినది.

ఇదివరలో పాఠ్యగ్రంధాలలో వుండిన పొరపాట్లు లోపాలు జాతీయం చేయబడిన పాఠ్యగ్రంధాలలో కూడా కనుపిస్తూ వున్నవి. దీనికి మౌలికమైన కారణం మొదటినుంచి గ్రంధకర్తలు అనుసరించిన రచనా విధానం. ఇటీవల కొన్నిసంవత్సరాల క్రిందట నా అధ్యక్షతన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం సాంఘికశాస్త్ర పాఠ్యప్రణాళికలను సంస్కరించుటకు నవరించిన ప్రణాళికలకు అనుగుణంగా పాఠ్యగ్రంధాలను రచించుటకు ఒక కమిటీని స్థాపించింది. ఆ సందర్భంలో పాఠ్యగ్రంధాల రచనా విధానాన్ని గురించి ఒక నివేదికను ప్రభుత్వానికి సమర్పించాను. పాఠ్య గ్రంధాన్ని వ్రాసే బాధ్యతను ఒకే ఒక గ్రంధకర్తకు ఒప్పగించ రాదనేది నా నివేదికకు మౌలిక లక్షణం. పాఠ్యగ్రంధాల రచనకు బహుముఖమైన ప్రజ్ఞ అవసరం. గ్రంధంలో చేర్చవలసిన విషయ పరిజ్ఞానం ఇందులో ఒకటి మాత్రమే. ఆ విషయాన్ని తరగతిని బట్టీ, వారికి గల అవగాహన శక్తి బట్టీ రచించడం అవసరం. ఇందుకుగాను ఒక మానసిక శాస్త్రాన్ని అధ్యయనం చేసినవారిని ( Psychologist ) గ్రంధకర్తకు సహాయం చేయుటకు నియమించ వలెను. గ్రంధంలో వాడదగిన భాషను, శైలిని నిర్ణయించగల నిపుణుడు ఇంకొకడు ఉండవలెను.

ఈనాటి పాఠ్యగ్రంధాలలో అధికసంఖ్యాకం తెనుగులో వ్రాయబడుతున్నవి. అందులోని భాష శిష్ట వ్యావహారిక భాష. కాని దీనికి ఒక ప్రామాణిక రూపం ఇంకా ఏర్పడలేదు. దానిని

గురించి పరిశోధన గావించిన నిపుణు డొకడు గ్రంథకర్త వాడిన భాషను, శైలిని పరిశీలించవలసి ఉన్నది. ఇదిగాక గ్రంథంలో చేర్చవలసిన చిత్రములు ( Illustrations ) నిర్ణయించగల చిత్రకారుడు కూడా అవసరం. ఈలాటి వారందరు కలిసి, పరస్పరం సంప్రతించుకొని, ఒక నిర్ణయానికి వచ్చిన తర్వాత ఆ నిర్ణయ ప్రకారం గ్రంథకర్త రచనను పూర్తిచేయవలసి ఉంటుంది. అప్పుడు గ్రంథం లోపరహితంగా రూపొందే అవకాశం ఏర్పడుతుంది.

ఈలాగు రచించబడిన గ్రంథాన్ని పాఠ్యగ్రంథంగా వెంటనే నిర్ణయించరాదు. దానిని కొన్ని విద్యాలయాలలో ఒకటి రెండు సంవత్సరాలకాలం ప్రయోగాత్మకంగా ఉపయోగించవలెను. ఆ యా తరగతులకు చెందిన అధ్యాపకులు దీనిని ఉపయోగించి, దీనిలో చేయవలసిన మార్పులను గ్రంథకర్త దృష్టికి తీసుకొని రావలెను. ఆ మార్పుల గురించి పైన సూచించిన సంపాదకీయ వర్గం చక్కగా ఆలోచించి గ్రంథానికి తుది స్వరూపాన్ని కల్పించి ప్రకటించవలెను. అటుతర్వాతనే అది పాఠ్యగ్రంథంగా వాడుకలోకి రావలెను.

ఈ అంశాలనన్నిటినీ పొందుపరుస్తూ నా నివేదికను సమర్పించాను. కాని ఇది కాలయాపనతోను, ఎక్కువ ఖర్చుతోను కూడిన కార్యక్రమం అనే భావంతో ప్రభుత్వం దీనిపట్ల ఏలాటి శ్రద్ధను వహించలేదు. అందుచేతనే జాతీయం చేసిన పాఠ్యగ్రంథాలలో కూడా రకరకాలైన పొరపాట్లు, లోపాలు కనుపస్తున్నవి. అందరు పాతమార్గంలో నడిచేవారే. క్రొత్త మార్గం ఎవరికీ నచ్చడంలేదు. విద్యారంగంలో మన వెనుకబడిన తనానికి ఈ మనస్తత్వమే ప్రధాన కారణం.

1952 తర్వాత కూడా 'ఎడ్యుకేషనల్ ఇండియా' ( Educational India ) అనే విద్యాసంబంధమైన మాసపత్రికకు నేను సంపాదకుడనుగా ఉండి, నెలనెలా సంపాదకీయాలు వ్రాస్తూ విద్యావిధానంలో జరగవలసిన మార్పుల గురించి, సమకాలిక

18)

విద్యా సమస్యల గురించి తెలియపరుస్తూ ఉండేవాడిని. ప్రతి నెలా రెండు మూడు రోజులు ఇందుకుగాను వినియోగించే వాడిని. ఇది గాక రామకోటేశ్వరరావుగారిచే స్థాపించబడి యిప్పుడు భావరాజు నరసింహారావుగారి సంపాదకత్వంలో ప్రకటింపబడు తున్న 'త్రివేణి' పత్రికలో అప్పుడప్పుడు వ్యాసాలను ప్రకటించడమే గాక కొంతకాలం, 'అంతర్జాతీయ పరిణామాలు' ( International Survey) గురించి ప్రతి సంచికలో వ్రాస్తూ ఉండేవాడిని. దీనికి కూడా ప్రతినెలలో రెండు మూడు రోజులు వినియోగిస్తూ ఉండే వాడిని. ఇదిగాక నా యువక మిత్రులు కొల్లూరు కోటేశ్వరరావు సంపాదకత్వాన క్రొత్తగా స్థాపింపబడిన 'తెనుగు విద్యార్థి' అనే మాసపత్రికలో "ప్రశ్నలు, సమాధానాలు" అనే శీర్షికను నిర్వహించసాగాను. విద్యార్థులు పంపిన ప్రశ్నలకు నా సమాధానాలను చెప్పడం దీనికి ప్రధాన లక్షణం. ఇదిగాక ఇందులో కొన్ని వ్యాసాలను కూడా అప్పుడప్పుడు ప్రకటిస్తూ వుండేవాడిని. దీనిమూలంగా నాకు కోటేశ్వరరావుగారితో సన్నిహిత సంబంధం ఏర్పడినది. వారు నాపట్ల గౌరవమేగాక అభిమానం గలవారయ్యారు. ఈ రెండు భావాలు వారిలో ఏర్పడడంచేత వారు నాకు అనేకవిధాలుగా సహాయం చేయసాగారు. నేను వ్రాసిన గ్రంథాలలో కొన్నిటిని వారు ప్రకటించారు. వారి స్నేహం నాకు అమూల్యమైనట్టిది. నేను మద్రాసు ఆకాశవాణిలో ఉద్యోగాన్ని స్వీకరించిన తర్వాత కూడా పైన పేర్కొన్న కార్యక్రమాలన్నింటిని సాగిస్తూనే వచ్చాను.

1954 ఏప్రిల్ 3 న మద్రాసు ఆకాశవాణిలో తెలుగు విద్యార్థి కార్యక్రమాలను నిర్వహించే ఉద్యోగిగా పదవీస్వీకారం చేశాను. ఈ ఉద్యోగానికి నేను దరఖాస్తు పెట్టలేదు. అధికారులే వారంతట వారు నన్ను ఆహ్వానించి, నన్ను నియమించినారు.

నేను ఏ ఉద్యోగాన్ని చేపట్టినా ఏలాటి శక్తివంచన లేక దానిని నిర్వహించుటకు ప్రయత్నించడం నా స్వభావం. అందు చేతనే నేను నా తరంలో ఒక ఆదర్శ అధ్యాపకుడనుగా పేరు ప్రతిష్ఠలు సంపాదించగలిగాను. నా విద్యార్థులు నాపట్ల గౌరవాభిమానములు కలవారగుటకు నేను నా బాధ్యతను వహించుటలో

చూపిన శ్రద్ధ ప్రధాన కారణము. ఇదే మనస్తత్వంతో నేను ఆకాశవాణి ఉద్యోగంలో ప్రవేశించాను.

దీనిని కార్యరూపంలో పెట్టుటకు నేను రెండు, మూడు మార్గాలను అనుసరించినాను. విదేశాలలో వాటిలో ప్రధానంగా బ్రిటన్‌లోని బి. బి. సి. (B. B. C.) ఆకాశవాణివారు విద్యార్థుల కార్యక్రమాలను ఏలాగు నిర్వహిస్తున్నారో తెలుసుకొని, దాని మూలంగా సంపాదించిన పరిజ్ఞానాన్ని నా కార్యనిర్వహణలో వినియోగించడం నేను అనుసరించిన మొదటి మార్గం. ఇందుకు అనేక గ్రంథాలను చదివాను.

ఇదిగాక ఆకాశవాణి ప్రసారంచేసిన విద్యార్థి కార్యక్రమాలను ఎంతవరకు విద్యాలయాలలోని విద్యార్థులు వింటున్నారో, వాటిపట్ల అధ్యాపకులకు ఏలాంటి అభిప్రాయాలు ఏర్పడి ఉన్నవో తెలుసుకొనదలచాను. కార్యక్రమాలను వినేవారు ఉన్నప్పుడే వాటికి సార్థక్యం కలుగుతుంది. లేనప్పుడు అవి చెవిటికి శంఖూది నట్లే ఉంటవి. దీనిని తెలుసుకొనుటకు నేను అధికారుల అనుజ్ఞను పొంది నెల్లూరు, గుంటూరు, కృష్ణా, కర్నూలు జిల్లాలలో పర్యటించి, అక్కడి విద్యాలయాలలో కొన్నిటికి వెళ్ళి, విద్యార్థులు కార్యక్రమాలను వింటున్నారో లేదో తెలుసుకున్నాను. అన్ని విద్యాలయాలలో రేడియోలు ఉండేవి కావు. రేడియోలు ఉన్నా అవి హెడ్‌మాస్టరు గదిలో దాచి ఉంచబడేవి. రోజూవారి టైం టేబిలులో కార్యక్రమాలను వినుటకు కాలాన్ని కేటాయించడం జరిగేది కాదు. ఈలాంటి పరిస్థితులలో ఆకాశవాణి విద్యార్థుల కార్యక్రమాలు నిరర్థకములని ప్రత్యేకంగా చెప్పవలసింది లేదు. కాని నేను ఉద్యోగిగా చేరుటకు పూర్వం ఎవరూ ఈలాంటి పర్యటనలను సాగించి, వాస్తవ పరిస్థితులను గమనించలేదు. కార్యక్రమాలను ప్రసారం చేయడంతో తమ బాధ్యత తీరినట్లు వారు అనుకొనే వారు. నేను దానికి అన్యథాగా ప్రవర్తించి. పరిస్థితులను తెలుసుకొని, నా అభిప్రాయాలను వ్యక్తంచేస్తూ అధికారులకు నా నివేదికలను సమర్పించినాను. కాని వీటిమూలంగా నేను ఆశించిన ఫలితాలు లభించలేదు. అధికారు లందరివలెనె ఆకాశవాణి

అధికారులు కూడ పాతమార్గాలను విడనాడి, క్రొత్త మార్గాలలో నడచుటకు సిద్ధంగా లేకపోయినారు.

నేను ప్రవేశపెట్టిన మూడవ మార్గం విద్యార్థి కార్యక్రమాలను ఆకాశవాణి ఆఫీసులో మాత్రమే ప్రసారం చేయుటకు బదులు విద్యాలయాలలో కూడా ప్రసారం చేయాలి. ఈ సంస్కరణ మూలంగా విద్యార్థులలోను, అధ్యాపకులలోను కార్యక్రమాలను వినడంలో ఆసక్తి, ఉత్సాహం పెరిగినవి. ఈ ప్రక్రియ మద్రాసులోని విద్యాలయాలలో మాత్రమే ఆనాడు సాధ్యమైంది. కాని దానిమూలంగా కార్యక్రమాలకు ఎక్కువ సార్థక్యం లభించింది.

వీటి అన్నిటిలో నాకు ఆకాశవాణిలో ఉద్యోగిగా ఉన్నట్టేన్నీ, ఆంధ్ర విశ్వవిద్యాలయంలో నాకు శిష్యుడుగా ఉన్నట్టేన్నీ జనమంచి రామకృష్ణ నాకు ఎంతగానో తోడ్పడినాడు. జిల్లాలలో నేను పర్యటించినప్పుడు నాతో కూడా వచ్చి, నేను నిర్వహించిన కార్యకలాపాల భారాన్ని చాలావరకు తగ్గించినాడు.

విద్యార్థి కార్యక్రమాలను నిర్వహించుటకు నాతోపాటు జానకిరామన్ అనే సుప్రసిద్ధ తమిళ గ్రంథకర్త నియమింపబడినాడు. తమిళ విద్యార్థుల కార్యక్రమాలు అతని అధీనంలో ఉండేవి. కాని మేమిద్దరం వేర్వేరుగా మా బాధ్యతలు నిర్వహించక పరస్పరం సంప్రతించుకొని కలిసి నిర్వహించడం పరిపాటి అయింది. దీనిమూలంగా మా కార్యక్రమాలకు మరింత పటిష్ఠత చేకూరింది.

సంవత్సరం పొడుగునా ప్రాథమిక, మాధ్యమిక, ఉన్నత తరగతులలోని విద్యార్థులకు ఏలాటి కార్యక్రమాలను నిర్వహించవలసిందీ నిర్ణయిస్తూ మేమిద్దరం కలిసి ఒక ప్రణాళికను తయారు చేసేవారం. అధికారులు దానిని గ్రంథరూపంలో ప్రకటించి విద్యాలయాలన్నిటికీ ముందుగానే పంచిపెట్టేవారు. అందుచేత ఏ యే రోజులలో ఏలాటి కార్యక్రమాలు ప్రసారమయ్యేది అధ్యాపకులు, విద్యార్థులు తెలుసుకొనుటకు అవకాశం ఏర్పడింది. ఈ గ్రంథం ఏటేట తెనుగు, తమిళం, ఇంగ్లీషు భాషలలో ప్రకటింపబడేది. విద్యార్థి కార్యక్రమాలకు సంబంధించి 1954-'57 లో నేను 80 ప్రసారాలు చేశాను. ఇతర ప్రసారాలను మద్రాసు

విద్యాలయాలలోని అధ్యాపకులు, ఇతర నిపుణులు చేశారు. ఒకొక్క ప్రసారానికి సంబంధించిన నా వ్యాసాన్ని ఇంట్లో వ్రాసి, నా వ్రాతప్రతిని ఆకాశవాణికి తీసుకొనిపోయి ప్రసంగాన్ని ప్రసారం చేసేవాడిని.

పనులు ఉన్నప్పుడే నేను మద్రాసు ఆకాశవాణికి వెళ్లేవాడిని. రోజూ పని ఉన్నా లేకపోయినా ఉదయం 10 గంటలకు వెళ్లి సాయంత్రం 5 గంటలవరకు అక్కడుండవలసిన నిర్బంధం లేక పోవడంచేత నా ఇతర కార్యక్రమాలను సాగించుటకు నాకు కాల వ్యవధి ఉండేది. ఈవిధంగా ఆకాశవాణి ఉద్యోగంలో 1957 జూలై వరకు గడిపాను. ఆ జూలైలో నన్ను హైదరాబాదు ఆకాశవాణికి బదిలీచేశారు. అక్కడి పరిస్థితులు మద్రాసు పరిస్థితులకు భిన్నంగా ఉండేవి. పనిఉన్నా లేకపోయినా ఆఫీసుకు 10 గంటలకు వెళ్ళి సాయంకాలం 5 గంటల వరకు నిర్బంధంగా ఉండవలసి వచ్చింది. దీనిమూలంగా నా కాలంలో చాలాభాగం వ్యర్థమౌతూ వచ్చింది. అందుచేత ఆగస్టులో నా ఉద్యోగానికి రాజీనామా చేశాను. అటుతర్వాత ఏ ఉద్యోగాన్ని నేను స్వీకరించలేదు. స్వేచ్ఛగా నా జీవితాన్ని సాగించాను. ఇంతటితో నా ఉద్యోగ దశలో ఆఖరు భాగం పూర్తి అయింది. 1910 లో నేను ఉద్యోగంలో ప్రవేశించాను. మధ్యకాలంలో ఆరు సంవత్సరాలు ఉద్యోగం చేయలేదు. అందుచేత నెల జీతం పుచ్చుకొని ఉద్యోగిగా 41 సంవత్సరాలు జీవితాన్ని సాగించినట్లు చెప్పవచ్చు.

1955, 1956 లో నేను చేపట్టిన కార్యక్రమాలలో తెలుగు భాషాసమితివారు ప్రకటించ దలచిన విజ్ఞాన సర్వస్వం లోని 'ఆంధ్ర సంస్కృతి' అనే మూడవ సంపుటానికి సంపాదకత్వం. నాతో సర్వశ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ, నేలటూరు వెంకటరమణయ్య, మోటూరు సత్యనారాయణ సంపాదకులుగా వుండినారు. మాలో సత్యనారాయణగారు రచనా కార్యక్రమంలో పాల్గొనలేదు. కాని మా అందరిపైన అజమాయిషి చేస్తూ వుండేవారు. తెలుగు భాషాసమితికి వారు కార్యదర్శులు కావడంచేత ఈలాటి పాత్రను వహించి అప్పుడప్పుడు మా కార్యకలాపాలను విమర్శిస్తూ,

సలహాలను ఇస్తూ వుండేవారు. తక్కిన మేము ముగ్గురమే వాస్త వంగా సంపాదకీయ కార్యక్రమమును జరపినవారము.

ఈ సంపుటంలో ఆంధ్ర దేశ ఆధునిక చరిత్రను గురించిన వ్యాసా లన్నిటినీ నేను వ్రాశాను. ఆంధ్ర దేశాన్ని బ్రిటిష్ వారు జయించుట, వారి పరిపాలన విధానము, అందులో కాలక్రమాన జరిగిన మార్పులు, భారత స్వాతంత్ర్యోద్యమంలో ఆంధ్రులు వహించిన పాత్ర, ఆంధ్రోద్యమ చరిత్ర—వీటిని గురించి కొంత పరిశోధన చేసి నా వ్యాసాలు వ్రాశాను. ఇదిగాక ఆంధ్ర దేశపు ఆర్థిక చరిత్రలోని కొన్ని దశలను కూడా వివరించాను. ఇతరులు వ్రాసిన వ్యాసాలను పరిశీలించి వాటిలో అవసరమైన సవరణలు చేశాను. ఈ సంపాదకత్వ బాధ్యతను నిర్వహించడంలో చాలా కాలాన్ని వినియోగించినాను.

1952 లో కేంద్రప్రభుత్వం ప్లానింగు కమీషన్ పరిశోధన కమిటీలో నన్ను సభ్యునిగా నియమించింది. దీని సమావేశాలలో పాల్గొనుటకు నేను రెండు మూడు పర్యాయాలు ఢిల్లీ వెళ్ళినాను. పంచవర్ష ప్రణాళికల ప్రధానోద్దేశం ఆర్థికాభివృద్ధి అయినా, ప్రణాళికలను అమలుపరచడం నిమిత్తం పరిపాలన విధానంలో మార్పులు జరగవలసి ఉన్నదని, వాటిని గురించి పరిశోధన జరపడం అవసర మని నేను సమావేశాలలో నొక్కి చెప్పినాను. కాని ఆర్థిక వేత్తలు కమిటీ లో ఎక్కువ సంఖ్యలో ఉండడంచేత నా అభిప్రాయానికి విలువ లేకపోయింది. సమావేశాలలో అవసరం ఉన్నా లేకపోయినా డాక్టర్ వి. కె. ఆర్. వి. రావు, డాక్టర్ గాడ్గిల్ పదే పదే మాట్లాడుతూ ఉండేవారు. సమావేశాలకు వెళ్ళడం ప్రయోజనకరంగా నాకు కనుపించలేదు. కొంతకాలమైన తర్వాత వాటికి వెళ్లుటకు మానుకొన్నాను.

కార్యాంతరం మీద 1951 లో ఒక పర్యాయం ఢిల్లీకి వెళ్ళినాను. అప్పుడు శ్రీమతి దుర్గాబాయి ప్లానింగు కమీషన్‌లో సభ్యురాలుగా ఉండినది. నన్ను కలుసుకొని, స్త్రీలవిద్యను గురించి ప్రణాళికలో ఒక అధ్యాయం వ్రాయవలసి ఉన్నదనీ, అందులో తనకు సహాయపడవలసిందిగానూ నన్ను కోరింది.

ఆ కోరికను పురస్కరించి నేను ఒక వ్యాసాన్ని వ్రాసి ఆమెకు అందజేశాను. దానిలోని అనేక భాగాలను యథాతథంగా ప్రణాళికలో తాను వ్రాసిన అధ్యాయంలో పొందుపరచుకొన్నది. ఇలాటి సహాయం నేను అనేకులకు చేశాను. 'స్వతంత్ర'కు నేను వ్రాసిన వ్యాసాలలో కొన్నిటిని ఖాసా సుబ్బారావుగారు సంపాదకీయాలుగా వినియోగించడం జరుగుతూ ఉండేది అని ఇంతకు పూర్వమే చెప్పినాను.

1952–'57 లో నేను కొనసాగించ గలిగిన కార్యక్రమాలను ఇంతవరకు వివరించాను. నేను ఇదే కాలంలో కొనసాగించ దలచి పూర్తిచేయలేని కార్యక్రమాలలో రెంటిని పేర్కొనడం అవసరం. వాటిలో మొదటిది ఢిల్లీలోని ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ వరల్డ్ అఫైర్సు (Indian Council of World Affairs) కార్యదర్శి డాక్టర్ అప్పాదొరై గారు "ఇండియా ఇన్ వరల్డ్ అఫైర్సు 1950–'51" (India in World Affairs) అనే గ్రంథాన్ని వ్రాయవలసిందిగా నన్ను కోరారు. నేను దానిని వ్రాయుటకు సమ్మతించి 1952 లో ఢిల్లీకి వెళ్ళి ఒక వారం రోజులు దానిని గురించిన వివరాలను ఆయనతో చర్చించినాను. కాని ఆలాటి గ్రంథాన్ని వ్రాయుటకు కావలసిన మౌలిక గ్రంథాలు, పత్రికలు మద్రాసులో లభ్యం కాలేదు. దానికి సంబంధించిన పరిశోధనను ఢిల్లీలోనే ఒక సంవత్సరమైనా జరపడం అవసరంగా నాకు కనుపించింది. ఇందు నిమిత్తం నేను, నా భార్య, నా పెద్ద కుమార్తె అన్నపూర్ణ 1953 లో ఢిల్లీకి వెళ్ళి ప్రథమంలో ఒక నెల రోజులు గడిపాము. ఇండియన్ కౌన్సిల్ గ్రంథాలయానికి రోజూ వెళ్ళడం, అందులో నా పరిశోధనకు సంబంధించిన గ్రంథాలను చదవడం నా దైనందిన కార్యక్రమంగా రూపొందింది. కాని నెల రోజులలో 400–500 పుటల గ్రంథాన్ని వ్రాయుటకు కావలసిన సామగ్రిని సమకూర్చు కొనడం సాధ్యం కాలేదు. కౌన్సిల్ అధికారులు నాకు ఇయ్య దలచిన ఆర్థిక సహాయంతో సంవత్సరకాలం ఢిల్లీలో నివసించడం సాధ్యం కానిపనిగా కనుపించింది. అందుచేత ఈ పరిశోధనను మానుకొని ఒక నెల తర్వాత తిరిగి మద్రాసు చేరాను. తలపెట్టిన గ్రంథాన్ని ఇందుమూలంగా వ్రాయలేకపోయినాను.

1952 లో యూరప్ ఖండంలోని నెదర్లాండ్సుకు ప్రధాన నగరమైన హేగ్ (The Hague) లో అంతర్జాతీయ రాజనీతి శాస్త్ర సభ సమావేశాన్ని ఏర్పాటుచేసి, భారత రాజనీతి శాస్త్ర సంఘం తరఫున ఒక ప్రతినిధిని దానికి పంపవలసిందిగా కోరారు. సంఘం నన్ను ప్రతినిధిగా ఎన్నుకొన్నది. సమావేశంలో చదువుటకు నేను "భారత దేశంలో స్థానిక సంస్థల పరిపాలన" (Local Government in India) అనే పరిశోధన పూర్వమైన వ్యాసాన్ని వ్రాసి పంపినాను. సమావేశ కార్యదర్శి అది సర్వ విధాలా ప్రశంసనీయమైన వ్యాసమని నాకు వ్రాస్తూ, నా ప్రయాణానికి కావలసిన ఆర్థిక సహాయం కూడా లభించగలదని తెలియ పరచాడు. నా విదేశ ప్రయాణానికి కావలసిన సన్నాహమంతా చేశాను. ప్రధానంగా కలరా, మశూచి, టైఫాయిడ్ మొదలైన రోగాలకు సంబంధించిన టీకాలు వేయించుకొన్నాను. పాసుపోర్టు, వీసాలను సంపాదించాను. కాని ప్రయాణాన్ని సాగించ లేక పోయినాను. దీనికి ప్రధాన కారణం నా ఆరోగ్యం. (దీనిని గురించే పదే పదే ప్రస్తావించి ఉన్నాను.) ఇది తిరిగి నాకు ఆందోళన కలిగించే స్థితిలోకి వచ్చింది. రోగంతో బాధపడుతూ విదేశానికి వెళ్ళడం అనుచితంగా కనుపించింది. ఇదీగాక నాకు విదేశానికి వెళ్ళి అక్కడి దుస్తులను ధరించడం, అక్కడి ఆహారాన్ని భుజించడం ఎంతమాత్రం ఇష్టంలేదు. కాని విదేశాలకు వెళ్లే భారతీయులు మామూలుగా తమ దేశంలో ధరించే దుస్తులను, తినే ఆహారాన్ని మానివేయడం మొదటినుండి జరుగుతూ ఉన్నది. మన దేశానికి వచ్చే విదేశీయులు ఈలాగు చేయడంలేదు. వారి వారి దుస్తులపట్ల, ఆహారంపట్ల అభిమానాన్ని వారు వదలు కొనడంలేదు. మనం మాత్రం వీటిని ఎందుకు వదలుకొనవలెననే ప్రశ్నకు నాకు సమాధానం లభించలేదు. మన దుస్తులతో అక్కడ పర్యటించడం వాతావరణ పరిస్థితులు కారణంగా సాధ్యం కానట్లు నాకు తోచింది. ఈ కారణాల మూలంగా నా విదేశ పర్యటనకు స్వస్తి చెప్పినాను. నా స్థానంలో కలకత్తా విశ్వవిద్యాలయంలో రాజనీతిశాఖకు ప్రధానాధ్యాపకులుగా ఉండిన డి. యన్. బెనర్జీ వెళ్ళారు. కాని దురదృష్టవశాత్తున వారు వ్యాధిగ్రస్తులై

సమావేశం జరిగిన తర్వాత స్వదేశానికి తిరిగి వచ్చినారు. అక్కడ వారు పొందిన చికిత్సలో ఏదో లోపం ఉండడంచేత వారు పాక్షిక పక్షవాతానికి గురియై, యావజ్జీవం బాధపడుతూ, చేతులతో వ్రాయ గల స్థితిలో మాత్రం ఉండడంచేత వారి రచనా కార్యక్రమాన్ని సాగించగలిగారు. నేను ఒక పర్యాయం కొన్ని సంవత్సరాలు గడిచిన తర్వాత కలకత్తా వెళ్ళినప్పుడు వారి ఇంటికి వెళ్ళి వారితో గంటకాలం ఇష్టాగోష్ఠి జరిపి వచ్చినాను. వారి కుమార్తె ఆయనను రోజూ ఎత్తుకొనివచ్చి, కుర్చీలో కూర్చోపెట్టడం తప్పేది కాదు. ఆలాగు కూర్చొని, వారు గ్రంథరచన చేస్తూ ఉన్నట్లు వారు నాతో చెప్పినారు.

విదేశ పర్యటన నేను తలపెట్టి మానుకొన్న పనులలో రెండవది.

1954 సెప్టెంబరు 27-వ తేదీన ఒక గొప్ప గండం నుండి తప్పించుకొన్నాను. మద్రాసు నుండి హైదరాబాదుకు నా స్వంత పనిమీద వచ్చి ఆనాడు రాత్రి రైలులో తిరుగు ప్రయాణం చేయుటకు మొదటి తరగతి టిక్కెట్టు కొని రిజర్వేషన్ చేయించు కొన్నాను. కాని అంతకు ముందు రెండు రోజులు భారీ వర్షం పడి, రైళ్ళు సరిగ్గా నడవడం లేదని తెలిసింది. ఆలాటి పరిస్థితులలో ప్రయాణం మానుకొనవలసిందని నా కుమారుడు ఆనందం పట్టు పట్టాడు. నేను ప్రయాణం మానుకొన్నాను. మొదటి క్లాసు టిక్కెట్టు దొరకక వెయిటింగ్ లిస్టులో (Waiting list) ఉన్న ఒక సినిమా యజమాని (చాలా ధనవంతుడు) నా స్థానంలో రిజర్వేషన్ సంపాదించి, రాత్రి రైలులో ప్రయాణం చేశాడు. కాని సికింద్రాబాదుకు 30 మైళ్ళ దూరంలో జనగామ్ స్టేషన్ సమీపాన ఉన్న ఒక వంతెన కూలిపోవడంతో ఈ రైలు నదిలో పడిపోయి, 500 ప్రయాణికులు మృతిచెందినారు. నేను నా రైలు ప్రయాణాన్ని ఆఖరు నిమిషంలో మానుకొనిన కారణంగా నాకు ఆగతి పట్టలేదు. ఈ గండంనుండి తప్పించుకొనడం నా సుకృతం అని కొందరు, నా అదృష్టమని కొందరు భావించారు. అప్పటికి నా వయస్సు 65 సంవత్సరాలు. గండం తప్పడంవల్ల నేను

ఇప్పటివరకు ( ఇప్పుడు నా వయస్సు 90 సంవత్సరాలు ) జీవించి ఉన్నాను.

1957 జనవరి 25 నా జీవితంలో ఇంకొక దుర్దినం. ఆరోజు ఉదయం నా ఎడమ కంటిలో భరించరాని బాధ ప్రారంభమైంది. ఆ బాధతోనే ఆకాశవాణికి వెళ్లి సాయంకాలానికి నా కార్యక్రమాలను ముగించుకొని ఇంటికి వచ్చాను. అంతకు ముందురోజు మా గ్రామంలోని రైతులు పంటలకు నష్టం కలిగిందని, మామూలు మక్తాలు చెల్లించడం సాధ్యం కాదని ఏదో ఒక వివాదంలోకి దిగినట్లును, దానిని వెంటనే పరిష్కరించ వలసిన అవసరం ఉన్నట్లును, అందుకుగాను నేను గ్రామానికి ఆలస్యం చేయక రావలసినట్లును నా కుమార్తె నెల్లూరునుండి తంతివార్తను పంపింది. వెళ్లని పక్షంలో నాలుగు ఐదు వేలు నష్టం కలిగేటట్లు కనిపించింది. కాని కంటి బాధతో వెళ్లడమా అనే సందేహంతో డాక్టర్లైన నా మనుమడు, మనుమరాలితో సంప్రదించినాను. నా కంటిజబ్బు ప్రమాదకరమైనదని, వారు నన్ను రాత్రి 9 గంటలకు కంటివైద్యులు రంగాచారి వద్దకు తీసుకొని వెళ్ళగా ఆయన ఏదో మందు వేసి, గ్రామంలో పని వెంటనే జరుగవలసి వుంటే వెళ్లి రావచ్చునని సలహా ఇచ్చారు. అందుచేత 26 న కారులో నా భార్య, నా మనుమరాలు డాక్టర్ లక్ష్మీదేవితో కలిసి గ్రామానికి వెళ్ళి నెల్లూరుకి వచ్చినాను. అప్పటికి నా కంటిబాధ దుర్భరమై పోయింది. ఆ స్థితిలో కారులో ప్రయాణం చేసి, మద్రాసుకు వెళ్ళడం ఉచితం కాదని నా అల్లుడు డాక్టర్ మహాదేవయ్య, లక్ష్మీదేవి ఇద్దరు సలహా ఇచ్చారు. అందుచేత నేను నెల్లూరులోనే రెండు వారాలు ఉండి అక్కడ కంటి చికిత్సను పొందినాను. కాని రోజు రోజుకు బాధ పెరగడమే కాని తరగలేదు. అందుచేత ఫిబ్రవరి 12 న మద్రాసుకు వచ్చి, డాక్టర్ను కలుసుకోగా ఆయన దృష్టి పూర్తిగా కోల్పోయినానని, దానిని తిరిగి వచ్చేటట్లు చేయడం సందేహాస్పదమని, బాధను తగ్గించుటకు మాత్రం చికిత్స చేయగలనని చెప్పినాడు.

అది మొదలు అడయారులోని మా ఇంటినుంచి రోజూ రెండు పర్యాయాలు నాలుగు మైళ్ళ దూరంలో వుండిన ఆయన

ఇంటికి వెళ్ళడం, చికిత్స చేయించుకోనడం జరిగింది. రెండు మూడు రోజులు భరింపరాని బాధ మూలంగా డాక్టర్ వద్దకు వెళ్ళలేక పోయినాను. ఆయనే మా ఇంటికి వచ్చి మందులు వేశాడు. కొంత బాధ క్రమక్రమంగా తగ్గింది. ఏప్రిల్ 22 న డాక్టర్ రోజూ రెండు పర్యాయాలు రావలసింది లేదని, ఒక పర్యాయం వస్తే చాలునని చెప్పినాడు. ఆలాగే చేస్తూ కొంత కాలం వెళ్ళబుచ్చాను. తుదకు జూన్ 19 న మద్రాసు వదలి 20-వ తేదీన సికింద్రాబాదుకు వచ్చాను. ఇంతటితో 1944 లో ప్రారంభమైన నా మద్రాసు నివాసం ముగిసింది. ఇది మొదలు సికింద్రాబాదు నివాసి అయినాను.

కంటితో బాధపడుతూ వున్న ఆరునెలల కాలంలో నా మామూలు కార్యక్రమాలను సాధ్యమైనంత వరకు సాగిస్తూనే వచ్చాను. కుడికన్ను బాగానే వుండడంచేత సమీక్షార్థం వచ్చిన గ్రంథాలను చదివి సమీక్షలు వ్రాసి పంపినాను. పరీక్షల సందర్భంలో మైసూరుకు వెళ్ళినాను. సమావేశాలలో కూడా ప్రసంగించాను. పరీక్షపత్రాలను దిద్దినాను. ఇదంతా డబ్బు ఆర్జించుటకు చేసిన పనులు. ఆర్జనను పూర్తిగా వదలుకోనడం ఇష్టం లేకపోయింది.

సికింద్రాబాదుకు వచ్చిన తర్వాత అక్కడి ఆకాశవాణిలో చేరడమా, మానడమా అనే సమస్యను గురించి ఆలోచించాను. తుదకు జూలై 25 న అందులో చేరాను. కాని ఇదివరలో చెప్పినట్లు హైదరాబాదు ఆకాశవాణిలోని పరిస్థితులు నాకు ఎంత మాత్రం నచ్చలేదు. పని వున్నా లేకపోయినా రోజూ 10 గంటలకు వెళ్లి 6 గంటల వరకు వ్యర్థంగా కాలాన్ని వెళ్ళబుచ్చటం ఇష్టం లేక పోయింది. 15 రోజులు గడిచిన తర్వాత ఆగస్టు 12 న రాజీనామా చేశాను. దీనితో నా ఉద్యోగ దశ ముగిసింది. అప్పటి నుంచి ఇప్పటి వరకు ఏ ఉద్యోగంలోను చేరక స్వతంత్రంగా నా జీవితాన్ని సాగిస్తూ ఉన్నాను.

## 9. వార్ధక్యం - ప్రథమదశ ( 1957-'61 )

నేను బొంబాయి విశ్వవిద్యాలయ అధ్యాపకత్వాన్ని వదులుకొనిన నాటికి నా వయస్సు 63 సంవత్సరాలు. సాధారణంగా 60 సంవత్సరాల వయస్సులో వార్ధక్యం ప్రారంభమౌతుందని అందరూ చెప్పడం కద్దు. అప్పటికి శారీరక దౌర్బల్యం కలిగి చేయవలసిన పనులను సకాలంలో, సక్రమంగా చేయడం సాధ్యం కాకపోతుంది. అందుచేతనే ప్రభుత్వశాఖలలోను, ఇతర సంస్థల లోను ఉద్యోగంచేసే వారిని 55-60 మధ్య ఉద్యోగాననుండి విరమింపజేసి పింఛన్ గాని, ప్రావిడెంటు ఫండునుగాని ఇచ్చి పంపివేయడం మామూలు.

నాకు వార్ధక్యం ప్రాప్తించినా స్వతంత్రంగా జీవించ దలచాను. స్వతంత్రంగా జీవించడమంటే ఇతరుల పోషణలో ఉండక, నేనే అవసరమైతే ఇతరులను పోషిస్తూ ఇంటి వ్యవహారాలపై నేనే యాజమాన్యం వహించడం. దీనికి కావలసిన ఆర్థిక స్థోమత నాకు ఉండినది. 1952-'57 మధ్య నేను ఎక్కువగా మద్రాసులో 'హిందూ' పత్రికలో ఉద్యోగిగాఉన్న నా కుమారుడు పట్టాభిరాంతో అడయారులో నా సహాయంతో వాడు కట్టించిన ఇంటిలో ఉండేవాడిని. ఇంటిపై యాజమన్యమంతా నాదే. ఇంటి ఖర్చులను నేనే భరిస్తూ ఉండేవాడిని. 1954 లో నా నాల్గవ కుమారుడు వెంకటేశ్వర్లు పోటీపరీక్షలో కృతార్థుడై ఇన్ కంటాక్సు ఆఫీసర్ గా ( Income-tax Officer ) మద్రాసుకు

కుటుంబ సహితంగా వచ్చి నావద్దనే 1956 వరకు ఉండినాడు. వాడు వాని జీతంలో నుంచి కొంతసొమ్మును ఇంటి ఖర్చుల నిమిత్తం నాకు ఇచ్చినా నేను దానిని ఈ ఖర్చులకు వినియోగించ లేదు. వాడు వచ్చిన తర్వాత అడయారులోని ఇల్లు మాకు చాలలేదు. అందుచేత వాడు ఇచ్చిన సొమ్ముతో మరికొంత సొమ్మును కలిపి ఇంటి మేడపై ఒక విశాలమైన గదిని కట్టినాను. అందుచేత ఇంటి ఖర్చుల నంతా నేనే భరిస్తూ, ఇంటిపై పూర్తి యాజమాన్యాన్ని వహించి, స్వతంత్రంగా జీవించగలిగాను.

1952-'54 లో అప్పుడప్పుడు నేను సికింద్రాబాదుకు వెళ్ళుతూ వుండేవాడిని. అక్కడే నా కుమార్లు ముగ్గురు నరసింహం, సీతారాం, ఆనందం కలిసి సమిష్టి కుటుంబంగా వుండే వారు. కాని ఆరోజులలో మొదటి ఇద్దరికి ఏలాటి ఆదాయం లేదు. ఇంటి ఖర్చునంతా నా మూడవ కుమారుడు ఆనందం భరిస్తూ వుండేవాడు. ఇది ఆనాడు వాడికి తలకు మించిన బరువుగా వుండేది. అందుచేత నేను సికింద్రాబాదు వెళ్ళినప్పుడు ఇంటి ఖర్చులలో కొంతభాగాన్ని నేనే భరిస్తూ వచ్చాను. నేను మద్రాసులో వున్నా కొంతవరకు వారికి కావలసిన బియ్యం, నెయ్యి మొదలైన పదార్థాలను మా గ్రామాననుండి పంపిస్తూ వుండేవాడిని.

1957 లో నేను సికింద్రాబాదులో నివసించుటకు ప్రారంభించినా తరుచుగా మద్రాసుకు, నెల్లూరుకి వెళ్ళుతూ వుండే వాడిని. మద్రాసులో నా కుమారుడు పట్టాభిరాం హిందూ పత్రికలో చాలీచాలని ఆదాయంతో ఒక ఉద్యోగిగా వుండేవాడు. వాడి కుటుంబాన్ని పోషించే బాధ్యతను నేనే వహించాను. అందు చేత నేను తరుచుగా అక్కడికి వెళ్లి కొన్ని వారాలపాటు ఉండడం తప్పేదికాదు. బొంతలపాలెం గ్రామంలోని నా భూములు గురించి 1957 నుండి ఒక క్లిష్ట పరిస్థితిని ఎదుర్కొనవలసి వచ్చింది. ఆ కారణంచేత నేను అప్పుడప్పుడు నెల్లూరుకి వెళ్లి, గ్రామంలోని పరిస్థితులను చక్కబెట్టుకొనవలసి వచ్చింది.

ఆనాడు దేశంలో ఏర్పడిన కాంగ్రెసు ప్రభుత్వాలు ప్రతి రాష్ట్రంలోను భూమికమతాలను గురించి, కౌలుదారీ విధానాన్ని

గురించి కొత్త చట్టాలను చేయుటకు తలపెట్టినవి. భూమి కమతాలకు ఒక గరిష్ఠ పరిమితిని నిర్ణయించి, అంతకు పైబడిన భూవసతుల కలవారి భూములను వశపరచుకొని, వాటిని భూమిలేని వారికి పంచిపెట్టడం మొదటి రకపు చట్టాల ఉద్దేశం. దేశంలో భూవసతి విషయంలో కొందరికి వందలు, వేలు ఎకరాలకు మించిన భూవసతులు ఉండడం, మరికొందరికి బొత్తిగా భూములు లేక పోవడం ఆర్థిక సమత్వాన్ని ప్రతిపాదించే సోషలిస్టు సిద్ధాంతానికి పరమ విరుద్ధమనీ, అలాటి తరతమ భేదాలను తొలగించినప్పుడే సాంఘిక న్యాయం చేకూరగలదని కాంగ్రెసు లక్ష్యం. దేశంలో సోషలిస్టు విధానాన్ని ప్రవేశపెట్టడమనేది ఈ చట్టాలకు ఆధారం. ఈలాటి చట్టాన్ని చేసి అమలు పరచిన పక్షంలో నాకు మా గ్రామంలో ఉండిన 40 ఎకరాల మంచి మాగాణి భూములలోను, 15 ఎకరాల మెట్టభూములలోను నాకు మిగిలేది 10 ఎకరాలకు మించి ఉండదు.

నేను ఈ భూములను పిత్రార్జితం ద్వారా సంపాదించిన వాడను కాను. నా ఉద్యోగకాలంలో కష్టపడి పనిచేసి, దాని ఫలితంగా లభించిన ఆదాయంలో కొంత భాగాన్ని కూడబెట్టుకొని, దానితో సంపాదించినట్టిది. ఇది నా కష్టార్జితమైనట్టిది. జమీందార్ల భూములవంటిది కాదు. కష్టార్జితమైన భూములను ప్రభుత్వం వశపరచుకొనడమూ, వశము చేసుకొన్న భూములకు నామకమైన నష్టపరిహారాన్ని చెల్లించడమూ ఎలాటి సాంఘిక న్యాయమో నాకు బోధపడలేదు. ఇంతేకాదు, వర్తక వ్యాపారాలు చేసి పరిశ్రమలను స్థాపించిన సాహుకార్లు లక్షలు, కోట్లు సంపాదించిన వా రెందరో దేశంలో ఉన్నారు. వారి ఆస్తులకు ఎలాటి పరిమితినీ విధించక భూకమతాలకు మాత్రమే పరిమితిని విధించడం న్యాయం కాజాలదని నేను భావించాను. తక్కిన భూస్వాము లందరు అలాగే భావించి, వారి భూములను చట్టం రాకముందే కుమాళ్ల మధ్య, ఇతర దగ్గర బంధువుల మధ్య బినామీగా పంచిపెట్టసాగారు. నేను కూడా నా భూములను నా ఏడ్గురు కుమాళ్ళమధ్య పంచిబెట్ట దలచాను. కాని ఇది క్రియారూపం ధరించుటకు పూర్వం ఆనాడు ఆంధ్రప్రదేశ్ లో రివిన్యూ మంత్రిగా ఉండిన కళా వెంకట్రావుగారిని

కలుసుకొన్నాను. అప్పుడు వారు ఈలాటి చట్టం ఒకటి చేయబడినా నా కుటుంబం పెద్దది కావడంచేత అది నాకు వర్తించదని ఒకవిధమైన విశ్వాసాన్ని కలిగించారు. అంతటితో నా భూములను కుమాళ్లమధ్య పంచిపెట్టే ప్రయత్నం మానుకొన్నాను.

తర్వాత ప్రభుత్వం గరిష్ఠ ప్రమాణాలను విధిస్తూ చట్టం చేసింది. కాని దీనిని అమలుపరచడంలో అధికారులు ఏలాటి శ్రద్ధను వహించలేదు. వారిలో బహుళ వ్యాప్తిని గాంచిన అవినీతి దీనికి ప్రధాన కారణం. ఈలాటి చట్టాలను అమలుపరచే అధికారులు అవినీతి పూర్వంగా ధనాన్ని ఆర్జించుటకు ఇది ఎక్కువగా వినియోగమౌతున్నది. చట్టాల ప్రధానాశయం నెరవేరడంలేదు. మంత్రులు మొదలైన పరిపాలకవర్గాలవారు భూస్వాములు కావడంచేత ఉద్యోగాలపై క్రమశిక్షణ చర్యలను తీసుకొనడంపట్ల ఏలాటి ఆసక్తిని చూపడంలేదు. కేంద్ర ప్రభుత్వాన్ని తృప్తి పరచుటకు, ప్రజాభిప్రాయాన్ని తమవైపు త్రిప్పుకొని ఎన్నికలలో వోట్లను సంపాదించుటకు పరిపాలకులు ఈ చట్టాలను చేయడం జరుగుతూఉన్నది. అది ఈనాటి పరిపాలన విధానానికి ఒక లక్షణం.

ప్రభుత్వం తలపెట్టిన రెండవ రకపు చట్టాలు కౌలుదారీ విధానానికి సంబంధించినట్టిది. భూస్వాములలో కొందరు స్వయంగా తమ భూములను వ్యవసాయం చేయక, రైతులకు కౌలుకు యిచ్చి, వారివద్దనుండి ఏటేటా మక్తాలు వసూలుచేయడం మామూలు. కష్టపడి పనిచేసేవారు రైతులుగాను, వాని ఫలితాలలో చాలా భాగాన్ని ఏలాటి కష్టము చేయక ఉండే భూస్వాములుగాను వుంటూ వచ్చారు కౌలుదారీ చట్టాలు రైతులకు న్యాయం చేకూర్చుటకు ఉద్దేశింపబడి నట్టివి 'దున్నే వాడిదే భూమి' అనే సూత్రం దీనికి ఆధారం. వీటిఫలితంగా భూస్వాములు రైతులవద్ద నుండి వసూలు చేసే మక్తాలకు ఒక పరిమితి విధింపబడినది. ఇంతేగాక ఆరు సంవత్సరాలు ఒక పొలాన్ని వరుసగా సేద్యం చేస్తున్న రైతులను దానినుండి తొలగించుటకు వీలు లేదని విధింపబడినది. దీనిమూలంగా నా వంటి భూస్వాముల ఆదాయం చాలా వరకు తగ్గిపోయే ప్రమాదం ఏర్పడింది.

ఈ నష్టాన్ని ఎదుర్కొనుటకు అనాలస్యంగా తీసుకొనవలసిన చర్యలను తీసుకొనే అవసరం నాకు కలిగింది.

దీనిని తీర్చుకొనుటకు కష్టపడి సంపాదించిన నా భూములను ఏదోవిధంగా అమ్మివేయుటకు సిద్ధపడినాను. ఆరోజులలో మా గ్రామంలో ఎకరా ఖరీదు అయిదారు వేల రూపాయలుగా ఉండేది. కాని నా రైతులను వారు సేద్యంచేసే భూములనుండి తొలగించి, ఇంతటి ఖరీదుకు వాటిని అమ్ముట కష్ట సాధ్యమైంది. ఆ పరిస్థితులలో ఏదో ఒక ధరకు నా రైతులకే వారు సేద్యంచేసే భూములను అమ్మివేయుటకు నిర్ణయించుకొన్నాను. వారు రెండు, మూడు వేల రూపాయలకంటె ఎక్కువ ధరను ఇచ్చుటకు అంగీకరించరైరి. అందుచేత వారు ఏ ధర ఇయ్యగలిగితే ఆ ధరకే వాటిని అమ్ముటకు సిద్ధపడ్డాను. ఇందుకుగాను తరుచుగా నేను మా గ్రామానికి వెళ్ళి, ఒక్కొక్క రైతుతో సంప్రదించి, భూముల అమ్మకాన్ని సాగించాను. ఈ కార్యక్రమం పూర్తి అగుటకు రెండు, మూడు సంవత్సరాలు పట్టినది. విక్రయ పత్రాలను వెంటనే రిజిస్టరు చేయుటకు రిజిస్ట్రారు అంగీకరించే వాడు కాదు. రిజిస్ట్రార్లు కూడా తమకు లభించవలసిన మామూళ్లను వసూలు చేసేవారు. ఆ మామూళ్లను వారికి చెల్లించి ఏలాగో పత్రాలను రిజిస్టరు చేశాను. ఇదంతా ఆరోజులలో ఉద్యోగ వర్గాలలో వ్యాపించిన అవినీతికి తార్కాణాలు. జీతాని కంటె ఈలాటి పై సంపాద్యం వారికి ఎక్కువ ఆకర్షణీయంగాను, లాభ కరంగాను ఉండేది. ఈవిషయంలో వారిలో ఈనాటి వరకు ఎలాటి మార్పూ రాలేదు. దేశంలో ఈ అవినీతి సర్వవ్యాప్తంగా రూపొందింది. అధికారాన్ని మంత్రులు మొదలు క్రింది తరగతికి చెందిన ఉద్యోగుల వరకు ప్రజల శ్రేయస్సుకుగాక నీతి నియమా లతో నిమిత్తంలేక ధనార్జన చేయుటకు వినియోగించడం పరిపాటి అయింది.

దీనికి ఆనాడు మా గ్రామంలో ఇంకొక తార్కాణం కూడా ఉండేది. గాంధీమహాత్ముని ఆదేశానుసారం ప్రభుత్వం మద్య పానాన్ని నిషేధిస్తూ చట్టాన్ని చేసింది. కాని దానిని అమలు పరచుటకు నియమింపబడిన అధికారులు అవినీతికి లోబడినవారు

కావడంచేత త్రాగుడు వృద్ధిగాంచినదే గాని ఏమాత్రం తగ్గ లేదు. మా గ్రామానికి వెళ్ళే మార్గంలో తాటిచెట్లు అనేకం ఉండేవి. వాటి మోావులపైన కల్లుకుండలు కట్టి ప్రతిరోజూ సాయంకాలం ఆ చెట్ల చుట్టూ 50, 60 మంది చేరి బాహాటంగా కల్లు త్రాగుతూ ఉండేవారు. అధికారులు వీరిపై ఎలాటి చర్యలను తీసుకొనేవారు కారు. ఇదిగాక గ్రామంలోపల కల్లు గీయడమే కులవృత్తిగా గల నాలుగైదు కుటుంబాలవారు దొంగ సారాయిని తయారుచేసి, దానిని రహస్యంగా అమ్మడం పరిపాటి అయింది. దీనిఫలితంగా స్త్రీలు, పిల్లలు సారాయి త్రాగుటకు అలవాటు పడినారు. సారాయిని తయారుచేసేవారు ప్రతినెలా పోలీసువారికి రెండు మూడు వందలు చెల్లించేవారు. వారిపై ఒక్కొక్కప్పుడు నేరారోపణ చేయడం, మాజిస్ట్రేటులు వారిని విచారణ చేసి 20, 30 రూపాయల జరిమానాను విధించడం జరిగేది. వారి ఖర్చులలో ఇది ఒక పద్దుగా వారు భావించేవారు. దీనిఫలితంగా వారు దొంగ సారాయిని తయారు చేయడం మానుకొనలేదు. ఈలాటి పరిస్థితులలో మద్యపాన నిషేధమునకు సంబంధించిన చట్టాలను చేయడం నిరర్థకమని క్రమక్రమంగా ప్రభుత్వం గ్రహించి, వాటిని రద్దుచేసింది. కాని 1977 లో జనతా ప్రభుత్వం ఏర్పడిన తర్వాత మద్యపాన నిషేధాన్ని తిరిగి ప్రవేశపెట్టే ఉద్దేశంతో ఈలాటి చట్టాలు చేయ బడుతున్నవి. అవి ఎంతవరకు ఆచరణ సాధ్యమో చెప్పడం కష్టసాధ్యం. గతకాలంనాటి అనుభవం అది సాధ్యం కాజాలదని స్పష్టం చేస్తూ ఉన్నది. ప్రజలలో హృదయపరివర్తన జరిగితే తప్ప చట్టాల మూలంగా ఏలాటి ప్రయోజనమూ లభించదు. ఆలాటి పరివర్తన జరుగుటకు కావలసిన చర్యలను ప్రభుత్వం గాని, మతప్రచారకులుగాని, ఇతరసంస్థలుగాని తీసుకొనడంలేదు. అన్నివర్గాలలో ఈనాడు నీతి నియమాల ప్రభావం శూన్యమైంది. ఇది విషాదకరమైన పరిణామం. యాదవులలో ముసలం బయలు దేరి వారి వినాశనానికి దారితీసినట్లు దేశంలో ఈనాడు రకరకము లైన విపరీత పరిస్థితులు తలలెత్తుచున్నవి. నిర్భయంగా చట్ట

ధిక్కారంచేసి, శాంతి భద్రలకు ప్రమాదం కలిగించేవారి సంఖ్య పెరుగుతూ ఉన్నది.

1961 నాటికి బొంతలపాలెంలోని నా భూములతో పాటు ఇంటిని కూడా అమ్మివేశాను. దానితో 30 సంవత్సరాల కాలం నాకు ఆ గ్రామంతో ఉన్న సంబంధం తెగిపోయింది. మామిడి పూడి, పురిణి గ్రామాలతో సంబంధం కూడా ఆనాటికి తెగి పోయింది. నేను పూర్తిగా నగరవాసి నైనాను.

కౌలుదారీచట్టాల వంటి చట్టాలు ఒక వర్గానికి చెందిన భూస్వాములందరికి వర్తించేవి. వ్యక్తుల విషయంలో ఏలాటి మినహాయింపులూ ఉండేవి కావు. ఇది చట్టాలన్నిటికీ ఒక లక్షణం. నేను తక్కిన భూస్వాములవంటివాడను కాను. నావద్ద కౌలుకు పుచ్చుకొని, నా భూములను సేద్యం చేసే రైతులకు అనేక విధాలుగా సహాయపడుతూ ఉండేవాడిని. ఇంజనీరులతో సంప్ర తించి రెండో కారుకు కావలసిన నీటిపారుదల జరిగేటట్లు నా పలుకు బడిని వినియోగించేవాడిని. రైతుల ఉపయోగార్థం రసాయనిక ఎరువులను (ఇవి అప్పుడే కొంతవరకు ఉపయోగంలోకి వస్తూ ఉండేవి) సరఫరా చేసేవాడిని. వారికి కావలసిన ఋణాలను స్వల్ప వడ్డీలకు ఇస్తూ ఉండేవాడిని. సహకార సంస్థలు ఉండినా వాటి మూలంగా రైతులకు ఎక్కువ సదుపాయాలు సకాలంలో లభించేవి కావు. రైతులకు కావలసిన ఋణాలలో పది శాతం కూడా ఈ సంఘాలు ఇయ్యగల స్థితిలో ఉండేవి కావు. సంఘా లకు పలుకుబడి గల భూస్వాములే డైరెక్టరులై, తామే వాటినుండి ఋణాలను తీసుకొని, పత్రాలను ఇతరుల పేరట వ్రాయించడం జరుగుతూ ఉండేది. సంఘాల వ్యవహారాలు ఈలాగు పరిణ మించడంచేత రైతులు సాహుకార్ల వద్దనుండి ఋణాలు ఎక్కువ భాగం తీసుకోవడం తప్పేది కాదు. ఈలాటి పరిస్థితులలో భూస్వామిగా నేను నా రైతులకు సహాయపడుతూ ఉండేవాడినే గాని, వారిని స్వార్థానికిగాను దోచుకొనేవాడను కాను. అయినా కౌలుదారీచట్టం నావంటి వారికి కూడా వర్తించడంచేత నేను కష్టపడి ఆర్జించిన భూములను ఏదోవిధంగా అమ్మివేయ వలసి వచ్చింది.

ఈలాటి పరిస్థితులనే నెల్లూరులో నేను కష్టపడి కట్టిన ఇంటి విషయంలో ఎదుర్కొనవలసినవాడనైనాను. యుద్ధకాలంలో ప్రభుత్వం దానిని వశపరచుకొని, తక్కువ అద్దెకు దానిని ప్రభుత్వ శాఖలలో పని చేసే ఉద్యోగులకు ఇచ్చింది. యుద్ధం ముగిసిన తర్వాత కూడా ఇంటిని నా స్వాధీనం చేయలేదు. అద్దెను పెంచడం కూడా నాకు సాధ్యం కాలేదు. రెవిన్యూ మంత్రి కళా వెంకట్రావుగారిని ఈవిషయంలో సహాయం పడవలసిందిగా కోరాను గాని వారు సహాయం చేయలేదు. ఈలాగు కొన్ని సంవత్సరాలు గడిచిన తర్వాత నెల్లూరులోని ఒక మైకా వర్తకుడు దానిని కొనుటకు సిద్ధపడ్డాడు అద్దెకు ఉన్నవారిని తొలగి చే బాధ్యతను తానే వహించేటట్లు అంగీకరించాడు. ఈ కారణం చేత ఇంటిని కొంచెం తక్కువ ధరకు అతనికే అమ్మినాను.

ఈవిధంగా గ్రామంలోను, నగరంలోను నాకు ఉన్న స్థిరాస్తిని విక్రయించి, విక్రయధనంతో సికింద్రాబాదులో నాలుగు వాటాలతో కూడిన ఒక ఇంటిని కట్టాను. దీనిని కట్టుటకు ఒక సంవత్సరం పట్టింది. తర్వాత నాలుగు వాటాలను నలుగురికి అద్దెకు ఇచ్చినాను. ఈనాడు ఈ అద్దెలే నా ఆదాయంలో ప్రాధాన్యం వహిస్తున్నవి. భూములనుండి నాకు లభిస్తున్నంతటి ఆదాయం అద్దెల మూలంగా రాక పోయినా ఏదో కొంత ఆదాయం లభించడంచేత నేను తృప్తిగానే కాలక్షేపం చేస్తూ ఉన్నాను.

1952 లో బొంబాయి విశ్వవిద్యాలయ ఉద్యోగాన్ని వదలుకొనిన తర్వాత నేను అప్పుడప్పుడు హైదరాబాదుకు వెళ్లుతూ వుండినా అక్కడ నా స్థిరనివాసం ఏర్పడలేదు. చాలాభాగం మద్రాసులోని అడయారులో గడిపాను. 1961 వరకు నాతో కూడ నా అయిదవ కుమారుడు 'హిందూ' పత్రికలో ఒక ఉద్యోగిగా వున్నా వాడి కుటుంబాన్ని నేనే పోషిస్తూ వచ్చాను. అడయారు లోని ఇల్లు వాడి పేరట వుండినా స్థలాన్ని కొనుటకు, ఇల్లు కట్టుటకు నేనే కొన్ని వేలు పెట్టుబడి పెట్టినాను సహకార సంఘానికి ప్రతినెలా చెల్లించవలసిన 140 రూపాయిలను నేనే చెల్లిస్తూ

వచ్చాను. ఈ పరిస్థితులలో ఇంటిపై యాజమాన్యం నాదిగానే వుండేది. నేను స్వతంత్రంగా జీవిస్తూ వుండినాను.

1961 లో మా వాడిని కలకత్తాలో ప్రత్యేక విలేఖరిగా 'హిందూ' పత్రికాధిపతులు నియమించారు. మే 12 న వాడు కుటుంబ సహితంగా కలకత్తాకు వెళ్ళిపొయ్యాడు. అటుతర్వాత కూడా నేను, నా భార్య కొంతకాలం అడయారులో వుండినాము. వార్ధక్యంలో కూడా ఇతరుల పోషణతో నిమిత్తంలేక స్వతంత్రంగా జీవించడమే ఉత్తమ విధాన మనేది నా అభిప్రాయం. కుమాళ్లు, కోడండ్రు, కుమార్తెలు, అల్లుండ్రు నా ఇంటికి వచ్చి కొంతకాలం గడపడం వాంఛనీయమని, నేను కుమాళ్ళ పోషణలో వుండడం అంతటి వాంఛనీయంకాదని నేను భావించాను. దీనికి కావలసిన ఆదాయం నాకు ఉండేది. కుమాళ్ల, కోడండ్ర విషయం నేను ఎక్కువగా పట్టించుకొనలేదు. కాని నా కుమార్తెలు వారిలో ప్రధానంగా నా ఆఖరు కుమార్తె వైదేహి అప్పుడప్పుడు పుట్టింటికి వచ్చి కొన్నిరోజులపాటైనా నా సమక్షంలో గడపడానికి నేను అడయారులో కాపురం ఉంటే ఎక్కువ అవకాశము ఉండేది. అది ఆమెకు, నాకు, నా భార్యకు ఎక్కువ తృప్తిని కలిగించేది. నేను హైదరాబాదులో నా కుమారుడు ఆనందం పోషణలో ఉండిన పక్షంలో ఈ అవకాశం నా కుమార్తెలకు లభించేదికాదు. సోదరులకు, వారి భార్యలకు ఎంత అభిమానం ఉండినా అది తల్లి దండ్రుల అభిమానం వంటిది కాజాలదు. పుట్టింటిలో ఉండే ఆనందం వారికి లభించదు.

కాని నేను అనేక దీర్ఘవ్యాధులకు గురికావడంచేత అడయారులో కాపురం ఉండడం సాధ్యం కాలేదు. మద్రాసులో లెక్కకు మించిన వైద్యులు ఉండినా వారి చికిత్సను పొందడం భరింపరాని ఖర్చుతో కూడుకొన్నది. వ్యాధిగ్రస్తుడను కావడంచేత వారి సహాయం ప్రతిరోజూ అవసరమౌతూ వచ్చింది. హైదరాబాదు లోని పరిస్థితులు దీనికి భిన్నమైనట్టివి. అక్కడ నా మనుమరాలు లక్ష్మీదేవి, నా మనుమడు వెంకటేశ్ వైద్యులుగా ప్రభుత్వ ఆస్పత్రిలో ఉద్యోగంచేస్తూ మా ఇంటిలోనే ఉండేవారు. తర్వాత నా మనుమరాలు కృష్ణవేణి కూడ వైద్యశాస్త్రంలో ఉన్నత డిగ్రీని

సంపాదించి, అక్కడే ఉద్యోగం చేయసాగింది. నాకు ఏలాటి ఖర్చూలేక, వీరు ముగ్గురు సర్వదా నా అందుబాటులో వుండినారు. అందుచేత నేను అడయారు కాపురాన్ని మానుకొని హైదరాబాదులోని నా మూడవ కుమారుడు ఆనందం పోషణలో వుండవలసి వచ్చింది.

పోషణ విషయంలో నాకు గాని, నా భార్యకు గాని ఏలాటి లోపం వుండేదికాదు. ఇందులో మా దంపతులు ఇద్దరిపట్ల నా కుమారుడు సీతారాం, భార్య రాధ, ఆనందం భార్య సీత కడు శ్రద్ధ వహిస్తున్నారు. రోగపీడితులమైన మాకు సకాలంలో చికిత్స చేయించడంలోను, మందులు ఇవ్వడంలోను, ఇతర సౌకర్యాలను సమకూర్చడంలోను మాకు ఏలాటి లోపం లేకుండా వారు జాగ్రత్త వహిస్తున్నారు. అలాటి కోడండ్రు మాకు లభించడం మా అదృష్టమని నేను భావిస్తూ వుంటాను.

మా కుమారుడు ఆనందం పోషణకర్త కావడంచేత ఇంటిపై పూర్తి యాజమాన్యం వాడే వహించడం సహజం. నేను కుటుంబానికి పెద్దవాడనైన కారణంగా యాజమాన్యం నాకు వుండవలెనని నేను వాంఛించడంలేదు. ఇది ఒకవిధంగా నా స్వాతంత్ర్యానికి భంగం కలిగించినా ఇది సహజమైన పరిణామమనే భావంతో నేను జీవిస్తున్నాను. ఒక్కొక్కప్పుడు ఇంటి వ్యవహారాలు నా అభిమతానికి అవ్యథగా ఉన్నా, నేను వాటిని గురించి ఏలాటి జోక్యం కలిగించుకొనడంలేదు. ఈలాగు జోక్యం కల్గించుకొనడం నా ప్రకృతికి విరుద్ధం. కుమాళ్లు పెద్దవారైన తర్వాత వారి వ్యవహారాలలో జోక్యం కలిగించుకొనడం ప్రాజ్ఞత కాదనే భావానికి నేను పూర్తిగా కట్టుబడి ఉన్నాను. అందుచేత మా మధ్య ఏలాటి మనస్పర్థలు కలగడంలేదు.

1957 తర్వాత నేను అనేక వ్యాధులకు గురి అయ్యాను. అవి నేను తలపెట్టిన కార్యక్రమాలలో కొన్నిటికి విఘ్నం కలిగించాయి. మరికొన్నిటికి వాటిమూలంగా నేను తృప్తికరంగా సాగించలేకపోయినాను. వాటిని గురించి ఇదివరలో రెండు మూడు పర్యాయాలు ప్రస్తావించినా తిరిగి ప్రస్తావించడం అవసరమని భావిస్తున్నాను.

1957 లో ఎడమకంటి దృష్టిని కోల్పోయాను. అందుచేత ఒక కంటితోనే నేను నా కార్యకలాపాలను సాగించవలసివచ్చింది. దాని ఫలితంగా 1957 జూలైలో కేంద్రప్రభుత్వ ఉద్యోగాలకు జరిగే పోటీపరీక్ష పత్రాలను అభ్యర్థులకు న్యాయం చేకూరేటట్లు దిద్ది మార్కులు వేయడం సాధ్యంకాదని భావించి వాటిని దిద్దకుండా అధికారులకు వాపసుచేసినాను. ఇదే కారణంచేత దూరప్రయాణం చేయవలసిన బరోడా, బొంబాయి, పూనా, మైసూరు వంటి విశ్వ విద్యాలయాలతో సంబంధాన్ని వదలుకొన్నాను. ఆర్థికంగా ఇది నాకు నష్టం కలిగించినా, నా అనారోగ్య పరిస్థితిలో పరీక్షాధికారి పదవివంటి బాధ్యతతోకూడిన కొన్ని పనులను నిర్వహించరాదనే భావంతో ఈలాగు చేశాను.

నేను ఇదివరలో చాలాకాలం నుండి ఫైలేరియా జ్వరంతోను, కడుపులోని వ్రణం మూలానను చాలా బాధపడుతూ ఉండేవాడిని. 1957 తర్వాత ఫైలేరియా జ్వరం తరుచుగా నన్ను పీడించేది. కడుపులోని వ్రణం పగిలి విస్తారంగా రక్తస్రావం జరిగేది. దానిచికిత్సకుగాను నాలుగైదు పర్యాయాలు నన్ను ఆసుపత్రిలో చేర్చి వారం పది రోజులు అక్కడ ఉంచినారు. రక్తస్రావానికి విరుగుడుగా డాక్టర్లు ఇతరులు దానంచేస్తే సేకరింపబడిన రక్తాన్ని నా రక్తనాళాలలోకి ఎక్కించేవారు. దీనికి రెండు మూడు గంటలు పట్టేది. ఈ మధ్యకాలంలో దుర్భరమైన చలి సంభవించేది. శరీరాన్ని మంచుగడ్డలో పూర్తిగా కప్పబడిన పరిస్థితి ఏర్పడేది. అప్పుడు చలి తగ్గేవరకు రక్తాన్ని ఎక్కించడం ఆపి అటుతర్వాత దానిని తిరిగి ప్రారంభించి పూర్తిచేసేవారు. నాకు తిరిగి బలం చేకూరేవరకు పూర్తి విశ్రాంతితో ఆసుపత్రిలో ఉండేవాడను.

పదే పదే ఈ రక్తస్రావం జరగడం నాకు ఆందోళన కలిగించింది. దాని నివారణకు శాశ్వతమైన చికిత్స ఏదైనా వుండిన పక్షంలో దానిని చేయించుకొనుటకు హైదరాబాదులో ప్రఖ్యాతి గాంచిన వెంకటేశ్వరరావు అనే డాక్టరు సలహాను కోరినాను. ఆయన ఎక్స్‌రే సహాయంతో నన్ను పూర్తిగా

పరీక్షించి, ఈ వ్యాధి నివారణకు అనేకులు శస్త్రచికిత్స చేయడం పరిపాటి అయినా నావిషయంలో అది ప్రమాదకరమని భావించి కొన్ని వారాలపాటు ద్రవరూపమైన ఆహారాన్ని (Liquid diet) తీసుకోనవలసిందిగా సలహా ఇచ్చి ఒకటి రెండు మందులను వాడ మన్నారు. నేను అలాగే చేశాను. క్రమక్రమంగా ఆ వ్యాధి తగ్గింది. నాలుగైదు సంవత్సరాలుగా అది అదృశ్యమైంది.

1963 ప్రాంతాన ఇంకొక వింత వ్యాధికి నేను గురి అయినాను. అది సోకినప్పుడు ప్రపంచమంతా గిరగిర తిరుగుతూ వున్నట్లూ, నేను మంచంమీద నుండి నేలమీదికి పడిపోయినట్లూ, ఇంకా పడిపోతున్నట్లూ ఒక భ్రమ కలిగేది. అప్పుడు ఇద్దరు ముగ్గురు నా తలను, శరీరాన్ని గట్టిగా పట్టుకోనడం అవసరమయ్యేది. 10, 15 నిమిషములు గడచిన తర్వాత ఈ భ్రమ తొలగి పొయ్యేది. కాని నాలుగైదు రోజుల వరకు చాలా బలహీనంగా ఉండేవాడిని. ఏ పని చేయుటకు శక్తి వుండేదికాదు. ఏదో పైత్య జబ్బుకు ఇచ్చే మందును నాకు ఇచ్చేవారు. దీనిమూలంగా ఏలాటి లాభం కలుగలేదు. డాక్టరును వెంటబెట్టుకోనిగాని స్థలాంతరాలకు వెళ్ళడం సాధ్యం కాకపోయింది. ఈ విధంగా నాలుగైదు సంవత్సరాలు బాధ పడిన తర్వాత ఈ జబ్బు అదృశ్య మైంది. నాలుగైదు సంవత్సరాలుగా ఇది నాకు సోకలేదు. ఈ వ్యాధికి వర్టిగో (Vertigo) అని పేరు. 1974 లో ఇంకొక వ్యాధికి గురియై ఈనాటి వరకు దానిమూలగా బాధపడుతూ ఉన్నాను. నా వెన్నెముకలో ఏదో లోపం ఉండడంచేత ఇది సంభవించినట్లు డాక్టర్లు చెప్పినారు. దానిమూలంగా నడుములో, వీపులో భరింపరాని బాధ బయలుదేరింది. క్రమక్రమంగా అది కాళ్ళకు, పాదాలకు వ్యాపించింది. అతురాలా నేను మంచంపట్టిన వాడనైనాను. ఒక దశలో ఆరు నెలలపాటు పడకలోనే మల మూత్రాల విసర్జన చేయడం అవసరమైంది. లేచి కూర్చుండడం గాని, నిలబడడంగాని సాధ్యం కాకపోయింది. 24 గంటల కాలం వెల్లకిల పడుకొని జీవించవలసి వచ్చింది. డాక్టర్లు ఇచ్చిన మందులు, చేసిన యింజక్షనులు ఏలాటి ప్రయోజనమును కలిగించలేదు. ఈవిధంగా ఆరు నెలలు గడిపిన తర్వాత

కూర్చుండ గలిగినాను. క్రమక్రమంగా లేచి నిలబడ గలిగాను. అటుతర్వాత పది అడుగులు వేయగలిగాను. పడకలో ఒక వైపునుండి ఇంకొకవైపునకు తిరగ గలిగాను.

ప్రస్తుతం స్నానాల గదికి వెళ్ళి స్నానం చేయగల శక్తి, భోజనాల గదికి వెళ్ళి కూర్చీమీద కూర్చుండి అందరితో భోజనం చేయగల శక్తి, కారులో కూర్చుని ఒకటి రెండు మైళ్ళు ప్రయాణం చేయగల శక్తి లభించినవి. కాని నేలమీద కూర్చుండ లేను. ఈవిధంగా 1974 తర్వాత మంచంమీద పడుకొనే నా గ్రంధరచనను సాగించాను. ఇదీ నా వ్యాధుల చరిత్ర. నా జీవితంలో 1925 నుండి దీనికి ప్రాధాన్యం కలిగింది. (ప్రస్తుతం 6 నెలలుగా పూర్వంవలెనే అక్షరాలా మంచంపట్టి ఉన్నాను. లేచి నిలబడడం, నడవడం సాధ్యం కావడం లేదు. 12-3-80.)

1957-'61 లో పేరుకు మాత్రమే నేను హైదరాబాదు నివాసినైనాను. ఆగష్టు 12-వ తేదీన ఆకాశవాణి ఉద్యోగాన్ని విరమించుకొనిన తర్వాత నా స్వంతవ్యవహారాల పరిష్కార మునకై తరుచుగా మద్రాసుకు, నెల్లూరుకి వెళ్లుచుండేవాడిని. 1957 ఆగష్టు 16 న నా ఆఖరు కుమారుడు సింహాచలానికి నా మనుమరాలు నారాయణితో (నా పెద్ద కుమార్తె అన్నపూర్ణ కూతురు) వివాహం నెల్లూరులో అతివైభవంగా జరిగింది. మా కుటుంబంలో నివారు, దగ్గరబంధువులు, స్నేహితులు ముహూర్తానికి, సాయంత్రం ఏర్పాటు చేయబడిన స్వల్పాహారవిందుకు వచ్చి వధూవరులను ఆశీర్వదించారు. ఈ వివాహం నిమిత్తం నేను రు. 4000 లు ఖర్చు పెట్టాను. దీనితో నా పిల్లల పెండ్లిండ్లు పూర్తి అయినవి. పెండ్లిండ్లకు గాను నేను ఎవరికీ వరదక్షిణ లియ్య లేదు. వాటిని పుచ్చుకొన లేదు. నేను చేసిన వివాహాలన్నీ మా శాఖకు చెందిన వారితోనే చేశాను. నా తమ్ముడు రామ కృష్ణయ్య ఏడ్గురు కుమార్తెలలో అయిదుగురికీ, కుమాళ్లలో ముగ్గు రికి శాఖాంతర వివాహాలు చేశాడు. ఈవిషయంలో వాడు వాడి మామగారైన అల్లాడి మహాదేవశాస్త్రి వేసిన మార్గంలోనడిచాడు. (వీరు నా పెదమామగారు) శాస్త్రిగారు ప్రథమంలో వేదాధ్యయనం

చేసి, సంస్కృతంలో గొప్పపాండిత్యాన్ని సంపాదించి, తర్వాత ఇంగ్లీషు చదివి, విశ్వవిద్యాలయ పట్టభద్రులై, మైసూరు సంస్థానంలో ప్రాచ్య లిఖిత గ్రంథాలయానికి (Oriental Manuscripts Library) అధిపతిగా ఉద్యోగం చేసేవారు. వీరు దివ్యజ్ఞాన సభలో సభ్యులై గొప్ప సంఘ సంస్కర్తలుగా ప్రఖ్యాతి గాంచినారు. ఉపనిషత్తులకు శంకరాచార్యులు రచించిన వ్యాఖ్యానాన్ని ఇంగ్లీషులో అనువాదము గావించి ప్రపంచ ప్రఖ్యాతిని సంపాదించినారు. వారి కుమార్తెలలో ఇద్దరికీ, కుమాళ్లలో ఒకనికీ శాఖాంతర వివాహాలు చేశారు. పింఛన్ పుచ్చుకొన్న తర్వాత వారు అడయారులోని దివ్యజ్ఞాన సభకు అనుబంధంగా ఉండిన గ్రంథాలయానికి అధిపతిగా ఉద్యోగం చేశారు. అక్కడే నివసిస్తూ ఉండేవారు నా తమ్ముడు వీరికి అల్లుడై, శాఖాంతరాల వివాహ విషయంలో వీరి మార్గాన్ని అనుసరించినాడు. ఇటీవల ఇవి సర్వసాధారణమైనవి. కాని వీటితో వరదక్షిణల విధానం కూడా ప్రాబల్యం గాంచింది. ఇది ఒక పిశాచంగా అందరినీ పట్టుకొని వేధిస్తున్నది.

1957 తర్వాత నేను చేపట్టిన కార్యక్రమాలు ఇదివరలో 1944 నుండి నేను చేపట్టినవాటి వంటివే. 1957-'61 లో 231 గ్రంథ సమీక్షలు చేశాను. 1960 వరకు వీటిలో అనేకాన్ని ఢిల్లీలోని 'హిందూస్థాన్ టైమ్సు'లో ప్రకటించాను. కొన్నిటిని 'హిందూ', 'ఇండియా క్వార్టర్లీ', బొంబాయిలోని 'ఇలస్ట్రేటెడ్ వీక్లీ' లో (IllustratedWeekly) ప్రచురించాను. 1960 తర్వాత 'హిందూస్థాన్ టైమ్సు'తో నా సంబంధం తెగిపోయింది. దాని స్థానే 'ఇలస్ట్రేటెడ్ వీక్లీ' తోను, బెంగుళూరులో 'డక్కన్ హెరాల్డ్' (Deccan Herald) తోను సంబంధం పెరిగింది. 'ఇలస్ట్రేటెడ్ వీక్లీ'కి 1959 ప్రాంతాన ఆంధ్ర విశ్వ విద్యాలయంలో నాకు శిష్యులుగా ఉండిన ఎ. ఎస్. రామన్ గారు సంపాదకు లయ్యారు. వారు గొప్ప వక్తలు. చిత్రకళా విమర్శకులు. మత ప్రచారకులతో సంబంధం కలవారు. నాపట్ల వారికి ఎక్కువ గౌరవం ఉండేది. గ్రంథ సమీక్షల మూలంగాను, వ్యాసాల మూలంగాను వారి పత్రికతో నాకు సంబంధం కలుగుటకు ఇదియే ప్రధాన కారణం.

అప్పట్లోనే 'డక్కన్ హెరాల్డు'కు నా మిత్రులు కృపానిధిగారు సంపాదకులైనారు. వీరు 'హిందూస్థాన్ టైమ్సు'లో చాలా కాలం సంపాదకీయ వర్గంలో ఉండేవారు. అప్పుడు నాకు వీరితో స్నేహం ఏర్పడింది. 'డక్కన్ హెరాల్డు' తోటి నా సంబంధం దీని ఫలితమే. వీరు ఈ సంపాదకత్వానికి రాజీనామా చేసిన తర్వాత కూడ 'డక్కన్ హెరాల్డు'తో నా సంబంధం కొనసాగింది. నాలుగు సంవత్సరాల క్రిందట నేను వ్యాధిగ్రస్థుడ నైనప్పుడు ఐచ్ఛికంగా నేను ఈ సంబంధాన్ని వదలుకొన్నాను. నేను తమ పత్రికకు చేసిన సేవను ప్రశంసిస్తూ దాని ప్రధాన సంపాదకులు, సమీక్షల శాఖకు సంపాదకులు నాకు ఉత్తరాలు వ్రాశారు.

పైన సూచించిన సమీక్షలు గాక నేను పత్రికలకు అనేక వ్యాసాలు వ్రాశాను. "భారతదేశము శ్రేయోరాజ్యమా", "మన విద్యావిధానము", "మన విశ్వవిద్యాలయాలు", "పార్టీ రహిత ప్రజాస్వామికం", "విద్య, జాతీయ సమైక్యత" మొదలైన విషయాల గురించినవి నేను వ్రాసిన వ్యాసాలలో కొన్ని. మొత్తం నల్బై వ్యాసాలను వ్రాసి ఉంటాను. కొన్నిటిని నీలంరాజు వెంకట శేషయ్య సంపాదకత్వంలో ఉండిన 'ఆంధ్ర ప్రభ'లో ప్రకటించాను.

నాకు చాలాకాలం నుండి కోలవెన్ను రామకోటేశ్వరరావు గారితోను, వారు నిర్వహిస్తున్న "త్రివేణి" పత్రికతోను, సంబంధం ఉండేది. రావుగారు గొప్ప ఆదర్శవాది (Idealist). మానవునిలోని ఔన్నత్యమే వారిని ఆకర్షించేది. భారతీయ సంస్కృతిని ప్రతిబింబించుటకు వారు వారి పత్రికను వినియోగించారు. దేశంలోని వివిధజాతులు— ఆంధ్రులు, తమిళులు, కర్ణాటకులు, మహారాష్ట్రులు మొదలైనవారు— ప్రత్యేక సంస్కృతులను అభివృద్ధి జేసినా వాటి అన్నిటికీ తొలికాలపు ఆర్యసంస్కృతి జన్మస్థానమని వారు భావించినారు. ఈనాటి భారతీయ సంస్కృతి ఈ భిన్నసంస్కృతుల సమ్మేళనమే. ఈలాటి భావాలతో వారు పత్రికను నడిపినారు. నేను మొదటినుండి దానికి వ్యాసాలు వ్రాస్తూ వుండేవాడిని. ఇవిగాక "అంతర్జాతీయ పరిణామాలు" (International Affairs : ASurvey) అనే శీర్షికతో ప్రతిసంచికలోనూ

1950 నుంచి వ్రాసాను. 1957 తర్వాత నా ఆరోగ్యం చెడిన కారణంగా నేను దీనిని వ్రాయడం కష్టసాధ్యమైనా, రావుగారిపట్ల నాకు ఏర్పడిన గౌరవం కారణంగా దానిని ఏలాగో 1963 వరకు వ్రాస్తూ వచ్చాను.

బందరునుండి ప్రకటింపబడుతున్న "ఎడ్యుకేషనల్ ఇండియా" అనే విద్యావిషయక మాసపత్రికకు నేను ప్రారంభ దశనుండి సంపాదకుడనుగా ప్రతినెలా నాలుగు సంపాదకీయాలను వ్రాస్తూ వుండేవాడను. నా పాఠ్యగ్రంథాలను ప్రకటించిన మద్దూరి శేషాచలంగారు దీనికి అధిపతులు. పాఠ్యపుస్తకాల ద్వారా వారు నాకు మిత్రులైనారు. వారిది వ్యాపారదృష్టి అయినా ఈ పత్రికను నడపడం మూలాన వారు ఆర్థికలాభాన్ని గడించదలచినవారు కారు. వారు గొప్ప దేశాభిమాని విద్యా రంగంలోని కృషి సాధనాన దేశాభివృద్ధికి తోడ్పడదలచినవారు. నేను కూడా అలాటి ఆశయంతోనే దేశం ఎదుర్కొంటున్న విద్యా సమస్యల గురించి సంపాదకీయాలను వ్రాస్తూ వచ్చాను. ఇది నా కార్యక్రమాలలో ఒక ప్రధాన స్థానాన్ని ఆక్రమించింది.

నేను సంబంధం కల్పించుకొన్న మూడవ పత్రిక బందరు నుంచి ప్రకటింపబడుతున్న 'తెనుగు విద్యార్థి' అనే మాస పత్రిక. దీనికి ఉత్సాహవంతులైన యువకులు కొల్లూరి కోటేశ్వరరావుగారు సంపాదకులు. ప్రతినెలా నేను "ప్రశ్నలు-సమాధానాలు" అనే శీర్షికను నిర్వహిస్తూ వచ్చాను. ప్రతినెలా విద్యార్థులు పంపే ప్రశ్నలద్వారా ఆనాటి విద్యార్థుల మనస్తత్వాన్ని నేను అర్థం చేసుకొనగలిగాను. ఇవి రాజకీయ, నాంఘిక, ఆర్థిక, సాంస్కృతిక రంగాలన్నిటికీ సంబంధించినట్టివి. నేను నా శక్తికొలది ఆలోచించి వీటికి సమాధానాలను పంపేవాడిని. సమకాలిక సమస్యలను గురించి నా అభిప్రాయాలను తెలియ పరచుటకు ఇది ఒక పటిష్ఠస్థానంగా రూపొందింది. మొదటి సంవత్సరాలలోని ఈ ప్రశ్నలు—సమాధానాలను కోటేశ్వరరావు గారు "సమాధాన వేదిక" అనే పేరుతో ఒక గ్రంథంగా ప్రకటించారు. తర్వాత సంవత్సరాలలోని వాటిని కూడా

వర్గీకృతంచేసి ఒక పుస్తకరూపంలో ప్రకటించదలచారు. కాని దానికి కావలసిన ఆర్థిక వనరులు లేని కారణంగా (బహుశః) ఆ ప్రయత్నాన్ని మానుకొన్నారు. ఎప్పటికైనా ఆ గ్రంథం ప్రకటితం కాగలదని నేను ఆశిస్తున్నాను. ఆలాటి గ్రంథం సమకాలిక విషయాల గురించి నా అభిప్రాయాలకు దర్పణంగా ఉండగలదు.

1957 ఆగస్టులో ఉద్యోగానికి రాజీనామా చేసిన తర్వాత ఆకాశవాణిలో నా ప్రసారాలు చాలావరకు తగ్గిపోయినవి. 1958 లో 'సాంస్కృతిక పునరుజ్జీవనము', 1959 లో 'యువకులకు సందేశము,మహాభారతములోని రాజనీతి,' 1960 లో 'అంతర్జాతీయ పరిణామాలు, మలేషియా', 1961 లో 'ఆఫ్రికా'— వీటిని గురించి ప్రసారాలు చేసినాను. ఇవిగాక 1960 లో విద్యాశాఖలో కార్యదర్శిగా ఉండిన గ్విన్ దొరగారితో 'నిర్బంధవిద్యా విధానాన్ని' గురించిన చర్చలలో పాల్గొన్నాను.

పైన వివరించినవన్నీ నేను 1944 నుండి సాగిస్తూ ఉండిన కార్యక్రమాలు. ఇవిగాక 1958 నుండి కొన్ని ప్రత్యేక కార్యక్రమాలలో పాల్గొన్నాను. ఆ సంవత్సరం ఫిబ్రవరి 15, 16 తేదీలో ఢిల్లీలోని Indian Institute of Public Administration వారు "పల్లెప్రాంతాలలో స్థానిక పరిపాలనము" ను గురించి ఒక గోష్ఠిని ఏర్పాటుచేసి నన్ను అందులో పాల్గొనవలసిందిగా ఆహ్వానించారు. నేను అందుకు అంగీకరించి ఆ విషయాన్ని గురించి ఒక పరిశోధన పూర్వకమైన వ్యాసాన్ని వ్రాసి అందులో పాల్గొన్నాను. అనధికారులతో పాటు పరిపాలక ఉద్యోగి వర్గానికి చెందిన ఐ. సి. యస్. (I. C. S) ఉద్యోగులు అందులో పాల్గొన్నారు. అప్పటికి వారి దృక్పథం చాలా మారినట్లు నాకు కనుపించింది. బ్రిటిష్ పరిపాలన కాలంలో వీరు ప్రజాస్వామిక విధానం పట్ల విముఖులుగా ఉండినారు. 1952 తర్వాత నెహ్రూ ప్రభుత్వం ఆర్థికాభివృద్ధికి పంచవర్ష ప్రణాళికను రూపొందించి, దానిని అమలుపరచే బాధ్యతను ఉన్నత ఉద్యోగి వర్గానికి అప్పగించింది. శాంతి భద్రతలను కాపాడడంలో వీరు చూపిన దక్షతను ప్రణాళికను అమలుపరచుటలో చూపలేకపోయినారు.

దాని ఫలితంగా ప్రణాళిక లక్ష్యాలు కొనసాగలేదు. ప్రజలు, శాసనసభ్యులు, ఉద్యోగుల అసమర్థత దీనికి కారణ మనే అభిప్రాయాని తరుచుగా వ్యక్తం చేయసాగారు. దాని ఫలితంగా ప్రజలు ప్రణాళిక తలపెట్టిన కార్యక్రమాలను అమలుపరచే బాధ్యతను వహించడం అవసరమనే అభిప్రాయాన్ని గోష్ఠి చర్చలలో వీరు వెలిబుచ్చినారు. ప్రజాస్వామికం పట్ల తమకు విశ్వాసం ఉన్నట్లు ప్రకటించారు. ప్రాచీనకాలపు గ్రామ స్వరాజ్య విధానాన్ని ప్రశంసించి, ఆలాటి స్వరాజ్యాన్ని వెంటనే స్థాపించడం అవసరమని వాదించారు. ఇదీ వారి దృక్పథంలో కలిగిన గొప్ప మార్పు. ప్రజలు ఈలాటి బాధ్యతను స్వీకరించిన పక్షంలో తమ బాధ్యత తగ్గిపోగలదని, తాము సమర్థత లేని వారనే వాదానికి అవకాశం ఉండజాలదని వారు భావించినట్లు నేను ఊహించాను. ఈ భావానికి వారి స్వార్థం కొంత కారణ మని నేను అభిప్రాయపడినాను.

ఈ ఢిల్లీ పర్యటనలో నా కోడలు సీతను నాకు సహాయంగా తీసుకొని వెళ్ళి, నా తమ్ముడి కుమార్తె మైత్రేయి ఇంట్లో బస చేసినాను. మైత్రేయి నా కోడలికి ఢిల్లీలో చూడవలసిన ప్రదేశాల నన్నిటిని విసుగులేక చూపించినది. నా కార్యక్రమం ముగిసిన తర్వాత నేను కూడా వారితో వెళ్ళినాను. ఇదిగాక నేను దుర్గాబాయి దేశ్‌ముఖ్‌ను, ఆమె భర్త చింతామణి దేశ్‌ముఖ్‌ను కలుసుకొన్నాను. అప్పటికి వారిద్దరు నెహ్రూ విధానాలను తీవ్రంగా ఖండించేవా రయ్యారు. ఢిల్లీ విశ్వ విద్యాలయానికి ఉపాధ్యక్షులైన నా మిత్రుడు వి. కె. ఆర్. వి. రావును, అధ్యాపకులు కొందరిని కలుసుకొని విద్యా విషయంలో వారి అభిప్రాయాలను తెలుసుకొన్నాను. మరికొందరు ప్రముఖులను కేంద్రమంత్రి కె. సి. రెడ్డిగారి ఇంట్లో కలుసుకొనగలిగాను. ఈలాగు ఢిల్లీలో అయిదు రోజులు గడిపి 19 న హైదరాబాదుకు తిరిగి వచ్చినాను.

అటుతర్వాత సెప్టెంబరు 13, 14 తేదీలలో "నగర పరిపాలన విధానము" గురించి ఇన్‌స్టిట్యూట్ వారు బెంగుళూరులో ఒక

సదస్సును ఏర్పాటు చేసి దానికి కూడా నన్ను ఆహ్వానించారు. నేను అక్కడికి వెళ్ళి చర్చలలో పాల్గొని రెండు రోజుల తర్వాత మద్రాసుకు వచ్చినాను.

1957 ఆఖరున ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వంవారు విధాన్ సభ స్పీకరు అయ్యదేవర కాళేశ్వరరావుగారి అధ్యక్షతన 'గ్లాసరీ కమిటీ' నొకదానిని ఏర్పాటుచేసి, అందులో నన్ను ఒక సభ్యునిగా నియమించినారు. పరిపాలన శాఖలలోను, న్యాయస్థానాలలోను వాడుకలో ఉన్న ఇంగ్లీషులోని సాంకేతిక పదాలకు సరియైన తెలుగు పదాలను తయారుచేయడానికిగాను ఈ ఏర్పాటు జరిగింది. ఇందులో నాతోపాటు సర్వశ్రీ దిగవల్లి శివరావు, పి. వి. నరసింహారావు, రావి నారాయణరెడ్డి మొదలైనవారు సభ్యులు. 1958 లో దీని సమావేశాలు కొన్ని జరిగినవి. చాలాపదాలకు పర్యాయపదాలను తయారు చేసింది. వాటి నన్నిటిని ఒక నిఘంటువు రూపంలో ప్రకటించారో లేదో నాకు జ్ఞాపకంలేదు.

కాని ఈ పద్ధతి నాకు అంతగా రుచించలేదు. బ్రిటిష్ పరిపాలనకాలంలో ప్రతిదేశభాషకు ప్రభుత్వం ఒక భాషాంతరీకరణం చేయగల ఉద్యోగిని (Government Translator) నియమించినది. అతడు ఇంగ్లీషులోని శాసనాలను, ఇతర నివేదికలను తెనుగు మొదలైన భాషలలోకి తర్జుమా చేసేవాడు. నిఘంటువు ఒకదానిని ఆధారం చేసుకొనక అనేక పర్యాయపదములను ఇతడు సృష్టించగలిగాడు. గ్రంథకర్తలు వారి వారికి తోచిన మాటలను వారి గ్రంథాలలో వాడిన తర్వాతనే నిఘంటువు దీనిని ఆధారంగా చేసుకొనక అనేక పర్యాయపదములను ఇతడు సృష్టించగలిగాడు. గ్రంథకర్తలు వారి వారికి తోచిన మాటలను వారి గ్రంథాలలో వాడిన తర్వాతనే నిఘంటువులు తయారు కావడం సాధారణ పద్ధతి. మొదట నిఘంటువులను తయారుచేయడం, తర్వాత గ్రంథాలను రచించడం కనీ వినీ ఎరుగని పద్ధతి. పరిపాలన విధానాన్ని గురించి, న్యాయవిచారణ గురించి తెనుగులో కొన్ని గ్రంథాల రచన సాగిన తర్వాత రచయితలు వారి గ్రంథాలలో సమయోచితంగా వాడిన పదాలను సమన్వయపరచిన పక్షంలో కొంతకాలానికి సాంకేతిక పదజాలం ఏర్పడగలదనేది నా అభిప్రాయం.

గ్లాసరీ కమిటీ కార్యక్రమం సార్థకం కానట్లే కనుపిస్తున్నది. కాని దీనిమూలంగా మేధావులు కొందరితో కలిసి కొంత కాలక్షేపం చేసే అవకాశం నాకు లభించింది.

కాళేశ్వరరావుగారు ఆంధ్రభాషపట్ల గొప్ప అభిమానం కలవారు. 1915 లో సూరి నరసింహశాస్త్రిగారితో కలిసి వీరు తెనుగులో అర్థశాస్త్రాన్ని గురించి కొన్ని ఉపన్యాసాలు ఇయ్యవలసినదిగా నన్ను కోరారు. నేను అలాగే చేశాను. వీరికి విజ్ఞానమండలితో సన్నిహిత సంబంధం ఉండేది. తన స్వీయ చరిత్రలో ఆంధ్రోద్యమానికి ప్రాధాన్యం కల్పిస్తూ, దానిని తెనుగులోనే రచించినారు. ఇదిగాక చైనా, టర్కీ, ఈజిప్టు మొదలైన దేశాల ఆధునిక చరిత్రలను తెనుగులో రచించి ప్రకటించినారు. విధాన్ సభకు స్పీకరైన తర్వాత హైదరాబాదులో 'తెనుగు ఉర్దూ అకాడమీ' అనే సంస్థను తన అధ్యక్షతన స్థాపించి, దాని ఆధ్వర్యాన కొన్ని తెనుగు గ్రంథాలను (వీటిలో అనేకం వారు రచించినవే), ఉర్దూ గ్రంథాలను ప్రకటించారు. ఆంధ్రుల పునర్వికాసానికి ఆంధ్ర భాషాభివృద్ధి ప్రధాన సాధనమని విశ్వసించిన వారిలో వీరు అగ్రశ్రేణికి చెందినవారు.

1957 తర్వాత నా అనారోగ్యం కారణంగా కొన్ని ప్రధానమైన కార్యక్రమాలలో పాల్గొనలేకపోయినాను. ఢిల్లీలోని Institute of Public Administration వారు 1958 లో ఏర్పాటుచేసిన రెండు కార్యక్రమాలలోను పాల్గొనిన తర్వాత ఇన్‌స్టిట్యూట్ డైరెక్టరు మీనన్‌గారికి నాపట్ల చాలా గౌరవం కలిగింది. వారు ఏటేట ఐ. సి. యస్. ఉద్యోగి వర్గానికి చెందినవారికిగాను కొన్ని ప్రత్యేక శిక్షణా కార్యక్రమాలను ఏర్పాటు చేయడం మామూలు. వాటిలో పాల్గొనవలసిందిగాను, అందునిమిత్తం 1959 లో మార్చి నుండి మూడు మాసాలు ఇన్‌స్టిట్యూట్‌లో ప్రొఫెసరు హోదాలో స్థానిక పరిపాలనను గురించి ఉద్యోగులతో చర్చలు సాగించవలసిందిగాను కోరారు. ప్రథమంలో దీనికి నేను అంగీకరించి 'స్థానిక పరిపాలనములో కార్యనిర్వహణ' (Executive in Local Government) అనే విషయాన్ని గురించి పరిశోధన గావించి మూడు ప్రత్యేక ఉపన్యాసాలను వ్రాశాను. వాటిని

ఆధారం చేసుకొని ఇన్‌స్టిట్యూట్ ఏర్పాటు చేసిన చర్చలలో పాల్గొన దలచాను. కాని ఫిబ్రవరిలో నా కడుపులోని వ్రణం పగిలి 10 రోజులు హైదరాబాదు ఆసుపత్రిలో చికిత్స పొందవలసి వచ్చింది. దానిమూలంగా నేను చాలా చిక్కిపోయాను. మూడు మాసాలకాలం ఢిల్లీలో గడపడం వాంఛనీయంకాదని వైద్యులు సలహా ఇచ్చారు. అందుచేత మీనన్ గారి ఆహ్వానాన్ని తిరస్క రించి వారికి గొప్ప ఆశాభంగాన్ని కలిగించాను. ప్రముఖులతో చర్చలు సాగించి, నాశక్తిసామర్థ్యాలను ప్రదర్శించగల అవకాశాన్ని కూడా కోల్పోయాను.

ఆనాడు దుర్గాబాయి దేశ్‌ముఖ్ గారు కేంద్ర సంఘ సంక్షేమ సంఘానికి (Central Social Welfare Board) అధ్యక్షు రాలుగా ఉండేవారు. ఆమె సంఘ సంక్షేమాన్ని గురించి నా సంపాదకత్వంలో ఒక గ్రంథాన్ని తయారుచేసి ప్రకటించుటకు ఒక సంవత్సరం నెలకు రు. 800ల జీతంతో ఢిల్లీలో ఉండవలసినట్లుగా కోరింది. ఇంతకాలం నా అనారోగ్య పరిస్థితులలో నేనూ, నా భార్య మా కుటుంబానికి దూరంగా ఉండడం భావ్యంకాదనే కారణంగా ఆమె కోరికను నిరాకరించడం తప్పిందికాదు. తర్వాత చావలి హనుమంతరావుగారి సంపాదకత్వాన ఆ గ్రంథం తయారు చేయబడింది. అందులో సంఘ సంక్షేమాన్ని గురించిన అధ్యా యాన్ని నేను వ్రాశాను.

ఇదేవిధంగా ఢిల్లీలోని యు. జి. సి. వారు వివిధ విశ్వ విద్యాలయాలలో ఆనాడు రాజనీతిశాస్త్ర బోధన ఏలాగు జరుగుచున్నదో తెలుసుకొని, దానిని మెరుగు పరచుటకు సూచన లను చేయుటకు ఒక కమిటీని నియమించి అందులో సభ్యుడుగా ఉండమని నన్ను ఆహ్వానించారు. ఈ కమిటీవారు దేశంలోని విశ్వవిద్యాలయాలకు వెళ్లి, అధ్యాపకులతో చర్చలు సాగించి తమ నివేదికను సమర్పించ వలసిందిగా నిర్ణయించారు. నా అనారోగ్యం మూలంగా ఈలాటి పర్యటనను సాగించడం సాధ్యం కాక పోయింది. అందుచేత ఈ ఆహ్వానాన్ని కూడా నిరాక రించడం తప్పింది కాదు. ఈలాటి అవకాశాలను కోల్పోయి

వందుకు నేను ఎంతగానో ఆశాభంగాన్ని పొందినాను. కాని ఇవి నా శారీరక శక్తికి మించిన కార్యక్రమా లనేభావంతో ప్రవర్తించాను. జీవితంలో ఈలాటి ఆశాభంగాలు తప్పవని నా స్వానుభవంద్వారా తెలుసుకొన్నాను.

అనారోగ్యం మూలంగా నేను బాధపడుతూ ఉండినా నా కొన్ని కార్యక్రమాలను ఏకాగ్రతతో చేపట్టి పూర్తి చేయ గలిగాను. 1959 లో బెంగుళూరు సైన్సు ఇన్‌స్టిట్యూట్‌లో ఉద్యోగిగా చేరిన నా కుమారుడు కృష్ణమూర్తిని చూచుటకు నేనూ, నా భార్య అక్కడికి వెళ్లాము. ఆసమయంలో ప్రజాహిత కార్యా లన్నిటిలో పాల్గొనడంపట్ల అత్యంత శ్రద్ధను వహిస్తున్న డి. వి. గుండప్పగారిని సందర్శించాను. వారు కన్నడంలోను, ఇంగ్లీషు లోను చక్కగా మాట్లాడ గలిగేవారు. కొన్ని రచనలను కూడా చేశారు. రాజకీయాలలో వారు మితవాదులు. కీ. శే. గోపాల కృష్ణ గోఖలే అడుగు జాడలలో నడిచేవారు. దానికి చిహ్నంగా బెంగుళూరులో 'Gokhale Institute of Public Affairs' అనే సంస్థను స్థాపించి, దానికి కార్యదర్శిగా యావజ్జీవం కృషి చేశారు. దాని అధ్వర్యంలో తరుచుగా సమావేశాలను, చర్చలను ఏర్పాటు చేసేవారు. నేను వారిని కలుసుకొన్నప్పుడు అనేక విషయాల గురించి నాతో చర్చించారు. వాటిలో రెండు నాకు ఇప్పటికి కూడా జ్ఞాపకంలో ఉన్నవి. ఆనాడు మైసూరు రాష్ట్రంలో బ్రాహ్మణేతర ఉద్యమం తీవ్రరూపం ధరించి ఉండినది. ప్రాచీన మధ్య యుగాలలో చాతుర్వర్ణ్య వ్యవస్థలో వైదిక విద్యలయందు ప్రజలకు ఆదరణ ఉండడం చేతను, ఆనాటి విద్యను ఖలం కాకుండా బ్రాహ్మణ వర్గానికి చెందినవారు కాపాడడం చేతను సమాజంలో వారికి అగ్రస్థానం ఉండేది. కాని 19-వ శతాబ్దంలో ఇంగ్లీషు విద్యతోను, పాశ్చాత్య సంస్కృతితోను మన విద్యాధికులకు సంబంధం ఏర్పడడంచేత పాశ్చాత్య దేశాలలో ఆనాటి తత్త్వ వేత్తలు ప్రచారం చేసిన మానవసమత్వ సిద్ధాంతం విద్యాధికులపై ప్రభావం వహించింది. దాని ఫలితంగా తరతమ భేదాలతో కూడిన వర్ణ వ్యవస్థపై తిరుగుబాటు ప్రారంభమైంది. ఇది

క్రమక్రమంగా బ్రాహ్మణ ద్వేష రూపం ధరించింది. దేశానికి స్వాతంత్ర్యం లభించిన తర్వాత ఏర్పడిన ప్రభుత్వాలు బ్రాహ్మణులను అణగద్రొక్కే ఉద్దేశంతో విద్యాలయాలలోను, ప్రభుత్వ ఉద్యోగాలలోను వారికి ఏలాటి స్థానం లేకుండా చేశాయి. ఇది మానవ సమత్వ సిద్ధాంతానికి విపరీతార్థం కల్పించడమని గుండప్పగారు అభిప్రాయపడి, ఈ ప్రభుత్వ విధానంపట్ల వారి అసమ్మతిని నాకు తెలియపరచారు. ఈవిషయంలో నేను వారితో ఏకీభవించాను.

ఆనాడు దేశంలో ఇంకొక పరిణామంకూడా ప్రముఖుల దృష్టిని ఆకర్షించింది. విద్యార్థులలో క్రమశిక్షణ లోపించడం, వారు తమ ప్రధాన కర్తవ్యాన్ని విస్మరించి, సమ్మెలలోకి దిగి, విధ్వంసక కార్యక్రమాలలో పాల్గొనడం జరుగుతూ వచ్చింది. గుండప్పగారు దీనిని పూర్తిగా నిరసించారు. ఇందులోకూడా నేను వారితో పూర్తిగా ఏకీభవించాను. 1957 లో డి. యస్. రెడ్డిగారిని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఉస్మానియా విశ్వవిద్యాలయానికి ఉపాధ్యక్షులుగా నియమించిన సందర్భంలో వారు ఆంధ్ర ప్రాంతానికి చెందిన వారని, తెలంగాణాలోని విశ్వవిద్యాలయ ఉపాధ్యక్ష పదవికి అర్హులు కారని విద్యార్థులు సమ్మెలోకి దిగడం, విశ్వవిద్యాలయ కార్యక్రమాలన్నీ స్తంభించిపోవడం నాకు జ్ఞాపకం ఉండినది. అది మొదలు కాలక్రమాన విద్యార్థులలో విద్యపట్ల అశ్రద్ధ, ఇతర కార్యక్రమాలలో ఆసక్తి, దౌర్జన్యచర్యల ద్వారా ఆ ఆసక్తిని వ్యక్తం చేయడం సర్వసాధారణమైంది. అందుచేతనే నేను గుండప్పగారి అభిప్రాయంతో ఏకీభవించాను. 1957 లో విద్యార్థులలో అంకురించిన ఈ మనస్తత్వమూ, క్రమశిక్షణా రాహిత్యమూ ఇప్పటివరకు ఏవిధంగాను మారలేదు. 1958 లో నేను దీనిని గురించి నా సంపాదకత్వంలో ప్రకటింపబడుతున్న 'ఎడ్యుకేషనల్ ఇండియా' మాసపత్రికలో ఒక వ్యాసాన్ని వ్రాశాను.

గుండప్పగారిని కలుసుకొన్న కారణంగా వారి సంస్థ అధ్వర్యాన 1959 లో "భారత రాజ్యాంగం పనిచేస్తున్న తీరు తెన్నులు" (Indian Constitution at Work) అనే విషయాన్ని గురించి ఉపన్యసించాను. 1959 లో నేను ఇంకొక పర్యాయం

బెంగుళూరు వెళ్ళినప్పుడు వారిని తిరిగి కలుసుకొనగా నేను పరిశోధన గావిస్తున్న స్థానిక స్వపరిపాలన విధానాన్ని గురించి వారి సంస్థ అధ్వర్యంలో రెండు, మూడు ఉపన్యాసాలను చేయవలసిందిగా వారు కోరినారు. నేను దానికి అంగీకరించి 'గతంలో మనదేశంలో స్థానిక స్వపరిపాలనము, వర్తమానంలోని విధానము, భవిష్యత్తులో జరగవలసిన మార్పులు' అనే విషయాల గురించి మూడు ఉపన్యాసాలను వ్రాసి, 1960 జూన్ లో వాటిని ఆధారం చేసుకొని గోఖలే ఇన్‌స్టిట్యూట్‌లో మూడు ఉపన్యాసాలు చేశాను. మొదటి ఉపన్యాసంనాడు మైసూరు మాజీ దివాన్ న్యాపతి మాధవరావుగారు అధ్యక్షత వహించారు. (వీరు బందరుకు చెందినవారు. నేను పచ్చయప్ప కళాశాలలో బి. ఏ. లో విద్యార్థిగా ఉన్నప్పుడు వారు కూడా విద్యార్థిగా ఉండి, బి. ఏ లో కృతార్థులై మైసూరు సివిల్ సర్వీసు పోటీ పరీక్షలో పాల్గొని అక్కడ ఉన్నత ఉద్యోగిగా కృషి చేసి దివాన్ పదవిలో ఉండి, ఫించన్ పుచ్చుకొన్నవారు) రెండవ రోజున మైసూరు విధాన సభ మాజీ స్పీకరు వెంకప్పగారు, మూడవ రోజున బెంగుళూరు మునిసిపల్ కార్పొరేషన్ మేయరు శ్రీమతి ఇందిరమ్మగారు అధ్యక్షత వహించారు. నా ఉపన్యాసాల కార్యక్రమం విజయవంతంగా జరిగింది.

1958 లో ఉత్కల్ విశ్వవిద్యాలయాధికారులు తమ విశ్వవిద్యాలయంలో రాజనీతిశాఖకు ప్రధానాధ్యాపకుడనుగా ఉండవలసిందిగా నన్ను ఆహ్వానించారు. నేను దానికి అంగీకరించాను. కాని వెంటనే ఎం. ఏ. తరగతులను ప్రారంభించడం వారికి సాధ్యం కాకపోవడం చేత నాకు వారు పంపిన ఆహ్వానం క్రియారూపం ధరించ లేదు. కాని ఇంకొకవిధంగా ఆనాడు, అటు తర్వాతనూ నాకు విశ్వవిద్యాలయంతో సంబంధం ఏర్పడింది. దాని అనుబంధ కళాశాలలన్నిటిలో అగ్రస్థానాన్ని వహించిన కటక్ లోని రావెన్‌షా కళాశాలలో కె. వి. రావుగారనే ఆంధ్రులు రాజనీతిశాఖలో అధ్యాపకులుగా ఉండేవారు. వారు పిహెచ్. డి. డిగ్రీకి వ్రాసిన వ్యాసాన్ని చిత్తురూపంలో నాకు పంపి దానిలో సవరణలేవైనా చేయవలసి ఉంటే వాటిని

సూచించవలసిందిగా నన్ను కోరారు. భారత రాజ్యాంగ విధానాన్ని గురించిన ఆ వ్యాసాన్ని నేను క్షుణ్ణంగా పరిశీలించి నా సూచనలు పంపినాను. వారికి పిహెచ్. డి. డిగ్రీ లభించింది. అప్పటినుంచి వారితో నాకు స్నేహం ఏర్పడింది.

వారి కళాశాలలో ఏటేటా ఒక ప్రముఖుని ఆహ్వానించి వారిచేత రెండు మూడు ఉపన్యాసాలు ఇప్పించే ఏర్పాటు ఒకటి ఉండేది అందునిమిత్తం 1959, 1960 లో నన్ను కళాశాలాధికారులు ఆహ్వానించారు. కాని ఆరోజులలో నాకు తరుచుగా మైలేరియా జ్వరం తగులుతూ ఉండడంచేత నేను వారి ఆహ్వానాన్ని అంగీకరించలేక పోయినాను. కాని 1961 లో ఉపన్యాసాలు చేయవలసిందిగా నన్ను తిరిగి ఆహ్వానించారు. ఎలాగైనా దీనికి అంగీకరించవలసిందిగా కె. వి. రావుగారు నన్ను కోరారు. వారి కోరికను తిరస్కరించడం మర్యాదగా ఉండదనే భావంతో నేను దానికి అంగీకరించాను.

ఆ రోజులలో రాజనీతి శాస్త్రవేత్తలు, రాజకీయ పార్టీల నాయకులు శ్రేయో రాజ్యాన్ని గురించి, సోషలిస్టు రాజ్యాన్ని గురించి వాదోపవాదాలు చేస్తూ ఉండేవారు. మనదేశంలో ఏర్పడిన కాంగ్రెసు ప్రభుత్వం తన లక్ష్యం సోషలిజాన్ని స్థాపించడమని పదే పదే ప్రకటించడం పరిపాటిగా ఉండినది. కాని దీని లక్షణాలు, దీనిని సాధించుటకు అనుసరించ దగిన కార్యక్రమాలు ఏలాటివో అధికారంలో ఉన్నవారికి తెలిసినట్లుగా కనుపించలేదు. సోషలిస్టు వ్యవస్థ ఒక రాజకీయ నినాదంగా రూపొందింది. ఈలాటి పరిస్థితులలో ఈ రెండింటి లక్షణాలను స్పష్టంగా వివరించడం సందర్భోచితంగా ఉండగలదనే భావంతో కటక్‌లో నేను చేయవలసిన ఉపన్యాసాలను ఇందుకుగాను వినియోగించినాను. ఇందు నిమిత్తం అనేక ప్రామాణిక గ్రంథాలను చదివి, స్వయంగా అన్నివిషయాల గురించి ఆలోచించి మొదటి ఉపన్యాసంలో శ్రేయోరాజ్య లక్షణాలను, రెండవ దానిలో సోషలిస్టు రాజ్య లక్షణాలను, మూడవ దానిలో మన రాజ్యాంగం ఈ రెండు రకములైన రాజ్యాల స్థాపనకు ఏలాటి అవకాశాలను కల్పిస్తున్నదో వివరించాను. ఈవిధంగా మూడు ఉపన్యాసాలను వ్రాసి

1961 జనవరి 18 న నా కుమారుడు పట్టాభిరాం సహాయంతో కటక్ చేరాను.

స్టేషన్‌లో కె. వి. రావుగారు, మరికొందరు అధ్యాపకులు నన్ను కలుసుకొని సర్క్యూట్ హౌసులో నా బసకు ఏర్పాటు చేశారు. రావెన్‌షా కళాశాల ప్రిన్సిపాల్ మిశ్రాగారు అక్కడ నన్ను కలుసుకొని అనేక విషయాల గురించి చర్చించారు. వారి అధ్యక్షతన నేను 19, 20, 21 తేదీలలో అధ్యాపకులు, విద్యార్థుల సమక్షంలో ఉపన్యసించాను. నా ఉపన్యాసాలను ప్రశంసిస్తూ మిశ్రాగారు మాట్లాడారు. సభ్యులందరు తృప్తిగాంచినట్లు నేను భావించాను. ఈ మూడు రోజులలో కె. వి. రావుగారు నాకు కటక్‌లో చూడదగిన ప్రదేశాలనన్నిటినీ చూపించారు. ఆఖరు రోజు ఉపన్యాసం ముగిసిన తర్వాత కటక్‌లో న్యాయవాదిగా ఉండిన వామనమూర్తిగారి కారులో నన్ను, నా కుమారుని భువనేశ్వరుకు తీసుకొని వెళ్లి అక్కడి దేవాలయాన్ని, అందులోని శిల్పాలను చూపించారు. అటుతర్వాత ఆ రాత్రి నేను తిరుగు ప్రయాణంచేసి, మద్రాసుకు వచ్చాను. ఈ విధంగా నా ఉపన్యాస కార్యక్రమం నిర్విఘ్నంగా జరిగింది.

1960 లో అఖిలభారత తెనుగు రచయితల మహాసభ హైదరాబాదులో జరిగింది. అందులో చారిత్రక రచనను గురించి ప్రసంగించ వలసిందిగా కార్యకర్తలు నన్ను కోరారు. వారి కోరిక మేరకు ఆంధ్రదేశంలో చారిత్రక రచన వెనుకబడి వుండుటకు కారణాలు, చారిత్రక రచనకు వుండదగిన లక్షణాలు, దానిని అభివృద్ధి పరచుటకు మార్గాలు మొదలగు విషయాల గురించి సుదీర్ఘమైన ఉపన్యాసాన్ని వ్రాశాను. మహాసభను డాక్టర్ రాధాకృష్ణన్‌గారు ప్రారంభించారు. వారు ఆ సందర్భంలో ఉత్తేజకరమైన ఉపన్యాసాన్ని తెనుగులో చేశారు. బూర్గుల రామకృష్ణారావు, బెజవాడ గోపాలరెడ్డి మొదలైన ప్రముఖులు కూడా ప్రసంగించారు. మూడవ రోజున చారిత్రక రచనను గురించి ప్రత్యేక సమావేశం జరిగింది. దానికి నన్ను అధ్యక్షునిగా ఎన్నుకొన్నారు. నేను వ్రాసిన వ్యాసాన్ని ఆధారం చేసుకొని

నా అధ్యక్షోపన్యాసాన్ని చేశాను. తర్వాత రెండు, మూడు గంటలు చర్చలకై వినియోగింపబడినవి. అంతటితో మహాసభ ముగిసింది. అందులో పాల్గొనగలిగినందుకు నేను సంతోషించినాను.

ఎంతటి క్లిష్ట విషయమునైనా నేను సామాన్యులకుకూడా అర్థం అయ్యేటట్లు బోధించగలవాడననే ప్రఖ్యాతి అప్పటికి నాకు లభించింది. దీనికి నేను ఎంతవరకు అర్హుడనో చెప్పలేను. కాని దీని మూలంగా నా కార్యభారం పెరిగింది. నన్ను అనేక సమావేశాలలోను, ఇతర కార్యక్రమాలలోను పాల్గొనుటకు అనేకులు ఆహ్వానించుటకు ఇది ఒక ప్రధాన కారణం.

1960 లో సంఘ సంక్షేమ ప్రభుత్వశాఖలో అధికారిగా ఉండిన శ్రీరంగం శేషు అనే ఆమె గ్రామస్థాయి ఉద్యోగులకు (Village Level Workers) ప్రభుత్వం నిర్ణయించిన పాఠ్యప్రణాళిక ననుసరించి కొన్ని ఉపన్యాసాలు ఇయ్యవలసిందిగా నన్ను కోరింది. ఈమె నెల్లూరులో ఉన్నప్పుడు హరిజనోద్ధరణలోను, ఇతర సంఘ సంక్షేమ కార్యక్రమాలలోను గొప్ప కృషిచేస్తూ ఉండిన నా పెద్ద కుమార్తె అన్నపూర్ణకు స్నేహితురాలైనది. దానిమూలంగా నాకు కూడా ఈమె పరిచితురాలైనది. ఈమె ఇంగ్లీషు వాఙ్మయంలో బి. ఏ. ఆనర్సులో పట్టభద్రురాలైనట్టిది. ఈమె పట్ల నాకు గౌరవం కలుగుటకు ఇదికూడా ఒక కారణం. ఈ పరిచయం ఆధారంగా ఈమె నన్ను గ్రామస్థాయి ఉద్యోగుల శిక్షణ కార్యక్రమంలో పాల్గొనవలసిందిగా కోరింది. దానికి నేను అంగీకరించడం తప్పిందికాదు.

ఈ ఉద్యోగులు 20 సంవత్సరాల వయస్సుగల స్త్రీలు, స్కూలుఫైనల్ వరకు చదివినవారు. వీరి పాఠ్యప్రణాళిక ననుసరించి నేను వీరికి 12 ఉపన్యాసాలను చేశాను. రోజూ నా ఉపన్యాసానంతరం వీరు వేసిన ప్రశ్నలకు సమాధానాలు చెప్పి నా పని ముగించుకొని నేను కారులోనో, బస్సులోనో నాలుగు మైళ్లు ప్రయాణంచేసి ఇంటికి వచ్చేవాడిని. తర్వాత కొన్నాళ్ళకు శేషుగారు సామాజికశాస్త్రాన్ని (Sociology) గురించి కొన్ని ఉపన్యాసాలను గ్రామస్థాయి ఉద్యోగులకు ఇయ్యవలసిందిగా నన్ను కోరినారు. ఆ కోరికనుకూడా చెల్లించినాను.

1944 జనవరిలో నేను ఆంధ్ర విశ్వవిద్యాలయ అధ్యాపకత్వాననుండి విరమింపబడిన తర్వాత ఆ సంస్థతో నాకు ఏలాటి సంబంధం లేకపోయిందని ఇదివరలో చెప్పినాను. కాని 1959 లో అక్కడి విద్యార్థి సంఘంవారు వారి సాంస్కృతిక కార్యక్రమాలలో పాల్గొనవలసిందిగా నన్ను ఆహ్వానించారు. నేను సంతోషపూర్వకంగా దానిని అందుకొని విశ్వవిద్యాలయంలో 15 సంవత్సరాలు గడిచిన తర్వాత తిరిగి అడుగుపెట్టినాను. నా పూర్వస్నేహితుల నందరిని కలుసుకొన్నాను. నా శిష్యవర్గంలోని వారు కొందరు అప్పుడు అధ్యాపకులుగా ఉండినారు. వారితో ముచ్చటించినాను. అటుతర్వాత "దేశ పునర్నిర్మాణము—విద్యార్థుల కర్తవ్యము" అనే విషయాన్ని గురించి రెండుగంటలు ఉపన్యసించినాను. వందలాది విద్యార్థులు నిశ్శబ్దంగా శ్రద్ధతోను, ఓపికతోను దానిని విన్నారు. దేశం అన్నిరంగాలలో, వాటిలో ప్రధానంగా ఆర్థిక రంగంలో వెనుకబడి ఉన్నదనీ, దానిని మార్చే బాధ్యతను యువకులైన విద్యావంతులు వహించవలసి ఉన్నదనీ, విద్యార్థిదశలోని యువకులు తమ దృష్టిని పూర్తిగా విద్యార్జన పట్ల కేంద్రీకరించి నప్పుడే వారు విద్యావంతులై తర్వాత ఈ బాధ్యతను నిర్వహించుటకు సమర్థులు కాగలరనీ నా ఉపన్యాసంలో ఉద్ఘాటించాను. ఈ ప్రసంగాన్నే తర్వాత ఒక చిన్నగ్రంథంగా 'తెనుగు విద్యార్థి' సంపాదకులు వారి ప్రచురణలలో ప్రకటించారు.

1959 ప్రాంతాన వేరొకసంస్థ అధ్వర్యాన "మన రాజకీయాలు" అనే విషయం గురించి హైదరాబాదులో ప్రసంగించాను. అందులో రాజనీతిశాస్త్ర గ్రంథాలలోని సిద్ధాంతాలకు, వాస్తవ ప్రపంచంలోని రాజకీయాలకు ఎక్కువ సంబంధం లేదని చెప్పాను. వాస్తవరాజకీయాలలో అధికారంలోకి రావడం, దానిని వినియోగించడం ప్రధాన అంశాలు. ఈ రెండు ఆశయాలను సాధించ దలచేవారు నీతినియమాలకు లోబడి ప్రవర్తించడం చాలా అరుదు. ఏదోవిధంగా అధికారాన్ని సంపాదించడం, దానిని స్వార్థం కొరకు వినియోగించడం రాజకీయ రంగంలో కృషిచేసే వారి లక్ష్యం. ఇందువలననే దేశంలో అవినీతి పెరిగింది. నేను ఈ దృష్ట్యా మనదేశంలోని అధికారపక్షం,

ప్రతిపక్షాలు, శాసనసభ్యులు, మంత్రిపదవులను అధిష్ఠించేవారు, రాజకీయాలలో ఎక్కువ పరిజ్ఞానం లేని వోటర్లు, మొదలైనవారి ప్రవర్తనను నా ప్రసంగంలో పరిశీలించి విమర్శించినాను. ఈ ప్రసంగాన్ని కూడా 'తెనుగు విద్యార్థి' ప్రచురణలలో గ్రంథ రూపంగా సంపాదకులు ప్రకటించారు.

మన రాజ్యాంగాన్ని సామాన్య ప్రజలకు అర్థం అయ్యేటట్లు వివరించదలచి ఇదే కాలంలో "మన రాజ్యాంగం", "మన శాసన సభలు", "మన పరిపాలకులు" అనే సంక్షిప్తపరచిన గ్రంథాలను కూడా తెనుగు విద్యార్థి ప్రచురణలలో ప్రకటించదలచాను. వీటిని ప్రకటించడంలో 'తెనుగు విద్యార్థి' సంపాదకులు కోటేశ్వరరావుగారు నాకు సహాయపడినారు.

ఈవిధంగా 1957 నుండి 1961 వరకు వ్యాధిగ్రస్తుడనైనా నా శక్తి కొలదీ అనేక కార్యక్రమాలలో పాల్గొని కొన్ని గ్రంథాలను కూడా ప్రకటించాను. వీటిలో అనేకాన్ని తెలుగులో వ్రాశాను. కటక్‌లో నేను చేసిన ఉపన్యాసాలు ఇంగ్లీషులో ఉండినవి. వాటిని కూడా బందరులోని 'త్రివేణి పబ్లిషర్సు' గ్రంథరూపంలో ప్రకటించారు. 1957-'61 లో నాకాలాన్ని వ్యర్థపుచ్చ లేదని తెలియపరచే ఉద్దేశంతో పై వివరణను వ్రాశాను.

1957-'61 లో నా కుటుంబానికి సంబంధించిన కొన్ని ఉదంతాలను పేర్కొనడం అవసరమని, ఉచితమని భావిస్తున్నాను. నా కుటుంబానికి కల్పతరువుగా ఉన్న నా మూడవ కుమారుడు ఆనందం 1958 పట్టభద్రుల నియోజకవర్గాన నుండి ఆంధ్రప్రదేశ్ శాసన మండలికి ఎన్నికయ్యాడు. తర్వాత దానికి ఉపాధ్యక్షు డయ్యాడు. మరికొంత కాలం గడచిన తర్వాత ఆంధ్రప్రదేశ్ విధాన్ సభవారు వాడిని కేంద్రంలోని రాజ్యసభకు ఎన్నుకొన్నారు. అప్పటి నుంచి ఇప్పటి వరకు రాజ్యసభలో సభ్యుడుగా ఉన్నాడు. అనేక కమిటీలలో సభ్యుడుగా ప్రఖ్యాతిని సంపాదించినాడు. నిరుద్యోగ కమిటీ సభ్యుడుగా నిరుద్యోగ నివారణకు కమిటీ నివేదికలో అనేక సూచనలను చేసినాడు. పార్లమెంటు సభ్యత్వం మూలంగా మంచి పలుకుబడిని సంపాదించి, అనేకులకు సహాయం

చేయగల స్థితిలో ఉన్నాడు. ఈ సభ్యత్వం మా కుటుంబంలోని వారందరికి గర్వకారణమైనట్టిది.

1960 లో ఆనందం కుమార్లలో నాల్గవ వాడైన విక్రంకు పోలియో వ్యాధి సోకింది. అయిదుగురు కుమార్లలో వాడే ఎక్కువ చురుకైన వాడు. బాల్యంలోనే అనేక తెనుగు పద్యాలు, సంస్కృత శ్లోకాలు వల్లించి ఒప్పగించ గలిగాడు. పోలియో వ్యాధి మూలంగా అనేకులు అంగవైకల్యంతో యావజ్జీవం గడపవలసి వచ్చేది. అది ఒకవిధమైన చచ్చువ్యాధి. నేను అప్పుడు అడయారులో నా కుమారుడు పట్టాభి తో ఉండేవాడిని. ఎంతటి ఖర్చైనా భరించి పిల్లవాడికి చికిత్స చేసే నిమిత్తం నా కోడలు సీత వాడిని అడయారుకు తీసుకొని వచ్చినది. ఈ వ్యాధిని కుదుర్చుటలో ప్రత్యేక నిపుణులు కొందరితో సంప్రతించాము. వారు ఒక చికిత్స విధానాన్ని అనుసరించ వలసిందిగా ఆదేశించారు. అందుకుగాను ఒక ప్రత్యేక నేర్పరిని నియమించారు. అతడు రోజూ వచ్చి కాళ్లు చేతులు పాదాలు కొంత చలనశక్తిని సంపాదించుటకు కావలసిన క్రియలను వాడిచేత చేయించేవాడు. చికిత్సలో ఒక భాగంగా చలనం కలిగిన ఎడమ తొడలోని మాంస కృత్తులను విడదీసి, చలనం లేని కుడి తొడలో అతికించారు. ఈ శస్త్రచికిత్స జరిగినప్పుడూ, అటు తర్వాతనూ పిల్లవాడు పడిన బాధ ఇంతా అంతా కాదు. పాదాలకు ప్రత్యేక బూట్సును, మోకాలివరకు ఇంకొక ప్రత్యేక పరికరాన్ని అమర్చారు. వారు చేసిన చికిత్స నంతను వివరించడం నాకు సాధ్యం కాదు. అది అనవసరం కూడాను. ఈలాగు ఆరునెలలు చికిత్స జరిగిన తర్వాత వాడు కూర్చుండుటకు, లేచుటకు శక్తిగల వాడయ్యాడు. దోగాడుటకు మొదలు పెట్టాడు. క్రమక్రమంగా లేచి నిలబడ గలిగాడు. నాలుగైదు అడుగులు పెట్ట గలిగాడు. వ్యాధి ఎలాగో నిర్మూలమై మామూలు మనిషిగా తిరిగి తయారయ్యాడు. ఇది మా అదృష్టమని భావించాము. తర్వాత వీడు విద్యను సాగించి అన్ని పబ్లిక్ పరీక్షలలో ప్రథమశ్రేణిలో కృతార్థుడైనాడు. ఇప్పుడు ఆడిటరు వృత్తిలో ప్రవేశించుటకు శిక్షణ పొందు చున్నాడు. మొదటి పరీక్షలో మంచి మార్కులు తెచ్చుకొన

గలిగాడు. రెండవ పరీక్షకు (ఇదే ఆఖరు పరీక్ష) చదువు తున్నాడు.

1959 లో నా 71-వ జన్మదినాన్ని నా కుమార్లు అతివైభవంగా జరిపారు. ఆ రోజున ఒక గొప్పసమావేశంలో నా మిత్రులు, ఉభయ భాషలలో పండితులు, గ్రంథకర్తలుగా ప్రఖ్యాతి గాంచిన ఆకుండి వెంకట శాస్త్రిగారు వారి 'శ్రీవిలాస' మనే గ్రంథాన్ని నాకు అంకితం చేశారు. హైదరాబాదులోని ప్రముఖు లనేకులు సమావేశానికి వచ్చి నన్ను గౌరవించారు. సుప్రసిద్ధ విమర్శకులు కురుగంటి సీతారామయ్యగారు అధ్యక్షత వహించారు. సర్వశ్రీ పెనుమత్స సత్యనారాయణరాజు, మాడపాటి హనుమంతరావు, ఖండవల్లి లక్ష్మీరంజనం మొదలైనవారు ప్రసంగించారు. సమావేశం విజయవంతంగా జరిగింది. నాజీవితంలో ఇది ఒక సుదినంగా నేను పరిగణిస్తున్నాను.

ఇదే సంవత్సరం సెప్టెంబరులో నా తమ్ముడు రామకృష్ణయ్య తాను వ్రాసిన 'వాల్మీకి రామాయణ అమృతసారము'ను మా దంపతు లిద్దరికీ హైకోర్టు న్యాయధీశులు పెనుమత్స సత్యనారాయణ రాజుగారి అధ్యక్షతన నెల్లూరు టౌన్ హాలులో జరిగిన మహా సభలో అంకితం చేశాడు. మాపట్ల వాడికి గల గౌరవాభి మానాలకు ఇది ఒక బాహ్యచిహ్నంగా మేము భావించాము.

ఇదేవిధంగా జూన్ 23 న నా శిష్యవర్గంలో ఒకరున్నూ, ఉభయభాషలలో గొప్ప పండితులుగాను, రచయితలుగాను ప్రఖ్యాతి గాంచిన సరిపల్లి విశ్వనాథశాస్త్రిగారు వారు రచించిన 'యాదవ రాఘవపాండవీయ వ్యాఖ్యానము'ను కృష్ణదేవరాయ గ్రంథాలయంలో మాడపాటి హనుమంతరావుగారి అధ్యక్షతన జరిగిన మహాసభలో నాకు అంకితం చేశారు.

1959 లో నా కుమారుడు కృష్ణమూర్తి ఉస్మానియా విశ్వవిద్యాలయ అధ్యాపకత్వానికి రాజీనామా చేసి బెంగుళూరు సైన్స్ ఇన్‌స్టిట్యూట్‌లో పరిశోధకుడుగా చేరాడు. నా కుమార్లలో వాడు నాకు చాలా సన్నిహితుడై నా సమస్యలను పరిష్క రించడంలో మంచి సలహాలను ఇస్తూ ఉండేవాడు. వాడు

బెంగుళూరికి వెళ్లిపోవడం నాకు కొంత విచారాన్ని కలిగించినా వాడి అర్హతకు తగిన పదవి హైదరాబాదులో లభించనప్పుడు అన్యథాగా చేయడం ప్రాజ్ఞతకాదని నేను తృప్తిపడినాను. ఈ రోజులలో భారతీయులలో విద్యావంతు లనేకులు వారి విద్యను పూర్తిగా వినియోగించుటకు స్వదేశంలో అవకాశాలు లేనందున అమెరికా వంటి విదేశాలకు వెళ్ళి ఉద్యోగాలు చేయడం పరిపాటిగా వున్నది. అలాంటివారికి దేశాభిమానం లేదని వారిని కొందరు విమర్శించడం కద్దు. నేను ఈ విమర్శతో ఏకీభవించేవాడను కాను. ఈలాటి విద్యావంతులు విదేశాలకు వెళ్లి వారి శక్తి సామర్థ్యాలను పూర్తిగా వినియోగించి గొప్ప ప్రఖ్యాతిని గడించగలుగుతున్నారు. ధనార్జన కూడా వారి ఉద్దేశమైనా ఇది ఒక్కటే వారి ఉద్దేశం కాదు. వారిలో కొందరు గొప్ప పరిశోధనలు గావించి నోబెల్ బహుమానాలను పొందినవారు కూడా వున్నారు. వారి మూలంగా భారత దేశపు పేరు ప్రతిష్ఠలు ప్రపంచమందంతటా వ్యాప్తి గాంచుచున్నవి. ప్రాచీన కాలంలో బౌద్ధమత ప్రచారకులు, వైదికమత, ప్రచారకులు చైనా, జపాన్, ఆగ్నేయ ఏషియా దేశాలకు వెళ్ళి భారతీయ సంస్కృతిని వ్యాపింప చేయగలిగారు. ఈనాడుకూడా విద్యావంతులుగా విదేశాలకు వెళ్ళే భారతీయులు ఈలాటివా రనేదే నా భావం.

1958 లో నా భార్య మా రెండవ కుమార్తె గోదావరితో కలిసి కంచి కామకోటి పీఠాధిపతి శంకరాచార్యులను మద్రాసులో దర్శనం చేసుకొన కలిగింది. ఆ సమయంలో ఒక సందేశం ఇయ్యవలసిందిగా ఆమె వారిని కోరింది. వారు "శ్రీరామ" అని కోటి పర్యాయాలు వ్రాయవలసిందిగాను, దాని మూలంగా ఆమె తరించగలదని ఆదేశించారు. వారి ఆదేశానుసారం ఆమె శ్రీరామనవమినాడు రామకోటిని వ్రాయడం ప్రారంభించింది. 40 లక్షలు వ్రాసేనాటికి శంకరాచార్యులవారు మద్రాసు సమీపంలో ఒక గ్రామంలో మకాంచేసి ఉండినారు. అప్పుడు ఈ 40 లక్షల రామకోటి వ్రాసిన నోటుబుక్కులతో మేము ఇద్దరమూ, నా రెండవ కుమార్తె గోదావరి, నా అల్లుడు అల్లాడి వాసుదేవన్ శంకరాచార్యుల దర్శనార్థం వెళ్ళి వారిని కలుసుకొని

రామకోటి పుస్తకాలను వారికి అందజేయగా వారు అతిసంతోషంతో వాటిని స్వీకరించి, నా భార్యకు ఒక బంగారు కాసును ఇచ్చి మమ్ములను ఆశీర్వదించి పంపివేసినారు. ఆ సమయంలో ప్రసంగ వశాన మేము పుదూరు ద్రావిడశాఖకు చెందినవారమని తెలిసికొని 'అల్లాడి మహాదేవశాస్త్రిగారు మీకు బంధువులా' అని ప్రశ్నించి నారు. వారు నా భార్యకు పెద్దతండ్రి అని చెప్పగా' వారు గొప్ప పండితు లనీ, ఒక పర్యాయం వారు ఒక గంటకాలం ఏదో వేదాంత విషయాన్ని గురించి తమతో చర్చించినా'రని సెలవిచ్చారు.

అటుతర్వాత నాభార్య రామకోటిని వ్రాసే కార్యక్రమాన్ని నిర్విరామంగా సాగిస్తూ దానిని పూర్తిచేసింది. అప్పుడు కామ కోటి పీఠాధిపతి మధురలో మకాం చేస్తూ ఉండినారు. వారి దర్శనార్థం వెళ్లదలచి, ప్రసంగవశాన మా అభిప్రాయాన్ని మా బంధువర్గంలో ఒకరైనట్టిన్నీ, ఆడిటర్ గా ప్రఖ్యాతిగాంచినట్టిన్నీ వేదం మహాదేవన్ గారికి తెలియపరచాము. వీరు శంకరాచార్యుల వారికి అనేక సంవత్సరాలుగా ప్రియ శిష్యులు. వారితో సన్నిహిత సంబంధం గలవారు. మా అభిప్రాయాన్ని తెలియపరచగానే తానే మా ఇద్దరిని మధురకు తీసుకొనివెళ్లి శంకరాచార్యుల దర్శ నానికి ఏర్పాటుచేయుటకు సిద్ధపడ్డారు. మేము ఇద్దరం మహాదేవన్, వారి భార్యతో కలిసి 14-5-'61 న మధురకు ప్రయాణం చేశాము. 15-5-'61 న శంకరాచార్యుల సన్నిధికి వెళ్ళినాము.

ఆనాడు మధురలో నా రెండవ కోడలు రాధయొక్క తల్లి దండ్రులు ఉండెడివారు. వారిని చూచుటకు నా కోడలు, నా కుమారుడు సీతారాం, నా మనుమరాలు జయంతి కొన్ని రోజుల క్రిందట అక్కడికి వచ్చి ఉండినారు. నేనూ, నా భార్య శంకరా చార్యులవారి దర్శనార్థం వెళ్లినపుడు వారుకూడా మాతోవచ్చి నారు. మహాదేవన్ గారు మాతో ఉండడంచేత వారి దర్శనం మాకు సులభంగా లభించింది. నా భార్య రామకోటిని వ్రాసి పూర్తిచేసి నందుకు వారు చాలా సంతోషించినారు. ఆమె తెచ్చిన రామకోటి పుస్తకా లన్నిటిని వారికి సమర్పించగా వారు వాటిని స్వీకరించి మా అందరినీ ఆశీర్వదించారు. ప్రసంగవశాత్తున నా మనుమ రాలు జయంతిని చూచి "నీ వేమి చేస్తున్నావు?" అని అడిగి

నారు. "నేను హైయర్ సెకండరీ పరీక్షకు వెళ్ళినాను." "అటు తర్వాత ఏమి చేస్తావు?" అని వారు ఇంకొక ప్రశ్న వేశారు. "నేను ఇంకా దానిని గురించి ఆలోచించలే" దని అమ్మాయి చెప్పింది. అప్పుడు వారు "నీవు వైద్యశాస్త్రం చదువు. దేశంలో వైద్యుల కొరత ఎంతగానో వున్నది" అని సలహా ఇచ్చారు. నా మనుమరాలు అలాగే చేసి, ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఎం. బి. బి. యస్. పట్టభద్రురాలై, అటుతర్వాత బొంబాయి విశ్వవిద్యాలయంలో ఎం. డి. డిగ్రీని సంపాదించింది.

ఈవిధంగా శంకరాచార్యుల దర్శనం చేసుకొని, మరుసటి దినం మేమందరము నా వియ్యంకులు కృష్ణన్‌గారి ఇంటిలో భోజనంచేసి, సాయంత్రం ఆ రైలులో తిరుగు ప్రయాణంచేసి మద్రాసు చేరుకొన్నాము.

కంచి కామకోటి పీఠాధిపతుల ఆదేశానుసారం రామకోటిని వ్రాయడం పూర్తిచేసి, నోటు పుస్తకాలన్నిటినీ వారికి సమర్పించ గలిగినందుకు నా భార్య ఆనందభరితురాలైనది. తన జన్మ సార్థకమైనట్లు భావించింది. అటుతర్వాత కూడా రామకోటిని ఈనాటివరకు వ్రాస్తూనే వున్నది.

మమ్ములను మధురకు తీసుకొని వెళ్ళినప్పుడు మహాదేవన్ గారే మా ప్రయాణ ఖర్చులను భరించారు. నేను మద్రాసు చేరిన తర్వాత ఆ ఖర్చులకుగాను 150 రూపాయల చెక్కును వారికి పంపినాను. కాని ఆ చెక్కును మార్చి సొమ్మును తీసుకొనుటకు వారు ఇష్టపడలేదు. ఆ చెక్కును మార్చక, మా ఇద్దరి మధ్య ఏర్పడిన స్నేహానికి దానిని ఒక చిహ్నంగా భద్రపరచి తమ వద్ద ఉంచుకొన్నారు. వారి ఔదార్యానికి దంపతులు మేము ఎంతగానో సంతోషించినాము.

1960 ఏప్రిలులో ఉస్మానియా విశ్వవిద్యాలయంలో అధ్యాపకులుగా ఉండిన కె. సజ్జనలాల్ గారితో నాకు పరిచయం కలిగింది. వారు ముస్లిం మతానికి చెందినవారైనా వారి పేరు హిందువులు పెట్టుకొనే పేరువలె నాకు కనిపించింది. దానికి కారణ మేమిటి అని నేను వారిని ప్రశ్నించగా తమ తండ్రి

హైదరాబాదులో గొప్ప క్షామం సంభవించినప్పుడు క్షామ బాధితులకు సహాయం చేసి వారిని రక్షించారని, దానికి అప్పటి నిజాం ప్రభువు హర్షించి వారికి 'సజ్జన్ లాల్' (సత్ జన్=మంచి వారు) అనే బిరుదును ప్రసాదించినారని, తండ్రిగారు తనకు ఆ పేరే పెట్టినారని సమాధానం చెప్పినారు.

సజ్జన్ లాల్ ఉర్దూలో గొప్ప పండితులు. 19-వ శతాబ్దంలో ప్రకటింపబడిన ఉర్దూ పత్రికలను కొన్ని సేకరించి, వాటిని ఆధారం చేసుకొనే పరిశోధన జరిపి కొన్ని వ్యాసాలను వ్రాశారు. వీరు సేకరించిన గ్రంథాలయంలో అనేక ప్రాచీన గ్రంథాలు ఉండేవి.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఆంధ్ర ప్రాంతంలో జరిగిన స్వాతంత్ర్యసమరాన్ని గురించిన చరిత్రను వ్రాయించుటకు ఒక రాష్ట్ర కమిటీని, నిపుణులతో కూడిన ఒక కార్యనిర్వాహక కమిటీని నియమించింది. ఈ రెండు కమిటీలకు సజ్జన్ లాల్ గారు కార్యదర్శులు. కార్యనిర్వాహక కమిటీవారు స్వాతంత్ర్యసమర చరిత్రను వ్రాయుటకు కావలసిన మౌలిక ఆధారాలను సేకరించుటకు డాక్టర్ నేలటూరు వెంకట రమణయ్యగారిని నియమించారు. వీరు మద్రాసులోని రికార్డు ఆఫీసులో రెండు మూడు సంవత్సరాలు పరిశోధన గావించి సుమారు 20,000 పుటలతో కూడిన ఆధారాలను సేకరించినారు. వీటి సహాయంతో స్వాతంత్ర్య సమర చరిత్రను రచించడం కమిటీవారి ఉద్దేశం.

ఇదిగాక కార్యనిర్వాహక కమిటీవారు చరిత్రలో ఏ యే విషయాలు చేర్చవలెనో సూచిస్తూ ఒక ప్రణాళికను తయారు చేశారు. దానిని అనుసరించి చరిత్రను వ్రాయించడం వారి లక్ష్యం.

1960 కు పూర్వం నాకు హైదరాబాదుతో ఎక్కువ పరిచయం లేదు. నేను రాష్ట్ర కమిటీలోగాని, కార్యనిర్వాహక కమిటీలోగాని సభ్యుడను కాను. కార్యనిర్వాహక కమిటీలో చరిత్ర రచయితలుగా ప్రఖ్యాతిగాంచిన నీలకంఠ శాస్త్రిగారు, నేలటూరు వెంకట రమణయ్యగారు, తదితరులు సభ్యులుగా వుండినారు. కాని వీరెవ్వరు స్వాతంత్ర్య సమర చరిత్రను వ్రాసే బాధ్యతను వహించుటకు సిద్ధపడలేదు. అలాంటి పరిస్థితిలో దానిని రచించుటకు నన్ను కోరినారు. నేను దానికి అంగీకరించాను.

తొందరపడి దీనికి అంగీకరించినానేమో అనే సందేహం తర్వాత సంభవించిన పరిణామాల మూలంగా నాకు కలిగింది. కాని అలాటి పరిణామాలు సంభవించగలవని నేను ఊహించలేక పొయ్యాను. ఒకటి మాత్రం వాస్తవం. నేను ఈ చరిత్రను నా శక్తి సామర్థ్యాలను పూర్తిగాను, హృదయపూర్వకంగాను వినియోగించి రచించాను.

దీనిని సాగించడంలో నేను కొన్ని పరిమితులకు లోబడి కృషి చేయవలసి వచ్చింది. నేలటూరు వెంకట రమణయ్యగారు సేకరించిన ఆధారాల సహాయంతో మాత్రమే నేను దీనిని రచించవలసివచ్చింది. అవి సమగ్రమైన ఆధారాలు కావు. మద్రాసు రికార్డు ఆఫీసులో లభించిన వాటిని మాత్రమే వారు సేకరించినారు. ఇవిగాక స్వాతంత్ర్య సమరాన్ని పూర్తిగా వివరించుటకు ప్రతి జిల్లాలో లభించే ఆధారాలను సేకరించడం ఎంతైనా అవసరం. కాని అది చాలా కాలయాపనతో జరగవలసిన కార్యక్రమం. దీనిని చేపట్టుటకు ప్రభుత్వం నియమించిన కమిటీలు ఏలాటి ప్రయత్నమూ చేయలేదు. అలాటి ప్రయత్నం పూర్తిగా జరుగుటకు ఎన్నో సంవత్సరాలు పట్టేది. అందుచేత వారు ఆ ప్రయత్నంలోకి దిగక, వెంకట రమణయ్యగారు సేకరించిన ఆధారాల సహాయంతో మాత్రమే ఈ చరిత్ర రచనను చేయవలసిందిగా నన్ను ఆదేశించారు. ఆధారాలు అసమగ్రంగా ఉండడం చేత నేను రచించిన చరిత్ర అసమగ్రంగా ఉండడం తప్పింది కాదు ఈవిషయాన్ని మొదటి సంపుట లోని నా పీఠికలో స్పష్టం చేశాను. నా రచనను సమీక్షించి విమర్శించిన వారు నా పీఠికను చదవక విమర్శలోకి దిగినారు.

ఈ చరిత్ర రచనలో ఏయే విషయాలు చేర్చడం అవసరమో తెలియపరచుటకు కార్యనిర్వాహక కమిటీవారు ఒక ప్రణాళికను తయారు చేశారు. ఆ ప్రణాళిక 1905 వరకు జరిగిన చరిత్రకు మాత్రమే సంబంధించినట్టిది. 1905 తర్వాత జరిగిన చరిత్రకు సంబంధించి వారు ఏలాటి ప్రణాళికను తయారు చేయలేదు.

ఇదివరలో నేను వ్రాసిన గ్రంథాలన్నీ స్వతంత్రంగా వ్రాసినట్టివి. ఇతరుల అజమాయిషిలో వ్రాసినట్టివి కావు. కాని ఈ

స్వాతంత్ర్య సమర చరిత్రను వ్రాయడంలో నేను కార్యనిర్వాహక కమిటీవారికి లోబడి వ్రాయవలసి వచ్చింది. నా వ్రాతప్రతిని కమిటీ సభ్యులలో ఒక్కొక్కరు క్షుణ్ణంగా పరిశీలించి, దానిని మార్చుటకు, మెరుగుపరచుటకు సూచనలుచేసే అధికారం వారికి ఉండేది. ఆ సూచన లన్నిటిని కార్యనిర్వాహక కమిటీ పరిశీలించి వాటిలో ఏవి గ్రాహ్యములో ఏవికావో నిర్ణయించేది. గ్రాహ్యము లైన సూచనల మేరకు నేను నా వ్రాతప్రతిని సవరించవలసి ఉండేది. నేను ఈ సవరణలను చేసిన తర్వాత కమిటీ సమావేశమై నేను సవరించిన వాటిని ఆమోదించిన తర్వాత దానిని రాష్ట్రకమిటీ వారు ఆమోదించడం జరిగేది. ఈ రెండు రకములైన ఆమోదాలు లభించినతర్వాతనే వ్రాతప్రతి అచ్చుకావడం, గ్రంథరూపంలో ప్రకటింపబడడం జరిగేది. అందుచేత స్వాతంత్ర్యసమర చరిత్ర తుది స్వరూపాన్ని నేను మాత్రమేగాక పైన పేర్కొన్న రెండు కమిటీలు నిర్ణయించడం జరిగేది. నేను ఒక్కడినే దీనికి బాధ్యుడను కానని ఈగ్రంథాన్ని విమర్శించినవారు గ్రహించలేదు.

ఈ చరిత్రను ప్రభుత్వం ప్రకటించడం చేత దీనిని గురించి శాసన సభలోని సభ్యులు విమర్శించే అవకాశం లభించింది. ఆ విమర్శలు సహేతుకములైనా కాకపోయినా వాటికి జవాబు చెప్పగల హక్కు గ్రంథకర్తకు ఉండేదికాదు. అది శాసనసభ హక్కులకు భంగకరమనే సంప్రదాయం ఏర్పడి ఉండిన కారణంగా సభ్యులు కొందరు ఇష్టం వచ్చినట్లు గ్రంథాన్నివిమర్శించడం జరిగింది. ఇది నా ప్రతిష్ఠకు భంగకరంగా ఉండినా నేను నోరుమూసుకొని ఉండడం తప్పింది కాదు. ఈలాటి విమర్శలు జరుగునని నేను మొదటిలో ఊహించ లేకపోయినాను. అందుచేతనే కమిటీ కోరిన ప్రకారం ఈ రచనకు పూనుకొనడంలో కొంత తొందరపడినా నని పైన పేర్కొనినాను.

ఈ చరిత్రను నాలుగు సంపుటాలలో వ్రాయించ వలసిందిగా కార్య నిర్వాహక కమిటీవారు నిర్ణయించి, మొదటి సంపుటాన్ని వ్రాయవలసిందిగా నన్ను ప్రథమంలో కోరారు. అటుతర్వాత తక్కిన సంపుటాలను వ్రాసే బాధ్యతను నాకే అప్పగించారు.

నా మొదటి సంపుటి రచనను కొందరు విమర్శించడం కమిటీవారికి తెలిసినా, ఆ విమర్శలు సహేతుకాలుకావని వారు భావించడంచేత అన్ని సంపుటాలను నాచేతనే వ్రాయించడం జరిగిందని నా అభిప్రాయం.

ఈ విధంగా 1960 లో సజ్జనలాల్‌గారితో నాకు కలిగిన పరిచయం ఆంధ్రలో జరిగిన స్వాతంత్ర్య సమర చరిత్రకు నేను గ్రంధకర్త కావడానికి దారి తీసింది.

మొదటి సంపుటానికి సంబంధించిన మౌలికాధారాలను 1961 ప్రారంభంలో నాకు అందజేశారు. సంపుటాన్ని నేను రెండు భాగాలుగా విభాగంచేసి, మొదటి భాగంలో స్వాతంత్ర్యోద్యమ చరిత్రను కథారూపంలోను, రెండవ భాగంలో మౌలికాధారాలలో ప్రధానములైన వాటిని ఎంపికచేసి ప్రకటించాను. ఇతర రాష్ట్రాల ప్రభుత్వాలు కూడా ఆ యా రాష్ట్రాల స్వాతంత్ర్యోద్యమ చరిత్రను వ్రాయించాయి. కాని వాటిని రచించినవారు నేను అనుసరించిన పద్ధతిని అనుసరించినవారు కారు. నా పద్ధతి మూలంగా మొదటి భాగం సామాన్య ప్రజలకు, రెండవ భాగం భావి పరిశోధకులకు ఉపయోగపడగలవని భావించాను. ఇదియే నా పద్ధతిలోని విశిష్టత.

మొదటి సంపుటాన్ని నేను 1961 జూన్ ఆఖరుకు పూర్తి చేసి, రెండు భాగాల వ్రాతప్రతిని సజ్జన్‌లాల్‌గారికి పంపినాను. కాని దానిని టైపు చేయడం, రెండు కమిటీలవారు పరిశీలించి ఆమోదించడం, ప్రభుత్వ ముద్రణాలయంవారు దానిని ముద్రించడం చాలా ఆలస్యంగా జరిగింది. 1965 కు గాని ఈ తంతు పూర్తి కాలేదు. తక్కిన సంపుటాల విషయంలో కూడా ఈలాటి ఆలస్యం జరిగింది. ప్రతి సంపుటాన్ని నేను కొన్ని నెలలలో పూర్తిచేసే వాడిని. కాని వాటి ప్రకటన కొన్ని సంవత్సరాలు పట్టేది. ప్రభుత్వ అధ్వర్యంలో జరిగే పనులన్ని ఈలాటి ఆలస్యంతో కూడు కొని ఉంటవి. సమర చరిత్రను వ్రాయించుటకు 1957 లో ప్రభుత్వం కమిటీలను ఏర్పాటుచేసింది. ఆపని ఇప్పటికి (1978 అక్టోబరు) కూడా పూర్తికాలేదు. 1948 లో నిజాంరాజ్యంలో జరిగిన పోలీసు చర్య

గురించిన చరిత్రను వ్రాయించడం అయిదారు సంవత్సరాలక్రిందట ఒకరికి ఒప్పగించినా ఆ రచన ఇప్పటికి కూడా పూర్తి కాలేదు. కమిటీ నిమిత్తం ఏటేట కొన్ని వేల రూపాయలు ఖర్చు జరుగుతున్నది. ఇది అనవసరమైన ఖర్చు అనే భావం అధికారులకు కలగకపోవడం విచారకరం.

1961 లో తెలుగు భాషా సమితివారు ప్రకటించిన విజ్ఞాన సర్వస్వం మొదటి సంపుటాన్ని పూర్తిగా సంస్కరించి వ్రాయించవలసిందిగా కార్యనిర్వాహకవర్గంవారు నన్ను కోరారు. నేను ఇందులోని చరిత్ర విభాగాన్ని, రాజనీతి విభాగాన్ని నూతన దృక్పథంతో సంస్కరించుటకు నిర్ణయించుకొని, ఒక సంవత్సరంలోపల దీనిని పూర్తిచేశాను.

మొదటి ముద్రణ సందర్భంలో అప్పటి సంపాదకులు గిడుగు సీతాపతిగారు, ప్రతాపగిరి రామమూర్తిగారు ఆధునిక యూరపు ఖండ చరిత్రను గురించి, పాశ్చాత్య రాజనీతి తత్వపరిణామాన్ని గురించి వ్యాసాలు వ్రాయవలసిందిగా నన్ను కోరారు. వారి కోరిక మేరకు నేను ఈ రెండు వ్యాసాలను వ్రాసి పంపినాను. కాని ఏకారణంచేతనో చరిత్రకు సంబంధించిన వ్యాసాన్ని వారు ముద్రించలేదు. తర్వాత వారివద్దనుండి నా వ్రాతప్రతిని తీసుకొని, "పాశ్చాత్యుల వృద్ధిక్షయాలు" అనే పేరుతో దానిని ఒక ప్రత్యేక గ్రంథంగా శేషాచలం కంపెనీవారి ద్వారా ప్రకటించాను.

1958 ప్రాంతంలో హైదరాబాదులోని ప్రముఖులు కొందరు డాక్టర్ చెన్నారెడ్డిగారి అధ్యక్షతను ఖండవల్లి లక్ష్మీరంజనంగారి కార్యదర్శకత్వాన ఒక కమిటీగా ఏర్పడి సంగ్రహ విజ్ఞానకోశాన్ని అయిదారు సంపుటాలలో ప్రకటించుటకు నిర్ణయించారు. అందుకుగాను, నా అధ్యక్షతన ఒక సంపాదకీయ వర్గాన్ని నియమించారు. అధ్యక్షుడనుగా నేను రాజనీతికి సంబంధించిన వ్యాసాలను అనేకం వ్రాసి ఇందులో ప్రకటించాను.

ఈవిధంగా 1957-'61 లో నేను వ్యాధిగ్రస్తుడనైనా గ్రంథ సమీక్షలు మొదలైన మామూలు కార్యకలాపాలతోపాటు ప్రత్యేక కార్యక్రమాలు కొన్నిటిని చేపట్టి నా కాలాన్ని

వ్యర్థపుచ్చక సార్థకంగా వినియోగించినాను. వార్ధక్యం నా కార్య క్రమాలకు ఏలాటి ఆటంకం కలిగించకపోవడం నా అదృష్టమని భావిస్తున్నాను.

1962 మన దేశచరిత్రలో ఒక గడ్డు సంవత్సరం. ఆ సంవత్సరం సెప్టెంబరు, నవంబరులలో చైనావారు బ్రిటిష్ పరిపాలన కాలాననుండి గుర్తింపబడిన సరిహద్దులను అతిక్రమించి గొప్ప సైన్యంతో ఆగ్నేయభాగంలోని హిమాలయ ప్రాంతాలను, కాశ్మీరులోని లడక్ ప్రాంతాలలో కొన్నిభాగాలను వశపరచు కొన్నారు. అస్సాం వారి వశంలోకి వచ్చే ప్రమాదం ఏర్పడింది. నెహ్రూ గొప్ప ఆదర్శవాది. ప్రపంచశాంతి అవసరమని పదే పదే వాదించినవారు. అవకాశం లభించినప్పుడంతా అందుకు గాను కృషి చేసినవారు. కాని వాస్తవ పరిస్థితులను గుర్తించ లేదు. చైనావారు టిబెట్‌పై దురాక్రమణ గావించి, దానిని పూర్తిగా వశపరచుకొన్న సమయంలో తన నిరసనను తెలియ పరచక పోవడమేగాక, చారిత్రక విషయాలను పూర్తిగా విస్మరించి టిబెట్ చైనా వశంలోని భూభాగం అనే వాదాన్ని 1954 లో సమర్థించారు. భారతదేశం ఏ రాజ్యకూటమిలో చేరరాదనిన్ని, విదేశ రాజ్యాంగ విధానంలో అలీనపద్ధతియే శ్రేయస్కరమనిన్ని, మనదేశంపై దురాక్రమణ చేసేవారు ఎవరూ లేరని విశ్వసించిన వాడు. కాని 1959 నుండి చైనావారు దురాక్రమణను ప్రారంభించారు. అప్పుడు రక్షణమంత్రిగా ఉన్న కృష్ణమీనన్ నెహ్రూకు ప్రధాన సలహాదారుడు. కమ్యూనిస్టు తత్వాన్ని అభిమానించినవాడు. చైనాయెడల పక్షపాతం వహించినవాడు. రక్షణసైన్యాలను బలపరచుటకు ఏలాటి చర్యలను తీసుకొన్న వాడు కాడు. సైన్యాధిపతుల నియామకంలో రాజకీయాలను ప్రవేశపెట్టినాడు. మనదేశంపై దండెత్తి వచ్చినప్పుడు మన సేనలు చైనా సేనలను ఎదిరించి నిలబడలేక పరాజయాన్ని పొందడం తప్పిందికాదు. అలాటి క్లిష్టసమయంలో అమెరికా వారు, బ్రిటిషువారు మనకు సహాయం చేయుటకు సిద్ధపడ్డారు. దీనిని గమనించిన చైనావారు నవంబరులో కొన్ని ప్రదేశాలను మాత్రమే తమ వశంలో ఉంచుకొని, ఏకపక్షీయంగా యుద్ధాన్ని

విరమించుకొని తాత్కాలికంగా వెనుకకు వెళ్ళిపోయినారు. గొప్ప గండం తప్పించుకొని మనం ఏలాగో బయటపడినాము.

ఆనాడు కోట్లకొలది భారతీయులు ఆందోళన పడినట్లు సామాన్య పౌరుడనైన నేను కూడా ఆందోళనపడినాను. ప్రజలందరు దేశసమైక్యతను, సమగ్రతను రక్షించుటకు తమ శక్తి సామర్థ్యాలను వినియోగించవలెనని నిర్ణయించుకొన్నారు. నేను కూడా ఈలాటి భావం కలవాడనైనాను. రక్షణనిధికి ప్రతినెలా 20 రూపాయులు విరాళంగా ఇచ్చుటకు నిర్ణయించుకొన్నాను. క్రమ క్రమంగా 10,000 రూపాయలు జాతీయ రక్షణ సర్టిఫికెట్లు కొనుటకు వినియోగించినాను. దేశరక్షణ విషయం గురించి పత్రికలకు వ్యాసాలు వ్రాశాను. ఆకాశవాణిలో ప్రసారం చేశాను. బుద్ధదేవుడు చేపట్టదగిన కార్యకలాపాలను చేపట్టినాను. కృష్ణమీనన్ రక్షణశాఖకు మంత్రిగా ఉండరాదని ప్రజలు వ్యక్త పరచిన అభిప్రాయంతో ఏకీభవించాను. మహారాష్ట్ర ముఖ్య మంత్రిగా ఉన్న చవాన్‌ను రక్షణమంత్రిగా నెహ్రూ నియమించడం పట్ల హర్షాన్ని తెలియపరచాను. 'ఉడతకు ఉడతాభక్తి' అన్నట్లు నేను కూడా పైవిధంగా దేశరక్షణ కార్యక్రమాలలో ఎంతో కొంత పాల్గొని నా దేశాభిమానాన్ని వ్యక్తంచేశాను.

కొన్నిసంవత్సరాలుగా నెహ్రూపట్ల, ఆయన ప్రభుత్వం పట్ల, ఆయన అనుసరించిన విధానాలపట్ల ప్రముఖులలోను, సామాన్య ప్రజలలోను ఒకవిధమైన అతృప్తి కలిగింది. నేను రెండు పర్యాయాలు చింతామణి దేశ్ముఖ్ గారిని కలుసుకొన్నప్పుడు ప్రసంగవశాత్తున వారు నెహ్రూను తీవ్రంగా విమర్శించారు. వారి ప్రణాళికలు ఫలప్రదములు కాలేదని, వారి మంత్రివర్గంలో అవినీతిపరులైనవా రనేకులు ఉన్నారని, అందుచేతనే దేశంలో అన్నిరంగాలలో అవినీతి పెరిగిందని, దేశంలో ఒకవిధమైన నియంతృత్వం ఏర్పడీనదని స్పష్టంగా చెప్పినారు. నేను ఢిల్లీకి వెళ్ళినప్పుడు, వారు మనుమడి ఉపనయనానికి మద్రాసు వచ్చినపుడు, రాష్ట్రపతిగా హైదరాబాదులో కొన్ని వారాలపాటు మకాం చేసినప్పుడు శ్రీ రాధాకృష్ణన్ గారిని కలుసుకొన్నాను. ఆంధ్రప్రదేశ్‌లో రెడ్డిరాజులు,

కమ్యూనిస్టులు పరిపాలకులుగా ఉన్నారని, నెహ్రూ విధానాలు విఫలమైనవని ఏలాటి దాపరికం లేకుండా వారి అభిప్రాయాలను వ్యక్తం చేశారు. ఒక సమయంలో నేను నెల్లూరులో ఉండగా నెహ్రూ రైలులో మద్రాసు ప్రయాణం చేస్తూ నెల్లూరు స్టేషన్‌లో కొంతసేపు ఆగి ఒక బహిరంగసభలో ప్రసంగించారు. వారి ప్రసంగాన్ని వేలాదిజనం విని అనేకపర్యాయాలు హర్షధ్వానాలు చేశారు. కాని ప్రజలందరు వారి ప్రభుత్వం పట్ల వాస్తవంగా విశ్వాసం కలవారుగా కనుపించలేదు. ధరలు విపరీతంగా పెరిగిపోవడం, కనీస అవసరాలైన బియ్యం, చింతపండు, మిరపకాయలు, పంచదార మొదలైన పదార్థాలకు కొరత ఏర్పడడం, దీనికి నెహ్రూ ప్రభుత్వం ఏలాటి ప్రతిక్రియను చేయలేక పోయినదని ఆయనను నిందించడం ఆరోజులలో పరిపాటిగా ఉండేది. వారి విదేశ విధానమే గాక, దేశ పరిపాలన కూడా లోపభూయిష్ఠమైనట్లు ప్రజలు భావించేవారు. నాకు కూడ ఆలాటి భావం కలిగింది. అందుచేత ఎన్నికలలో ప్రజలు కాంగ్రెసు పక్షానికి మెజారిటీ బలం వచ్చేటట్లు వోటు చేయడం విపరీతంగా కనుపించింది. స్వాతంత్ర్యం లభించి పది పండ్రెండు సంవత్సరాలు గడిచిన తర్వాత కూడా వారు వోటు యొక్క విలువను గ్రహించలేక పోయినారు. ప్రజాస్వామికంలో వోటర్లు వహించవలసిన బాధ్యత గురించి ప్రభుత్వంగాని, విద్యా సంస్థలు గాని సామాన్య ప్రజలకు బోధించడంలో ఏలాటి కృషిని చేయకపోవడం దీనికి కారణం. ఈనాటికి కూడా ఈవిషయంలో ఏలాటి మార్పు జరుగలేదు. వోటర్లు విచక్షణా రహితంగా (కొన్ని మినహాయింపులకు లోబడి) వోటు చేయడం మన ప్రజాస్వామికానికి లక్షణం. దేశంలో బలీయమైన ప్రతిపక్షాలు ఏర్పడకపోవడం దీనికి ఇంకొక కారణం.

30-3-'63 నా జీవితంలో ఒక గొప్ప సుదినంగా నేను భావిస్తున్నాను. నా ప్రఖ్యాతికంతా అధ్యాపకుడనుగా నేను చేసిన కృషి ప్రధాన కారణం. దీనిని గుర్తించి, నా శిష్యవర్గంలో అనేకులు శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి నాయకత్వాన హైదరాబాదు రవీంద్ర భారతిలో "గురుపూజ" అనే పేరుతో

నన్ను, నా భార్యను సత్కరించుటకు ఒక మహాసభను సమావేశ పరచారు. పరిపాలన శాఖలో ప్రఖ్యాతి గాంచిన శొంఠి రామమూర్తిగారు దానికి అధ్యక్షులై ఆయన నేను ఒకే సంవత్సరం బి. ఏ. పరీక్షలో ప్రథమ శ్రేణిలో కృతార్థులగుటను సభవారి స్మరణకు తెచ్చి జీవితంలో నేను చేసిన కృషిని ప్రశంసించారు. శిష్యవర్గంవారు మా దంపతుల నిద్దరిని వస్త్రములతో బహూకరించి సత్కరించారు. సర్వశ్రీ శిరుగూరి హనుమంతరావు, దివాకర్ల వెంకటావధాని, తెన్నేటి విశ్వనాథం, కాట్రగడ్డ రాజగోపాలరావు మొదలైన ప్రముఖులు నన్ను గురించి ప్రసంగించారు. నేను సమావేశ కార్యకర్తలకు, వక్తలకు, అధ్యక్షునికి నా కృతజ్ఞతను తెలియపరుస్తూ ప్రసంగించాను. అంతకు కొన్ని రోజులకు ముందు తిరుమల రామచంద్రగారు నన్ను కలుసుకొని, నా జీవిత విశేషాలను తెలుసుకొని వాటిని గురుపూజ సందర్భంలో 'ఆంధ్రప్రభ' వారపత్రికలో ప్రకటించారు. ఉత్సవం విజయవంతంగా పూర్తి అయింది. మానవుడు ఇతరుల గుర్తింపును కోరుతాడు. నాకు ఈ సమావేశం మూలంగా అర్థమైన గుర్తింపు లభించినదని మా కుటుంబంలోని వారందరు సంతోషించారు.

# 10. నా వార్ధక్యం - రెండవదశ

ఆనాటినుంచి నేను చేపట్టిన సాధారణ కార్యక్రమాలు ఇంతకు పూర్వం 1944 నుంచి నేను చేపట్టిన వాటిమోస్తరుగానే ఉండినవి. 1962లో 44 గ్రంథసమీక్షలను 'డక్కన్ హెరాల్డు', 'ఇలస్ట్రేటెడ్ వీక్లీ', 'హిందూ', 'ఇండియా క్వార్టర్లీ' పత్రికలలో ప్రకటించాను. పత్రికలలో సమకాలిక సమస్యలగురించి 14 వ్యాసాలను వ్రాశాను. 10 రేడియో ప్రసంగాలను ప్రసారం చేశాను, అనేక సభా వేశాలలో పాల్గొని ప్రసంగించాను.

ఇవిగాక కొన్ని అదనపు కార్యక్రమాలను కూడా చేపట్టాను. 1958 నుండి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం జిల్లా గజెటియర్లను రచించుటకు సి. కె. మూర్తిగారి అధ్యక్షతన ఒక కమిటీని నియమించింది. అందులో నేను సభ్యుడనై మూర్తిగారు రచించిన చిత్తూరుపంలోని వ్యాసాలను సమీక్షించి వాటిని సవరించే విషయంలో నా సూచనలను యిస్తూ వచ్చాను. 1962 లో హైదరాబాదులో దివ్యజ్ఞాన సమాజశాఖ నన్ను అధ్యక్షునిగా ఎన్నుకొన్నది. నాకు దివ్యజ్ఞానతత్వంలో ఎక్కువ పరిచయం లేకపోయినా అధ్యక్ష బాధ్యతను స్వీకరించడంచేత కొన్ని గ్రంథాలను చదివి ప్రధానములైన కార్యక్రమాలలో నేను ప్రసంగించడం పరిపాటి అయింది. ఉన్నత న్యాయస్థానంలో ప్రధాన న్యాయమూర్తిగా ఉండిన సిన్హాగారు దివ్యజ్ఞాన సమాజ సభ్యులు. వారు 1962 లో హైదరాబాదుకు వచ్చినపుడు

దివ్యజ్ఞాన శాఖకు వారిని ఆహ్వానించాము. వారు ఆహ్వానాన్ని అందుకొని వచ్చినప్పుడు వారికి మా ఆహ్వానపత్రాన్ని సమర్పించి, మా శాఖ యొక్క కృషిని తెలియపరచే బాధ్యతను వహించాను. కాళేశ్వరరావుగారి తర్వాత వారు స్థాపించిన తెలుగు ఉర్దూ అకాడమికి వారు నన్ను అధ్యక్షునిగా ఎన్నుకొన్నారు. రెండు సంవత్సరాలపాటు దీని కార్యక్రమాలను సాగించినాను. 1964 లో నా ఆరోగ్యం పూర్తిగా క్షీణించడం చేత ఈ పదవికి రాజీనామా చేశాను.

1963 ఏప్రిల్ 24 న ఒక గండం నుండి నేను తప్పించుకొన్నాను. ఆ రోజు నేను స్నానాల గదిలో నిలబడి స్నానం చేస్తూండగా తల గిర గిర తిరగడం ప్రారంభమైనది. అది కారణంగా నేను క్రింద పడి తల బ్రద్దలు కావలసింది. కాని నేను పెద్ద కేక వేశాను. దానిని విని వెంటనే అప్పట్లో నాకు అతిథులుగా ఉండిన గుంటూరు వాస్తవ్యులు ఓరుగంటి రామబ్రహ్మంగారు గదిలోపలికి వచ్చి నన్ను గట్టిగా పట్టుకొని ఎలాగో మంచం వద్దకు మోసుకొని వెళ్ళి పరుండబెట్టినారు. దీనితో నాకు వర్టిగో వ్యాధి ప్రారంభమైనది. అరగంట తర్వాత మామూలు స్థితికి వచ్చినాను. కాని అది మొదలు తరుచుగా నాకు ఈ వ్యాధి తగలడం, ఒక్కొక్క పర్యాయం రోజుకు రెండు సార్లు దీనికి గురికావడం జరుగుతూ వచ్చింది. నేను చాలా బలహీనత గాంచి నా శారీరక శక్తిని చాలావరకు కోల్పోయాను.

ఈ వ్యాధితోనే నేను నా కార్యక్రమాలను యథాప్రకారం సాగిస్తూ వచ్చాను. 1962 సెప్టెంబరులో స్వాతంత్ర్య సమర కమిటీవారు 1920-'31 లో జరిగిన స్వాతంత్ర్య సమర చరిత్ర మూడవ సంపుటాన్ని రచించే బాధ్యతను నాకు ఒప్పగించారు. నేను దానిని రచిస్తూ ఉండగా రెండవ సంపుటాన్ని వ్రాసిన ఉస్మానియా విశ్వవిద్యాలయ చరిత్రశాఖలో ప్రధానాధ్యాపకులుగా ఉండిన పుట్టపర్తి శ్రీనివాసాచారిగారు వారి వ్రాతప్రతిని కార్య నిర్వాహణ కమిటీ వారికి పంపినారు. వారు దానిని పరిశీలించి అది తృప్తికరంగా లేనట్లు భావించి, దానిని సంస్కరించి తిరిగి

వ్రాయవలసిందిగా వారిని కోరారు. కాని వారు అమెరికాకు వెళ్ళిన కారణంగా దానిని సంస్కరించడం వారికి సాధ్యం కాలేదు. ఆ పరిస్థితిలో రెండవ సంపుటాన్ని వ్రాయడం కూడా నాకే ఒప్పగించారు. అప్పటికి నేను మూడవ సంపుటాన్ని వ్రాస్తూ ఉండడంచేత దీనిని పూర్తిచేసిన తర్వాతగాని రెండవ సంపుటాన్ని వ్రాయలేనని వారికి తెలియపరచాను. వారు దానికి సమ్మతించారు. అందుచేత మూడవ సంపుటం మొదట ప్రకటింపబడడం, అటు తర్వాత రెండవ సంపుటం ప్రకటింపబడడం జరిగింది. పై వివరాల నన్నింటిని నన్ను విమర్శించినవారు తెలుసుకోనక, వారి విమర్శలో ఈ విషయానికి కూడా ఒక ప్రాధాన్యం కల్పించారు. రెండవ సంపుటానికి సజ్జన్‌లాల్‌గారు వ్రాసిన పీఠికలో మూడవ సంపుటం తర్వాత రెండవ సంపుటాన్ని వ్రాయడం ఎందుకు జరిగిందో స్పష్టం చేశారు.

1963 జూన్ నాటికి మూడవ సంపుటాన్ని రచించడం నేను పూర్తిచేశాను. జూలైలో తలవని తలంపుగా ఇంకొక కార్యక్రమాన్ని చేపట్టాను. మద్రాసులోని అమెరికన్ సమాచారశాఖవారు కొన్ని సంవత్సరాలుగా ప్రఖ్యాతి గాంచిన అమెరికన్ గ్రంథాలను దేశభాషలలోకి తర్జుమా చేయించి ప్రకటించుటకు నిర్ణయించుకొన్నారు. ఆ పథకంక్రింద తోరో (Thoreau) అనే అమెరికన్ రచయిత వ్రాసిన "వాల్డెన్" (Walden) అనే గ్రంథాన్ని తెనిగించవలసిందిగా నన్ను కోరినారు. నేను దానికి సమ్మతించి 13-7-'63 న తెనిగించడాన్ని ప్రారంభించి 14-10-63 నాటికి దానిని పూర్తి చేశాను. ఇందులో సరిపల్లి విశ్వనాథశాస్త్రిగారు నాకు కొంత సహాయం చేసినారు. దీనిని తెనిగించిన తర్వాత తోరోను గురించి అమెరికన్‌లు వ్రాసిన కొన్ని గ్రంథాలను చదివి నా తెనిగింపుకు ఒక దీర్ఘమైన పీఠికను వ్రాసినాను. తోరో ఆనాటి అమెరికన్‌ల ఆడంబర జీవితాన్ని పూర్తిగా గర్హించి, నిరాడంబర జీవితం మానవుని ఆదర్శంగా ఉండవలెనని ప్రతిపాదించాడు. అమెరికాలో ఆనాడు నీగ్రోల స్థితి కడు శోచనీయంగా ఉండేది. వీరు అనుభవిస్తున్న బానిసత్వాన్ని పూర్తిగా నిర్మూలించుటకు అహింసాపూర్వమైన

సాత్త్విక నిరోధ విధానాన్ని అనుసరించ వలసిందిగా మానవ సమత్వాన్ని కాంక్షించే ప్రతి అమెరికన్ పౌరుని కోరడమేకాక తాను దానిని అనుసరించి శిక్షకు పాత్రుడైనాడు. అనేక సంవత్స రాలు గడచిన తర్వాత మన జాతిపితగా ప్రఖ్యాతి గాంచిన గాంధీ మహాత్ముడు ఈ రెండు విధానాలను (నిరాడంబర జీవితం, సాత్త్విక నిరోధం) అనుసరించడంలో తోరో ప్రతిపాదించిన తత్వంచేత ప్రభావితుడైనాడు. ఈ విషయాలన్నిటిని నేను నా పీఠికలో తెలియపరచాను.

కాని నా తెనిగింపు పూర్తిఅయ్యేనాటికి అమెరికన్ సమాచారశాఖవారు భారతీయ భాషలోకి తర్జుమాచేసిన గ్రంథా లను ప్రకటించే కార్యక్రమాన్ని మానుకొన్నారు. ఇది నాకు తెలియదు. నాకు ఇయ్యదలచిన పారితోషికాన్ని వెంటనే చెల్లించారు (అందులో మూడవ వంతును నేను విశ్వనాథశాస్త్రి గారికి ఇచ్చాను). సంవత్సరంవరకు నేనే వేచియుండి, ఎందువలన ఈ గ్రంథాన్ని ప్రకటించ లేదో తెలియపరచవలసిందిగా కోరాను. అమెరికన్ సమాచారశాఖవారు నా ఉత్తరానికి సమాధానం వ్రాశారు. అది నాకు చేరగానే నేను తెనిగించిన వ్రాతప్రతిని నాకు పంపవలసిందిగా కోరాను. కాని తమ ప్రకటన కార్య క్రమాన్ని మానుకొన్నతర్వాత నా వ్రాతప్రతిని చిత్తుకాగితాలలో పడవేయడం జరిగిందని, అందుచేత దానిని పంపడం సాధ్యంకాదని తెలియపరచారు. నేను వారి ఉత్తరాన్ని చదివి నిర్ఘాంతపోయాను. ఇంతటి ఘోరానికి వారు పాల్పడడం నాగరికులని విర్రవీగుతున్న అమెరికన్‌లకు తగదని భావించాను. నేను మూడు నెలలు కష్టపడడం బూడిదలో హోమం చేసినట్లు పరిణమించినదని ఎంతో విచారాన్ని పొందినాను.

ఇదే కాలంలో దుర్గాబాయి దేశముఖ్‌గారు ప్రకటించిన మూడు సంపుటాల సాంఘిక సంక్షేమ విజ్ఞాన సర్వస్వంలో ప్రకటించుటకు (Encyclopaedia of Social Work) "సాంఘిక సంక్షేమం" (Public Welfare) అనే వ్యాసాన్ని వ్రాశాను. గౌహతి విశ్వవిద్యాలయంలో రాజనీతిశాఖకు ప్రధానాచార్యులుగా

నుండిన వడ్లమూడి వెంకట్రావు వ్రాసిన "అస్సాం స్థానిక పరిపాలన చరిత్ర" అనే సుదీర్ఘమైన గ్రంథం యొక్క వ్రాత ప్రతిని తుణ్ణంగా పరిశీలించి ప్రకటనకు పూర్వం అందులో చేయ దగిన సవరణల గురించి నా సూచనలను పంపినాను.

పైన పేర్కొనిన కార్యక్రమాలనే కాక నేను "త్రివేణి" లో వ్యాసాలను, అంతర్జాతీయ పరిణామాలను ; "ఎడ్యుకేషనల్ ఇండియా" లో సంపాదకీయాలను ; "తెనుగు విద్యార్థి" లో ప్రశ్నలకు సమాధానాలు వ్రాస్తూ వచ్చాను. కాని ఈ కార్య క్రమాలలో నాకు ఇదివరలో యుండిన ఉత్సాహం, ఆసక్తి చాలా వరకు తగ్గినవి. వార్తాపత్రికలను చదివితే గాని వీటిని నిర్వ హించడం సాధ్యంకాదు. కాని నా దృష్టి లోపించడంచేత వార్తా పత్రికలను చదివి సమకాలిక సమస్యలను అర్థం చేసుకొనడం కష్టతరమైనది 'తెనుగు విద్యార్థి' పాఠకులు పంపే ప్రశ్నలు కూడా రానురాను చాలా పేలవంగా తయారైనవి. ఆలోచించి ప్రశ్నలను వేయడం జరిగినపుడే సమాధానాలను ఉత్సాహంతో వ్రాయడం సాధ్యమౌతుంది. ఈ కారణాలన్నింటి మూలంగా 'త్రివేణి' మొదలైన పత్రికలకు మామూలుగా నేను వ్రాసే కార్యక్రమాన్ని చాలావరకు తగ్గించుకొన్నాను.

1963 దీపావళికి ముందు బెంగుళూరులో ఇన్ కంటాక్సు ఆఫీసరుగా ఉండిన నా కుమారుడు వెంకటేశ్వర్లును చూచుటకు వెళ్ళినాను. దీపావళి రోజున టపాకాయలు కాల్చడాన్ని చూచుటకు మేడ దిగి క్రిందకు వచ్చినాను. ఆ సమయంలో అకస్మాత్తుగా నాకు వర్టిగో వ్యాధి తగిలి పడిపోయినాను. అరగంట గడచిన తర్వాత నేను మామూలు స్థితికి వచ్చి అతికష్టంతో మేడమీదికి వెళ్ళగలిగాను. వైద్యులు వచ్చి నన్ను పరీక్షించి ఏవో మందులు వాడమని చెప్పినారు. ఈలాగు అయిదారు రోజులు గడపి నేను, నా భార్య నా కోడలు వేంకట లక్ష్మి సహాయంతో రైలు ప్రయాణం చేసి హైదరాబాదు చేరినాము

నేను అక్కడికి చేరేటప్పటికి తిరుపతిలోని శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయాధికారులు మహాత్మా గాంధీ బోధనలను గురించి ఉపన్యాసాలను ఇయ్యవలసిందిగా కోరుతూ నాకు వ్రాసిన లేఖ

వచ్చి యుండినది. ఢిల్లీలోని యు. జి. సి. ( University Grants Commission ) వారు ఏటేట మహాత్మా గాంధీ గారి ఉపదేశాల గురించి కొన్ని విశ్వవిద్యాలయాలలో ఈలాటి ఉపన్యాసాలను గురించిన కార్యక్రమాన్ని ప్రవేశపెట్టారు. దీనిని అనుసరించి తిరుపతి విశ్వవిద్యాలయంవారు 1964 లో ప్రసంగించవలసినదిగా నన్ను కోరారు. ఈలాటి అవకాశాన్ని వినియోగించుకొనక పోవడం నా అభిమతం కాదు. ఆరోగ్యం తృప్తికరంగా లేక పోయినా నేను వారు పంపిన ఆహ్వానానికి సమ్మతించి, 1964 ఫిబ్రవరిలో "గాంధీ మహాత్ముని సత్యాగ్రహ సందేశం" అనే విషయాన్ని గురించి మూడు ఉపన్యాసాలను చేయుటకు అంగీకరించాను.

ఇందు నిమిత్తం, 'గాంధీగారి ఆత్మకథ', 'దక్షిణ ఆఫ్రికాలో సత్యాగ్రహం' అనే గ్రంథాలను; లూయీ ఫిషరు రచించిన 'గాంధీ జీవిత చరిత్రను'; సి. యఫ్. ఆండ్రూస్ రచించిన గ్రంథాలను; ప్యారీలాల్ వ్రాసిన వాటిని మరి కొన్నింటిని పూర్తిగా చదివాను. 1964 జనవరి వరకు ఈ గ్రంథపఠన కార్యక్రమాన్ని పూర్తి చేసికొని, అటుతర్వాత నా మూడు ఉపన్యాసాలను వ్రాశాను. ఫిబవరి 24, 25, 26 తేదీలలో నేను ఉపన్యాసాల నిమిత్తం తిరుపతికి వస్తున్నట్లు విశ్వవిద్యాలయాధికారులకు తెలియపరచాను.

1957 నుండి ప్రతిరోజు ఒకటి రెండు గంటలు నా మనుమలు, మనుమరాండ్రకు చదువు చెప్పడంలో వినియోగిస్తూ ఉండేవాడిని. నేను విద్యార్థిగా ఉన్న రోజులలో ఉపాధ్యాయులు బాధ్యతతో విద్యాబోధ చేయడంచేత ఇంట్లో పెద్దలెవ్వరు పిల్లలకు బోధించడం ఎక్కువ అవసరం అయ్యేది కాదు. కాని ఇటీవలకాలంలో అధ్యాపకుల బోధన స్థాయి చాలావరకు దిగజారిపోయినది. అందుచేత పిల్లలకు ఇంట్లో బోధించడం అవసరమని నేను భావించాను. నా కుమారులు వారి వారి వృత్తులలో నిమగ్నులు కావడం కారణంగా పిల్లల చదువు విషయమై వారు శ్రద్ధ వహించడం సాధ్యం కాలేదు. నా కోడండ్రు ఎక్కువగా చదువుకొన్నవారు కారు. పెద్ద క్లాసులో చదివే పిల్లలకు పాఠాలు చెప్పగల శక్తి వారికి లేదు. ప్రైవేటు టీచర్లను పెట్టడం మూలాన ఆశించిన

రాజకీయరంగంలో కృషిచేసేవారి అభిప్రాయాలను మాత్రమే అనుసరించరాదని ఉద్ఘాటించాను. ఇదే విధంగా హైదరాబాదులో డిసెంబరులో జరిగిన కళాశాలల విద్యా విధానమును గురించి మూడురోజులు జరిగిన సమావేశంలో 'మానవశాస్త్రాలకు విశ్వవిద్యాలయాలలో వుండదగిన స్థానము, విద్యాబోధకు ప్రాంతీయ భాషలను ఉపయోగించవలసిన అవసరము'—వీటిని గురించి ఉపన్యసించాను. ఈ సమావేశంలో చింతామణి దేశముఖ్, దుర్గాబాయి దేశముఖ్, నారాయణ ప్రసాద్ మున్నగువారు పాల్గొన్నారు. ఇదిగాక దేవులపల్లి కృష్ణశాస్త్రిని అభినందించడానికి హైదరాబాదులో జరిగిన సమావేశంలో వారి రచనల గురించి ప్రసంగించాను. ఈసందర్భంలో వారి రచనలలో అనేకాన్ని చదివినాను. తర్వాత డిసెంబరు ఆఖరున విజయనగరం వెళ్ళి, టౌన్ సహకార బాంక్ స్వర్ణోత్సవాలను ప్రారంభించి, అధ్యక్షత వహించాను. ఈ బాంకును స్థాపించినవారిలో అప్పటికి సజీవులుగా యున్న ఇద్దరిలో నేను ఒకడిని కావడంచేత ఈ ఉత్సవాలకు నన్ను ఆహ్వానించడం జరిగింది. ఆ సమయంలోనే అక్కడి దివ్యజ్ఞాన సమాజంలోను, మహారాజా కళాశాలలోను ఉపన్యసించాను. అక్కడ నా పాత స్నేహితు లనేకులను సందర్శించాను. నా కుమార్తె వైదేహికి ఆమె జన్మించిన ఇంటిని చూపించాను. ఇవిగాక విజయవాడలో జరిగిన గ్రంథాలయ మహాసభకు నా ఉపన్యాసాన్ని వ్రాసి పంపినాను. సమావేశాలలో పాల్గొనడంచేత ప్రముఖు లనేకుల ఉపన్యాసాలను విని నా దృక్పథాన్ని విశాలతరం చేసికొన కలిగినాను.

1964 లోని నా కార్యక్రమాలలో ఒక ప్రధాన భాగంగా తిరుపతి శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో గాంధీ సత్యాగ్రహ సందేశాన్ని గురించి 24, 25, 26 తేదీలలో మూడు ప్రసంగాలు చేశాను. మొదటి దానిలో వ్యక్తి జీవితంలో దాని ప్రాధాన్యాన్ని గురించి, ఆయన స్థాపించిన ఆశ్రమాలలోని వారు దానిని ఏవిధంగా అనుసరించి ఇతరులకు మార్గదర్శకులైనది వివరించాను. రెండవ దానిలో సాంఘిక పరివర్తనములో అది ఎలాగు పటిష్ఠసాధనమో, దానిని వినియోగించిన పక్షంలో

హింసతోను, రక్తపాతంతోను నిమిత్తం లేకుండా మనం కోరే మార్పులన్నిటిని చేయుట సాధ్యమో వివరించాను. మూడవ ఉపన్యాసంలో సాంఘిక జీవితానికి అది ఎలాగు పునాది కాగలదో, దాని మూలంగా గ్రామీణ స్వయంసమృద్ధిని సాధించడం ఎలాగు సాధ్యమో, నగర జీవితాని కంటె ఉత్తమమైన గ్రామీణ జీవితమును పునరుద్ధరించడం ఎంతటి అవసరమో వివరించాను.

పర్కిన్‌సన్ వ్యాధికి గురియై నప్పటినుండి నేను ఎక్కడికి ప్రయాణం చేసినా నాతో కూడా నా భార్య, నా మనుమడు డాక్టర్ వేంకటేశ్ రావడం పరిపాటి అయింది. రైలులో మొదటి క్లాసులోనే ప్రయాణం సాగించడం అవసరమైంది. అందుచేత ప్రయాణ ఖర్చులు విపరీతంగా పెరిగినవి. కాని మార్గాంతరం లేకపోవడంవల్ల ఇది తప్పించదికాదు. తిరుపతి ప్రయాణంలో నా పెద్దకుమార్తె అన్నపూర్ణ కూడా నెల్లూరు నుంచి నాతో వచ్చింది. బెంగుళూరు నుండి నా కుమారుడు వెంకటేశ్వర్లు, నాకోడలు వేంకటలక్ష్మి నా ఉపన్యాసాలను వినుటకు వచ్చినారు. కుటుంబంలోని వారిలో అనేకులు నాతో ఉండడం చేత నా ఆరోగ్య విషయమై ఎలాంటి భయంలేక నా ఉపన్యాస కార్యక్రమాన్ని విజయవంతంగా పూర్తిచేసుకొన గలిగినాను. 26 న కొండపైకి వెళ్ళి దేవాలయం వరకు, అటు తర్వాత దేవాలయం లోపల గర్భగృహం వరకు నడచి స్వామి దర్శనం చేసికొని, మేమందరం తిరుగు ప్రయాణంచేసి సాయంత్రం నాలుగు గంటలకు నెల్లూరు చేరినాము.

పై ఉపన్యాసాలను బొంబాయిలోని భారతీయ విద్యా భవన్ వారు గ్రంథరూపంలో ప్రకటించారు. అటుతర్వాత గాంధి మహాత్ముని శతజయంతి ఉత్సవాల సందర్భంగా హైదరాబాదు లోని గాంధీ సాహిత్య ప్రచురణాలయంవారు దానిని తెనుగులో ప్రకటించినారు. అందుచేత నా ఉపన్యాసాలకు మంచి ప్రచారం లభించింది.

తెనుగు భాషాసమితివారు ప్రకటించిన విజ్ఞాన సర్వస్వం మొదటి సంపుటాన్ని సంస్కరించి పునర్ముద్రణకు సిద్ధం చేసే

బాధ్యతను నేను వహించినట్లు ఇదివరలో చెప్పినాను. ఇందుకు గాను సాధారణంగా ప్రతిరోజు హైదరాబాదులోని సమితి కార్యాలయంలో ఉద్యోగిగా ఉన్న శర్మ నావద్దకు రావడం, నేను సంస్కరించిన రాజనీతిని గురించిన భాగాలను ఆయనతో చర్చించి, వాటిని అందచేయడం జరిగేది. దీనిని ఏదోవిధంగా అక్టోబరు 14-వ తేదీ నాటికి పూర్తిచేశాను.

1964 లో ఆంధ్ర ప్రదేశ్ స్వాతంత్ర్య సమర చరిత్రలో రెండవ భాగాన్ని ఏప్రిల్ 6 నుండి వ్రాయసాగాను. ఇది చాలా శ్రమతో కూడుకొనిన పని. కార్యనిర్వాహక కమిటీవారు దీనికి ఎలాటి ప్రణాళికలను తయారుచేయలేదు. అందుచేత నేనే స్వయంగా ఆలోచించి నాకు తోచినట్లు దీనిని వ్రాశాను. రాజమండ్రి కళాశాల విద్యార్థుల తిరుగుబాటు, కాకినాడలోని కొట్లాటలు, బిపిన్ చంద్రపాల్ ఆంధ్రదేశ పర్యటన, స్వదేశీ ఉద్యమము, గాంధీ రాజకీయాలలో ప్రవేశించి రౌలట్ సత్యాగ్రహంలో ప్రజలందరు పాల్గొనవలసినదిగా గావించిన పిలుపు దాని ఫలితాలు మొదలైన విషయాలన్నింటిని నేలటూరు వెంకట రమణయ్య సేకరించిన మౌలికాధారముల సహాయంతోను, కాశీశ్వరరావుగారి 'ఆత్మకథ', వేంకటప్పయ్యగారి 'ఆత్మకథ' మొదలైన గ్రంథాల సహాయంతోను వివరించాను. దీనిని అక్టోబరు 2-వ తేదీన పూర్తిచేసి, నా వ్రాతప్రతిని సజ్జన్‌లాల్ గారికి అందచేశాను.

ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం తలపెట్టిన జిల్లా గెజెటియర్ల ప్రకటనకు సంబంధించిన సంపాదకీయ వర్గంలో 1958 నుండి నేను సభ్యుడుగా వుండినాను. ఆరు సంవత్సరాలు గడచినా ప్రధాన సంపాదకులు సి. కె. మూర్తిగారు ప్రారంభించిన ఒక కడప జిల్లా గెజెటియరును కూడా పూర్తిచేయలేదు. ఆయన ఒక విధమైన చాదస్తుడు. దీనిని రచించుటకు గొప్ప పరిశోధనను చేయడమేకాక, ప్రతి అధ్యాయాన్ని తానే వ్రాయసాగినాడు. ఆయన వ్రాసిన దానిని సంపాదకీయవర్గంలోని ఇతర సభ్యులు పరిశీలించి, బోర్డు సమావేశాలలో తమ సవరణలను సూచించే

వారు. వాటిమేరకు ఆయన తొలి రచనను సంస్కరించడం జరిగింది. ఇది చాలా కాలయాపనతో కూడిన విధాన మని భావించి, ప్రధాన సంపాదకత్వాన నుండి వారిని తొలగించి, వారి స్థానే ప్రభుత్వ కళాశాలలో అధ్యాపకులుగా ఉండిన బి. శివశంకర నారాయణగారిని నియమించారు. కమిటీకి అధ్యక్షులైన అనంతరామన్, ఐ. సి. యస్. (వీరు ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి, Chief Secretary) ఈపనిని చురుకుగా పూర్తి చేయుటకు నిశ్చయించుకొని ప్రొఫెసర్ షర్వానీని, నన్ను ఒక ప్రత్యేక సబ్ కమిటీకి సభ్యులుగా నియమించారు. అప్పటినుంచి నేను ఈ సంపాదకీయ కార్యక్రమంలో ఎక్కువగా పాల్గొనసాగాను.

1964 లో ఆంధ్ర మహిళా సభ అధ్యక్షురాలు సభ అధ్వర్యంలో సాగుతున్న పాఠశాల అజమాయిషీ నిమిత్తం ఒక కమిటీని ఏర్పాటు చేసి దానికి నన్ను అధ్యక్షునిగా నియమించింది. ఆమె పట్ల నాకు చాలాకాలానునుండి అత్యధిక గౌరవం ఉండేది. అందుచేత ఈ నియామకానికి నేను అంగీకరించాను. కాని ఈ పదవిలో రెండు సంవత్సరాల కంటె ఎక్కువకాలం ఉండలేక పోయినాను. కార్యదర్శి, హెడ్ మిస్ట్రెస్ ల మధ్య అభిప్రాయ భేదాలు ఉత్పన్నం కావడం, వాటిని పరిష్కరించే భారం నాపైన పడడం, నా కాలం వ్యర్థం కావడం ఎంతమాత్రము సహించలేక పోయినాను. రెండు సంవత్సరాలు గడచిన తర్వాత ఈ పదవికి రాజీనామా చేశాను.

ఒకే సమయంలో ఈలాటి వివిధ కార్యక్రమాలను చేపట్టడం నా తలకు మించిన భారాన్ని వహించడమే. నాపట్ల గౌరవం కలవారు వీటిని నేను వహించవలసినదిగా కోరినప్పుడు వారి కోరికను తిరస్కరించడం మర్యాదకాదనే భావం నాలో ఉండడమే దీనికి కారణం. ఇది నాలో మొదటినుండి జీర్ణించుకు పోయిన ఒక మోస్తరు బలహీనత. దీనిని నేను అధిగమించ లేక పోయినందుకు విచారిస్తున్నాను.

ప్రజాస్వామికంలో దేశంలోని ప్రతిపౌరుడు దేశం ఎదుర్కొంటున్న సమస్యలు తన సమస్యలుగా భావించి వాటిని

పరిష్కరించడంలో తన అభిప్రాయాలను వ్యక్త పరచడం ఎంతైనా అవసరం. పౌరులందరు ఈలాటి అవసరాన్ని గ్రహించినప్పుడే ప్రజాస్వామికం వాస్తవంగా క్రియారూపం ధరిస్తుంది. 1964 ఏప్రిల్ 10-వ తేదీన 11 సంవత్సరాలుగా జైలులో యుంచబడిన కాశ్మీరు నాయకుడు షేక్ అబ్దుల్లాను నెహ్రూ ప్రభుత్వం విడుదల చేసింది. కాని అతడు తనకు లభించిన స్వేచ్ఛను దుర్వినియోగం చేయసాగాడు. 1947 అక్టోబరులో పాకిస్తాన్ సేనలు కాశ్మీరుపై దండెత్తినపుడు దాని పరిపాలకుడైన మహారాజా హరిసింగు మార్గాంతరంలేక భారతదేశంలో తన రాజ్యం విలీనం అగుటకు అంగీకరించి, ఒక ఒడంబడికను చేసుకొన్నాడు. దానిఫలితంగా భారత సైన్యాలు కాశ్మీరులో ప్రవేశించి, రాజధాని శ్రీనగరు పట్టణాన్ని, కాశ్మీరులోయను రక్షించి, ఆప్రాంతాననుండి పాకిస్తాన్ సైన్యాలను పారద్రోలినవి. అప్పటినుంచి కాశ్మీరు భారతదేశంలో ఒక భాగంగా ఉన్నది. షేక్ అబ్దుల్లా దీనికి ఆనాడు సమ్మతించాడు. కాని 1953 లో కాశ్మీరు స్వతంత్ర రాజ్యంగా ఉండవలెననే వాదాన్ని సమర్థించ సాగాడు. ఇది చాలా ప్రమాదకరమని భావించి నెహ్రూ ప్రభుత్వం అతనిని జైలులో పెట్టింది. 1964 నాటికి అతని అభిప్రాయంలో మార్పు వచ్చినదనే భావంతో అతనిని విడుదలచేసింది. కాని వాస్తవంగా అతని ఉద్దేశాలలో ఏలాటి మార్పు రాలేదు. జైలు నుండి విడుదలైన తర్వాత 1947 లో జరిగిన ఒడంబడిక చెల్లదని, కాశ్మీరుకు స్వతంత్ర ప్రతిపత్తి లభించవలెనని పునరుద్ఘాటించడం ప్రారంభించాడు. అతని వాదానికి తలయొగ్గిన పక్షంలో అప్పటికి తలఎత్తిన మరికొన్ని వేర్పాటు ఉద్యమాలు బలపడి, దేశ సమైక్యతకు విచ్ఛిత్తి సంభవించే ప్రమాదం యున్నట్లు నేను భయపడినాను. సిక్కులలో ఒక వర్గంవారు, తమిళులలో ఇంకొక వర్గంవారు తమకు ప్రత్యేక స్వతంత్రరాజ్యాలు వుండవలెననే భావాన్ని అప్పుడప్పుడు వ్యక్తంచేయడంజరుగుతూవచ్చింది. కాశ్మీరు విలీనం చెల్లదనే షేక్ అబ్దుల్లా వాదం బలపడిన పక్షంలో ఇలాంటి ఇతర ఉద్యమాలకు ప్రాబల్యం లభించగలదనే అభిప్రాయం నాకు కలిగింది. ఈ నా అభిప్రాయాన్ని వ్యక్తం చేయడంలో నేను వెనుదీయలేదు. 1947 లో పాకిస్తాన్ సేనలు కాశ్మీరుపై

దండెత్తి వచ్చినపుడు ఏ కారణం చేతనో నెహ్రూ ప్రభుత్వం వాటిని లోయ ప్రాంతాన నుండి మాత్రమే పారద్రోలింది. దానికి పశ్చిమంగాను, ఉత్తరంగాను వున్న భూభాగాన నుండి వాటిని పారద్రోలక పాకిస్తాన్ భారతదేశంలో భాగమైన కాశ్మీరుపై దురాక్రమణ చేసిందని, ఈ దురాక్రమణను తొలగించుటకు చర్యలు తీసుకొనవలసినదని ఐక్యరాజ్యసమితిని కోరింది. ఈలాగు చేయడంతో నెహ్రూ ప్రభుత్వం కాశ్మీరు సమస్య ఒక అంతర్జాతీయ సమస్యగా ఏర్పడుటకు అవకాశం కల్పించింది. ఇది ఒక గొప్ప పొరపాటు అనేది అప్పటికీ, ఇప్పటికీ నా భావం. కాశ్మీరులో మనం ఎదుర్కొనవలసి వచ్చిన చిక్కులన్నిటికీ ఇదే జన్మస్థానం.

1964, మే 27 న జవహర్‌లాల్ నెహ్రూ మరణంతో భారతదేశం ఒక ప్రముఖ స్వాతంత్ర్యయోధుని, ప్రధానిగా 17 సంవత్సరాల కాలం దేశాన్ని పాలించిన నాయకుని, జగద్విఖ్యాతి చెందిన వానిని కోల్పోయింది. ఆయన సారథ్యం మూలంగా దేశం ఎలాటి గొప్ప ప్రమాదాలకు లోనుగాక మొత్తంమీద నెమ్మదిగా కాలం గడపగలిగింది. అనేకులతోపాటు నేను కూడా నెహ్రూ తర్వాత దేశానికి తగిన నాయకుడు లభించగలడా అనే భయ సందేహాలతో ఉండినాను. నాయకత్వానికి, ప్రధాని పదవికి పోటీ జరిగి దేశ సమగ్రతకు, సమైక్యతకు ప్రమాదం సంభవించవచ్చునని అనుకొన్నాను. కాని ఆనాడు కాంగ్రెసుకు అధ్యక్షుడుగా ఉండిన కామరాజ నాడార్ ప్రధాని పదవికి ఎలాటి పోటీ లేకుండా నెహ్రూకు కుడిభుజంగా ఉండిన లాల్‌బహదూర్ శాస్త్రిని ప్రధానిగా ఎన్నుకొనునట్లు చేయగలిగాడు. ఇంతటితో దేశ చరిత్రలో నెహ్రూనుయుగం అంతరించి క్రొత్త యుగం ప్రారంభమైనది. ఈసందర్భంలో నెహ్రూను గురించి "త్రివేణి" పత్రికకు ఒక వ్యాసాన్ని వ్రాశాను. ఆకాశవాణిలో కూడా ఆయనను గురించిన నా ప్రసంగాన్ని ప్రసారం చేశాను.

1965 జనవరి 12-వ తేదీ నా జీవితంలో ఒక విస్మరించరాని సుదినం. ఆరోజున బొంబాయి విశ్వవిద్యాలయంలోని రాజనీతి శాఖకు చెందిన డాక్టర్ యస్. పి. అయ్యర్, కుమారి ఉషా

మెహాతాల సంపాదకత్వాన నా గౌరవార్థం ప్రకటించిన "భారత సమాఖ్య విధానమును గురించిన వ్యాసాలు" అనే గ్రంథాన్ని విశ్వవిద్యాలయ సెనేట్ హాలులో జరిగిన ఒక మహాసభలో నాకు సమర్పించారు. ఈ గ్రంథాన్ని 1964 డిసెంబరులోనే అన్నామలై నగరంలో సమావేశమైన భారత రాజనీతిశాస్త్ర సాంవత్సరికసభలో నాకు సమర్పించుటకు ఏర్పాటులు చేశారు. కాని అప్పటికే నేను అదే సమయంలో విజయనగర టౌన్ సహకార బాంకు స్వర్ణోత్సవమును ప్రారంభించుటకు అంగీకరించినందున నేను అన్నామలై నగరానికి వెళ్ళడానికి సాధ్యం కాలేదు. ఆ సందర్భంలో ఈసమర్పణ కార్యక్రమాన్ని బొంబాయి విశ్వవిద్యాలయములో జరపడమే ఉచితంగా ఉండగలదని నేను తెలియపరచాను. వారు దానికి అంగీకరించి 1965 జనవరి 12-వ తేదీన అందు నిమిత్తం ఒక సభను ఏర్పాటు చేశారు.

వారు చేయదలచిన సన్మానాన్ని అందుకొనుటకు నేను, నాభార్య, నామూడవ కుమారుడు ఆనందం, నా కోడలు సీత 9-వ తేదీన హైదరాబాదు నుంచి కారులో బయలుదేరి జనవరి 10-వ తేదీ సాయంకాలం బొంబాయి చేరాము. 11-వ తేదీన డాక్టర్ అయ్యర్, ఉషా మెహాతా నన్ను కలుసుకొని 12-వ తేదీ మధ్యాహ్నము వారు ఏర్పాటు చేసిన విందులో పాల్గొనవలసింది గాను, అటుతర్వాత సాయంకాలం 5 గంటలకు సన్మానసభకు రావలసిందిగాను తెలియపరచారు. వారు చెప్పిన ప్రకారం మేము విందుకు వెళ్ళి అందులో పాల్గొనిన నా శిష్యవర్గములోని వారిని, రాజనీతిశాఖలోని అధ్యాపకులను, ఇతర మిత్రులను కలసికొని ఇష్టాగోష్ఠిగా అనేకవిషయాల గురించి మాట్లాడి సుమారు 2 గంటల కాలము గడిపాము. అటుతర్వాత 5 గంటలకు విశ్వవిద్యాలయ రెక్టర్ (Rector) ఆచార్య డాక్టర్ పరేక్ (Dr Parekh) అధ్యక్షతన సన్మానసభ జరిగింది. ఆ సందర్భములో రాజనీతిశాఖలో ప్రధాన అధ్యాపకులు డాక్టర్ దస్తూర్, అనుబంధ కళాశాల ప్రిన్సిపాల్ రాంజోషి, నాగపూరు విశ్వవిద్యాలయ రాజనీతిశాఖలో ప్రధాన అధ్యాపకులు డాక్టర్ దేశ్ పాండే, డాక్టర్ అయ్యర్ నన్ను గురించి, రాజనీతి శాస్త్రములో

నేను చేసిన పరిశోధనను గురించి ప్రశంసిస్తూ ఉపన్యసించారు. అటుతర్వాత గ్రంధాన్ని నాకు సమర్పించారు. నేను సమావేశాన్ని ఏర్పాటు చేసినవారికి, వక్తలకు నా కృతజ్ఞతలను తెలియపరుస్తూ ఉపన్యసించాను. అటుతర్వాత ఉషా మెహతా వచ్చిన వారందరికి వందన సమర్పణ గావించింది.

సమావేశానంతరం ఒక టీపార్టీ జరిగింది. అందులో అతిథు లనేకులు పాల్గొన్నారు. 7 గంటలకు కార్యక్రమమంతా అతివైభవంగా జరిగి ముగిసింది. నేను, నాతో కూడా వచ్చిన నా కుటుంబలోనివారు ఆనందభరితులమై అతిథుల వద్ద సెలవు పుచ్చుకొని మా బసకు వచ్చి చేరాము.

ఈ సన్మానసభను గురించి బొంబాయిలోని ప్రఖ్యాత దినపత్రికలు "టైమ్స్ ఆఫ్ ఇండియా", "భారతజ్యోతి" 13-వ తేదీ వెలువడిన సంచికలలో వివరించాయి. భారతజ్యోతి విలేఖరి 13-వ తేదీ సాయంకాలం నన్ను కలుసుకొని నా జీవితాన్ని గురించి తెలుసుకొని 14-వ తేదీన నా ఫోటోతో సహా, తన పత్రికలో ఒక వివరణను ప్రకటించాడు. అంతటితో నా బొంబాయి పర్యటనను పూర్తిచేసికొని 14-వ తేదీన మేమందరం సికిందరాబాదు చేరాము.

రాజనీతిశాస్త్రం అన్నిశాఖలవలెనే అనేక శాఖోప శాఖలతో కూడిన విశాలమైన శాస్త్రం. ఇటీవలికాలంలో అది చాలా వృద్ధి గాంచింది. మొత్తం శాస్త్రాన్ని గురించి పరిశోధన గావించడం ఏదో ఒక వ్యక్తికే సాధ్యం కాజాలదు. అందుచే పరిశోధకులు ఏదో ఒక శాఖలోకాని, ఒక ఉపశాఖలోకాని పరిశోధన చేయడం జరుగుతూ యున్నది. నేను 1925 నుండి "స్థానిక పరిపాలన" (Local Government), "సమాఖ్య విధానము" (Federalism) అనే విషయాలగురించి పరిశోధన గావించి, 1935 లో "పరిపాలనలో సమాఖ్య విధానం" (Federalism in Government) అనే గ్రంధాన్ని వ్రాశాను. దానిని ఆంధ్ర విశ్వవిద్యాలయంవారు ప్రకటించారు. అది చాలా ఉత్తమ గ్రంథమని "హిందూ", "సర్వెంట్ ఆఫ్ ఇండియా" మొదలైన పత్రికలలో సమీక్షలు చేశారు. విద్యార్థులు,

అధ్యాపకులు దానిని చదవడం పరిపాటి అయింది. కాని ఏ విశ్వ విద్యాలయంగాని దానిని పాఠ్యగ్రంథాలలో చేర్చలేదు. ఆ రోజులలో పాశ్చాత్యులు వ్రాసిన గ్రంథాలకే ఈవిషయంలో ఎక్కువ ప్రాధాన్యం లభించేది. ఇది నాకు కొంత ఆశాభంగాన్ని కలిగించింది. అయితే తర్వాత కొన్ని సంవత్సరాలకు ఆక్స్‌ఫర్డు (Oxford) విశ్వవిద్యాలయానికి చెందిన ప్రొఫెసర్ కె. జి. విషియ్యర్ (K. G. Wheare) "సమాఖ్య ప్రభుత్వం" (Federal Government) అనే గ్రంథాన్ని ప్రకటించారు. దానిని వెంటనే భారతదేశంలోని విశ్వ విద్యాలయాలవారు తమ పాఠ్యగ్రంథాలలో చేర్చారు. ఆయన తనగ్రంథంలో ఆఖరున సమాఖ్య విధానాన్ని గురించిన ప్రామాణిక గ్రంథాలలో (Bibliography) నా గ్రంథాన్ని పేర్కొనలేదు. ఇది కూడా నాకు కొంత ఆశాభంగాన్ని కలిగించింది. పాశ్చాత్య రచయితలు గ్రంథకర్తల జాతితో నిమిత్తం లేకుండా గ్రంథంలోని గుణాలను బట్టి దానిని ప్రశంసిస్తారు. మనం అనేక శతాబ్దాల కాలం విదేశీయుల పరిపాలనకు లోబడిన కారణంగా ఆత్మ విశ్వాసాన్ని, ఆత్మగౌరవాన్ని కోల్పోయినాము. మనవారిలోని ప్రతిభను విదేశాలవారు గుర్తించిన తర్వాతనే మనము దానిని గుర్తిస్తాము. విశ్వకవి రవీంద్రనాథునికి నోబుల్ బహుమతి అందిన తర్వాతనే ఆయనకు దేశవ్యాప్తమైన గుర్తింపు లభించింది. మహాకవి విషయంలోనే ఈలాగ జరిగినప్పుడు నావంటి సామాన్యుల విషయం ప్రత్యేకంగా చెప్పవలసింది లేదు.

బహుశా నా గ్రంథాన్ని చూడని కారణంగా ప్రొఫెసర్ విషియ్యర్ ప్రామాణిక గ్రంథాలలో దానిని పేర్కొనలేదేమో అనే సందేహం నాకు కలిగింది. దానిని తీర్చుకొనే ఉద్దేశంతో నేను బొంబాయి విశ్వవిద్యాలయములో చేరిన వెంటనే నా గ్రంథాన్ని ఆయనకు పంపినాను. దానిని గురించి ఆయన నాకు రెండు ఉత్తరాలు వ్రాసినారు. మొదటిదానిలో నా గ్రంథం చేరినట్లు, వ్యవధి దొరకగానే దానిని చదివి, దానిని గురించి తన అభిప్రాయాన్ని తెలియపరచేటట్లు వ్రాసినారు. రెండవదానిలో అది చాలా ప్రశస్తమైన గ్రంథమని పునర్ముద్రణ జరగవలసిన అవసరం ఉన్నదని తెలియపరచడమేకాక, తన గ్రంథ పునర్ముద్రణ

జరిగినప్పుడు ప్రామాణిక గ్రంథ జాబితాలో నా గ్రంథాన్నే ప్రథమంగా పేర్కొని, అది చాలా ఉత్తేజకరమైనట్టిదని, పునర్ముద్రణ జరగవలసియున్నదని ప్రశంసా వాక్యాలు వ్రాశారు. ఇది నాకు ఎంతో తృప్తిని కలిగించింది. ఈ ఉదంతాన్ని నేను బొంబాయి విశ్వవిద్యాలయంవారు నాకు చేసిన సన్మానసభలో వివరించాను. అందుచేతనే దానిని ఇక్కడ ప్రస్తావించడం ఉచితమని భావించాను. పాశ్చాత్య శాస్త్రవేత్త గుర్తింపు నాకు లభించిన తర్వాత నా మిత్రులనేకులు నన్ను అభినందిస్తూ ఉత్తరాలు వ్రాశారు. అంతకుపూర్వం అలాంటి ఉత్తరాలు నాకు ఎవరూ వ్రాయలేదు.

బొంబాయి సన్మానసభ తర్వాత జనవరి 28 నుండి 31 వరకు నాలుగు రోజులు కర్నాటక విశ్వవిద్యాలయ ఆధ్వర్యాన ధార్వార్‌లో జరిగిన "ప్రజాస్వామికం ఎదుర్కొంటున్న చిక్కులు" (Dilemmas of Democratic Politics) అనే విషయాన్ని గురించి చర్చించుటకు ఏర్పాటు చేయబడిన గోష్ఠిలో పాల్గొన్నాను. 28 న విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు పావటిగారు దానికి ప్రారంభోత్సవం జరిపారు. మధ్యాహ్నం 3 గంటలకు చర్చలు ప్రారంభమైనవి. నేను వాటిని ప్రారంభించి, మన దేశంలో ప్రజాస్వామికానికి సంబంధించిన చారిత్రక, సామాజిక పరిస్థితుల గురించి ఉపన్యసించాను. మరుసటిరోజునుంచి నేనే అధ్యక్షతను వహించి కార్యక్రమాలను సాగించాను. మన వర్ణ వ్యవస్థకు, ప్రజాస్వామికానికి ఉన్న సంబంధాన్ని గురించి వక్త లనేకులు ప్రసంగించారు. 30 న "భారతీయ సమాఖ్య విధానాన్ని" గురించి ప్రత్యేక సభలో ప్రసంగించాను. విశ్వవిద్యాలయ రాజనీతిశాఖలో ప్రధానాధ్యాపకులైన హాలప్పగారు అధ్యక్షత వహించారు. నా ఉపన్యాసం అందరి మెప్పులను పొందగలిగినది. 31 న మధ్యాహ్నం 1 గంటకు గోష్ఠి ముగిసింది. ఆ రోజు రాత్రి బయలుదేరి ఫిబ్రవరి 1 రాత్రి సికిందరాబాదు చేరినాను. నా ప్రయాణంలో నా కోడలు నారాయణి నాకుసహాయంగా వచ్చినది. నాలుగురోజుల గోష్ఠి కార్యక్రమం మూలంగా నేను చాలా అలసిపోయి ఇల్లు చేరినాను.

ఈ గోష్ఠిలో జరిగిన చర్చలను పూర్తిగా వివరిస్తూ హాలప్ప గారు ఒక గ్రంథాన్ని ప్రకటించారు. అందులో నేను గోష్ఠిలో చేసిన ప్రసంగాలను సంక్షిప్త పరచి చేర్చారు. ఇదిగాక గోష్ఠిలో చర్చ నిమిత్తం నేను వ్రాసిన "జాతీయవాదులు, ప్రజాస్వామికం గురించి వారి భావాలు" అనే పరిశోధక వ్యాసాన్ని గ్రంథంలో ప్రకటించారు.

ఏప్రిల్ 4 న నా భార్య, నా కుమారుడు ఆనందం, నా కోడలు సీతతో కూడ కారులో నెల్లూరుకి ప్రయాణం చేసి 6 న తిరుపతి కొండమీదికి వెళ్ళి మూడు రోజులు గడిపాను. ఇది నా జీవితంలో ప్రాధాన్యంవహించిన యాత్ర. 6 న మధ్యాహ్నం 1 గంటకు స్వామి దర్శనం చేసుకొన్నాం. 7 న ఉదయం 3 గంటలకే లేచి, స్నానం చేసి, దేవాలయానికి వెళ్ళి, సుప్రభాతాన్ని విని, విశ్వరూప దర్శనం చేసుకొన్నాము. తర్వాత కాశీగంగ మొదలైన ప్రదేశాలకు వెళ్ళి, తిరిగి 1 గంటకు స్వామి దర్శనం చేసుకొన్నాము. అటు తర్వాత కొండ దిగి విశ్వవిద్యాలయానికి వచ్చి, ఆర్. ఆర్. దివాకర్ గాంధీజీ గురించి ఉపన్యసించిన సమావేశానికి అధ్యక్షత వహించి నాను. అటు తర్వాత తిరుచానూరుకు వెళ్ళి అమ్మవారి దర్శనం చేసికొని రాత్రి 9 గంటలకు కొండపైకి వచ్చినాము. 8 న స్వామివారి నేత్ర దర్శనం చేసికొని ఆ సాయంకాలం బయలుదేరి నెల్లూరుకు వచ్చి 18 న మదరాసుకు వెళ్ళినాను.

మదరాసులో నా మామూలు కార్యక్రమాలను సాగిస్తూ, నా తమ్ముడి మనుమరాలి వివాహంలో 25 న పాల్గొన్నాను. ఆనాడు దృష్టి చెడిపోయిన నా ఎడమ కంటిలో ఒక బాధ బయలుదేరింది. దానిని భరించడం సాధ్యం కాలేదు. చికిత్స నిమిత్తం హైదరాబాదు వెళ్ళడం ఉచితమని భావించి సాయం కాలం ప్లేనులో నా భార్యతో హైదరాబాదు చేరి, కంటి వైద్యుడు రాంజీని కలుసు కొన్నాను. ఆయన కంటి గుడ్డును తీసివేయడం తప్ప బాధ నివారణకు మార్గాంతరం లేదని సలహా ఇచ్చాడు. దానికి అంగీకరించి 27న నర్సింగ్ హోంలో ప్రవేశించాను. 28 న రాంజీ, డాక్టర్ హుస్సేన్ సహాయంతో, ఆపరేషన్ చేసి కంటి గుడ్డును తీసివేశాడు. బాధతో నే

మే 3 న నర్సింగ్ హోం వదలి ఇంటికి వచ్చినాను. డాక్టర్ రాంజీ ఆనాడు విదేశపర్యటనార్థం వెళ్ళిపోయినాడు. అది మొదలు డాక్టర్ హాన్సేన్ చికిత్స చేయసాగాడు. బాధ చాలా వరకు తగ్గింది. కాని పూర్తిగా తగ్గలేదు. 20 న కృత్రిమ ప్లాస్టిక్ కంటిని ( Artificial Plastic Eye ) పెట్టాడు. ఇంతటితో చికిత్స పూర్తి అయింది. కాని ఈనాటి వరకు కంటిలో ఏదో ఒక బాధ ఉంటూనే ఉన్నది. మధ్యకాలంలో అనేక పర్యాయాలు వైద్యుల దగ్గరికి వెళ్ళడం మందులు వేసుకొనడం జరుగుతూనే ఉన్నది. కాని వీటి మూలంగా ఎక్కువ ఫలితం కలుగలేదు. కొన్ని వ్యాధులకు పూర్తిచికిత్స లేదనేదే నాఅనుభవం స్పష్టం చేసింది. వ్యాధిని భరించడం తప్ప మార్గాంతరం లేదు.

కంటి జబ్బుతోనే నా మామూలు కార్యక్రమాలు సాగిస్తూ వచ్చాను.

1965 నాటికి 'తెనుగు విద్యార్థి' సంపాదకులు శ్రీ కొల్లూరు కోటేశ్వరరావుగారు నా స్నేహితులలో అగ్రశ్రేణికి చెందిన వారయినారు. వారు సర్వదా నా శ్రేయస్సును కోరేవారు. మా దంపతులపట్ల అత్యంత శ్రద్ధా భక్తులు కలవారు. వారికి 15-5-'63 లో ఒక కుమారుడు కలిగినాడు. పిల్లవాని నామకరణం మా సమక్షంలో చేయవలెనని ఉద్దేశించినారు. కాని 1965 జూలై 31 వరకు మేము బందరు వెళ్ళలేకపోయినాము. ఆరోజున మేము మా కుటుంబములో మరికొందరితో కలిసి బందరు వెళ్ళినాము. ఆగస్టు 1 న నామకరణం అతివైభవంగా జరిగింది. నా సలహా పైన వేంకట రమణ అనే పేరు పిల్లవాడికి పెట్టడం జరిగింది. మా కందరికీ వస్త్రము లిచ్చి సత్కరించారు. ఈ కార్యక్రమంతో పాటు అక్కడి ఉపాధ్యాయ సంఘపు కార్యనిర్వాహక కమిటీవారి సభలోను, లయన్సు క్లబ్‌లోను ప్రసంగించాను. సెకండరీ విద్యావిధానం గురించి ఏర్పాటు చేయబడిన గోష్ఠిలో అధ్యక్షత వహించి ఉపన్యాసం చేశాను. ఈ కార్యక్రమాన్ని పూర్తిచేసుకొని 2 న హైదరాబాదుకు వచ్చి చేరినాము.

నవంబరు 4 న నా కుమారుడు ఆనందం నన్ను, నాభార్యను భద్రాచలం తీసుకొని వెళ్ళినాడు. ఆ పుణ్యక్షేత్రానికి ఇదియే

నా ప్రథమ యాత్ర. మేము రామాలయానికి వెళ్ళి స్వామి దర్శనం చేసికొని దేవాలయ ఉద్ధరణకై జరుగుతున్న కార్యక్రమాన్ని చూచినాము. దేవాలయ శిల్పంలో నిపుణులై దక్షిణ ప్రాంతాన నుండి వచ్చిన శిల్పులు ఆనాడు అక్కడ పనిచేస్తూ ఉండినారు. కల్యాణ మంటప నిర్మాణంలో వారు చేస్తూ ఉండిన పనిని చూచి 6-వ తేదీ హైదరాబాదుకు వచ్చినాము.

నవంబరు 15 న ఆంధ్ర విశ్వవిద్యాలయ రాజనీతిశాఖలో రీడరు నియామకానికిగాను ఏర్పరచబడిన సెలక్షన్ కమిటీ సభ్యుడిగా నేను, నా భార్య, నా మనుమరాలు హైమవతి సహాయంతో వాల్తేరుకు వెళ్ళినాము. మూడు రోజులు అక్కడ ఉండి నా పాత స్నేహితులను, వారిలో ప్రధానంగా దివ్యజ్ఞాన సమాజ సభ్యులను కలుసుకొన్నాను. 16 న కమిటీ సమావేశమై, ఉస్మానియా విశ్వవిద్యాలయంలో లెక్చరర్‌గా ఉండిన జి. రాంరెడ్డిగారిని రీడరు పదవిలో నియమించవలసినదిగా సిఫారసు చేసినది. (వీరు ప్రస్తుతం ఉస్మానియా విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు) 17 న సింహాచలానికి వెళ్ళి దేవుని దర్శనం చేసుకున్నాము. ఒకప్పుడు నేను విజయనగర సంస్థానానికి దివానుగా ఉండి నౌకర్లందరి జీతాన్ని పెంచిన విషయాన్ని దేవాలయ నౌకర్లు మరచినవారు కారు. అందుచేత వారు నన్ను ప్రత్యేకంగా గౌరవించారు. అక్కడ పండితులను నా శక్తి కొలది సత్కరించాను. విశ్వవిద్యాలయ చరిత్ర, రాజనీతిసంఘం అధ్వర్యాన మన విదేశ రాజ్యాంగ విధానాన్ని గురించి ఉపన్యసించాను. ఈవిధంగా నా కార్యక్రమాన్ని పూర్తిచేసికొని 19 న సికిందరాబాదుకు వచ్చి చేరినాను.

అటుతర్వాత డిసెంబరు 17 న బయలుదేరి నా భార్యతో కూడా మైసూరుకు ప్రయాణం చేశాను. అక్కడ నా కుమారుడు వెంకటేశ్వర్లు ఇన్‌కంటాక్సు ఆఫీసర్‌గా ఉండినాడు. ఇదిగాక అక్కడ 28-30 న భారత రాజనీతి సాంవత్సరిక సభ (Indian Political Science Conference) సమావేశం జరగవలసి యుండినది. అందులో పాల్గొనే ఉద్దేశంతో కూడా మైసూరుకు ప్రయాణం చేశాను. ఈ సమావేశం ఎన్. ఆర్. దేశ్‌పాండే అధ్యక్షతన

జరిగింది. ముఖ్యమంత్రి నిజలింగప్ప ప్రారంభోపన్యాసం చేశారు. (మైసూరు విశ్వవిద్యాలయ రాజనీతిశాఖలో ప్రధానాధ్యాపకులైన తోటప్పగారి కోరిక ననుసరించి ఈ ఉపన్యాసాన్ని నేనే వ్రాశాను.) మూడు రోజులు సమావేశానికి వెళ్లే అవకాశం లభించినప్పుడు నా అభిప్రాయాలను వ్యక్తం చేశాను. ఒకరోజు ప్రత్యేకంగా "రాష్ట్ర రాజకీయాలు" ( State Politics ) ను గురించి ఉపన్యసించాను.

డిసెంబరు 31 న నా కుమారుడు, కోడలు నా 78–వ జన్మదిన ఉత్సవాన్ని అతివైభవంగా జరిపారు. బొంబాయి నుంచి సమావేశానికి వచ్చిన నా మిత్రులు డాక్టర్ దస్తూరు, డాక్టర్ ఉషా మెహతా, మరికొందరు ప్రముఖులు మధ్యాహ్నం విందులో పాల్గొన్నారు. జనవరి 2 న బయలుదేరి సికింద్రాబాదుకు వచ్చినాము. 1965 అనేక ప్రయాణాలతో కూడిన సంవత్సరంగా పరిణమించింది.

మధ్యకాలంలో నా మామూలు కార్యక్రమాలను, కొన్ని అదనపు కార్యక్రమాలను సాగించినాను. 35 గ్రంథ సమీక్షలు చేసినాను. ఆకాశవాణిలో 10 ప్రసంగాలు ప్రసారంచేసినాను. యథాప్రకారం 'ఎడ్యుకేషనల్ ఇండియా' లో సంపాదకీయాలను, 'తెలుగు విద్యార్థి' లో ప్రశ్నలకు సమాధానాలను వ్రాసినాను. హైదరాబాదులోని రాజేంద్రనగర్‌లో జాతీయ సమాజాభివృద్ధి కేంద్రం ఉన్నది. దాని అధ్వర్యంలో ఉన్నత ఉద్యోగి వర్గానికి చెందిన వారు 50, 60 మంది ప్రతిసంవత్సరం రెండు మూడు నెలలపాటు అక్కడ సమావేశమై పంచాయతీరాజ్య వ్యవస్థను గురించి చర్చలు జరపడం మామూలు. వారి చర్చల సందర్భంలో నన్ను ఉపన్యసించవలసిందిగా ఆహ్వానించారు. నేను దానికి అంగీకరించి 5 పర్యాయాలు 'పంచాయతీరాజ్య వ్యవస్థ'ను గురించి, 'గ్రామీణ పునర్నిర్మాణాన్ని' గురించి ఉపన్యసించాను. అక్కడ సమావేశమైనవారు పరిపాలనలో ఆరితేరిన ఉన్నత వర్గానికి చెందినవారు. సామాన్యులతో కూడిన సభలలో ఉపన్యసించునట్లు వారి సమక్షంలో ఉపన్యసించడం వాంఛనీయం కాజాలదు. అందుచేత నేను ప్రత్యేకంగా కృషిచేసి, ఉన్నతస్థాయి ఉద్యోగులకు రుచించునట్లు

నా ఉపన్యాసాలను చేసి, వారు వేసిన ప్రశ్నలకు సమాధానాలు చెప్పి మొత్తంమీద వారికి తృప్తికరంగా ఈ కార్యక్రమాన్ని నిర్వహించాను.

ఇలాగే ఉస్మానియా విశ్వవిద్యాలయంలోని పరిపాలనా శాఖవారు (Public Administration) కొన్ని గోష్ఠికార్యక్రమాలను ఏర్పాటుచేసి అందులో పాల్గొనవలసిందిగా నన్ను కోరారు. నేను దానికి అంగీకరించి 'పంచాయతీరాజ్య వ్యవస్థలో ఉద్యోగుల నియామకము' (Recruitment), 'నగరముల అభివృద్ధి' (Urban Development) అనే విషయాలను గురించి ఉపన్యసించాను.

అమెరికన్ పీస్ కోర్ (Peace Corps) కు చెందినవారు జూన్‌లో హైదరాబాదుకు వచ్చినారు. వీరు తెలుగును చక్కగా నేర్చుకొన్నవారు. ఆంధ్రుల చరిత్రపట్ల, సంస్కృతిపట్ల అధిక శ్రద్ధకలవారు. ఆంధ్రులచరిత్రలో ప్రధాన విషయాల గురించి ఉపన్యసించవలసిందిగా నన్ను కోరారు. నేను దానికి సిద్ధపడి ఆంధ్రులచరిత్రను గురించి సంక్షిప్తంగా ప్రసంగించాను. పరాయి వారికి మన సంస్కృతిలో అభిరుచి ఉండడం ఎంతైనా హర్షించ దగ్గదని ప్రత్యేకంగా చెప్పవలసిందిలేదు.

పై కార్యక్రమాలతో పాటు హైదరాబాదులో ప్రకటింప బడుచున్న (దీని సంపాదకీయ వర్గానికి నేను అధ్యక్షుడను) సంగ్రహ విజ్ఞానకోశానికి, కౌటిల్యుడు, నాగరికత అనే విషయాల గురించి వ్యాసాలు వ్రాశాను. తెలుగు భాషా సమితివారు ప్రకటించిన విజ్ఞాన సర్వస్వం మొదటి సంపుటాన్ని సంస్కరించు టకు నన్ను సంపాదకుడిగా నియమించారని ఇంతకు పూర్వమే చెప్పినాను. ప్రథమంలో రాజనీతి విభాగాన్ని సంస్కరించాను. 1965 లో చరిత్ర విభాగాన్ని సంస్కరించి, నూతన దృక్పథంతో ప్రపంచ చరిత్రను వ్రాయించి అందులో చేర్చినాను.

ఆనాడు హైదరాబాదులో ప్రముఖులు కొందరు నా అధ్యక్షతన ఒక కమిటీగా ఏర్పడి సంస్కృతం అధికార భాషగా ఉండవలెననే ఉద్యమాన్ని ప్రారంభించారు. ఈసందర్భంలో

జూన్ 29 న మేము రాష్ట్రపతి శ్రీ రాధాకృష్ణన్‌గారిని కలుసుకొన్నాము. ఈవిషయాన్ని గురించి రాష్ట్రశాసన సభలో ఒక తీర్మానం చేసిన పక్షంలో మా ఉద్యమానికి బలం చేకూరగలదని వారు సలహా ఇచ్చినారే కాని వారి స్వంత అభిప్రాయాన్ని వ్యక్తం చేయలేదు. అదే సమయంలో బొంబాయికి చెందిన ప్రముఖ రచయిత కె. యం. మున్షీగారు హైదరాబాదులో ఉండినారు. వారిని కూడా మేము కలుసుకొన్నాము. మా ప్రతిపాదన ముస్లింలకు, తమిళులకు ఆమోదం కాజాలదని, అందుచేత అది ఆచరణసాధ్యం కాదని వారు చెప్పినారు. అటుతర్వాత మేము మా ఉద్యమం గురించి కొంత ప్రచారం చేశాము. కాని దాని మూలంగా ఏలాటి ఫలితం లభించలేదు. సంస్కృతం పట్ల మనకు ఎంత గౌరవాభిమానాలు ఉన్నా అది ప్రజలు మాట్లాడే భాష కాకపోవడంచేత అది అధికారభాషగా ఉండుటకు అర్హత లేనట్టిదనే నిర్ణయానికి నేను వచ్చాను. ప్రజాస్వామికంలో వ్యవహారంలో ఉండే భాషకే అలాటి అర్హత లభిస్తుంది. వ్యవహారంలో ఉండే భారతీయ భాషలలో హిందీని అధికసంఖ్యాకులు మాట్లాడడంచేత ఆ అర్హత దానికే చెందవలసి యున్నది. దేశాభిమానంగలవారెవ్వరు శాశ్వతంగా ఇంగ్లీషు భాష అధికారభాషగా ఉండవలెనని వాదించరు దేశభాషలన్నీ అధికారభాషలు కావలెననే వాదం ఆచరణసాధ్యం కాజాలదు. ఆ యా రాష్ట్రాలలో అవి అధికారభాషలు కావడం సమంజసం. పరిపాలనా సౌష్ఠవార్థం దేశభాషలలో ఒకటి అధికారభాషగా ఏర్పడడమే వాంఛనీయం. అనవసరంగా దీనిని గురించి వాదాలలోకి దిగిన పక్షంలో ఈనాటి కలుషిత రాజకీయ వాతావరణం మరింత కలుషితమై దేశ విచ్ఛిత్తికి దారితీస్తుంది. దేశానికి ఉజ్జ్వల భవిష్యత్తును వాంఛి చేవారు హిందీ ఉద్యమాన్ని బలపరచవలసి యున్నది. తెలుగు, తమిళం, బెంగాల్ మొదలైన భాషలను మాట్లాడేవారికి హిందీ కూడా ఒక పరాయిభాష అనే వాదం సంకుచితమైనట్టిది. ఇంగ్లీషు ఎంతటి పరాయి భాషయో హిందీ అంతటి పరాయిభాషకాదు. హిందీ మన దేశభాషలలో ఒకటి. హిందీ అధికారభాష అయిన పక్షంలో అఖిలభారత ఉద్యోగాలన్నీ హిందీభాష మాతృభాషగా

ఉన్న వారికే లభిస్తవి అనేవాదం బలంలేనిది. అఖిలభారత దేశభాష లన్నీ పోటీ పరీక్షలలో ఉపయోగించడం జరిగే ఏర్పాటులు చేసిన తర్వాత ఈ వాదం బలాన్ని కోల్పోయింది. ఈ విషయా లన్నిటినీ విశాల దృక్పథంతో పరిశీలించి, అధికారభాషను గురించిన వాదోపవాదాలకు స్వస్తి చెప్పడం ప్రాజ్ఞత.

1965 లో నేను చేపట్టిన కార్యక్రమాలలో "ఆంధ్ర ప్రదేశ్ లో పంచాయతీ రాజ్యం" అనే గ్రంథాన్ని రచించుటకు ప్రారంభించడం ప్రాధాన్యాన్ని వహిస్తున్నది. ప్రభుత్వం స్థాపించిన "స్టేట్ ఛాంబర్ ఆఫ్ పంచాయతీ రాజ్" (State Chamber of Panchayati Raj) అనే సంస్థకు అప్పట్లో శ్రీ జలగం వెంగళరావు గారు అధ్యక్షులు. నేను చాలాకాలంగా స్థానిక పరిపాలనను గురించి పరిశోధన గావించడం వారికి తెలియవచ్చింది పంచాయతీ రాజ్య వ్యవస్థను గురించి ఒక సమగ్రమైన గ్రంథాన్ని రచించ వలసిందిగా వారు నన్ను కోరారు. నేను దానికి అంగీకరించి అలాటి రచనకు పూనుకొని 1966 లో దానిని పూర్తి చేశాను. 1967 లో స్టేట్ ఛాంబర్ వారు దానిని ముద్రించి ప్రకటించారు. దానికి శ్రీ జయప్రకాశ్ నారాయణ్ గారు ఒక తొలిపలుకును, వెంగళ రావుగారు ఛాంబరు అధ్యక్షులుగా పరిచయవాక్యాలను వ్రాసినారు.

ఇది 15 అధ్యాయాలతో కూడిన గ్రంథం. ఆనాడు ఉస్మానియా విశ్వవిద్యాలయ రాజనీతిశాఖలో రీడరుగా ఉండిన జి. రాంరెడ్డిగారు పంచాయతీరాజ్యాన్ని గురించే ప్రత్యేకంగా పరిశోధన చేసినవారు. అందుచేత నా గ్రంథాన్ని రచించడంలో వారి సహాయాన్ని కోరినాను. వారు నా కోరికను మన్నించి గ్రంథములోని 15 అధ్యాయాలలో 4 అధ్యాయాలను వ్రాసి నారు. తక్కిన 11 అధ్యాయాలను నేను వ్రాసినాను. ఈ కారణం చేత మా ఇద్దరి గ్రంథకర్తృత్వంతో గ్రంథం ప్రకటింపబడినది.

ప్రాచీన మధ్యయుగాలలో ప్రయాణ సౌకర్యాలు లోపించిన కారణంగా ప్రతి గ్రామం స్వయంపోషకంగా ఉండేది. దాని అవసరాలను పెద్దలతో కూడిన పంచాయతీలు తీర్చేవి. ప్రభుత్వం గ్రామ వ్యవహారాలలో జోక్యం కలుగచేసుకొనేది కాదు. అందు చేత గ్రామ పరిపాలన చాలావరకు గ్రామస్థుల వశంలోనే ఉండేది.

రెడ్డి, కరణం మొదలైన గ్రామాధికారులు వంశపారంపర్యంగా వారి అధికారాన్ని చెలాయిస్తూ ప్రజలకూ, ప్రభుత్వానికీ మధ్య మధ్యవర్తులుగా ఉండేవారు. వీరికి సహాయంగా తలారి, పంచాంగం బ్రాహ్మణుడు, కమ్మరి, కుమ్మరి, వడ్రంగి, చాకలి, మంగలి, వెట్టి, చర్మకారుడు ప్రజల అవసరాలను తీరుస్తూ ఉండేవారు. మధ్య యుగంలో పంచాయతీల ప్రాబల్యం తగ్గి, రెడ్డి ప్రాబల్యం పెరిగింది. కాని అన్నికులాలవారు వారి వారి వృత్తులను సాగిస్తూ ఒక కుటుంబానికి చెందినవారివలె ఉండేవారు. ఈ సంఘీభావం ఆనాటి గ్రామీణ జీవితానికి ప్రధాన లక్షణం.

బ్రిటిషు పరిపాలనలో రవాణా సౌకర్యాలు పెరిగిన కారణం గాను, కేంద్రీకృతమైన పరిపాలన స్థాపింపబడడం చేతను గ్రామ స్వరాజ్యం, స్వయంపోషకత్వం క్షీణించినవి. గ్రామాధికారులు ప్రభుత్వ నౌకర్లుగా రూపొందినారు. 19-వ శతాబ్దం ఆఖరు దశలో పంచాయతీల పునరుద్ధరణ ప్రయత్నాలు కొన్ని జరిగినా అవి ఎక్కువ ఫలప్రదం కాలేదు.

1947 లో దేశానికి స్వాతంత్ర్యం లభించిన తర్వాత గాంధీ మహాత్ముని గ్రామపునరుద్ధరణ ప్రయత్నం, రాజ్యాంగ సభలో దీనిని గురించిన చర్చలు, పంచవర్ష ప్రణాళికలు, సామాజికాభివృద్ధి కార్యక్రమాలు (Community Development) మొదలైనవాటి మూలంగా పంచాయతీల పునర్నిర్మాణం జరిగింది. 1956 లో జాతీయాభివృద్ధి కౌన్సిల్ వారు (National Development Council) బల్వంతరాయ్ మెహతా అధ్యక్షతన పంచాయతీ వ్యవస్థ నిర్మాణానికి సిఫారసులు చేయుటకు ఒక కమిటీ ఏర్పాటు చేసినారు. అది గ్రామ పంచాయతీలు, పంచాయతీ సమితులు, జిల్లా పరిషత్తులు అనే మూడు స్థాయిలలో ఈ వ్యవస్థ పునర్నిర్మాణం జరగవలెనని సిఫారసు చేసింది. దీనిమేరకు 1959 లో ఈ వ్యవస్థ పునర్నిర్మాణం జరిగింది.

ఈ వ్యవస్థ ప్రధాన లక్షణాలు : పరిపాలన సౌకర్యార్థం ఏర్పడిన ప్రాంతాలు (Administrative Areas), వాటి పరిపాలనాంగాలు ; ఆంతరంగిక నిర్మాణం, వాటి కార్యకలాపాలు ; అనధికార కార్యనిర్వాహక వర్గం, ఉద్యోగి వర్గం, వాటి ఆదాయ

వ్యయాలు, ప్రభుత్వం వాటిపై చలాయించే అధికారాలు ; మొత్తంపైన 1959 తర్వాత అవి సాధించిన ఆశయాలు, వాటి కృషిలోని గుణగణాలు , వాటికి సంబంధించిన సమస్యల సమగ్ర స్వరూపం, వాటిని పరిష్కరించుటకు సూచనలు— ఈ వివిధ విషయాలను సంపూర్ణంగా గ్రంథం వివరిస్తున్నది. అందుచేత అది పంచాయతీ రాజ్యాన్ని గురించిన ఉత్తమగ్రంథంగా నేను భావిస్తున్నాను.

1966 తర్వాత జరిగిన మార్పులను గ్రంథంలో చేర్చి దానిని పునర్ముద్రించవలసిన అవసరం ఎంతైనా ఉన్నది. పంచాయతీ రాజ్యాన్ని నిర్వహించేవారిలో అధికసంఖ్యాకులకు ఇంగ్లీషు భాషతో ఎక్కువ పరిచయంలేదు. ఈలాటి గ్రంథాన్ని వారే ప్రధానంగా చదువవలసి ఉన్నది. అందుచేత వెంటనే దానిని తెనిగించే ప్రయత్నం కొనసాగవలెను.

1965 లో భారతీయులందరివలె నేను కూడా మనదేశంపై పాకిస్తాన్ చేసిన దురాక్రమణ, దాని ఫలితంగా సంభవించిన యుద్ధము మొదలైన సంఘటనల గురించి ఆందోళన పడినాను. 1964 లో నెహ్రూ నిర్యాణానంతరం ప్రధాని ఎన్నికలో కాంగ్రెసు అధ్యక్షులు కామరాజ్ నాడార్ జోక్యం గల్గించుకొని ఎలాటి పోటీ లేకుండా లాల్ బహదూర్ శాస్త్రిని ప్రధానిగా ఎన్నుకొనుటలో గొప్ప పాత్రను వహించారు. శాస్త్రియొక్క ఉద్దేశం పాకిస్థాన్‌కు సంబంధించిన వివాదాలన్నిటిని శాంతియుతంగా పరిష్కరించడమే. యుద్ధంపట్ల వారికి ఏలాటి అభిమతంలేదు. కాని పాకిస్థాన్ పరిపాలకుడు అయూబ్ ఖాన్ యుద్ధంలోకి దిగినాడు. దీనిని ప్రథమంలో పశ్చిమ తీరంలోని కచ్ఛ (Kutch) సరిహద్దులలో జనవరిలో ప్రారంభించాడు. అక్కడ మన భూభాగంలో ఒక రోడ్డును నిర్మాణంచేసి రెండు స్థావరాలను పాకిస్థాన్ వశంచేసుకొనడం జరిగింది. మన సైన్యాలు వాటిని పూర్తిగా తరిమివేయడం సాధ్యం కాలేదు. శాస్త్రిగారికి భారీ ఎత్తున యుద్ధంలోకి దిగడంపట్ల ఇష్టం లేదు. అలాటి సందర్భంలో బ్రిటిష్ ప్రధాని విల్సన్ ఈ వ్యవహారాన్ని మధ్యవర్తులద్వారా పరిష్కరించుకొనడం ఉచితమని శాస్త్రిగారికి సలహా ఇచ్చాడు.

దానికి శాస్త్రిగారు సమ్మతించారు. మధ్యవర్తులు ఈప్రాంతంలో పాకిస్థాన్ తనదిగా వాదించిన 87,500 చదరపు కిలోమీటర్ల ప్రదేశంలో 800 చదరపు మీటర్లు మాత్రమే దానికి చెంద వలసినదిగా తీర్పుచెప్పినారు. ఇందులో కూడా వారు కొంత పక్షపాత వైఖరిని ప్రదర్శించినారు. కాని యుద్ధంలోకి దిగవలసిన అవసరం లేక శాంతియుతంగా వ్యవహారం పరిష్కారమైనదని భావించి శాస్త్రిగారు దీనికి సమ్మతించారు.

కాని అప్పటికే పాకిస్థాన్ కాశ్మీరుపై దాడి జరుపుటకు సన్నాహాలు పూర్తి చేసికొని సెప్టెంబరు 1న జమ్మూలోని చాంబ్ ప్రాంతాన్ని వశపరచుకొన్నది. దీనిమూలంగా జమ్మూలోకి భారతీయ సైన్యాలను చేరవేయడం సాధ్యం కాకపోయింది. ఈ పరిస్థితిలో భారీఎత్తున యుద్ధంలోకి దిగటం తప్ప భారత దేశానికి మార్గాంతరం లేకపోయింది. దీనికి శాస్త్రిగారు సిద్ధపడ్డారు. దురాక్రమణను ఎదుర్కొనుటకు కాశ్మీరు నుండి పాకిస్థాన్‌కు వెళ్ళే మార్గాలలోని రెండు ప్రధానములైన ప్రదేశాలను వశపరచుకొనడమే కాక పంజాబు భారత దేశాల మధ్య సరిహద్దులను దాటి పంజాబుపై దాడి చేయవలసిందిగా శాస్త్రి గారు మన సైన్యాలను ఆదేశించినారు. ఈలాగు జరుగుతుందని అయూబ్ ఖాన్ భావించలేదు, యుద్ధం కాశ్మీరుకు మాత్రమే పరిమితం కాగలదని తలచి అతడు యుద్ధంలోకి దిగాడు. మన సైన్యాలు పంజాబులోనికి చొచ్చుకొనిపోయి కొంత ప్రదేశాన్ని వశపరచుకొన్నవి.

ఈలాగు భారత ఉపఖండంలో భారీఎత్తున ఈ రెండు రాజ్యాల మధ్య యుద్ధం సాగడం పాకిస్థాన్ పక్షం వహించిన పాశ్చాత్య దేశాలకు—బ్రిటన్, అమెరికాలకు—అంగీకార యోగ్యం కాలేదు. ఈ యుద్ధంలో చైనా పాకిస్థాన్‌కు సహాయం చేసే ఉద్దేశంతో సిక్కింప్రాంతంలో తన సైన్యాలను తరలింప సాగినది. అది జరిగిన పక్షంలో భారతదేశం పశ్చిమప్రాంతంలోనేగాక, తూర్పుప్రాంతంలో కూడా ఏకకాలంలో యుద్ధం చేయవలసి

వస్తుంది. ఉపఖండంలో చైనాకు విజయం లభించడం పాశ్చాత్య దేశాలకేగాక సోవియట్ రష్యాకు కూడా ఇష్టం లేదు. అందుచేత ఐక్యరాజ్య సమితిలోని భద్రతా సంఘం సమావేశమై యుద్ధాన్ని విరమించవలసిందిగా భారత పాకిస్థాన్ దేశాలను కోరుతూ సెప్టెంబరు 20 న ఒక తీర్మానం చేసింది. సెప్టెంబరు 25 న శాస్త్రి విధిలేక దీనికి అంగీకరించారు. యుద్ధానికి పూర్వం ఎవ రెవరి వశంలో ఏ ప్రాంతాలు ఉండినవో ఆ ప్రాంతాలలోకి వెళ్ళిపోయే షరతుకు రెండు దేశాలు అంగీకరించినవి. 21 రోజుల యుద్ధం మూలంగా ఏలాటి లాభం చేకూర లేదు. కాని కాశ్మీరుపై భవిష్యత్తులో పాకిస్థాన్ దురాక్రమణ చేసిన పక్షంలో భారత దేశం కాశ్మీరుకు మాత్రం యుద్ధాన్ని పరిమితం చేయదని, పంజాబు ప్రాంతానికి యుద్ధం వ్యాపించగలదని ఈ 21 రోజుల యుద్ధం స్పష్టం చేసింది. కాశ్మీరు భారత దేశంలో పూర్తిగా విలీనమైన దేశమని, కాశ్మీరుపై దురాక్రమణ భారత దేశంపై దురాక్రమణ అని శాస్త్రిగారు ఋజువు చేయగలిగారు. యుద్ధం మూలంగా భారత దేశానికి ఈ లాభం కలిగింది.

ఒకప్పుడు సోవియట్ రష్యా చైనాకు చాలా సన్నిహితంగా ఉండేది. కాని సరిహద్దుల విషయమై ఈ రెండు దేశాల మధ్య వివాదాలు బయలుదేరి 1965 నాటికి యుద్ధం సంభవించే పరిస్థితులు ఏర్పడినవి. పాకిస్థాన్ సోవియట్ రష్యాకు పొరుగు దేశం. చైనా పాకిస్థాన్‌తో స్నేహ సంబంధాలు ఏర్పరచు కొనడం సోవియట్ రష్యాకు ఇష్టంలేదు. కాశ్మీరు కూడా సోవియట్ రష్యాకు పొరుగున ఉండే భూభాగం. కాశ్మీరు విష యంలో చైనా పాకిస్థాన్ పక్షం వహించడం కూడా దాని అభిమతం కాదు. ఈపరిస్థితులలో పాకిస్థాన్, భారత దేశాల మధ్య స్నేహ సంబంధాలను కుదిర్చే ఉద్దేశంతో సోవియట్ ప్రధాని కొసిగిన్ శాస్త్రిగారిని, అయూబ్ ఖాన్‌ను రష్యా భూభాగంలోని తాష్కెంటు నగరానికి వచ్చి తన్ను కలుసుకొనవలసిందిగా ఆహ్వానించాడు. దానికి వారు సమ్మతించి కొసిగిన్ సమక్షంలో చర్చలు జరిపారు చర్చల అనంతరం ఉభయులు (1) భద్రతా సమితి ఆదేశానుసారం వారు అంగీకరించిన యుద్ధ విరమణను

ఉల్లంఘించరాదని, (2) రెండు దేశాలమధ్య ఉత్పన్నం అయ్యే వివాదా లన్నింటిని శాంతియుతంగా పరిష్కరించుకొనుటకు సిద్ధంగా వున్నట్లు ఒక ప్రకటనను గావించారు. ఆరోజే గుండెపోటు కారణంగా శాస్త్రిగారు తాష్కెంటులోనే ప్రాణాలు కోల్పోయారు. పాకిస్థాన్‌తోటి యుద్ధం మూలంగా వారికి ఎనలేని ప్రఖ్యాతి లభించింది. ఇంతేకాదు. 1962 లో చైనా దురాక్రమణ కాలంలో మన సైన్యాలు కోల్పోయిన పేరు ప్రతిష్ఠలను శాస్త్రిగారు విజయవంతంగా సాగించిన పాకిస్థాన్ యుద్ధం కారణంగా తిరిగి సంపాదించినవి. వారు ప్రధానిగా 19 నెలలు మాత్రమే దేశాన్ని పాలించినా వీటి అన్నిటి మూలంగా మన చరిత్రలో వీరికి శాశ్వత స్థానం లభించింది. కాని తాష్కెంటు ప్రకటన ఫలితా లన్నిటిని చూడగల అవకాశం అకాలమరణంవల్ల వారికి లేకపోవడం చాలా విచారకరం.

21 రోజుల యుద్ధకాలంలోను, తాష్కెంటు సంప్రదింపుల కాలంలోను, అటు తర్వాతను కాశ్మీరు గురించి, మన విదేశాంగ విధానాన్ని గురించి, తాష్కెంటు ప్రకటనను గురించి, చైనావారి బెదరింపుల గురించి నేను పత్రికలకు వ్యాసాలు వ్రాశాను. ఆకాశవాణిలో ప్రసారం చేశాను. అనేక సమావేశాలలో ఉపన్యసించాను. ఆనాడు కాంగ్రెసు ప్రముఖులలో ఒకరైన వి. బి. రాజుగారు హైదరాబాదులో మన విదేశాంగ విధానాన్ని గురించి చర్చలు జరుపుటకు ఒక సంఘాన్ని ఏర్పాటు చేశారు. నేను దాని సమావేశాలలో పాల్గొని నా అభిప్రాయాలను వ్యక్తం చేస్తూ వచ్చాను. దేశం ఎదుర్కొంటున్న సమస్యలను గురించి అన్నివర్గాలకు, అన్ని పక్షాలకు చెందిన ప్రజలలో సదభిప్రాయాన్ని వ్యాపింపచేయడం నా జీవిత లక్ష్యాలలో ప్రధానంగా అనేక సంవత్సరాలుగా భావించినాను. నేను పత్రికలలో వ్రాసిన వ్యాసాలు, సమావేశాలలో చేసిన ఉపన్యాసాలు, ఆకాశవాణి ప్రసారాలు దీనిని నా యథాశక్తి సాధించుటకే ఉద్దేశించినాను. ఈ ఉద్దేశంతోనే 1965 లో నా కార్యక్రమాలలో అనేకాన్ని సాగించినాను.

1966 నాటికి నా కార్యక్రమాలు ఒక పంథాలో పడినవి. దానిలో పూర్తిగా నడచుటకు నేను అలవాటు పడినాను.

ఇంకొక మార్గంలో నడచుటకు సాధ్యం కాలేదు. అలాగు చేయడం అవసరమని కూడా నేను భావించలేదు.

ఇందులో గ్రంథ సమీక్షలను చేయడం ప్రధాన స్థానాన్ని వహించింది. 'దక్కన్ హెరాల్డు', 'ఇలస్ట్రేటెడ్ వీక్లీ' సమీక్షార్థం పంపిన గ్రంథాలు ఎప్పుడూ నా చేతిలో ఉండేవి. రైలులో ప్రయాణం చేసినప్పుడు కూడా వీటిని తీసుకొని వెళ్ళి చదువుతూ ఉండడం పరిపాటి అయింది. అప్పుడుగాని సకాలంలో సమీక్షలను పంపడం సాధ్యం కాలేదు. అందుచేత ఇతర పనులు ఎన్ని ఉన్నా నా వ్యవధిలో చాలా భాగం దీనికిగాను వినియోగించేవాడిని. 1966 మొదలు 1974 వరకు 138 గ్రంథ సమీక్షలు చేశాను. 1974 లో నా ఆరోగ్యం చాలావరకు క్షీణించింది. మంచంనుండి లేవలేని స్థితికి వచ్చాను. కంటి దృష్టి కూడా చాలావరకు లోపించింది. ఈ పరిస్థితిలో గ్రంథాలను చదివి సమీక్షించడం సాధ్యం కాలేదు. అందుచేత 1974 అక్టోబరులో సమీక్షార్థం గ్రంథాలను పంపవద్దని 'దక్కన్ హెరాల్డు' సంపాదకులకు వ్రాసినాను. అప్పటికే ఎ. యస్. రామన్‌గారు 'ఇలస్ట్రేటెడ్ వీక్లీ'తో సంబంధాన్ని వదలుకొన్నారు. వారి తర్వాత సంపాదకత్వాన్ని వహించినవారు క్రమక్రమంగా గ్రంథాలను నాకు పంపడం మానుకొన్నారు. ఇందుకుగాను నేను ఎలాటి విచారాన్ని పొందలేదు. కార్యభారం తగ్గిందని సంతోషించినాను. అటుతర్వాత ఎప్పుడైనా ఢిల్లీలోని 'ఇండియా క్వార్టర్లీ' లో మాత్రం గ్రంథ సమీక్షలు చేస్తూ ఉండినాను. ఈ పత్రికతో ఈనాటివరకు నాకు ఈలాటి సంబంధం ఉన్నది. గ్రంథ సమీక్షలను మానుకొనిన తర్వాత చరిత్ర, రాజనీతి, సామాజికశాస్త్రం మొదలైనవాటిని గురించి గ్రంథాలను చదవగల అవకాశం చాలావరకు తగ్గింది.

ఈకాలంలో గ్రంథ సమీక్షలతో పాటు పత్రికలకు వ్యాసాలను వ్రాస్తూ ఉండినాను. వీటిని కూడా ఎక్కువగా 'దక్కన్ హెరాల్డులోను', 'ఇలస్ట్రేటెడ్ వీక్లీ'లోను, 'త్రివేణి'లోను ప్రకటించినాను. అప్పుడప్పుడు 'ఆంధ్రప్రభకు', ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సమాచారశాఖవారు ప్రకటించే ' ఆంధ్రప్రదేశ్ ' అనే పత్రికకు వ్యాసాలు వ్రాస్తూ ఉండినాను. ఇతర తెలుగు పత్రికలు కూడా

అప్పుడప్పుడు వ్యాసాలు వ్రాయవలసిందిగా నన్ను కోరుతూ ఉండేవి. ఎవరి కోరికను నేను నిరాకరించేవాడను కాను. ఈ వ్యాసాలలో అనేకం చరిత్ర, రాజకీయాలు, సంస్కృతి మొదలైన విషయాలకు సంబంధించినట్టివి.

నేను 1966–'74 లో అనేక సమావేశాలలోను, గోష్ఠి కార్యక్రమాలలోను పాల్గొని ఉపన్యసించాను. 1966 లో "విశ్వ విద్యాలయాలకు ఉండ దగిన స్వేచ్ఛ" (University Autonomy), "మునిసిపాలిటీల కార్యకలాపాలు" (Municipal Services),' "మద్యపాన నిషేధము" (Prohibition), "సాంఘిక శాస్త్రాల అధ్య యనంలో అనుసరించదగిన విధానము" (Methodology in Social Science), "నిరక్షరాస్యత–ప్రజాస్వామికము" (Illiteracy and Democracy) అనే విషయముల గురించి జరిగిన సదస్సులలో పాల్గొ న్నాను. ఇవిగాక మైసూరు విశ్వవిద్యాలయం, అమెరికా సమాచార శాఖలు కలిసి మైసూరులో ఏర్పాటు చేసిన సదస్సులలో ప్రసంగించుటకు రెండు ప్రత్యేక ఉపన్యాసాలను వ్రాసి, అధ్యక్షతను వహించి సదస్సును నడిపాను. ఇదేవిధంగా ఇతర సంవత్సరాలలో జరిగిన సదస్సులలో పాల్గొన్నాను. గ్రంథ విస్తరణ భీతిచేత వాటి నన్నిటిని పేర్కొనడం మానుకొంటున్నాను. వీటి అన్నిటిలో 1970 సెప్టెంబరులో వరంగల్లులో జరిగిన పోలీసు వ్యవస్థను గురించిన మూడు రోజుల సదస్సు ఎక్కువ ప్రాధాన్యాన్ని వహిస్తున్నది. దీనిని విశ్వవిద్యాలయానికి చెందిన రాంరెడ్డి, శేషాద్రిగార్లు ఏర్పాటు చేశారు. పోలీసుశాఖకు చెందిన అధికారు లనేకులు ఇందులో పాల్గొన్నారు. అది దీనిలోని విశిష్టత. నేను రెండు రోజులు అధ్యక్షత వహించినాను. పోలీసు వ్యవస్థకు చెందిన సమస్యలన్నీ ఈ సదస్సులో క్షుణ్ణంగా పరిశీలింపబడినవి. దేశంలో అధికారులు, అనధికారులు కలిసి పోలీసు వ్యవస్థను గురించి ఏర్పాటుచేసిన సదస్సులలో ఇదే మొదటిది.

ఇదివరలో చేస్తున్నట్లు 1966–'74 లో ఆకాశవాణిలో సమకాలిక సమస్యల గురించి 22 ప్రసంగాలు ప్రసారం చేశాను. 'త్రివేణి' లో 'అంతర్జాతీయ పరిణామాల' స్థానే 'జాతీయ రంగంలో పరిణామాలు' (National Scene) అనే విషయాన్ని గురించి

తరుచుగా వ్యాసాలు వ్రాశాను. 'ఎడ్యుకేషనల్ ఇండియా'లో సంపాదకీయాలను, 'తెనుగు విద్యార్థి'లో ప్రశ్నలకు సమాధానాలు వ్రాస్తూ వచ్చినాను. ఈ పత్రికలతో నాకు చాలాకాలం క్రిందట ఏర్పడిన సంబంధాన్ని వదలుకొనలేదు.

ఇవిగాక ఈకాలంలో నేను కొన్ని గ్రంథాలను కూడా రచించినాను. 1966 లో 'ఆంధ్రప్రదేశ్ లో పంచాయతీ రాజ్య' మనే గ్రంథాన్ని రాంరెడ్డిగారితో కలిసి పూర్తిచేశాను. అదే సంవత్సరంలో కేంద్ర ప్రభుత్వ ప్రచురణశాఖవారు "సక్రమమైనట్టివిన్ని, స్వేచ్ఛతో కూడినట్టివిన్ని ఎన్నికల" గురించి (Fair and Free Elections) ఒక చిన్న గ్రంథాన్ని వ్రాయవలసిందిగా కోరినారు. నేను దానికి అంగీకరించి ప్రజాస్వామికము, ఎన్నికలకు సంబంధించిన కొన్ని ప్రామాణిక గ్రంథాలను చదివి 1966 మే 25 న నా గ్రంథాన్ని వ్రాయుటకు ప్రారంభించాను.

ఇది ఆరు అధ్యాయాలతో కూడిన గ్రంథం. మొదటి అధ్యాయంలో ఈనాటి ప్రాతినిధ్య ప్రజాస్వామికంలో ఎన్నికలకు గల ప్రాధాన్యాన్ని, ఈ ప్రాధాన్యం ప్రజలు, ఓటర్లు, రాజకీయ పక్షాలు, శాసనసభలు, ప్రభుత్వము—వీటి అన్నిటి దృష్ట్యా ఎలాగు వైవిధ్యం వహిస్తున్నదో వివరించాను. రెండవ దానిలో వోటు చేసే హక్కు స్త్రీలు, పురుషులు అనే విచక్షణలేక వయోజనులందరికి ఉండవలెననే సిద్ధాంతాన్ని సమర్థించాను. మూడవ దానిలో ఓటర్లు, నియోజక వర్గాలకు సంబంధించిన సమస్యలను, నాల్గవ దానిలో అభ్యర్థులు, రాజకీయ పక్షాలకు సంబంధించిన సమస్యలను పరిశీలించినాను. అయిదవ దానిలో స్వేచ్ఛారహితమైనట్టివిన్ని, క్రమబద్ధములు కానట్టివిన్ని ఎన్నికల లక్షణాలను వివరించినాను. ఆరవ అధ్యాయంలో ఓటర్ల బాధ్యతలు ఏలాటివో సవిమర్శకంగా పరిశీలించినాను. గ్రంథాన్ని పూర్తిచేసి జూన్ 19 న ప్రచురణశాఖకు పంపినాను. దానిని ప్రభుత్వం సంవత్సరం ఆఖరున ప్రకటించింది. కొన్నినెలలు గడచిన తర్వాత దానిని హిందీ భాషలోకి అనువదించి దానిని కూడ ప్రకటించింది. గ్రంథం చిన్నదైనా ఎన్నికల గురించిన ప్రధాన విషయాలన్నిటినీ నేను దానిలో చేర్చగలిగాను.

మైసూరు సదస్సులో పాల్గొనడానికి నేను వెళ్ళినపుడు విశ్వవిద్యాలయ రాజనీతిశాఖలో ప్రధానాధ్యాపకులు తోటప్పగారు మాటవరసన 1967 ప్రారంభంలో విశ్వవిద్యాలయంలో మూడు ప్రత్యేక ఉపన్యాసాలను ఇయ్యవలసిందిగా నన్ను కోరినారు. తర్వాత నవంబరు ప్రాంతాన అధికారపూర్వకంగా ఆహ్వానాన్ని పంపినారు. నేను దానికి సమ్మతించి 'భారత దేశంలో ప్రజాస్వామికం పనిచేసే తీరు తెన్ను'లను గురించి ప్రసంగించెదనని వారికి తెలియ పరచాను.

ప్రజాస్వామికం పనిచేయడంలో ఓటర్లు, రాజకీయ పక్షాలు, ఒత్తిడి సంఘాలు ప్రధాన పాత్రను వహించడం జరుగుతుంది. మన దేశంలో ఇవి ఏ విధంగా పనిచేస్తున్నది తెలుసుకొనిన పక్షంలో ప్రజాస్వామికం తీరుతెన్నులు ఎలాటివో స్పష్టం కాగలవు. అందుచేత నేను నా మొదటి ఉపన్యాసంలో ఓటర్ల ప్రవర్తన, రెండవ దానిలో రాజకీయ పక్షాల ప్రవర్తన, మూడవ దానిలో ఒత్తిడి సంఘాల (Pressure Groups) ప్రవర్తనలను పరిశీలించుటకు ఉద్దేశించినాను. ఇందుకుగాను కొన్ని ప్రామాణిక గ్రంథాలను, సాధారణ ఎన్నికలను గురించిన నివేదికలను చదివి, వాటిని ఆధారం చేసికొని నా ఉపన్యాసాలను వ్రాసినాను. 1967 ఫిబ్రవరి 4 న హైదరాబాదులో బయలుదేరి 5-వ తేదీ ఉదయం బెంగుళూరు స్టేషన్ చేరినాను. నాతో కూడా నా భార్య, నా మనుమడు డాక్టర్ వెంకటేశ్ వచ్చారు. స్టేషన్‌లో మొదటి క్లాసు పెట్టెలో కూర్చొని వుండగా అకస్మాత్తుగా వర్టీగో వ్యాధి తగిలి ఒక అరగంటకాలం బాధపడినాను. తర్వాత ఎలాగో తేరుకొని 11 గంటలకు మైసూరు చేరినాను. కాని మంచం నుంచి లేచి నిలబడడం సాధ్యం కాలేదు. తోటప్పగారిని పిలిపించి ప్రసంగాలు చేయడమా, మానడమా అనే విషయాన్ని వారితో చర్చించాను. ఎలాగో ఒకలాగు సమావేశానికి రావలసిందిగాను, ప్రసంగాలను చదవగలిగితే నేను చదవవలసినట్లుగాను, లేని పక్షంలో తోటప్పగారు చదవవలసినట్లుగాను తీర్మానించుకొన్నాము.

అతి కష్టంమీద సాయంకాలం 5 గంటలకు సమావేశానికి వెళ్ళినాను. విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు శ్రీమాలిగారు

అధ్యక్షత వహించారు. అటుతర్వాత నేను సాహసించి నా మొదటి ఉపన్యాసం చదివినాను. రెండవ రోజున, మూడవ రోజున సమావేశానికి వెళ్ళినాను. కాని ఉపన్యాసాలను చదవడం సాధ్యం కాలేదు. నా తరఫున తోటప్పగారు చదివారు. ఉపాధ్యక్షులు నా ఉపన్యాసాలను ప్రశంసిస్తూ మాటలాడినారు. ఈవిధంగా నా ఉపన్యాసాల కార్యక్రమం ఎలాగో ముగిసింది.

అప్పుడు మైసూరులో నా కుమారుడు వెంకటేశ్వర్లు ఉండినందున నాకు కావలసిన వైద్యసహాయం, ఇతర సౌకర్యాలు లభించినవి. 9 న బయలుదేరి 10–వ తేదీ రాత్రి 10 గంటలకు హైదరాబాదు చేరినాను. నా ఉపన్యాసాలను వినుటకు వచ్చిన 'హిందూ' పత్రిక విలేఖరి వాటిని సంక్షిప్త పరచి పత్రికలకు పంపించినాడు. దానిని 'హిందూ' పత్రిక 10. 12 తేదీలలో ప్రకటించింది. దీనిమూలంగా నా ఉపన్యాసాలకు తగిన ప్రచారం లభించింది.

ఈ మూడు ఉపన్యాసాలను "Some Aspects of Democratic Politics in India" అనే పేరుతో మైసూరు విశ్వవిద్యాలయంవారు గ్రంథరూపంలో ప్రకటించారు. కొన్ని నెలలు గడచిన తర్వాత దానిని కన్నడ భాషలోకి తర్జుమా చేసి, దానిని కూడా ప్రకటించారు. మొత్తంమీద నా ఆరోగ్యం ఎలాగుండినా మైసూరు విశ్వవిద్యాలయంలో నా ఉపన్యాసాల కార్యక్రమం తృప్తికరంగానే ముగిసింది.

1966 లో ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం ఇంటర్మీడియేట్ విద్యార్థులకు, బి. ఏ. విద్యార్థులకు తెలుగులో పాఠ్యగ్రంథాలను వ్రాయించుటకు నా అధ్యక్షతన ఒక కమిటీని నియమించింది. నా ఇతర కార్యక్రమాలతోపాటు ఈ కార్యక్రమాన్ని కూడా చేపట్టి ప్రధానంగా భారతదేశచరిత్ర, పౌరశాస్త్రం, వాణిజ్యం మొదలైన విషయాలకు సంబంధించిన గ్రంథాలను వ్రాయించాను. గ్రంథకర్తలను ఎంపికచేయడం, వారిచేత గ్రంథాలను వ్రాయించడం, వాటిని సరిచూచి సంస్కరించవలసివచ్చినపుడు సంస్కరించడం, అచ్చువేయించడం—ఇదంతా చాలా శ్రమతో

కూడుకొన్న పని. కాని ఎలాగో దీనిని విజయవంతంగానే సాగించినాను. రెండు సంవత్సరాలైన తర్వాత ప్రభుత్వం ఈ కమిటీని రద్దుచేసి ఇంటర్మీడియేట్, బి. ఏ. లకు పాఠ్యగ్రంథాలను రచించే బాధ్యతను క్రొత్తగా స్థాపింపబడిన తెలుగు అకాడమి అనే సంస్థకు ఒప్పగించింది.

1967 లో నా రచనా కార్యక్రమం చురుకుగా సాగింది. నేను మొదటినుండి స్థానిక ప్రభుత్వము (Local Government) ను గురించి పరిశోధనలు చేస్తూ వచ్చాను. ఈవిషయాన్ని గురించి అప్పుడప్పుడు అనేక వ్యాసాలు వ్రాసి ప్రకటించాను. అందుచేత 1967 లో భారత దేశంలో స్థానిక ప్రభుత్వ పరిణామాన్ని గురించిన మౌలిక ఆధారాలను ఎంపికచేసి, ఒక సుదీర్ఘమైన పీఠికతో ప్రకటించ నిర్ణయించుకొన్నాను. నాకు కావలసిన ఆధారాలన్నీ హైదరాబాదులో లభించలేదు అందుచేత ఢిల్లీలో 'హిందూ' ప్రత్యేక విలేఖరిగా ఉండిన నా కుమారుడు పట్టాభిరామ్‌ను నాకు కావలసిన ఆధారాలను కొన్నిటిని అక్కడి గ్రంథాలయాల నుండి సేకరించవలసిందిగా కోరాను. వాడు దీనిపట్ల శ్రద్ధవహించి నా కోరికను కొనసాగించినాడు. అందుచేత నేను గ్రంథాన్ని మా ఇద్దరిపేరట ప్రకటించాను.

మౌలిక ఆధారాలను సేకరించిన తర్వాత మన దేశంలో మొదటినుండి స్థానిక ప్రభుత్వం ఎలాంటి ప్రాధాన్యం వహించినది, ప్రాచీన, మధ్య యుగాలలో అది ఎలాగు పని చేసినది, బ్రిటిషు పరిపాలనా కాలంలో ప్రథమంలో దాని ప్రాధాన్యం ఎలాగు క్షీణించినది, క్రమక్రమంగా బ్రిటిషు ప్రభుత్వం దానిలో చేసిన మార్పులను, దాని ఫలితంగా వర్తమాన కాలంలో అది ఏవిధంగా పనిచేస్తున్నది, భవిష్యత్తులో దానిలో జరగవలసిన మార్పులు మొదలైన విషయాల గురించి సుదీర్ఘమైన పీఠికను వ్రాసినాను. ఈ గ్రంథాన్ని 1968 లో ఢిల్లీలోని అలైడ్ పబ్లిషర్స్ (Allied Publishers) వారు ప్రకటించారు.

1967 లో నేను సాగించిన రెండవ రచన కౌటిల్యుని అర్థశాస్త్రాన్ని శిష్ట వ్యవహార భాషలోనికి తెనిగించడం. 1923 లో

ఉభయభాషా ప్రవీణులైన ఆకుండి వేంకటశాస్త్రిగారు, నేను కలసి దీనిని తెనిగించినాము. కాని ఆ తెనిగింపు గ్రాంథిక భాషలో జరిగింది. సామాన్య పాఠకులు దానిని అర్థం చేసుకోనడం సాధ్యం కాలేదు. దానిని తెనిగించుటకు మరెవ్వరు ప్రయత్నం చేయ లేదు. 1923 లో శ్యామశాస్త్రి రచించిన సంస్కృత ప్రతిని నేను ఆధారం చేసికొని తెనిగింపును సాగించినాను. 1967 నాటికి బొంబాయి విశ్వవిద్యాలయాధికారులు కాంగ్లె పండితుని చేత సంస్కరింపబడిన సంస్కృత మూలాన్ని ప్రకటించారు. ఇదిగాక దానికి ఒక ఇంగ్లీషు తర్జుమాను చేయించారు. దీనికి తోడు కౌటిల్యుని అర్థశాస్త్రంలోని విశిష్టతను, మాకియవెల్లి వ్రాసిన రాజనీతికిని, దీనికి ఉన్న పోలికలు, తారతమ్యాలు విమర్శాత్మకంగా వివరించే సంపుటాన్ని కూడా కాంగ్లె ప్రకటిం చారు. కాంగ్లె సంస్కరించిన సంస్కృత మూలాన్ని ఆధారం చేసికొని 1967 లో నేను దీనిని వ్యవహార భాషలోకి తెనిగించి, క్లిష్ట విషయాలను స్పష్టపరచుటకు Footnotes ను చేర్చాను. ఇంతేకాక నా తెనిగింపునకు ఒక సుదీర్ఘమైన పీఠికను వ్రాసి అందులో గ్రంథకర్తృత్వము, కౌటిల్యుని కాలము, ఆకాలములోని భారతదేశ పరిపాలన విధానము మొదలైన విషయములను సమగ్రంగా వివరించినాను. అందుచేత సర్వవిధాలా 1923 లోని తెనిగింపు కంటె 1967 లోని తెనిగింపు ఉత్తమమైనదిగా నేను భావిస్తున్నాను. ఆంధ్రదేశంలోని పాఠకులు దీని ప్రాశస్త్యాన్ని గ్రహించినందువలన ఒక సంవత్సరంలో దీని ప్రతులన్ని ఖర్చ యినవి. ఇప్పటికి కూడా దీనికి చాలా గిరాకీ ఉన్నది. ముద్రణ ఖర్చులు అత్యధికంగా పెరిగినందున నేను దీనిని పునర్ముద్రించడం సాధ్యం కాలేదు. ఆ పనిని ఆంధ్ర విశ్వవిద్యాలయంవారికి అప్ప గించినాను.

1967 లో నేను ఆంధ్ర స్వాతంత్ర్య సమరానికి సంబంధించిన నాల్గవ సంపుటాన్ని రచించినాను. దీనిని ఆగస్టులో ప్రారంభించి 1968 జనవరినాటికి పూర్తిచేసినాను. నా రచనను కార్య నిర్వాహక కమిటీవారు ఆమోదించిన తర్వాత రాష్ట్ర కమిటీ వారు దానిని పరిశీలించుటకు కొండాలి ఆంజనేయులు, క్రొవ్విడి

లింగరాజు, యం. జగ్గన్నశాస్త్రిని నియమించారు. వారు అనేక సూచనలు చేసినారు. వాటిని కార్యనిర్వాహక కమిటీవారు చర్చించి కొన్నిటిని గ్రహించి మరికొన్నిటిని త్రోసిపుచ్చినారు. గ్రహించిన సూచన లన్నిటిని నేను గ్రంథంలో పొందుపరచాను. నేను ఎంపిక చేసిన మౌలికాధారములనే కాక మరికొన్నిటిని కూడా చేర్చవలసిందిగా వీరు సూచించారు. దాని ఫలితంగా నాల్గవ సంపుటం మొదటి మూడు సంపుటాల కంటె విపరీతంగా పెరిగింది. నిర్హేతుకమైన విమర్శలకు, ఖండనలకు గురియైన స్వాతంత్ర్య సమర రచనను పూర్తిచేయగలిగినందులకు సంతోషించినాను. నేను వహించిన కార్యభారాన నుండి విముక్తుడనైనాను.

కార్యనిర్వాహక కమిటీవారు, పరిశీలకబృందంవారు వారి వారి పనులను పూర్తి చేయుటకు, అటుతర్వాత దీనిని ముద్రించుటకు 7 సంవత్సరాలు పట్టింది. 1976 మార్చి 11 న దీనిని ముఖ్యమంత్రి జలగం వెంగళరావుగారు జూబిలీ హాలులో విద్యాశాఖమంత్రి అధ్యక్షతన జరిగిన సభలో ఆవిష్కరించారు. ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు కమిటీ అధ్యక్షులు వెంకట నారాయణ గారు, వావిలాల గోపాలకృష్ణయ్యగారు నా రచనను ప్రశంసించారు. వారందరిపట్ల నా కృతజ్ఞతలను తెలియపరచుచు నేను ఈ సమరం యొక్క ప్రధాన లక్షణాలను వివరించాను. ప్రకటన విషయంలో ఇంతటి ఆలస్యం ఎందుకు జరిగిందో ఎవరూ పట్టించుకోలేదు. దీనికి మూలకారణం స్వార్థం. కార్యం పూర్తి అగుటకు రాష్ట్ర కమిటీ సభ్యు లెవరికి ఇష్టంలేదు. కమిటీకి ఎలాంటి పని లేకపోయినా ఇప్పటివరకు ప్రభుత్వం దానిని రద్దు చేయలేదు. ఆరు నెలల కొక పర్యాయం దానిని పొడిగిస్తూ వున్నది. ఈ పొడిగింపు మూలంగా ప్రభుత్వ వ్యయం నిరర్థకంగా పెరిగిపోతున్నది. ప్రభుత్వం ఈవిషయంలో బాధ్యతతో ప్రవర్తించకపోవడం విచారకరం.

1967 లో మౌలికాధారాలతో కూడిన స్థానిక ప్రభుత్వాన్ని గురించిన గ్రంథాన్ని రచించిన తర్వాత భారత సమాఖ్యను గురించి ఈలాటి గ్రంథాన్నే రచించ సంకల్పించి అందులో నాకు

సహాయపడవలసిందిగా ఉస్మానియా విశ్వవిద్యాలయ రాజనీతి శాఖలో రీడరుగా ఉండిన శివయ్యగారిని కోరినాను. వారు నా కోరికను మన్నించి నాకు సహాయపడినారు. భారత దేశంలో సమాఖ్య పరిపాలన పరిణామమును గురించిన మౌలిక పత్రములను, రాజ్యాంగసభ వారు 1946–'49 లో రూపొందించిన సమాఖ్య ప్రధాన లక్షణములను, 1950 నుండి 1973 వరకు అది ఆచరణలో ఏవిధంగా మారింది మొదలైన విషయాలను స్పష్టపరచే పత్రాలను మేమిద్దరం కలిసి ఎంపిక చేసినాము. అటుతర్వాత దీనికి ఒక సుదీర్ఘమైన పీఠికను నేను వ్రాయవలసినట్లుగాను. ఒక్కొక్క మౌలిక పత్రాన్ని గురించి సంక్షిప్తంగా ఆ పత్రానికి ప్రథమంగా ఒక పీఠికను శివయ్య వ్రాయవలసినట్లుగాను మేము కార్యవిభజన చేసుకొన్నాము. దీని మేరకు మా పనులను నిర్వహించి, నా స్థానిక పరిపాలన గ్రంథాన్ని ముద్రించిన ఢిల్లీలోని అలైడ్ పబ్లిషర్స్ వారికి దీనిని కూడా ప్రకటించ వలసిందిగా కోరుతూ టైపు ప్రతి 890 పుటలను పంపినాను.

ఈ కంపెనీలో చాలా కాలాననుండి నా శిష్యవర్గంలో ఒక రైన అబ్బూరి రాజేశ్వరరావుగారు మేనేజరుగా ఉండేవారు. వారి సహాయం ఉండబట్టి నా స్థానిక పరిపాలన గ్రంథం అనాలస్యంగా ప్రకటించబడింది. సమాఖ్య పాలనను గురించిన గ్రంథాన్నికూడా అలైడ్ పబ్లిషర్సు వారు ప్రకటించుటకు మాట ఇచ్చారు. కాని ఏకారణంవల్లనో వారు ఆ కంపెనీలోని ఉద్యోగాన్ని మాను కొనవలసి వచ్చింది. అయినా నా గ్రంథాన్ని ఇంకొక కంపెనీ ద్వారా ప్రకటించుటకు ప్రయత్నిస్తామని చెప్పినారు. కాని ఇది వెంటనే సాగక కొన్ని సంవత్సరాలు సాగిపోయినవి. తుదకు ఢిల్లీ లోని ఆర్నాల్డు హీన్‌మాన్ కంపెనీవారు దీనిని ప్రకటించుటకు సిద్ధపడ్డారు. కాని గ్రంథం చాలా పెద్దది అని, దానిని ప్రకటించు టకు కావలసిన ఆర్థిక స్తోమత తమకు లేదని. అందుచేత నా పీఠికను మాత్రం మొదటి సంపుటంగాను, మౌలిక పత్రాలను రెండవ సంపుటంగాను ప్రకటించుటకు నిర్ణయించి, దాని మేరకు 1975 లో నా పీఠికను ప్రకటించారు. ప్రకటనలో కొంత ఆలస్యం జరిగినా తుదకు అది ప్రకటితమైనందుకు నేను చాలా సంతోషించి

నాను. దానిని నేనే వ్రాసినా మొత్తం మూలిక పత్రాలతో కూడిన గ్రంథం శివయ్య, నేను కలసి వ్రాయడంచేతను, ఇది అందులో మొదటి సంపుటం కావడంచేతను ఇది కూడా మా ఇద్దరి పేరట ప్రకటింపబడినది.

ఇది నాలుగు అధ్యాయాలతో కూడిన 123 పుటల గ్రంథం. మొదటి అధ్యాయంలో కేంద్రీకృతమైన బ్రిటిషు పరిపాలన 1861-1921 మధ్య ఏవిధంగా క్రమక్రమంగా కేంద్రీకృతమై, 1921 లో అది మాంటేగు—చెమ్స్ఫర్డ్ సంస్కరణల ఫలితంగా ద్వంద్వ ప్రభుత్వం (Dyarchy) గా రూపొందిందో, ఈప్రభుత్వంలో సమాఖ్య బీజాలు ఎలాగు నాటబడినవో వివరించాను. రెండవ దానిలో ద్వంద్వ ప్రభుత్వం 1935 భారత ప్రభుత్వ చట్టం మూలంగా పూర్తిగా ఫెడరల్ విధానంగా మారిన విషయాన్ని, ఈ విధానంలోని ప్రత్యేక లక్షణాలను వివరించాను. బ్రిటిషు పరిపాలన స్థాపితమై నప్పటినుండి ప్రత్యక్షంగా వారు పాలించిన రాష్ట్రాలు, పరోక్షంగా వారు పాలించిన స్వదేశ సంస్థానాలు వేరువేరుగా ఉండినవి. 1935 చట్టం ఈ రెండింటిని కలిపి ఒకే ప్రభుత్వ పరిపాలనలోకి తెచ్చింది. సమాఖ్య విధానంలో చేర్చబడిన ప్రత్యేకలక్షణాన్ని ఈ కలయిక ఫలితాలనే విషయాన్ని స్పష్టం చేశాను. మూడవ అధ్యాయంలో 1935 తర్వాత మన స్వాతంత్ర్య పోరాటం విజయ వంతంగా సాగి, ఆగస్టు 1947 లో మనకు స్వాతంత్ర్యం లభించడం, దాని ఫలితంగా మనమే ఎన్నుకొన్న రాజ్యాంగసభ మన దేశానికి, మన అవసరాలకు అనుగుణమైన సమాఖ్య విధానాన్ని రూపొందించడం, దాని ప్రధాన లక్షణాలు ఎలాటివో సంపూర్ణంగా వివరించాను. నాల్గవ అధ్యాయంలో ఈ విధానం 1950-'73 మధ్య ఏవిధంగా మరింత కేంద్రీకృతంగా మారిందో, దానికి ప్రధాన కారణాలు ఎలాటివో వివరించాను. ఈ గ్రంథం మన సమాఖ్య విధానాన్ని సమగ్రంగా వివరించే గ్రంథం అని నేను భావిస్తున్నాను. శాస్త్రవేత్తలు కూడా దీనిని ఈ కారణం చేతనే ప్రశంసించారు. ఇటీవల పంజాబు విశ్వవిద్యాలయంలో రాజనీతిశాఖలో ప్రధానాధ్యాపకులైన బాంబ్వాలా సంపాదకత్వాన వెలువడిన

సమాఖ్యను గురించిన గ్రంథంలో నా గ్రంథంలోని ఆఖరు అధ్యాయాన్ని చేర్చడం దీనికి తార్కాణం.

ఈకాలంలో నాకు గ్రంథరచనను సాగించడంలో ప్రముఖులు కొందరి ప్రోత్సాహం లభించింది. వారిలో మొదటి వారు రాష్ట్రపతి డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణన్‌గారు. వారు రాష్ట్రపతి అయిన తర్వాత ప్రతి సంవత్సరం కొన్ని వారాలపాటు ఢిల్లీ వదలి హైదరాబాదు బొలారంలోని రాష్ట్రపతి నిలయంలో నివసించే సంప్రదాయం ఏర్పడింది. దీనిఫలితంగా దేశంలో ఉత్తర దక్షిణ రాష్ట్రాల మధ్య సత్సంబంధాలు బలపడగలవని ఆశించారు. 1965 లో వారు హైదరాబాదుకు వచ్చినప్పుడు వారు ఆంధ్ర విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులుగా ఉన్నప్పుడు వారితోను, వారి కుటుంబంతోను నాకు, నా భార్యకు, నా కుటుంబంలోని ఇతరులకు మంచి పరిచయం లభించింది. దానిని పురస్కరించుకొని నేను కుటుంబ సహితంగా వారి దర్శనార్థం రాష్ట్రపతి నిలయానికి వెళ్ళి వారితో అరగంట గడపినాను. వారు మా యొక్క యోగక్షేమములు తెలుసుకొని, కొన్నినిమిషాలపాటు మాకందరికి తత్వబోధ చేసి, ఆఖరున నా గ్రంథరచనను ప్రశంసించి, ఆ కార్యక్రమాన్ని పట్టుదలతో సాగించవలసిందిగా నాకు సలహా ఇచ్చారు. ఇది నా గ్రంథరచనకు మరింత ప్రోత్సాహాన్ని కలిగించింది.

గ్రంథరచనలో నాకు ప్రోత్సాహం కలిగించిన ప్రముఖులలో రెండవవారు రాష్ట్రపతి జకీర్ హుస్సేన్. 1967 లో వీరు హైదరాబాదు రాష్ట్రపతి నిలయంలో నివాసార్థం వచ్చినపుడు ఇక్కడి Indian Institute of Public Administration శాఖ వారు వారి గౌరవార్థం జూబిలీ హాలులో ఒక మహాసభను సమావేశపరచారు. నేను ఈ శాఖలో సభ్యుడను కావడంచేత సభకు వెళ్ళినాను. కార్యదర్శి నన్ను వారికి పరిచయం చేసినప్పుడు "ఉద్యోగాన నుండి విరమించిన తర్వాత నీవు ఏమి చేస్తున్నా"వని ప్రశ్నించినారు. "ఆంధ్రప్రదేశ్ స్వాతంత్ర్యోద్యమ చరిత్ర, మరికొన్ని గ్రంథాలను వ్రాసినా"నని వారికి తెలియపరచాను. "అధ్యాపకులైన మనవంటివారు ఉద్యోగాన నుండి విరమించిన తర్వాతనే ఎక్కువ గ్రంథాలను రచిస్తూ ఉంటాము. నీవు

ఈలాగు చేయడం నాకు ఎంతో సంతోషంగా ఉన్నది. ఈ కార్యక్రమాన్ని పట్టుదలతో సాగించు" అని సెలవిచ్చారు. ఇవి ప్రోత్సాహకరమైన మాటలుగా నేను భావించాను.

1968 లో ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి కాసు బ్రహ్మానందరెడ్డిగారు నాకు 'పద్మభూషణ' గౌరవాన్ని ప్రసాదించవలసిందిగా రాష్ట్రపతికి సిఫారసు చేశారు. (రెడ్డిగారు, వారి సతీమణి నాపట్ల, నా భార్యపట్ల, నా కుమారుడు ఆనందంపట్ల అత్యంత గౌరవాభిమానములు గలవారు. వారి సతీమణి రెండు మూడు పర్యాయాలు మా ఇంటికి వచ్చి నా భార్యను గౌరవించింది) వారి సిఫారస్సుకు అంగీకరించి 1968 రిపబ్లిక్ దినోత్సవము నాడు నాకు ఈ గౌరవమును ప్రసాదించుటకు రాష్ట్రపతి నిర్ణయించినట్లు ప్రకటించినారు. ఏటేటా ఈలాంటి గౌరవమును అనేకులకు ప్రసాదించడం 1950 నుండి పరిపాటి అయింది. 1968 లో సుమారు వంద ప్రముఖులకు 'పద్మవిభూషన్', 'పద్మభూషణ్' మొదలైన బిరుదులను ప్రసాదించినారు.

ఈ బిరుదును స్వీకరించుటకు నేను, నా భార్య, నా కుమారుడు ఆనందం 1968 ఏప్రిల్ 5 న విమానంలో ప్రయాణం చేసి వెళ్ళాము. బిరుదుప్రదానోత్సవం 16 న జరగవలసియుండినది. 15 న రాష్ట్రపతి భవనంలో ఒక రిహార్సల్ (Rehearsal) ఏర్పాటు చేయబడింది. బిరుదును స్వీకరించుటకు వచ్చినవారు అందులో పాల్గొని మరుసటిరోజు రాష్ట్రపతి ఎదుటికి ఎలాగు వెళ్ళవలెనో, వారి ఎదుట బిరుదును వారు ప్రసాదించు సమయంలో ఎలాగు నిలబడవలెనో, వారు అందజేసే లాంఛనాలను ఏవిధంగా స్వీకరించవలెనో నేర్చుకొన్నారు. మరుసటిరోజు సాయంకాలం బిరుదుప్రదానోత్సవం జరిగింది. అది పూర్తి అగుటకు 1½ గంటలు పట్టింది. అందరివలెనే నేను కూర్చుండిన కుర్చీ నుండి రాష్ట్రపతి వద్దకు నడిచి వారి ఎదుట నిలబడినాను. వారు నాకు ఒక పతకమును (Medal), ఒక సర్టిఫికేటును ఇచ్చారు. వాటిని ఇచ్చినప్పుడు వారు నన్ను గుర్తుపట్టి (హైదరాబాదులో మా మధ్య జరిగిన సంభాషణ వారికి జ్ఞాపకం వుండినది) మందహాసం చేశారు. నేను తిరిగి నా కుర్చీ వద్దకు వచ్చి కూర్చుండినాను.

ఈ ఉత్సవ సమయంలో నా భార్య, నా కుమార్తె వైదేహి, నా కుమారుడు (హిందూ పత్రిక ప్రత్యేక విలేఖరి) పట్టాభిరామ్, నా కోడండ్రు పార్వతి, లక్ష్మి అక్కడికి వచ్చి కార్యక్రమాన్ని చూచినారు. పాస్ (Pass) లభించనందున నా కుమారుడు కృష్ణమూర్తి మాత్రం రాలేకపోయినాడు. 'హిందూ' పత్రికాధిపతికి కూడా ఆరోజు బిరుదుప్రదానం జరిగింది. పత్రిక ఫొటోగ్రాఫర్ (Photographer) అక్కడికి వచ్చి కొన్ని ఫొటోలు తీసినాడు. వాటిలో రాష్ట్రపతి ఎదుట నేను నిలబడి బిరుదు స్వీకరించిన ఫొటో కూడా వుండినది. దానిని ఇప్పటివరకు నా దగ్గర జాగ్రత్తగా దాచి వుంచుకొని ఉన్నాను.

5-16 మధ్య నేను ఢిల్లీలో ఉండిన మిత్రులను, బంధువులను కలుసుకొన్నాను. ఒకరోజు Institute of Public Administration లో కేంద్ర రాష్ట్ర సంబంధాల గురించి జరిగిన సభకు వెళ్ళి అందులో పాల్గొన్నాను. కెనడా (Canada) నుండి ఒక ప్రొఫెసర్ ఆ సభకు వచ్చి కొన్నివిషయముల గురించి ముచ్చటించాడు. నేను నా ప్రసంగంలో వారు లేవదీసిన కొన్ని ప్రశ్నలకు జవాబులు చెప్పినాను. సభ ముగిసిన తర్వాత సభాధ్యక్షుడు త్యాగి (వీరు కేంద్ర మంత్రివర్గంలో సభ్యుడు) నావద్దకు వచ్చి "చక్రవర్తుల రాజగోపాలాచారి, మీరు ఒకే విశ్వవిద్యాలయంలో విద్యాభ్యాసం చేసిన వారా" అని అడిగాడు. "ఔను" అని నేను చెప్పి "ఎందుకు ఈ ప్రశ్న వేశారు" అని వారిని అడిగాను. "మీ ఉచ్చారణ, మీ అభిప్రాయాలు వారి ఉచ్చారణ, అభిప్రాయాల మోస్తరుగా ఉన్నందున ప్రశ్న వేసినాను" అని వారు జవాబు చెప్పినారు. రాజగోపాలాచారివంటి ప్రముఖునితో నన్ను పోల్చినందుకు నేను సంతోషించాను.

ఏప్రిల్ 18 న ఢిల్లీలోని ఆంధ్ర సంఘం వారు డాక్టర్ భగవంతంగారి అధ్యక్షతన సమావేశమై రాష్ట్రపతిచే బిరుదుల మూలంగా గౌరవింపబడిన ఆంధ్రులను అభినందించారు. కాని వారు నావంటివారి ప్రసంగాలపట్ల ఎక్కువ ఉత్సాహం కనపరచ లేదు. సినిమా యాక్టర్ అక్కినేని నాగేశ్వరరావు ప్రసంగాన్ని చక్కగా విన్నారు. యామినీ కృష్ణమూర్తిగారు కూడా బిరుదును

స్వీకరించిన ఆంధ్రులలో ఒకర్తె. కాని ఆమె అభినందన సభకు రానందుకు సభ్యులు చాలా ఆశాభంగాన్ని పొందినారు.

28 న నా గౌరవార్థం ఆంధ్ర విద్యాసంఘంవారు (Andhra Education Society) ఒక సభను సమావేశపరచారు. నన్ను, నా గ్రంథాలను ప్రశంసిస్తూ డాక్టర్ చింతామణి దేశముఖ్, దుర్గాబాయ్ దేశముఖ్, బుర్రా వేంకటప్పయ్య, తెన్నేటి విశ్వనాథం, పెండేకంటి వేంకట సుబ్బయ్య, ప్రొఫెసర్ శ్రీనివాసన్ మొదలైనవారు ప్రసంగించారు. నేను నా కృతజ్ఞతలను వారికి, సంఘంవారికి తెలియపరుస్తూ మాటలాడినాను.

నా కుమాళ్ళు పట్టాభిరాం, కృష్ణమూర్తి ఢిల్లీలో ఉండినందున నేను మరికొన్ని రోజులపాటు అక్కడ ఉండి హైదరాబాదులో లభించని కొన్ని ప్రామాణిక గ్రంథాలను చదువుతూ స్నేహితులను, బంధువులను కలుసుకొంటూ కాలం గడిపి మే 7న ఆనందం సహాయంతో నేను, నా భార్య హైదరాబాదు చేరినాము. నా ఆరోగ్యం చక్కగా లేకపోయినా ఒక నెలరోజులు ఢిల్లీలో ఉండడం నాకు ఎంతో తృప్తిని కలిగించింది.

1968 ప్రారంభంలో రాష్ట్రపతి నాకు 'పద్మభూషణ్' బిరుదును ప్రదానం చేసిన తర్వాత ఆంధ్ర విశ్వవిద్యాలయం అధికారులు నాకు గౌరవ డి. లిట్. డిగ్రీని ప్రదానం చేయుటకు తీర్మానించారని, ఈ ప్రదానం ఆ సంవత్సరం డిసెంబరు 14 న జరుగనున్న స్నాతకోత్సవంలో చేసెదరని, దీనిని స్వీకరించుటకు అంగీకరించవలసినదని విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు డాక్టర్ కె. ఆర్. శ్రీనివాస అయ్యంగార్ నవంబరు 11 న నాకు ఉత్తరం వ్రాశారు. నేను 1931 మొదలు 1944 వరకు పదమూడు సంవత్సరాలకాలం విశ్వవిద్యాలయంలో రాజనీతిశాఖలో రీడరుగాను, ప్రొఫెసరుగాను యథాశక్తి కృషిచేసి, విద్యార్థుల యొక్కయు, ఇతర అధ్యాపకుల యొక్కయు మన్ననలను పొందినా, పదవీ విరమణ తర్వాత అధికారుల మూలంగా ఎలాటి గుర్తింపు లభించకపోవడం నాకు ఎంతో ఆశాభంగాన్ని

కలిగించింది. 24 సంవత్సరాలు గడిచిన తర్వాత గౌరవ డి. లిట్. డిగ్రీని ప్రదానం చేయుటకు అధికారులు తీర్మానించడం నాకు ఎంతో సంతోషాన్ని కలిగించింది. నేను స్నాతకోత్సవానికి హాజరై డిగ్రీని స్వీకరించెదనని ఉపాధ్యక్షులకు ప్రత్యుత్తరం వ్రాశాను. ఈ మధ్యకాలంలో అయ్యంగారు ఉపాధ్యక్ష పదవికి రాజీనామా చేశారు వారి స్థానే యల్. బుల్లయ్యగారు ఉపాధ్యక్షులుగా నియమింపబడినారు. వీరు 1942-'44 లో ఆంధ్ర విశ్వవిద్యాలయం గుంటూరులో ఉన్నప్పుడు బి. ఏ. ఆనర్సు తరగతిలో నా శిష్యులుగా ఉండినారు. వారి ఉపాధ్యక్షకాలంలో నాకు ఈ గౌరవం లభించడం మరింత సంతోషాన్ని కలిగించింది.

డిసెంబరు 11 న నేను, నా భార్య, నా రెండవ కోడలు రాధ, నా కుమార్తె వైదేహి కలిసి ప్రయాణంచేసి 12—వ తేదీన వాల్తేరు చేరినాము. మాకు అన్నిసౌకర్యాలతో విశ్వవిద్యాలయ అతిథి గృహంలో బస ఏర్పాటు చేశారు. 13 న అధ్యాపకుల క్లబ్బులో నేను ఉపన్యసించాను. ఆనాడే విద్యార్థి సంఘంవారు, పాతవిద్యార్థుల సంఘంవారు నాకు ఆహ్వానపత్రాలను సమర్పించారు. 14 న స్నాతకోత్సవానికి వెళ్ళి అధికారులు అంద జేసిన గౌన్, హుడ్, కాప్‌ను ధరించి ఛాన్సెలర్ అందచేసిన డిగ్రీ సర్టిఫికేటును స్వీకరించాను. ఇంతటితో డిగ్రీ ప్రదాన ఉత్సవం పూర్తి అయింది. తర్వాత రెండు రోజులు అక్కడ ఉండి నా పాత స్నేహితులను చూచి 17 న తిరుగు ప్రయాణం చేసి 18 న సికింద్రాబాదు చేరినాను.

కొన్ని నెలలు గడచిన తర్వాత విశ్వవిద్యాలయాధికారులు రాజనీతిశాఖలో నన్ను గౌరవ ప్రొఫెసర్‌గా మూడు సంవత్సరాల పాటు నియమించారు. ఈ పదవిలో నిర్బంధంగా నేను చేయవలసిన పని ఏదీ లేకపోయినా నేను ఈ పదవిని సార్థక్యం చేసుకొనే ఉద్దేశంతో 'భారతదేశంలో జాతీయత' అనే విషయాన్ని గురించి మూడు ఉపన్యాసాలు వ్రాసి, వాటిని ఆధారం చేసికొని ప్రసంగించుటకు 1970 ఫిబ్రవరి 2 న నా భార్యతో నా కోడలు సీతను, నా మనుమరాలు శాంతను మాకు సహాయంగా తీసుకొని వాల్తేరు వెళ్ళినాను.

22 న విశ్వవిద్యాలయంవారు గాంధీమహాత్ముని శత వార్షిక ఉత్సవం ఏర్పాటుచేసి, దానికి నన్ను అధ్యక్షునిగా ఎన్నుకొని నా భార్యను ప్రారంభోపన్యాసం చేయవలసిందిగా కోరారు. ఆమె విజయనగరంలో 1920 ప్రాంతాన మహాత్ముని కలుసుకొనడం, ఆయన ఆదేశానుసారం రాట్నంపై నూలు వడకడం, ఖద్దరు ధారణాన్ని ప్రారంభించడం, అటుతర్వాత మద్రాసులో ఆయన సమావేశాలకు వెళ్ళడం మొదలైన విషయాల గురించి తన జ్ఞాపకాలను వివరించింది. నేను నా ఉపన్యాసంలో మహాత్ముని తత్త్వబోధ, ఆయన చేపట్టిన కార్య క్రమాలు శాశ్వతమైన విలువలు కలిగినట్టివని వివరించినాను. తర్వాత నా ఉపన్యాసాన్ని వ్రాసి కార్యకర్తలకు ప్రకటనార్థం పంపినాను.

23 న నా ఉపన్యాసాలకై విద్యార్థులు, అధ్యాపకులు సమావేశానికి హాజరైనారు. ఉపాధ్యక్షులు బుల్లయ్యగారు ప్రారంభోత్సవం జరిపారు. కాలేజి ప్రిన్సిపాల్ మూర్తిగారు అధ్యక్షత వహించారు. 'భారత జాతీయత'ను గురించిన నా మొదటి ఉపన్యాసాన్ని చదివినాను. 24 న మేము సింహాచల క్షేత్రానికి వెళ్ళి స్వామి దర్శనం చేసుకొని మధ్యాహ్నానికి వాల్తేరుకు వచ్చి నాము. అటుతర్వాత సాయంకాలం రాజనీతిశాఖ ప్రొఫెసర్ అధ్యక్షతన జరిగిన సమావేశంలో 'మత వైషమ్యాలు జాతీయతకు ఎలాటి భంగాన్ని కలిగించుచున్నవో' వివరిస్తూ నా రెండవ ఉపన్యాసాన్ని చదివాను. 25 న 'ప్రాంతీయ దురభిమానాలు, కులతత్వాలు ఎంతవరకు, ఏ విధంగా జాతీయతకు అవరోధంగా ఏర్పడినవో' వివరించే నా మూడవ ఉపన్యాసాన్ని చదివాను. ఈ సమావేశానికి చరిత్రశాఖ ప్రొఫెసర్ ఓరుగంటి రామచంద్రయ్య గారు అధ్యక్షత వహించారు. రాజనీతిశాఖ ప్రొఫెసర్ డాక్టర్ చంద్రశేఖరరావుగారి వందన సమర్పణతో నా మూడు రోజుల ఉపన్యాస కార్యక్రమం ముగిసింది. ఉపన్యాసాలను వినుటకు నగరంలోని ప్రముఖులనేకులు వచ్చారు. 25 న రాజనీతిశాఖకు చెందిన అధ్యాపకులు, విద్యార్థులు నా గౌరవార్థం ఒక టీపార్టీని ఏర్పాటు చేశారు. అందులో 'పరిశోధన కార్యక్రమాలను

అధ్యాపకులు కలిసిచేయడం వాంఛనీయం' అనే విషయాన్ని ఉద్ఘాటించాను. ఈ రెండు మూడు రోజులలో నా భార్య, నా కోడలు, నా మనుమరాలు నౌకా నిర్మాణ కేంద్రాన్ని, ఇతర ప్రదేశాలను చూచుటకు వెళ్ళారు. మేమందరము మా స్నేహితులను కలుకొని 27 న సికింద్రాబాదుకు తిరిగివచ్చినాము.

నేను విశ్వవిద్యాలయంలో చేసిన మూడు ఉపన్యాసాలను విశ్వవిద్యాలయాధికారులు 1971 లో గ్రంథరూపంలో ప్రకటించారు. మన జాతీయతకు సంబంధించిన విషయాలన్నిటిని ఇందులో నేను క్షుణ్ణంగా పరిశీలించాను. మేధావులను ఉద్దేశించి మాత్రమే నేను దీనిని వ్రాయలేదు. ఇందులోని విషయాలను సామాన్య పౌరులు అర్థంచేసికొనడం అవసరం. గ్రంథాన్ని తెనిగించినప్పుడే ఈ అవసరం తీరుతుంది. విశ్వవిద్యాలయంవారు దీనిని తీర్చగలరని ఆశిస్తున్నాను.

ఈ గ్రంథంలోని మొదటి ఉపన్యాసంలో దేశంలోని ప్రజలందరు తాము ఏ మతాన్ని అనుసరించినా, ఏ భాషను మాట్లాడినా, ఏ ప్రాంతంలో నివసించేవారైనా, ఏ కులానికి చెందినవారైనా రాజకీయంగా ఒకే జాతివారనే భావంతో ప్రవర్తించినప్పుడు వారిలో జాతీయతఉన్నట్లు పరిగణించబడుతారు అనే విషయాన్ని స్పష్టంచేశాను. ఈలాటి భావం ప్రజలలో లేక పోవడం చేతనే పరాయివారైన ఆఫ్ఘన్‌లు, తురుష్కులు, మొగలాయిలు, బ్రిటిష్‌వారు మనదేశాన్ని జయించి పరిపాలించగలిగారు. బ్రిటిష్ పరిపాలన కాలంలో మేధావి వర్గానికి చెందినవారు ఇంగ్లీషువిద్య నభ్యసించి, పాశ్చాత్య సంస్కృతిచేతను, విప్లవాలతో కూడిన పాశ్చాత్య చరిత్రచేతను ప్రభావితులై పాశ్చాత్య ప్రపంచంలో అప్పటికి ప్రాబల్యం గాంచిన జాతీయ భావం తమలో కూడా ఉండడం అవసరమని గ్రహించి దానిని తమలో వృద్ధిచేసుకొన్నారు. 1885 లో భారత జాతీయ కాంగ్రెసు పుట్టుకతో దీనికి ఒక బాహ్యరూపం ఏర్పడింది. దీని ఫలితంగా పరాయి పరిపాలనను నిర్మూలించి తమదేశాన్ని తామే పరిపాలించుకొనుటకు క్రమక్రమంగా ఒక ఉద్యమాన్ని వారు లేవదీశారు. ఇది ప్రథమంలో వారికి మాత్రమే పరిమితమై

ఉండినా తిలక్ మొదలైన వారి కృషిమూలంగాను, గాంధీ మహాత్ముని సత్యాగ్రహం మూలంగాను సామాన్య ప్రజలలో కొంతవరకు వ్యాపించింది. స్వాతంత్ర్య సమరంలో పాల్గొనవారే జాతీయతచే ప్రభావితులైనారు. అందులో పాల్గొనని ముస్లింలు, జస్టిస్ పార్టీవారు, హరిజనులు, బలహీనవర్గాలకు చెందినవారు, ఆదివాసులు మొదలైన వారిపై జాతీయభావం ప్రభావం వహించ లేదు. అందుచేతనే ఇప్పటివరకు జాతీయత అన్నివర్గాలలో పూర్తిగా వ్యాపించలేదు. దానిచే ప్రభావితులైనవారిలో కూడ ఇది లోతుగా నాటుకొనలేదు. వారు స్వాతంత్ర్య సంపాద నార్థం చేసిన త్యాగాలు ఇతర దేశాలవారు (అమెరికా, ఇటలీ, పోలెండ్ మొదలైన దేశాలవారు) చేసిన త్యాగాలతో పోల్చి నప్పుడు బహుస్వల్పము లని చెప్పక తప్పదు. అందుచేతనే వారు స్వాతంత్ర్యంయొక్క విలువను పూర్తిగా గ్రహించలేక పోయినారు. ఈ విషయాలన్నిటినీ నేను మొదటి ఉపన్యాసంలో క్షుణ్ణంగా పరిశీలించినాను.

జాతీయభావానికి ఆటంకంగా పరిణమించిన శక్తులలో ముస్లింల మత దురభిమానం అగ్రస్థానం వహిస్తున్నదనీ, చారిత్రక కారణాల మూలంగా వారిలో ఇది ఏర్పడినదనీ, బ్రిటిష్ పరిపాలన కాలంలో వారి నాయకులు ద్విజాతి సిద్ధాంతాన్ని లేవదీసి స్వాతంత్ర్య సమరంలో పాల్గొనక, దేశ విభజనకై కృషి చేశారనీ, ఆ సిద్ధాంత ప్రభావం ఇప్పటికి కూడా వారిలో ఉన్నదనీ, అందుచేత హిందువులలోని కొన్ని వర్గాలలో వారిపట్ల ద్వేష భావం ఉత్పన్నమైనదనీ, ఈ రెండు వర్గాలమధ్య దీనిమూలంగా అప్పుడప్పుడు కొట్లాటలు సంభవిస్తున్నవనీ, ఇది జాతీయతకు భంగం కలిగిస్తున్నదనీ నా రెండవ ఉపన్యాసంలో వివరించి, దీనికి విరుగుడు ఏమిటో సూచించినాను.

వారు వారు మాట్లాడే భాషలపట్ల, వారు వారు నివసించే ప్రాంతాలపట్ల వారి వారి కులాలపట్ల, ఆదివాసులలో వారి వారి తెగలపట్ల దురభిమానం బలపడడం జాతీయతకు ఏవిధంగా ఆటంకంగా పరిణమిస్తున్నదో, అభిమానం ఉండడం సహజమే కాని అది దురభిమానంగా మారినప్పుడు పరస్పర ద్వేషాలకు, కొట్లాటలకు

దారితీయగలదని, తమిళనాడులో రామస్వామి నాయకర్, పంజాబులో తారాసింగు, నాగాలాండు మొదలైన ఆదివాసులు లేవదీసిన వేర్పాటు ఉద్యమాలు ఈలాటివని నా మూడవ ఉపన్యాసంలో పరిశీలించినాను.

ఈ మూడు ఉపన్యాసాలలో జాతీయత ఎదుర్కొనవలసిన దుష్టశక్తులతో పాటు, ఆ శక్తుల ప్రాబల్యాన్ని తొలగించుటకు ప్రభుత్వము, ప్రజలు తీసుకొనవలసిన చర్యలను వివరించినాను. ఈ విషయాలు దేశంలోని వారందరు తెలుసుకొన వలసినట్టివి. అందుచేతనే నా గ్రంథానికి ఒక విశిష్టత ఉన్నట్లు నేను భావిస్తున్నాను.

1971 లో "భారతదేశంలో సమాఖ్య పరిపాలన" అనే విషయాన్ని గురించి నాలుగు ఉపన్యాసాలు వ్రాసి వాటిని చదువుటకు సమావేశాలను ఏర్పాటు చేయవలసిందిగా విశ్వ విద్యాలయాధికారులకు తెలియపరచాను. కాని అప్పట్లో తెలంగాణానుండి ఆంధ్రజిల్లాలను వేరుపరచి, వాటిని ఒక ప్రత్యేక రాష్ట్రంగా నిర్మాణం చేయుటకు కోస్తాలోని ఆంధ్రులు తీవ్రమైన ఆందోళన జరుపుచుండుటచేత పరిస్థితులు చక్కబడిన తర్వాత నేను రావలసిందిగా విశ్వవిద్యాలయమువారు నాకు ఉత్తరం వ్రాశారు.

కాని ఆటుతర్వాత నా ఆరోగ్యం పూర్తిగా క్షీణించి, ప్రయాణం చేయడం సాధ్యంకాకపోవడంచేత నేను ఈ కార్య క్రమాన్ని మానుకొనవలసి వచ్చింది.

ఇదే సంవత్సరం (1970) పూనా విశ్వవిద్యాలయంవారు తిలక్ స్మారక ఉపన్యాసాలు రెంటిని చేయవలసిందిగా నన్ను ఆహ్వానించారు. బాలగంగాధర తిలక్ గొప్ప రాజకీయవేత్త. స్వరాజ్య సంపాదనార్థం ఘనమైన కృషి చేసినవారు. సంస్కృతంలో గొప్ప పండితుడు. గీతకు నూతన దృక్పథంతో "గీతారహస్యం" అనే వ్యాఖ్యానాన్ని రచించినవారు. అట్టి మహనీయుని స్మారకార్థం ఉద్దేశింపబడిన ఉపన్యాసాలను చేయడం నా అదృష్టంగా భావించి విశ్వవిద్యాలయంవారి ఆహ్వానానికి నేను అంగీకరించి "సమాఖ్య

విధానాన్ని గురించిన కొన్ని సిద్ధాంతాలు" అనే విషయాన్ని గురించి రెండు ఉపన్యాసాలను వ్రాశాను. మొదటి ఉపన్యాసంలో సమాఖ్య విధానానికి ప్రధాన లక్షణాలను వివరించే 'సంప్రదాయ సిద్ధాంతాన్ని' (Classical Theory of Federalism) గురించి వ్రాశాను. దీనిని విమర్శించే వారి విమర్శను పరిశీలించి, అందులోని లోపాలను చూపెట్టి, సాంప్రదాయ సిద్ధాంతాన్ని సమర్థించాను. రెండవ ఉపన్యాసంలో సమాఖ్య పుట్టుకను గురించిన మూడు సిద్ధాంతాలను (Theories of the Origin of Federalism) వివరించాను. వాటిలో మొదటిది సామాజిక సిద్ధాంతం (Sociological Theory). సమాజంలో భాష, జాతి, మతం మొదలగు వాటి ఫలితంగా విభిన్న వర్గాలు ఏర్పడడం, ఒక్కొక్క వర్గంవారు ఒక ప్రాంతంలో కేంద్రీకృతం కావడం జరిగినప్పుడు సమాఖ్య పరిపాలన విధానం అమలులోకి వస్తుందని ఈ సిద్ధాంతం ప్రతిపాదిస్తున్నది. వాటిలో రెండవది రాజకీయ సిద్ధాంతం (Political Theory). విభిన్న వర్గాలు లేకపోయినా అధికార వ్యామోహంచేత ఒక కేంద్రప్రభుత్వానికి లోబడుటకు ఇష్టపడక, ఒక్కొక్క రాష్ట్రానికి కొంత స్వాతంత్ర్యం ఉండవలెననే వాదం రాజకీయరంగంలో కృషిచేసేవారిలో ప్రాబల్యం గాంచి, దాని మూలంగా కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల మధ్య అధికార విభజన జరిగి కొన్ని విషయాలలో కేంద్రానికి, మరికొన్ని విషయాలలో రాష్ట్రాలకు స్వతంత్రాధికారం కేటాయింపబడి సమాఖ్య విధానం ఏర్పడుతుందని ఈ సిద్ధాంతం ప్రతిపాదిస్తున్నది. మూడవ సిద్ధాంతం అనేక పరిస్థితులు కారణంగా సమాఖ్య పరిపాలన విధానం ఏర్పడుతుందని (Multiple Factors Theory) ప్రతిపాదిస్తుంది. నా ఉపన్యాసంలో ఈ మూడు సిద్ధాంతాలను, వాటిలోని గుణదోషాలను సోదాహరణంగా వివరించాను.

ఈ రెండు ఉపన్యాసాలను వ్రాసి, నేను పూనాకు వెళ్ళి నవంబరు 26, 27 తేదీలలో ఈ ఉపన్యాసాలను చదివాను. మొదటిరోజు రాజనీతిశాఖలో ప్రధానాధ్యాపకులు గార్డే, రెండవ రోజు హైకోర్టు జడ్జి నాయక్ అధ్యక్షత వహించారు. అధ్యాపకులు, విద్యార్థులు నా ఉపన్యాసాలను వినుటకు సమావేశ

మైనారు. ఈ రెండు రోజులలో అధ్యాపకులను కలుసుకొని అనేక విషయాలను గురించి వారితో చర్చించాను.

ప్రథమంలో మూడు ఉపన్యాసాలను చేయ ఉద్దేశించి సమాఖ్య విధానం పనిచేసే తీరుతెన్నుల గురించిన సిద్ధాంతాలను (Functional Theories of Federalism) గురించి మూడవ ఉపన్యాసాన్ని వ్రాశాను. కాని అనారోగ్యం కారణంగా నేను దీనిని చదవలేదు. కొంతకాలం గడచిన తర్వాత దీనిని ఉస్మానియా విశ్వవిద్యాలయ సాంఘికశాస్త్ర పత్రికలో ప్రకటించాను.

పూనాలో నేను చేసిన రెండు ఉపన్యాసాలను 1971 లో విశ్వవిద్యాలయంవారు ఒక గ్రంథరూపంలో ప్రకటించారు.

నేను అప్పుడప్పుడు చాలా సంవత్సరాలనుండి పత్రికలకు రాజనీతిని గురించిన వ్యాసములను ప్రకటిస్తూ వచ్చినాను. ఇది గాక కాశీనాథుని నాగేశ్వరరావుగారి యొక్కయు, మదరాసులోని తెలుగుభాషాసమితి యొక్కయు, హైదరాబాదులోని సంగ్రహ ఆంధ్ర విజ్ఞానకోశ సమితివారి యొక్కయు యాజమాన్యమున వెలువడిన విజ్ఞాన సర్వస్వములో ఈ విషయాన్ని గురించి అనేక వ్యాసములను వ్రాసినాను. ఇవి అన్నియు ఒకే గ్రంథంలో లేని కారణాన వీటిని చదవగోరినవారికి అందుబాటులో లేకుండెను. వాటి నన్నిటిని కలిపి ఒకే గ్రంథంగా ప్రకటించడం అవసరమని నా మిత్రులు సూచించినారు. వారి సూచనల మేరకు 1971 లో వీటి నన్నిటిని కలిపి 'రాజనీతి' అనే గ్రంథాన్ని 'తెలుగు విద్యార్థి' ప్రచురణలలో ప్రకటించినాను. ఈ వ్యాసములను వ్రాయుటలో నేను ఒక నూతన దృక్పథాన్ని అనుసరించినాను. విజ్ఞాన శాస్త్రవేత్తలు వాస్తవ పరిస్థితులను ఆధారం చేసుకొని తమ శాస్త్రాలను రూపొందించునట్లే రాజనీతిశాస్త్రవేత్తలు కూడా అధికారమునకు సంబంధించిన వాస్తవ పరిస్థితులను ఆధారం చేసికొని తమ శాస్త్రాన్ని రూపొందించి నప్పుడే దానికి నిజమైన విలువ లభించగలదని ఇటీవలికాలంలోని శాస్త్రవేత్త లనేకులలో ఒక అభిప్రాయం బలపడినది. రాజనీతిలో చర్చించదగిన విషయము దండనాధికారము, ఆ అధికారమును వహించినవారు కొందరు

ప్రతిరాజ్యములో ఉన్నారు. అట్టి అధికారము సమాజంలో ఎందుకు అవసరమో, దానిని ఏవిధముగ సంపాదించుచున్నారో, సంపాదించిన వారు ఏవిధముగ దానిని నిలబెట్టుకొనుచున్నారో, ఏవిధముగ వినియోగము చేయుచున్నారో, దానికి గల పరిమితులు ఏలాటివో మొదలైన విషయములను, ఊహాలను ఆధారము చేసికొనక, వాస్తవ పరిస్థితులను ఆధారము చేసికొని పరిశీలించి వివరించుటయే రాజనీతిశాస్త్ర లక్ష్యము. ఈ విషయముల నన్నింటిని నేను నా గ్రంథంలో వివరించినాను. అందుచేతనే ఇది ఒక ఉత్తమగ్రంథంగా నేను భావించుచున్నాను. ఈ గ్రంథము యొక్క ప్రతులన్నియు ఖర్చైపోయినవి. పాఠకుల ఆదరణ దీనికి లభించడమే ఇందుకు కారణము. దీనిని పునర్ముద్రించ వలసినదిగా 'తెలుగు విద్యార్థి' సంపాదకులు శ్రీ కొల్లూరి కోటేశ్వర రావుగారు ఆంధ్ర విశ్వవిద్యాలయాధికారులతో ప్రస్తుతం సంప్రదింపులు జరుపుతున్నారు. అవి విజయవంతం కాగలవని విశ్వసించుచున్నాను.

1968 లో ఆంధ్ర విశ్వవిద్యాలయంవారు నాకు గౌరవ డి. లిట్. డిగ్రీని ప్రసాదించినట్లే 1974 లో శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయంవారు అదే డిగ్రీని ప్రసాదించి నన్ను గౌరవించారు. ఇంతకి పూర్వం అనేక పర్యాయాలు నేను ఆ విశ్వవిద్యాలయానికి వెళ్ళి ఉపన్యాసాలు చేసినట్లు ఇదివరలో చెప్పినాను. 1974 లో డిగ్రీని స్వీకరించుటకు నేను వెళ్ళినప్పుడు కూడా రాజనీతి శాఖలోని విద్యార్థుల, అధ్యాపకుల సమావేశంలో పాల్గొని ఉపన్యసించాను. రాజనీతిశాఖ ప్రధానాధ్యాపకులు కె. కమల నాథన్‌గారు అధ్యక్షత వహించారు. స్నాతకోత్సవంలో పత్రికా సంపాదకులుగా ప్రఖ్యాతిగాంచిన యం. చలపతిరావు గారికి, రచయితగాను, సంగీత విద్వాంసులుగాను, పరిశోధకులు గాను ప్రసిద్ధిగాంచిన రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారికి విశ్వ విద్యాలయంవారు నాతోపాటు గౌరవ డి లిట్. డిగ్రీని ప్రసా దించారు. ఈలాటి మహామహులతో కలసి ఈ డిగ్రీని స్వీకరించడం నాకు మరింత సంతోషాన్ని కలిగించింది.

నా కుటుంబ వ్యవహారాల గురించి ఒకటి రెండు మాటలు చెప్పడం ఉచితమని భావిస్తున్నాను. నా కాలంలో సమాజం అనేకవిధాలుగ మారినది. ఈ మార్పు మా శాఖలో ఉపనయనాలు, వివాహాలలో ఎక్కువగా కనుపిస్తున్నవి. వీటికి నా చిన్నతనంలో ఉండిన మత ప్రాధాన్యం తగ్గి, లౌకిక ప్రాధాన్యం అపరిమితంగా పెరిగింది. బహుశా ఈలాటి మార్పు ఇతర శాఖలలో కూడా కనిపిస్తున్నట్లు చెప్పవచ్చు. నాకు ఉపనయనం 7-వ ఏట జరిగింది. సాధారణంగా మా బంధువులందరి ఇండ్లలో ఆ వయస్సునే ఉపనయనం జరిగేది. వటువులు సంధ్యావందనాన్ని పూర్తిగా నేర్చుకొనేవారు. అటుతర్వాత త్రికాల సంధ్యావందనం చేసేవారు. అనేకులు వేదాధ్యయనం కూడా ప్రారంభించి పూర్తి చేయడం జరిగేది. కాని ఇది క్రమక్రమంగా మారింది. ఇపుడు కూడా వివాహానికి పూర్వం ఉపనయనం జరగవలెననే నియమం ఉన్నది. కాని అధికసంఖ్యాకులకు బాల్యంలో ఇది జరగడం లేదు. వివాహానికి కొన్నిరోజులకు ముందు ఇది లాంఛన ప్రాయంగా జరగడం పరిపాటి అయింది. సంధ్యావందనం నేర్చుకొనేవారు చాలా తక్కువ. లేరని కూడా చెప్పడం అతిశయోక్తి కాజాలదు. కాని దీనికి లౌకిక ప్రాధాన్యం విపరీతంగా పెరిగింది. తల్లివంకవారు వటువుకు బంగారు ఉంగరం, వెండి పంచపాత్ర, ఉద్ధరిణె, అర్ఘ్యపాత్ర, పట్టుపంచె కానుకగా నిర్బంధంగా ఇయ్యవలసి యున్నది. వటువు తల్లి దండ్రులకు వటువు మేనమామవంకవారు నవగ్రహ రోజునను, బ్రహ్మోపదేశ కాలంలోను వస్త్రములనిచ్చి సత్కరించవలసి యున్నది బంధువులు, స్నేహితులు వారి వారికి తోచినట్లు వటువుకు ఏదోవిధంగా కానుకలను సమర్పించడం ఒక మర్యాదగా రూపొందింది. కానుకలను పుచ్చుకొనడంతో పాటు కానుకలను ఇచ్చినవారిని ఏదో రూపంలో సత్కరించడం తప్పడం లేదు. కాఫీలు, ఫలహారాలు, భోజనాలు రెండు పూటలు ఏర్పాటు చేయవలసి ఉంటుంది. దూరప్రాంతాలలో నివసించె దగ్గరి బంధువులు రైలు ఖర్చులు భరించి ఈ ఆడంబరాన్ని చూచుటకు, అందులో పాల్గొనుటకు రావడం మామూలైనది. మధ్యతరగతి కుటుంబాలలో అధమపక్షం

రెండు వేలైనా ఉపనయనానికి ఖర్చుపెట్టడం జరుగుతున్నది. సంధ్యావందనం కూడా నేర్చుకోనడం జరగినప్పుడు ఇంతటి ఖర్చు చేయడం అనవసరమని ఎవరూ భావించడంలేదు. అందుచేతనే దీనికి మత ప్రాధాన్యం తగ్గి, లౌకిక ప్రాధాన్యం పెరిగిందని నేను చెప్పడానికి సాహసించాను. నా ఉపనయనంలో నా మేనమామ ఒక కంచు పంచపాత్రను, ఉద్ధరిణెను మాత్రమే ఇచ్చినారు.

వివాహాల విషయంలో కూడా లౌకిక ప్రాధాన్యం ఇంతకంటె విపరీతంగా పెరిగింది. నాకు 15–వ ఏట వివాహం జరిగింది. అప్పుడు నా భార్య వయస్సు 11 సంవత్సరాలు. మా మామగారు అల్లాడి నారాయణయ్యగారు కందుకూరు తాలూకా తహసీల్దారు. వివాహార్థం బాగా ఖర్చుపెట్టగల శక్తి గలవారు. కాని ఆరోజులలో వివాహాలను నిరాడంబరంగా చేయడం పరిపాటి కావడంచేత వారు ఎక్కువ ఖర్చు చేయడం అవసరం లేకపోయింది. వారు ఇద్దరు కుమార్తెలకు ఏకకాలంలో వివాహం చేశారు. వివాహం కందుకూరుకు సమీపాన సింగరాయకొండలోని నరసింహస్వామి దేవాలయంలో జరగడంచేత ఒక రోజులోనే పూర్తి అయింది. ఒక కంచు రైలు చెంబు, ఒక సరిగె అంగవస్త్రం, ఒక తలపాగా మాత్రమే ఇచ్చినారు. ఇద్దరు కుమార్తెలలో పెద్దపిల్లకు వారు కన్యాదానం చేసినారు. నా భార్యకు వారి అన్నగారు మైసూరులో గొప్ప ఉద్యోగంచేస్తూ ఉండిన అల్లాడి మహాదేవశాస్త్రిగారు కన్యాదానం చేసి నాకు ఒక వెండి పంచపాత్ర, ఉద్ధరిణెను బహూకరించినారు. వివాహమంతా చాలా నిరాడంబరంగా జరిగింది

ఈనాటి వివాహాలకు ఆడంబరం ఒక ప్రధాన లక్షణం. తల్లిదండ్రులకు శక్తి ఉన్నా లేకపోయినా కొన్నివేలు ఖర్చుపెట్టడం అవసరమవుతున్నది. 1965 లో నా మనుమరాలు ( నా రెండవ కుమారుడు సీతారాం కుమార్తె ) జయంతికి వివాహం జరిగింది. వరుడు నా రెండవ కుమార్తె గోదావరి కుమారుడు, సుబ్రహ్మణ్యం. వరకట్నం ఎలాంటిదీ లేదు. కాని వధువుకు పెట్టిన కొద్దిపాటి

బంగారు నగలు, పట్టుచీరెలు ; వరునికి ఇచ్చిన దుస్తులు, వెండి పాత్రలు ; వియ్యాలవారికి, ఇతర బంధువులకు ఇచ్చిన చీరెలు, ధోవతులు, కాఫీ, ఫలహారాలు, భోజనాలు మొదలైన వాటికి 15,000 రూపాయలు ఖర్చుపెట్టాము. ఇందులో 9,000 రూపాయలు నేను, 6,000 రూపాయలు నా మూడవ కుమారుడు ఆనందం భరించాము. ఇదిగాక పిల్లను కాపురానికి పంపించుటకు నా కుమారుడు సీతారాం నాలుగైదు వేలు ఖర్చుపెట్టాడు. నా భార్యను కాపురానికి పంపించినప్పుడు నా మామగారు పెట్టిన ఖర్చు ఇరవై రూపాయలు మాత్రమే. 1965 తర్వాత మా యింటిలోను, నా కుమార్తెల ఇండ్లలోను అనేక వివాహాలు జరిగినవి. అన్నిట్లో కూడా 20 వేలకు మించి ఖర్చు చేయడం తప్పింది కాదు. 1978 లో నా నాల్గవ కుమారుడు వేంకటేశ్వర్లు తన కుమార్తె వాణికి వరదక్షిణ లేకపోయినా 50,000 రూపాయలు పెట్టి వివాహం చేశాడు.

నా మనుమడు ప్రసాద్ (నా రెండవ కుమారుడు సీతారాం కుమారుడు) నా మనుమరాలు (నా రెండవ కుమార్తె గోదావరి కుమార్తె) మంగళాంబను అనవసరమైన ఖర్చులు తగ్గించే ఉద్దేశంతో రిజిస్టరు వివాహం చేసికొనుటకు నిశ్చయించుకొన్నాడు. ప్రథమంలో దీనికి అతని తల్లిదండ్రులు, నేను అంగీకరించాము. కాని మంగళసూత్రధారణలేక వివాహం జరగడం అనాదిగా వస్తున్న సాంప్రదాయానికి విరుద్ధమనే భావం మాకు కలిగి, ఖర్చును తగ్గించుటకు మార్గాంతరాన్ని అన్వేషించి నా పెద మామగారు రూపొందించిన సంక్షిప్త వివాహ విధానాన్ని అనుసరించడం దీనికి అనుగుణమైన సమార్గమని భావించాము. ఇందులో అగ్నిసాక్షిగా మంగళసూత్రధారణమునకు అవకాశం ఉన్నది. వివాహమంతా ఒక గంటలో పూర్తి అవుతుంది. వధూవరుల కుటుంబాలవారు మాత్రమే పాల్గొంటారు. ఎలాటి ఆడంబరం లేక వివాహం జరుగుతుంది. అడయారులోని దివ్యజ్ఞాన సమాజ సభ్యులు కొన్ని సంవత్సరాలుగా ఈ విధానాన్ని అనుసరిస్తున్నారు. మా కుటుంబంలోనివా రందరికి ఇది అభిమతమైనా తుదకు ఆడంబరంగానే ముప్పైవేలు ఖర్చుపెట్టి వివాహం జరిగింది.

పదిమంది నడిచే మార్గాన్ని అనుసరించడం ఒక ఫాషన్‌గా (Fashion) తయారైనది. నేను చాలాకాలాన నుండి వివాహాలు పొదుపుగా జరగవలెననే అభిప్రాయాన్ని వ్యక్తంచేస్తూ వున్నా కుటుంబంలో వారెవరు దీనికి సుముఖంగా లేరు. నా మాటలు చెవిటివానికి శంఖం ఊదినట్లు పరిణమించాయి. అందరూ సమాజానికి దాసులు. ఇతరులను అనుకరించడం అందరి ప్రవర్తనకు లక్షణం. ఇందుచేతనే వివాహాలలో ఆడంబరం దిన దినాభివృద్ధిగాంచుతూ ఉన్నది.

ఇటీవలి కాలలో ఆడపిల్లలకు తగిన వరుడు వారి వారి శాఖలలో లభించడం కష్టతరమైనది. అందులోనూ మా శాఖ చాలా చిన్నది కావడంచేత అది మరింత కష్టమౌతున్నది. తల్లిదండ్రులు మొగపిల్లలతో పాటు ఆడపిల్లలకు కూడా గొప్ప చదువులు చెప్పించడం పరిపాటి అయింది. పిల్లకు 22 మొదలు 25 సంవత్సరాల వయస్సులో చదువు పూర్తి అగుచున్నది. పెద్దచదువులు చదువుకొన్నవారు కావడంచేత వారి అభిమతానికి విరుద్ధంగా తల్లిదండ్రులు వరుని ఎంపికచేయడం సాధ్యం కావడం లేదు. తుదకు వారు దిసిగి, వరుని శాఖతో నిమిత్తం లేకుండా శాఖాంతరులతో వివాహం చేయుటకు సిద్ధంగా ఉన్నారు. కాని వరకట్నాల బెడద తప్పడంలేదు. పత్రికలలోని ప్రకటనలను ఆధారం చేసికొని వరుని ఎంపికచేయడం కూడా జరుగుతున్నది. ఈలాగు జరిగిన వివాహాలు ఫలప్రదం కాలేదు. భార్యాభర్తల మధ్య అనుకూలత లేక విషాదాంతంగా పరిణమించినవి. శాఖాంతర వివాహాలన్నీ ఈలాంటివని నేను చెప్పడం లేదు. కాని వరుని గుణగణాల గురించిగాని, కుటుంబ లక్షణాల గురించి గాని ఏమీ పట్టించుకొనకుండా విద్యను, పత్రికలలోని ప్రకటనలను ఆధారం చేసికొని జరిగిన వివాహాలు కొన్ని ఈలాగు పరిణమించినవి. ఆడపిల్లలు, మొగపిల్లలు స్వేచ్ఛగా కలసి తిరగడం సాధ్యం కాకపోవడంచేతను, స్వయంవర విధాన వివాహాలు జరగడం లేదు. మన సమాజం ఈనాడు సంధియుగంలో ఉన్నది. అందుచేత ఇతర విషయాలతో పాటు వివాహ విషయంలో కూడా అనేక క్లిష్ట సమస్యలను ఎదుర్కొనడం

తప్పడం లేదు. వీటికి పరిష్కారమార్గం ఫలానా అని ఎవరూ చెప్పలేరు. కాలమే క్రమంగా వీటిని పరిష్కరిస్తుంది. కాని ఏ పరిష్కారం కూడా సమాజాన్ని పూర్తిగా చక్కపరచజాలదు. ఒక సమస్య పరిష్కారం కాగానే ఇంకొక సమస్య దాని స్థానే ఉత్పన్న మౌతుంది. ఇదే మానవ చరిత్రకు లక్షణం.

ఇటీవల మా కుటుంబంలో ఒక కులాంతర వివాహం కూడా జరిగింది. నా మూడవ కుమారుడు ఆనందం కుమార్తె శాంత ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఎం. ఏ. క్లాసులో అజయ కుమార్ సిన్హాతో కలసి చదువుకొన్నది. ఇద్దరూ పరస్పరం ప్రేమించుకొని వివాహం చేసుకొనుటకు నిర్ణయించుకొన్నారు. పిల్లవాని తండ్రి విజయకుమార్ సిన్హా కాయస్థ కులానికి చెందిన వారు. విప్లవ ఉద్యమంలో పాల్గొని ద్వీపాంతరవాస శిక్షను కూడా అనుభవించినవారు. తల్లి కమ్మకులానికి చెందిన శ్రీ రాజ్యంసిన్హా. ఈ వివాహం జరగడం కుటుంబంలో మా కెవరికీ ఇష్టం లేదు. మేము దానిని ప్రతిఘటించినాము. మా పిల్ల మనస్సును మార్చుటకు విశ్వప్రయత్నం చేశాము. కాని మా మాటలను పిల్ల వినలేదు. ఒకనాడు మా ఇంటిని వదలి సిన్హాగారి ఇంటికి వెళ్ళిన తర్వాత కొన్నిరోజులకు ఎలాంటి ఆడంబరం లేక పూలదండలను మార్చుకొని వివాహం చేసుకొన్నది. రెండు మూడు నెలలపాటు మాకు, ఆ పిల్లకు, పిల్ల భర్తకు ఎలాంటి సంబంధం లేకపోయింది. తుదకు, "జరిగినది జరిగిపోయినది. మనం చేయగలిగింది ఏదీ లే"దని సమర్థించుకొన్నాము. కూతురు, అల్లుడు, వియ్యాలవారు మా ఇంటికి రాసాగినారు. మేము కూడ వారి ఇంటికి వెళ్ళసాగాము. రెండు కుటుంబాలు చాలా సన్నిహితమై పోయినవి. శాంత ఇద్దరు ఆడపిల్లల తల్లి అయినది. పిల్లలు మాయింట్లోనే పెరుగుతూ ఉన్నారు. సిన్హా కుటుంబంవారు మా బంధువర్గంలో పూర్తిగా కలసిపోయినారు. ఈ పరిణామంలో ఎలాంటి లోపం లేదని నేను భావిస్తున్నాను.

కుటుంబ జీవితంలో ఇటీవల ఇంకొక మార్పుకూడా జరుగుతూ ఉన్నది. అనాదిగా కుటుంబం ఎంత పెద్దదిగా ఉంటే అంత మంచిది అనేభావం మనలో వ్యాపించి వుండినది. పిల్లలు పుట్టి

పెద్దవారు కావడం ఒక అదృష్టమని అనుకొనేవారు. కాని దేశంలో దారిద్ర్యం, నిరుద్యోగం వ్యాపించడంచేత పరిమిత కుటుంబాలపట్ల మధ్యతరగతి వారు సుముఖులవుతున్నారు. ఇందుకుగాను రకరకములైన విధానాలను అనుసరిస్తున్నారు. కాని శస్త్రచికిత్స చేసుకొనడం అన్నిటికంటె పటిష్ఠ విధానముగా వ్యాపించింది. ప్రభుత్వంవారు దీనికి కావలసిన సదుపాయాలను కల్పిస్తున్నారు. సంతానం పరిమితంగా ఉన్న పక్షంలో పిల్లలను పెంచి, పెద్దవారిని చేసి, వారికి తగిన విద్యను నేర్పడం సులభ సాధ్యమనే అభిప్రాయం అనేకులకు కలిగింది. గర్భస్రావం చేసుకొనడం చట్ట సమ్మతంగా రూపొందింది. మా కుటుంబంలో నలుగురైదుగురు శస్త్రచికిత్సను చేసుకున్నారు. ముగ్గురు నలుగురు పిల్లలకంటె ఎక్కువమంది కలగడం వారికి ఇష్టం లేకపోవడమే దీనికి కారణం. మారుతున్న సమాజానికి ఇది ఒక ప్రధాన కారణం. ఇది కూడా హర్షించతగ్గ మార్పు.

అనేక శుభకార్యాలు జరుగుతున్న ఈ కాలంలో మా కుటుంబాన్ని దుఃఖసాగరంలో ముంచి, నా అల్లుడు డాక్టర్ అల్లాడి మహాదేవయ్య 1968 మార్చి 6-వ తేదీన గుండె జబ్బుచేత అకస్మాత్తుగా దివంగతుడైనాడు. మరునటిరోజే నా తమ్ముడు రామకృష్ణయ్య కాన్సర్ వ్యాధి మూలంగా మరణించి మా దుఃఖాన్ని మరింత పెంచినాడు. నా అల్లుడు నెల్లూరులోను, చుట్టుపట్ల గ్రామాలలోను వైద్యుడుగా ప్రఖ్యాతి గాంచినాడు. రోగులను పీడించి ఫీజులు వసూలుచేసేవాడు కాడు. ఎవరికి ఏమి తోస్తే దానిని పుచ్చుకొని తృప్తిపడేవాడు. అయినా బాగానే గడించి, పిల్లలకు పెద్దచదువులు చెప్పించి, అవసరమైనప్పుడు కట్నాలు ఇచ్చి కుమార్తెలకు వివాహాలు చేశాడు. అతడు మితభాషి. ఎవరిని నొప్పించేవాడు కాడు. అతని ముఖంలో నేను ఎప్పుడు కోపం చూడలేదు. అలాంటి సౌమ్యుని కోల్పోవడం మా దురదృష్టం. అతని పేరు చిరస్థాయిగా ఉండుటకు నా పెద్దకుమార్తె అన్నపూర్ణ ( ఈమె అతనిభార్య ) ఈమధ్య నెల్లూరులో ఒక ప్రాథమిక విద్యాలయాన్ని స్థాపించినది.

నా తమ్ముడు రామకృష్ణయ్యను గురించి ఇదివరలో చెప్పినాను. ప్రథమంలో ఎలాగు ఉండినా పెద్దకుమార్తె అకాల మరణానికి గురియైన తర్వాత గొప్ప రామభక్తుడై వాల్మీకి రామాయణాన్ని పారాయణం చేసి 'రామాయణ కథామృతము' అనే తెలుగు గ్రంథాన్ని వ్రాసి ప్రకటించి ఆంధ్రగద్యవాఙ్మయంలో శాశ్వతస్థానాన్ని సంపాదించినాడు.

నాకు చాలాకాలాన నుండి దేశంలో జరిగే రాజకీయ పరిణామాలను సమీక్షించడంలోను, వాటిని గురించి అవకాశం లభించినపుడు పత్రికల ద్వారాను, సమావేశాల ద్వారాను, ఆకాశవాణి ద్వారాను నా అభిప్రాయాలను వ్యక్తం చేయడంలోను ఎక్కువ ఆసక్తి ఉండేది. ఈ దృష్ట్యా 1966 నుంచి సంభవించిన పరిణామాలు అత్యంత ప్రాధాన్యాన్ని వహించినాయి. అప్పటినుంచి 1977 వరకు ఇందిరాగాంధి ప్రధానిగా ఉండి రాజకీయాలను తన అధికారాన్ని విస్తృతపరచుకొనుటకు వినియోగించి, క్రమక్రమంగా ప్రజాస్వామిక పరిపాలనా విధానాన్ని తారుమారుచేసి నియంతృత్వాన్ని స్థాపించినది. తనను ఎవరూ ఎదిరించలేనట్టి స్థితిని నెలకొల్పింది. రెండవ ప్రపంచ యుద్ధానంతరం పాశ్చాత్యుల పరిపాలననుండి ఆసియా, ఆఫ్రికా ఖండాలలోని దేశాలు విముక్తి గాంచి ప్రథమంలో ఆ యా దేశాలకు అనుగుణమైన ప్రజాస్వామికాన్ని స్థాపించుకొన్నా క్రమక్రమంగా దాని స్థానే ఒకవిధమైన నిరంకుశ పరిపాలన అమలులోనికి వచ్చింది. మనదేశం ఆలాగు కాక ఏలాటి అంతరాయం లేకుండా ప్రజాస్వామికాన్ని నిలబెట్టు కొనగలిగింది. కాని ఇందిరాగాంధి 1966 లో ప్రధాని అయి నప్పటినుండి క్రమక్రమంగా ప్రజాస్వామిక యంత్రాన్ని పెకలించి 1975 లో పూర్తిగా నిరంకుశపాలనను స్థాపించి ఇండోనేషియా, పాకిస్తాన్, ఇరాన్, ఆరబ్, ఆఫ్రికా దేశాలలో ఉన్నట్లే మన దేశంలో కూడా తన నిరంకుశపరిపాలనను నెలకొల్పి తన అధికారానికి ఎలాటి ఆటంకం లేక అధికారాన్ని చెలాయించసాగింది.

మన రాజ్యాంగాన్ని నిర్మాణంచేసి, ప్రజాస్వామిక విధానము, సమాఖ్య విధానము ప్రధాన లక్షణములతో దానిని

రూపొందించిన నెహ్రూ, పటేల్, రాజేంద్రప్రసాద్, అంబేద్కర్ మొదలైన నాయకులు పరిపాలనలో భాగస్వామ్యం గలవారెవరు కూడా నిరంకుశంగా ప్రవర్తించుటకు వీలుకానట్లు అనేక ఏర్పాటులు చేశారు. మనది ప్రజాస్వామిక విధానమైనా పరిపాలించేవారు ప్రజలు కారు. పరిపాలకులను ఎన్నుకొనే అధికారం మాత్రమే వారికి ఉన్నది. అందుచేత ప్రజలు కూడా సర్వస్వతంత్రులు కారు. వారు పార్లమెంటు సభ్యులను, రాష్ట్ర విధాన సభల సభ్యులను ఎన్నుకొంటారు. అంతవరకే వారికిగల అధికారం. ఈ సభ్యులు తమ నాయకులను ఎన్నుకొనుటకు, వారి ప్రవర్తనను గురించి చర్చించుటకు, అవిశ్వాస తీర్మానాల మూలంగా వారిని అధికారాననుండి తొలగించుటకు, శాసనముల చేయుటకు అధికారాలను వహిస్తారు. అందుచేత వారికి కూడా సర్వస్వతంత్రంగా దేశాన్నిగాని, రాష్ట్రాలనుగాని పాలించుటకు అధికారం లేదు. వారు ఎన్నుకొనిన నాయకులు దేశానికి ప్రధానులుగాను, రాష్ట్రాలకు ముఖ్యమంత్రులుగాను ఉంటారు. కాని వీరు కూడా సర్వస్వతంత్రులు కారు. పరిపాలన విషయాలలో వారు అనుసరించే విధానాలను పరిశీలించుటకు, అధిక్షేపించుటకు అన్ని శాసనసభలలో ఒక ప్రతిపక్షం ఉన్నది. అది వారిపై అవిశ్వాస తీర్మానాన్ని ప్రకటించి వారిని అధికారాననుండి తొలగించవచ్చు. వారు ఎన్నుకొనిన ప్రధానిగాని; ముఖ్య మంత్రులుగాని సర్వస్వతంత్రులు కారు. వారు ఒక మంత్రి మండలిని ఏర్పాటుచేసి, వాటి సలహాలతో దేశాన్ని, రాష్ట్రాలను పాలించవలసి ఉన్నది. మంత్రిమండలులతో సంప్రదించకుండా వారు నిర్ణయాలను తీసుకొనడం సంప్రదాయానికి, రాజ్యాంగానికి విరుద్ధం. ప్రధానిగాని, ముఖ్యమంత్రిగాని తప్పకుండా వారి వారి మంత్రిమండలులతో సమాలోచించి, వారి అనుమతితో నిర్ణయాలు తీసుకొనడం అవసరం. దేశానికంతకు ఒక రాష్ట్రపతి, ప్రతిరాష్ట్రానికి ఒక గవర్నరు ఉన్నారు. వీరికి స్వతంత్రాధికారాలు లేకపోయినా ప్రధానిగాని, ముఖ్యమంత్రులుగాని తీసుకొనిన నిర్ణయాలు సరియైనవా, కావా అనే విషయాలలో తమ

అభిప్రాయాలను వారికి తెలియపరచవచ్చు. ఇదిగాక ప్రతి రాజకీయపక్షం దానికి సంబంధించిన సంఘాల ఆదేశాలకు విరుద్ధంగా నడవరాదు. అలాగే రాష్ట్రాలలోని ముఖ్యమంత్రులు ప్రవర్తించడం విధి.

ఇవిగాక ప్రతి రాష్ట్రంలోను ఒక హైకోర్టు, దేశానికంతకు ఒక సుప్రీం కోర్టు ఉన్నవి. పార్లమెంటు, శాసన సభలు చేసిన శాసనాలు మౌలిక శాసనమైన రాజ్యాంగానికి అనుగుణంగా ఉన్నదీ లేనిదీ తుది పరిష్కారం చేసే అధికారం వీటికి ఉన్నది. అలాగే ప్రభుత్వం తీసుకొనే నిర్ణయాలు రాజ్యాంగ సమ్మతములా కావా అని అవి నిర్ణయించవచ్చు. వాటి నిర్ణయాలను పార్లమెంటు, శాసన సభలు, ప్రభుత్వాలు, ఇతర సంస్థలు, పౌరులు శిరసావహించవలసి యున్నది.

ఇది మన రాజ్యాంగం నిర్ణయించిన పరిపాలనా విధానము. ఇందుమూలంగా ఎవరికిగాని, తుదకు ప్రధానికిగాని, ముఖ్య మంత్రికిగాని సంపూర్ణ స్వాతంత్రాధికారం లేదు. అందరు రాజ్యాంగానికి లోబడి ప్రవర్తించడం విధి. ఎవరూ నియంతలుగా ప్రవర్తించుటకు సాధ్యపడనట్లు రాజ్యాంగం రూపొందించబడింది. నెహ్రూ మొదలైన రాజ్యాంగ నిర్మాతల విజ్ఞానానికి, దూరదృష్టికి ఇది తార్కాణం.

ఇదే ఉద్దేశంతో వారు దేశ పరిపాలన సమాఖ్య విధానంగా (Federalism) ఉండేటట్లు రాజ్యాంగాన్ని నిర్మాణం చేశారు. ఈ విధానంలో కేంద్రప్రభుత్వానికి పరిమితమైన అధికారాలు మాత్రమే ఉన్నవి. రాష్ట్రప్రభుత్వాలకు కొన్ని విషయాలలో స్వాతంత్రాధికారాలు ఉన్నవి. అందుచేత కేంద్రప్రభుత్వం తన ఇష్టానుసారం రాష్ట్రాలను పాలించుటకు వీలులేదు. ఈలాటి అధికార విభజన సమాఖ్య విధానానికి మౌలిక లక్షణం. మన పరిపాలన విధానం ఈలాటిది.

ఎవరు గాని నిరంకుశంగా పాలించుటకు వీలు కానట్లు మన రాజ్యాంగ నిర్మాతలు రాజ్యాంగాన్ని నిర్మాణం చేశారు. కాని ఇందిరాగాంధి 1966 లో ప్రధానిగా ఎన్నుకొనబడిన తర్వాత

క్రమక్రమంగా రాజ్యాంగంలోని కట్టుబాట్లను, నియమ నిబంధనలను, సంప్రదాయాలను పూర్తిగా తొలగించి 1975 నాటికి సర్వస్వతంత్రంతో కూడిన నియంతగా దేశానికి పాలకురాలైనది. ఇందులోనే ఆమె తనకు సహజమైన చాణక్యనీతిని ప్రదర్శించి వినియోగించ గలిగింది. ఆమె నైపుణ్యమంతా ఇందులో ప్రస్ఫుటమైంది. నేను ఈ పరిణామాన్ని గమనిస్తూ వచ్చాను. బహిరంగంగా నా అభిప్రాయాలను ప్రకటించడం సాధ్యం కానప్పుడు వాటిని నా డైరీలలో వ్యక్తం చేసి పెట్టాను. అలాగు వ్యక్తం చేయడం నా జీవితంలో ఒక భాగం కావడంచేత వాటిని గురించి, వాటి పరిణామాన్ని గురించి ఇక్కడ వ్రాయడం సముచితమని భావిస్తున్నాను. ప్రజాస్వామికాన్ని తొలగద్రోసి నియంతృత్వాన్ని స్థాపించడం ఒక విప్లవాత్మకమైన మార్పు. 1966 తర్వాత మన దేశంలో అలాంటి మార్పు సంభవించింది. ఇండొనేషియాలో సుకర్నో, పాకిస్తాన్‌లో భుట్టో నియంతలుగా ప్రవర్తించినట్లే మన దేశంలో ఇందిరాగాంధి ప్రవర్తించింది. హిట్లరు నియంతతో ఆమెను పోల్చడం కూడా ఉచితంగా కనిపిస్తుంది. ఇది ఒక అతిశయోక్తిగా కొందరు భావించవచ్చు. కాని జరిగిన పరిణామం ఈలాటిదే.

1966 లో ఆమెను కాంగ్రెసు అధ్యక్షుడు కామరాజు అనేక రాష్ట్ర ముఖ్యమంత్రుల సహాయంతో పార్లమెంటరీ పార్టీ ప్రధానిగా ఎన్నుకొనునట్లు చేశాడు. ఆమెతో పోటీ చేసిన మొరార్జీ దేశాయికి పార్టీలో 169 ఓట్లు, ఆమెకు 355 ఓట్లు లభించినవి. అప్పటినుంచి దేశాయిని ఆమె తన గర్భశత్రువుగా భావించింది. కామరాజుపట్ల కూడా ఆమె ఏలాటి కృతజ్ఞతను చూపలేదు. ఇతరుల సహాయంతో ప్రధాని కావడం ఆమెకు ఎంత మాత్రం అంగీకారయోగ్యం కాలేదు. ఎవరి సహాయంతోను నిమిత్తం లేకుండా తనంతట తాను ప్రధాని పదవిని భవిష్యత్తులో సంపాదించి, సుస్థిరం చేసికొనుటను తన లక్ష్యంగా పెట్టుకొన్నది.

1966 లో దేశంలో విపరీతంగా ఆహారపదార్థాల కొరత ఏర్పడి క్షామ పరిస్థితులు సంభవించినవి. అమెరికా ఒక్కటే

ఆహారపదార్థాలను పంపగలిగిన స్థితిలో ఉండినది. కాని అమెరికా అధ్యక్షుడు రూపాయి మారకం రేటును తగ్గించిన పక్షంలో మాత్రమే తాను ఆహారపదార్థాలను సప్లై చేయుటకు సిద్ధంగా ఉన్నట్లు ఆమె అమెరికాకు వెళ్ళినపుడు స్పష్టం చేశాడు. కామరాజుకుగాని, తక్కిన భారతీయ నిపుణులకుగాని ఇది ఇష్టం కాకపోయినా వారిని లక్ష్యపెట్టక మార్గాంతరం లేదని భావించి దానికి అంగీకరించింది. ఆహారపదార్థాలను అమెరికా అధ్యక్షుడు భారత దేశానికి పంపడమే కాక ఇతర విధములైన ఆర్థిక సహాయాన్ని అందచేశాడు. తాత్కాలికంగా దేశానికి క్షామ పరిస్థితులనుండి విముక్తి లభించింది. కాని రూపాయి రేటును తగ్గించడంవల్ల దేశంలో ధరలు విపరీతంగా పెరిగినవి. ప్రజల స్థితిగతులు మరింత దిగజారిపోయినవి.

1967 ఫిబ్రవరిలో లోక్ సభకు, రాష్ట్ర విధాన సభలకు ఎన్నికలు జరిగినవి. దారిద్ర్యపీడితులైన ప్రజలు కాంగ్రెసు పక్షంపట్ల, ప్రధాని ఇందిరాగాంధిపట్ల, తమ అసంతృప్తిని పూర్తిగా ఈ ఎన్నికలలో వ్యక్తం చేశారు. లోక్ సభలోని 520 స్థానాలలో కాంగ్రెసుకు 281 స్థానాలు మాత్రమే లభించినవి. ఎనిమిది రాష్ట్రాలలో కాంగ్రెసుకు మెజారిటీ లభించని కారణంగా ప్రతిపక్షాలు సంకీర్ణ మంత్రివర్గాలను నెలకొల్పి పరిపాలనను సాగించినవి. దేశానికి స్వాతంత్ర్యం లభించినప్పటినుండి కేంద్రం లోను, రాష్ట్రాలన్నిటిలోను ( కేరళ మినహా ) కాంగ్రెసు పక్షం అధికారం చెలాయిస్తూ వచ్చింది. 1967 ఎన్నికల ఫలితంగా అది అలాటి అధికారాన్ని కోల్పోయింది. ఒకవిధంగా ఇది వాంఛనీయమైన మార్పే. ప్రజాస్వామికంలో ఎల్లప్పుడు కేంద్రం లోను, రాష్ట్రాలలోను ఒకే పక్షం అధికారంలో ఉన్నట్లయితే నిరంకుశత్వానికి దారితీస్తుంది. ప్రతిపక్షాల పరిపాలనకు అవకాశం లభించడం ఎంతైనా అవసరం. 1967 లో జరిగిన ఎన్నికల ఫలితంగా ఆ అవసరం కొంతవరకు తీరింది.

ఎన్నికల తర్వాత ప్రధానిని ఎన్నుకొనుటలో కామరాజు తిరిగి జోక్యం కలిగించుకొని మొరార్జీ దేశాయి, ఇందిరాగాంధీల మధ్య ఒక రాజీని కుదిర్చాడు. దేశాయి ఉపప్రధానిగాను, ఆర్థిక

శాఖామంత్రిగాను నియమింపబడినాడు. ఈ షరతుకు అంగీకరించిన కారణంగా ఇందిరాగాంధి ప్రధానిగా ఎన్నుకొనబడినది. ఇదిగాక దేశాయితో పాటు కుడి పక్షానికి చెందిన (Right) సంజీవ రెడ్డిని లోక్‌సభ స్పీకర్‌గా ఎన్నుకొనుటకు ఆమె అంగీకరించినది. దేశాయి తన మంత్రివర్గంలో చేరడం ఇష్టం లేకపోయినా ఆయన నియామకానికి అంగీకరించడం తప్పింది కాదు. ఆమె అధికారాన్ని కొంతవరకు కట్టిపెట్టుటకు ఇది పటిష్ఠ సాధనంగా కామరాజు భావించాడు. అప్పటినుంచి మంత్రిమండలి కుడి, ఎడమ వర్గాలుగా చీలిపోయింది. ఎడమ వర్గంలో చవాన్ ప్రాధాన్యం వహించాడు. ఇందిరాగాంధి ఎడమ వర్గాన్ని అభిమానించ సాగింది. అందుచేత కమ్యూనిస్టులు ఆమెను సమర్థించేవారైనారు.

1967 లో రాష్ట్రపతి ఎన్నిక కూడా జరిగింది. రాధాకృష్ణన్‌ను రెండవ పర్యాయం రాష్ట్రపతిగా ఎన్నుకొనవలసినట్లు కామరాజు వాంఛించాడు. కాని ఇందిరాగాంధి దానికి సమ్మతించక, జకీర్ హుస్సేన్‌ను సమర్థించి, అతనిని రాష్ట్రపతిగా ఎన్నుకొనేటట్లు చేసింది. ఇది కామరాజుకు గొప్ప అపజయం. ఇంతేకాదు. కాంగ్రెసు అధ్యక్షునిగా అతని స్థానే తన అభిమానులలో ఒకరిని ఎన్నుకొనునట్లు చేయుటకు ప్రయత్నించింది. కాని అలాటివారు ఎవరూ ఆమెకు లభించలేదు తుదకు ఆనాడు మైసూరుకు ముఖ్యమంత్రిగా ఉండిన నిజలింగప్ప ఎన్నికను ఆమె ఆమోదించింది. కామరాజు తొలగిపోవడం ఆమె విజయాలలో రెండవది. కాని కుడిపక్షానికి చెందిన నిజలింగప్ప కాంగ్రెసు అధ్యక్షుడు కావడం ఆమెకు ఎక్కువగా నచ్చలేదు.

ఎనిమిది రాష్ట్రాలలో అధికారానికి వచ్చిన సంకీర్ణ మంత్రివర్గాలు సొష్టవంగా పనిచేయడం సాధ్యం కాకపోయింది. కొంతవరకు దీనికి కూడా ఇందిరాగాంధి బాధ్యురాలని చెప్పవలసియున్నది. ప్రతిపక్షాలకు చెందిన వారిని కాంగ్రెసు పక్షంలో చేరునట్లు ఆమె ప్రోత్సహించింది. వారిలో అనేకులు ఎలాటి నియమాలకు కట్టుబడినవారు కారు. స్వార్థం ఒక్కటే వారి అభిలాష. మంత్రి పదవులు, ఇతర పదవులు లభించగలవనే

వాంఛతో వారు ఒక రాజకీయపక్షాననుండి ఇంకొక దానిలో ప్రవేశించుటకు సంసిద్ధులుగా ఉండినారు. వారిలో కూడా ఎలాంటి నిలకడ కనుపించలేదు. ఇతర పక్షాలలోకి మారినవారు కొన్ని రోజులు గడచిన తర్వాత ఇంకొక పక్షాన్ని ప్రవేశించడం కూడా జరుగుతూ వచ్చింది. ఇది ఒకవిధమైన అవినీతి. ప్రముఖులే దీనికి పాల్పడినప్పుడు సామాన్యుల మాట చెప్పవలసిన అవసరం ఏలాటిదీ లేదు.

అవినీతి, లంచగొండితనం 1967 తర్వాత విపరీతంగా పెరిగిపోయినవి. మంత్రులు మొదలు గుమాస్తాలు, బంట్రోతుల వరకు అందరు లంచం ఇచ్చినప్పుడే తమ పనులను నిర్వహించుటకు అలవాటు పడిపోయినారు. అందరు అష్టైశ్వర్యాలను అనుభవించడం ఒక్కటే తమ లక్ష్యంగా పెట్టుకొన్నారు. మంత్రి పదవులను అనుభవించినవారు నివసించే భవనాలు, వాటిలోని సోఫాలు మొదలైనవి, వారి మోటారుకార్లు, వారి దుస్తులు, ఆహారం, వారు పాల్గొనే విందులు— ఇవి అన్నీ వారి ఆడంబర జీవితానికి తార్కాణం. లంచాలు తీసుకొంటేనేగాని ఈలాటి జీవితాన్ని సాగించడం సాధ్యంకాదు గదా! అధికారంలో ఉన్నవారందరు మహాత్మాగాంధీని సభావేదికలలో ప్రశంసించేవారే! కాని ఎవరూ కూడా ఆయన ఆశయాలను అనుసరించేవారు కారు. త్రికరణ శుద్ధిగా ప్రవర్తించడం జీవితానికి లక్ష్యంగా ఉండవలెనని మన పూర్వులు చెప్పేవారు. చెప్పడమేకాక ఆలాగు ప్రవర్తించేవారు. కాని 1967 తర్వాత త్రికరణశుద్ధి అనేది అదృశ్యమైపోయింది. "యథా రాజా తథా ప్రజా" అనే సూక్తి ప్రాబల్యం వహించింది. జీవితంలో అవినీతికి అగ్రస్థానం లభించింది.

తన అధికారాన్ని పెంచుకొని సుస్థిరం చేసుకొనే ఉద్దేశంతో ఇందిరాగాంధి ఒక ప్రత్యేక పోలీసుదళాన్ని నిర్మాణం చేసుకొన్నది. ఆ దళానికి చెందినవారు మంత్రులు, ఇతర అధికారులు, ప్రముఖులైన అనధికారులు ఆమెపట్ల ఏలాటి వైఖరి కలవారో, ఏవైనా కుట్రలు పన్నుతున్నారో ఆమెకు అప్పటికప్పుడు తెలియచేయడం పరిపాటి అయింది. అనుమానాస్పదు లందరిని ఆమె వెంటనే

అధికార పదవుల నుండి తొలగించి, విశ్వసనీయులైనవారిని వారి స్థానే నియమించడం ఆమె అనుసరించిన పరిపాలన విధానంగా మారింది.

1969 మే 3 న రాష్ట్రపతి జకీరు హుస్సేన్ అకస్మాత్తుగా మరణించాడు. వెంటనే రాష్ట్రపతిని ఎన్నుకొనవలసిన అవసరం లేదు. 6 నెలలు ఉపరాష్ట్రపతి రాష్ట్రపతిగా వ్యవహరించవచ్చు. ఆనాడు వి. వి. గిరిగారు ఉపరాష్ట్రపతిగా ఉండినందున తాత్కాలిక రాష్ట్రపతిగా వారు పదవిని అధిష్ఠించినారు. కాని రాష్ట్రపతి పదవికి కాంగ్రెసు పక్షం తరఫున అభ్యర్థిని పేర్కొనే అధికారంగల పార్లమెంటరీ బోర్డు కాలయాపన లేకుండా క్రొత్త రాష్ట్రపతి ఎన్నికను జరుపుటకు నిర్ణయించింది. ఆ బోర్డులో కుడిపక్షానికి చెందిన నిజలింగప్ప, మొరార్జీ దేశాయి మొదలైన నలుగురు లోక్‌సభ స్పీకరుగా అన్నిపక్షాల గౌరవానికి పాత్రుడైన సంజీవరెడ్డి అభ్యర్థిత్వాన్ని సమర్థించారు. ఆయన కుడిపక్షానికి చెందిన వాడని, రాష్ట్రపతిగా తన విధానాలకు అడ్డు తగిలి, తన్ను ప్రధాని పదవినుండి తొలగించగలడని అనుమానించి ఆమె జగజీవన్‌రాం అభ్యర్థిత్వాన్ని సమర్థించ దలచింది. కాని పార్లమెంటరీ బోర్డులో చవాన్ కూడా కుడిపక్షంలో కలియడంచేత అయిదుగురు సంజీవ రెడ్డిని సమర్థించేవారుగాను, ముగ్గురు మాత్రమే జగజీవన్‌రాంను సమర్థించేవారుగాను ఏర్పడినారు. తన ప్రయత్నం విఫలం కావడం ఆమెకు ఇష్టంలేదు. అందుచే తుదినిర్ణయం జరుగుటకు ముందు ఇంకొక పన్నుగడను పన్నింది.

రాష్ట్రపతి పదవికి అభ్యర్థిని నిర్ణయించుటకు పార్లమెంటరీ బోర్డు బెంగుళూరులో సమావేశమైనప్పుడు కాంగ్రెసు కమిటీ కూడా (ఏ. ఐ. సి. సి. — A. I. C. C.) అక్కడ సమావేశమైనది. తాను సోషలిజాన్ని స్థాపించి సామాన్య ప్రజల ఆర్థిక పరిస్థితులను మెరుగుపరచుటకు కంకణం కట్టుకొనగా మొరార్జీ దేశాయి మొదలైన కుడి వర్గానికి చెందినవారు ఎలాటి మార్పును వాంఛించక తనకు అడ్డుతగులుతున్నారని స్పష్టంచేసే ఉద్దేశంతో కొన్ని సోషలిస్టు లక్షణాలు గల ఒక ప్రణాళికను తయారుచేసి, సంజీవరెడ్డిని అభ్యర్థిగా ఎన్నుకొనుటకు ముందు, దానిని కాంగ్రెసు

కమిటీలో చర్చించవలసిందిగా ఇందిరాగాంధి ప్రధాని హోదాలో కోరింది. ఆ ప్రణాళికను దేశాయి మొదలైనవారు ఎదిరించి, దానికి ఆటంకం కలిగించగలరని, అది జరిగిన పక్షంలో వారు ప్రజాదరణను కోల్పోయి, సంజీవరెడ్డి స్థానే ఆమె సూచించిన జగజీవన్‌రాంను అభ్యర్థిగా అంగీకరించడం తప్పదని ఆమె భావించి ఈ పన్నుగడను పన్నింది. కాని వారు ఆమె ఉద్దేశాన్ని గ్రహించి, ఆ ప్రణాళికను యథాతథంగా సమర్థించారు. అందుచేత ఏ. ఐ. సి. సి. దానిని ఏకగ్రీవంగా ఆమోదించింది. ఆమె ఎలాటి సోషలిస్టో, తాముకూడా అలాటి సోషలిస్టులేనని ఇందుమూలంగా వారు స్పష్టం చేశారు. ఆమె వేసిన పాచిక పారకపోవడంతో రెడ్డి అభ్యర్థిత్వాన్ని ఆమె ఆమోదించక తప్పలేదు. ఆయన అభ్యర్థిత్వాన్ని ప్రతిపాదిస్తూ ఎలక్షన్ అధికారులకు నామినేషన్ పత్రాన్ని దాఖలు చేసింది.

రెడ్డికి పోటీగా వి. వి. గిరిగారు, చింతామణి దేశ్‌ముఖ్ గారు నిలబడినారు. ఉభయ పార్లమెంటు శాఖల సభ్యులు రాష్ట్రపతిని ఎన్నుకొనవలసి యుండినది.

రెడ్డి రాష్ట్రపతి కావడం ఇందిరాగాంధికి ఎంతమాత్రము ఇష్టంలేదు. ఆయన రాష్ట్రపతి అయిన పక్షంలో తన ప్రధాని పదవికి తప్పకుండా ప్రమాదం సంభవించగలదనే భయ సందేహాలు ఆమెకు కలిగినవి. అందుచేత తాను, తన సన్నిహితులు గిరిగారికి ఓటు చేయవలసినట్లుగా నిర్ణయించింది. ఆమె కాంగ్రెసు పక్షానికి చెందినా తాను అభ్యర్థిగా ప్రతిపాదించిన రెడ్డిగారికి ఓటు చేయక, కాంగ్రెసు పక్షానికి చెందని గిరిగారికి ఓటు చేయడం సంప్రదాయ విరుద్ధమని కొంచెం కూడా శంకించలేదు. ఈ ఓటు విషయంలో ఎవరి ఇష్టానుసారం వారు ప్రవర్తించవచ్చుననే కనీ వినీ ఎరుగని సూత్రాన్ని ఆధారం చేసుకొని కాంగ్రెసు పక్షానికి విరుద్ధంగా ప్రవర్తించింది. ఈలాగు కాంగ్రెసులో చీలిక సంభవించడంచేత గిరిగారు స్వల్ప మెజారిటీతో రాష్ట్రపతిగా ఎన్నుకొనబడినారు. ఆయనకు 4,20,007 ఓట్లు, రెడ్డికి 4,05,527 ఓట్లు వచ్చినవి. తనకు అనుకూలుడైన గిరి రాష్ట్రపతి కావడం ఇందిరాగాంధికి మరింత బలం చేకూర్చింది.

అటుతర్వాత క్రమక్రమంగా మరికొన్ని పరిణామాలు సంభవించినవి. 1969 నవంబరు 12-వ తేదీన క్రమశిక్షణా రాహిత్యానికి కాంగ్రెసు అధిష్ఠానవర్గంవారు (నిజలింగప్ప వగైరా) ఇందిరాగాంధిని కాంగ్రెసు నుండి తొలగించి, ఆమెస్థానే ఇంకొకరిని పార్లమెంటరీ పార్టీకి నాయకులుగా ఎన్నుకొనవలసినట్లు నిర్ణయించారు. ఆ ఎన్నికలో 282 లోక్‌సభలోని కాంగ్రెసు సభ్యులలో 220 మంది ఆమెనే తిరిగి ఎన్నుకొన్నారు. అందుచేత ఆమె ప్రధాని పదవికి ఎలాంటి అంతరాయం కలుగలేదు. నిజలింగప్ప పక్షంలో 62 మంది మాత్రమే చేరారు. కాని లోక్‌సభలోని మొత్తం సభ్యులు 523. వారిలో 220 మాత్రమే ఆమెను సమర్థించడంచేత ఇతరపక్షాల సహాయంతో— ముఖ్యంగా కమ్యూనిస్టులు, డి. యం. కె. పక్షంవారు, కొందరు స్వతంత్రులు (Independents) మొదలైనవారి సహాయంతో ఆమె ప్రధానిగా పాలించగలిగింది. ఆమెది ఒక మైనారిటీ ప్రభుత్వంగా రూపొందింది.

కాంగ్రెసులో ఆమెను అనుసరించినవారు నవంబరు 17-వ తేదీన ఎ. ఐ. సి. సి. ని సమావేశపరచి కాంగ్రెసు నుండి నిజలింగప్పను తొలగించారు. దీనికి జవాబుగా అతని అనుచరులతో కూడిన కాంగ్రెసు అలహాబాదులో సమావేశమై ఇందిరాగాంధి తొలగింపును ఖాయం చేసింది. అదేవిధంగా ఇందిరా పక్షం వహించిన కాంగ్రెసు డిసెంబరు 4 న బొంబాయిలో సమావేశమై నిజలింగప్ప తొలగింపును ఖాయం చేసింది. దీనితో దేశంలో రెండు కాంగ్రెసులు— కాంగ్రెసు (ఆర్), కాంగ్రెసు (ఓ) అనే పేర్లతో ఏర్పడినవి.

1885 లో స్థాపింపబడి, గాంధీమహాత్ముని నాయకత్వాన పరాయి ప్రభుత్వంతో స్వాతంత్ర్య పోరాటాన్ని విజయవంతంగా సాగించి, దేశానికి స్వాతంత్ర్యం సంపాదించి, 1947 నుండి 1967 వరకు స్వతంత్ర భారతాన్ని మెజారిటీ సంఖ్యాబలంతో ఏలగలిగిన కాంగ్రెసు ఇందిరాగాంధి అధికార వ్యామోహంచేత రెండు పక్షాలుగా చీలిపోవడం విషాదకరం. కాని ఈ చీలిక మూలంగా కుడిపక్షానికి చెందిన నిజలింగప్ప, మొరార్జీ దేశాయి మొదలైన

వారి బెడదనుండి తాను విముక్తి గాంచినట్లు ఇందిరాగాంధి భావించి తృప్తి పడింది. వారి బెడద తప్పడంచేత ఆమెను అనుసరించిన కాంగ్రెసు (ఆర్) పక్షంలో ఆమెకు అడ్డుతగిలేవారు ఎవరూ లేకపోవడంమూలంగా ఆమె నియంతృత్వానికి గట్టి పునాదులు ఏర్పడినవి. ఇందుకుగాను ఆమె కాంగ్రెసువంటి ప్రధాన రాజకీయ సంస్థలో చీలికలు తెచ్చిపెట్టడం గమనార్హము.

ఈ చీలిక కాలంలో ఉత్తరప్రదేశ్, గుజరాత్, మైసూరు ముఖ్యమంత్రులు తప్ప తక్కిన రాష్ట్రాల ముఖ్యమంత్రులు ఆమెకు అనుచరులయ్యారు. కేంద్ర ప్రభుత్వాన నుండి ఎక్కువ విరాళాలను డి. ఎం. కె ప్రభుత్వానికి యిచ్చి ముఖ్యమంత్రి కరుణానిధిని తన వశంలోకి తెచ్చుకొన్నది. ఉత్తరప్రదేశ్‌లో గవర్నరు నివేదికను ఆధారం చేసికొని రాష్ట్రపతి పాలనను విధించింది. గుజరాత్‌లోను, మైసూరులోను అలాగే చేసింది. ఈవిధంగా కాలక్రమాన అన్నిరాష్ట్రాల ముఖ్యమంత్రులు ఆమె వశంలోకి వచ్చారు. రాష్ట్రపతి పరిపాలనను విధించే అధికారం కేంద్రప్రభుత్వానికి ఉండడంచేతను, గవర్నరులు కేంద్రానికి లోబడినవారు కావడంచేతను ఇది సులభసాధ్యమైంది. ఇది మన సమాఖ్య విధానానికి పరమ విరుద్ధం. అధికార వ్యామోహంచేత శ్రీమతి ఇందిరాగాంధి దీనిని అనుసరించింది. రాష్ట్రాలపై తన అధికారాన్ని చెలాయించుటకు ఆమెకు మార్గాంతరం లేకపోయింది.

బెంగుళూరు సమావేశానికి, రాష్ట్రపతి ఎన్నికకు మధ్యకాలంలో ఆమె తన సోషలిస్టు విధానాన్ని అమలుపరచుటకు 14 బాంకులను జాతీయం చేసింది. బాంకులు సామాన్య ప్రజలకు, సన్నకారురైతులకు,రిక్షాలులాగేవారికి, టాక్సీడ్రైవరులకు, స్వయం ఉపాధి పథకాలను సాగించేవారిక, అలాటి ఇతరులకు ఋణాలు ఇచ్చి సహాయపడుటకు అవసరమనే భావంతో ఈ మార్పు చేసింది. దీనిమూలంగా సామాన్య ప్రజల అభిమానాన్ని ఆమె సంపాదించ గలిగింది.

ఆమె తలపెట్టిన ఇతర మార్పులను చేసే విషయంలో రాజ్యాంగాన్ని సవరించవలసిన అవసరం కలిగింది. కాని

పార్లమెంటులో 2/3 మెజారిటీ బలం ఉన్నప్పుడే ఇది ఆమెకు సాధ్యమౌతుంది. కాంగ్రెసు చీలిక తర్వాత పార్లమెంటులో ఆమె సంఖ్యాబలాన్ని కోల్పోయింది. అందుచేత 1971 లో మధ్యంతర ఎన్నికలు జరిపి, 2/3 బలాన్ని సంపాదించవచ్చుననే భావంతో ఆమె లోక్‌సభకు ఎన్నికలు జరిపింది. ఎన్నికలలో విజయాన్ని సంపాదించుటకు లైసెన్సులు, పర్మిట్లు, ఇతరసదుపాయాలు వ్యాపారస్తులకు కల్పించింది. కోట్లకొలది ధనాన్ని వసూలు చేసింది. దీనిని ఖర్చుపెట్టి ఎన్నికలలో ఘనవిజయాన్ని సంపాదించింది. 1971 మార్చిలో జరిగిన ఎన్నికల ఫలితంగా లోక్‌సభలోని 523 స్థానాలలో ఆమె పార్టీకి 350 స్థానాలు లభించినవి. అంటే 2/3 మెజారిటీ కంటె ఎక్కువ స్థానాలు లభించినవన్నమాట. ఈ మెజారిటీ మూలంగా రాజ్యాంగంలో ఆమె వాంఛించిన మార్పులన్నిటినీ గావించి, తన నియంతృత్వాధికారాన్ని పెంచుకొనుటకు ఆమెకు అపూర్వమైన అవకాశం లభించింది. ఎన్నికలలో ఆమెను ఓడించుటకు కాంగ్రెసు (ఓ), జనసంఘ్, స్వతంత్ర మొదలైన పార్టీలు కలసికట్టుగా పనిచేసినా సామాన్య ప్రజలకు ఆమె నెహ్రూ కుమార్తె అనే భావం మూలంగా ఎక్కువ ఆదరణ ఉండడంచేతను, ప్రజల దారిద్ర్యాన్ని తొలగించుటకు ఆమె అనుసరించదలచిన సోషలిస్టు విధానాలు మాత్రమే అనుకూలించగలవని వారు భావించడంచేతను, తక్కిన పార్టీలవారు అలాంటి కార్యక్రమాలను నిరోధించేవారనే భావం వారిలో నాటుకొనడంచేతను ఆమె ఎన్నికలలో ఘనవిజయాన్ని సాధించ గలిగింది.

ఎన్నికలలో ఇంతటి విజయం లభించడంచేత ఆమెలో ఆత్మవిశ్వాసం పెరిగింది. తన్ను నిరోధించగలవారు ఎవరూ లేరనే నమ్మకంతో తాను తలపెట్టిన కార్యక్రమాలను సాగించుటకు కృతనిశ్చయురాలైనది. కార్మికులకు ఇవ్వవలసిన బోనసు 4 శాతం నుండి 8.33 శాతానికి పెంచింది. ఇన్సూరెన్సు కంపెనీలన్నిటిని ప్రభుత్వం అధీనంలోకి తెచ్చి ఇన్సూరెన్సు విధానాన్ని జాతీయం చేసింది. ఆమె తలపెట్టిన సోషలిస్టు విధానం కార్యరూపం ధరించడంలో ఇది ఒక గొప్ప మెట్టు. అలాగే బొగ్గు పరిశ్రమను జాతీయం చేసింది కాని దీనిమూలంగా బొగ్గు

ధరలు పెరిగినవి. పల్లెప్రాంతాలలోని దారిద్ర్యాన్ని, నిరుద్యోగాన్ని తొలగించుటకు 50 కోట్లు పెట్టుబడితో ఒక పథకాన్ని అమలు పరచింది. కాని దీనిమూలంగా ఆశించిన ఫలితాలు లభించ లేదు. అదేవిధంగా విద్యాధికులకు ఉద్యోగాలను కల్పించుటకు ఇంకొక పథకాన్ని అమలు పరచింది. కాని దీనిమూలంగా కూడా ఎలాటి ఫలితం లభించలేదు. రాజకీయంగా ఆమె విజయాన్ని సంపాదించినా ఆర్థికరంగంలో ఎలాటి అభివృద్ధిని సాధించలేక పోయింది. ఆమె విధానాలను ఖండించే వారిపై కఠినచర్యను తీసుకొనే ఉద్దేశంతో మీసా (MISA— ఆంతరంగిక భద్రతా చట్టాన్ని) రూపొందించి అమలుపరచింది. అనుమానా స్పదులను ఎలాటి విచారణ లేకుండా బంధించి జైళ్ళలో పెట్టుటకు దీనిమూలంగా అధికారులకు అవకాశం లభించింది. 1971 అంతానికి సుమారు 6000 మంది ఈ చట్టంక్రింద బంధింపబడినారు. ఇదేకాలంలో రాజ్యాంగానికి 24-వ సవరణ జరిగింది. దీని ప్రకారం పార్లమెంటుకు రాజ్యాంగాన్ని ఇష్టానుసారం (మౌలిక హక్కులతో సహా) సవరించుటకు అధికారం లభించింది. మౌలిక హక్కులను (Fundamental Rights) సవరించే హక్కు పార్లమెంటుకు లేదని సుప్రీం కోర్టు ఇదివరలో చేసిన తీర్పు ఇందుమూలంగా రద్దు చేయబడింది. రాజ్యాంగంలో ఇంకొక సవరణ గావించి ఇష్టం వచ్చిన నష్ట పరిహారాన్ని (అది స్వల్ప మొత్తమైనా) ఇచ్చి వ్యక్తుల ఆస్తిని ప్రభుత్వం వశంచేసుకొనవచ్చునని, ఆ వశం చేసుకొనడం చెల్లుతుందా చెల్లదా అనే విషయాన్ని గురించి విచారణ చేయుటకు సుప్రీం కోర్టుకు అధికారం లేదని నిర్ణయించింది. నిరంకుశత్వానికి న్యాయస్థానాలకు గల అధికారాన్ని తొలగించడం ఒక ప్రధాన లక్షణం. ఆ తొలగింపు కార్యక్రమంలో ఈ రాజ్యాంగ సవరణ ఒక ప్రధానమైన మెట్టు.

ఈ సవరణలను అమలుపరచి తాను వాంఛించిన ఫలితా లన్నిటిని సంపాదించుటకు ఇందిరాగాంధి తలపెట్టిన సమయంలో పాకిస్తాన్‌లోని పరిణామాలు ఆమె దృష్టిని ఆకర్షించినవి. అనేక సంవత్సరాలుగా పాకిస్తాన్ సైనిక నియంతృత్వ పరిపాలనకు లోబడి ఉండినది. ఆ పరిపాలనలో బెంగాలీ భాషను మాట్లాడే

ప్రజలతో కూడిన తూర్పు పాకిస్తాన్ ఒక వలస రాష్ట్రంగా పరిగణింపబడినది. దాని అభివృద్ధికై పాకిస్తాన్ ప్రభుత్వం ఏలాటి ప్రయత్నము చేయలేదు. ఉద్యోగాలన్నీ పశ్చిమ పాకిస్తాన్ వారికే లభించినవి. 1971 లో సైనిక నియంత యాహ్యాఖాన్ ఎన్నికలు జరిపాడు. దానిఫలితంగా పశ్చిమ పాకిస్తాన్ భుట్టో నాయకత్వంలోని పార్టీకి పూర్తి మెజారిటీ, తూర్పు పాకిస్తాన్‌లో ముజీబుర్ రహిమాన్ పార్టీకి పూర్తి మెజారిటీ లభించినవి.

ఎన్నిక ఫలితాలు తెలిసిన వెంటనే ముజీబుర్ రహిమాన్ తూర్పు పాకిస్తాన్‌కు ఆంతరంగిక విషయాలలో సంపూర్ణ స్వాతంత్ర్యం ఉండవలెనని కోరాడు. పాకిస్తాన్ ప్రభుత్వం ఆ కోరికను నిరాకరించడమే కాకుండా, ముజీబురును అరెస్టుచేసి, పంజాబులో బంధించి, తన సైన్యాలను తూర్పు పాకిస్తాన్‌కు పంపి, అక్కడి ప్రజలను భయభ్రాంతులుగ చేసి, అనేకులను చంపి, అనేకులను బంధించి, స్త్రీలను చెరచి, నగరాలను గ్రామాలను దోచుకొని, బీభత్సంగా ప్రవర్తించింది. ఈ ఘోరాలను సహింపలేక ప్రజలలో అనేకులు (ప్రధానంగా అల్పసంఖ్యాకులైన హిందువులు) దేశాన్ని వదలి, పశ్చిమ బెంగాలుకు కాందిశీకులుగా వచ్చారు. రెండు మూడు నెలలలో వీరి సంఖ్య ఒక కోటికి పెరిగింది. వీరిని వెనుకకు తరిమివేయడం రాక్షసకృత్యమని భావించి, ఇందిరాగాంధి ప్రభుత్వం వారిని సంరక్షించి పోషించడం తన బాధ్యతగా స్వీకరించి, దానిని వహించుటలో విదేశాల సహాయాన్ని అర్థించింది. కాని అట్టి సహాయం చాలా స్వల్పంగా మాత్రమే లభించింది. వారి సంరక్షణార్థం ప్రజలపై ఎక్కువ పన్నులను విధించి వారిని సంరక్షించే బాధ్యతను పూర్తిగా ఆమె వహించింది.

తూర్పుపాకిస్తాన్ ఒక యుద్ధరంగంగా మారింది. తిరుగుబాటు చేసిన అక్కడి ప్రజలు "ముక్తివాహిని" అనే పేరుతో ఒక గొరిల్లా సైన్యాన్ని సమకూర్చుకొని, వారి శిక్షణ నిమిత్తము, వారికి కావలసిన ఆయుధాల సేకరణ నిమిత్తము పశ్చిమ బెంగాలును ప్రవేశించగా ఇందిరాప్రభుత్వం వారికి కావలసిన సహాయాన్ని అందించింది. ఈ అంతర్యుద్ధంలో చైనా, అమెరికాలు పాకిస్తాన్‌కు

పూర్తి సహాయంచేయుటకు సిద్ధపడినవి. అమెరికావారు పాకిస్తాన్‌కు సైనిక పరికరాలను అత్యధికంగా సప్లై చేయసాగారు. అలాంటి పరిస్థితులలో ఇందిరాగాంధి పాకిస్తాన్ మూలంగా భారతదేశానికి ప్రమాదం సంభవించగలదని ఊహించి, 1971 ఆగస్టు 9-వ తేదీన సోవియట్ రష్యాతో ఒక సైనిక ఒడంబడికను చేసుకొన్నది. దీనిమూలంగా పాకిస్తాన్, భారత దేశాల మధ్య యుద్ధం సంభవించిన పక్షంలో సోవియట్ రష్యా భారతదేశానికి వెంటనే సహాయం చేయుటకు అంగీకరించింది. అలాగే విదేశాల మూలంగా సోవియట్ రష్యాకు ప్రమాదం సంభవించిన పక్షాన భారతదేశం దానికి సహాయం చేయుటకు అంగీకరించింది.

తూర్పు పాకిస్తాన్‌లోని ముక్తివాహినికి భారతదేశం సహాయం చేయడం గమనించి, పాకిస్తాన్ నియంత యాహ్యాఖాన్ భారతదేశంపై యుద్ధాన్ని డిసెంబరు 3-వ తేదీన ప్రకటించాడు. డిసెంబరు 4-వ తేదీన భారత సైన్యాలు దీనికి జవాబుగా పశ్చిమ పాకిస్తాన్‌పై దాడిచేసి కొన్ని ప్రాంతాలను వశపరచుకొని, తూర్పు పాకిస్తాన్‌కు సైన్యాలను పంపి అక్కడి ముక్తివాహినితో కలసి యుద్ధాన్ని సాగించింది. యుద్ధం రెండు వారాలు జరిగింది. డిసెంబరు 16-వ తేదీన తూర్పు పాకిస్తాన్‌లోని పాకిస్తాన్ సైన్యాలు యుద్ధం మాని భారత సైన్యాలకు వశపడిపోయినవి. దీనికి ఆటంకం కలిగించే ఉద్దేశంతో అమెరికా తన నౌకాదళాన్ని బంగాళాఖాతానికి పంపింది. భారతదేశం దానిని లక్ష్యపెట్ట లేదు. దాని వెంటనంటి రష్యా నౌకాదళం రావడంచేత అమెరికా ఎలాంటిచర్యను తీసుకొనుటకు సాధ్యం కాలేదు. బంగ్లాదేశంలో (తూర్పు పాకిస్తాన్‌కు ప్రజలు పెట్టుకొన్న పేరు) భారత సైన్యాలకు పూర్తి విజయం లభించడంచేత దానికి స్వాతంత్ర్యం లభించింది. ఈ విజయం మూలంగా ఇందిరాగాంధి పేరుప్రతిష్ఠలు ఇనుమడించినవి. ఆమె బంగ్లాదేశ్ విముక్తిని సంపాదించి పెట్టిన నాయకురాలుగా ప్రసిద్ధి గాంచింది. ఇంతేకాదు డిసెంబరు 17-వ తేదీన పశ్చిమ పాకిస్తాన్‌లో యుద్ధవిరమణను ఏక పక్షీయంగా ప్రకటించింది. మరి యుద్ధం సాగించడం లాభం లేదని భావించి పాకిస్తాన్ కూడా యుద్ధాన్ని మానింది.

ఈ రెండు వారాల యుద్ధం మూలంగా బంగ్లాదేశ్ కు సంపూర్ణ స్వాతంత్ర్యం లభించడమే కాక పశ్చిమ పాకిస్తాన్‌లో సింధు రాష్ట్రంలో ఐయిదువేల చదరపు మీటర్ల భూభాగాన్ని, పంజాబు, జమ్మూ, కాశ్మీరు, ప్రాంతంలో 2500 చదరపు మీటర్ల భూభాగాన్ని భారత సైన్యాలు వశపరచుకొన్నవి. భారత భూబాగంలో 150 చదరపు మీటర్లు మాత్రమే పాకిస్తాన్ వశపరచుకొనగలిగింది.

ఇందిరాగాంధి 1971 నుండి నియంతగా దేశాన్ని పాలించినా, ఆమె పరిపాలన కాలంలో ఈలాటి ఘనవిజయాన్ని ఆమె సంపాదించినందుకు ప్రజలు ఆమెను ప్రశంసించారు. ఇటీవలి కాలంలో ఆమెవంటి నాయకుడు దేశానికి లభించలేదనే కీర్తి ఆమెకు లభించింది.

ఈలాటి అదనులో రాష్ట్రాలలోని విధాన సభలకు ఎన్నికలు జరపడం తనకు, తన పార్టీకి లాభకరంగా ఉండగలదని భావించి 1972 మార్చిలో ఎన్నికలు జరిపింది. బంగ్లాదేశ్ యుద్ధంలో ఆమె ఘనవిజయాన్ని సాధించినందుకు కృతజ్ఞతా సూచకంగా ప్రజలు కాంగ్రెసు (ఆర్) కు ఓటు చేశారు. ఆంధ్రప్రదేశ్, అస్సాం, బీహార్, గుజరాత్, హర్యానా, హిమాచల్ ప్రదేశ్, జమ్మూ, కాశ్మీరు, మధ్యప్రదేశ్, మహారాష్ట్ర, మైసూరు; పంజాబు, రాజస్థాన్, పశ్చిమ బెంగాలులలో దీనిమూలంగా సుస్థిరమైన కాంగ్రెసు ప్రభుత్వాలు ఏర్పడినవి. గోవా, మణిపూరు, మేఘాలయాలలో మాత్రమే కాంగ్రెసేతర పక్షాలు గెలిచినవి. 1967 కు పూర్వం ఉన్నట్లే 1972 లో జరిగిన ఎన్నికల ఫలితంగా కేంద్రంలోను, రాష్ట్రాలలోను కాంగ్రెసు (ఆర్) ప్రభుత్వాలు ఏర్పడినవి. ఇందిరాగాంధి రాష్ట్ర ముఖ్యమంత్రులను తన అధీనంలో ఉంచుకొని దేశాన్నంతా తన ఇష్టానుసారం పరిపాలించ గలిగింది.

దేశానికి 1947 లో స్వాతంత్ర్యం లభించిన తర్వాత పాకిస్తాన్‌తో మూడు పర్యాయాలు యుద్ధం సంభవించి రెండు దేశాల మధ్య ఉద్రిక్త పరిస్థితులు ఏర్పడినవి. ఈలాటి పరిస్థితులను తొలగించి పాకిస్తాన్‌తోటి సంబంధాలను మెరుగుపరచు

కొనుటకు 1971 యుద్ధానంతరం ఆమె గొప్ప ప్రయత్నం చేసింది. ఆమె చేసిన ప్రయత్నం కొంతవరకు ఫలప్రదమై, 1972 జూన్ 29 న పాకిస్తాన్ అధ్యక్షుడు భుట్టో ఇందిరాగాంధిని సిమ్లాలో కలుసుకొని జూలై 3 న ఒక ఒడంబడికకు అంగీకరించాడు. యుద్ధ కాలంలో వశపరచుకొన్న ప్రాంతాలను తిరిగి ఇచ్చివేయుటకు 1971 డిసెంబరు 17 న జమ్మూ కాశ్మీరులో రెండు దేశాల మధ్య ఏర్పడిన ఎల్లలను గుర్తించుటకు, భవిష్యత్తులో రెండు దేశాల మధ్య ఉత్పన్నమయ్యే సమస్య లన్నిటిని శాంతియుతంగా సంప్రదింపులద్వారా పరిష్కరించుకొనుటకు ఉభయులు వాగ్దానాలు చేశారు. ఈ ఒడంబడిక ఫలితంగా కొంతవరకు ఉభయ దేశాలమధ్య ఉద్రిక్తతలు తగ్గినవి. విదేశ రాజకీయాలలో ఇందిరా గాంధి సాధించిన విజయాలలో ఈ ఒడంబడిక పై కారణం చేత ప్రాధాన్యం వహిస్తున్నది

ఇందిరాగాంధి విదేశ వ్యవహారాలలోను, యుద్ధాన్ని సాగించడంలోను అపూర్వమైన విజయాన్ని సాధించినా దేశంలోని ఆర్థిక పరిస్థితులను చక్కబెట్టుటలోను, నిరుద్యోగ సమస్యను పరిష్కరించడంలోను విఫలత గాంచినది. ఆమె పరిపాలన కాలంలో మంత్రులు మొదలైన అధికారులలో అవినీతి, లంచగొండితనం, ఆశ్రిత పక్షపాతం తారాపథాన్ని అందుకొన్నవి. అధికారులలో ఎవరు అవినీతికి పాల్పడినదీ ఆమెకు తెలిసినా వారిపై ఎలాటి చర్యను ఆమె తీసుకొనలేదు. నగర్వాలా అనేవాడు ఆమె గొంతుకను అనుకరించి ఢిల్లీ స్టేట్ బాంక్ ఆఫ్ ఇండియా నుండి 60 లక్షల రూపాయలు వసూలుచేయడం, దానిని గురించి తగిన విచారణ జరగక పోవడం, ఆమె ప్రతిష్ఠకు భంగం కలిగించింది. ఆమె కుమారుడు సంజయగాంధి స్థాపించిన మారుతీ కంపెనీకి చట్టవిరుద్ధంగా అనేక ఆర్థిక సదుపాయాలు కల్పించడం ఈవిధంగానే పరిణమించింది. ఆమె అనుసరించిన విధానాలలో కొన్ని రాజ్యాంగ విరుద్ధా లనే అభిప్రాయాన్ని వ్యక్తం చేసినందుకు ఉన్నత న్యాయస్థానంలోని ముగ్గురు సీనియర్ జడ్జిలను కాదని ఒక జూనియర్ జడ్జి అజిత్ నాథ్ రేని ప్రధాన న్యాయమూర్తిగా నియమించడాన్ని అందరూ విమర్శించారు.

న్యాయస్థానాల స్వాతంత్ర్యానికి ఇది గొడ్డలిదెబ్బవంటిదని అందరూ భావించారు. ఆర్థికపరిస్థితులు దిగజారిపోయిన కారణంగా 1972 లో కార్మికులు అనేక సమ్మెలను లేవదీసి, ఉత్పత్తికి అపార నష్టాన్ని కలిగించారు. విశ్వవిద్యాలయా లన్నిటిలో విద్యార్థులు క్రమశిక్షణకు లోబడక, తమకు ఎలాంటి సంబంధంలేని రాజకీయాలలో ప్రవేశించి దౌర్జన్య కార్యక్రమాలు సాగించడం పరిపాటి అయింది. వాటిని అరికట్టుటకు ఎలాంటి చర్యలు ఆమె తీసుకోన లేదు. నెలల పర్యంతం అనేక విశ్వవిద్యాలయాలు మూతబడిపోయినవి. ధరలు విపరీతంగా పెరిగి ఆహారపదార్థాలు, ఇతర అవసర వస్తువులు సామాన్య ప్రజల అందుబాటులో లేకపోయినవి ఆమె పరిపాలనలో సోషలిజం ఒక నినాదంగా రూపొందిందేకాని ప్రజలమధ్య ఆర్థిక అసమానతలు ఏమాత్రమూ తగ్గలేదు. దేశంలో ఉత్పత్తి పెరిగినా అది ధనికులను మరింత ధనవంతులుగా చేయగలిగిందేకాని సామాన్య ప్రజల దారిద్ర్యాన్ని తగ్గించలేకపోయింది. ఆమె పరిపాలనా విధానంలో ఈలాంటి లోపాలు అసంఖ్యాకంగా ప్రవేశించినవి. కాని వాటికి ప్రతిక్రియ ఎలాంటిదో కనుగొని, దానిని ఆచరణసాధ్యం చేయుటకు ఆమె గాని, ఆమె సలహాదార్లు గాని ఎలాంటి చర్యలు తీసుకొనలేదు.

ధరల పెరుగుదలను అరికట్టుటకుగాని, అవసర పదార్థాల కొరతను తీర్చుటకుగాని, మంత్రులు మొదలైన అధికారులలో అవినీతిని తగ్గించుటకుగాని ఆమె ఎలాంటి చర్యలను తీసుకొనక పోవుటకు నిరసనగా గుజరాత్ రాష్ట్రంలోని విద్యార్థులు, ఇతర యువకులు "నిర్మాణ యువక సమితులను" స్థాపించి, విధాన సభను రద్దుచేయవలసినదిగా కోరుతూ ఒక గొప్ప ఉద్యమాన్ని లేవదీశారు. దానిని ఎదుర్కొనలేక ఇందిరా గాంధి అవినీతి పరులతోకూడిన విధాన సభను రద్దుచేసి రాష్ట్రపతి పరిపాలనను విధించింది. అలాంటి ఉద్దేశాలతోనే జయప్రకాశ్ నారాయణ బీహారులో ఒక యువక ఉద్యమాన్ని లేవదీశాడు. ప్రతిపక్షాలకు చెందిన వారందరు అందులో పాల్గొన్నారు. కాని బీహారు విధాన సభను రద్దుచేయుటకు ఆమె ఇష్టపడలేదు. అలాగు రద్దు

చేసిన పక్షంలో ఈలాంటి ఉద్యమాలు ఇతర రాష్ట్రాలకు వ్యాపించే ప్రమాదం ఉన్నట్లు ఆమె భావించింది. మంత్రులు మొదలైన అధికారులలో అవినీతిని, ఆడంబర జీవితాన్ని తగ్గించుటకుమార్గాంతరం లేదనే భావంతో నారాయణ విసుగు వేసటలు లేక ఉద్యమాన్ని సాగిస్తూనే వచ్చాడు. కాని ఇందిరాగాంధి ఎంతమాత్రము చలించ లేదు. అదే సమయంలో రైల్వేకార్మికులు గొప్పసమ్మెను లేవ దీసి చాలానష్టాన్ని కలిగించారు. కాని ఆమె వారిపై అమానుష మైన చర్యలు తీసుకొని, దానిని ఎదుర్కొనగలిగింది. మొండి పట్టుబట్టి ఆమె నారాయణను ఎదుర్కొనినా, రైల్వేకార్మికులను లొంగదీసినా దేశంలో ఆమె పరిపాలనపట్ల అసంతృప్తి దినదినాభి వృద్ధి గాంచింది.

1971 లో ఆమెను పార్లమెంటుకు ఎన్నుకొనడం చెల్లదని 1975 లో అలహాబాదు హైకోర్టు తీర్పు చెప్పింది. అటుతర్వాత ఆమె ఏదోవిధంగా అధికారంలో ఉండి, 1975 జూన్ 25 న మంత్రి మండలితో సంప్రదించక అత్యవసర పరిస్థితిని ప్రకటించి మరింత దారుణంగా 19 నెలల కాలము దేశాన్ని పాలించింది. ఆనాటి ఆమె అనుసరించిన పరిపాలనా విధానాన్ని, దాని మూలంగా ప్రజ లనుభవించిన కష్టనష్టాలను షా కమీషన్ దాని నివేదికలో కండ్లకు కట్టినట్లు వివరించింది. ఆరోజులలో వార్తాపత్రికలకు ఎలాంటి స్వేచ్ఛ లేని కారణంగా వాటిని గురించి నా డైరీలో నేను వివరించి వ్రాసిపెట్టాను. ఈ అత్యవసర పరిస్థితి, దాని మూలంగా ఆమె ప్రభుత్వం సాగించిన అత్యాచారాలు ప్రజలను దిగ్భ్రాంతి పరచినవి. 1977 మార్చిలో జరిగిన ఎన్నికలలో ఆమె అపజయం గాంచడం, జనతా పార్టీకి అధిక సంఖ్యాకబలం లభించి, మొరార్జీ దేశాయి ప్రధానమంత్రిగా నూతన ప్రభుత్వం ఏర్పడడంతో ఆమె పరిపాలన అంతరించింది. దేశపరిపాలనలో నూతనశకం ప్రారంభ మైనది. నియంతృత్వ స్థానంలో ప్రజాస్వామికం పునరుద్ధరింప బడింది.

1966 తర్వాత రాజకీయ రంగంలో సంభవించిన ఇంకొక మార్పు నా దృష్టిని ఆకర్షించింది. దానిని గురించి నా డైరీలలో అక్కడక్కడ వ్రాసిపెట్టుకొన్నాను. మన రాజకీయ పరిణామంలో

దానికి ఎక్కువ ప్రాధాన్యం ఉన్నందున దానిని గురించి ప్రస్తావించడం ఉచితంగా కనిపిస్తున్నది.

మనకు స్వాతంత్ర్యం లభించిన తర్వాత 20 సంవత్సరాలు కాంగ్రెసు పక్షానికి కేంద్రంలోను, రాష్ట్రాలలోను మెజారిటీ బలం లభించడంచేత కాంగ్రెసు మంత్రివర్గాలు ఏర్పడి పరిపాలనను సాగించినవి. 1967 లో జరిగిన ఎన్నికలలో 8 రాష్ట్రాలలో కాంగ్రెసు పక్షానికి మెజారిటీ బలం లభించలేదు. అదే విధంగా ప్రతిపక్షాలలో దేనికి కూడా అలాటి బలం లభించలేదు. ఆ పరిస్థితులలో ప్రతిపక్షాలు కొన్ని కలిసి సంకీర్ణ మంత్రివర్గాలను (Coalition Governments) ఏర్పాటు చేసి రాష్ట్రాలను పాలించ సాగినవి. ఈలాటి మంత్రివర్గాలు సుస్థిరంగా పరిపాలన సాగించుటకు వాటిని ఏర్పాటు చేసుకున్న ప్రతిపక్ష పార్టీలమధ్య ఐకమత్యము, సామరస్యము వుండడం చాలా అవసరం. కాని ప్రథమంలో అలాటి ఐకమత్యం ఉండినా క్రమక్రమంగా అది క్షీణించి, వాటి మధ్య అంతఃకలహాలు సంభవించడంతో సంకీర్ణ ప్రభుత్వాలు స్థిరత్వాన్ని కోల్పోయి పరిపాలనాధికారాన్ని వదలుకోనవలసి వచ్చినది. మన దేశ పరిస్థితులలో సంకీర్ణ మంత్రివర్గాలు స్థిరంగా కలిసి పరిపాలనను సాగించడం సాధ్యంకాదని 1967–'70 మధ్య సంభవించిన పరిణామం ఋజువు చేసింది.

మనం చాలాకాలం బ్రిటిష్ పరిపాలనకు లోబడిన కారణంగాను, బ్రిటన్‌లో పార్లమెంటులో సాధారణంగా ఏదో ఒక పక్షం మాత్రమే ఎన్నికలలో మెజారిటీ బలాన్ని సంపాదించి ఇతర పక్షాలతో కలియవలసిన అవసరం లేకుండా తనంతట తాను మంత్రివర్గాన్ని ఏర్పాటు చేసుకొని పరిపాలనాధికారాన్ని చెలాయించడంచేతను, మనం ఇదే సత్సంప్రదాయమని భావించడంచేతను సంకీర్ణ మంత్రివర్గాల ద్వారా పరిపాలనను 1967–'70 మధ్య సాగించలేక పోయినాము. తాత్కాలికంగా కలిసిన పార్టీలు తమ అధికారాన్ని, తమ తమ పార్టీల ప్రాబల్యాన్ని పెంచుకొనుటకు వినియోగించడంచేత వాటి మధ్య ఐకమత్యం సాధ్యం కాలేదు. రాష్ట్ర శాసనసభలలో బాహాటంగా అధికారంలో

వుండిన పార్టీలు పరస్పరం కలహించ సాగినవి. యూరప్ ఖండంలో నార్వే, స్వీడన్, డెన్మార్కు మొదలైన దేశాలలో సాధారణంగా సంకీర్ణ మంత్రివర్గాల ద్వారానే పరిపాలన జరుగుచున్నది. బ్రిటిష్ సంప్రదాయం ఒక్కటే సత్సంప్రదాయం అని భావించడం పొరబాటు. ఈలాటి భావం మన రాజకీయ పక్షాలలో జీర్ణించు కొనిపోయిన కారణంగా సంకీర్ణ మంత్రివర్గాలు స్థిరత్వాన్ని కోల్పోయి తమ రాష్ట్రాలలో రాష్ట్రపతి పాలన స్థాపింపబడుటకు దారితీసినవి. 1972 లో జరిగిన ఎన్నికల మూలంగా అన్ని రాష్ట్రాలలో ఏకపక్ష కాంగ్రెసు ప్రభుత్వాలు ఏర్పడినవి.

ప్రస్తుతం ( 1977 మార్చిలో జరిగిన ఎన్నికల ఫలితంగా ) కేంద్రంలోను, అనేక రాష్ట్రాలలోను జనతాపార్టీ ఒక పార్టీ కాదు. అది కాంగ్రెసు (ఓ), బి. ఎల్.డి., జనసంగ్, సి.యఫ్.డి., సోషలిస్టు మొదలైన పార్టీల కలయికచేత ఏర్పడినట్టిది. వీటి మధ్య సంపూర్ణ సహకారం, ఐకమత్యము ఇప్పటికి కూడ ఏర్పడలేదు. ప్రతి పార్టీ తన వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకొనుటకు ప్రయత్నం చేస్తున్నది. ఈ మనోవైఖరిని మాని యూరప్ ఖండంలోని స్వీడన్ మొదలైన దేశాలలో సంకీర్ణ మంత్రి వర్గాలు విజయవంతంగా పరిపాలించడాన్ని గుర్తించి, అవి ఐక మత్యంతో ఎలాగు పనిచేయగలుగుచున్నవో అర్థం చేసుకొనడం మనకు ఎంతైనా అవసరం. 1977 వరకు అధికారంలో ఉండిన కాంగ్రెసులో కూడా అనేక వర్గాలు ఉండేవి. కాని నెహ్రూ, ఇందిరా గాంధి మొదలైనవారి నాయకత్వాన్ని వారు హృదయ పూర్వకంగా అంగీకరించడంచేత అన్ని వర్గాలు కలిసి పరిపాలనను సాగించడం సాధ్యమైంది. మన సామాజిక పరిస్థితులు భిన్నత్వాన్ని ప్రోత్సహించు నట్టివి. కుల భేదాలు, భాషా భేదాలు, మత భేదాలు, ప్రాంతీయాభిమానాలు వాటికి లక్షణం. ఆ కారణం చేత రాజకీయ పక్షాలు కూడా అనేకం ఏర్పడి యున్నవి. మన ప్రజాస్వామికం బ్రిటన్‌లోని ప్రజాస్వామికం మోస్తరు. ఒక అధికార పక్షం, ఒక ప్రతిపక్షంతో మాత్రమే పని చేయడం సాధ్యం కాదు. అనేక పక్షాలతోను, సంకీర్ణ మంత్రి వర్గాలతోను దేశపరిపాలనను సాగించుటకు మనం అలవాటు

పడడం ఎంతైనా అవసరం. ఈ అవసరాన్ని మనం తీర్చుకొనకపోయిన పక్షంలో ప్రజాస్వామికానికే ప్రమాదం సంభవించవచ్చు. 1967-'71 మధ్య ఏర్పడిన సంకీర్ణ మంత్రివర్గాల యొక్కయు, 1977 మార్చి నుండి ఏర్పడిన జనతా మంత్రివర్గాల పరిపాలనయు మనకు ఈ గుణపాఠాన్ని నేర్పుచున్నవి. దీనిని నేర్చుకున్నప్పుడే మనం మన ప్రజాస్వామికాన్ని నిలబెట్టుకొనడం సాధ్యం.

మన పరిపాలన విధానము ప్రజాస్వామికము మాత్రమే కాదు. దానితో పాటు అది సమాఖ్య విధానము కూడాను. దీనిమూలంగా ప్రభుత్వం చెలాయించే అధికారాలలో కొన్ని కేంద్ర ప్రభుత్వానికి, మరికొన్ని రాష్ట్ర ప్రభుత్వాలకు కేటాయింపబడినవి. రాజ్యాంగం చేసిన ఈ కేటాయింపుకు లోబడి రెండు స్థాయిలలోని ప్రభుత్వాలు వాటి పరిపాలనను సాగించడం అవసరం. అయినా వాటి మధ్య అభిప్రాయ భేదాలు ఉత్పన్నం కావడం తప్పదు. 1967 వరకు కేంద్రంలోను, రాష్ట్రాలలోను కాంగ్రెసు పక్షం ఒక్కటే అధికారంలో ఉండిన కారణంగా వాటి మధ్య అభిప్రాయ భేదాలు ఉత్పన్నమైనప్పుడు అవి కలహాలకు దారితీయలేదు. సమష్టి కుటుంబంలో అన్నదమ్ముల మధ్య ఏర్పడే అభిప్రాయ భేదాలు పరిష్కారమైనట్లే కాంగ్రెసు అధిష్ఠాన వర్గం (Working Committee) కేంద్ర, రాష్ట్రాల మధ్య ఏర్పడిన అభిప్రాయ భేదాలను పరిష్కరిస్తూ ఉండేది. కాని 1967 తర్వాత కేంద్రంలో కాంగ్రెసు పక్షం, కొన్ని రాష్ట్రాలలో కాంగ్రెసేతర పక్షాలు అధికారంలోకి రావడంచేత ఈలాటి పరిష్కారం సాధ్యం కాలేదు. ప్రధానంగా కేరళలోను, పశ్చిమ బెంగాలులోను వామపక్ష ప్రభుత్వాలు కేంద్ర ప్రభుత్వాన్ని ఎదిరించుటకు, బెదరించుటకు సిద్ధపడినవి. కేంద్ర ప్రభుత్వం తమ ప్రభుత్వంపట్ల పక్షపాతవైఖరితో ప్రవర్తిస్తున్నట్లు ఆరోపించి ప్రజలలో కేంద్ర ప్రభుత్వాన్ని ఎదిరించవలసినదిగా ప్రోత్సహించినవి. రాష్ట్రాలలో ఉన్న కేంద్ర ప్రభుత్వ కార్యాలయాలకు అపారనష్టం కలిగించినవి. శాంతిభద్రతలను పరిరక్షించవలసిన ప్రభుత్వాలు ఈలాటి దౌర్జన్యాలకు ప్రజలను పురికొల్పడం అరాచకపరిస్థితులను సృష్టించడమే.

తమ ఆస్తులను రక్షించుటకు కేంద్ర ప్రభుత్వం తన ప్రత్యేక పోలీసు దళాన్ని పంపినపుడు దానితో సహకరించడం మాని దాని కార్యకలాపాలకు అడ్డు తగిలినవి. కేంద్ర ప్రభుత్వ ఉద్యోగులు 1968 లో సమ్మె చేసినపుడు వారిని శిక్షించుటకు కేంద్ర ప్రభుత్వం జారీ చేసిన ఉత్తర్వులను అమలుపరచుటకు కేరళ ప్రభుత్వం సిద్ధపడ లేదు. ఈలాటి కలహాలు 1967 తర్వాత అనేకం సంభవించినవి. రెండు స్థాయిలలోని ప్రభుత్వాలు కలిసికట్టుగా ప్రజలను రక్షించడమూ, వారి శ్రేయస్సును వృద్ధిచేయడమూ అవసరమనే సామాన్య సూత్రాన్ని విస్మరించడం జరిగింది. ఈలాంటి అవాంఛనీయ పరిణామాలను అరికట్టుటకు రాష్ట్రాలలో రాష్ట్రపతి పరిపాలనను విధించవలసి వచ్చింది. సమాఖ్య పరిపాలనా విధానాన్ని నిలబెట్టుటకు రెండు స్థాయిలలోని ప్రభుత్వాలు పరస్పర అవగాహనతోను, సామరస్యంతోను ప్రవర్తించడం ఎంతైనా అవసరం. దీనిని కొన్ని రాష్ట్ర ప్రభుత్వాలు గ్రహించని కారణంగా తాత్కాలికంగా సమాఖ్య విధానం అదృశ్యమైనది. ఇది అవాంఛనీయ పరిణామం. రాజకీయ పక్షాలు ఇలాంటి పరిణామానికి దారితీసే పరిస్థితులను కల్పించరాదనే విషయాన్ని గ్రహించవలసి యున్నది. 1967-'70 లోని రాజకీయాల చరిత్ర ఈ విషయాన్ని స్పష్టం చేస్తున్నది. దీనిని నేను ఆ రోజులలో గమనిస్తూ వచ్చాను. అందుచేతనే దానిని గురించి ఇక్కడ ప్రస్తావించాను.

ప్రభుత్వం ప్రజలందరి శ్రేయస్సును నిష్పక్షపాతంగా అభివృద్ధి చేయవలెనని అందరూ చెప్పడం కద్దు. కాని వాస్తవంలో ఇది జరగడంలేదు. ఏ వర్గం ప్రభుత్వంపై ఎక్కువ ఒత్తిడిని తీసుకొని రాగలదో దాని శ్రేయస్సును మాత్రమే వృద్ధిచేయుటకు ప్రభుత్వం చర్యలు తీసుకొనడం మామూలు. కొన్ని వర్గాలవారు ఎక్కువ ఒత్తిడని తేగల స్థితిలో ఉన్నారు. 1966 తర్వాత ప్రభుత్వ ఉద్యోగులు, సుసంఘటితమైన ట్రేడ్ యూనియన్ లు (Trade Unions) గా ఏర్పడి విజయవంతంగా సమ్మెలు కొనసాగించగల కార్మిక వర్గాలు, విద్యార్థులు ఈ స్థితిలో వుండినారు. వీరి ఒత్తిడిని ఎదుర్కొనడం సాధ్యంకాక ప్రభుత్వం వారి వాంఛలను

విధిలేక తీర్చవలసి వచ్చింది. యుద్ధంలో ఏ పక్షానికి ఎక్కువ సైనికబలం, సంఖ్యాబలం, ఆయుధబలం, క్రమశిక్షణకు సంబంధించినబలం వున్నవో ఆ పక్షం విజయాన్ని సాధించడం అందరికీ తెలిసిన విషయమే. అలాటిపక్షం ఎదుటి పక్షంపై ఎక్కువ ఒత్తిడిని సాగించడమే దీనికి కారణం. అలాగే ప్రభుత్వాన్ని లొంగదీయడంలో ఎక్కువ బలంగల వర్గాలు కొన్ని వున్నవి. ప్రభుత్వం వారిని ఎదుర్కొనడం సాధ్యంకాక వారి కోర్కెలను తీర్చడం జరుగుతూ వున్నది. ఇది 1966 తర్వాత రాజకీయ రంగంలో జరిగిన పరిణామాలలో ప్రాధాన్యం వహించింది.

పల్లె ప్రాంతాలలోని భూస్వాములు ఈలాటి వర్గాలలో ఒకరు. ఎన్నికలలో వీరికే ఎక్కువ పలుకుబడి వుండడము, దానిమూలంగా వీరే ఎక్కువ సంఖ్యలో పార్లమెంటుకు, రాష్ట్ర శాసన సభలకు ఎన్నిక కావడం, ప్రభుత్వ అధిష్ఠాన వర్గంలో వుండడం లేకపోవడం వీరి ఓటుపై ఆధారపడి వుండడం దీనికి కారణం. ప్రజల వాంఛలను తీర్చడంలో ప్రభుత్వం వీరి వాంఛలకు అగ్రస్థానం కల్పిస్తున్నది.

ఇదేవిధంగా ఇతర సాహుకారీ వర్గాలవారు ప్రభుత్వంపై ఎక్కువ ఒత్తిడిని తీసుకొనిరాగల స్థితిలో ఉన్నారు. ఎన్నికలలో ప్రభుత్వానికి కావలసిన ధనసహాయాన్ని విరాళాలద్వారా అందచేయుటకు వీరికి గల ప్రాబల్యం ఇతరులకు లేకపోవడం దీనికి కారణం. విరాళాలు చెల్లించినందుకు ప్రత్యుపకారంగా వీరి వాంఛలను తప్పకుండా తీర్చవలసిన అవసరం ప్రభుత్వానికి ఏర్పడుతున్నది.

ఈలాటి స్థితిలో ఉన్నారు. మూడవ వర్గం ప్రభుత్వోద్యోగులు. ఇటీవలికాలంలో వీరు కూడా సుసంఘటితమైన సంఘాలుగా ఏర్పడి, విజయవంతంగా సమ్మెలు సాగించగల స్థితిలో ఉన్నారు. వీరు సమ్మెచేసిన పక్షంలో పరిపాలన యంత్రాంగం స్తంభించి పోతుంది. అందుచేత వీరి సమ్మెలను ఎదుర్కొనలేక, వీరి కోరికలను ప్రభుత్వం తీర్చడం పరిపాటి అయింది. దీనిఫలితంగా వీరికి ముట్టవలసిన జీతాలు, బత్యాలు, అలవెన్సులు విపరీతంగా

పెరిగిపోయినవి. ధరల పెరుగుదల మూలంగా మధ్యతరగతి, బలహీన వర్గాలకు చెందినవారు జీవితాన్ని సాగించడం సాధ్యం కాకపోయినా, ధరల పెరుగుదలకు అనుగుణంగా ప్రభుత్వోద్యోగుల జీతాలను పెంచడం మామూలుగా పరిణమించింది. ఇతర వర్గాలు ఇందు నిమిత్తం ఎక్కువ పన్నులను చెల్లించవలసి ఉంది. వారి కష్టాలను ప్రభుత్వం గమనించదు. ఉద్యోగులు ఒత్తిడి చేయ గలిగినట్లు వీరు ఒత్తిడి చేయలేకపోవడమే దీనికి కారణం.

నగరాలలో, ఫ్యాక్టరీలలో పనిచేసే కార్మికులు, రైల్వే కార్మికులు సుసంఘటితములైన ట్రేడ్ యూనియన్‌లను ఏర్పరచు కొనిన కారణంగా సమ్మెలద్వారా ప్రభుత్వంపై ఎక్కువ ఒత్తిడిని తేగలిగి యున్నారు. వీరిని ఎదుర్కొనడం సాధ్యం కాక, వీరి కోరికలు న్యాయసమ్మతములు కాకపోయినా వాటిని ప్రభుత్వము, ఫ్యాక్టరీ యజమానులు తీర్చడం మామూలు. వ్యవసాయ కూలీ లకు ట్రేడ్ యూనియన్‌లను ఏర్పాటు చేసుకొనడం గాని, సమ్మెల లోకి దిగడం గాని సులభసాధ్యం కాదు. అందుచేత ప్రభుత్వం గాని, భూస్వాములు గాని వారి వాంఛలను తీర్చుటకు సిద్ధంగా లేరు. ఫ్యాక్టరీల కార్మికులు మంచి స్థితిలో ఉండుటకు, వ్యవసాయ కార్మికులు హీన స్థితిలో ఉండుటకు ఇదియే ప్రధాన కారణం. 'సంఘీభావం బలం' అనే ప్రాచీనసూక్తి అన్నికాలాలలో వర్తిస్తున్నది. 1966 తర్వాత కార్మికుల సమ్మెల సంఖ్య విపరీతంగా పెరిగినది. దేశంలో ఉత్పత్తి ఎంతో దెబ్బ తిన్నది. కాని విజయవంతంగా కొన్ని వర్గాలవారు సమ్మెలు సాగించగల స్థితిలో ఉండడంచేత వారి స్థితి మెరుగుపడడం, తక్కినవారి స్థితి మరింత దిగజారి పోవడం తప్పింది కాదు. ప్రభుత్వం నిష్పక్షపాతంగా అన్నివర్గాల శ్రేయస్సును అభివృద్ధిచేసే సంస్థ అనేది పుక్కిటి పురాణం. వాస్తవంలో ఎక్కువ ఒత్తిడి చేయగలవారిపట్ల ఎక్కువ శ్రద్ధను వహించడం జరుగుతూ ఉంది. దేశంలో ఉత్పత్తి పెరిగినా కొందరు మాత్రమే మంచి స్థితిలో ఉండుటకు, తక్కినవారు దారిద్ర్యాన్ని అనుభవిస్తూ ఉండుటకు ఇదే కారణం. అన్నివర్గాలవారు సుసంఘటితులు కావడం ఒక్కటే సాంఘిక న్యాయాన్ని ( Social Justice ) చేకూర్చుటకు సాధనం.

1966 తర్వాత విద్యార్థులు ఒక రాజకీయ వర్గంగా ఏర్పడి ప్రభుత్వంపై ఒత్తిడి తెచ్చి, తమ వాంఛలను కొంతవరకైనా తీర్చుకొనగలిగినారు. ఇది కూడా మనం గుర్తించవలసిన రాజకీయ పరిణామం. వందేమాతరం ఉద్యమము లోను, స్వాతంత్ర్యోద్యమంలోను రాజకీయోద్దేశాలను సాధించుటకు విద్యార్థులను వినియోగించడం పరిపాటి అయింది. పరాయి ప్రభుత్వాన్ని తొలగించి దేశానికి స్వాతంత్ర్యాన్ని సంపాదించడంలో ప్రజలతో, విద్యార్థులతో సహా అన్ని వర్గాలవారు పాల్గొనవలెనని, అప్పుడుగాని స్వాతంత్ర్యోద్యమం జాతీయోద్యమం కాజాలదని మహాత్మాగాంధీ వాదించడంలో కొంత ఔచిత్యం ఉండినది. ఇంతేకాదు. ఆయన తన ఉద్యమాన్ని అహింసతో కూడినదానిగా సాగించాడు. ఇదిగాక ఒక నిర్మాణ కార్యక్రమాన్ని కూడా స్వాతంత్ర్యోద్యమంతో జోడించి, అందులో పాల్గొనవలసిందిగా విద్యార్థులను ప్రోత్సహించాడు. ఈ కారణాలచేత విద్యార్థులు రాజకీయాలలో ఆనాడు పాల్గొనడం ఎలాంటి అవాంఛనీయ పరిణామాలకు దారి తీయలేదు. వారిని దేశాభిమానపూరితులుగా చేయడంలోను, సాంఘికసేవ చేసేవారినిగా చేయడంలోను అది పటిష్ఠ సాధనమైంది.

కాని 1966 తర్వాత గొప్ప ఆశయాలను సాగించుటకు విద్యార్థులకు రాజకీయాలలో ప్రవేశం లేదు. సంకుచితములైన ఆశయాలతో వారు వాటిలో ప్రవేశించారు. విశాఖపట్నంలో ఒక ఉక్కు కర్మాగారాన్ని స్థాపించుటకు, ప్రత్యేక తెలంగాణా రాష్ట్రాన్ని, ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రాన్ని నిర్మాణం చేయుటకు వారు రాజకీయాలలో ప్రవేశించారు. ఇంతే కాదు. వారు దౌర్జన్య సాధనాలను వినియోగించారు. దుండగులవలె భవనాలను, దుకాణాలను, బస్సులను, కార్లను, ఇతర ఆస్తులను తగలబెట్టి ఆస్తులకు, ప్రాణాలకు అపారమైన నష్టాన్ని కలిగించారు. ప్రజాస్వామికంలో ఈలాటి ఉద్దేశాలను ప్రజాభిప్రాయం ద్వారాను, ఎన్నికల సాధనచేతను నెరవేర్చుటకు ఎంతైనా అవకాశం వున్నది. ప్రజాస్వామికంలో ప్రత్యక్షచర్యకు అందులోను దౌర్జన్యంతో కూడిన చర్యకు ఎలాటి అవసరం లేదు. కాని

విద్యార్థులు దీనిని విస్మరించారు. విద్యార్థులు స్వతంత్ర భారతంలో ఈలాటి చర్యలలో దిగుటకు ఎంతమాత్రం అవసరం లేదు. రాజకీయ నాయకులు స్వార్థపరులై విద్యార్థులను, వారి ఉత్సాహాన్ని ఈవిధంగా దుర్వినియోగం చేయడం వారిని పెడ త్రోవలో పెట్టడమే. విశ్వవిద్యాలయాలలోను, కళాశాలలలోను నాయకత్వం వహించిన విద్యార్థులు ధనిక భూస్వామిక వర్గానికి చెంది, విద్యపట్ల ఎలాటి ఆసక్తి లేనివారు. నాయకులుగా పేరు సంపాదించడమే వారి లక్ష్యంగా రూపొందింది గొర్రె దాటుగా అలాటివారిని అనుసరించడం తక్కిన విద్యార్థులకు పరిపాటి అయింది. ఏదో ఒక నెపాన్ని ఆధారం చేసుకొని సమ్మెలు లేవదీయడం నాయకత్వం వహించినవారి ధ్యేయమైంది. దేశంలో శాంతి భద్రతలు అడుగంటినవి. శాసనసభలలోని రాజకీయ నాయకులు, మంత్రులతో సహా విద్యార్థులను ప్రోత్సహించేవారు కావడంచేత వారిపై చర్యలను తీసుకొనుటకు పోలీసు అధికారులు భయపడ సాగారు. విద్యార్థులు విద్యావిధానాన్ని సంస్కరించుటకు రాజకీయాలలో ప్రవేశించడాన్ని కొంతవరకు క్షమించవచ్చు. కాని విద్యావిధానంతో ఎలాటి సంబంధంలేని కార్యక్రమాలలో పాల్గొనడం ఏ పరిస్థితులలో కూడా క్షంతవ్యం కాజాలదు. 1966 తర్వాత విద్యార్థులు ఈలాటి కార్యక్రమాలను మాత్రమే సాగించారు. విద్యను ఆర్జించి, తద్వారా దేశాభివృద్ధిలో ప్రధాన పాత్ర వహించడం తమ కర్తవ్యమనే దానిని విస్మరించి సంకుచిత మనస్తత్వంతో ఈవిధంగా ప్రవర్తించారు.

గుజరాత్‌లోను, బీహార్‌లోను వారు లేవదీసి సాగించిన ఉద్యమాలు ఈలాటి కార్యక్రమాలకు మినహాయింపులుగా గుర్తించడం అవసరం. విద్యార్థుల ప్రవర్తన 1966 తర్వాత దేశంలోని రాజకీయ వాతావరణాన్ని పూర్తిగా కలుషితం చేయుటకు తోడ్పడినది. విద్యార్థులను మంచిమార్గాలలో నడిపించుటకు ఇందిరా గాంధి గాని, ఇతర నాయకులు గాని ఎలాటి ప్రయత్నము చేయకపోవడం విచారకరం.

1969 జనవరి నుండి ప్రత్యేక తెలంగాణా రాష్ట్రం నిర్మాణం కావలెననే ఉద్దేశంతో స్వార్థపరులైన రాజకీయ

నాయకులు, విద్యార్థులు, యన్. జి. ఒ. ఉద్యోగి వర్గం (గుమస్తాలు మొదలైన క్రింది వర్గానికి చెందినవారు), తెలంగాణాలోని వర్తకులు, వ్యాపారస్థులు (వీరిలో అధిక సంఖ్యాకులు మొగలాయీల కాలంలోను, నిజాం పరిపాలనా కాలంలోను ఉత్తర భారతదేశం నుండి వచ్చినవారు), మధ్య తరగతికి, ధనికవర్గానికి చెందిన భూస్వాములు ఈ ఉద్యమంలో పాల్గొన్నారు. 1956 లో ఆంధ్ర ప్రదేశ్ నిర్మాణమైనపుడు తెలంగాణా ప్రత్యేక అవసరాలను తీర్చుటకు తెలంగాణా నాయకులు, ఆంధ్ర నాయకులు కలిసి ఒక ఒడంబడికను చేసుకొన్నారు. ఇందులోని షరతుల నన్నిటిని 1956–1969 మధ్య ప్రభుత్వం చెల్లించినట్లు (ఒకటి రెండు అంశాలు మినహాగా) తెలంగాణా ఉద్యమాన్ని గురించి నిష్పక్షపాతంగా పరిశీలించిన కె. వి. నారాయణరావుగారు వారి గ్రంథంలో స్పష్టపరచారు. అయినప్పటికి తెలంగాణాలోని అనేకవర్గాల వారు ప్రత్యేక తెలంగాణారాష్ట్ర ఉద్యమాన్ని లేవదీసి హైదరాబాదు, మరికొన్ని పట్టణాలలోని ఆంధ్రులను భీతావహుల చేసి వారిపట్ల భీభత్సంగా ప్రవర్తించడం విచారకరం.

విద్యార్థులు, యువకులైన ఇతరులు, జంటనగరాలలోని దుండగులు ఈ భీభత్స కార్యక్రమాలలో ఎక్కువగా పాల్గొన్నారు. మంత్రిపదవులను కోల్పోయిన రాజకీయ నాయకులు వారిని ప్రోత్సహించారు. మార్వాడీ వర్తకులు వారికి కావలసిన ద్రవ్య సహాయం చేశారు. ఉద్యమ కర్తలు బందులు సాగించి ఆర్థిక జీవితాన్ని స్తంభింప చేశారు. దుకాణాలను లూటీ చేశారు. కొన్నిటిని దగ్ధం చేశారు. ఆంధ్రులను అవమానపరుస్తూ గోడలమీద అశ్లీలమైన ప్రకటనలను ప్రకటించారు. ఆంధ్ర నుండి తెలంగాణాకు వచ్చే రైళ్ళను అటకాయించి, ప్రయాణీకులకు నష్టం కలిగించారు. స్త్రీలను అవమాన పరచారు. నల్గొండ వంటి నగరాలలోని ఆంధ్ర ఉద్యోగుల ఇండ్లలో ప్రవేశించి స్త్రీలను అవమానపరచారు. ఈ బాధలలో కొన్నిటిని నేను, నా కుమారుడు ఆనందం, నా కుటుంబములోని వారం స్వయంగా అనుభవించాము. బహిరంగంగా మా కారులో ప్రయాణం చేయడం కష్టసాధ్యమైంది. విద్యాలయాలను మూసివేశారు. ఏప్రిల్, మే లో జరగవలసిన

పరీక్షలను సక్రమంగా నిర్వహించడం సాధ్యం కాకపోయింది. కర్నూలు మొదలైన కేంద్రాలలో తెలంగాణాలోని విద్యార్థులు పరీక్షలు వ్రాయవచ్చునని ప్రభుత్వం నిర్ణయించినా ఇది ఆచరణ సాధ్యం కాలేదు. ఆనాడు బ్రహ్మానందరెడ్డిగారు ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిగా వుండినారు. వారి ప్రత్యర్థి డాక్టర్ మర్రి చెన్నారెడ్డి గారు కేంద్రంలో మంత్రిత్వాన్ని కోల్పోయి ( 1967 లో వారి ఎన్నిక చెల్లదని హైకోర్టు తీర్పు చెప్పడం, సుప్రీం కోర్టు దానిని ఖాయంచేయడం దీనికి కారణం ) నిరుద్యోగిగా హైదరాబాదుకు వచ్చి ప్రత్యేక తెలంగాణా ఉద్యమానికి నాయకు లయ్యారు. దౌర్జన్యం సాగించే వారిపై కఠినచర్యలు తీసుకొనుటకు బ్రహ్మానందరెడ్డిగారు సిద్ధపడలేదు. ఇందిరాగాంధి కూడా ఆ రోజులలో పార్లమెంటులో మెజారిటీ బలాన్ని కోల్పోయిన కారణంగా సకాలంలో తెలంగాణా ఉద్యమాన్ని గురించి నాయకులతో సంప్రదించి, వారి మధ్య రాజీ కుదర్చలేకపోయింది. 1969 లో ఉధృతంగా వివిధరకములైన దౌర్జన్యాలతో ఉద్యమం కొనసాగింది.

నేను ఆరోజులలో కొన్ని బహిరంగ సభలలో విద్యార్థులు వివాదాస్పదములైన రాజకీయాలలో పాల్గొనరాదనే నా అభిప్రాయాన్ని వ్యక్తం చేశాను. కాని అలాంటి సమావేశాలను జరుపుటకు అనేకులు భయపడినారు. యువక అధ్యాపకుల సంఘం ఒక సమావేశాన్ని ఏర్పాటు చేసి, అందులో పాల్గొన వలసిందిగా నన్ను ఆహ్వానించింది. నేను దానికి అంగీకరించాను. కాని సంఘంవారు అలాంటి సమావేశాన్ని జరపడం ప్రమాద కరమనే భయంతో దానిని రద్దు చేశారు. ఇంకొక సమావేశం కూడా ఇలాగే రద్దయిపోయింది. రాజ్యాంగం ద్వారా మనకు లభించిన వాక్స్వాతంత్ర్యం, సంఘస్వాతంత్ర్యం ( Freedom of Association ), ప్రయాణ స్వాతంత్ర్యం మొదలైనవి ఆనాటి దౌర్జన్య పూరిత వాతావరణంలో ఆచరణసాధ్యం కాలేదు. ప్రజలలో అనేకులు దౌర్జన్యవాదులైనప్పుడు అలాంటి వారిపై కఠినచర్యలను తీసుకొని వ్యక్తుల స్వాతంత్ర్యాన్ని రక్షించుటకు ప్రభుత్వం భయపడినప్పుడు రాజ్యాంగం ప్రసాదించిన మౌలిక

హక్కులు ఆచరణసాధ్యం కాజాలవు. సంఘవిద్రోహ చర్యలకు పాల్పడే వారిని కఠినంగా శిక్షించగల ప్రభుత్వం దేశంలో ఉన్నప్పుడే అవి ఆచరణసాధ్యం కాగలవు. 1969 లోను, ఆటు తర్వాతను ఆలాటి ప్రభుత్వం కేంద్రంలో గాని, రాష్ట్రంలో గాని లేకపోయింది. అందుచేత వ్యక్తుల మౌలిక హక్కులకు ప్రమాదం కలిగించే దౌర్జన్య శక్తులు విశృంఖలంగా తాండవమాడి ప్రజలను భీతావహుల చేయ గలిగినవి.

విద్యారంగంలో నేను కొంత ప్రఖ్యాతిని సంపాదించడంచేత నా కార్యభారం నా శారీరక శక్తికి మించినట్లుగా పెరిగిందని ఇదివరలో చెప్పినాను. జిల్లా గెజెటీయర్ల రచనలో సంపాదకులు తయారుచేసిన చిత్తు డ్రాఫ్టులను (Drafts) సంస్కరించడంలో ఆనాడు ప్రభుత్వ ప్రధాన కార్యదర్శిగా యుండిన కె. యస్. అనంతరామన్‌గారు నా పైన గొప్ప బాధ్యతను విధించారు. నా శక్తి సామర్థ్యాల పట్ల వారికి గల విశ్వాసమే దీనికి కారణము. దీని ఫలితంగా కొంతకాలం రోజుకు నాలుగైదు గంటలు ఈ సంస్కరణ కార్యక్రమానికై వినియోగించ వలసి వచ్చింది. నేను సంస్కరించిన తర్వాత డ్రాఫ్టును అనంతరామన్‌గారు పర్యవేక్షించి ఆమోదించడం మామూలైంది. నేను బాధ్యతతో సంస్కరించాననే విశ్వాసం సంపాదకీయవర్గానికి కలగడంచేత సంపాదకీయ సమావేశాలలో నాచే సంస్కరింపబడి అనంతరామన్‌గారు ఆమోదించిన డ్రాఫ్టులను విస్తారం చర్చలతో నిమిత్తం లేకుండ ఆమోదించడం పరిపాటి అయింది. సంపాదకులుగా శివశంకర నారాయణగారి స్థానే ఎం. వి. రాజగోపాల్, ఐ. ఏ. యస్. (I.A S.) నియమితులైన తర్వాత గెజిటీయర్ల రచనా కార్యక్రమం పూర్తిగా మారింది. అప్పటికి నేను సంపాదకవర్గ సభ్యత్వానికి రాజీనామా చేశాను.

పై కారణం మూలంగానే ఇంటర్మీడియేట్, బి. ఏ. తరగతులకు తెనుగులో పాఠ్యగ్రంథాలు వ్రాయించుటకు ఏర్పడిన కమిటీకి ప్రభుత్వం నన్ను అధ్యక్షునిగా నియమించింది. దీనిని గురించి ఇదివరకే ప్రస్తావించాను. తెలుగు అకాడమి స్థాపింప

బడడంతో ఈ కమిటీకి అవసరం లేకపోయింది. కాని రెండు సంవత్సరాలకాలం నేను దీని కార్యక్రమాలలో నిమగ్నుడనై ఉండినాను. ఈ అనుభవం మూలంగా శ్రద్ధతో పాఠ్యగ్రంథాలను రచించగలవారు ఆం(ధ్ర)ప్రాంతంలో ఎక్కువమంది లేరని నేను తెలిసికొన్నాను. ఈలాంటి రచనకు కావలసిన శక్తి సామర్థ్యాలు, మనోవైఖరి, పట్టుదల గలవారి సంఖ్య చాలా తక్కువ. అనేకుల దృష్టి వారికి లభించే పారితోషికంమీదనే ఉంటుంది.

విద్యారంగంలో నేను గడించిన ప్రఖ్యాతి కారణంగా ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ బ్రహ్మానందరెడ్డిగారి షష్ఠిపూర్తి ఉత్సవమును జరుపుటకు ఏర్పాటు చేయబడిన అనధికారుల కమిటీకి నన్ను అధ్యక్షునిగా ఎన్నుకొన్నారు. నేను ఈ పదవిని అతిసంతోషంతో అందుకొని నిర్వహించాను. బ్రహ్మానందరెడ్డి గారికి, ఆయన భార్యకు నాపట్ల, నా భార్యపట్ల అత్యంత గౌరవము. అలాంటి వారి షష్ఠిపూర్తి ఉత్సవంలో ప్రధాన పాత్రను ధరించడం నా కర్తవ్యంగా భావించాను. ఈ ఉత్సవంలో ప్రభుత్వంయొక్క గాని, రాజకీయ నాయకులయొక్క గాని జోక్యం ఏలాటిది లేదు. హిందూపత్రిక ప్రత్యేక విలేఖరి కమిటీకి కార్యదర్శిగా యుండి వారి భార్య సహాయంతో కార్యక్రమాన్ని సాగించుటకు సిద్ధపడి, నా కార్యభారాన్ని చాలావరకు తగ్గించారు. ఈసందర్భంలో శ్రీ కపిల కాశీపతిగారు బ్రహ్మానందరెడ్డిగారి జీవితాన్ని గురించి ఒక ప్రశస్తమైన గ్రంథాన్ని రచించి ప్రకటించారు. ఆంధ్రదేశ చరిత్రలో అనేక సంఘటనలను చక్కగా ఇందులో వారు వివరించారు. ఇదిగాక నా సంపాదకత్వాన అనేక వ్యాసాలతో కూడిన ఒక సోవినీర్ (Souvenir) సంచికను ప్రకటించాము.

1970 జూలై 27 న షష్ఠిపూర్తి ఉత్సవం అతివైభవంగా జూబిలీ హాలులో జరిగింది. సమావేశానికి ఆంధ్రప్రదేశ్ గవర్నరు అధ్యక్షత వహించారు. కంచి కామకోటి పీఠాధిపతి, శృంగేరి మఠాధిపతి వారి శిష్యులను పంపి రెడ్డి దంపతులకు బహుమానాలను అందజేసి ఆశీర్వదించారు. అటుతర్వాత నేను నా అధ్యక్షోపన్యాసం చదివాను. నా భార్య రెడ్డిగారి భార్యకు ఒక చీరెను కానుకగా ఇచ్చి సత్కరించింది. ఉత్సవాన్ని ఏర్పాటు చేసినవారికి

రెడ్డిగారు తమ కృతజ్ఞతలను తెలియపరచారు. మొత్తంమీద ఉత్సవం అందరికి తృప్తి కలిగించింది. అందులో ఒకవిధంగా నేను ప్రధాన పాత్ర వహించినందుకు ఎంతగానో సంతోషించాను. సమావేశానికి నాతోపాటు నా భార్య, నా కుమారుడు ఆనందం, నా కోడలు సీత, నా మనుమరాండ్రు శాంత, డాక్టర్ కృష్ణవేణి వచ్చారు.

అప్పటికి కొన్నిసంవత్సరాలుగా సాంఘికశాస్త్ర పాఠ్య ప్రణాళికను సంస్కరించి కొత్త పాఠ్యప్రణాళికను తయారు చేయుటకు ప్రభుత్వం నియమించిన కమిటీకి నేను అధ్యక్షుడుగా ఉండినాను. ఆంధ్ర జిల్లాలు మద్రాసు రాష్ట్రంలో ఒక భాగంగా ఉన్నప్పుడు మద్రాసు ప్రభుత్వం ఒక నిపుణుల కమిటీని నియమించి, అది తయారుచేసిన ప్రణాళికను ప్రవేశపెట్టింది. ప్రణాళికను అనుసరించి 1949 లో నేను మొదటి ఫారం వరకు ఆరు పాఠ్య గ్రంథాలను రచించాను. ఆంధ్రప్రదేశ్ నిర్మాణమైన తర్వాత ఈ ప్రణాళికను, దానినను సరించి వ్రాయబడిన పాఠ్యగ్రంథాలను ఆంధ్ర ప్రభుత్వం దాని అధీనంలోని విద్యాలయాలలో ప్రవేశ పెట్టింది.

కాని క్రమక్రమంగా పాఠ్యగ్రంథాలను వ్రాయించే బాధ్యతను ప్రభుత్వం స్వీకరించి, వాటిని జాతీయం చేయవలెననే వాదం బలపడింది. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం కూడా పాఠ్య గ్రంథాలను జాతీయం చేయుటకు నిర్ణయించింది. ఆ సందర్భంలో నా అధ్యక్షతన సాంఘికశాస్త్ర పాఠ్య ప్రణాళికను సవరించుటకు, సవరించిన ప్రణాళికకు అనుగుణంగా పాఠ్యగ్రంథాలను వ్రాయించుటకు ఒక కమిటీని ఏర్పాటు చేయడం జరిగింది. యస్. సి. ఇ. ఆర్. టి. (S. C. E. R. T.) డైరెక్టర్ దీనికి కార్యదర్శిగా పనిచేశారు. కమిటీలో ఉస్మానియా విశ్వవిద్యా లయంలో సామాజికశాస్త్రశాఖ (Sociology) కు ప్రధానా చార్యులైన లక్ష్మన్నగారు, భూగోళశాఖలో రీడరు శ్రీ విద్యా నాథ్ గారు, హైదరాబాదు కళాశాలలో ఒక దానికి ప్రిన్సిపాలుగా ఉండిన వై. వి. రమణగారు, ఆంధ్రప్రదేశ్ విద్యాశాఖ డైరెక్టరు పి. ఆదినారాయణగారు సభ్యులుగా ఉండినారు. సభ్యులందరు వారి

వారి ప్రత్యేక శాఖలలో గొప్ప పేరు ప్రఖ్యాతులను ఆర్జించినవారు. కాని సాంఘికశాస్త్రాన్ని గురించి ఎలాంటి పరిశోధనను గావించిన వారు కాదు.

బ్రిటిషు పరిపాలనా కాలంలో ప్రతిరంగంలోను బ్రిటన్‌లోని విధానాలు అత్యుత్తమములనీ, వాటిని భారతదేశంలో ప్రవేశ పెట్టడం ఉచితమనీ అధికారులు భావించడం సహజమే. అక్కడి విద్యావిధానంలో దేశచరిత్ర, భూగోళము, పౌరశాస్త్రం (Civics) ఒక దానితో ఇంకొకటి సంబంధంలేని ప్రత్యేక పాఠ్య విషయాలుగా ప్రవేశపెట్టారు. కాని 1940 ప్రాంతాన బ్రిటన్ లోను, అంతకంటే అధికంగా అమెరికాలోను విద్యార్థులకు బోధించవలసిన విషయం సంఘానికి, వ్యక్తికి గల సంబంధమని, వ్యక్తుల జీవితంపై సంఘంయొక్క ప్రభావం ఎలాంటిదో, అలాగే సంఘపు జీవితంపై వ్యక్తుల ప్రభావం ఏలాటిదో విద్యార్థులు తెలుసుకొన్నప్పుడే వారు వాస్తవంగా విద్యావంతులు కావడం జరుగుతుందని, ఈ పరస్పర సంబంధం ఏర్పడుటలో చరిత్ర, భూగోళము, పరిపాలనా విధానము, మతము, కళలు మొదలైన వన్నీ ప్రభావం వహిస్తున్నవని, అందుచేత సాంఘికజీవితంపైన, వ్యక్తి జీవితంపైన (సంఘానికి వ్యక్తికిగల పరస్పర సంబంధాన్ని తెలియపరచే శాస్త్రమే సాంఘికశాస్త్రం) ఇవి ఎలాగు ప్రభావం వహిస్తున్నవో తెలుసుకోనడం విద్యార్థులకు అవసరమని— ఈ విషయాలను ప్రత్యేకంగా బోధించుటకు బదులు, వీటి మధ్య సమన్వయం కుదిర్చి సాంఘికశాస్త్రంలో వీటికి గల ప్రాధాన్యాన్ని స్పష్టం చేయడమే ఉత్తమ విద్యావిధానమనే అభిప్రాయం వ్యాపించింది. 1940 ప్రాంతాన మన విద్యాధికులు కూడా దీనిచే ప్రభావితులైనారు. అప్పటినుంచి దేశచరిత్ర, భూగోళము, పౌరశాస్త్రము వీటిని ప్రత్యేక విషయాలుగా బోధించరాదనీ, సాంఘికశాస్త్రంలో అంతర్భాగాలుగా బోధించడం అవసరమనే భావం ప్రాబల్యం గాంచింది. సాంఘికశాస్త్రాన్ని విద్యాలయాలలో ప్రవేశపెట్టుటకు ఈ భావం ప్రధాన కారణము.

పాఠ్యప్రణాళికను సంస్కరించుటకు నా అధ్యక్షతన ఏర్పాటు చేయబడిన కమిటీలోని సభ్యులు దేశచరిత్ర, భూగోళం,

పౌరశాస్త్రము విడివిడిగా బోధించడమే ఉత్తమవిధాన మని విశ్వసించినారు. 1940 ప్రాంతాన నుండి బ్రిటన్‌లోను, అమెరికా లోను అభివృద్ధి గాంచిన సాంఘికశాస్త్రంతో వారికి ఎక్కువ పరిచయంలేదు. నేను మద్రాసులో ఉన్నప్పుడు దీనిని గురించి అమెరికన్లు వ్రాసిన గ్రంథాలను కొన్నిటిని చదివిన కారణంగా నాకు దానితో కొంత పరిచయం కలిగింది. కాని కమిటీలోని ఇతర సభ్యులకు ఈలాటి పరిచయం లేనందున నూతన దృక్పథంతో సాంఘికశాస్త్ర పాఠ్యప్రణాళికను తయారుచేయడం సాధ్యం కాలేదు. మేము ప్రణాళికను సంస్కరించాము కాని అందులో కూడా దేశచరిత్ర, భూగోళము, పౌరశాస్త్రము వేర్వేరు విషయాలుగానే ఉండిపోయినవి. వీటిమధ్య సమన్వయం జరగ లేదు. ఢిల్లీ ఎన్. సి. ఇ. ఆర్. టి. (N. C. E. R. T) నుంచి మాకు సహాయం చేయుటకు వచ్చిన సభ్యులుకూడా ఈదృక్పథంతో మా కార్యక్రమంలో తోడ్పడలేదు. అందుచేత ఇప్పటికికూడా పైన పేర్కొన్న మూడు విషయాలు విడివిడిగానే బోధింప బడుచున్నవి. ఇదివరలో విద్యార్థులు ఒక్కొక్క విషయాన్ని గురించి ఒక గ్రంథాన్ని చదివేవారు. ఇప్పుడు అలాగుకాక మూడు విషయాలు ఒకే సాంఘికశాస్త్ర గ్రంథంలో చేర్చబడినవి. మా సంస్కరణ మూలంగా ఆశించిన ఫలితాలు ఏవీ చేకూరలేదు.

ప్రాథమిక, మాధ్యమిక విద్యాలయాలలోని విద్యార్థులకు బోధించదగిన సాంఘికశాస్త్ర స్వభావము, దాని ఆశయాలు, వాటిని తీర్చుటకు అనుసరించదగిన విధానాలు మొదలైన విషయాల గురించి ఎన్. సి. ఇ. ఆర్. టి. (N. C E. R. T.) ప్రయో గాత్మకములైన పరిశోధనలను గావించడం ఎంతైనా అవసరం. రాష్ట్రంలోని అధ్యాపకుల శిక్షణ కళాశాలలు (Teachers' Training Colleges) ఈ పరిశోధన కార్యక్రమంలో పాల్గొనడం కూడా అవసరం. ఈ రెండు సంస్థలు పరస్పర సహకారంతో కొన్ని సంవత్సరాలు పరిశోధన గావించిన తర్వాతనే సాంఘికశాస్త్ర పాఠ్యప్రణాళికను సంస్కరించడం, ఉత్తమములైన పాఠ్యగ్రంథా లను వ్రాయడం సాధ్యం కాగలదు. ఇందుకు కావలసిన

కార్యక్రమాన్ని జరిపించుటకు ప్రభుత్వం తగిన చర్యలను తీసుకొన వలసి ఉన్నది.

కమిటీవారు పాఠ్యప్రణాళికను తయారుచేసిన తర్వాత ప్రణాళిక ననుసరించి పాఠ్యగ్రంథాలను వ్రాసే బాధ్యత కూడా ప్రభుత్వం వారికే ఒప్పగించింది. ఈ బాధ్యతను వహించడంలో కమిటీవారు 1–వ తరగతి మొదలు 10–వ తరగతి వరకు 10 గ్రంథాలను తెనుగులోను, 10 గ్రంథాలను ఇంగ్లీషులోను వ్రాయించవలసిన అవసరం ఏర్పడింది. ప్రభుత్వం ఈ గ్రంథ రచన అనాలస్యంగా జరగవలెనని ఆదేశించింది. పాఠ్యగ్రంథాలను వ్రాయడంలో అనుభవము, నైపుణ్యము కలవారు ఎక్కువ మంది లేకపోవడంచేత అర్హులైనవారిని ఎంపికచేయడం కష్టసాధ్యమైంది. ఒక్కొక్క గ్రంథంలో చరిత్ర, భూగోళం, పౌరశాస్త్రం అనే విడివిడి భాగాలు మూడూ ఉండడం చేత మొత్తంమీద ముప్పై రచయితలను నియమించవలసి వచ్చింది. వీరిని ఎలాగో నియమించాము. నియమింపబడిన వారిలో కొందరు తమకు కేటాయింపబడిన భాగాన్ని వ్రాయలేక మధ్యకాలంలో విరమించుకొనడంచేత వారి స్థానే ఇతరులను నియమించవలసి వచ్చింది.

ఇదిగాక గ్రంథంలో ప్రతిభాగానికి ఒక సంపాదకుని నియమించాము. కమిటీ సభ్యులే సంపాదకులుగా నియమింపబడినారు. వీరు గ్రంథకర్తలు వ్రాసిన దానిని సవరించే బాధ్యతను వహించారు. నేను వీరందరి పనులను పర్యవేక్షించే జనరల్ సంపాదకుడుగా (General Editor) పనిచేశాను.

గ్రంథకర్తలు, సంపాదకులు వారి వారి పనులను తృప్తికరంగా నిర్వహించి యుండిన పక్షంలో నేను నా పనిని సులభంగా చేయగలిగి యుండేవాడిని. కాని ఇది జరుగలేదు. అందుచేత ప్రతిగ్రంథాన్ని సరిదిద్దే బాధ్యతను నేను వహించవలసినవాడినైనాను. గ్రంథకర్తలు (ఒకరు మినహాగా) ఉద్యోగాలలో ఉండినవారు. అందుచేత వారికి కాలవ్యవధి ఎక్కువగా లేదు. నేను నిరుద్యోగిని కావడంచేత నాపైననే ఎక్కువ బరువు పడినది. గ్రంథరచనలో ఏ లోపం కనిపించినా ప్రభుత్వం

దానికి నన్నే సంజాయిషీ చెప్పవలసిందిగా కోరేది. అందుచేత నా కార్యభారం పెరిగింది.

ఇదిగాక పాఠ్యగ్రంథాన్ని వ్రాసేవారు ఏ వయస్సు విద్యార్థులకు వ్రాయవలసిందీ మనస్సులో ఉంచుకొని వారు అర్థం చేసుకొనగల విషయాలను, వారి అందుబాటులోని భాషలో వ్రాయడం అవసరం. కాని ఈ సామాన్య సూత్రాన్ని వారిలో అనేకులు గమనించినవారు కారు. భాషా విషయంలో బాధ్యత వారిది కాదు. శిష్ట వ్యవహారభాషలో పాఠ్యగ్రంథాలను వ్రాయవలసిందిగా ప్రభుత్వం నిర్ణయించినా ఇప్పటివరకు దానికి ఒక స్వరూపం ఏర్పడలేదు. అందుచేత గ్రంథకర్తలు వారి వారికి తోచిన భాషలో తమ గ్రంథాలను వ్రాయడం పరిపాటి అయింది. భాషా దృష్ట్యా అన్ని గ్రంథాలను సరిదిద్దుటకు ప్రభుత్వం ఎవరినీ నియమించలేదు. ప్రామాణికభాష ఏర్పడకపోవడం ఒక తెనుగు విషయంలోనే కాదు, తెనుగులో వ్రాసిన పాఠ్యగ్రంథాలను ఇంగ్లీషులోకి తర్జుమా చేయడంలో కూడా ఈ లోపం కనుపించింది. వీటి నన్నింటిని సంస్కరించుటకు నాకు వ్యవధి లేకపోయింది.

దిద్దిన వ్రాతప్రతులు సిద్ధం కాగానే హైదరాబాదు, సికిందరాబాదులలో ప్రాథమిక, మాధ్యమిక, ఉన్నత పాఠశాలలలోని అధ్యాపకులను వేర్వేరుగా సమావేశపరచి, వారి అనుభవాన్ని పురస్కరించుకొని గ్రంథాలను సంస్కరించుటకు సూచనలను చేయవలసిందిగా కోరినాము. కొందరు సూచనలను చేశారు. వాటి దృష్ట్యా వ్రాతపత్రాలను సరిదిద్ది అచ్చుకు పంపినాము. గ్రంథాలన్నిటికి జనరల్ సంపాదకుడుగా నేను ఒక పీఠికను వ్రాసినాను. అందులో పాఠ్యప్రణాళిక, పాఠ్యగ్రంథాలు ఏవిధంగా, ఏ ఆశయాలతో సంస్కరించబడినవో వివరించాను.

ప్రథమంలో స్వల్పసంఖ్యలో గ్రంథాలను ముద్రించి, ఒకటి రెండు సంవత్సరాలపాటు వాటిని ట్రెయినింగు విద్యాలయాలలో ఉపయోగించిన తర్వాత ఆ విద్యాలయాల అధ్యాపకులు సూచించే వివరణల దృష్ట్యా గ్రంథాలను సంస్కరించి విద్యాలయా లన్నిటిలో ప్రవేశపెట్టవలసిందిగా నేను ప్రభుత్వానికి

సిఫారసు చేసినాను. ఇది కాలయాపనతోను, ఎక్కువ వ్యయం తోను కూడినదని ప్రభుత్వం దీనికి సమ్మతించలేదు.

జాతీయం చేసిన తర్వాత కూడా లోపరహితాలైన పాఠ్యగ్రంథాలు లభించడంలేదని అనేకులు విమర్శించడం కద్దు. ఈ విమర్శలో చాలా సత్యం ఉన్నది. లోపరహితములైన గ్రంథాలను వ్రాయించుటకు నేను ప్రభుత్వానికి కొన్ని సూచనలను చేశాను. కాని వాటిని గురించి అధికారులు ఎలాటి శ్రద్ధను వహించలేదు. పాఠ్యగ్రంథాలను జాతీయం చేయడం జరిగిందే గాని దాని మూలంగా ఆశించిన ఫలితాలు లభించలేదు. సుమారు 5 సంవత్సరాలు నాకాలంలో చాలాభాగాన్ని సాంఘికశాస్త్ర పాఠ్యప్రణాళికను సంస్కరించుటకు, పాఠ్య గ్రంథాలను వ్రాయించుటకు వినియోగించాను. కాని శ్రమకు తగిన ఫలితం లభించనందుకు విచారిస్తున్నాను.

మన విద్యావిధానాన్ని పూర్తిగా సంస్కరించ దలచి కొఠారీ అధ్యక్షతన ప్రభుత్వం ఒక నిపుణులతో కూడిన సంఘాన్ని నియమించింది (Kothari Commission). అది 1966 లో దాని నివేదికను సమర్పించింది. ఆ నివేదికను అన్ని స్థాయిలలో చర్చించారు. అనేక నిర్ణయాలను తీసుకొన్నారు. కాని ఇప్పటి వరకు ఆ నివేదికను ప్రభుత్వం ఆచరణలోకి తీసుకొని రాలేదు. ఇంతేకాదు. జనతా ప్రభుత్వంలో విద్యామంత్రిగా ఉండే పి సి. చందర్ ఇంకొక విధానాన్ని రూపొందించినారు. మన జాతిలో వాక్శూరత్వానికేగాని కార్యశూరత్వానికి ప్రాధాన్యం లేదనే అభిప్రాయం ఒకటి ఉన్నది. బహుశా అదే సత్యంగా తోస్తూ ఉన్నది. అందుచేతనే ఇటీవలికాలంలో సమగ్ర ఆంధ్రుల చరిత్రను వ్రాయించుటకు ఒక కమిటీని నియమించి అందులో సభ్యుడుగా ఉండమని ప్రభుత్వం నన్ను కోరింది. కాని దీనికి నేను అంగీకరించలేదు. ఆంధ్ర విశ్వవిద్యాలయం దాని స్వర్ణోత్సవ సమయంలో ఆంధ్రుల చరిత్రను ప్రకటించుటకు నిర్ణయించింది. దానికి 1600 తర్వాత ఆంధ్రుల ఆర్థిక చరిత్రను గురించి, 1858 తర్వాత పరిపాలనా చరిత్రను గురించి వ్యాసాలను వ్రాయవలసిందిగా విశ్వ విద్యాలయాధికారులు

నన్ను కోరారు. నేను అనారోగ్య స్థితిలో ఉండినా మూడు నెలలు కొంత పరిశోధన గావించి ఈ రెండు వ్యాసాలను వ్రాసి అధికారులకు పంపినాను. 1978 లో స్వర్ణోత్సవం అతివైభవంగా జరిగింది. కాని ఇప్పటివరకు వారు తలపెట్టిన సమగ్ర ఆంధ్రుల చరిత్ర ప్రకటింపబడలేదు. నేను త్వరపడి వ్రాసిన రెండు వ్యాసాలకు ఏలాటి గతి పట్టగలదో అని విచారిస్తున్నాను. ఆంధ్రులలో ఆరంభశూరత్వం అధికంగా ఉన్నట్లు అందరూ అభిప్రాయపడుతున్నారు. ఇది వాస్తవమేమో!

సాంఘికశాస్త్ర పాఠ్యప్రణాళికను సంస్కరించి, దాని ననుసరించి పాఠ్యగ్రంథాలను వ్రాయిస్తున్న కాలంలో నా మామూలు కార్యక్రమాలు జరుగుతూనే ఉండినవి. హైదరాబాదు మేధావులకు కేంద్రం. ఉస్మానియా విశ్వవిద్యాలయం, అనుబంధ కళాశాలలు, ఆంధ్ర సాహిత్య అకాడమి వంటి సంస్థలు మొదలైనవి ఉన్నందున ఎప్పుడూ ఏదో ఒక గోష్ఠి కార్యక్రమం జరుగుతూ ఉంటుంది. విద్యారంగంలోనే గాక, రాజనీతిశాస్త్రంలోను, అందులో ప్రధానంగా సమాఖ్య విధానము, స్థానిక పరిపాలనము, పంచాయతీ రాజ్యము మొదలైన విషయాలలో నాకు కొంత ప్రఖ్యాతి లభించిన కారణంగాను, నేను ఇంగ్లీషులోను, తెలుగులోను చక్కగాను, స్పష్టంగాను ఉపన్యసించగలవాడను కావడం చేతను, గోష్ఠి కార్యక్రమాలలోను, ఇతర సమావేశాలలోను తరుచుగా పాల్గొంటూ ఉండేవాడిని. అనారోగ్యంతో బాధపడుతూ ఉన్నప్పుడు కూడా వీటిని మానుకొనడం నాకు ఇష్టం లేదు. గ్రంథరచయితలు తమ గ్రంథాలకు తొలిపలుకులు వ్రాయవలసినదిగా కోరడం పరిపాటి అయింది. కొందరు వారు వ్రాసిన గ్రంథాలను ముద్రించుటకు ముందు వాటి వ్రాతప్రతులను చదివి, అవసరమైన సలహాలు ఇవ్వవలసిందిగా కోరేవారు. ఎవరి కోరికనూ తిరస్కరించడం నా స్వభావానికి విరుద్ధం. ఎలాగో తీరిక చేసికొని నా యథాశక్తి వారి కోరికను మన్నించేవాడిని. ఇవి అన్నీ ఉపయోగకరమైన కార్యక్రమాలో కావో నేను చెప్పలేను. కాని వీటిని చేపట్టడం తప్పేదికాదు.

1970 లో నేను ఆంధ్ర విశ్వవిద్యాలయంలో "భారత దేశంలో జాతీయత" అనే విషయాన్ని గురించి మూడు ఉపన్యాసాలు, పూనా విశ్వవిద్యాలయంలో "సమాఖ్య విధానాన్ని గురించిన కొన్ని సిద్ధాంతాలు" అనే విషయాన్ని గురించి రెండు ఉపన్యాసాలు చేసినాననీ, వాటిని ఆ యా విశ్వవిద్యాలయాలు గ్రంథరూపంలో ప్రకటించాయనీ ఇదివరలో చెప్పినాను.

ఇవి గాక నా మామూలు కార్యక్రమాలను—గ్రంథ సమీక్షలు, ఆకాశవాణి ప్రసారాలు, పత్రికలకు వ్యాసాలు వ్రాయడం, సమావేశాలలో పాల్గొనడం—సాగిస్తూ వచ్చాను. 1970 గాంధీ మహాత్ముని శతజయంతి సంవత్సరం. ఆ సందర్భంలో ఢిల్లీలో నెహ్రూ మ్యూజియంవారు ఆయన 'అహింసా తత్త్వాన్ని' గురించి ఒక వ్యాసాన్ని వ్రాసి, వారు ఏర్పాటుచేసిన గోష్ఠి చర్చలలో పాల్గొనవలసిందిగా ఆహ్వానించారు. వ్యాసం వ్రాసి పంపినాను. కాని అనారోగ్యం కారణంగా అంతదూరం ప్రయాణం చేయలేకపోయినాను. ఇదే విషయాన్ని గురించి ఉస్మానియా విశ్వవిద్యాలయంవారు ఏర్పాటుచేసిన గోష్ఠిలో చర్చ నిమిత్తం వ్యాసాన్ని వ్రాసి చర్చలో పాల్గొన్నాను. జాతీయత గురించి ఉపన్యసించుటకు ఆంధ్ర విశ్వవిద్యాలయానికి వెళ్ళినప్పుడు అక్కడ కూడా గాంధీ మహాత్ముని శతజయంతి ఉత్సవంలో ప్రసంగించి, అటుతర్వాత నా ప్రసంగాన్ని వ్రాసి కార్యదర్శికి పంపినాను. ఈ ఉత్సవాన్ని నా భార్య ప్రారంభించి, గాంధీ మహాత్ముని గురించి ఆమె అనుభవాలను తెలియపరచింది.

ఆ సంవత్సరం హైదరాబాదులో 'మునిసిపల్ పన్నుల విధానము', 'పరీక్షల సంస్కరణ' (Examination Reform), 'ఆస్తి హక్కు', కె. వి. గోపాలస్వామి రచించిన 'భారత రాజ్యాంగము—రాజకీయ పక్షాలు,' సి. నరసింహంగారి 'పరిపాలనా శాఖలో జరగవలసిన సంస్కరణలు' (Civil Service Reform), 'మతాధార మైన రాజకీయ పక్షాలపై ఆంక్ష' (Ban on communal parties) అనే విషయాల గురించి జరిగిన సదస్సులలో పాల్గొన్నాను. కొన్నిటికి నా అభిప్రాయాలను వ్యక్తంచేస్తూ వ్యాసాలు వ్రాశాను.

1967 తర్వాత కార్మికులు యజమానులను, ఇతర అధికారులను "ఘురావ్" (Gherao) చేసే అలవాటు ఒకటి అమలులోకి వచ్చినది. గంటలకొద్ది వారిని కార్మికులు వారి గదులలో నుంచి బయటకు రాకుండా ముట్టడివేయడం దీని ప్రధాన లక్షణం. దీని మూలంగా పరిశ్రమలలో ఉత్పత్తికి అపారనష్టం కలిగేది. దీనిని గురించి చర్చించుటకు హైదరాబాదులో జరిగిన గోష్ఠిలో నేను పాల్గొన్నాను. ఇది ఒక విషమైన దౌర్జన్యం. దీనిని నేను పూర్తిగా గర్హించాను. క్రమక్రమంగా ఇది అన్నిరంగాలకు వ్యాపించింది. విద్యార్థులు తమ కోరికలను తీర్చుకొనుటకు విశ్వవిద్యాలయాల ఉపాధ్యాయులను, అధ్యాపకులను, ఇతర అధికారులను ఘురావ్ చేయడం పరిపాటి అయింది. నీతినియమాలకు కట్టుబడక అన్ని వర్గాలవారు వారి వారి ప్రయోజనాలను తీర్చుకొనుటకు సిద్ధపడిన ఈ ఆధునిక యుగంలో ఇది ఒక నూతన పరిణామం.

ఈలాగు గోష్ఠి కార్యక్రమాలలో పాల్గొంటూ నా కాలాన్ని వినియోగించుచుండిన సమయంలో తలవని తలంపుగా రామేశ్వర యాత్ర చేయుటకు నాకు అవకాశం లభించింది. చాలాకాలం వరకు నా కోడలు నారాయణికి సంతానం కలుగలేదు. సంతానం కలిగిన పక్షంలో రామేశ్వర యాత్ర చేసేటట్లు మొక్కుకొన్నది. ఇద్దరు మొగపిల్లలు పుట్టారు. కాలం అప్పటికే గడచిపోయింది. మొక్కుబడిని చెల్లించే విషయంలో ఆలస్యం చేయడం వాంఛనీయం కాదనే భావంతో పెద్ద పిల్లవాడు ప్రసన్నకుమారును వెంట బెట్టుకొని రామేశ్వరానికి వెళ్ళుటకు అక్టోబరు 12 న నిజామాబాదులో బయలుదేరి హైదరాబాదుకు వచ్చింది. నా భార్య, నేను కారులో దానితో కూడా వెళ్ళుటకు నిర్ణయించుకొన్నాము. మా మనుమడు రంగా కూడా మాతో వచ్చాడు. నెల్లూరు చేరగానే నా పెద్దకుమార్తె (నారాయణి తల్లి) మాతో కూడా వచ్చుటకు నిశ్చయించుకొన్నది. నెల్లూరువారు రాజగోపాలన్ కరైకుడిలో ఉద్యోగిగా వుండినందున అక్కడికి వెళ్ళి అతని సహాయంతో రామేశ్వరానికి వెళ్ళదలచాము. 14 న నెల్లూరులో బయలుదేరి, రాత్రి మద్రాసులో గడపి, 15 న తిరుచినాపల్లి మీదుగా సాయంకాలం 7 గంటలకు కరైకుడి చేరినాము. 16 ఉదయం

అక్కడ మా బంధువులను, స్నేహితులను కొందరిని చూచి రాజగోపాలన్ సహాయంతో మధ్యాహ్నం 2 గంటలకు మండపంలో దిగినాము. అక్కడి మత్స్యపరిశ్రమశాఖవారు రాజగోపాలన్‌కు బాగా తెలిసినవారు. అందుచేత మాకు సులభంగా వారి అతిథి గృహంలో బస కుదిరింది. అక్కడ మ్యూజియాన్ని, చూడదగిన ఇతర స్థలాలను చూచి 17 న మండపం నుంచి రైలులో రామేశ్వరానికి ప్రయాణం చేసి ఉదయం 6 గంటలకు చేరి సముద్ర స్నానం చేసి దేవాలయానికి వెళ్ళి దేవుని దర్శనం చేసుకొని, దేవాలయ శిల్పాలను, ఎత్తైన స్తంభాలను, అరుగులను చూస్తూ మూడు గంటలు గడపి, సాయంత్రం 4 గంటలకు రైలులో తిరుగు ప్రయాణంచేసి, మండపంలో కారు ఎక్కి, మార్గంలో మానామధురైకి రాగానే రాజగోపాలన్‌గారు రైలు ఎక్కి కరైకుడికి వెళ్ళారు. వారి సహాయం వుండబట్టే మేము ఎలాటి చిక్కులు లేక సులభంగా మా రామేశ్వర యాత్రను పూర్తి చేసుకొనగలిగాము. వారు వెళ్ళిన తరువాత మేము మధురకు మా ప్రయాణాన్ని సాగించి రాత్రి 8 గంటలకు మధురకు చేరినాము. అక్కడ నా రెండవ కోడలు తండ్రి కృష్ణన్ ఉండినందున బస, భోజన విషయంలో మాకు ఎలాటి ఇబ్బంది కలుగలేదు. 19 న కృష్ణన్ కుమారుడు నారాయణన్ మమ్ములను మీనాక్షి దేవాలయానికి తీసికొని వెళ్ళినాడు. అక్కడ మేము అర్చనాదులు జరపి అమ్మవారి దర్శనం చేసికొని రెండు, మూడు గంటలు దేవాలయ వైభవాన్ని చూడగలిగాము. అంతటి విశాలమైనట్టిన్నీ, శిల్ప సంపదతో కూడినట్టిన్నీ దేవాలయం దేశంలో ఇంకొకటి లేదని చెప్పడంలో అతిశయోక్తి ఎలాటిదీ లేదు. దేవాలయమే ఒక నగరం. అందులోనే దుకాణాలు, నివాస గృహాలు. తర్వాత ఇంటికి వచ్చి, భోజనం చేసి, తిరిగి బయలుదేరి తిరుమల నాయక్ మేడ, ఇతర దృశ్యాలను చూచి ఇల్లు చేరాము. అప్పటికే నేను చాలా అలసిపొయ్యాను. కాని తక్కినవారు తిరిగి బయలుదేరి దుకాణాలకు వెళ్ళి వారి వారికి తోచినవాటిని కొని ఇంటికి వచ్చారు.

మరుసటిరోజు ఉదయం 8 గంటలకు బయలుదేరాము. వర్షము పడిన కారణంగా చుట్టు తిరిగి ప్రయాణం చేయవలసి వచ్చింది. మేము తిరుచినాపల్లి మీదుగా శ్రీరంగం చేరేటప్పటికి దేవాలయంలో గర్భగృహాన్ని మూసివేశారు. దేవాలయ శిల్పాలను చూస్తూ ఒక గంట గడిపాము. 12 గంటల ప్రాంతంలో గర్భాలయం తలుపులు తెరచారు. అప్పటికే ఒక వైష్ణవ బ్రాహ్మణుని సహాయంతో ఆలయ ప్రవేశానికి టికెట్లు కొన్నాము. వెంటనే అర్చనాదులతో దేవుని దర్శనం చేసుకున్నాము.

అటుతర్వాత తిరుచినాపల్లికి వచ్చి హోటలులో భోజనం చేసికొని తంజావూరికి వెళ్ళడం ఉద్దేశం మానుకొని తిన్నగా మద్రాసుకు ప్రయాణంచేసి రాత్రి 9-30 కి మైలాపూరిలో నా రెండవ కుమార్తె ఇల్లు చేరాము. ఈవిధంగా మేము రామేశ్వర యాత్రను పూర్తి చేసుకొనగలిగాము. 1931 లో నా భార్య, నేను, నా పండ్రెండేళ్ళ కుమారుడు ఆనందం. మూడేండ్లవాడు సింహాచలంతో దక్షిణదేశ యాత్రను ఒక నెలకాలం చేసి తిరువనంత పురం, కుత్తాళం, శుచీంద్రం, కన్యాకుమారి, రామేశ్వరం, మధుర, శ్రీరంగం, తిరుచినాపల్లి, తంజావూరు, కుంభకోణం, చిదంబరం, కంచి మొదలైన క్షేత్రాలను చూచి వచ్చాము. కాని ఈ మధ్యకాలంలో దేశం, ప్రజల జీవిత విధానం, ప్రయాణ సౌకర్యాలు ఎంతగానో మారినవి. 1970 లో మేము చేసిన ప్రయాణం ఎలాటి చిక్కులులేక సాఫీగా సాగిపోయింది. వార్ధక్యంలో ఈలాటి ప్రయాణం చేయడం సులభసాధ్యంకాదు. కాని మాకు మా కుమార్తె అన్నపూర్ణ, మా కోడలు నారాయణి సహాయంగా రావడంచేత ప్రయాణం సవ్యంగా సాగింది.

1971 లో నేను చేపట్టిన కార్యక్రమాలు ఇదివరలో నేను చేపట్టిన కార్యక్రమాల వంటివే. సాంఘికశాస్త్ర పార్యప్రణాళిక కమిటీ కార్యక్రమాలు రావణాసురుడి కాష్ఠం మోస్తరుగా తయారైనవి. నాలుగు సంవత్సరాలు గడచినా పార్యగ్రంథాలన్నీ తయారు కాలేదు. తయారైనవి తృప్తికరంగా ఉండలేదు. గ్రంథకర్తలు, సంపాదకులు వారి వారి విధులపట్ల శ్రద్ధను వహించని కారణంగా వారు చేయవలసిన పనులను నేనే చేయవలసి

వచ్చింది. నా కార్యభారాన్ని తగ్గించుకొనుటకు ఏలాటి ఉపాయము లేకపోయింది. ప్రభుత్వం నా సలహాలను స్వీకరించ లేదు. నా అధ్యక్ష పదవికి రాజీనామా చేయదలచాను. కాని ఆఖరు దశలో ఈలాగు ప్రవర్తించడం మర్యాదగా ఉండదనే కారణంగా నా పదవికి సంబంధించిన బాధ్యతను త్వరితకాలంలో పూర్తిచేయుటకు నిర్ణయించుకొన్నాను. 1972 లో ఏలాగో దానిని పూర్తిచేశాను.

ఇతరు లనేకులు వారి కార్యక్రమాలను సాగించడంలో నా సహాయాన్ని కోరడం పరిపాటి అయింది. వారిలో కొందరు నా కుటుంబంలోని వారు, మరి కొందరు నా మిత్రవర్గంలోని వారు. ఒకరిద్దరు ఇదివరలో నాతో ఎలాటి పరిచయంలేని వారు. సాధారణంగా ఎవరి కోరికను తిరస్కరించడం నా ప్రకృతికి విరుద్ధం. వారి కోరికలను చెల్లించుటకు నా కాలంలో అధికభాగాన్ని వినియోగించాను. నా శరీర శక్తికి మించి ఒక్కొక్కప్పుడు దీనిమూలంగా నేను పనిచెయ్యవలసి వచ్చింది. అయినా నేను దానికి సిద్ధపడినాను.

నా మనుమరాలు శాంత అప్పుడు ఉస్మానియా విశ్వ విద్యాలయ రాజనీతిశాఖలో ఎం. ఏం. విద్యార్థినిగా యుండినది. పాఠ్యవిషయా లన్నిటినీ చక్కగా బోధించవలసిందిగా నన్ను కోరింది. నేను దానికి సమ్మతించి ప్రామాణిక గ్రంథాలను చదివి, బోధించ వలసిన అంశాలను నోటు చేసుకొని. వారానికి అధమం నాలుగు రోజులు ఈ బోధనా కార్యక్రమాన్ని సాగిస్తూ ఉండేవాడిని. విషయాల సంఖ్య ఎక్కువగా ఉండడంచేత నేను విశ్వవిద్యాలయంలో అధ్యాపకత్వం వహించిన కాలంలో చేసిన పనికంటె ఎక్కువ పనిచేయవలసి వచ్చింది.

1971 లో నా కుమార్తె వైదేహి తెలుగు అకాడమీవారు కోరినట్లు బి. ఎ. తరగతికి బ్రిటిషు ఇండియా చరిత్రను వ్రాయ వలసి వచ్చింది. ఆమెకు సలహా ఇచ్చుటకు, ఆమె వ్రాతప్రతిని సంస్కరించుటకు ఒక సంపాదకుడు ఉండినా ఆమె నా సహాయాన్ని కోరింది. నేను ఆమెకు ఒక్కొక్క అధ్యాయాన్ని ఎలాటి దృక్పథంతో ఏవిధంగా వ్రాయడమో చెప్పడమే కాక ఆమె

వ్రాసిన దానిని సంస్కరించుటకు కూడా పూనుకొన్నాను. నా కాలంలో కొంతభాగం ఇందుకుగాను వినియోగించాను.

ఆనాడు నా కుమారుడు ఆనందం భారత ప్రభుత్వం నియమించిన నిరుద్యోగ కమిటీలో సభ్యుడుగా ఉండి అప్పుడప్పుడు నా సలహాను కోరుతూ ఉండేవాడు. మన దేశంలో నిరుద్యోగ సమస్యను పరిష్కరించుటకు మార్గాలు, ఇతర దేశాలలో ఇందుకుగాను ప్రభుత్వం అనుసరించిన విధానాలు మొదలైన విషయాల గురించి కొంత సమాచారాన్ని సేకరించి వాడికి సహాయపడినాను. ఆనాడు కేంద్ర రాష్ట్రాల సంబంధాల గురించి తీవ్రంగా దేశంలో వాదోపవాదాలు జరుగుతూ ఉండేవి. వాటిని గురించి కూడా అవసరమైనప్పుడు వాడికి సమాచారాన్ని అందచేస్తూ వచ్చాను. వాడు పార్లమెంటులో సభ్యుడు కావడం చేత ఈలాటి సమాచారం వాడికి అవసరమయ్యేది.

నా మిత్రవర్గంలో నా సహాయాన్ని కోరినవా రందరినీ పేర్కొనడం, నేను వారికి చేసిన సహాయాన్ని వివరించడం ఉచితం కాదని నేను దానికి పూనుకొనలేదు. ఆంధ్ర విశ్వవిద్యాలయంలో అధ్యాపకులుగా ఉండినట్టి శ్రీ టి. అప్పారావు వారిలో ఒకరు.వీరు మునిసిపల్ ప్రభుత్వాన్ని గురించి పరిశోధనచేసి, దానిని ఆధారం చేసుకొని ఒక పిహెచ్ డి. తీసిస్ వ్రాసి డిగ్రీకి ప్రయత్నించారు. కాని దానిని సంస్కరించవలసిందిగా పరీక్షాధికారులు ఆదేశించారు. ఆ ఆదేశానుసారం ఆయన తన పరిశోధనా వ్యాసాన్ని సంస్కరించి తాను చేసిన సంస్కరణ ప్రామాణికంగా వున్నదీ లేనిదీ తెలుసు కొనుటకు నావద్దకు అనేక పర్యాయాలు వచ్చారు. నేను వారి వ్యాసాన్ని సంస్కరించడంలో అనేక సూచనలు చేశాను. సంస్కరింపబడిన ఈ వ్యాసాన్ని పరీక్షాధికారులు ఆమోదించినారు. వారికి డిగ్రీ లభించింది.

ఆంధ్రోద్యమాన్ని గూర్చి సంక్షిప్తంగా ఒక వ్యాసాన్ని వ్రాసి పంపవలసినదిగా నాకు అత్యంత సన్నిహితులును, ఉస్మానియా విశ్వవిద్యాలయంలో రాజనీతిశాఖలో అధ్యాపకులునైన డాక్టర్ శేషాద్రిగారు కోరినారు. ఆంధ్రలో స్వాతంత్ర్యోద్యమ

చరిత్రను వ్రాసే సందర్భంలో నేను ఈవిషయాన్ని గురించి కొంత పరిశోధన గావించాను. అటుతర్వాత ఉద్యమాన్ని గురించి సమగ్ర చరిత్రను వ్రాసిన గోష్ఠి సుబ్బారావుగారితో దీనిని గురించి అనేక చర్చలు సాగించాను. వీటి నన్నిటిని ఆధారం చేసికొని వారు కోరిన సంక్షిప్త వ్యాసాన్ని వ్రాసి పంపినాను.

ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు కమిటీవారు నాగార్జునసాగర్‌లో ఒక యువజన కాంగ్రెసు శిబిరాన్ని ఏర్పాటుచేసి, మన రాజ్యాంగం లోని ప్రధాన లక్షణాలు వివరిస్తూ ఒక చిన్న గ్రంథాన్ని వ్రాయ వలసిందిగా కోరారు. నేను అలాంటి గ్రంథాన్ని వ్రాసి వారికి ఇచ్చాను. దానిని వారు అచ్చువేసి శిబిరంలో సమావేశమైన వారందరికి పంచిపెట్టారు. ఇదిగాక ఒకరోజు నేను శిబిరానికి వెళ్ళి కాంగ్రెసు పుట్టుపూర్వోత్తరాలు, దేశానికి అది చేసిన సేవ, స్వాతంత్ర్యం లభించిన తర్వాత అది దేశాన్ని పరిపాలిస్తున్న తీరు తెన్నులు మొదలగు విషయాల గురించి రెండు గంటలసేపు ఉపన్యసించాను. నా ఉపన్యాసాన్ని అందరు ప్రశంసించారు. దానిని వినిన ప్రముఖులు కొందరు కాంగ్రెసు చరిత్రను గురించి నూతన దృక్పథంతో ఒక గ్రంథాన్ని వ్రాయవలసిందిగా నన్ను కోరినారు. నేను దానికి అంగీకరించాను. కాని శిబిరం ముగిసిన తర్వాత కార్యకర్తల ఉత్సాహం తగ్గింది. అందుచేత నా ప్రయత్నం విరమించవలసి వచ్చింది.

పై కార్యక్రమాలే కాక ప్రజాస్వామికాన్ని గురించి మరి రెండు రోజుల గోష్ఠికి "పార్లమెంటరీ ప్రజాస్వామికం మన దేశంలో ఏవిధంగా పనిచేస్తున్నది" సమీక్షిస్తూ ఒక సుదీర్ఘమైన వ్యాసాన్ని వ్రాసి చర్చలలో పాల్గొన్నాను. ఇండో సోవియట్ ఒడంబడికను గూర్చి ఏర్పాటు చేయబడిన ఇంకొక గోష్ఠిలో మాడరేటర్ (Moderator) గా పాల్గొన్నాను. బంగ్లాదేశ్ విముక్తికై జరిగిన యుద్ధం, దానిమూలంగా భారతదేశం ఎదుర్కొన్న సమస్యలను గురించి చర్చించిన గోష్ఠిలో ప్రధాన పాత్ర వహించాను. ఇవిగాక సంగ్రహ ఆంధ్ర విజ్ఞానకోశానికి, రాజనీతికి సంబంధించిన నాలుగు వ్యాసాలను వ్రాసినాను.

1970, 1971 లో సమాఖ్య పరిపాలనా విధానాన్ని గురించి అనేక ప్రామాణిక గ్రంధాలను—వాటిలో ప్రధానంగా ఇటీవలి కాలంలో వెలువడిన గ్రంధాలను చదివాను. విహియర్ (Where) వంటి వారి ప్రశంసలకు పాత్రమైన నా "పరిపాలనలో సమాఖ్య విధానము" (Federalism in Government) అనే గ్రంధాన్ని సంస్కరించి పునర్ముద్రణ గావించదలచి వీటిని చదవడం ప్రారంభించాను. సంస్కరణ ప్రయత్నంలో కొన్ని పుటలను వ్రాశాను. కాని గ్రంధాన్ని సంస్కరించడం సాధ్యం కాదని, సమాఖ్య విధానాన్ని గురించి సరిక్రొత్త గ్రంధాన్ని వ్రాయవలసి ఉన్నదని సంస్కరణ కార్యక్రమాన్ని వదలుకొన్నాను. సరిక్రొత్త గ్రంధాన్ని వ్రాయుటకు కాలవ్యవధికాని, శారీరకశక్తిగాని లేకపోయింది. అందుచేత "భారతదేశపు సమాఖ్య విధానము" అనే విషయాన్ని గురించి (Indian Federalism) మూడు అధ్యాయాలు వ్రాయగలిగాను.

1971 లో నా బంధువుల వివాహాల కారణంగా మూడు పర్యాయాలు మద్రాసుకు ప్రయాణం చేయవలసి వచ్చింది. ఆఖరు రెండు వివాహాల కాలంలో వర్టిగో వ్యాధి మూలంగా వాటిలో ఎక్కువగా పాల్గొన లేకపోయినాను. అటుతర్వాత అతికష్టంమీద కారులో ప్రయాణంచేసి నెల్లూరు చేరాను. అక్కడ నా ఆరోగ్యం మరీ క్షీణించింది. కారులో ప్రయాణంచేసి హైదరాబాదు చేరడం సాధ్యం కాలేదు. అప్పుడు ఢిల్లీలో ఉండిన నా కుమారుడు ఆనందాన్ని పిలిపించి రైలులో మొదటి తరగతిలో వాడి సహాయంతో ప్రయాణం చేసి సెప్టెంబరు 6 న సికింద్రాబాదు చేరాను. ఆరోగ్యాన్ని కోలుకొనుటకు మూడు నెలలు పట్టింది.

నేను అలాటి స్థితిలో ఉన్నప్పుడు పార్వతీపురం కళాశాలలో అధ్యాపకులుగా ఉన్న అప్పలస్వామిగారు "రాజకీయతత్వం" అనే 500 పుటల గ్రంధాన్ని వ్రాసి, సికింద్రాబాదుకు వచ్చి, దానిని చదివి తొలిపలుకులు వ్రాయవలసిందిగా కోరారు. అప్పట్లో నేను పడకనుండి లేచి కూర్చుండే స్థితిలో కూడా లేను.

ఆ స్థితిలో 500 పుటల వ్రాతప్రతిని చదివి తొలిపలుకు వ్రాయడం సాధ్యంకాదని నిరాకరించవలసి వచ్చింది. అటుతర్వాత మరి రెండు పర్యాయాలు పార్వతీపురంనుండి వారు నన్ను చూచుటకు వచ్చారు. అప్పటికి కూడా నా స్థితి చక్కబడలేదు. అందుచేత ఏలాగో వారి గ్రంథాన్ని అక్కడక్కడ చదివి సంక్షిప్తంగా నా అభిప్రాయాన్ని వ్రాసి వారికి ఇచ్చాను. అనేకులకు సహాయం చేసిన నేను వారికి సహాయం చేయలేక పోయినందుకు ఎంతగానో విచారించాను. సెప్టెంబరు 11 మొదలు 30 వరకు నా భార్య నా డైరీని వ్రాసింది. డైరీని వ్రాయుటకు కూడా కావలసిన శక్తి ఆనాడు నాకు లేకపోయింది.

అనారోగ్యం కొంత తగ్గిన తర్వాత ఢిల్లీలో ప్రకటింపబడే Journal of Constitutional Studies పత్రికలో "సమాఖ్య విధానం - రాజకీయ పక్షాలు" అనే వ్యాసాన్ని ప్రకటించాను. 'త్రివేణి'లో రెండు వ్యాసాలు, 'ప్రసారిత'లో రెండు వ్యాసాలు ప్రత్యేకంగా ప్రకటనార్థం వ్రాశాను. గ్రంథసమీక్షలు, ఇతరము లైన నా మామూలు కార్యక్రమాలు సాగించాను. మొత్తం మీద తక్కిన సంవత్సరాల వలెనే 1971 సంత్సరాన్ని కూడా ప్రయోజనకరంగా గడిపినట్లు భావిస్తున్నాను.

1972 లో నా కార్యక్రమాల స్వభావంలో ఎలాటి మార్పూ లేదు. ఇదివరలో నేను చేపట్టిన కార్యక్రమాలనే ఈ సంవత్సరం కూడా చేపట్టాను. హైదరాబాదులోని మేధావులు కొందరు కొన్ని గోష్ఠులను ఏర్పాటు చేశారు. వాటిలో ఒకటి "దేశరక్షణ దృష్ట్యా హిందూమహాసముద్ర ప్రాధాన్యం" అనే విషయాన్ని గురించి చర్చించుటకు ఏర్పాటు చేయబడినది. అమెరికా, సోవియట్ రాజ్యాలు ఈ మహాసముద్రంలో నౌకా స్థావరాలను నిర్మాణం చేయడం ఈ సముద్రప్రాంత దేశాలకు అంగీకారయోగ్యం కాలేదు. వాటిమూలంగా అగ్రరాజ్యాల మధ్య ఉద్రిక్తత పెరిగి ఈ దేశాల శాంతి భద్రతలకు ప్రమాదం సంభవించగలదని అనేకులు భావించారు. ఈ గోష్ఠిలో నేను పాల్గొని ఈలాటి ప్రమాదం తప్పక సంభవించగలదనే అభిప్రాయం

వ్యక్తం చేశాను. మరికొందరు, వారిలో ప్రధానంగా నౌకా శాఖలో ఉద్యోగం చేసినవారు, ఈలాటి ప్రమాదాన్ని ఎదుర్కొనుటకు తీసుకొనవలసిన చర్యలను సూచించారు.

గాంధీ మహాత్ముని ఆర్థిక విధానాలు ఎంతవరకు ఈనాడు మనకు ప్రయోజనం కలిగించగలవు అనే విషయాన్ని చర్చించుటకు శ్రీకృష్ణ దేవరాయ గ్రంథాలయంలో శ్రీ కోదాటి నారాయణరావుగారు ఒక గోష్ఠిని ఏర్పాటుచేసి, అందులో చర్చించుటకు ఒక వ్యాసాన్ని వ్రాయవలసిందిగా నన్ను కోరారు. నేను వారి ఆర్థిక విధానము— స్వదేశీ, కుటీరపరిశ్రమలు, గ్రామ స్వయం సమృద్ధి మొదలగు లక్షణాలతో కూడినట్టిది—మన దారిద్ర్యాన్ని, నిరుద్యోగాన్ని నిర్మూలించగలదని, ప్రభుత్వం దిగుమతులను తగ్గించడం, ఎగుమతులను పెంచడం, విదేశ మారక ద్రవ్యాన్ని సేకరించడం మొదలైన విధానాలపట్ల శ్రద్ధ వహించడాన్ని చక్కగా పరిశీలించిన పక్షంలో ఇవి గాంధీ మహాత్ముని ఆర్థిక విధానానికి రూపాంతరాలని, అందుచేత ఆయన ఆశయాలకు సర్వకాలాలలో విలువ గలదని నిరూపించినాను. గోష్ఠిలో నేను చదివిన వ్యాసాన్ని, ఇతర చర్చలను పుస్తకరూపంలో ప్రకటించుటకు ఏర్పాటులు జరుగుచున్నట్లు నారాయణరావుగారు చెప్పినారు. కాని ఇప్పటివరకు ఆ పుస్తకం ప్రకటింపబడనందుకు నేను విచారిస్తున్నాను.

అరవిందుని రాజకీయ ఆశయాల గురించి ఏప్రిల్ 4 న ఉస్మానియా విశ్వవిద్యాలయంలో తత్వశాఖలో ప్రధానాచార్యులుగా వుండిన మధుసూదనరెడ్డిగారు ఒక గోష్ఠిని ఏర్పాటు చేశారు. అరవిందుడు వ్రాసిన 'భారతీయ పరిపాలనా విధానము' (Indian Polity) అనే గ్రంథాన్ని ఆధారంచేసుకొని గోష్ఠిలో నా అభిప్రాయాలను వ్యక్తంచేశాను. డాక్టర్ శివయ్యగారు అరవిందుని అభిప్రాయాలను కొన్నింటిని విమర్శించారు గాని మధుసూదనరెడ్డిగారు ఆ విమర్శ నిరాధారమని నిరూపించారు. శ్రీ జి. రాంరెడ్డిగారు కూడా చర్చలో పాల్గొన్నారు. మొత్తం మీద ఈ గోష్ఠి విజయవంతంగా సాగినది.

1972 లో రెండు నెలలు అదేపనిగా పరిశోధన గావించి మనకు స్వాతంత్ర్యం లభించిన తర్వాత స్థానిక పరిపాలనా

విధానంలో జరిగిన మార్పుల గురించి ఒక వ్యాసాన్ని వ్రాశాను. బొంబాయి విశ్వవిద్యాలయంలో రాజనీతిశాఖ రజతోత్సవ సందర్భంగా ప్రకటించ దలచిన సంచికకు ఒక వ్యాసాన్ని వ్రాయ వలసిందిగా ఆ శాఖవారు నన్ను కోరిన కారణంగా నేను దీనిని వారికి పంపినాను. కాని రజతోత్సవం జరగలేదు. నా వ్యాసం కూడా ప్రకటింపబడలేదు. అనేక కమిటీల నివేదికలను, ప్రామాణిక గ్రంథాలను చదివి ఈ వ్యాసాన్ని వ్రాశాను. పంచాయతీరాజ్య వ్యవస్థను ప్రవేశపెట్టడం మూలంగా పల్లె ప్రాంతాల స్థానిక పరిపాలన ఏవిధంగా మారినది ఇందులో నేను పూర్తిగా వివరించాను. ఇది ప్రకటించదగిన వ్యాసమని నా అభిప్రాయం. ఈ సంవత్సరం ఆఖరు లోపల దీనిని ప్రకటించుటకు ప్రయత్నం చేస్తున్నాను.

ఇదిగాక 1972 లో 'ఆంధ్రప్రభ'లో (1) చైనా, అమెరికాల సన్నిహితత్వము, (2) భారత రాజ్యాంగాన్ని మార్చుటకు ఒక నూతన రాజ్యాంగ పరిషత్తు అనే విషయాల గురించిన వ్యాసాలు; 'త్రివేణి'లో, దేశవ్యవహారాల గురించి రెండు వ్యాసాలు; మన సమాఖ్య విధానం పనిచేసే తీరుతెన్నుల గురించి ఢిల్లీలోని 'రౌండ్ టేబిల్' పత్రికకు ఒక వ్యాసం; హైదరాబాదు స్టేట్ ఆర్కైవ్స్ అధ్వర్యాన ప్రకటింపబడే 'ఇతిహాస్' ప్రథమసంచికకు Sociology of Freedom Movement (ఏ వర్గాలవారు ఆంధ్ర స్వాతంత్ర్య సమరంలో పాల్గొన్నది వివరించే వ్యాసం) గురించి ఒక వ్యాసాన్ని; మన ప్రజాస్వామికాన్ని గురించి ఆచార్య కె. వి. రావు సంపాదకత్వాన వారణాసిలో ప్రకటింపబడు పత్రికకు; హైదరాబాదులోని సమాచార శాఖవారు ప్రకటించే 'ఆంధ్ర ప్రదేశ్' పత్రికకు వ్యాసాలను, 'తెనుగు విద్యార్థి' లో ప్రకటనార్థం "స్వాతంత్ర్య సమరంలో గాంధీమహాత్ముని పాత్ర" అనే వ్యాసాన్ని వ్రాశాను. 1972 లో ఆకాశవాణిలో రెండు ప్రసంగాలు ప్రసారం చేశాను. వీటిలో ఒకటి "అధ్యాపకుడుగా నా జ్ఞాపకాలు"; "రెండవది ప్రజాస్వామికము—దౌర్జన్యము."

ఈ కార్యక్రమాలకు తోడు నా మనుమరాలు శాంతకు జూన్‌లో ఆఖరు పరీక్ష పూర్తి అయ్యేవరకు పాఠాలు చెప్పాను.

పరీక్షలో అది మొదటి శ్రేణిలో కృతార్థురాలై పిహెచ్. డి. పరిశోధనార్థం జూలైలో ఢిల్లీలోని జవహర్‌లాల్ విశ్వ విద్యాలయానికి వెళ్ళింది. 1972 ఆఖరు వరకు బ్రిటిషు ఇండియా చరిత్ర రచనలో నా కుమార్తె వైదేహికి సహాయపడుతూ ఉండినాను. ఆగస్టులో నేను ఢిల్లీకి వెళ్ళి సెప్టెంబరు ఆఖరువరకు అక్కడ వుండినాను. అప్పుడు కూడ నా మనుమరాలు పద్మ ప్రియకు, నా మనుమడు జయరాంకు పాఠాలు చెప్తూవచ్చాను. పిల్లలకు బోధించడంలో నాకు మొదటినుండి ఉండిన ఆసక్తి దీనికి ప్రధాన కారణము. ఈ సంవత్సరం నా మనుమడు రంగాకు సంస్కృతం నేర్పుటకు గట్టి ప్రయత్నం చేశాను. కాని వాడికి అందులో ఏలాటి శ్రద్ధా లేకపోవడం మూలాన నా ప్రయత్నాన్ని మానుకొన్నాను.

1972 ఆగస్టు 15 కు మనకు స్వాతంత్ర్యం లభించి 25 సంవత్సరాలు పూర్తి అయింది. ఆ సందర్భంలో స్వాతంత్ర్య రజతోత్సవాన్ని జరుపుటకు ప్రభుత్వం గొప్ప సన్నాహాలు చేసింది. ఆనాడు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంలో సాంస్కృతిక శాఖామాత్యులుగా వుండిన శ్రీ భాట్టం శ్రీరామమూర్తిగారు తెలుగులో సంక్షిప్తంగా ఆంధ్రదేశ స్వాతంత్ర్య సమరాన్ని గురించి ఒక గ్రంథాన్ని వ్రాయవలసిందిగా నన్ను కోరారు. దానికి నేను అంగీకరించి నా నాలుగు ఇంగ్లీషు సంపుటాలను ఆధారం చేసికొని దీనిని వ్రాయడంలో నా మిత్రులు ఇన్నయ్యగారిని నాకు సహాయపడవలసిందిగా అభ్యర్థించాను. వారు, నేను కలిసి 130 పుటల గ్రంథాన్ని సిద్ధపరచాము. దానికి ముఖ్యమంత్రి (శ్రీ) పి. వి. నరసింహారావుగారు ఒక తొలిపలుకును, శ్రీ (శ్రీ)రామమూర్తిగారు ఒక పరిచయమును వ్రాశారు. గ్రంథాన్ని ముద్రించిన తర్వాత రవీంద్ర భారతిలో జరిగిన ఒక బహిరంగ సభలో దానిని ఆవిష్కరించినారు.

ఈ సంవత్సరం 22 గ్రంథ సమీక్షలు ప్రకటించాను. నేను సమీక్షించిన వాటిలో అరుణచంద్రగుహా వ్రాసిన "విప్లవంలో మొదటి అగ్నికణాలు" (First Sparks of Revolution) అనే

గ్రంథం బహు ఉత్తేజకరమైనట్టిదిగా నేను భావిస్తున్నాను. అందులో ఆయన విప్లవ ఉద్యమాన్ని గురించి, అందులో పాల్గొన్న యువకులు, వారి క్రమశిక్షణ, వారి దేశాభిమానం, స్వార్థ త్యాగం, సాహసం, వారికి తోడ్పడినవారు మొదలగు విషయాల గురించి సమగ్రంగా వివరించారు. భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో విప్లవ ఉద్యమం గొప్ప పాత్ర వహించింది. దానిని గురించి ఈనాటివా రందరు తెలుసుకొనడం అవసరం. ఆ అవసరం తీరడంలో ఈ గ్రంథం ఎంతగానో తోడ్పడగలదు. నా సమీక్షను 'దక్కన్ హెరాల్డు' లో ప్రకటించాను.

1972 ఆఖరు మూడు నెలలలో నా మనుమరాలు శాంత కులాంతర వివాహాన్ని చేసుకొనుటకు నిర్ణయించుకొనడం మా కుటుంబంలోనివా రందరికి భరింపరాని విషాదాన్ని కలిగించింది. వివాహాన్ని మానవలసిందిగా నయాన భయాన పిల్లకు చెప్పాము. కాని మా ప్రయత్నం ఫలప్రదం కాలేదు. తుదకు ఇంటినుంచి వెళ్ళిపోయి పిల్లవాని ఇంటిలో అతనిని డిసెంబరు 3 న వివాహం చేసుకొన్నది. కని, పెంచి, పెద్దదానినిచేసి, చదువు చెప్పించిన పిల్లకు సాంప్రదాయానుసారం వివాహం చేయలేకపోయినందుకు మే మెంతో విచారించాము. తర్వాత అయిదారు నెలల వరకు మాకు, పిల్లకు ఎలాంటి సంబంధమూ లేకపోయింది. 1973 జూలై 8 న శాంత, దాని భర్త అజయ సిన్హా మా ఇంటికి వచ్చారు. దాని తల్లిదండ్రులు (సీత, ఆనందం) జరిగినది జరిగిపోయింది, పగను సాధించడం ఉచితం కాదు అనే భావంతో వారు వచ్చినందుకు ఎంతో సంతోషించారు. కుటుంబంలోని తక్కిన వారం ఆనందభరితులమైనాము. క్రమక్రమంగా మా రెండు కుటుంబాలు కలిసిపోయినవి. దీనిని గురించి ఇంతకు పూర్వమే వివరించాను.

జూలై లో విశ్రాంతి నిమిత్తం రెండు వారాలు నిజామాబాద్ లో గడిపాను. అప్పటివరకు ఆధునిక తెనుగు వాఙ్మయంతో నాకు ఎక్కువ పరిచయం లేదు. రాచకొండ విశ్వనాథ శాస్త్రి, గుడిపాటి వెంకటచలం, పాలగుమ్మి పద్మరాజు మొదలైనవారి

పేర్లు వినడమే గాని వారు రచించిన గ్రంథాలను చదివే అవకాశం లభించలేదు. నిజామాబాద్‌లో నా కోడలు నారాయణి వీరి గ్రంథాలను సేకరించి ఉండినది. వాటిలో కొన్నిటిని నా విశ్రాంతి కాలంలో చదివాను. నేను చదివిన వాటిలో పద్మరాజుగారి "నల్లరేగడి" అనే నవల అత్యుత్తమ గ్రంథంగా కనిపించింది. వారి "రామరాజ్యము"ను కూడా చదివాను. కాని ఇది నన్ను ఎక్కువగా ఆకర్షించలేదు. చలంగారి గ్రంథాలలో "దేవుడు చేసిన పెళ్ళి" చక్కగా వ్రాయబడినట్లు నేను భావించాను. విశ్వనాథశాస్త్రిగారి "నిజం" నాకు నచ్చింది. వారి తక్కిన "సారాయి కథలు" అంత ఉత్తమములుగా కనిపించలేదు. "భాగ్యచక్రం" అనే నవల నన్ను ఆకర్షించింది. మొత్తంమీద ఆధునిక తెలుగు నవలా వాఙ్మయం ఈనాటి సామాజిక జీవితాన్ని వాస్తవికతకు భంగం లేకుండా చిత్రించ గలిగింది అనే విశ్వాసం నాకు కలిగింది.

విశ్రాంతి నిమిత్తమే నేను ఆగస్టు, సెప్టెంబరులలో ఆరు వారాలు ఢిల్లీలో నా కుమాళ్లు పట్టాభిరాం, కృష్ణమూర్తి ఇండ్లలో గడిపాను. అప్పట్లో నా ఆరోగ్యం చాలావరకు క్షీణించి నందున ఎక్కడికీ వెళ్ళలేక పోయినాను. బంధువులు, మిత్రులు మా ఇంటికి వచ్చి నన్ను చూడవలసి వచ్చినది.

1972 లో ఇందిరా గాంధి ప్రధానిగా దేశాన్ని ఏవిధంగా పాలించిందీ ఇదివరకే తెలియపరచాను. ఆ సంవత్సరం ప్రారంభంలో పాకిస్తాన్ ప్రభుత్వం బంగ్లాదేశ్ నాయకుడైన ముజబీరును నిర్బంధాననుండి విడుదల చేసింది. అతడు ప్రథమంలో లండన్‌కు వెళ్ళి, అక్కడినుండి ఢిల్లీకి వచ్చినపుడు ఇందిరా గాంధి మొదలైనవారు అతనికి ఘనస్వాగతాన్ని ఏర్పాటు చేసినారు. తర్వాత అతడు ఢాకాకు వెళ్ళి, ప్రశాసక అధినేతగా పరిపాలనను చేపట్టాడు. భారతదేశంపట్ల అతని వైఖరి ఎలాగు ఉండగలదో అనే సందేహం నాకు కలిగింది. ఒకప్పుడు అతడు ముస్లింలీగ్ నాయకులలో ప్రముఖుడు. బంగ్లాదేశ్ ప్రజలు కూడా అల్ప సంఖ్యాకులైన హిందువులపట్ల ద్వేషభావన్ని వహించినవారు. ఈ పరిస్థితులలో బంగ్లాదేశ్, భారతదేశాల మధ్య సంబంధాలు

ఎలాగు పరిణమించగలవో ఊహించడం కష్టసాధ్యమనే భావం నాకు కలిగింది.

ఇంతకంటె గడ్డుసమస్య ప్రత్యేక ఆంధ్రరాష్ట్రాన్ని కోరుతూ కోస్తా జిల్లాలలోని ఆంధ్రులు గొప్ప ఆందోళనను దౌర్జన్య సహితంగా కొనసాగించడం. దేశాభిమానం కంటె ప్రాంతీయాభిమానం ప్రాబల్యం గాంచడం దీనికి ప్రధాన కారణం. రాజకీయ వాతావరణం దౌర్జన్యపూరితం కావడం విచారించదగిన విషయం. ప్రజాస్వామికంలో వివాదాల నన్నిటిని శాంతియుతంగా పరిష్కరించుకొనుటకు అవకాశం ఉండినా దానిని వినియోగించక స్వార్థపరులైన రాజకీయ నాయకులు అధికార వ్యామోహంచేత దౌర్జన్యాలలోకి దిగడం, విద్యార్థులను, ఇతర యువకులను అందుకుగాను ప్రోత్సహించడం విషాదకరమని నేను ఆ రోజులలో భావించాను. ప్రజాస్వామికం మనదేశంలో విజయవంతంగా కొనసాగగలదా అనే సందేహంకూడా నాకు కలుగుతూ వచ్చింది.

నైజాం పరిపాలనా కాలంలో ఉద్యోగాలకు, విశ్వవిద్యాలయంలో విద్యాభ్యాసం చేయుటకు ముల్కీలు మాత్రమే (హైదరాబాదు రాష్ట్రంలో పుట్టి పెరిగినవారు, లేదా 15 సంవత్సరాలు స్థిరంగా నివసించినవారు) అర్హులుగా పరిగణించబడుతుండేవారు. 1948 లో పోలీసుచర్య జరిగి, హైదరాబాదు భారత యూనియన్‌లో విలీనమైన తర్వాత పరిపాలనను పటిష్ఠం చేసే ఉద్దేశంతో మద్రాసు రాష్ట్రంలో పరిపాలనానుభవం గల వారిని అనేకులను ఉద్యోగాలలో నియమించారు. విద్యారంగంలో హైదరాబాదు చాలా వెనుకబడి యుండేది. 1948 తర్వాత ఏర్పడిన ప్రజాప్రభుత్వం క్రొత్త విద్యాలయాలను స్థాపించి, వాటిలో అధ్యాపకులుగా పనిచేయుటకు మద్రాసు రాష్ట్రంలో పట్టభద్రులై ఇంగ్లీషుభాషతో మంచి పరిచయంగలవారిని అధ్యాపకులుగా నియమించింది. ఈవిధంగా అనేకరంగాలలో ముల్కీలు కానివారు ఉద్యోగు లయ్యారు. 1956 లో ఆంధ్రప్రదేశ్ నిర్మాణమైన తర్వాత ఆంధ్రప్రాంతాన నుండి ఈలాటి వారు అనేకులు వచ్చారు. తెలంగాణావారికి అంతకుపూర్వం ఉండిన ఉద్యోగావకాశాలు దీనిఫలితంగా తగ్గినవి. హైదరాబాదు

ఆంధ్రప్రదేశ్‌కు ప్రధాన నగరం కావడం చేత సెక్రటేరియట్ మొదలైన సంస్థలలో ఆంధ్రు లనేకులు ఉన్నత ఉద్యోగాలను అనుభవించే వారైనారు. ఈ పరిణామం తెలంగాణాకు చెందిన ఉద్యోగులకు, తదితరులకు రుచించలేదు. తమకు ఉద్యోగాలు లభించే అవకాశాలు సన్నగిల్లగలవనే కారణంగా విద్యార్థులుకూడా అసంతృప్తి చెందినారు. అందుచేతనే తెలంగాణాలో యన్. జి. వో. ఉద్యోగివర్గం, విద్యార్థులు తెలంగాణా ప్రత్యేక రాష్ట్రం నిర్మాణం కావలెననే ఉద్యమంలో ఎక్కువగా పాల్గొని దౌర్జన్య కార్యక్రమాలను, విధ్వంసక చర్యలను సాగించుటలో అగ్రస్థానం వహించారు. వారిని సంతృప్తిపరచుటకై బ్రహ్మానందరెడ్డి ప్రభుత్వం ఆంధ్ర ఉద్యోగులను ఆంధ్రప్రాంతానికి బదిలీ చేసింది. కాని వీరిలో కొందరు ఆంధ్రప్రదేశ్ నిర్మాణమైన తర్వాత ముల్కీ నిబంధనలు రాజ్యాంగవిరుద్ధ మనే వాదాన్ని లేవదీసి ఆంధ్రప్రదేశ్ హైకోర్టులో కేసు పెట్టారు. 1972 ఫిబ్రవరి 14 న హైకోర్టు వీరి వాదం చట్టసమ్మతమని, ముల్కీ నిబంధనలు రాజ్యాంగానికి విరుద్ధమని వాటిని కొట్టివేసింది. అప్పటికి బ్రహ్మానందరెడ్డిగారి స్థానే నరసింహారావుగారు ముఖ్యమంత్రిగా యుండినారు. వారి ప్రభుత్వం ఉన్నత న్యాయస్థానానికి అప్పీలు చేయగా అది ముల్కీ నిబంధనలు చెల్లగలవని తీర్పు చెప్పింది. ఇది ఆంధ్రుల అసంతృప్తికి కారణమైంది. తమ రాష్ట్రానికి ప్రధాన నగరమైన హైదరాబాదులో తమకు ఉద్యోగార్హతగాని, విద్యాభ్యాసం చేసే అర్హతగాని లేనప్పుడు తాము ఆంధ్రప్రదేశ్ నుండి విడిపోయి ప్రత్యేక రాష్ట్రాన్ని నిర్మాణం చేసుకొనడం మర్యాదగా ఉంటుందనే భావంతో ప్రత్యేకాంధ్ర రాష్ట్ర నిర్మాణోద్యమాన్ని ప్రారంభించారు. తెలంగాణా ఉద్యమంలో జరిగినట్లే ఇందులో కూడా విద్యార్థులు ప్రధాన పాత్రను వహించారు. సంఘ విద్రోహులు వారితో కలిశారు. శాంతి భద్రతలు అడుగంటినవి దౌర్జన్యాన్ని అణచే ఉద్దేశంతో ఇందిరా గాంధి ప్రభుత్వం 1973 జనవరి 18 న ఆంధ్రప్రదేశ్‌లో రాష్ట్రపతి పరిపాలనను విధించింది. కాని విధ్వంసక చర్యలు కొనసాగుతూనే ఉండినవి. రైల్వే ఆస్తికి, తపాలా ఆఫీసులకు,

ఇతర పబ్లిక్ భవనాలకు అపారనష్టం కలిగింది. ఉద్యమాన్ని అణచుటకు రాష్ట్రపతి పాలన సాధనం కాజాలదని ఇందిరా గాంధి ప్రభుత్వం గ్రహించింది.

దీనిఫలితంగా ఆంధ్ర, తెలంగాణా నాయకులు సంప్రదింపులు జరిపి తుదకు ఒక ఆరు అంశాల పథకాన్ని కేంద్ర ప్రభుత్వం రూపొందించింది. దీనిఫలితంగా ముల్కీ నిబంధనలు తొలగింపబడినవి. తెలంగాణాకే గాక వెనుకబడిన ప్రాంతాలన్నింటికీ అన్వయించే ప్లానింగ్ బోర్డు నిర్మాణమైంది. కొన్ని ఉద్యోగాలు స్థానికులకు కేటాయించబడినవి. హైదరాబాదులో ఒక కేంద్ర విశ్వవిద్యాలయం స్థాపించుటకు సన్నాహాలు జరిగినవి. ఈ పథకానికి నాయకులు అంగీకరించారు. దీనిఫలితంగా రాష్ట్రపతి పాలన తొలగి శ్రీ జలగం వెంగళరావు ముఖ్యమంత్రిగా 1973 డిసెంబరు 10 న నూతన ప్రభుత్వం ఏర్పడింది. ఆంధ్రప్రదేశ్ సమైక్యత పునరుద్ధరింపబడింది.

ప్రత్యేక రాష్ట్రాల నిర్మాణాన్ని వాంఛించడంలో ఎలాటి లోపంలేదు. ఆలాటి లక్ష్యాన్ని సాధించుటకు దౌర్జన్యంలోకి దిగి విధ్వంసకచర్యలను సాగించి, ప్రాణనష్టాన్ని, ఆస్తి నష్టాన్ని కలిగించడం ఏ పరిస్థితులలోను వాంఛనీయం కాజాలదు. ప్రజాస్వామ్యంలో శాంతియుతంగా తమ లక్ష్యాలను సాధించుటకు ఎంతో అవకాశం ఉన్నది. ఈవిషయాన్ని విస్మరించి రాజకీయ నాయకులు స్వార్థపరులై దౌర్జన్య చర్యలలోకి దిగడం గర్హించదగినది.

ఈ ఉద్యమాలు జరుగుతున్న కాలంలో నేను ఆంధ్రప్రదేశ్ సమైక్యతను నిలబెట్టడం వాంఛనీయమనే అభిప్రాయాన్ని సమావేశాలలోను, ఆకాశవాణి ప్రసంగాలలోను, పత్రికలకు వ్రాసిన వ్యాసాలలోను వ్యక్తంచేశాను. నా అభిప్రాయాలకు కొంత విలువ ఉన్నట్లు గ్రహించి కేంద్ర ప్రభుత్వ ఫిలింసు శాఖవారు (Films Division) అక్టోబరు 2 న నన్ను కలుసుకొని ఆరు అంశాల పథకాన్ని గురించి నేను వ్యక్తం చేసిన అభిప్రాయాలతో సహా ఒక చిత్రపటాన్ని (Film) తయారుచేసి దానిని కొన్ని వారాలపాటు

సినిమాలలో ప్రదర్శించారు. దీనిఫలితంగా సామాన్య ప్రజలలో అనేకులు నన్ను చూచి, నా మాటలను వినగలిగారు.

1973 లో రాష్ట్రంలో ఈ సంఘటనలు జరుగుతున్న కాలంలో నా మామూలు కార్యక్రమాలకు ఎలాటి భంగం కలుగలేదు. 22 గ్రంథ సమీక్షలు ప్రకటించాను. ఆకాశవాణిలో నాలుగు ప్రసంగాలు ( రాష్ట్ర సమైక్యత, మారుతున్న సమాజంలో అధ్యాపకుల పాత్ర, ఆరు అంశాల పథకం, కొన్ని ప్రశ్నలకు సమాధానాలు ) ప్రసారం చేశాను. దక్షిణ భారతంలో స్వాతంత్ర్యోద్యమం, భారతదేశంలో రాజనీతిశాస్త్ర ప్రస్తుత పరిస్థితి, ఆని బిసెంటు యువకులకు అందచేసిన సందేశం మొదలైన విషయాల గురించి సమావేశాలలో ప్రసంగించాను. రాజనీతి శాస్త్రాన్ని గురించిన నా ప్రసంగం అనేకులను ఆకర్షించింది. దానిని 'భారతీయ రాజనీతిశాస్త్ర' పత్రికలో ( Indian Journal of Political Science ) ప్రకటించారు. పిహెచ్. డి. ( Ph. D. ) పరీక్షాధి కారిగా బొంబాయి విశ్వవిద్యాలయానికి నవంబరులో వెళ్ళినాను. ఆ సమయంలో రాజనీతిశాఖ అధ్యాపకులు, విద్యార్థులు సమావేశమై మనదేశ రాజకీయాల గురించి నా ప్రసంగాన్ని విన్నారు.

1971 తర్వాత నా గ్రంథరచన కార్యక్రమం ఆగిపోయింది. 1972 లో భారతదేశ స్వాతంత్ర్యోద్యమ చరిత్రను గురించి ఒక గ్రంథాన్ని వ్రాయడం అవసరమని భావించి, దానికి సంబంధించిన గ్రంథాలను కొన్నింటిని చదివాను. దీనిని నూతన దృక్పథంతో వ్రాయ సమకట్టాను. దేశచరిత్రను ప్రపంచ చరిత్ర దృష్ట్యా వ్రాసినప్పుడే దానిని మనం చక్కగా అర్థంచేసికొన గలుగుతాము. ప్రపంచంలో ఇతర ప్రాంతాలలో జరిగిన సంఘటనల మూలంగా ప్రతిదేశ చరిత్ర ప్రభావిత మౌతున్నది. సమాజంలో వ్యక్తుల జీవితం సామాజిక జీవితంపై ఆధారపడినట్లే ఒక దేశంలోని ప్రజల జీవితవిధానం ఇతర ప్రాంతాలలో సంభవించే ఉద్యమము లపై ఆధారపడి ఉంటుంది. 1500 ప్రాంతాన యూరోపియన్లు మనదేశానికి ఒక సముద్ర మార్గాన్ని కనుగొన్న కారణంగా వారిలో కొందరు వర్తకవ్యాపారాలకై మనదేశానికి రావడం, వారి

రాశమూలంగా మన దేశాన్ని వారు జయించి పరిపాలించడం, మనం మన స్వాతంత్ర్యాన్ని కోల్పోవడం జరిగింది. ప్రపంచ చరిత్రలో ఆధునిక యుగం (క్రీ. శ. 1500 నుండి ప్రారంభమైన యుగం) ఖండాంతరాలపైన యూరోపియన్లు తమ ఆధిపత్యాన్ని స్థాపించిన యుగం. భారత దేశాన్ని జయించి బ్రిటిషువారు దానిని పాలించడం ఈ ఆధిపత్యంలో ఒక భాగం.

అలాగే 18-వ శతాబ్దం ఆఖరు భాగంతో ప్రారంభమైన యుగం విప్లవ యుగం. స్వాతంత్ర్యానికై అమెరికన్‌లు బ్రిటిషు వారితో ఏడు సంవత్సరములు యుద్ధంచేసి విజయాన్ని సంపాదించడంలో ఈ యుగం ప్రారంభమైంది. అది 1789 లో ఫ్రెంచి విప్లవానికి దారితీసింది. 1917 లో సోవియట్ రష్యాలో జరిగిన విప్లవం దీని ఫలితమే. ఇతర దేశాలలో స్వాతంత్ర్యాన్ని సంపాదించుటకై ప్రజలు విప్లవాలను లేవదీసినట్లే మనంకూడా ఒక విప్లవాన్ని లేవదీసి పరాయి పరిపాలనను తొలగించి స్వాతంత్ర్యాన్ని సంపాదించినాము. మన స్వాతంత్ర్యోద్యమ చరిత్రను ఈ దృక్పథంతో వివరించుటకు నేను ప్రయత్నించాను.

ఈ నా గ్రంథం మూడు భాగాలతో కూడినట్టిది. ఇందులో నేను రెండు ప్రధాన ప్రశ్నలకు సమాధానాలను సహేతుకంగాను, సమగ్రంగాను చెప్పదలచాను. వాటిలో మొదటిది, మనం మన స్వాతంత్ర్యాన్ని ఎందుకు, ఏ పరిస్థితుల్లో పోగొట్టుకొన్నాము అనేది. రెండవది, ఏ పరిస్థితులలో దానిని తిరిగి రాబట్టుకొన్నాము అనేది. ఈసందర్భంలో ఇవిగాక ఇతర ప్రశ్నలు కూడా మనం ఎదుర్కొనవలసి యుండినది. వాటి అన్నిటికి కూడా నేను నా గ్రంథంలో సమాధానాలు చెప్పుటకు ప్రయత్నించాను.

గ్రంథంలోని మొదటి భాగం 8 అధ్యాయాలతో కూడినట్టిది. వర్తకులుగా తూర్పు ఇండియా సంఘంగా ఏర్పడి క్రీ. శ. 1600 ప్రాంతాన మన దేశానికి వచ్చిన బ్రిటిషువారు 1740 వరకు వర్తకులుగా ఉండి అటుతర్వాత రాజకీయాలలో ప్రవేశించి 1856 నాటికి నయాన భయాన దేశమును జయించి వశపరచుకొన్న చరిత్రను వివరించాను. మన ఓటమికి రాజకీయ పరిస్థితులేగాక,

మన సాంఘిక, ఆర్థిక, వైజ్ఞానిక పరిస్థితులు కారణములని మొదటి అధ్యాయంలో స్పష్టపరచాను. రెండవ అధ్యాయంలో వారు ఏవిధంగా వారి సామ్రాజ్యాన్ని విస్తరింపజేసుకొన్నదీ, మూడవ అధ్యాయంలో కంపెనీ ఉద్యోగులు అవినీతికి పాల్పడి ప్రజలను దోచుకొనిన కారణంగా బ్రిటన్‌లోని పార్లమెంటు కంపెనీపై ఏవిధంగా ఆధిపత్యాన్ని వహించిందో, దానిమూలంగా భారత దేశంలోని బ్రిటిషు పరిపాలన వ్యవస్థ ఏవిధంగా మారిందో, ఈ మార్పుల వలన కలిగిన శాశ్వత ఫలితాలు ఏలాంటివో, బ్రిటిషు పరిపాలన తొలగి మనం మన దేశాన్ని స్వతంత్రంగా పరిపాలించు కొనగలిగిన తర్వాత కూడా వాటిలో కొన్నిటిని ఏవిధంగా అనుసరించడం జరిగిందో వివరించాను. ఈ వివరణలో కూడా కొంత నవ్యతను చూపగలిగాను. నాల్గవ అధ్యాయంలో బ్రిటిషు పరిపాలన కాలంలో భూస్వామిక విధానంలోను, పారిశ్రామిక రంగంలోను ఏలాంటి మార్పులు జరిగినవో వీటి ఫలితంగా ఒక భూస్వామిక వర్గము, ఒక సావుకారీ వర్గము, ఒక వ్యవసాయ కూలీల వర్గము, ఒక నిరుద్యోగి వర్గము ఏలాగు ఏర్పడినవో వివరించాను. ఈ వివరణలో కూడా ఒక నూతన దృక్పథాన్ని అనుసరించాను. అయిదవ అధ్యాయంలో కంపెనీ పరిపాలనా కాలంలో మత, విద్యా, సాంఘిక రంగాలలో సంభవించిన మార్పులను వివరించి, ఈ మార్పులు జరుగుటలో ఆనాడు బ్రిటన్‌లో బయలుదేరిన ఉద్యమాలు, తాత్విక సిద్ధాంతాలు ఎలాంటి ప్రభావాన్ని వహించినవో విపులంగా తెలియపరచాను. ఆరవ అధ్యాయంలో పై మార్పుల ఫలితంగా ప్రజలు అలజడులకు గురియై కంపెనీపై చేసిన తిరుగుబాటులను, వాటి స్వభావాన్ని వివరించాను.

గ్రంథంలోని ఏడవ అధ్యాయం చాలా ప్రధానమైనట్టిది. బ్రిటిషు పరిపాలనా ఫలితంగా ఇంగ్లీషువిద్య దేశంలో వ్యాప్తి గాంచి ఒక నూతన మేధావి వర్గం ఏర్పడినది. వీరు పాశ్చాత్య సంస్కృతితో సన్నిహిత సంబంధం కలవారయ్యారు. ఇదివరకు ప్రజలలో లేనట్టి రాజకీయ చైతన్యం వీరిలో అంకురించి వృద్ధి గాంచింది. దీనిఫలితంగా వీరు రాజకీయ సంఘాలను, సభలను

స్థాపించి, చట్టబద్ధమైన సక్రమ ఆందోళనలను లేవదీశారు. ఈనాటి రాజకీయ జీవితానికి పునాదులు వేసినవారు వీరే. దీనినంతను ఏడవ అధ్యాయంలో వివరించాను. ఎనిమిదవ అధ్యాయంలో 1857-'58 లో సంభవించిన గొప్ప తిరుగుబాటు కారణాలు, దాని చరిత్ర, అందులో పాల్గొనిన రాణి ఝాన్సీ వంటి ప్రముఖుల ధైర్యసాహసాలు, అది విఫలమగుటకు కారణాలు, దాని ఫలితాలు వివరించాను. ఈ తిరుగుబాటును గురించి చరిత్ర రచయితల మధ్య సంభవించిన వాదోపవాదాలను, వాటిలోని గుణదోషాలను సహేతుకంగా విమర్శించాను.

180 పుటలతో కూడిన ఈ భాగాన్ని వ్రాయడం నేను 1973 ఏప్రిల్ లో ప్రారంభించి సంవత్సరం ఆఖరుకు పూర్తిచేశాను. దీని ముద్రణను 1974 జూలైలో ప్రారంభించి, గ్రంథాన్ని సెప్టెంబరులో ప్రకటించాను.

గ్రంథంలోని రెండవ భాగాన్ని 1974 ఫిబ్రవరి 11 న ప్రారంభించి 1975 ఏప్రిల్ 8 న పూర్తి చేశాను. 1974 లో నా ఆరోగ్యం పూర్తిగా క్షీణించడంచేతను, ఇతరములైన కొన్ని తొందరపనులు చేపట్టడం అవసరం కావడంచేతను దీనిని వ్రాయుటకు సుమారు 14 నెలలు పట్టింది. ఇందులో 1858 నుండి 1918 వరకు స్వాతంత్ర్యోద్యమం దృష్ట్యా ప్రాధాన్యం వహించిన పరిణామాలన్నిటిని విపులంగాను, సమగ్రంగాను వివరించాను.

ఈ పరిణామాలన్నిటిని 1858 తర్వాత ప్రథమంలో ప్రముఖులలోను, అటుతర్వాత క్రమంగా సామాన్య ప్రజలలోను అంకురించి వృద్ధిగాంచిన జాతీయత (Nationalism) అనే నూతన భావం మౌలికమైన ఆధారం కావడంచేత ఈ 60 సంవత్సరాల కాలానికి 'జాతీయాభ్యుదయ కాలం' అని పేరు పెట్టాను. ఈ భావం స్వాతంత్ర్య సంపాదనకు దారితీయుటయేగాక దానిని సాధ్యం చేసింది. అందుచేత ఈ పేరు సర్వవిధాలా తగినట్టిది.

మొదటి అధ్యాయంలో జాతీయత అంటే ఏమిటో, అందులో ఇమిడియున్న విశాలార్థం ఏలాంటిదో, దానిచే ప్రభావితులైన ప్రజల మనోవైఖరి ఎలాగు ఉండగలదో వివరించాను. ఈ భావానికి

జన్మస్థానం బ్రిటిషు పరిపాలనా కాలంలో వ్యాపించిన ఇంగ్లీషు విద్య. దీనిమూలంగా ఇంగ్లీషు నేర్చిన విద్యార్థులకు పాశ్చాత్య సంస్కృతితోను, జాతీయభావంతోను, విప్లవాలతోను పరిచయం లభించింది. వారిలో జాతీయభావం రేకెత్తుటలో ఇది అమూల్య సాధనంగా పరిణమించింది.

ఇదిగాక, బ్రిటిషు పరిపాలన మూలంగా దేశంలోని ఆర్థిక పరిస్థితులు దిగజారిపోయి దారిద్ర్యం వ్యాపించడం, ఇంగ్లీషువిద్య ప్రభావంచేతను, ఇతర కారణాల మూలంగాను ప్రజల దృక్పథము మారి నూతన మత ఉద్యమాలు, సంఘ సంస్కరణ ఉద్యమాలు ప్రాబల్యం గాంచడంచేతను, వార్తాపత్రికలు (వాటిలో ప్రధానంగా దేశభాషా పత్రికలు) దేశాభిమానాన్ని పురికొల్పే నూతన వాఙ్మయము. జాతీయత వృద్ధిగాంచుటకు ప్రధాన కారణాలని, తంతి తపాలా సౌకర్యాలు, రోడ్లు రైల్వేలు మొదలైన ప్రయాణ సౌకర్యాలు ఈ భావాన్ని మరింత బలపరిచినవని 2, 6 అధ్యాయాలలో స్పష్టపరచాను. ఈ ఉద్యమాలు జాతీయతను బలపరచినట్లే జాతీయత కూడా వీటిని బలపరచినది. ఇవి అన్నీ పరస్పరాశ్రయము లని, ప్రజల వికాసానికి తోడ్పడినవని ఈ అధ్యాయాలలో వివరించాను.

జాతీయత ప్రజాజీవితానికి సంబంధించిన ఉద్యమాలన్నిటిపై ప్రభావం వహించినా రాజకీయోద్యమాలపై అది వహించిన ప్రభావం అగ్రస్థానం ఆక్రమించింది. దీనిచే ప్రభావితులైన ఇంగ్లీషు విద్యార్థికులు స్వాతంత్ర్యోద్యమాన్ని లేవదీసి దానిపై నాయకత్వం వహించి దానిని విజయవంతంగా సాగించారు. పాశ్చాత్య దేశాలలో ఈలాటి విప్లవాలను ఆధునిక యుగంలో ఏర్పడిన బూర్జువా వర్గం సాగించింది. మనదేశంలో పరాయి పరిపాలన కారణంగా భారతీయులతో కూడిన ఈలాటి వర్గం ఏర్పడలేదు. దేశంలోని బూర్జువాలలో అధికసంఖ్యాకులు బ్రిటిషువారే. అందుచేత విప్లవ కార్యకలాపాలను విద్యార్థికులు చేపట్టడం అవసరమైనది. ఇది మన విప్లవంలోని విశిష్టత. దీనిని గ్రంథంలో స్పష్టపరచాను.

ఈ కార్యక్రమాన్ని నిర్వహించడంలో విద్యార్థులు ప్రథమంలో రాష్ట్రాలకు మాత్రమే పరిమితములైన రాజకీయ సంఘాలను, అటుతర్వాత 1885 లో దేశానికంతా కేంద్రంగా కృషి చేయగల అఖిల భారత జాతీయ కాంగ్రెసును (Indian National Congress) స్థాపించారు. రాజకీయ సంఘా లన్నిటిలో ఇది అగ్రస్థానాన్ని వహించింది. 1981 తర్వాత గాంధీ మహాత్ముడు దీని ఆధ్వర్యంలోనే స్వాతంత్ర్యోద్యమాన్ని సాగించాడు. ఈ కారణంచేత దేశచరిత్ర చాలావరకు కాంగ్రెసు చరిత్రతో ముడిపడి పోయింది. ఇంతటి ప్రాధాన్యం వహించిన కాంగ్రెసు పుట్టుకకు ఏ పరిస్థితులు దారితీసినవో, కాంగ్రెసుకు పితామహుడని ప్రఖ్యాతిగాంచిన హ్యూం (Hume) ఇందులో ఏలాటి పాత్రను వహించాడో 7, 8 అధ్యాయాలలో వివరించాను. తొలిదశలో అతని ప్రభావం చేతనే కాంగ్రెసు మితవాదతత్వాన్ని అనుసరించింది. దానిపై నాయకత్వం వహించిన భారతీయులు సురేంద్రనాథ్ బెనర్జీ, గోపాలకృష్ణ గోఖలే, ఫిరోజ్ షా మెహతా మొదలైనవారు మితవాదులు. వీరు స్వాతంత్ర్య సంపాదనను లక్షణంగా పెట్టుకొన్నవారు కారు. బ్రిటిషు ప్రభుత్వానుండి కొన్ని సంస్కరణాలను రాబట్టుటకు మాత్రమే వీరు ప్రయత్నించారు. దీనికి కూడా వారు చట్టబద్ధమైన కార్యక్రమాలను అనుసరించారు. ఈవిధంగా వారి లక్ష్యంలోను, వారి కార్యక్రమ పద్ధతిలోను మితవాదతత్వం ప్రతిబింబితమైనది. 9-వ అధ్యాయంలో ఈవిషయాలను వివరించి ఇవి ఫలప్రదం కానందుకు కారణాలను పేర్కొన్నాను.

కాంగ్రెసు సాధనాన జాతీయతను, రాజకీయ ఉద్యమాలను బలపరచుటకు విద్యార్థులు చేసిన ప్రయత్నాలు బ్రిటిషు ప్రభుత్వానికి ఎంతమాత్రము రుచించలేదు. అది మితవాద తత్వాన్ని అనుసరించినా దానిపట్ల ద్వేషభావాన్ని వహించింది. దానిని బలహీనపరచుటకు అనేక విధానాలను అనుసరించింది. వాటిలో "విభజించి పాలించు" అనే భేదోపాయం అగ్రస్థానాన్ని వహించింది. ముస్లింలను హిందువులనుండి విడదీయుటకు, జమీందార్లు మొదలైన ఫ్యూడల్ వర్గాలను కాంగ్రెసు నుండి

వేరుపరచుటకు పన్నాగాలను పన్ని చాలావరకు విజయాన్ని సాధించింది. ముస్లింలలో ఒక ప్రధానవర్గం ప్రభుత్వ విధానాలకు లొంగి హిందువులు ఒకజాతివారని, ముస్లింలు వారితో ఎలాంటి సంబంధంలేని ఇంకొకజాతివారని ద్విజాతి సిద్ధాంతాన్ని ప్రతిపాదించసాగారు. ఈ సిద్ధాంతమే తుదకు దేశ విభజనకు, పాకిస్తాన్ నిర్మాణానికి దారితీసింది. ఈ పరిణామాలను, వీటికి ఆధారమైన బ్రిటిషువారి కుటిలనీతిని 7, 10 అధ్యాయాలలో వివరించాను.

మితవాదుల తత్వము వారి ప్రయత్నాలు ఫలప్రదములు కాకపోవడంచేత 1905 నాటికి దేశంలో జాతీయవాదులు (వీరినే అతివాదులని చరిత్రలో పేర్కొనడం జరిగింది) ఒక ప్రత్యేక రాజకీయ పక్షంగా స్వరాజ్య సంపాదనము ప్రజల లక్ష్యంగా ఉండవలెనని, దానిని సాధించుటకు చట్టబద్ధములైన కార్యక్రమములు పనికిరావని, పరాయి పరిపాలకులు బలప్రయోగానికి మాత్రమే లొంగగలరని, స్వాతంత్ర్య సంపాదనకు బలప్రయోగం చేయడంలో అధర్మం ఏదీ లేదని, భగవద్గీతాది గ్రంథాలు ధర్మయుద్ధాన్ని ప్రతిపాదిస్తున్నవని, కాని ఆనాటి దేశపరిస్థితులలో సాయుధ పోరాటం సాధ్యంకాదని, అందుచేత బ్రిటిషు వస్తువుల బహిష్కరణ, స్వదేశవస్తువుల వాడకము, జాతీయ విద్యావిధానం మొదలైనఅంశాలతో కూడిన సాత్వికనిరోధ కార్యక్రమం (Passive Resistance) అనుసరణయోగ్యమని ప్రతిపాదించారు. ఈ తత్వాన్ని ప్రచారంచేసిన వారిలో మహారాష్ట్రకు చెందిన బాలగంగాధర తిలక్, బెంగాలుకు చెందిన అరవింద ఘోష్, బిపిన్ చంద్రపాల్, పంజాబుకు చెందిన లజపతిరాయ్ ప్రముఖులు. కాంగ్రెసును తమ వశంలోకి తెచ్చుకొనిన పక్షంలో తమ కార్యక్రమాన్ని సాగించుట సులభసాధ్యం కాగలదని అందుకుగాను 1905 నుండి 1908 వరకు సర్వవిధాలా ప్రయత్నం చేశారు. కాని మితవాదులు పరాయి ప్రభుత్వ ఒత్తిడికి లోబడి, వీరికి బద్ధవిరోధులై 1907 లో సూరత్‌లో జరిగిన సమావేశంలో కాంగ్రెసు నుండి వీరు (జాతీయ వాదులు) తొలగి పోవలసిన పరిస్థితులను కల్పించారు. అది మొదలు 1918 వరకు కాంగ్రెసు అన్ని పక్షాలతో కూడిన జాతీయసంస్థ అను పేరును కోల్పోయి, పూర్తిగా మితవాదుల

సంస్థగా మారి, పరాయి ప్రభుత్వానికి అండగా నిలబడి, ప్రజల ఆదరణను కోల్పోయింది. ఈ పరిణామాలన్నిటిని 11, 12 అధ్యాయాలలో విశదపరచాను.

జాతీయవాదులకు కాంగ్రెసులో స్థానం లభించకపోయినా ప్రజలపై వారు ప్రభావం వహిస్తూనే వచ్చారు. బెంగాలు రాష్ట్ర విభజన రద్దుకై బెంగాలీలు 1905-'11 లో సాగించిన ఉద్యమంలో ఈ ప్రభావం స్పష్టంగా కనుపించింది. ఇందులో బెంగాలీలు సాత్విక నిరోధ కార్యక్రమాన్ని అనుసరించి ప్రభుశక్తికంటే ప్రజాశక్తియే బలవత్తరమని ఋజువుచేశారు. దీని ఫలితంగా ప్రభుత్వం రాష్ట్ర విభజనను రద్దుచేసి సమైక్య బెంగాలు రాష్ట్రాన్ని పునర్నిర్మాణం గావించింది. బెంగాలీలు లేవదీసిన ఈ ఉద్యమం వందేమాతర ఉద్యమంగా చరిత్రలో ప్రఖ్యాతి గాంచింది. దీని వివరాలను 12-వ అధ్యాయంలో తెలియపరచాను.

ఇదే కాలంలో ముస్లింలను, మితవాదులను, ఫ్యూడల్ వర్గాలను కొంతవరకైనా తృప్తిపరచడం అవసరమని పరాయి ప్రభుత్వం భావించి. "విభజించి పాలించు" అనే సూత్రాన్ని ఆధారం చేసుకొని మింటో - మార్లే సంస్కరణలను ప్రవేశపెట్టింది. ఈవిషయాన్ని 13-వ అధ్యాయంలో వివరించాను.

ఈ సంస్కరణలు జాతీయవాదులకు ఎలాటి తృప్తిని కలిగించలేదు.ఆ సమయంలో దివ్యజ్ఞాన సమాజానికి అధ్యక్షురాలై నట్టిన్నీ, జాతీయవిద్యా విధానాన్ని రూపొందించుటలో సుమారు 20 సంవత్సరాలు ప్రధానపాత్ర వహించినట్టిన్నీ అని బిసెంటు ఒక వైపున, ఆరు సంవత్సరాలు మాండలే జైలులో బంధింపబడి 1916 లో విడుదల గాంచినట్టి బాలగంగాధర తిలక్ ఇంకొకవైపున ఆంతరంగిక విషయాలలో భారతదేశానికి సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని సంపాదించ గోరి "హోం రూలు" ఉద్యమాన్ని కొనసాగించారు. అది కొంతవరకు ఫలప్రదమైనది. 1919 లో ప్రభుత్వం ప్రవేశపెట్టిన మాంటేగు - ఛెమ్సుఫర్డు సంస్కరణలు దని ఫలితమే. 14, 15 అధ్యాయాలలో వీటిని వివరించాను.

గ్రంథంలో విప్లవ ఉద్యమాన్ని పూర్తిగా వివరించే 16-వ అధ్యాయం చాలా ప్రధానమైనట్టిది. ఈ ఉద్యమాన్ని గురించిన వివరాలు ఇతర గ్రంథాలలో ఎక్కువగా ఉండడంలేదు. ఇది ఒక లోపంగా నేను భావించాను. దానిని పూరించుటకు ఈ అధ్యాయాన్ని వ్రాశాను. విప్లవ ఉద్యమానికి బెంగాలు రాష్ట్రం జన్మస్థానమైనా మహారాష్ట్ర, పంజాబులలో కూడా దాని ప్రభావం కనుపించింది. ఈ ఉద్యమం సాగుతున్న రోజులలో బ్రిటిషు అధికారులు, వారిక్రింద పనిచేసే భారతీయులు భీతావహులై పిడికిలిలో ప్రాణంపెట్టుకొని జీవితాన్ని సాగించారు. భారతదేశాన్ని బలప్రయోగ సాధనాన నిరంకుశంగా పాలించడం సాధ్యమా అనే సందేహం అధికారులనేకులకు కలిగింది. అందుచేత స్వాతంత్ర్య సంపాదనలో ఈ ఉద్యమానికి కూడా గొప్ప స్థానం ఉన్నది.

1858–1918 మధ్య దేశంలో సంభవించిన పరిణామాలు, ప్రజలలో అంకురించి వృద్ధిగాంచిన జాతీయుత, అఖిల భారత కాంగ్రెసు స్థాపన, వందేమాతరం ఉద్యమం, హోంరూల్ ఉద్యమం, విప్లవ ఉద్యమం మొదలైన ఉద్యమాలు ప్రజల వైఖరిని పూర్తిగా మార్చగలిగినవి. స్వరాజ్య సంపాదనపట్ల సుముఖత్వము, పరాయి పరిపాలనపట్ల విముఖత్వము వారిలో నాటుకొన్నవి. అందు చేతనే వారు 1918 తర్వాత గాంధీమహాత్మునికి అనుచరులై ఆయన సాగించిన స్వాతంత్ర్య సమరంలో అధికసంఖ్యలో పాల్గొన్నారు. ఈకారణంచేత ఈ అరవై సంవత్సరాలలో జరిగిన పరిణామాలు మన స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో ప్రాధాన్యం వహిస్తున్నవి. దీనిని స్పష్టపరచే ఉద్దేశంతో నేను గ్రంథంలోని రెండవ భాగాన్ని వ్రాశాను. నా ఉద్దేశం కొనసాగిందనే నా విశ్వాసం. దీనిని ముద్రించి 1976 ఆగస్టున విడుదల చేశాను.

నా గ్రంథంలో మూడవ భాగాన్ని వ్రాయుటకు 1975 మే 2 న ప్రారంభించి డిసెంబరు 22 న దానిని పూర్తిచేశాను. ఈ భాగంలో 1918 మొదలు 1947 ఆగస్టు 15 వరకు జరిగిన పరిణామాలను వివరించాను. 1918 లో గాంధీమహాత్ముడు రాజకీయరంగంలో ప్రవేశించి క్రమక్రమంగా స్వాతంత్ర్యోద్య

మానికి ఏకైక నాయకుడైనాడు. 1947 ఆగస్టు 15 న పరాయి ప్రభుత్వం తొలగి మనకు సంపూర్ణ స్వాతంత్ర్యం లభించింది. ఈ 29 సంవత్సరాల కాలానికి గాంధీయుగ మని పేరుపెట్టాను.

ఆయన ఆశయాలకు, వాటిని సాధించుటకు ఆయన అనుసరించిన సాధనాలకు దక్షిణ ఆఫ్రికాలో ఆయన గడించిన అనుభవం ఆధారం. అందుచేత మొదటి అధ్యాయంలో ఆ అనుభవాన్ని, అది ఆయనపై వహించిన ప్రభావాన్ని విపులంగా వివరించాను.

సమాజంలోని అన్యాయాలు ఏ రంగానికి సంబంధించినా, వాటిని నిర్మూలించుటకు సత్య అహింసలతో కూడిన సత్యాగ్రహం సాధనమనేది ఆయన కార్యక్రమాలకు మౌలిక లక్షణం. దీనిని దక్షిణ ఆఫ్రికాలో వినియోగించి అక్కడి శ్వేతజాతి ప్రభుత్వ మూలంగా అక్కడ జీవనాన్ని సాగిస్తూన్న భారతీయులు అనుభవిస్తున్న అన్యాయాలలో అనేకాన్ని తొలగించ గలిగాడు. భారత దేశానికి స్వాతంత్ర్యం సంపాదించుటకు ఇది ఒక్కటే పటిష్ఠ సాధనమనే విశ్వాసంతో ఆయన 1915 లో స్వదేశానికి తిరిగి వచ్చాడు. దీనిని దశలవారీగా వినియోగించి తుదకు విజయాన్ని సంపాదించాడు.

ఇదిగాక సామాన్య ప్రజల సహకారం లేక—వారిలోను ప్రధానంగా గ్రామీణ ప్రజల సహకారం లేక—స్వరాజ్యాన్ని సంపాదించడం సాధ్యం కాదని ఆయన విశ్వసించాడు. అలాగు సంపాదించిన స్వరాజ్యమే వాస్తవమైన స్వరాజ్యమని ఆయన సాగించిన నిరాడంబర జీవితం, ఆయనలోని త్రికరణశుద్ధి ప్రజలను ఆకర్షించి, ఆయన ఋషితుల్యుడనే భావం వారికి కలిగించింది. దేశానికి విముక్తి కలిగించుటకు ఆయన అవతరించినట్లు వారు విశ్వసించారు. అందుచేత ఆయన నాయకత్వాన్ని శిరసావహించి అత్యధికసంఖ్యలో సామాన్య ప్రజలు స్వాతంత్ర్య సమరంలో పాల్గొన్నారు. ఆ సమరాన్ని ప్రజాసమరంగా మార్చారు. అందుచేతనే స్వాతంత్ర్యం లభించిన తర్వాత మనం పరిపాలనను స్థాపించుకొన్నాము.

1919 లో ఆయన రౌలట్ సత్యాగ్రహంతో అఖిలభారత సత్యాగ్రహాలను ప్రారంభించాడు. ఖిలాఫత్ సమస్యను పరిష్క-

రించుటకు, పంజాబు దురంతాలకు ప్రభుత్వాననుండి ప్రతిక్రియను రాబట్టుటకు, స్వరాజ్యాన్ని సంపాదించుటకు 1921-'22 లో సహాయ నిరాకరణోద్యమాన్ని సాగించాడు. వీటిని గురించి 4,6 అధ్యాయాలలోను ; 8,10 అధ్యాయాలలోను ; 14,16 అధ్యాయాలలోను ; 14,15 అధ్యాయాలలోను వివరించాను. ఈకాలంలో విప్లవవాదులు వారి ఉద్యమాన్ని పునరుద్ధరించి అధికారులను భీతావహుల చేశారు. దీనిని 11-వ అధ్యాయంలో వివరించాను. విప్లవకర్తలలో భగత్ సింగు వంటివారు ప్రదర్శించిన ధైర్యసాహసాలు, వారి త్యాగశీలము ప్రశంసనీయములని, అందుచేత వారు ప్రజలను ఆకర్షించగలిగారని స్పష్టం చేశాను. 1944 నాటికి సమరరూపం ధరించిన స్వాతంత్ర్యోద్యమం ముగిసింది. ప్రజలను ఎదుర్కొని భారతదేశాన్ని పాలించడం తమకు సాధ్యం కాదని బ్రిటిషువారు నిర్ణయించుకొన్నారు రెండవ ప్రపంచ యుద్ధకాలంలో జపాన్ వారికి వశపడిపోయిన భారతీయ సిపాయీలను సుసంఘటితపరచి సుభాష్ చంద్ర బోసు బర్మా మీదుగా జపాన్ వారి సహాయంతో ఈశాన్య ప్రాంతాలను ప్రవేశించి కొన్ని విజయాలను సాధించిన కారణంగా 1740 నుండి తమకు అండగా నిలబడిన సిపాయీలలో కూడా దేశాభిమానము, స్వరాజ్య సంపాదనపట్ల పట్టుదల నాటుకొన్నవని బ్రిటిషువారు గ్రహించారు. అందుచేత వారు కాంగ్రెసు నాయకులతో సంప్రదింపులు జరిపి, శాంతియుతంగా తమ అధికారాన్ని వదలుకొనుటకు కృతనిశ్చయులైనారు. ఈ సంప్రదింపులు రెండు ఘట్టాలలో జరిగినవి. వాటిని 16,17 అధ్యాయాలలో వివరించాను. అన్ని అధ్యాయాలలో అవసరమైనప్పుడు బిటిషు ప్రభుత్వం ప్రవేశపెట్టిన సంస్కరణలను, మూస్లింలు జిన్నా నాయకత్వంలో వహించిన వైఖరిని వివరించాను. ఈ పరిణామాలన్నిటి ఫలితంగా 1947 ఆగస్టు 15 న మూటా ముల్లె కట్టుకొని బ్రిటిషువారు తొలగిపోవడం, దేశానికి స్వాతంత్ర్యం లభించడం, స్వాతంత్ర్యంతో పాటు దేశవిభజన జరగడం 18-వ అధ్యాయంలో వివరించాను. ఈ అధ్యాయం ఆఖరుభాగంలో మనం సాధించిన స్వాతంత్ర్యోద్యమం

లోని విశిష్టతను మనదేశ చరిత్ర దృష్ట్యాను, ప్రపంచ చరిత్ర దృష్ట్యాను దీని ప్రాధాన్యాన్ని దృష్టాంత సహితంగా విశదపరచాను.

ఈవిధంగా 1973 లో నేను ప్రారంభించిన మూడు భాగాలతో కూడిన భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్ర రచనను 1975 లో పూర్తిచేయగలిగాను. మనం ఏ పరిస్థితుల్లో స్వాతంత్ర్యం కోల్పోయినది, ఏ పరిస్థితులలో దానిని తిరిగి సంపాదించినది సామాన్య ప్రజలకు తెలియపరచే ఉద్దేశంతో నేను ఈ రచనను చేసినాను. ఇంగ్లీషులో స్వాతంత్ర్యోద్యమాన్ని గురించి ప్రామాణిక గ్రంథాలు అనేకం ఉన్నా ఇంగ్లీషుభాషతో ఎక్కువ పరిచయం లేనివారికి తెలుగులో అలాటి గ్రంథం అవసరమని భావించి ఈ గ్రంథాన్ని వ్రాశాను.

ప్రతిదేశచరిత్రపై ప్రపంచ చరిత్ర గొప్ప ప్రభావాన్ని వహిస్తుందని ఇదివరలో చెప్పాను. మన స్వాతంత్ర్య సమర చరిత్ర దీనిని స్పష్టం చేస్తున్నది. తమ అధికారాన్ని వదులుకొని బ్రిటిషువారు మన దేశానుండి వెళ్ళిపోవుటకు గాంధీమహాత్ముని నాయకత్వంలో మనం సాగించిన పోరాటం మాత్రమే కారణం కాదు. రెండవ ప్రపంచయుద్ధం కూడా దీనికి కారణం. ఈ యుద్ధంలో బ్రిటిష్‌వారి సైనిక నౌకా వైమానిక బలాలకు అపారనష్టం కలిగింది. ఆర్థికంగా వారు దివాలా తీశారు. భారత దేశాన్ని తమ వశంలో ఉంచుకొని పరిపాలించుట తమకు సాధ్యం కాదని గ్రహించారు. ఈవిధంగా రెండవ ప్రపంచయుద్ధం వారు వెళ్ళిపోవుటకు, మనకు స్వాతంత్ర్యం లభించుటకు కారణాలలో ఒకటి. దీనిని నేను నా మూడవ భాగంలో స్పష్టం చేశాను. చరిత్రను ఈ దృక్పథంతో పరిశీలించినప్పుడే దానిని చక్కగాను, పూర్తిగాను అర్థంచేసుకొనగలుగుతాము.

1974 లో స్వాతంత్ర్యోద్యమ చరిత్రతోపాటు "కేంద్ర రాష్ట్ర సంబంధాలు" (Central State Relations) అనే గ్రంథాన్ని ప్రభుత్వం హైదరాబాదులో స్థాపించిన తెలుగు అకాడమి కోరిక ననుసరించి నేను రచించాను. ఇది 8 అధ్యాయాలతో కూడిన 140 పుటల గ్రంథం. దీనిని కళాశాలలోని విద్యార్థులకు, అధ్యాపకు

లకు ఉపయోగపడునట్లుగా నేను రచించినా, మన పరిపాలన విధానాన్ని అర్థంచేసుకొనదలచిన సామాన్య పౌరులకు కూడా ఇది ఉపయోగపడగలదని నా విశ్వాసం. ప్రజాస్వామికంలో ప్రతి పౌరునికి దేశపరిపాలన ఏ సూత్రాల ననుసరించి జరుగుచున్నదో తెలుసుకొనవలసి యున్నది. ఈ గ్రంథం చాలావరకు ఆ అవసరాన్ని తీరుస్తున్నది.

రాజనీతిశాస్త్రవేత్తలు పరిపాలనా విధానాలను ఏకకేంద్ర విధానములని, సమాఖ్య విధానములని వర్గీకరణ చేస్తారు. వీటి మధ్యగల తారతమ్యాలను, సమాఖ్య వ్యవస్థ లక్షణాలను, మన పరిపాలన విధానం ఏకారణాలచేత సమాఖ్య విధానంగా పరిగణింపబడుతున్నదో మొదటి అధ్యాయంలో వివరించాను. అన్ని దేశాలలోని సమాఖ్య విధానాలు ఒకే మోస్తరుగా ఉండవు. ఆ యా దేశాల చరిత్ర రాజకీయ, సాంఘిక, ఆర్థిక పరిస్థితుల మూలంగా వీటి మధ్య తారతమ్యాలు ఏర్పడతవి. ఈ విషయాన్ని కూడా మొదటి అధ్యాయంలో స్పష్టం చేసినాను.

స్వతంత్రం లభించిన తర్వాత రాజ్యాంగాన్ని నిర్మాణం చేయుటకు ఏర్పడిన రాజ్యాంగసభ ఏ కారణాల మూలంగా సమాఖ్య విధానాన్ని వరించిందో, అది రూపొందించిన సమాఖ్య ఏ కారణంచేత కేంద్రీకృతమైనదో, దాని మౌలిక లక్షణాలు ఎలాంటివో రెండవ అధ్యాయంలో వివరించాను. మన సమాఖ్యలో అధికారాలు కేంద్ర రాష్ట్రాల మధ్య ఏ విధంగా విభజింపబడినవో, అందుకుగాను మూడు జాబితాలు తయారుకావడం, దానికి కారణాలు మూడవ అధ్యాయంలో తెలియపరచాను. సమాఖ్య విధానంలో స్వతంత్రంగల ఒక కేంద్ర ప్రభుత్వంతో పాటు, స్వతంత్రంగల రాష్ట్ర ప్రభుత్వాలు ఏర్పడినా వాటిమధ్య పరస్పర సంబంధాలు అనేకం ఉండక తప్పదు ఈ సంబంధాలు పలురకాలుగా ఉంటవి. మూడవ అధ్యాయంలో శాసన రంగంలోను, కార్య నిర్వహణ రంగంలోను, న్యాయవిచారణ రంగంలోను ఈ సంబంధాలు ఏలాంటివో వివరించాను.

నాల్గవ అధ్యాయంలో ఆర్థిక సంబంధాలు ఏలాంటివో, రాష్ట్రాలు నిధులకై కేంద్రంపై ఏవిధంగా ఆధారపడి ఉన్నవో,

ఈ వివరాళాలలోని వైవిధ్యము, ఈ విషయంలో 5 సంవత్సరాల కొక పర్యాయం స్థాపించబడే ఆర్థిక కమీషన్ (Finance Commission) ఎలాటి పాత్రను వహిస్తున్నదో స్పష్టం చేశాను. స్వతంత్ర భారతానికి పంచవర్ష ప్రణాళికలు ఒక ప్రధాన లక్షణం. దీనిమూలంగా కూడా కేంద్ర రాష్ట్రాల పరస్పర సంబంధాలు ఏర్పడుతున్నవి. ఇందులో కేంద్రాధికారం ప్రాధాన్యం వహిస్తున్నది. రాష్ట్రాల ప్రధాన మంత్రులతో కూడిన జాతీయాయాభివృద్ధి సభ (National Development Council) కు ప్రణాళికలను రూపొందించటంలో అనేక అధికారాలు ఉన్నా ముఖ్యమంత్రులు ఈ విషయంలో ఎక్కువ శ్రద్ధను వహించని కారణంగా రాజ్యాంగం మూలంగా రాష్ట్రాలకు లభించిన స్వాతంత్ర్యం దెబ్బతింటున్నది. ఇటీవలి కాలంలో ముఖ్యమంత్రుల ధోరణి మారుతున్నది. అందుచేత ప్రణాళికల నిర్మాణ విషయంలో వారి అధికారం పెరిగే సూచనలు కనిపిస్తున్నవి. వీటి నన్నిటిని 5-వ అధ్యాయంలో వివరించాను.

కేంద్రాన్ని, రాష్ట్రాలను పరిపాలించుటకు ఏర్పడిన కొన్ని సంస్థల మూలంగా (రాజ్య సభ, గవర్నరులు వగైరా) కూడా కేంద్ర రాష్ట్ర సంబంధాలు ప్రభావిత మౌతున్నవి. 1967 తర్వాత గవర్నరుల పాత్ర ప్రాధాన్యం వహించసాగింది. వారిని నియమించడంలోను, తొలగించడంలోను కేంద్రానికి మాత్రమే అధికారం ఉండడంచేత సాధారణంగా వారు కేంద్రంపట్ల పక్షపాత దృష్టిని ప్రదర్శించడం పరిపాటి అయింది. ఆరవ అధ్యాయంలో ఈ సంబంధాలను విశదీకరించాను.

ఏడవ అధ్యాయంలో అత్యవసర పరిస్థితులలో రాష్ట్రాలు కేంద్రానికి పూర్తిగా లోబడడం జరుగుతున్నది. అందుచేత మామూలు కాలంలోని సంబంధాలకు, అత్యవసర పరిస్థితిలోని సంబంధాలకు ఎక్కువ తారతమ్యం ఉన్నది. అత్యవసర పరిస్థితులలో కూడా వైవిధ్యం ఉంటున్నది. ఈ విషయా లన్నిటినీ ఏడవ అధ్యాయంలో వివరించాను.

మన సమాఖ్య పరిపాలనా విధానం 1950 లో అమలులోకి వచ్చింది. అప్పు డది కేంద్రీకృతంగా ఉండినది. కాలక్రమాన

జరిగిన పరిణామాల మూలంగా ఇది మరింత కేంద్రీకృతమైనది. ఈ పరిణామాల స్వభావం ఎలాంటిదో ఎనిమిదవ అధ్యాయంలో వివరించాను. రాష్ట్రప్రభుత్వాలకు కేంద్రాధికారాలు పెరగడం అంగీకారయోగ్యం కాజాలదు. కాని ఇష్టం ఉన్నా లేకపోయినా అవి ఈ పరిణామాల ప్రభావంచేత నిస్సహాయస్థితిలో ఉంటున్నవి. రాజ్యాంగం ఒకటి ఉన్నా ఏ దేశంలో కూడా పరిపాలన విధానం దాని ప్రకారం జరగడం సాధ్యంకాదు. ఏవిధంగా మనదేశంలో 1950 తర్వాత జరిగిన పరిణామాలు కేంద్ర రాష్ట్ర సంబంధాలను మార్చగలిగినవో ఎనిమిదవ అధ్యాయంలో స్పష్టం చేశాను. రాజ్యాంగం అనేది ఒక కరడుకట్టుకొనిపోయిన మౌలిక చట్టం కాదు. అది సజీవమై కాలానుసారంగా మారుతూ ఉంటుంది. ఈ మార్పుకూడా చాలా అవసరం. ఈ విషయాలన్నిటిని దృష్టాంతాల సహితంగా ఈ అధ్యాయంలో వివరించాను.

మన సమాఖ్య విధానంలోని విశిష్టతను తెలుసుకోన దలచినవారందరికి ఈ గ్రంథం చాలా ఉపయోగపడగలదు. నేను చాలా కాలాన నుండి సమాఖ్య పరిపాలనా విధానంలో పరిశోధన చేస్తూ ఉన్నాను. రాజనీతిశాస్త్రంలో ఇది నా అభిమాన శాఖ. అందుచేత 'కేంద్ర రాష్ట్రాల సంబంధాలు' అనే గ్రంథాన్ని వ్రాయడం నాకు సులభసాధ్యమైంది. ఇతరులచే వ్రాయించిన గ్రంథా లన్నిటికి తెలుగు అకాడమీ ఒక సంపాదకుని నియమించి గ్రంథంలోని లోపాలను సరిదిద్దే బాధ్యతను అతనికి ఒప్పగించడం పరిపాటి. నా గ్రంథం విషయంలో నాపైన అజమాయిషీ జరుపుటకు సంపాదకుని నియమించలేదు. గ్రంథరచనలో వారు నాకు సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని కల్పించారు.

1974 లో తెలుగు అకాడమీవారి కోరికను అనుసరించి గాంధీ మహాత్ముని గురించి డాక్టర్ ఆర్. వి. రావుగారు వ్రాసిన గ్రంథానికి సంపాదకత్వ బాధ్యతను వహించి అందులోని లోపాలను సవరించాను. స్వయంగా గ్రంథాలను వ్రాయుటకంటె ఇతరులు వ్రాసిన గ్రంథాలను సవరించడం ఎక్కువ కష్టంతో కూడుకొన్నట్టిది అనే గుణపాఠాన్ని ఈలాటి సంపాదకత్వాల మూలంగా గ్రహించాను.

1975 డిసెంబరులో నా 'భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్ర' మూడవ భాగాన్ని పూర్తి చేసిన తర్వాత మరి ఏలాటి గ్రంథ రచనకు నేను పూనుకోలేదు. కాని నా మిత్రులు కొందరు నా జీవిత విశేషాలను వివరిస్తూ ఒక స్వీయచరిత్రను వ్రాయవలసిందిగా పదే పదే చెప్తూ వచ్చారు. అనారోగ్యం కారణంగా దానిని వ్రాయడం సులభసాధ్యంకాదనేది నాకు తెలిసినా 1978 జూన్‌లో దానికి పూనుకొన్నాను. అందులో చాలా భాగాన్ని వ్రాశాను. ఇప్పటికీ (1979 ఏప్రిల్ ఆఖరుకు) దానిని పూర్తి చేయలేదు. బహుశా మే ఆఖరుకు దానిని పూర్తిచేయగలనని భావిస్తున్నాను.

నేను వ్రాసిన గ్రంథాలలో రెండు మూడు తప్ప తక్కిన వాటి నన్నిటిని ప్రకటనదార్ల (Publishers) కోరికపైన వ్రాశాను. అందుచేత వాటిని ముద్రించడం, అమ్మకంచేయడం, మొదలైన బాధ్యతలను వారే వహించారు. ముద్రణ ఖర్చులను కూడా వారే భరించారు. కాని ఇటీవల నేను రచించిన "కౌటిల్యుని అర్థశాస్త్రము", "భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్ర" లను నేనే స్వయంగా ముద్రించి ప్రకటించవలసి వచ్చింది. ముద్రణకు కావలసిన పెట్టుబడిని నేనే పెట్టవలసివచ్చింది. తెలుగు గ్రంథాలను ప్రకటించే ప్రకటన సంస్థలు ఆంధ్ర దేశంలో అనేకం ఉన్నవి. కాని అవి నవలలు, కథలు, కథానికలు, నాటకాలు మొదలైన వాటినే ఎక్కువగా ప్రకటిస్తున్నవి. వీటికి సులభంగా ప్రజల ఆదరణ లభించడం, అందుచేత వీటి అమ్మకం సులభసాధ్యం కావడం, దీనిమూలంగా వెంటనే ఎక్కువ లాభాలు సంపాదించుటకు అవకాశం ఉండడం దీనికి ప్రధాన కారణం. కౌటిల్యుని అర్థశాస్త్రము వంటి శాస్త్ర గ్రంథాలకు, చరిత్ర గ్రంథాలకు ఈలాటి ఆదరణ, గిరాకి లేవు. అందుచేత ఈ గ్రంథాలను ముద్రించి ప్రకటించే బాధ్యతను, అమ్మకంచేసే బాధ్యతను నేనే వహించవలసి వచ్చింది. నేను గ్రంథకర్తనే గాక వర్తక వ్యాపారాలను చేయడం అవసరమైంది. ఇది నా ప్రకృతికి విరుద్ధం. ఇందుకు కావలసిన నైపుణ్యాం నాకు లేదు. అయినా ఈ కార్యక్రమాన్ని చేపట్టడం తప్పిందికాదు.

పెట్టుబడి విషయంలో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం నాకు చాలా సహాయం చేసింది. కౌటిల్యుని అర్థశాస్త్ర ముద్రణ సమయంలో విద్యాశాఖమంత్రి శ్రీ టి. వి. రాఘవులుగారు నేను దరఖాస్తు పంపిన వెంటనే రు. 5000 లు మంజూరు చేశారు. ముద్రణ ఖర్చులలో సగభాగం నాకు ఈవిధంగా లభించింది. స్వాతంత్ర్యోద్యమ చరిత్ర మొదటి భాగాన్ని పూర్తిచేసే నాటికి శ్రీ జలగం వెంగళ రావుగారు ముఖ్యమంత్రిగా ఉండినారు. వారి ప్రోత్సాహంచేతనే నేను "ఆంధ్రప్రదేశ్‌లో పంచాయతీరాజ్యం" అనే గ్రంథాన్ని వ్రాసినట్లు ఇదివరలో చెప్పినాను. అప్పటినుంచి వారికి నాపట్ల గౌరవాభిమానాలు కలిగినవి. వాటిని పురస్కరించుకొని స్వాతంత్ర్యోద్యమ చరిత్ర మొదటి భాగాన్ని ముద్రించడంలో సహాయంచేయవలసిందిగా నేను వారిని కోరాను. వారికి ఔదార్యం సహజమైన గుణం. నేను వారిని కోరిన వెంటనే వారు నాకు రు. 7,5000 లు మంజూరు చేశారు. రెండవ భాగం ముద్రణ విషయంలో కూడా ఇంతటి సహాయాన్ని వారు చేశారు. కాని మూడవ భాగం ముద్రణనాటికి గ్రంథకర్తలకు గ్రాంటులు మంజూరుచేయుటకు సంబంధించిన నిబంధనలు మారిన కారణంగా (ఇది నా ఊహ) వారు గ్రాంటును మంజూరు చేయుటకు బదులు నా దరఖాస్తును విద్యాశాఖ కార్యదర్శికి పంపినారు. వీరు దానిని గ్రాంటుల కమిటీ సిఫారసులకు పంపినారు. ఈ తంతు పూర్తి అగుటకు అనేక నెలలు పట్టింది. తుదకు రు. 6750 లు మాత్రమే గ్రాంటుగా నాకు లభించింది. కాని ఎంతో కొంత లభించినందుకు నేను సంతోషించాను.

ముద్రించిన తర్వాత గ్రంథాలను అమ్మకంచేసే విషయంలో నేను అనేక చిక్కులను ఎదుర్కొనవలసి వచ్చింది. ప్రకటన దార్లు అనేక గ్రంథాలను ప్రకటించి అమ్మకం చేసేవారు కావడం చేత వారు వారి ఏజెంట్లను ఊరూరికి పంపి వారి ద్వారా ఆర్డర్లను సంపాదించే స్థితిలో ఉన్నారు. ఇంతటి ఖర్చును భరించడం నాకు సాధ్యంకాని పని. విద్యావంతులైన వ్యక్తులలో నలుగురైదుగురు తప్ప తక్కిన వారెవ్వరు నా గ్రంథాలను కొనుగోలు చెయ్యలేదు. వాటి అమ్మకానికి నేను విద్యాలయాలు, జిల్లా గ్రంథాలయ

సంస్థలు, జిల్లాపరిషత్తులు మొదలైన సంస్థలపైన ఆధారపడవలసి వచ్చింది. అధ్యాపకులకు, విద్యార్థులకు నా గ్రంథాలు ఉపయోగ పడగలవనే కారణంగా విద్యాలయాలు వాటిని కొనుగోలు చేయగలవని నేను భావించాను. కాని నేను అనుకొన్నంత మేరకు ఇది జరగలేదు. కొన్ని కళాశాలాధికారులు మాత్రమే నా గ్రంథాలను కొన్నారు. అదికూడా వారికి పదే పదే ఉత్తరాలు వ్రాసిన తర్వాత జరిగినది. స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో మొదటి భాగాన్ని కొన్నవారు తక్కిన భాగాలను కొనలేదు. దీనికి వారి ఉదాసీనత తప్ప కారణాంతరాలు ఏవీ కనుపించలేదు. జిల్లా గ్రంథాలయ సంస్థలు కూడా ఈలాగే ప్రవర్తించినవి. మనం ఏ పరిస్థితులలో స్వాతంత్ర్యాన్ని కోల్పోయినామో, ఏ పరిస్థితు లలో దానిని తిరిగి సంపాదించగలిగినామో భారతీయ పౌరు లందరు తెలుసుకోవడం అవసరం. నా గ్రంథం ఈలాటి అవసరాన్ని తీరుస్తున్నది. సామాన్య ప్రజలకు ఈలాటి విషయాలలో గ్రంథాలద్వారా విజ్ఞానాన్ని అందించుటకు జిల్లా గ్రంథాలయాలను ప్రభుత్వం స్థాపించింది. ఇదియే వాటి ప్రథమ కర్తవ్యం. నా చరిత్ర గ్రంథం ఏలాటిదో తెలియపరచుటకు అన్ని గ్రంథాలయ సంస్థలకు కరపత్రాలను రెండు మూడు పర్యాయాలు పంపినాను. కాని అయిదారు గ్రంథాలయ సంస్థలు మాత్రమే నా గ్రంథాన్ని కొనుగోలు చేయడం జరిగింది. ప్రకటనదార్లు ఇందు నిమిత్తం అనేకమార్గాలను అనుసరిస్తారు. వారిది పూర్తి వ్యాపార సరళి. కాని నేను ఆ మార్గాలను అనుసరించుటకు సిద్ధపడలేదు.

జిల్లా పరిషత్తుల యాజమాన్యంలో ఉండే విద్యాలయాలు నా గ్రంథాన్ని కొనవలసిందిగా సిఫారసు చేస్తూ విద్యాశాఖ డైరెక్టరు ఒక ఉత్తరువును జారీ చేసినారు. కాని ఒకటి రెండు పరిషత్తులు తప్ప తక్కినవి ఆ సిఫారసును మన్నించలేదు.

కొనుగోలు విషయంలో నాకు ఎక్కువగా సహాయం చేసిన వారు శ్రీమతి శ్రీ రాజ్యం సిన్హాగారు. వీరు సమాచార శాఖ డైరెక్టరు. సుమారు రు. 4500 లు ఖరీదుచేసే స్వాతంత్ర్యోద్యమ చరిత్ర ఒక్కొక్క భాగం ప్రతులను ఆమె కొనుగోలు చేసి, అన్ని కేంద్రాలకు పంచిపెట్టినారు.

ఆంధ్ర దేశంలో ప్రకటనదార్లు విజ్ఞానదాయకములైన గ్రంథాలను ప్రకటించడంపట్ల ఎక్కువ ఉత్సాహాన్ని, శ్రద్ధను ప్రదర్శించడం అవసరం. అదేవిధంగా విద్యాలయాలు, జిల్లా గ్రంథాలయ సంస్థలు, జిల్లా పరిషత్తులు, మున్సిపాలిటీవారు ఈలాగు చేయవలసి ఉన్నది. ఈరోజులలో అధికసంఖ్యాకులు ప్రజలు అక్షరాస్యులగుచున్నారు. ఈలాటి గ్రంథాలను చదవగల అవకాశం వారికి లభించినప్పుడే వారు గడించిన అక్షరజ్ఞానం సార్థకము అవుతుంది. దేశంలో గ్రంథాలయాల సంఖ్య, వాటిలో సేకరింపబడే గ్రంథాల సంఖ్య పెరుగుతున్నా ఉన్నతస్థాయికి చెందిన గ్రంథాలు సామాన్య ప్రజల అందుబాటులో లేకపోవడం విచారకరం. వారి వాస్తవమైన శ్రేయస్సు కోరేవారు ఈ లోపాన్ని సవరించుటకు సంసిద్ధులు కావలెను.

1974 లో ఆరోగ్యం క్షీణించిన కారణంగా నా మామూలు కార్యక్రమాలలో కొన్నిటిని తగ్గించుకొని తక్కినవాటిని యథా ప్రకారం సాగించినాను. పది గ్రంథ సమీక్షలు ప్రకటించాను. పత్రికలలో ప్రచురణార్థం పండ్రెండు వ్యాసాలు వ్రాశాను. ప్రాంతీయాభిమానాల గురించి ఒక ప్రసంగాన్ని ఆకాశవాణిలో ప్రసారం చేశాను. నా మనుమడు విక్రమ్, నా మనుమరాలు అరుణ బి.ఎస్‌సి. పరీక్షకు చదవవలసిన ఇంగ్లీషు పాఠ్యగ్రంథాలను వారికి బోధించాను. దీనికిగాను నాకాలంలో చాలా భాగాన్ని వినియోగించాను. యువకసభ్యుల శిక్షణార్థం కాంగ్రెసు వారు నాగార్జునసాగర్‌లో నిర్వహించిన శిబిరంలో ఏర్పాటు చేసిన సమావేశంలో పాల్గొని కాంగ్రెసు పక్షం దేశానికి ఎలాగు సేవ చేసిందో వివరిస్తూ ఒక ప్రసంగం చేశాను. వారి ఉపయోగార్థం "మన దేశంలో ప్రజాస్వామిక పరిపాలన" అనే విషయాన్ని గురించి ఒక చిన్న గ్రంథం వ్రాశాను. దానిని ప్రదేశ్ కాంగ్రెసు కమిటీవారు ప్రకటించారు.

1975 లో నా ఆరోగ్యం మరింత దిగజారిపోయింది. వెన్నెముకలో ఏదో లోపం ఏర్పడడంచేత వీపు, నడుము, కాళ్ళు, పాదాలలో భరింపరాని నొప్పి బయలుదేరింది. కూర్చుండడం, లేచి నిలబడడం సాధ్యం కాలేదు. సంవత్సరం అంతా అతురాలా

మంచంలోనే ఉండినాను. మలమూత్రాలకు బెడ్ పాన్, యూరిన్ బాటిల్ ఉపయోగించవలసి వచ్చింది. కొన్ని వారాలపాటు స్నానం కూడా చేయలేదు. తర్వాత ఒక ఎత్తైన బెంచీ మీద పడుకొని స్నానం చేయడం అవసరమైంది. నా కోడండ్రు రాధ, సీత ఎలాంటి విసుగులేక నా సంరక్షణలో శ్రద్ధను వహించారు. వైద్యురాలైన నా మనుమరాలు కృష్ణవేణి నరాల వ్యాధుల లోను, ఎముకల వ్యాధులలోను నిపుణులైన వైద్యులను పిలిపించి వారిచేత నన్ను పరీక్ష చేయించింది. కాని వారి చికిత్స ఫలప్రదం కాలేదు. వారు చెప్పిన ప్రకారం రోజుకు అయిదారు మందులు, వారం వారం ఇంజక్షన్‌లు తీసుకొనసాగాను. వీటిమూలంగా నా వ్యాధి కుదరలేదు. కొన్ని వ్యాధులకు మందులేదని, వాటిని భరించడం తప్పనిసరి అని నా అనుభవం మూలంగా తెలుసు కొన్నాను. 1978 లో నేను కొన్నిరోజులు నా కుమారునితో మద్రాసులోని అడయారులో గడపాను. ఆ సమయంలో చాలా బాధపడినాను. మా వాడు ఎముకల జబ్బులను కుదర్చడంలో ప్రఖ్యాతిగాంచిన ఒక వైద్యుని పిలిపించాడు. ఆయన నన్ను పరీక్షించి ఎలాటి దాపరికం లేకుండా "నీ నొప్పులకు ఎలాటి చికిత్సా లేదు. రోగులు బాధను భరించలేక మా వద్దకు రావడం పరిపాటి. వారిని తృప్తిపరచుటకు ఏవో కొన్ని మందులను ఇయ్యడం మా వృత్తిధర్మం. ఇది ఒకవిధంగా వారిని మోసగించడమే. నీవు 90 సంవత్సరాలవాడవు. వార్ధక్యంలో నిన్ను మోసగించడం ఇష్టం లేదు. నీ జబ్బు కుదురుటకు ఎలాటి చికిత్సాలేదు. ఇదీ వాస్తవం. తాత్కాలిక ఉపశమనార్థం ఒకటి రెండు మందులు ఇయ్యడం తప్ప నేను చేయగలిగింది ఏదీలేదు" అని స్పష్టంగా చెప్పాడు. ఇదే సత్యం. గ్రంథాలను చదవడం, గ్రంథాలను వ్రాయడం బాధను మరచిపోవుటకు ఒక పటిష్ఠ సాధనం. ఏదో ఒక పనిలో నిమగ్నుడనైనప్పుడు నేను బాధనుమరచిపోతాను. ఇటీవలి కాలంలో నేను గ్రంథరచనకు పూనుకొనుటకు ఇదికూడా ఒక కారణం.

1975 లో నా కార్యక్రమాలు చాలావరకు సన్నగిల్లినవి. పడుకొని చేయగలిగిన వాటిని మాత్రమే చేపట్టాను.

నా మనుమడు విక్రమ్‌కు ఇంగ్లీషు పాఠ్యగ్రంథాలను చెప్తూ వచ్చాను. ఢిల్లీలో నా మనుమడు గౌతమ్ చదువులో చాలా వెనుకబడిన వాడు. అతి కష్టంమీద ఎలాగో బి. ఏ. తరగతికి వచ్చాడు. వాడి పాఠ్య విషయాలలో "పౌరశాస్త్రం" ఒకటి. నాలుగైదు నెలల పాటు దానికి సంబంధించిన ప్రశ్నలను వాడు నాకు పంపడం, నేను వాటికి సులభ శైలిలో సమాధానాలు వ్రాసి వాడికి అందచేయడం నా కార్యక్రమంలో ప్రాధాన్యం వహించింది.

ఆకాశవాణిలో "నా జ్ఞాపకాలు" అనే శీర్షికన నాలుగు ప్రసంగాలు ప్రసారం చేశాను. ఇవి ఒకవిధంగా నా స్వీయచరిత్ర. విద్యావేత్తలుగా ప్రఖ్యాతి గాంచిన రఘుపతి వెంకటరత్నం నాయుడు, కిళాంబి రామానుజాచార్యులు, డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణన్, కట్టమంచి రామలింగారెడ్డిగార్లలోని విశిష్టత, వారిలో కొందరి పక్షపాత వైఖరి, విజయనగరం మహారాజా అలక్ నారాయణ గజపతివారి కొలువులో నేను గడించిన అనుభవాలు, బొంబాయి విశ్వవిద్యాలయంలో రాజనీతిశాఖలో ప్రధానాధ్యాపకుడనుగా (Professor) ఉన్నప్పుడు నా పట్ల విద్యార్థులు, అధ్యాపకులు చూపిన గౌరవాభిమానాలు, స్వాతంత్ర్యోద్యమ కాలంలో శ్రీ బులుసు సాంబమూర్తి మొదలైన కాంగ్రెసు నాయకులతో నాకు ఏర్పడిన సంబంధము—ఈ విషయాలన్నిటిని ఆకాశవాణి ప్రసంగాలలో వివరించాను. 'తెలుగు విద్యార్థి' సంపాదకులు శ్రీ కొల్లూరి కోటేశ్వరరావు వీటిని వారి పత్రికలో ప్రకటించారు. ఇవిగాక "దేశప్రగతి", "చైనా అణ్వస్త్ర విధానము", "దివ్యజ్ఞాన సమాజ శతజయంతి ఉత్సవము", ఆంధ్ర దేశంలోని "పోస్టు గ్రాడ్యుయేట్ కేంద్రాల స్వాతంత్ర్యము" (Autonomy for Post-Graduate Centres) అనే విషయాల గురించి ఆకాశవాణి నా ప్రసంగాలను ప్రసారం చేసింది.

వీటికి తోడు 'తెలుగు విద్యార్థి' పత్రికలో "ప్రాథమిక విద్యాలయాల పాఠ్యప్రణాళిక" అనే విషయాన్ని గురించి, అఖిల భారత విద్యా ఫెడరేషన్ వారు హైదరాబాదులో సమావేశమైనప్పుడు ప్రకటించిన సంచికకు "విద్యాభివృద్ధికి ఒక ప్రణాళిక" (Plan for Education), 'పంచాయత్' అనే పత్రికకు

"పంచాయతీరాజ్యము — విద్యాభివృద్ధి" అనే విషయాన్ని గురించి వ్యాసాలు వ్రాశాను.

1975 లో శ్రీ జలగం వెంగళరావు ముఖ్యమంత్రిగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ప్రపంచ తెలుగు మహాసభను (World Telugu Conference) అతివైభవంగా జరిపింది. ఇది ఉగాదినాడు ప్రారంభమై వారం రోజులు జరిగింది. 1969-'74 మధ్య తెలంగాణాలోని తెలుగువారు, ఆంధ్రలోని తెలుగువారు దాయాది పోరులోకి దిగి ఒకరిపట్ల ఇంకొకరు అతి భీభత్సంగా ప్రవర్తించారు. 1974 లో కొన్ని నెలలపాటు రాష్ట్రపతి పాలన విధించవలసి వచ్చింది. కేంద్ర ప్రభుత్వం ఆరు సూత్రాల పథకాన్ని రూపొందించి రెండు ప్రాంతాలలోని నాయకులను దానికి ఒప్పించి మామూలు పరిస్థితులను నెలకొల్పి శ్రీ జలగం వెంగళరావుగారు ముఖ్యమంత్రిగా ప్రజాస్వామికాన్ని పునరుద్ధరించింది. శ్రీ వెంగళరావుగారు పరస్పర ద్వేషాలను మానుకోని వాస్తవమైన భావ సమైక్యతతో ప్రవర్తించవలెనని దృఢంగాను, హృదయపూర్వకంగాను విశ్వసించినారు. వారు అవకాశవాదులు కారు. ఈలాటి సమైక్యతను కలిగించుటకు వారు ప్రపంచ తెలుగు మహాసభను జరిపారు. ఇందులో ఆంధ్రప్రదేశ్ లోని తెలుగువారే గాక, దేశంలోని ఇతర ప్రాంతాలలో నివసించే తెలుగువారు, విదేశాలలో నివసించే తెలుగువారు, తెలుగుభాషలో పరిశోధన జరుపుతున్న పాశ్చాత్యులు పాల్గొన్నారు. వివిధ రంగాలలో సంస్కృతి, వాఙ్మయము, సంగీతము, నృత్యము, శిల్పము, చిత్రలేఖనము మొదలైన వాటిలో ఆదికాలాననుండి ఇప్పటి వరకు తెలుగువారు ప్రదర్శించిన ఔన్నత్యమును ప్రపంచమునకంతకు చాటించుటకు ఈ సమావేశం గొప్ప ప్రయత్నంచేసి సఫలత గాంచింది.

ఈ సమావేశం నా జీవితంలో కూడా ప్రాధాన్యం వహించింది. సమావేశ కార్యకర్తలు ఆంధ్రులలో ప్రముఖులైనవారిని గౌరవించవలసిందిగా నిర్ణయించారు. ఆలాటి ప్రముఖులలో నన్ను కూడా చేర్చారు. సమావేశం మొదటి రోజుననే నన్ను గౌరవించుటకు ఏర్పాటుచేసి నాకు ఆహ్వానాన్ని పంపారు. కాని

అప్పట్లో నేను మంచంనుండి కదలలేని స్థితిలో ఉండినందున నా స్థానే నా భార్యను పంపినాను. ఆమె డెబ్బది సంవత్సరాలుగా నా సహధర్మచారిణిగా యుండినది. నేను గడించిన ప్రఖ్యాతికి ఆమె కూడా ఒక కారణము. అందుచేత నా తరఫున ఆమె గౌరవాన్ని స్వీకరించడము ఉచితమని భావించాను. సమావేశ కార్యకర్తలు కూడా ఈ ఔచిత్యాన్ని గుర్తించి, గౌరవ చిహ్నాలుగా వారు నా కివ్వదలచిన ఓరుగల్లు కోట ముఖద్వారం చిత్రంతో కూడిన ఒక ఇత్తడి పత్రము, ఒక కాశ్మీరు శాలువ, ఒక చేతి పెట్టె ఆమెకు ఇచ్చి ఆమె ద్వారా వాటిని నాకు పంపినారు. సమావేశానికి ప్రారంభోత్సవం జరిపిన ఉపరాష్ట్రపతి శ్రీ జెట్టి వీటిని ఇచ్చినారు.

ఈసందర్భంలో సమావేశానికి సంబంధించిన ఒక ఉదంతాన్ని గురించి ప్రస్తావించడం అవసరమని భావిస్తున్నాను. ప్రపంచ తెలుగు మహాసభ ఒకటి జరగవలెనని ప్రప్రథమంగా అభిప్రాయాన్ని వ్యక్తంచేసినవారు శ్రీ దేవగుప్తాపు విశ్వేశ్వర రావుగారు. వీరు విజయనగరం సమీపాన ఒక గ్రామానికి చెందినవారు, కాని కొన్ని సంవత్సరాలుగా హైదరాబాదులోనే నివాసం పెట్టినారు. వీరికి ప్రజా ఉద్యమాలలో గొప్ప ఆసక్తి. కొన్ని సంవత్సరాలక్రిందట మద్రాసులో ప్రపంచ తమిళ మహాసభ విజయవంతంగా జరగడం వీరిపై గొప్ప ప్రభావం వహించింది. దాని ఫలితంగా వీరు ప్రపంచ తెలుగు మహాసభ విషయంలో ఉత్సాహం కలవారయ్యారు. వీరు, స్వాతంత్ర్యయోధులుగా ప్రఖ్యాతిగాంచిన న్యాయవాది బుద్ధిరాజు రాజభూషణరావుగారు మహాసభ విషయమై ప్రథమ ప్రయత్నాలు గావించి, ఆ సందర్భంలో నా కుమారుడు, రాజ్యసభ సభ్యుడు ఆనందం సహాయాన్ని కోరారు. మేము వారి ఆశయం ఉన్నతమైనట్టిదిగా భావించి ప్రభుత్వసహాయం లేనిదీ ఇది కార్యరూపం ధరించడం సాధ్యంకాదని, ఇందు నిమిత్తం అప్పట్లో ఆంధ్రప్రదేశ్ ముఖ్య మంత్రిగా ఉండిన శ్రీ బ్రహ్మానందరెడ్డిగారిని కలుసుకొన్నాము. వారు మా ఉద్యమంపట్ల సానుభూతికలవారై ప్రాథమిక ఖర్చులకుగాను రు. 10,000 లు మంజూరు చేసి, వెంటనే

రు. 2000 లు చెల్లించవలసిందిగా అధికారులను ఆదేశించారు. దీనితో మేము, మా మిత్రులలో మరికొందరం కొంత ప్రచారాన్ని సాగించినాము. రాష్ట్రపతి గిరిగారు హైదరాబాదుకు వచ్చినప్పుడు వారిని కూడ కలుసుకొన్నాము. వారు మా ఆశయంపట్ల సానుభూతికలవారై, వ్యక్తి హోదాలో రు. 275 ల చెక్కును ఇచ్చారు. కాని మొత్తంమీద ప్రజలనుండి మాకు తగినంత ప్రోత్సాహం లభించలేదు. తమిళ మహాసభను నిర్వహించే బాధ్యతను తమిళనాడు ప్రభుత్వం వహించింది. అందుకుగాను కోటి రూపాయలు ఖర్చుపెట్టింది. ప్రపంచ తెలుగు మహాసభ కూడా ప్రభుత్వ ఆధ్వర్యంలో జరగడం ఉచితమని నా కుమారుడు ఆనందం, నేను భావించాము. కాని 1974 లో ఆంధ్రప్రదేశ్ రాష్ట్రపతి పరిపాలనలో ఉండినందున ఇది సాధ్యం కాలేదు. రాష్ట్రపతి పాలన తొలగి శ్రీ వెంగళరావుగారు ముఖ్యమంత్రిగా ప్రజా ప్రభుత్వం ఏర్పడిన తర్వాత ఎలాగు సాధ్యమైనదో పైన వివరించాను. ఉద్యమాన్ని తలపెట్టినవారు శ్రీ దేవగుప్తాపు విశ్వేశ్వరరావు గారు అనే విషయం ప్రజలు గుర్తించడం అవసరమనే భావంతో ఈ ఉదంతాన్ని ఇక్కడ పొందుపరచాను. మహాసభ గౌరవించిన ప్రముఖులలో విశ్వేశ్వరరావుగారు ఒకరు. ఈ గుర్తింపు మా అందరికీ సంతోషదాయకమైనది. ప్రభుత్వ మూలంగాను, విరాళాల మూలంగాను మాకు లభించిన మొత్తంలో మేము కొన్నివందలు మాత్రమే ఖర్చుపెట్టి, మిగిలిన రు. 9,000 ల సొమ్మును ప్రభుత్వానికి తిరిగి ఇచ్చివేసినాము.

1976 లో నా మామూలు కార్యక్రమాలను మరింత తగ్గించుకొనవలసి వచ్చింది. 5 గ్రంథ సమీక్షలను మాత్రమే ప్రకటించాను. వీటిలో ఒకటి "నడిరాత్రిలో స్వాతంత్ర్యము" (Freedom at Midnight.). దీనిని ఒక ఫ్రెంచి గ్రంథకర్త, ఒక అమెరికన్ గ్రంథకర్త కలిసి వ్రాశారు. ఇందులో 1946-'47 లో మౌంట్ బాటన్ ప్రభువు మన దేశానికి ఆఖరు రాజప్రతినిధిగా నియమితుడై, దేశాన్ని రెండు రాజ్యాలుగా విభజించి, వాటికి సంపూర్ణ స్వాతంత్ర్యం ఇయ్యవలసిందిగా బ్రిటిషు ప్రభుత్వానికి సిఫారసు చెయ్యడం, దానికి ఆ ప్రభుత్వం అంగీకరించడం, దేశ

విభజనకు కాంగ్రెసు నాయకులను ఒప్పించడం, ప్రథమంలో స్వతంత్ర భారతదేశం డొమినియన్‌గా రూపొందడం, దానికి మౌంట్‌బాటన్ గవర్నర్ జనరల్‌గా ఉండడం, దేశవిభజన జరిగిన తర్వాత హిందువులు, ముస్లింల మధ్య ఎన్నడూ లేని కొట్లాటలు సంభవించడం, వాటిని అణచి, శాంతి భద్రతలను స్థాపించడంలో ప్రధానమంత్రి నెహ్రూ, దేశవ్యవహారాల మంత్రి సర్దార్ పటేల్ మౌంట్‌బాటన్ సహాయాన్ని కోరడం మొదలైన విషయాలు నాటకశైలిలో వివరింపబడినవి. ఈ సహాయాన్ని వాస్తవంగా వారు కోరారా అనే విషయాన్ని గురించి దేశంలో అనేక విమర్శలు బయలుదేరినవి. ఇదిగాక సంస్థానాధీశుల గురించి, సావర్కారు గురించి, గ్రంథంలోని ఉదంతాలు కూడా అనేకులకు వివాదాస్పదంగాను, వాస్తవంకానట్లును కనుపించినవి. ఈలాటి వివాదగ్రస్థమైన గ్రంథాన్ని సమీక్షించడం సులభసాధ్యంకాదు. అయినా నేను నా సమీక్షను హైదరాబాదు స్టేట్ ఆర్కైవ్స్ (State Archives) వారి "ఇతిహాస్" (Itihas) అనే పత్రికలో ప్రకటించాను. ఈ సమీక్షలో ఎలాటి దాపరికం లేక నా అభిప్రాయాలను వ్యక్తంచేశాను.

పత్రికలకు నేను వ్రాసిన వ్యాసాల సంఖ్య కూడా 1976 లో తగ్గిపోయింది. నాలుగు వ్యాసాలు మాత్రమే వ్రాయగలిగాను. ఏప్రిల్‌లో రెండు వారాలు నిజామాబాదులో గడపాను. అప్పుడు జిల్లా గ్రంథాలయ సంస్థ ఆధ్వర్యాన, "నేను ఇదివరకు చూచినది" అనే విషయాన్ని గురించి ప్రసంగించాను. ఇటీవలి కాలంలో మన సమాజంలో జరిగిన మార్పులను ఈ ప్రసంగంలో వివరించాను.

1976 లో నా భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్ర రెండవ భాగాన్ని ముద్రించడంలోను, ప్రూఫులు దిద్దడంలోను రెండు మూడు నెలలు నా కాలాన్ని వినియోగించాను. ఇదిగాక నా కుమార్తె వైదేహి ఇంగ్లీషులో వ్రాసిన స్వాతంత్ర్యోద్యమ చరిత్ర విషయంలో ఆమెకు చాలా సహాయం చేశాను. డాక్టర్ అక్కిరాజు రమాపతిరావుగారు ప్రకటించిన "వెన్నెలకంటి

సుబ్బారావు స్వీయచరిత్ర'' ను గురించి, ఆంధ్ర విశ్వవిద్యాలయంలో అధ్యాపకులైన డాక్టర్ ఆంజనేయులుగారి పిహెచ్. డి. రచనను గురించి నా అభిప్రాయాలను వ్రాసి పంపినాను. శ్రీచలసాని సుబ్బారావుగారి ''మన విద్యారంగం'' అనే గ్రంథానికి, శ్రీమతి నేతి సీతాదేవిగారు రచించిన దుర్గాబాయి దేశముఖ్ జీవిత చరిత్రకు తొలిపలుకులు వ్రాశాను.

ఈ సంవత్సరంలో నాకు ఎక్కువ తీరుబడి ఉన్నందున దానిని గ్రంథపఠనలో వినియోగించాను. భగవద్గీతను, కాళిదాసు రఘువంశంలో కొన్ని సర్గలను, శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణగారి మాలపల్లి, బర్నాల్ అనే ఇంగ్లీషు విజ్ఞానవేత్త రచించిన 5 సంపుటాల Science in History (విజ్ఞాన శాస్త్రచరిత్ర) వీటిలో ప్రధానమైనవి.

1977 లో నా భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్ర మూడవ భాగ ముద్రణ నా మనశ్శాంతికి చాలా భంగం కలిగించింది. గ్రంథ రచనను సులభంగా సాగించాను గాని ముద్రణ విషయమై మొదటినుంచి నేను అనేక చిక్కులను ఎదుర్కొన్నాను. మొదటి సంపుటి ముద్రణ సందర్భంలో నాకు నమ్మకమైనవారు ప్రూఫులు దిద్దుటకు లభించ లేదు. అందుచేత రెండవ సంపుటాన్ని వ్రాసిన తర్వాతగాని ముద్రణ భారాన్ని, అమ్మక భారాన్ని తెలుగు అకాడమి వారు భరించవలసిందిగా నేను కోరాను. వీరు బి. ఏ. విద్యార్థులకు పాఠ్యగ్రంథాలను వ్రాయించుటకు ఏర్పడినవారు. నా గ్రంథం ఈ దృష్ట్యా విద్యార్థులకు చాలా ఉపయోగపడునట్టిది. తెలుగు అకాడమి అధ్యక్షులు, విద్యాశాఖ మంత్రి శ్రీ మండలి వెంకట కృష్ణారావుగారు ఒక బహిరంగ సభలో నా గ్రంథాన్ని ప్రకటించడంలో అకాడమివారు సహాయపడగలరని ఒకవిధమైన హామీ ఇచ్చారు. కాని అకాడమి సలహా సంఘం వారి అభిప్రాయాన్నికూడా గౌరవించక నా కోరికను నిరాకరించింది. అందుచేత రెండవ భాగ ముద్రణ భారాన్ని నేనే వహించవలసి వచ్చింది. ప్రూఫులు దిద్దడంలో నాకు ఎలాటి నైపుణ్యం లేదు. ఈ సంపుటాన్ని ముద్రించుటకు పూనుకొన్న ముద్రణాలయం నేను

చేసిన దిద్దుబాటులను అచ్చువేయడంలో తగిన శ్రద్ధను వహించ లేదు. ఈ పరిస్థితు లన్నిటినీ గమనించి మూడవ సంపుటాన్ని ముద్రించడంలో నా చిరకాల మిత్రులు, శేషాచలం కంపెనీలో భాగస్వాములు, గ్రంథాలను ప్రకటించడంలో గొప్ప అనుభవాన్ని సంపాదించినవారు శ్రీ యం. యన్. రావుగారి సహాయాన్ని కోరినాను. ప్రూఫులు దిద్దే బాధ్యతతో సహా ముద్రణ విషయంలో బాధ్యత లన్నిటినీ తాము వహించుటకు సిద్ధంగా ఉన్నట్లు వారు నాకు హామీ ఇచ్చారు. అందుచేత నా వ్రాతప్రతిని మదరాసులోని వారి కార్యాలయానికి పంపినాను. ముద్రణ ఖర్చులు నిమిత్తం వారు కోరిన సొమ్మును ముందుగా పంపినాను.

కాని, నా గ్రంథాన్ని ముద్రించడంలో వారి కార్యాలయం లోనివారు తగిన శ్రద్ధను వహించలేదు. మొదటి 48 పుటలలో 82 అచ్చు తప్పులు కనిపించినవి. అటుతర్వాత దిద్దిన పేజీ ప్రూఫులను నాకు పంపవలసినదిగా కోరాను. వారు అలాగే చేశారు. అచ్చు తప్పుల సంఖ్య కొంతవరకు తగ్గినది. కాని తప్పులు లేకపోలేదు. దీనికి తోడు రావుగారు ఏదో పనిమీద లండన్ వెళ్ళారు. దానిమూలంగా ముద్రణలో చాలా ఆలస్యం జరిగింది. సంవత్సరాంతానికి గాని ప్రతులు నాకు అందలేదు. ముద్రణ విషయంలో ఈలాటి చిక్కులనే కొన్ని ఎదుర్కొని ఏలాగో బయటపడినందుకు సంతోషించాను. కాని 1977 లో సుమారు పదినెలల కాలం మనశ్శాంతిలేక గడపవలసి వచ్చింది. అనారోగ్యంతో పాటు మనశ్శాంతి లేకపోవడం నాకు ఎంతో విచారాన్ని కలిగించింది.

ఈ పరిస్థితిలో కూడా నా మామూలు కార్యక్రమాలను తృప్తికరంగానే సాగించాను. 5 గ్రంథ సమీక్షలను ప్రకటించాను. "1977 మార్చిలో జరిగిన పార్లమెంటు ఎన్నికల ప్రాధాన్యాన్ని" గురించి 'త్రివేణి' కి వ్యాసాన్ని, ఆంధ్ర విశ్వవిద్యాలయ స్వర్ణోత్సవ సందర్భంలో ప్రకటించుటకు విశ్వ విద్యాలయంవారు తలపెట్టిన ప్రత్యేక సంచికకు ఆంధ్రలో స్వాతంత్ర్యోద్యమ లక్షణాలను గురించిన ఒక వ్యాసాన్ని, "మన విద్యా విధానంలో భాషలకు

ఉండదగిన స్థానము'' అనే విషయాన్ని గురించి 'తెలుగు విద్యార్థి'కి ఒక వ్యాసాన్ని వ్రాశాను. వీటి అన్నిటికంటె ప్రాధాన్యం వహించిన నా ప్రత్యేక కార్యక్రమం విశ్వ విద్యాలయ స్వర్ణోత్సవ సందర్భంలో ఆంధ్ర విశ్వవిద్యాలయాధికారులు ప్రకటించదలచిన ''ఆంధ్రుల చరిత్ర ''కు రెండు అధ్యాయాలను వ్రాయడం. వీటిలో ఒకటి 1600 నుండి 1950 వరకు ఆంధ్రదేశ ఆర్థిక పరిస్థితుల చరిత్ర, రెండవది 1858 తర్వాత ఆంధ్రదేశంలో ఏర్పడిన పరిపాలన విధానము. వీటిని వ్రాయుటకు అనేక ప్రామాణిక గ్రంథాలను చదివాను. ఆ కార్యక్రమాన్ని పూర్తిచేయుటకు మూడు నెలలు పట్టినవి.

ఈ సందర్భంలో ఆంధ్రుల చరిత్రను రచించు విషయంలో ఎదుర్కొన వలసిన చిక్కులలో కొన్నిటిని ఇచ్చట తెలియపరచడం అవసరమని భావిస్తున్నాను. ఆంధ్ర విశ్వ విద్యాలయ ఉపాధ్యక్షులు శ్రీ యం. ఆర్. అప్పారావుగారు కొన్ని సంవత్సరాల క్రిందట ఆంధ్ర ప్రదేశ్ సాంస్కృతిక శాఖ మంత్రిగా ఉన్నప్పుడు సమగ్రమైన ఆంధ్రుల చరిత్రను వ్రాయించుటకు గొప్ప ప్రయత్నం చేశారు. అందు నిమిత్తం పరిశోధకుల సభ నొకదానిని సమావేశపరచి, చరిత్రను రచించుటలో అనుసరించ వలసిన దృక్పథాన్ని గురించి వారి అభిప్రాయాలను తెలుసుకొన్నారు. చరిత్ర రచనకు ఒక సంపాదకీయ వర్గాన్ని కూడా నియమించారు. కాని వారి ప్రయత్నం కొనసాగలేదు. విశ్వ విద్యాలయ ఉపాధ్యక్షులుగా 1977 వారు సంకల్పించిన ఆంధ్రుల చరిత్ర రచన పూర్తి కావడం సంతోషించ వలసిన విషయం. కాని స్వర్ణోత్సవం జరిగి ఇప్పటికి ఒక సంవత్సరం గడచి పోయినా చరిత్ర ముద్రణ ఇంకను పూర్తి కాలేదు. ఇది ఎప్పుడు పూర్తి కాగలదో చెప్పడం సాధ్యం కావడంలేదు.

ఇటీవల శ్రీ భాట్టం శ్రీరామమూర్తిగారు సాంస్కృతిక శాఖ మంత్రిగా ఇరవై సంపుటాలలో సమగ్రమైన ఆంధ్రుల చరిత్రను వ్రాయించే బాధ్యతను హైదరాబాదులోని అంతర్జాతీయ తెలుగు సంస్థకు (International Telugu Institute)

ఒప్పగించినారు. దీనిని పది సంవత్సరాలలో పూర్తిచేయ వలసిందిగా సంస్థను ఆదేశించారు. సంస్థ డైరెక్టరు ఆ సందర్భంలో నా అభిప్రాయాన్ని కోరారు. ప్రస్తుతం ఆంధ్రదేశంలో ఆంధ్రుల చరిత్రలో పరిశోధన గావించి ఈ కార్యక్రమంలో పాల్గొనుటకు అర్హులైన వారి జాబితాను మొట్టమొదట తయారుచేయవలసిందిగా నేను వారికి తెలియపరచాను. అలాటివారు తగిన సంఖ్యలో ఉన్నప్పుడే ఈ కార్యక్రమం కొనసాగగల దనేది నా అభిప్రాయం. ప్రస్తుతం ఈలాటివారి సంఖ్య చాలా తక్కువ, ఇదిగాక ఇదివరలో జరిగిన పరిశోధన ప్రాచీన మధ్య యుగాలకు సంబంధించినట్టిది. ఆధునిక యుగచరిత్రలో చెప్పకోనతగ్గ పరిశోధన జరగలేదు. గత రెండు వందల సంవత్సరాలలో రాజకీయ, ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక రంగాలలో విప్లవాత్మకములైన మార్పులు సంభవించినవి. ఈ దృష్ట్యా ఆధునికయుగ చరిత్ర గొప్ప ప్రాధాన్యాన్ని వహిస్తున్నది. విశ్వవిద్యాలయాలలో చరిత్ర అధ్యాపకులు, ఇతర పరిశోధకులు ఈ ప్రాధాన్యాన్ని గుర్తించినవారు కారు. ఈ మార్పు లన్నిటిని వివరించని చరిత్ర సమగ్ర చరిత్ర కాజాలదు. అందుచేత కొన్ని సంవత్సరాలపాటు ఈలాటి పరిశోధన గావించి అటుతర్వాత సమగ్రచరిత్ర రచనకు పూనుకొనడం వాంఛనీయం. అధికారులు ఈ విషయంపట్ల ఎక్కువ శ్రద్ధ వహించడం అవసరం. ఆంధ్ర విశ్వవిద్యాలయం వ్రాయించిన ఆంధ్రుల చరిత్రకు రెండు వ్యాసాలు వ్రాసిన సందర్భంలో ఈలాటి అవసరం ఉన్నట్లు నేను గ్రహించాను. అందుచేతనే నేను దానిని గురించి ప్రస్తావించినాను.

1975–'77 లో రాజకీయ రంగంలో విప్లవాత్మకములైన మార్పులు సంభవించినవి. మనకు స్వాతంత్ర్యం లభించిన తర్వాత రాజ్యాంగ సభలో సమావేశమైన సభ్యులు జవహర్‌లాల్ నెహరూ, సర్దార్ పటేల్, రాజేంద్ర ప్రసాద్, డాక్టర్ అంబేద్కర్, అల్లాడి కృష్ణస్వామి అయ్యర్ మొదలైన నాయకుల యొక్కయు, ప్రముఖుల యొక్కయు సలహాలతో ఒక రాజ్యాంగాన్ని రూపొందించి, దాని మూలంగా నిరంకుశత్వానికి అవకాశం లేని ప్రజాస్వామిక విధానాన్ని, సమాఖ్య విధానాన్ని ప్రవేశపెట్టారు. ఇదిగాక రాజ్యాంగంలో కొన్ని మౌలిక హక్కులను చేర్చి,

వాటికి అన్యథాగా పార్లమెంటు గాని, ఇతర శాసనసభలు గాని చట్టాలు చేయరాదని, అధికార పదవులలోనివారు ఉత్తరువులు జారీ చేయరాదని నిర్ణయించి, ఆ నిర్ణయాన్ని అమలుపరచే అధికారాన్ని ఉన్నత న్యాయస్థానానికి ప్రసాదించినారు. వీటి అన్నిటి ఫలితంగా ప్రభుత్వాధికారానికి అనేక హద్దులు కల్పింపబడినవి. వాటిని అతిక్రమించి అధికారంలో ఉన్న వారెవరు నిరంకుశంగా నియంతలవలె పరిపాలనను సాగించుట సాధ్యం కాజాలదు.

కాని 1975 లో ప్రధాని పదవిలో ఉండిన శ్రీమతి ఇందిరా గాంధి ఈ హద్దుల నన్నిటిని అతిక్రమించి, జూన్ 26 న అత్యావసర పరిస్థితి ఏర్పడినట్లు ప్రకటించి 19 నెలల కాలం ప్రజాస్వామికానికి, సమాఖ్య విధానానికి విరుద్ధంగా నియంతృత్వ విధానాన్ని అనుసరించి, తన ఇష్టానుసారం దేశాన్ని పరిపాలించింది. పౌరులలో అనేకులవలె ఈ మార్పు మూలంగా నేను ఆందోళన చెందినాను. ఆమె విధానాలను విమర్శించేవారికి జైలు శిక్షను అనుభవించడం తప్పనిసరి అయినది. అందుచేత నా ఆందోళనను నా డైరీలలో వ్యక్తం చేశానే గాని బహిరంగంగా వ్యక్తం చేయలేక పోయినాను. ఎలాటి నేరాన్ని మోపకుండా ఎలాటి న్యాయవిచారణ లేకుండా ఎవరినంటె వారిని జైళ్ళలో నిర్బంధించే అవకాశం ఆమె నిరంకుశత్వం మూలంగా అధికారులకు లభించింది. అందుచేత అందరూ నోరుమూసుకొని ప్రవర్తించవలసి వచ్చింది.

ఈ నిరంకుశ పరిపాలన మూలంగా ఎలాటి నేరంచేయని వారు సుమారు 2 లక్షలమంది నిర్బంధింపబడినారు. మంత్రుల సభ ఒకటి ఉండినా అది అధికారంలేని సభగా మారిపోయింది. ప్రధాని నిర్ణయాలను ఆమోదించడం ఒక్కటే దాని కర్తవ్యం. పార్లమెంటులో ప్రతిపక్ష నాయకులందరు నిర్బంధంలో ఉండడం చేత ప్రధాని నిర్ణయాలకు ఎలాటి ఆక్షేపణ లేక ఆమోదం లభించడం మామూలైంది.

1971 లో లోక్‌సభకు ప్రధాని ఎన్నిక చెల్లదని అలహాబాదు హైకోర్టు తీర్పు చెప్పడం ఈ నియంతృత్వానికి ప్రధాన కారణం. అందుచేత ప్రధాని పదవిలో ఉన్నవారి ఎన్నిక

విషయం కోర్టులు విచారణ చేయరాదని ఎన్నికలచట్టం సవరింప బడింది. ఇదిగాక రాజ్యాంగ 42-వ సవరణ సుప్రీం కోర్టు అధికారాన్ని పూర్తిగా తగ్గించింది.

ఈలాటి మార్పులు మూలంగా ఇందిరా గాంధి నిరంకుశత్వం దేశరక్షణ చట్టాలక్రింద బ్రిటిషు ప్రభుత్వం ప్రపంచ యుద్ధాల కాలంలో వహించిన నిరంకుశత్వాన్ని విస్మరింపజేసింది. పరాయి పరిపాలనే ఉత్తమమైనదని అనేకులు భావించారు. ఈవిషయాలను, భావాలను నేను 1975, 1976, 1977 డైరీలలో వ్రాసి యుంచు కొన్న కారణంగా వాటిని ఇక్కడ పొందుపరచాను. ప్రజలు ఎన్నుకొన్న భారత ప్రధాని నియంతగా దేశాన్ని పరిపాలించ గలదని స్వప్నంలో కూడా ఎవరూ అనుకోలేదు. కాని వాస్తవంగా ఆలాటి మార్పే జరిగింది. ఈ నిరంకుశ పరిపాలనలో ఆమె కుమారుడు సంజయ గాంధి ప్రధానపాత్ర వహించడం ప్రజల దృష్టిని ఆకర్షించింది. ఆయన పర్యటనల నిమిత్తం వివిధ రాష్ట్ర ప్రభుత్వాలు లక్షలు, కోట్లు ఖర్చుపెట్టడం జరిగింది.

వార్తాపత్రికలపై ఆంక్షలు విధించడం మూలంగా ఆమెకు గాని, ఆమె సలహాదార్లకు గాని ఆమె పరిపాలనను గురించి ప్రజాభి ప్రాయం ఎలాంటిదో తెలియలేదు. ప్రజలందరు తనపట్ల, తన 20 అంశాల పథకం పట్ల సుముఖంగా ఉన్నట్లు ఆమె భావించింది. హరిజనులు, ఇతర బలహీనవర్గాల శ్రేయస్సుకై ఆమె అమోఘ మైన కృషిచేస్తున్నట్లు ఆకాశవాణి ప్రచారం చేయసాగింది. కాని ప్రజలు దీనిమూలంగా మోసపోలేదు. తమ స్థితిగతులలో ఎలాటి మార్పు రాలేదని వారికి తెలుసు. వాస్తవం తెలియని కారణంగా 1977 మార్చిలో ఆమె లోక్‌సభ ఎన్నికలను ఏర్పాటుచేసింది. ఎన్నికలకు ముందు నాయకు లందరిని విడుదలచేసింది.

ఇదిగాక ఆమెకు కుడిభుజంగా ఉండిన జగజీవన్‌రాం మంత్రి మండలినుంచి, కాంగ్రెసు పార్టీనుంచి రాజీనామా చేశాడు. దీనితో ఆమెకు కొంత కనువిప్పు కలిగింది. విడుదల గాంచిన నాయకులు జగజీవనరాంతోసహా ఆమె నిరంకుశత్వాన్ని ఖండిస్తూ తీవ్రమైన ప్రచారం సాగించారు. ఆమె నిరంకుశత్వం మూలంగా ఉత్తర

భారతంలోని రాష్ట్రాల ప్రజలు నరకబాధను అనుభవించారు. పరిమిత కుటుంబ పథకం క్రింద అవివాహితులు, క్రొత్తగా వివాహం చేసుకొన్నవారు, నడివయస్సులో యుండినవారు విచక్షణా రహితంగా శస్త్రచికిత్సలను నిర్బంధంగా చేయించుకొనవలసి వచ్చింది. దీనిమూలంగా అసంతృప్తి గాంచిన వారిలో అధిక సంఖ్యాకులు బలహీనవర్గాలకు చెందినవారు. ఢిల్లీ నగరాన్ని పునర్నిర్మాణం చేసే పథకంక్రింద నిరుపేదల ఇండ్లు అనేకం నేల మట్టం చేయబడినవి. తలదాచుకొనుటకు వీలులేనివారు కొందరు మునిసిపల్ అధికారులపై తిరుగబడగా పోలీసువారు జోక్యం కల్పించుకొని వారిపై కాల్పులు జరిపి అమానుషంగా వారిని హత్య గావించారు. ఈ రాక్షస కార్యక్రమమంతా సంజయ్ నాయకత్వంలో జరిగినదని షా కమిషన్ అభిప్రాయపడింది.

దీనిఫలితంగా 1977 మార్చిలో జరిగిన ఎన్నికలలో అభ్యర్థులుగా నిలబడిన ఇందిరా గాంధి, సంజయ్ గాంధి, కాంగ్రెసు వారిలో దాదాపు అందరు అభ్యర్థులు ఉత్తర భారత రాష్ట్రాలలో ఓడిపోయారు. కాంగ్రెసు (ఓ), జనసంఘ్, బి ఎల్. డి., సోషలిస్టు మొదలైన ప్రతిపక్షాలు సంయుక్తంగా జనతా పార్టీ అనే పేరిట ఒక పార్టీగా ఏర్పడి అధిక సంఖ్యలో లోక్‌సభ స్థానాలను గెలుచుకొని మొరార్జీ దేశాయి ప్రధానిగా ప్రభుత్వాధికారాన్ని వహించినవి. నియంతృత్వాన్ని నిర్మూలించుటకు ఇతర దేశాలలో ప్రజల తిరుగుబాటులు, అంతర్యుద్ధాలు, విదేశాలతో సంబంధించిన యుద్ధాలలో పరాజయం ప్రధాన కారణాలు. హిట్లరు, ముసోలిని మొదలైన నియంతలు వీటి ఫలితంగానే అధికారాన్ని కోల్పోయారు. మన దేశంలో ప్రజలు విచక్షణతో 1977 మార్చిలో జరిగిన ఎన్నికలలో ప్రవర్తించిన కారణంగా ఏలాటి దౌర్జన్యం, ఆస్తి నష్టం, ప్రాణ నష్టం అవసరం లేక శాంతియుతంగా నియంతృత్వం నిర్మూలమై ప్రజాస్వామ్యం పునరుద్ధరింపబడినది. ఈలాటి శాంతియుత విప్లవానికి కారణభూతులైన సామాన్య ప్రజలు అభినందనీయులు. ఈ విషయాలను ఎన్నికలు జరిగిన వెంటనే 'త్రివేణి' పత్రికకు వ్రాసిన వ్యాసములో తెలియపరచాను.

ఈ సందర్భంలో 'ఇతిహాస్' పత్రిక సహాయ సంపాదకులలో ఒకరు "చారిత్రక దృష్ట్యా ఇందిరా గాంధి ప్రకటించిన అత్యవసర

పరిస్థితి, ఆ కాలంలో ఆమె అనుసరించిన పరిపాలనా విధానము" గురించి ఒక వ్యాసం వ్రాయవలసిందిగా కోరారు. 'ఇతిహాస్' పత్రిక ప్రభుత్వ ఆధ్వర్యంలో ప్రకటింపబడే పత్రిక. ఇంతేగాక ఆనాడు కాంగ్రెసు పక్షం ఆంధ్రప్రదేశ్ లో అధికారంలో యుండినది. ఈలాటి వ్యాసం 'ఇతిహాస్' పత్రికలో ప్రకటించడం ఉచితమా, అందుకు సంపాదకులు అంగీకరించగలరా అనే సందేహాన్ని నేను వెలిబుచ్చాను. కాని సహాయ సంపాదకులు నాసందేహానికి అవకాశం లేదని చెప్పినారు. అయినా ఈసందేహం తోనే వారు సూచించిన విషయాన్ని గురించి ఒక వ్యాసాన్ని వ్రాసి, అందులో ప్రపంచ యుద్ధాల కాలంలో భారతదేశంలోని బ్రిటిషు ప్రభుత్వము, నాజీ పారిపాలనా కాలంలో హిట్లరు నియంత అనుసరించిన నిరంకుశత్వాలకు, ఇందిరా గాంధి నిరంకుశత్వానికి మధ్య ఉన్న పోలికలను వివరించాను. కాని నేను సందేహించినట్లే 'ఇతిహాస్' సంపాదకులు నా వ్యాసాన్ని ప్రకటించుటకు అంగీకరించ లేదు. అది అప్రకటితంగా నావద్ద ప్రస్తుతం ఉన్నది.

మనకు 1947 లో స్వాతంత్ర్యం లభించిన తర్వాత ముప్పది సంవత్సరాల కాలం కాంగ్రెసు ఒక్కటే కేంద్రంలో అధికారాన్ని చేపట్టి పరిపాలనను సాగించింది. 1977 ఎన్నికల ఫలితంగా కాంగ్రెసు అధికారాననుండి తొలగడ , వేరొకపార్టీ (జనతాపార్టీ) అధికారంలోకి రావడం జరిగింది. తర్వాత రెండు సంవత్సరాల కాలంలో నియంతృత్వాన్ని బలపరచుటకు ఇందిరా గాంధి రాజ్యాంగంలో చేసిన మార్పులను జనతా పార్టీ రద్దుచేసి ప్రజల మౌలిక హక్కులను, స్వాతంత్ర్యాలను, న్యాయస్థానాల అధికారా లను పునరుద్ధరించింది. ఆకాశవాణి, దూరదర్శన్ మొదలైన సమాచార సాధనాల దుర్వినియోగాన్ని అరికట్టింది. వార్తా పత్రికలకు స్వాతంత్ర్యాన్ని ప్రసాదించింది. ప్రతిపక్షాలు స్వేచ్ఛగా ప్రవర్తించుటకు అవకాశం కల్పించింది. అది సాధించిన విజయా లలో ప్రజాస్వామ్య పునరుద్ధరణ అగ్రస్థానాన్ని వహిస్తున్నది.

ఇదిగాక ఇందిరా గాంధి నిరంకుశంగా పరిపాలించిన కాలంలో ఆమె ఆదేశానుసారం జరిగిన అత్యాచారాల గురించి విచారణచేసి, వాటిని బహిరంగపరచుటకు షాకమిషన్ మొదలైన కమిషన్‌లను

నియమించింది. వీటి అన్నిటిలో షా కమిషన్ అత్యంత ప్రాధాన్యం వహించింది. ఇది అత్యవసరకాలంలో అధికారంలో ఉండినవారి సాక్ష్యాన్ని ఆధారంచేసికొని తన నివేదికను ప్రభుత్వానికి సమర్పించింది. కాని దీని ఎదుట ప్రమాణంచేసి, సాక్ష్యం ఇచ్చుటకు ఇందిరా గాంధి, సంజయ గాంధి, వారికి అత్యంత సన్నిహితులుగా ఉండిన వారిలో కొందరు నిరాకరించినారు. సాక్ష్యం ఇచ్చి తమ ప్రవర్తనను సమర్థించుకొనుటకు అవకాశం లభించినా ఆ అవకాశాన్ని వినియోగించుకొనుటకు వీరు నిరాకరించడం విచారకరం. ఇది చట్ట విరుద్ధం కూడాను. ఈలాగు చట్ట విరుద్ధంగా ప్రవర్తించినందుకు వీరిపై ఢిల్లీ మేజిస్ట్రేటు కోర్టులో కేసు పెట్టబడింది. కాని బ్రిటిషు పరిపాలనా కాలాననుండి కోర్టులలో న్యాయవిచారణ అధిక జాప్యంతో కూడినట్టిదిగా పరిణమించింది. జాప్యాన్ని అరికట్టుటకు తీసికొనవలసిన చర్యల గురించి నిపుణులు అనేక సూచనలు చేస్తూనే వచ్చారు. కాని ఇవి ఇప్పటివరకు కార్యరూపం ధరించలేదు.

అందుచేతనే అధికారంలో ఉన్నవారు చేసిన నేరాలను సత్వరం విచారణచేసి తీర్పుచెప్పుటకు వీలు కలుగచేస్తూ జనతా ప్రభుత్వం ఒక ప్రత్యేక కోర్టుల చట్టాన్ని (Special Courts Act) చేసింది. అది 1979 జూన్‌లో అమలులోనికి రాగలదు. ఇది జరిగిన పక్షంలో అత్యవసర పరిస్థితి కాలంలో అత్యాచారాలు గావించిన వారిని విచారణచేసి త్వరితకాలంలో తీర్పుచెప్పడం సాధ్యమౌతుంది. కాని ఈలాటి చట్టం ఒకటి ఉండడం ఇందిరా గాంధికి గాని, ఆమె నిరంకుశత్వాన్ని సమర్థించేవారికి గాని ఎంతమాత్రం ఇష్టంలేదు. అందుచేతనే వారు దీనికి నిరసనగా మూకలతో కూడిన సమావేశాలను జరుపుతూ శాంతి భద్రతలకు ప్రమాదం కలిగించడం జరుగుతూ ఉన్నది. జనతా ప్రభుత్వం ఎదుర్కొనవలసిన సమస్యలలో ఇది అత్యంత ప్రాధాన్యాన్ని వహిస్తున్నది. శాంతి భద్రతలను రక్షించడం ప్రతి ప్రభుత్వం యొక్క ప్రథమ కర్తవ్యం. దీనిని పటిష్ఠంగా నిర్వహించలేని ప్రభుత్వం, ప్రభుత్వం అనే పేరునకు అర్హతను పోగొట్టుకొనుచున్నది.

జనతా ప్రభుత్వం అధికారంలోకి వచ్చిన తర్వాత శాంతి భద్రతలు కొంతవరకు క్షీణించినవి. హరిజనులపై అత్యాచారాల

సంఖ్య పెరిగినది. ఇతర కులాలవారు భూస్వాములుగా ఉండడం, హరిజనులు వ్యవసాయ కూలీలుగా ఉండడం దీనికి ప్రధాన కారణం. హరిజనుల ఆర్థికాభివృద్ధి భూస్వామిక వర్గానికి చెందిన ఇతర కులాలవారికి అంగీకారయోగ్యం కాజాలదు. కారణా లేవైనా వీరి మధ్య ఉద్రిక్తత పెరగడం, అది దౌర్జన్యాలకు దారి తీయడం, అధికారులు తమ విధ్యుక్త ధర్మాలను నిర్వహించి హరిజనులను రక్షించలేక పోవడం విచారకరం.

ఇదేవిధంగా హిందువులు, ముస్లింల మధ్య ఉద్రిక్తతలు పెరగడం గుర్తించవలసి యున్నది. జంషెడ్‌పూర్‌లో ఏప్రిల్ లోను, అంతకుముందు అలీఘర్‌లోను జరిగిన కొట్లాటలు దీనికి ఉదాహరణలు. వీటిని అణచుటలో కూడా అధికారులు పక్షపాత వైఖరిని అనుసరించినారన్న ఆరోపణలో కొంతవరకు సత్యం ఉన్నది.

ఇందిరా గాంధి కాంగ్రెసువారు దౌర్జన్యాలలోకి దిగి సామాన్య ప్రజల దౌర్జన్య వైఖరికి బలం చేకూర్చడం విచారకరం. ఒకప్పుడు దేశానికి ప్రధానిగా ఇందిరా గాంధి నాయకత్వంలోని పార్టీ ఈవిధంగా ప్రవర్తించడం విచారకరం.

1977 నుంచి తక్కిన పౌరులవలె నేను కూడా దేశంలో దౌర్జన్య వాతావరణం పెరగడం, జనతా పార్టీలో అంతఃకలహాలు కొంతవరకు దీనికి కారణం కావడంతో చాలా ఆందోళన పడు చున్నాను. అరాచక శక్తులు ప్రాబల్యం గాంచడం విచక్షణతో ప్రవర్తించే పౌరు లెవరూ కూడా సహించరు. ఈ భావాలను నేను ప్రకటించిన వ్యాసాలలో వ్యక్తం చేశాను. అందుచేత వాటిని గురించి ఇచట ప్రస్తావించాను.

1978 లో నా మామూలు కార్యక్రమాలలో కొన్నిటిని సాగిం చాను. నాలుగు గ్రంథ సమీక్షలు చేశాను. 'త్రివేణి' కి, 'తెలుగు విద్యార్థి' కి వ్యాసాలు వ్రాశాను. ఆకాశవాణిలో రెండు ప్రసంగాలు ప్రసారం చేశాను. రెండు గ్రంథాలకు తొలిపలుకులు వ్రాశాను.

కాని 1978–'79 లో నేను నా స్వీయ చరిత్రను వ్రాయడం వీటి అన్నిటికంటె ఎక్కువ ప్రాధాన్యాన్ని వహిస్తున్నది. మిత్రు లనేకుల ప్రోత్సాహం కారణంగా నేను ఈ రచనను పూను కొన్నాను. నేను మొదటినుండి డైరీలు వ్రాసినవాడను కాను.

1945 తర్వాతనే డైరీలు వ్రాయడం ప్రారంభించాను. అందు చేత నా జ్ఞాపకాన్ని ఆధారంచేసుకొనే 1945 వరకు ఈ చరిత్రను వ్రాశాను. అటుతర్వాత నా డైరీల సహాయంతో ఈపనిని సాగించాను. డైరీలను చదివి వాటిలోని అంశాలను క్రోడీక రించుటలో నా కాలంలోచాలాభాగం వినియోగించవలసి వచ్చింది.

దీనిని వ్రాయడంలో నా 90 సంవత్సరాల జీవితకాలంలో మన సమాజంలో జరిగిన మార్పులను స్పష్టం చేయడం నా ప్రధానోద్దేశంగా పెట్టుకొన్నాను. ఈ దృక్పథంతో నేను మా గ్రామం, మా శాఖ, మా కుటుంబం, నా విద్యాభ్యాసం, నా గ్రంథరచనలు మొదలైన విషయాలను ఇందులో వివరించాను. ఈ దృష్టితోనే మన రాజకీయ, ఆర్థిక రంగాలలో జరిగిన మార్పు లను విశదీకరించాను. వీటికి సంబంధించిన నా అనుభవాలను, నాలో కలిగిన భావాలను తెలియపరచాను. నా చిన్నతనంలో నేను చూచిన సమాజానికి, ఈనాడు నేను చూస్తూ ఉండే సమాజానికి ఎన్నో తారతమ్యాలు కనపడుచున్నవి. నా స్వీయ చరిత్ర కొంతవరకు వాటికి ప్రతిబింబమని నేను భావిస్తున్నాను.

మన పూర్వులు వర్ణాశ్రమ ధర్మాలను అనుసరించవలసి నదిగా విధించారు. కాని కాలం మారిన కారణంగా వీటి ప్రాబల్యం క్షీణించింది. అందరు గృహస్థులుగానే జీవితాన్ని గడుపుతున్నారు. వానప్రస్థం వీరిని ఆకర్షించడంలేదు. సన్యాసాన్ని స్వీకరించే వారి సంఖ్య చాలావరకు తగ్గింది. నేను గృహస్థునిగానే నా జీవితాన్ని ఇప్పటివరకు గడుపుతున్నాను. కుటుంబ వ్యవహారా లను పూర్తిగా వదలుకొనడం సాధ్యం కాలేదు. నాది చాలా పెద్ద కుటుంబం. నాకు ఏడుగురు కుమారులు, ముగ్గురు కుమార్తెలు. నా పెద్ద కుమార్తె అన్నపూర్ణ అయిదుగురు కుమాళ్లు, అయిదుగురు కుమార్తెలకు తల్లి. నా రెండవ కుమార్తె గోదావరికి అయిదుగురు కొమాళ్లు, ఆరుగురు కుమార్తెలు. నా కుమారులలో పెద్దవాడు నరసింహానికి ముగ్గురు, రెండవవాడు సీతారాంకు నలుగురు, మూడవ వాడు ఆనందానికి ఆరుగురు, నాల్గవవాడు వెంకటేశ్వర్లుకు ముగ్గురు, అయిదవవాడుపట్టాభికి ముగ్గురు,ఆరవవాడు కృష్ణమూర్తికినలుగురు, ఆఖరివాడు సింహాచలానికి నలుగురు పిల్లలు. నాకు మనుమలు, మనుమరాండ్రు, ముని మనుమలు, మనుమరాండ్రు ఉన్నారు.

వీరిని పోషించి, పెద్దవారిని చేసి, చదువులు చెప్పించి, పెద్ద ఉద్యోగాలకు అర్హులుగా చేయడంలో మేము ఎలాటి క్లిష్ట సమస్యలను ఎదుర్కొనలేదు. పిల్లలలో ఇద్దరు ముగ్గురు వెనుకబడి పోవడం జరిగింది. కాని దీనికి మా ఆర్థిక పరిస్థితులు కారణాలు కావు. వారి శక్తి సామర్థ్యాలు లోపించినందువలననే ఇది జరిగింది.

కాని కాలం మారి, మధ్యతరగతివారు ఆడంబరజీవితానికి అలవాటు పడుచుండుటచేతను, ధరలు విపరీతంగా పెరుగుతుండడంచేతను ఈనాడు పరిమిత కుటుంబాలు అవసరమనే భావం వ్యాపించింది. నేను కూడా ఈలాటి భావం కలవాడను. 1960 లో కటక్ కళాశాలలో 'శ్రేయో రాజ్యం,' 'సోషలిస్టు రాజ్యం' అనే విషయాల గురించి నేను చేసిన మూడు ప్రసంగాలలోను, 1964 లో 'గాంధీ మహాత్ముని సత్యాగ్రహ సందేశాన్ని'గురించి శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయంలో చేసిన ఉపన్యాసాలలోను ఈ అభిప్రాయాన్ని వ్యక్తంచేసినాను. దేశంలో ఆహార పదార్థాలు మొదలైన ప్రాథమిక పదార్థాల ఉత్పత్తి పెరిగినా జనసంఖ్య వీటికంటె ఎక్కువ దామాషాలో పెరగడంచేతను 60, 70 శాతం ప్రజలు దారిద్ర్యాన్ని అనుభవించవలసిన వారుగా ఉన్నారు. నిరుద్యోగ సమస్య క్లిష్టరూపం ధరించుటకు, వివిధ వర్గాలమధ్య ఉద్రిక్త పరిస్థితులు ఏర్పడుటకు జనసంఖ్య పెరుగుదల ఒక ప్రధాన కారణం. ఈ పెరుగుదలను అరికట్టుటకు పరిమిత కుటుంబాలు ఒక పటిష్ఠ సాధనం. ఇందుకుగాను ప్రభుత్వం అనేకచర్యలను తీసుకొంటున్నది. వాటిని అమలుపరచటంలో ప్రజలందరూ ప్రభుత్వంతో సహకరించడం ఎంతైనా అవసరం.

సుమారు అరవైమంది నా కుటుంబంలో ఉన్నందున 1971 తర్వాత అనేక శుభకార్యాలు జరిగినవి. కాని జీవితం ఎల్లప్పుడు ఒకే విధంగా సాగదు సుఖంతోపాటు కష్టాలను అనుభవించడం తప్పదు. నా కుటుంబంలో ఇదే జరిగింది.

శుభకార్యాలలో నా మనుమరాలు నాగేశ్వరికి, నా మనుమడు సుబ్రహ్మణ్యానికి 1971 లో జరిగిన వివాహాలు; 1972 లో నా మనుమడు సదాశివ ఉపనయనం; 1973 లో నా మనుమడు రామబ్రహ్మం ఉపనయనం, వివాహం; 1975 లో

నా మనుమడు వెంకటేశ్వర వివాహం, ఇంకొక మనుమడు రాజేంద్ర ఉపనయనం వివాహం, ముగ్గురు మనుమలు విజయ, గౌతం, నాగార్జునల ఉపనయనాలు; 1978 లో నా మనుమడు, నా మనుమరాలు డాక్టర్ ఉమ వివాహములు, కృష్ణస్వామి నా మనుమరాలు వాణితో వివాహం, నా మనుమడు ప్రసాద్, నా మనుమరాలు మంగళాంబతో వివాహం; 1979 లో నా మనుమరాలు అరుణ, నా మనుమడు విజయుల వివాహాలు జరిగినవి. ఈశుభకార్యాలలో నా కుటుంబంలోనివారిలో అధిక సంఖ్యాకులు పాల్గొనడం ఒక విశేషం.

నా కుటుంబంలోనివారు కొందరు క్రొత్త ఇండ్లను కట్టుకొని (నా కుమారులు సీతారాం, ఆనందం, సింహాచలం, నా మనుమరాలు కృష్ణవేణి, నా మనుమడు రామబ్రహ్మం) గృహప్రవేశాలు చేశారు. 1975 లో నా పెద్ద కుమారుడు నరసింహం, 1977 లో నా రెండవ కుమారుడు సీతారాం, 1979 లో నా మూడవ కుమారుడు ఆనందం షష్ఠిపూర్తి చేసుకొన్నారు. వీటిలో ఆనందం షష్ఠిపూర్తి అతి వైభవంగా జరిగింది.

1979 మే 3-వ తేదీన నా మనుమరాలు (సీతారాం కుమార్తె) ఉషా వివాహం జరుపుటకు అన్ని ఏర్పాటులు చేశాము. వరుని దాని కోరికపైనే కుదిర్చినాము. కాని ఏ కారణంచేతనో అది అకస్మాత్తుగా ఇంటినుండి వెళ్ళిపోయి, రహస్యంగా ఇంకొకనిని ఆర్యసమాజ విధానాన పెండ్లాడింది. ఈలాగు జరిగినందుకు మే మందరం చాలా విచారించాము. ఎంతో వైభవంగా జరగవలసిన వివాహం ఈవిధంగా పరిణమించడం మా అందరికీ ఆశాభంగాన్ని కలిగించింది.

ఈలాటి శుభకార్యాలు జరుగుచున్న కాలంలో రెండు అకాల మరణాలు కూడా సంభవించినవి. నా మరదలు రాజ్యలక్ష్మి ఇద్దరు కుమారులకు, ఒక కుమార్తెకు తల్లి. చిన్నవయస్సులోనే భర్తను (నా బావమరది రామబ్రహ్మన్ని) కోల్పోయింది. అప్పటినుంచి నా రెండవ బావమరది అల్లుడు డాక్టర్ మహాదేవయ్య ఆమెను, ఆమె పిల్లలను పెంచి పెద్దవారిని చేసి వారికి గొప్ప చదువులు చెప్పించాడు. కాని దురదృష్టవశాత్తున పెద్దవాడు రామచంద్రన్ బెంగుళూరులో ఇన్‌కంటాక్స్ ప్రాక్టీషనర్ (Income-tax Practitioner) గా మంచి ఆదాయాన్ని గడిస్తూ

వ్యాధిగ్రస్తుడై 1972 లో దివంగతుడైనాడు. తర్వాత సంవత్సరం 1973 లో రెండవ కుమారుడు శాస్త్రి (ఇతడు ప్రఖ్యాతి గాంచిన ఇంజనీయర్. మద్రాసులో ఒక కంపెనీలో 3,000 రూపాయలు గడిస్తూ ఉండినవాడు.) ఒక కారు ప్రమాదం కారణంగా తలబ్రద్దలై మరణించాడు. ఈవిధంగా ఇద్దరు కుమారులను పోగొట్టుకొన్న రాజ్యలక్ష్మి వృద్ధాప్యంలో అనుభవించవలసిన దుఃఖాన్ని గురించి ప్రత్యేకంగా చెప్పవలసింది లేదు. ఆమె చాలా యోగ్యురాలు, నెమ్మదిమనిషి. ఆమెకు ఈలాటి కష్టాలుసంభవించడం మా కందరికి దుఃఖకారణమైంది. ఎలాటి పాపము చేయనివారికి ఈలాటి దుఃఖాలు సంభవించడానికి కారణము లేవి అనే ప్రశ్నను అనాదిగా మన తత్వవేత్తలు ఎదుర్కొంటున్నారు. పూర్వజన్మలోని సుకృత దుష్కృతులే ఈ జన్మలో మనం అనుభవించే సుఖ దుఃఖాలకు కారణము లనేది మన పూర్వులు చెప్పిన సమాధానం.

నా మూడవ కుమారుడు ఆనందం 1964 లో రాజకీయాలలో ప్రవేశించాడు. పట్టభద్రుల నియోజకవర్గాన నుంచి ఆంధ్రప్రదేశ్ శాసనసమితికి (Legislative Council) ఎన్నికయ్యాడు. ముఖ్యమంత్రి శ్రీ బ్రహ్మానందరెడ్డికి సన్నిహితుడైనాడు. దాని ఫలితంగా శాసన సమితికి ఉపాధ్యక్షుడుగా ఎన్నికైనాడు. అప్పట్లో శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్యగారు దానికి అధ్యక్షులు 1969 లో రాజ్యసభకు ఎన్నికయ్యాడు. 1974లో రెండవ పర్యాయంరాజ్యసభకుఎన్నికయ్యాడు. పార్లమెంటులో అనేక కమిటీలలో సభ్యుడై గణనీయమైన కృషి చేశాడు. 1980 వరకు రాజ్యసభ సభ్యత్వం కొనసాగుతుంది.

ఈకాలంలో రెండు మూడు పర్యాయాలు వాడు తిరుపతి యాత్ర చేశాడు. వాడి వెంట నా భార్య, నేను వెళ్ళినాము. పార్లమెంటు సభ్యుడు కావడంచేత దేవాలయాధికారులు స్వామి దర్శన విషయంలో మాపట్ల శ్రద్ధ వహించారు. మాకు కావలసిన సదుపాయాలన్నిటిని చేశారు. 1974 మే 13 న ఈ యాత్రా సందర్భంలో మావాడు సహస్ర కలశాభిషేకం చేయించాడు. ఇది ఉదయం గం. 9-30 కి ప్రారంభమై 12 గంటలకు ముగిసింది. తర్వాత ఆరోజే మధ్యాహ్నం కల్యాణోత్సవం చేయించాడు. మా కుటుంబంలోనివారిలో చాలామంది ఈ ఉత్సవాలలో

పాల్గొన్నాము. ఈ ఉత్సవాల వైభవం మా అందరిపై అత్యంత ప్రభావాన్ని వహించింది. 1978 ఆగస్టులో వీడు, నా ఆఖరు కుమారుడు సింహాచలం కలిసి కల్యాణోత్సవం చేయించారు. అందులో పాల్గొనుటకు నేను వెళ్ళలేకపోయాను.

అధిక ధనవ్యయంతో కూడిన ఈలాటి ఉత్సవాలను చేయించడం మన మూఢనమ్మకాలకు ఒక దృష్టాంతం అని హేతువాదాన్ని సమర్థించే విద్యాధికులు కొందరు, నాస్తికులూ వీటిని ఖండించడం కద్దు. కాని వీటిమూలంగానే హిందూ సంస్కృతి ఈనాటి వరకు నిలబడి యున్నది. స్వామి దర్శనం చేసుకొనే నిమిత్తం అన్ని కులాలవారు వెళ్ళుతున్నారు. స్వామివారి ఎదుట అందరు సమానులు అనే భావం వారిలో ఉదయించి వృద్ధిగాంచుటకు ఇది పటిష్ఠమైన సాధనం. ఏవో ఒకవిధమైన మూఢనమ్మకాలు లేక ఏ మానవుడు జీవించలేడు. జీవిత రహస్యాలన్నిటిని కనుగొనుటకు హేతువాదం ఒక్కటే సాధనమని అనుకొనడం కూడా ఒక మూఢనమ్మకమే. అందుచేత పుణ్యక్షేత్రాలను, యాత్రలను ఖండించడం అర్థంలేని ఖండనం.

ఆధ్యాత్మిక జీవితానికి ప్రాధాన్యం ఉన్నట్లు మా కుటుంబంలో విశ్వసించడంచేతనే 1968 లో శ్రీ కంచి కామకోటి పీఠాధిపతిగారు సికిందరాబాదుకు వచ్చినపుడు మే మందరం వారి దర్శనం చేసుకొన్నాము. ఆ సందర్భంలో వారు మతవిషయాలగురించి మాకు ప్రబోధం చేయడంతో పాటు మా శాఖను గురించి, మా పెద్ద మామగారు అల్లాడి మహాదేవశాస్త్రిగారి పాండిత్యాన్ని గురించి ప్రశంసించారు. కొన్నిరోజులు గడచిన తరువాత మా శాఖకు జన్మస్థానమైన చంద్రమాణిక్యాన్ని గురించి ఒక ప్రాచీన శ్లోకాన్ని వారు వారి శిష్యులలో ఒకరిద్వారా నాకు పంపినారు. నా తమ్ముడు వ్రాసి నా భార్యకు, నాకు అంకితం చేసిన శ్రీమద్వాల్మీకిరామాయణ కథామృతమును ప్రశంసిస్తూ వారి ఆశీస్సులను పంపినారు. ఈ ఆశీస్సులు ఈ గ్రంథానికి అమూల్యమైన అలంకారాలు.

తిరుపతికొండమీద వెంకటేశ్వరస్వామివారికి సహస్ర కలశాభిషేకం, కల్యాణోత్సవాలు జరిగిన తర్వాత కుటుంబంలో మే మందరం మద్రాసుకు వచ్చి నా రెండవ అల్లుడు వాసుదేవన్‌కు, నా రెండవ కుమార్తె గోదావరికి అతిథులుగా కొన్నిరోజులు

గడిపాను. అప్పటికి నా వివాహం జరిగి 70 సంవత్సరాలు గడచినవి. దానిని పురస్కరించుకొని వారు నా 70 సంవత్సరాల నాటి వివాహ "ప్లాటినమ్" ఉత్సవాన్ని అతివైభవంగా జరిపినారు. ఆ సమయంలో నేను నా కోడండ్రు, కుమార్తెలు, మనుమలు, మనుమరాండ్రకు రు. 1800 లు బహుమానాల రూపంలో పంచిపెట్టాను. అటుతర్వాత మా కుటుంబంలోనివారు కేరళలోని గురువాయూరు క్షేత్రానికి, దక్షిణ భారతంలోని మరికొన్ని క్షేత్రాలకు వెళ్ళి రెండు వారాల తర్వాత మద్రాసు చేరారు. అనారోగ్యం కారణంగా నేను వారితో కూడా వెళ్ళలేక పోయినాను.

నేను హైదరాబాదులో నివాసం ఏర్పరచుకొనిన తర్వాత విశ్వవిద్యాలయంలోను, కళాశాలలోను అధ్యాపకులుగా యుండినవారు, ఇతర మేధావులు నా మిత్రవర్గంలో చేరినారు. దీనిఫలితంగా వారు ఏర్పాటు చేసిన గోష్ఠి కార్యక్రమాలకు నన్ను ఆహ్వానించడం, నేను వాటిలో పాల్గొనడం జరిగినది. ఈ చర్చల సందర్భంలో యునకు లనేకుల అభిప్రాయాలను నేను తెలుసుకొన గలిగినాను. ఈ కార్యక్రమాలలో పాల్గొనడంచేత నా ఆలోచన శక్తి మరింత వృద్ధిగాంచింది. నేను వృద్ధుడ ననే విషయాన్ని మరచిపోయినాను. రచనా కార్యక్రమంలో నా ఆసక్తి, ఉత్సాహము వృద్ధిగాంచుటకు మేధావుల సాంగత్యం ఒక ప్రధాన కారణం.

ఈకాలంలో నాకు సన్నిహితులైన వారిలో 'యోగాసన రత్న' యశ్వంత సిన్హాగారు. వీరు పుట్టుకచే ఆంధ్రులు. యోగాసనాలు వేయడంలో వీరు సంపాదించిన నైపుణ్యం కారణంగా ఋషీకేశ్ లోని యోగవేదాంత విశ్వవిద్యాలయాధిపతి, దివ్య జీవిత సంఘు అధ్యక్షులు (Divine Life Society) స్వామి శివానంద వీరికి 'యోగాసనరత్న' అనే బిరుదును ప్రసాదించినారు. 1928 లో నేను నెల్లూరు కళాశాల ప్రిన్సిపాల్ గా ఉన్నప్పుడు జిల్లా ఉపాధ్యాయుల సంఘు సమావేశం ఒంగోలులో జరిగినది. ఆ సమావేశంలో నేను వీరి యోగాసనాల ప్రదర్శనను చూచి, వీరితో పరిచయం సంపాదించినాను. ప్రాచీనకాలపు యోగుల వలె వీరు హిమాలయపర్వత ప్రాంతాలలో అమరనాధ్ నుండి

కైలాసం, మానస సరోవరంవరకు 1490 మైళ్ళు పాదయాత్ర చేసి సువర్ణ మిశ్రితమైన సాలగ్రామాన్ని, సువర్ణ ధాతుమయమైన ఇసుక రేణువులను, సుగంధ సహితమైన పచ్చిక పోచలు సేకరించారు. నాసిక్ సమీపంలోని పంచవటి ఆశ్రమ మహంతు వీరికి దీక్ష నొసంగినారు. వీరు స్వాతంత్ర్య ఉద్యమంలో పాల్గొన్నవారు. ఈకారణంచేత ప్రభుత్వం వీరికి రు. 200 లు పింఛన్‌ను చెల్లిస్తున్నది. హైదరాబాదులో వీరు నన్ను తరుచుగా కలుసుకొనడం, వీరి అనుభవాలను నాకు తెలియపరచడం జరుగుచున్నందున వారిని గురించి నేను ఇక్కడ ప్రస్తావించాను.

ఇప్పుడు నా వయస్సు 9 సంవత్సరాలు. నా జీవిత కాలంలో మన సమాజం అన్నిరంగాలలో అనేకవిధాలుగా మారింది. ఈ మార్పుల నన్నిటిని నేను స్వయంగా చూచినాను. వాటిలోని గుణదోషాలను పరిశీలించినాను. నేను వ్రాసిన గ్రంథాల లోను, వ్యాసాలలోను, సమావేశాలలో నేను చేసిన ప్రసంగాల లోను, ఆకాశవాణిలోని నా ప్రసారాలలోను నా అభిప్రాయాలను వ్యక్తం చేసినాను. పరాయి పరిపాలకులకు దాస్యం చేయడం మాని మనం స్వతంత్రంగా దేశాన్ని పరిపాలించుకొనగలిగాము. సమాజంలో జరిగిన మార్పులన్నిటిలో ఇది అగ్రస్థానం వహిస్తున్నది. వర్ణవ్యవస్థ, కులకట్టుబాట్లు చాలావరకు మారినవి. స్త్రీలు పురుషులతో సమానత్వాన్ని సంపాదించినారు. బలహీనవర్గాల వారు, అస్పృశ్యులు, ఆదివాసులు అభివృద్ధి పథంలో నడుచుటకు ప్రారంభించారు. పారిశ్రామికంగా దేశం ముందడుగు వేస్తున్నది. అక్షరాస్యత పెరిగింది. విద్యార్థులు ఆధునిక యుగంలో ప్రాధాన్యత వహించిన విజ్ఞానశాస్త్రం, సాంకేతికశాస్త్రం, సామాజికశాస్త్రం మొదలైన వాటిలో ఉత్తీర్ణు లగుచున్నారు. సంగీతం, నృత్యం, చిత్రలేఖనం, శిల్పం మొదలైన కళలలో అనేక మార్పులు సంభవించినవి. స్తంభించి పోయిన సమాజం ఈనాడు సజీవంగా ప్రవర్తిస్తున్నది. వీటితోపాటు కొన్ని అవాంఛనీయ పరిణామాలు కూడా సంభవించిన మాట వాస్తవమే. కాని మొత్తంమీద మనం ఉత్తమ మార్గంలో నడుచుటకు ప్రయత్నిస్తున్నామనేదే నా విశ్వాసం. ఈ ప్రయత్నం ఫలప్రదం కావలెననేదే నా ఆశయం.

11-5-1979